మహారాజ గురువర్యాణాం కృష్ణాంశసంభవ పాంచాలపురుష పెద్దాచార్యులకు, తాతాచార్యులు అనిన్ని వాడుక, ఈ ఆచార్యులవారికి నృసింహదేవ మహారాయలుగారు బుక్కపట్టణం అనే గ్రామం ధారాగ్రహీతం చేసి యిచ్చినది.

శాలివాహనశకవరుషంబులు ౧౩౩౦ అగునేటి సర్వజిత్తు సం॥ చైత్ర శు॥ ౨ నాడు దానపత్రం వ్రాసియిచ్చినారని (ఒక) దానపత్రం కాగిదం వారివంశీకులవద్ద ఉన్నది. అయితే శాలివాహనశక సం॥ వ్యత్యాసముగానున్నది. ఈ నృసింహరాయలువారి యేలుబడి శకము ౧౪౩౦ వరకు యితర స్థళములయందు శిలాశాసనములు ఉన్నది. ఈ దానపత్రంలో శకం ౧౩౩౦ వ్రాసివున్నది గనుక ప్రతి వ్రాసేటప్పుడు వ్యత్యాసంగావచ్చి యుండవలెను. గాని యీ బుక్కపట్టణం గ్రామం తాతాచార్యులవారికి నడుస్తూయుండెను అనిన్ని యీ దేశంవారు ప్రఖ్యాతిగా వాడుతున్నారు. ఆచార్యులవారు లోగడ ప్రబలంగానుండి వారి తిరుమాళిగెలున్ను కట్టుకొని గ్రామం అనుభవించినారు అనిన్ని జనులు వాడుతున్నారు. ఆచార్యులవారి సంతతివారున్ను యిప్పటికిన్ని బుక్కపట్టణంగ్రామాన ఉన్నారు. నృసింహరాయలనాడు దేమర్సు అనే బ్రాహ్మణుడు రాయలవారి వద్ద పనులు విచారిస్తూయుండగాను కిల్లైపట్టి గండ్లూరు చౌటిపల్లె యీ రెండుగ్రామములున్ను వారికి అమరంగా నడుస్తూయుండెను.

ఈ నృసింహరాయలవారి కొమారుల్లు ౩కి వివరం: ౧ నరసింహరాయలు, ౧ అచ్యుతరాయలు, ౧ కృష్ణరాయలు.

౧౫ తర్వాత నృసింహరాయలవారి కొమారుడు శ్రీ మద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప కృష్ణదేవ మహారాయలుగారు విజయనగరమందు శాలివాహనశకవరుషంబులు ౧౪౩౧ శుక్ల సం॥ పట్టాభిషిక్తులై రాజ్యంచేస్తూ శాలివాహనశకవరుషంబులు ౧౪౫౦ వరకు యేలుతూఉండి, జంబులమడుగు తాలూకాలో రాయలవారున్ను

రాయలవారివద్ద అధికారదత్తులై యున్న వారున్ను, అమరం అనుభవిస్తూ యున్న వారున్ను వేయించిన శిలాశాసనములయొక్క సారాంశము.

కిఫ్లేపట్టి మొనమలచింతల గ్రామానికి సామీప్య గొంగడేశ్వరుని దేవాలయం యెదుట నిలవరాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౩౨ అగునేటి ప్రమోదూత సం॥ పుష్య శు॥ ౧౨॥ కృష్ణదేవరాయల ప్రధాని తిమ్మరసయ్యంగారు దేశములో అష్టాదశవర్ణములువారు వివాహము చేస్తే నగరికి యిచ్చేకట్నం సర్వమాన్యంగా మన్నించి సంస్కృతంలో శాసనం వేయించినారు.

౧ పాలూరుగ్రామం జగతికట్ట దగ్గర అగస్తీశ్వరున దేవాలయ దక్షిణభాగమున ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౩౨ అగునేటి ప్రమోదూత సం॥ కార్తీక శు॥ ౧౨॥ సో। శ్రీమతు నర్రావుల తిప్పానాయనింగారు కాసె వల్లభోజుకు యిచ్చిన ధర్మశాసనము: మాకు కృష్ణరాయలు పాలించిన నాయంకరము పాలూరి పొలానను మీకు పొలంపెట్టిన మాన్యంపెట్టిన చేను పాలూరు అగస్తీశ్వర దేవర అష్టభోగ తేజస్వాములతోను అనుభవించుకొనేది.

ఈ శాసనములో కాసెవానికి చేను ఖ ౦।౦ యిచ్చినట్లుగాను వ్రాసియున్నది.

౧ కిఫ్లేపట్టి రేగడిపల్లెకు ఆగ్నేయం చేనిలో దిగువరాతికి ఉండేది.

శాలివాహనశకవషంబులు ౧౪౩౩ అగునేటి ప్రజోత్పత్తి సం॥ ఆషాఢ శు॥ ౧౨ శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యు లయిన శ్రీవత్సన గోత్రయజుశ్శాఖాధ్యాయు లయిన యెదుట్ల తిరువెంగళాచార్యుల కుమారులు సింగరాగార్యులు అనంతాచార్యులుగారికి శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల ఓబళరాజు కుమారుడు సింగరయ్యగారు తమనాయంకరానకు చెల్లే పొద్దటూరను వెలిచేను పొలిమేరను పొద్దటూరి తెరువుతూర్పు

శేగడిచేను ఖ ౪॥౦ నాలుగుపుట్ల పండుము గోచర్మం ధారబోసి యిస్తిమి.

౧ శాలివాహనశకవరుషంబులు ౧౪౩౫ అగునేటి ఆంగీరస సం॥ లో కిన్లెపట్టి తాళ్లపొద్దటూరి గ్రామకరణాల కవిలెలలో కృష్ణ రాయలవద్దనుండే సోమరసయ్యగారు తాళ్లపొద్దటూరి పొలాన రామ సాగరమనే అగ్రహారముకట్టించి బ్రాహ్మలకు ధారాగ్రహీతం చేసి యిచ్చిరి అని వ్రాసియున్నది. ఈ రామసాగరం అనేదానికి యిప్పుడు బ్రాహ్మణపల్లె అని వాడుతూయున్నారు.

గొల్లపల్లెగ్రామానకు ఉత్తరం జంబిచేనులో దిగువ రాతికి ఉండేది.

శ్రీముఖ సం॥ శ్రావణ బ ౧౦॥ గు॥ కూరుమయ్య తిమ్మయ్యకు మాండ్రాజు గోపయ్య కొడుకు లింగరాజు మొసలిమోపూరికి ఉత్తరం శేగడి ౧౩కి ముత్తుం చేను యిస్తిమి.

ఇందులో శకం లేదుగాని యితరస్థళములలో యీ రాజుశాసనము యొక్క దృష్టాంతరం ప్రకారము శకము ౧౪౩౫ అవుతున్నది.

౧ దేవగుడి గ్రామాన తలకంటీశ్వర దేవళానికి పశ్చిమంగా ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౩౭ అగునేటి ధాతు సం॥ కార్తీక శు॥ ౧౫ లు. శ్రీమతు దేవగుడి స్థానంవారు పులి తళపరెడ్డి కొడుకు ఓబుళురెడ్డికిన్ని, చిల్లారెడ్డి కొడుకులు తాతిరెడ్డి, భైరవరెడ్డి జనులు ౩ కి యిచ్చిన దసవందం శాసనం. కృష్ణరాయలకు సాళువ గోవిందరాజ ఒడయలకు పుణ్యముగా మీచేత ప్రాకారం కోట పెట్టించే టందుకు మీ జనులు ౩ కి ఖ ౨౧౨ యిస్తిమి.

మాధవాపురం గ్రామములో హనుమంతరాయుస దవాలయం గోడదగ్గర దిగువయుండే శాసనము. వామనప్రతిమె చెక్కియున్నది.

ఈశ్వర సంవత్సరానను [1]చలమర్థిగండపట్ణానను జియ్యంగారి సన్నిధిని వెంకటయ్యగారికి కట్టహరిదాసు రాజు ధారపోసిన చేను నడిమి కత్తువను భీమగుండం త్రోవను చేను ఖ ౦౹౨.

ఈ చలమర్థిగండపట్ణానకు యిప్పుడు జనులు తలమంచిపట్ణం అని వాడుతున్నారు.

ఈ కృష్ణరాయల నాడు పైన వ్రాసిన మాధకాపురం అనేది గండి కోటలోనున్న మాధవస్వామి పడితరానకు చెల్లుతుండెనని జనులు వాడు తున్నారు.

౧ నెమళ్లదిన్నె గ్రామాన విష్ణుదేవాలయములో గర్భగుడి యెదుట నిలవరాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౩౯ అగునేటి యీశ్వర సం॥ పుష్య శు॥ ౨ లు సో॥ కృష్ణదేవమహారాయలుంగారు బుక్కరాజు తిమ్మరాజుగారికి నాయంకరానకు పాలించిన పాలూరు సీమలో నెమళ్ల దిన్నె స్థితాశేషవిద్వన్మహాజనాలున్ను, పోలెపల్లె తిప్పరాజుగారి కొమారుడు కృష్ణమ్మగారున్ను క్రితాన రామారాయుడు పెరుమాళ్లకు సమర్పించిన స్థళసుంకం పూర్వమర్యాదనే నేమున్ను తిమ్మరాజుగారిక పుణ్యముగాను దశమిమహోత్సవానకు యిస్తిమి.

ఈ శాసనములో నెమళ్లదిన్నెస్థితాశేషవిద్వన్మహాజనాలు అని వ్రాసియున్నది. గనుక లోగడ అగ్రహారంగా నుండవలెగాని, ఫలానా ప్రభుత్వములో అని తేట అయినదికాదు.

దేవగుడిగ్రామాన తలకంటిదేవి దేవళంయెదుట నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౦ అగునేటి బహుధాన్య సం॥ వైశాఖ బ॥ ౫ లు శ్రీమతు దేవగుడిస్థానంవారు ఆర్గురు చిన్నాగజియ్య

1. The cychic year Īśvara probably corresponds to S′ 1439 (A. D. 1577 - 78)

కొడుకులు బస్వన, మల్లు, నాగన మొదలయినవారు యిచ్చిన దసవందం శాసనం: కృష్ణరాయలకు, సాళువ గోవిందరాజు ఒడయలకు పుణ్యముగా మీచేత వంటశాల పందిలి, మిద్దె, కడిగెం, బావి, భైరవునిగుడి మొదలయిన ౫కి చేయించేటందుకు మీకు సుకుమంచిపల్లె పొలిమేర పడమట భైరవ రెడ్డిచేనికి ఉత్తరం ఖ౹౹౩ చేను యిస్తిమి.

౧. దొమ్మరనంద్యాలగ్రామం కోటలో చెన్నకేశవస్వామి దేవాలయం గర్భగుడి పట్టున వెలుపలి తట్టున ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౩ అగునేటి విషు సం॥ జ్యేష్ఠ, బ ౩ లు శ్రీమతు కత్తి తిప్పానాయుడు పాపానాయుడు ఎర్రమనాయని గారు రేనాటినందెల చెన్నకేశవస్వామికి యిచ్చిన ధర్మశాసనం క్రమ మెట్లన్నను: కృష్ణదేవమహారాయలు మానాయంకరానకు పాలించిన గండికోట సీమలోని రేనాటినందెలను మాకునడిచే స్థళసుంకం చెన్న కేశవులకు ప్రతిష్ఠాకాలమందు అఖండదీపారాధనకు చెల్లవచ్చేటట్టుగాను ధారవోసి యిస్తిమి.

ఉప్పలూరు గ్రామానకు పూర్వభాగమున ఆంజనేయుల దేవాలయం ముందర నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౫ అగునేటి స్వభాను సం॥ శ్రావణ, బ ౫ లు, గు॥ కృష్ణరాయలువారు రాజ్యం సేయుచుండగాను సాళువ గోవిందయ్య ఒడయలుగారు శ్రీమతు ఓబళనాయనికి అమరానికి పాలించిన గండికోట సీమలోని ఉప్పలూరను పూర్వకాలము హను మంతపెరుమాళ్లు ఖిలమయి యుండగాను ముడియం వడ్లంగి హనుమంతుని కొడుకు బండిబత్తునిచేత చేయించినందుకు వానికి గోవిందరాజయ్యకు పుణ్యముగాను చేను ఖ ౦౹౩ యిస్తిమి.

౧ తలమంచిపట్టణము గ్రామానికి పడమర ఎల్లమ్మ దేవాలయానకు దక్షిణం చేనుగట్టున నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౭ అగునేటి వ్యయ సం॥ శ్రావణ, బ ౫ లు కృష్ణ దేవమహారాయలవారి అవసరం తిమ్మరసయ్యగారు నాయంకరానకు పాలించిన గండికోట దుర్గం అణ్ణాజీ అయ్యవారు పారుపత్యంచేస్తూ, దుర్గాధిపతి అణ్ణాజీఅయ్యవారు చలమర్థి గండ పట్టణాం మొదలయినవాని పారుపత్యం యిచ్చి, సంతసాగించి, కట్టడచేసిన వివరం. మంగళవారంనాడు సంతకువచ్చే సరుకు ఆరునెలలదాకా సర్వ మాన్యం, అంతనుండి ఆరు నెలలు......

ఈవల నుండవలసిన అక్షరములు శిథిలములైనవి.

గొల్లలఉప్పలపాడు గ్రామాన నుండేది. గ్రామానికి వాయువ్యం పొలిమేరలో జంబినూనివద్ద శిథిలమైన దేవాలయంవద్ద నిలవరాతికి.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౯ అగునేటి ప్లవ సం॥ ఆషాఢ, శు ౧౨ లు దళవాయితిమ్మరసు అయ్యవారి ఆనతిని తాళ్లపాక ఓబళ నాయనిగారి ముందటను శ్రీమన్మహామండలేశ్వర కాటుపబోడి తిమ్మయ దేవమహారాజులు మారకాపురం చెన్నరాయనికి ఇచ్చిన ధర్మశాసనము. గండికోట సీమకు చెల్లే గొల్లలఉప్పలపాడు నేము గుత్తకు పుచ్చుక దేవుని అమృతపళ్లకు రేగడమోసలిమోపూరి పొలంచేనున్న దళవాయి తిమ్మరసయ్యగారికిన్ని, ఓబళనాయునికిన్ని, మా తల్లిదండ్రాదులకు పుణ్యంగాను ధారవోసి యిస్తిమి.

౧ ఈ శాసనానకు చేరినట్టుగానే దక్షిణంగా నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౯ అగునేటి క్రోధి సం॥ ఆషాఢ, శు ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల తిమ్మరాజుగారి ఆనతిని, నరసరాజు ముదలను, కంపరాజుతిరుమలయ మారకాపురం చెన్నరాయునికి యిచ్చిన ధర్మశాసనం. గండికోట సీమకు చెల్లే గొల్లల ఉప్పలపాడు గుత్తకు పుచ్చుక దేవుని అమృతపళ్లకు గుంటలచేని స్థళం చేను ౧౨ యిస్తిమి.

ఈ రెండుశాసనములలోనున్న శకసంవత్సరములు వ్యత్యాస ముగా నున్నవి.

3 కిల్లేపట్టి సుకుమంచిపల్లె గ్రామం పొలిమేరల అష్టదిక్కుల యందున్న ఉండేశాసనములలో ఆ గ్రామం కృష్ణరాయలు సిద్ధవటం ఇష్టకామేశ్వర భైరవేశ్వరులకు ధారవోసి యిచ్చినట్లు వ్రాసియున్నది. అయితే శకసంవత్సరము మాత్రము వ్రాయలేదు, అందులో ఒక శాసనం దిగువ వ్రాసినాను.

శ్రీకృష్ణదేవరాయలు సిద్ధవటం ఇష్టకామేశ్వర భైరవేశర్వులకు ధారవోసిన సుకుమంచిపల్లె.

౧ కిల్లేపట్టి నేకనామబాదు[1] గ్రామానికి దక్షిణం పినాకినీ చిత్రావతీనదుల సంగమంవద్ద సంగమేశ్వరుని దేవాలయంవద్ద ఉండేది.

శాలివాహశకవరుషంబులు ౧౪౪౮ అగునేటి వ్యయ సం॥ ఆషాఢ, శు ౧౧ లు కృష్ణదేవమహారాయలు దేమరసయ్యగారి నాయంకరానకు పాలించిన గండికోటదుర్గానకు చెల్లే గండ్లూరికి ఉత్తరము చవుటివల్లె గ్రామానకు తూర్పున చవుటివల్లె పొలంలోను గండిపడమర గండ్లూరు, చవుటివల్లె యీ రెండు గ్రామాలున్ను యీ నడిగడ్డపొలం చతుస్సీమాను కూడలిసంగమేశ్వరదేవునికి గార్గేయసగోత్ర ఆపస్తంబసూత్ర సర్వక్రతు వాజపేయయాజి విరూపాక్షదీక్షితుల పుత్రుడు అన్నాజయ్యవారు అన్న గడ్డచేని స్థళము అష్టభోగ తేజస్వామ్యముతోకూడ సంగమేశ్వరునికి సమర్పిస్తిమి.

౧ బోడితిప్పనపాడు గ్రామానికి దక్షిణం పాడుబావివద్ద ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౮ అగునేటి సర్వజితు సం॥ భాద్రపద, బ ౧౧ లు శ్రీమతు కొండ తిమ్మనేనిగారు నాగప్పనాయునికి పుణ్యముగాను చూపలిరామిరెడ్డికి యిచ్చిన ధర్మశాసనము. నాగప్ప నాయనింగారు: మాకు పాలూరి పొలములలో పాతర్లమిట్టచేను......

1. The village is called Nēkunāmpēṭa (See A.R. 311 of 1937-38).

కాంగాను యిప్పించినందుకు నాగప్పనాయనిగారికి పుణ్యముగాను చేను ౧౮ ధర్మమాన్యంగాను యిస్తిమి.

భీమగుండం గ్రామాన చెన్నకేశవుని దేవాలయం జగతికట్టకు పగిలిన శాసనము.

సర్వధారి సం॥ కార్తీక, శు ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర గంటి కోనేటిరాజయ్యదేవమహారాజుగారు నాయనివారికి పుణ్యముగాను రాయలచెరువు లింగాబత్తునికి యిచ్చిన భూదానపత్రం. భీమగుండం చెన్నకేశవపెరుమాళ్లను చేసినందుకు మాన్యం చేను ౦॥౦ యిస్తిమి.

౧ నందిపాటి గ్రామాన చెన్నకేశవుని దేవాలయం యెదుట గరుడస్తంభం అడుగున రాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౪౯ అగునేటి సర్వజితు సం॥ జ్యేష్ఠ, బ ౩౦ లు శ్రీమన్మహామండలేశ్వర పోలేపల్లె తిమ్మయదేవమహారాజులు పేరుసోమల కాసె గోపోజు కొడుకు తిమ్మోజుకు యిచ్చిన ఆకు: శ్రీమన్మహామండలేశ్వర బుక్కరాజు తిమ్మయదేవమహారాజులు మాకు ఉంబళి పాలించిన అవుకుసీమలోను నందిపాటిగ్రామాన శ్రీచెన్నకేశవ పెరుమాళ్లకు సింహాసనమున్ను, రంగమండపమున్ను, పేరుసోమల...... రాతిస్తంభమున్ను చేసేనిమిత్తం మీకు పెట్టిన చేను సర్వమాన్యంగాను యిస్తిమి.

ఇదిగాక కొల్లెపట్టిలో పొట్టిపాడు అనే గ్రామమున్ను, వనకెకాల్వ గ్రామం, గంగాపురగ్రామం ఈ మూడు గ్రామాలున్ను బ్రాహ్మణులకు సర్వాగ్రహారం నడుస్తూయుండెనని జనులు వాడుతున్నారు. ఇదిగాక తాలూకుమజుకూరులో నుండే శాసనముయొక్క సారాంశము.

కొల్లెపట్టి పొట్టిపాడు గ్రామానికి ఉత్తరం నృసింహస్వామి దేవాలయం యెదుట అక్షరములు శిథిలమయి యుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౧ అగునేటి విరోధి సం॥ ఆషాఢ, శు ౧౧ లు కృష్ణరాయల......య్యవారికి స్వామి రాయలు పాలించిన గండికోటకు పడమట పొట్టిపాడు ...... రాయసం తిమ్మరసు ఎఱమనాయుడు......అభంగగరుడవిరాయ ...... పరాపరమూర్తి యైన (అ) నాది అహోబళ శ్రీనరసింహదేవునికి అంగరంగ వైభవానకు గాను ధారవోసియిచ్చిన భూదానధర్మశాసనం క్రమమెట్లన్నను: ప్రథమ యేకాదశీ పుణ్యకాలమునందు, కృష్ణాతీరమందు స్వదత్త సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను ధారవోసి యిచ్చిన వెలిపాటనిపుడిని(?) చేను ఖ ౧ న్ని, మడి పెద్దకాలువవద్ద ఖ ।।౦ తిరుపణ్యారానికి ధారవోసి యిస్తిమి. పూర్వం దండు సాళువగోవిందరాజుంగారు ధారవోసి యిచ్చిన శాసనప్రమాణం చేను ఖ ౨, దిగువకాల్వమడి ఖ ౧న్ను, నెరసిచేను ఖ ౩, మడి ఖ ౧ ।। కున్ను వినియోగంధూపదీపనైవేద్యం కట్టడకు నిర్ణయంచేసిన చేను ఖ౧, మడి దిగువకాల్వ......కాక నిలచిన చేను ఖ ౨ న్ను మడి ఖ ౧ న్ని అక్షరాలను చేను యిరుపుట్టిన్నిమడి ఒకపుట్టిన్ని ఉభయమున్ను చేనుమడి సహాగాను యిస్తిమి.

౧ చారివారిఉప్పలపాడు[1] గ్రామం ఊరివాకిలి లోతట్టున నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౧ అగునేటి విరోధి సం॥ మాఘు, బ ౫ లు, శ్రీమతు జూపల్లి పెదసింగమనాయునికి పుణ్యంగాను దామెర తిమ్మలయ్యంగారు ఉప్పలపాటిగ్రామానను ఊరికి దక్షిణానను క్రొత్తగాను నుయ్యితొవ్వించి, ఆ నుయ్యి రాతికట్టడం కట్టించిన కాసె తిమ్మోజు పెదచిన్నోజుగారికి కొంతభూమి మాన్యంయిచ్చినారు.

ఇందులో కొన్ని అక్షరములు శిథిలములయినవి గనుక భూమి యిచ్చిన నిర్ణయం గోచరంకాలేదు.

౧౬. తరువాత పయినవ్రాసిన కృష్ణదేవమహారాయలవారి అన్న శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప అచ్యుతదేవ

1. The village is now called Sālevāri - Uppalapāḍu (See A. R. 379 of 1932-33).

మహారాయులు[1] విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై శాలివాహన శకవరుషంబులు ౧౪౫౨ ప్రారంభం శాలివాహనశకం ...... వరకు రాజ్యంసేయుచుండగాను యీరాయలవారున్ను, అమరనాయంకరానకు అనుభవించేవారున్ను, రెడ్లువగైరాలున్ను, రెడ్డికరణాలున్ను జంబుల మడుగు తాలూకాలో వేయించిన శిలాశాసనములు వాటి సారాంశము.

౧ కన్నెలూరు గ్రామమున గ్రామమునకు తూర్పు పోతరాజు దేవాలయమునకు యెదుట నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౨ అగునేటి విరోధి సం॥కార్తీక, శు ౧౨ లు, అచ్యుతరాయులు రాజ్యంసేయుచుండగాను వారి శిరః ప్రధానులైన, రాయలకుమరదులైన, శ్రీమన్మహామండలేశ్వరులైన సలక రాజు తిరుమలయ్య దేవమహారాజులుగారు ...... చినపాపసానికి యిచ్చిన భూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను : అచ్యుత దేవమహా రాయలు మాకు నాయంకరానికి పాలించిన చెన్నూరిసీమలోని కన్నె లూరు గ్రామానకు తూర్పు ఊరిముందర బావి తొవ్వించి రాతికట్టడం కట్టి నందులకు కొంతమాన్యం యిచ్చినట్టుగా నున్నది. మధ్యఅక్షరములు శిథిలములయినవి గనుక వివరం యేమి తెలియలేదు........

౧ గరిశలూరిగ్రామానికి యీశాన్యం పాడుగానున్న దేవాలయం వెనుక నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౩ అగునేటి ఖర సం॥ చైత్ర, శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర అష్టదిగ్రాయమనో భయంకర మూరురాయరగండ శ్రీవిజయనగరపట్టణాధీశ్వర ఈశ్వర నాయకపౌత్ర నరసానాయకపుత్ర శ్రీఅచ్యుతరాయ మహారాయ కృపా కటాక్షలబ్ధఅయిశ్వర్యధుర్య, సూర్యవంశోద్భవ, వశిష్టగోత్రపవిత్ర, బెజవాడపురవరాధీశ్వర, మల్లికార్జునదేవదివ్యశ్రీపాదపద్మారాధక, మాధవవర్మకులప్రదీప, బెజవాడపురప్రతిష్ఠాపనాచార్య, సేతుసీతాద్రి

1. A common mistake found in several village accounts.

పర్యంత...బిరుదరగండ, రణరంగభైరవ, మన్నె భార్గవ, కంఠమరాజ తిమ్మ రాజపౌత్ర, తిరుమలరాజపుత్ర, తిరుమల దేవీగర్భసుధాబ్ధిచంద్ర, వర్ణాశ్రమ ధర్మప్రతిపాలక, దేవబ్రాహ్మణపూజాపరాయణ, శ్రీనరసభూపాల చూడామణి హరిహరాదులకుంజేసిన కైంకర్యము: ఉదయగిరిరాజ్యము లోని ములికినాటి సీమలోని శ్రీవేదాద్రి, గరుడాద్రి మధ్య భవనాశినీతీర దివ్యమంటపనివాసులైన అహోబలేశ్వరుని యోజనపరిమితమైన నైఋతి దిగ్భాగాన మానాయంకరానకు చెల్లే చాంగలమర్రి సీమలోని కుముద్వతి దగ్గర గరిశలూరి పరమేశ్వర చెన్న కేశ్వరులకున్ను, మహారాజుగారికి పుణ్యముగాను ఆచంద్రార్క స్థాయిగాను మంటపాలుకట్టించి, నందాదీప అమృతపళ్లకున్ను చెల్లించేటందుకు ఈశ్వరునికిన్ని, చెన్న కేశ్వరునికిన్ని పూర్వము నల్తుం మాన్యము, క్రొత్తగాను నేముసమర్పించిన మాన్యం ఖ। యేదుముకున్ను, బసవన్నగుళ్లబయలు ౧౨న్ను, సకళం బసవయ్య చవిట చేను ౧ ౧, వెరసిస్థళాలు 3 చేను ఖ।3 న్ను దేవళ్లకు డోలు నాగసరాలు ఊడిగముచేసే అందుకు మంగళ కసవోజు కొడుకు రామోజు వారు దేవళ్ల ఊడిగముచేసి అనుభవించేది.

ఇందులోగూడ అక్కడక్కడ అక్షరములు విడిచిపోయినవి.

౧ దేవగుడి గ్రామాన తలకంటి దేవాలయానకు దక్షిణం పగిలి యుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౫ అగునేటి నందన సం॥ పుష్య, శు॥ ౧౨ లు తెలింగర్ణాయని తిమ్మానాయనింగారి కుమారుడు తిలంగయ్యంగారు దేవగుడి తలకంటిదేవరకు యిచ్చిన భూదానధర్మశాసన క్రమమెట్లన్నను: అచ్యుత దేవరాయలు రాజ్యము సేయుచుండగాను సకల (సలక) రాజు తిరుమలరాజుగారు చెన్నూరిసీమలోను మాకు నాయంక రానకు పాలించిన పెదదండ్లూరను కొర్లకుంట వెనుకను, పూర్వాన మాకు చెల్లే పొలానకు ఉత్తరమున సంక్రమణ పుణ్యకాలమందు తలకంటమ్మకు ధారవోసి అమృతపళ్లకు పెట్టినచేను ఖ।3 న్ను వరిమడి ఊరికి ఉత్తరా

నను చినదండ్లూరి కాలువమోయను ఖ ౦।౧ న్నూ చింతమాను ఒక టిన్ని ధారవోసి యిస్తిమి. స్వామి అచ్యుతరాయలకున్నూ, పెదతిరుమల రాజుగారికిన్ని పుణ్యముగాను, పూర్వానను తలకంటిఅమ్మకుచెల్లే కొర్ల కుంట మడి ఉత్తరంచేను ఖ ౦।౩, ఊరికిఉత్తరం మడి ఖ ౦।౩ న్ను యిస్తిమి.

చినకొమ్మర్ల గ్రామానకు వెలుపట చెన్నకేశవస్వామి దేవాలయములో ఉయ్యాలమండపంవద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౪ అగునేటి విజయ సం॥ కార్తీక, శు ౧౨ లు అచ్యుతరాయలు రాజ్యంసేయుచుండగాను కాశ్యప గోత్రాపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన భావయ్యగారి పౌత్రులున్ను, శ్రీరామయ్యగారిపుత్రులు అయిన తిమ్మరుసుంగారు యిచ్చిన భూదానధర్మశాసన క్రమమెట్లన్నను: అచ్యుత దేవమహారాయలు మాకు నాయంకరానికి పాలించియియ్యనవధరించిన గండికోటదేశానకు చెల్లే కొమ్మర్లగ్రామానకు చెన్నకేశవస్వామికి కొమ్మర్లగ్రామాన ఖ ౧౨ చేను పినాకినీతీరమందు లోకపావననృసింహదేవునిసన్నిధిని ధారవోసి యిస్తిమి.

పొన్నంపల్లె అనేగ్రామము గొడుగుమర్రి చెన్నకేశవునికి ధారవోసి యిచ్చినారు. ఇందుకు దృష్టాంతం యేమంటే, గ్రామంపొలిమేరలో నుండేది.

గొడుగుమర్రి కేశవనాథునికి పొన్నంపల్లె పొలిమేర.

అయ్యవారి కంబాలదిన్నె గ్రామంలో మంత్రాలమ్మతోట సమీపం చింతమానివద్ద.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౭ అగునేటి మన్మథ సం॥ పుష్య శు ౫ లు గొంగటిదేవ దివ్యశ్రీ పాదపద్మారాధకులయిన పెనుగొండ లక్కినాయని కొమారుడు పీరపణింగారితమ్ముడు వీర

నాయంనింగారు సమర్పించిన భూదానధర్మశాసనం క్రమ మెట్లన్నను: అచ్యుత దేవమహారాయలుంగారు మాకు అమరమాగాణికి పాలించిన గండికోట సీమలోని కొమ్మెర్ల వాయువ్యము కంబాలదిన్నె గ్రామం స్వామికి అమృతపళ్లకు అంగరంగవైభవాలకున్ను తథాతిథి మకరసంక్రాంతి పుణ్యకాలమునందు పినాకినీతీరమునందు మాస్వామి అచ్యుతమహారాయల వారికి పుణ్యముగాను, సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను ధార వోసి యిస్తిమి.

కల్లుట్లగ్రామానికి యీశాన్యము సామీప్యమున చెరువుకట్టను, కరమలవాని మాన్యంమడిలో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగునేటి దుర్ముఖి సం॥ కార్తీక, శు ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర నారాయణసింహరావాహునిధి వసాంత (?) రాజు కొండయ దేవమహారాజులయ్యాగారు కల్లుట్ల మంగల చినపీరోజులకు యిచ్చినవ్రాలు. శ్రీలక్ష్మీనరసింహమూర్తిని కొలువ నాగసరం సేవకుగాను......భీమచేను ఖం౦।౪ ...... నలచెరువు కట్టక్రింద చేను ౷ ౩ ఉభయం చేను మడి ఖం౦।।౨ నల్లచెరువు కట్టక్రింద కానమడి (కొన?) స్థళం ౷ ౨ ఉభయం మడిచేనున్ను అనుభవించుకొని బ్రతికేది.

మురపంది గ్రామం రాఘవభారతులు అనే యతీశ్వరులకు ధారాగ్రహీతంగా యిచ్చియుండిరి అని ఆ గ్రామస్తులు వాడుకొనుచున్నారు. ఇందుకు దృష్టాంతరం యేమంటే యీ గ్రామమునకు తూర్పు మజరా భూమసానిపల్లెకు తూర్పు రాగితోటలో ధ్వడియం మురపంది పొలిమేర నందున వుండేది.

○ వామనప్రతిమ ◡

రాఘవభారతుల గ్రామం.

౧ కిల్లేపట్టి ఫకీరుపల్లెకు ప్రాచీననామము కుడుపకుంట. ఈ గ్రామం అచ్యుతరాయలు, విజయభారతులు అనే యతీశ్వరులకు ధారాగ్రహీతంగా యిచ్చినారని జనులు వాడుకొనుచున్నారు. ఇందుకుదృష్టాం

తరం యీగ్రామానికి ఉత్తరం యీ గ్రామం పొలిమేరకున్ను బుక్క-పట్ణం పొలిమేరకున్ను సందున వుండేది.

విజయభారతీపురానకు ఉత్తరం పొలిమేర......

౧ క్లిప్తపట్టి అనంతపురగ్రామాన విఘ్నేశ్వరుని దేవాలయమువద్ద శిథిలమయి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౫౮ అగునేటి దుర్ముఖి సం॥ భాద్రపద, బ ౨ లు శ్రీమతు నవరసి పాపినాయనింగారికి అచ్యుత దేవమహారాయలు పాలించిన తాళ్ళపొదటూరిసీమలోని అనంతపురం గ్రామం వలువరెడ్డికి యిచ్చిన శాసనము. గ్రామము అరుభై (?) యుండగాను దొంతు పాపిరెడ్డి కరణం సమ్మతిన యిచ్చిన వివరం. గ్రామాన నుండి నేసుకొనే మగ్గాల వారికి మగ్గం ఒకటింటికి గ ౹౹౦ లెక్క-ను అరమగ్గానకు ర్ ౩ లెక్క-ను కానికె సిద్ధాయం వెట్టి వేము సర్వమాన్యంగాను చేస్తిమి.

౧ క్లిప్తపట్టి గ్రామానకు పడమర వా(ఓ)బనపల్లె గ్రామానకు దక్షిణం ఓబళాపురం మార్గంలో లోగడ గండ్లూరిపొలంలో నుండిన రాయి యీవల తెచ్చివేసినది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౦ ...... సంవత్సరం......

దిగువ వామనప్రతిమ ఉన్నది. వామనప్రతిమె వ్రాసియున్నది గనుక గండ్లూరుగ్రామము అగ్రహారమయి యుండవలయును.

౧ చిదిపిరాళ్లదిన్నె గ్రామానకు పూర్వభాగమందు ఈశ్వరుని దేవాలయం దగ్గర నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౦ అగునేటి విళంబి సం॥ ఆషాఢ, శు ౧౨ లు శ్రీగోవింద దేవుడు అహోబళాద్రికి వేంచేసి శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్యులయిన తాళ్లపాకపెద్దన్న ......... శ్రీవీర అచ్యుతరాయ మహారాయలు యిచ్చిన భూదానధర్మశాసనం: ఆరగింపుల

కున్ను, అతిరసాలకున్ను, అఖండతిరువళికెలకున్న చాంగలమఱ్ఱి సీమ లోని చిదిపిరేళ్లదిన్నె అనేగ్రామము ...... సింహాసనస్తంగాను (?) ఆచంద్రార్కస్థాయిగాను సమర్పిస్తిమి.

శ్రీకంభంకొండదేవుని శ్రీపాదపద్మంబులకు శ్రీమన్మహామండలేశ్వర వల్లభయ్యదేవమహారాజు కొమారుడు చౌషష్టివిద్యాధురంధరుడయిన బసువయ్యదేవ మహారాజులు దండము సమర్పించి యిచ్చిన భూదానము: మా చాంగలమఱ్రి సీమలో చిదిపిరాళ్లదిన్నె ఆచంద్రార్కస్థాయిగాను సమర్పిస్తిమి.

తరువాత శ్రీమద్రాజాధిరాజు రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాయలు విజయనగరమునందు వజ్రసింహాసనా రూఢులయి పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను గండికోటరాజ్యం నందెలరాజులకు అమరనాయంకరానకు యిచ్చియుండిరి. వారితట్టునుంచి కమ్మజాతిఅయిన పెమ్మసాని తిమ్మానాయుడు అనేఆయన గండికోట రాజ్యానకు అధికారపత్రుడయి యుండెను. పైనవ్రాసిన సదాశివరాయ లున్ను, అమరానికి అనుభవించేవారున్నూ, రెడ్డికరణాలున్ను జంబుల మడుగు తాలూకాలో వేయించిన శిలాశాసనముయొక్క సారాంశము.

౧ కిష్లేపట్టి గండ్లూరిగ్రామం వీధిలో గంగమ్మ జాతరచేసే వేప మాని అరుగువద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౪ అగునేటి శుభకృతు సం॥ ఆషాఢ, శు ౧౨ లు, సూర్యవంశోద్భవు లయిన, కాస్యపగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన, శ్రీమన్మహామండలేశ్వర గొబ్బూరి కోనమరాజుగారి పౌత్రు లయిన తిమ్మరాజుగారి పుత్రు లయిన అవుబళ దేవమహారాజులంగారి నాయంకరానకు పాలించిన గండికోటరాజ్యంలోని గండికోటకు పడమర గండ్లూరిగ్రామాన......యిచ్చిన భూదానధర్మ శాసనం క్రమ మెట్లన్నను: సదాశివదేవమహారాయలు మా నాయంక రానికి పాలించిన ఉదయగిరిదుర్గానికిచెల్లే గండికోటసీమలోని గండికోటకు

పడమర గండ్లూరి గ్రామమునందు............ధారపోసి సమర్పించిన చేను ఖ । 3..................

౧ తొర్రెవేముల గ్రామానకు తూర్పు ఆంజనేయుల దేవాలయానకు యెదుట నుండేది.

శాలివాహనవకవరుషంబులు ౧౪౬౫ అగునేటి శోభకృతు సం॥ శ్రావణ, బ ౧౨ లు సదాశివ దేవమహారాయలు రాజ్యం సేయుచుండగాను రామరాజు చినతిమ్మరాజుకు నాయంకరానకు పాలించిన రామేశ్వరం పొదటూరి సీమలోని తొర్రెవేముల కలుమళ్ల లక్షుమరాజుకు ఉమ్మళ్లి పాలించెను. రామరాజు తిమ్మరాజుకు పుణ్యాంగాను హనుమంతరాయనికి రేగటిచేను ఖం।। సమర్పిస్తిమి.

౧ బలపనగూడూరి గ్రామానకు తూర్పు దేవాలయంలో నాగులకట్టకు ఉండేది. ప్రథమభాగం రాయిపగిలిపోయినది.

శ్రీమన్మహామండలేశ్వర సోమరాజు తమ్మయ దేవమహారాజులు నంబితిప్పరాజుకు యిచ్చిన ధర్మశాసనం. బందిబోయలగూడూరు పెరుమాళ్లకు పుష్పాల పేరులు బెట్టను ఉప్పులవాడితోట ఖ ం ౫ ం।। ం ం యిరుస మాన్యం సమర్పిస్తిమి.

ఇందులో శకసంవత్సరం పోయినది. అయితే యీరాజుయొక్క శాసనములు యితర స్థళములలో సదాశివరాయల యేలుబడిలో నున్నవి.

నెమళ్లదిన్నె గ్రామానకు వెలపట రాజువోలుకోనకు దక్షిణం చలివిందలబండ దగ్గిర ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సం॥ కార్తీక, శు ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వర సోమవంశోద్భవు లయిన ఆత్రేయగోత్రపవిత్రు లయిన ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రులు రామరాజుగారి పౌత్రులు, తిమ్మరాజుగారి పుత్రులు తిమ్మరాజయ్య దేవ

మహారాజులుగారు శ్రీమద్యజనాదిషట్కర్మనిరతు లయిన నెమళ్లదిన్నె స్థితాశేషవిద్వత్ మహాజనాలకున్ను యిచ్చిన ధర్మశాసనం. మా నాయంకరానకు చెల్లే అవుకు సీమలోని నెమళ్లదిన్నె అగ్రహారాన నగరికి పెట్టే శ్రోత్రియం, కట్నం, కానికె, వెట్టిసహా సదాశివరాయల ఆనతిని సర్వమాన్యం చేస్తిమి.

౧ కిల్లేపట్టి సంకెపల్లెగ్రామంలో ఆంజనేయులస్వామి దేవాలయం యెదుట నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సం॥ కార్తీక, శు ౧౫ లు సదాశివరాయలు రాజ్యం సేయుచుండగాను కాశ్యప గోత్రోద్భవు లయిన శ్రీమన్మహామండలేశ్వర వరదరాజు చినవెంగళయ్య దేవమహారాజులు సంకెపల్లి జనార్దనదేవునికి సమర్పించి యిచ్చిన మగ్గాల ధర్మశాసనం. హళియరామరాజయ్యదేవ మహారాజులుగారు మా నాయంకరానకు పాలించిన గుత్తి సీమలోని సంకేపల్లెగ్రామాన నేసే మగ్గాలలోన మా మల్లెమమ్మగారికి పుణ్యంగాను ధారపోసిన మగ్గాలు ౪ ఈ మగ్గాలు సిద్ధాయం కానికెలు సహా యిస్తిమి.

కిల్లేపట్టి కోడూరుగ్రామాన చెన్నకేశవస్వామి దేవాలయం యెదుట నుండేది.

శాలిహహనశకవరుషంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సం॥ కార్తీక, శు ౧౨ లు సదాశివరాయలు రాజ్యం సేయుచుండంగాను శ్రీమన్మహా మండలేశ్వర అల్లుడు రామరాజు దేవ మహారాజులంగారు వేయించిన శిలాశాసనము: రాయరాజ్యంలోగల మంగళ్ల పన్ను, సిద్ధాయం రాయలు తమ పనివాోజు కొండోజుకు సర్వమాన్యంగాను పాలించి విడిచినారు. గుత్తిదుర్గానకుచెల్లేటి పెన్నబడిగ్రామము కోడూరి మంగళ్ల పన్ను, సిద్ధాయం, వెట్టి, విరాళము, దొమ్మరిపన్నుసహా సర్వమాన్యంగాను విడిస్తిమి.

౧ పెదకొమ్మర్లగ్రామానకు ఆగ్నేయం పావుకోసు దూరాన పెద్దబీడు చేనులో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సం॥ మాఘ, బ ౩౦ లు ఆత్రేయగోత్రాన్వయు లయిన శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల తిమ్మయ దేవమహారాజులు కొమ్మెర్ల కందుకూరుబసిరెడ్డికి పౌజన మాన్యపు చేనికి వేయించిన శిలాశాసన క్రమ మెట్లన్నను: మాకు సదా శివదేవరాయలు నాయంకరానకు పాలించి యిచ్చిన గండికోట సీమలోని పెదకొమ్మెర్ల, చినకొమ్మెర్ల గ్రామాలు రెండింటికి పొత్తుచేను కడప పోతిరెడ్డిగారి పెద్దచేని స్థళం ఖ ౦౹౹౦ చేను యిస్తిమి.

౧ గండికోట దుర్గంలో రఘునాథస్వామి దేవాలయము ప్రాకార మునకు దక్షిణమువైపున ప్రాకారంరాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౭ అగునేటి విశ్వావసు సం॥ చైత్ర, శు ౬ లు శనివారము సదాశివరాయలు రాజ్యము చేయుచుండ గాను ఉదయగిరి రాజ్యానకు చెల్లేటి గంటికోట దుర్గంమీాద నివాసు డయిన అఖిలాండకోటిబ్రహ్మాండనాయకు డయిన, శరణాగతవజ్రపంజరు డయిన, గండి శ్రీ రఘునాథ దేవునికి శ్రీ మన్మహామండలేశ్వర సోమవంశోద్భవు లయిన, ఆత్రేయసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన నంద్యాల అవుబళేశ్వర దేవ మహారాజులు గారి పౌత్రు లయిన నరసింహ దేవ మహారాజులుంగారి పుత్రు లయిన నంద్యాల తిరుమలదేవ మహా రాజులుంగారు సమర్పించిన ధర్మశాసన క్రమ మెట్లన్నను: సదాశివ దేవమహారాయలు మాకు నాయంకరానకు పాలింప నవధరించిన గండి కోటసీమలోని మలమీాదికంభాలదిన్నె గ్రామం రఘునాథ దేవునికి అమృత పడి, అంగరంగవైభవాలకున్ను కట్టడసేసి శ్రీరామజయంతి పుణ్య కాలమందున సహిరణ్యోదకదానధారాపూర్వకముగాను ఆచంద్రార్క స్థాయిగాను సమర్పిస్తిమి.

౧ కోరువానిపల్లె ఆంజనేయుల దేవళంలో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౭ అగునేటి విశ్వావసు సం॥ ఆషాఢ, శు ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయగోత్రం ఆపస్తంబ సూత్రం యజుశ్శాఖాధ్యాయులైన సత్యభాషాహరిశ్చంద్రులైన సోమ

వంశాధీశ్వరు లైన ఆరవీటి రామరాజుతిమ్మయదేవమహారాజుగారి కొమారుడు, చినతిమ్మయదేవమహారాజులుంగారు, అవుబళభట్లగారికి యిచ్చిన భూదాన ధర్మశాసనం: సదాశివదేవమహారాయలు మాకు నాయంకరానకు పాలించిన రేనాటిసీమలోను, అవుకు సీమకు చెల్లే కోరు వానిపల్లెకు ప్రతినామ మయిన చినతిమ్మరాజుపురము చతుస్సీమలకు లోనైన నిధినిక్షేప జలపాషాణ అక్షీణఆగామి సిద్ధసాధ్యంబు లనేటి అష్టభోగ తేజస్వామ్యాలున్ను యీ సోమగ్రహాణ పుణ్యకాలమునందు తిరువేంకటాద్రి సన్నిధిని సువర్ణముఖితీరమునందు సహిరణ్యోదకదాన ధారాపూర్వకముగాను ధారవోసి యిస్తిమి.

౧ తలమంచిపట్టణంకోటలో ఆంజనేయస్వామి దేవళంవద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౭ అగునేటి విశ్వావసు సం॥ భాద్రపద, శు ౧౪ లు సదాశివరాయలు రాజ్యము చేయుచుండగాను గండికోట సీమలోని గ్రామము చలమర్ధిగండపట్టణం సంపెట లింగరాజు గారు, శ్రీ మన్మహామండలేశ్వర జగతాపి కంచిరాజు సోమదేవచోడ మహారాజుల కొమారుడు ఓబళరాజదేవ మహారాజులుగారు పట్ణం మాధవాపురము హనుమంతరాయనికిన్ని అవసరము సాగించి దేవునికి కట్టడకు నడిచేటట్టుగాను కట్టడచేసినది: క్రితానభి.........రాజుకు తెలు గణ్ణాయని లింగానాయునికి ధారపోసిన చేను ౧౨.న్ను వరిమడి ౧౨న్ను జుమలా ౧౩[1] ఆ గంగరాజుచేత క్రయానికి పుచ్చుకొని యిస్తిమి.

౧ గొల్లపల్లెగ్రామమున్ను యింకా కనుమక్రింద ద్రవిడదేశము లోను యింకా కొన్ని గామములున్ను సదాశివదేవమహారాయలుగారు పుష్పగిరి మఠస్వాములవారికి ధారాగ్రహీతముగాను యిచ్చి శాలివాహన శకవరుషంబులు ౧౪౬౭ పరావ సం॥ భాద్రపద, బ ౧౦ లు నాగర అక్షరములతో తామ్రశాసనము వ్రాయించియిచ్చినారు.[2]

1. The calculation is faulty. The total extent of the land granted must be ౧

2. The text of this Grant is not given here.

౧ పెదకొమ్మెర్ల గ్రామాన చెన్న కేశవుని దేవాలయములో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౭ అగునేటి పరాభవ సం॥ ఆషాఢ, బ ౧౦ లు పెదకొమ్మెర్ల చెన్న రాయనికి శ్రీ మన్మహామండలేశ్వర నంద్యాల అవుబళరాజుగారి పౌత్రులు అవుబళేశ్వరదేవ మహారాజులు గారి పుత్రులు అయిన చిన అవుబళ్వేరదేవ మహారాజులుగారు యిచ్చిన భూదాన ధర్మశాసనము: సదాశివదేవ మహారాయలు మూనాయంక రానకు పాలించిన గండికోట సీమలోని పెదకొమ్మెర్ల గ్రామానను చెన్న కేశవస్వామి నైవేద్యదీపారాధనఅంగరంగవైభవాలు సకల మహోత్సవాలకున్ను పినాకినీతీరమునందు లోకపావన శ్రీ నృసింహస్వామి సన్నిధిని మా పెద్దతల్లిగారు లక్ష్మమ్మగారికి తిరుకైంకర్యమునకుగాను పెద కొమ్మెర్ల గ్రామాన కొండపొలమున నరసింహాపురం లక్ష్మీపురానకు పెద రేగడస్థళము చెరువుకు తూర్పు పొలము ఖ ౧౨ న్నూ, ఉప్పలపాటి చెరువుచేను ఖ ౧౩ న్నూ, వరిమడి చెరువుక్రిందను ఖ ।।౧ న్ని సమ ర్పిస్తిమి.

౧ దేవగుడి గ్రామాన తలకంటీశ్వరి దేవాలయం యెదుట ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సం॥ ఆషాఢ, బ ౧౧ లు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంతా చార్యు లయిన కందాళం అప్పలాచార్యులయ్యవారికి శ్రీ మన్మహామండ లేశ్వర కొండ్రాజు చినతిమ్మయ్యదేవ మహారాజులు పాలించిన చెన్నూరి సీమలోని గ్రామము తూగుటపల్లె ధారాపూర్వకంగాను సమర్పిస్తిమి. ఆ గ్రామమునకు కలిగిన అష్టభోగ తేజస్వామ్యములతోకూడా ఆంద్రార్క స్థాయిగాను అనుభవించేది.

౧ కిబ్లేపట్టి లావనూరు గ్రామాన మాధవస్వామి దేవాలయంవద్ద.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సం॥ కార్తీక, శు ౧౧ లు గు॥ సదాశివరాయలు రాజ్యము సేయుచుండగాను విప్రవినోదులకు యీ లావనూరి అగ్రహారీకులు యిచ్చేవర్తన పది మాడలున్న మాధవేశ్వరుని స్వస్తిరోహణంవాచనకు సమర్పిస్తిమి.

౧ కిబ్లేపట్టి బెడదూరి ఉత్తరం చెన్నకేశవస్వామి దేవాలయం గర్భగుడిలో రాతిదూలముపైన నుండేది.

శాలివాహశకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సం॥ మార్గశిర, బ ౨ లు గండికోట సీమలోను నంద్యాలతిమ్మరాజుగారు సదాశివదేవ మహారాయలచేతను శాసనం పుచ్చుకొని తమ తండ్రిగారి పేర చేసిన బెడదూరు ప్రతినామము నరసింహాపురము అగ్రహారము నందు కొండమీదనున్న తిరువెంగళనాథస్వామికిన్ని, చెన్నకేశవునికిన్ని, మహాలింగానికిన్ని, యీ మొదలయిన దేవాలయాలకున్ను దొమ్మరి వారికి అగ్రహారీకులు యిచ్చేపన్ను ధారపోసి యిస్తిమి.

౧ కిబ్లేపట్టి లావనూరిగ్రామానకు తూర్పు ఎల్లమ్మదేవళంవద్ద ఉత్తరముగా తోటలో ...... అక్షరములు శిథిలమై యుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౬౯ అగునేటి ప్లవంగ సం॥ మార్గశిర, బ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాలతిమ్మరాజయ్య దేవమహారాజులుగారు వ్రాయించిన శిలాశాసనము: సదాశివదేవమహారాయల ఆనతిని రామరాజయ్య......మా నాయంకరానికి చెల్లే గండికోట సీమలోని లావనూరు...........

ఈవల అక్షరములు బొత్తిగా పోయినవి.

౧ కిబ్లేపట్టి ఎర్రగుడిగ్రామానికి దక్షిణం ఆంజనేయుల దేవళము వద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౦ అగునేటి కీలక సం॥ వైశాఖ, శు ౨ లు సోమవంశోద్భవు లైన ఆత్రేయగోత్ర ఆపస్తంబసూత్ర శ్రీ మన్మహామండలేశ్వర నందెల నరసింగయ్య దేవమహారాజులు అవుబళేశ్వర స్వామికి దండములు సమర్పించి యిచ్చిన భూదానధర్మశాసన క్రమ మెట్లన్నను: సదాశివదేవ మహారాయలు మానాయంకరానకు పాలించిన......లోని తాళ్లప్రొద్దుటూరికి వాయువ్యం, ఎర్రసిద్ధమడుగు తూర్పు, ఎర్రచెలకకు ఆగ్నేయం, చామలూరికి నైరుతి, నాంగమళ్ల దిన్నెకు యీశాన్యము పెన్నదరిని హారగ్రామం...శ్రీ దేవతాసామ్మకు ఆసపడి ఎర్రగుడి గుత్తకు తీసికునియెడి రాచఆలికి చండాలుండు సుధృ ......తిరువద్యానతిరునాళ్లకున్ను, ఉయ్యాళ్ల తిరునాళ్లకున్ను, మండపం వడలపతికిన్ని ఆచంద్రార్కస్థాయిగాను సమర్పిస్తిమి.

౧ కల్లేపట్టి సుగుమంచిపల్లె గ్రామాన చెన్నకేశవుని దేవళములో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౦ అగునేటి కీలక సం॥ మాఘు, శు ౭ లు శ్రీ మన్మమహామండలేశ్వర ఆత్రేయగోత్రపవిత్రులైన, సోమ వంశాధీశ్వరులైన, శ్రీ కృష్ణపాదారవిందద్వితీయ సేవకులైన, నిస్సీమ భూదానచక్రవర్తులైన, పరమధార్మికులైన, పదవాక్యప్రమాణజ్ఞులైన ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రులు, రామరాజుగారి పౌత్రులు, తిమ్మ రాజుగారి పుత్రులు చినతిమ్మయ దేవమహారాజుగారు సుగుమంచిపల్లె గ్రామకరణాలకు యిచ్చిన ధర్మశాసనము: శ్రీ సదాశివ దేవమహారాయలు గారు మానాయంకరానకు పాలించిన గండికోట సీమలోని పడమటిహార గ్రామము సుగుమంచిపల్లెను మిమ్ము ప్లవంగసంవత్సరానను మీకు కరణీక మాన్యాలకున్నూ, వృత్తిమాన్యాలకున్నూ, వరిమళ్లకున్నూ కొన్న మాడలు, ధారవోసి సర్వమాన్యము చేసియిస్తిమి.

౧ కల్లేపట్టి కోడూరిగ్రామాన చెన్నకేశవుని దేవళమువద్ద

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౦ అగునేటి కీలక సం॥ భాద్రపద, శు ౧౫ లు సదాశివరాయలు రాజ్యముచేయుచుండగాను

శ్రీ మన్మహామండలేశ్వర అళిరామప్పయ్యదేవమహారాజులుగారు పాలించి యియ్యనవధరించిన గుత్తిసీమలోను పెన్నబడిగ్రామాలలోను కోడూరి గ్రామమునందు, శ్రీ చెన్నకేశ్వరస్వామి దీపారాధన నైవేద్యానకు దొమ్మరివారికి యీ కోడూరిగ్రామస్తులు యిచ్చేవర్తన దొమ్మరివారు సమర్పించిరి.

౧ కిల్లేపట్టి బెడదూరుగ్రామానికి పడమర వీరభద్రుని దేవాలయమువద్ద.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౧ అగునేటి సౌమ్య సం॥ చైత్ర, బ ౧౦ లు జంగాలగురువు అయిన సిద్ధభిక్షావృత్తి అయ్యవారి ఆనతిని వీరముష్టి (వారు) గండికోటకు చెల్లే బెడదూరికి ప్రతినామమైన నరసింహాపురం అగ్రహారం, విశ్వేశ్వరుని, గవిరామలింగస్వామి అమృత పళ్లకున్నూ, మాసమహోత్సవాలకున్ను బెడదూరి అగ్రహారీకులు వీర ముష్టులకు యిచ్చే పన్ను ధారవోసి యిస్తిమి.

౧ కిల్లేపట్టి ఎనమలచింతల గ్రామానకు దక్షిణము, ఆంజనేయ దేవాలయము వద్ద.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౨ అగునేటి సౌమ్య సం॥ చైత్ర, బ ౩౦ లు శు॥ సదాశివరాయలు రాజ్యం సేయుచుండగాను ముసళగోత్రులైన, పెమ్మసాని తిమ్మానాయనింగారి కుమారుడు చిన తిమ్మానాయనింగారు తాడిపరతి చింతల తిరువేంగళనాథ దేవునికి దండము సమర్పించి యిచ్చిన శాసనము: శ్రీ సదాశివదేవమహారాయలు మాకు నాయంకరానకు పాలించిన గుత్తిమాగాణికి చెల్లే తాళ్లపొద్దుటూరి సీమలోన, చిరబడి సీమ, ఎనమచింతలగ్రామము ఈ తథాతిథి, సూర్యోప రాగపుణ్యకాలమునందు తుంగభద్రాతీరమందు శ్రీ విరలేశ్వరుని సన్నిధిని శ్రీ సదాశివదేవమహారాయలకున్నూ, అళిరామప్పయ్యదేవ మహారాజు గారికిన్ని, తమ తల్లిదండ్రులు తిమ్మానాయుడు, మాచమమ్మగారికిన్ని పుణ్యముగానున్ను తాడిపరతి శ్రీ చింతలతిరువేంగళనాథ దేవునికి

అమృతపళ్లకున్ను అంగరంగవైభవాలకున్ను ఎనమచింతల గ్రామము ధారవోసి సమర్పిస్తిమి. ఈ యెనమలచింతలగ్రామానకు చెల్లే చతుస్సీమలోనైన అష్టభోగ తేజస్వామ్యములున్ను ధారపోసి సమర్పిస్తిమి.

౧ కిళ్లేపట్టి పొట్టిపాడు గ్రామాన వీరభద్రుని దేవళం వద్ద.

శాలివాహనశకవరుషంబు ౧౮౭౩ అగునేటి సాధారణ సం॥ శ్రావణ, బ ౩౦ జంగాలగురువు అయిన సిద్ధభిక్షావృత్తివారి ఆనతిని వీరముష్టివారు తమకు పొట్టిపాడుగ్రామస్తులు యిచ్చే పన్ను యీ గ్రామమున నున్న మల్లికార్జునవీరభద్రస్వామికి దీపారాధనకు సమర్పిస్తిమి.

౧ పెద్దముడియంగ్రామాన వీరభద్రుని దేవాలయము వద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౮౭౩ అగునేటి విరోధికృతు సం॥ శ్రావణ, బ ౯ లు గండికోట రాజ్యములోని రేనాటి సీమలోని త్రిలోచనపురానకు ప్రతినామమైన బ్రాహ్మణముడియం యజనాదిషట్కర్మనిరతులైన నూటయెనమంద్రు స్థితాశేషవిద్వన్మహాజనాలకున్నూ శ్రీ త్రిలోచనపుర ప్రతిగ్రహాలబ్ధమైన బ్రాహ్మలముడియం సర్వమాన్య అగ్రహారమునందు శ్రీ సోమేశ్వర దేవునికి, శ్రీనృసింహ దేవునికిన్ని వీరముష్టులకు అయ్యావళిముఖ్యమైనవారున్ను, తమ్ముళ్లు మొదలైనవారు ఇచ్చే వీరముష్టిపన్ను దేవునికి దీపారాధనలకు సమర్పిస్తిమి.

౧ పెదకొమ్మెర్లగ్రామాన చెన్నకేశవుని దేవాలయములో.

శాలివాహనశకవరుషంబులు ౧౮౭౩ అగునేటి విరోధికృతు సం॥ శ్రావణ, బ ౮ లు విప్రవినోదులు అనే యక్షిణీవిద్య ఆడే బ్రాహ్మలకు యీ గ్రామం గ్రామస్తులు యిచ్చే వర్తన పెరుమాళ్లకు ధారపోసి యిస్తిమి.

౧ గుండ్లకుంటగ్రామాన చెన్నకేశ్వరుని దేవాలయములో నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౩ అగునేటి విరోధికృతు సం॥ నిజభాద్రపద, బ ౧౧ లు శ్రీమారకాపురం చెన్నరాయనికి వేముల కూర్మయ్యగారి ప్రపౌత్రులయిన చెన్నమయ్యగారి పౌత్రులు వరదరాజు గారి పుత్రులు చెన్నమయ్యగారికి శ్రీ మన్మహామండలేశ్వర ఆరవీటి బుక్క-రాజుగారి ప్రపౌత్రులు రామరాజుగారి పౌత్రులు తిమ్మరాజుగారి పుత్రులు పాపతిమ్మరాజయ్యదేవ మహారాజులుగారు సమర్పించిన భూదానధర్మ శాసనము క్రమమెట్లన్నను: మానాయంకరానకు చెల్లే హారగ్రామాల గుండ్లకుంటను చేను ఖ ౨ యిస్తిమి.

గుండ్లకుంటలో చెన్నకేశవుని దేవళములో.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౩ అగునేటి పరీధావి సం॥ మాఘ, శు ౧ లు గుండ్లకుంట చెన్నరాయనికి విప్రవినోదులు అనే బ్రాహ్మణులకు గుండ్లకుంట మహాజనాలు యిచ్చేవర్తన స్వామికి ఉట్ల తిరునాళ్లకు సమర్పిస్తిమి.

కిబ్లేపట్టి చాములూరిగ్రామాన చెన్నకేశవుని దేవళమువద్ద అక్షర ములు శిథిలమయి యుండేది.

శకసంవత్సరం ఉన్నస్థళము శిథిలమైనది.

సదాశివరాయలు రాజ్యముసేయుచుండగాను గుత్తిరాజ్యానకు చెల్లే వీరనరసింహాపురానికి ప్రతినామమయిన చాములూరి చెన్నకేశవునికి సంక్రాంతి మహోత్సవానకు విప్రవినోదులకు యీ అగ్రహారీకులు యిచ్చే వర్తన సమర్పించిరి.

కిబ్లేపట్టి పొట్టిపాడుగ్రామానికి తూర్పు అరపరువున మజరా పెద్ది రెడ్డి తిమ్మయపల్లెకు దక్షిణం చేనులో నుండేది.

ప్రమాదీచ సం॥ కార్తీక, శు ౧౨ లు శ్రీమతు పొట్టిపాటి చాతాని బలభద్రయ్యకు శ్రీమన్మహామండలేశ్వర మాండ్రాజు సింగయ్య దేవ మహారాజులుంగారు సమర్పించిన చేను ౧౨, మడి ౧౩ ఉభయం యిస్తిమి.

ఇందులో శకం లేదు. ఇతర స్థళములో యీ రాజు శాసనములలో నున్నప్రకారం యిందుకు శకం ౧౪౭౫ అవుతున్నది.

చినకొమ్మెర్ల గ్రామాన చెన్నకేశవుని దేవాలయం వద్ద.

ఆనంద సం॥ వైశాఖ, శు ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర నందెల తిమ్మయదేవ మహారాజులుంగారు చినకొమ్మెర్ల మంగళ్ళ ఓజులకు యిచ్చిన శాసనం క్రమం యెట్లన్నను: సదాశివదేవ మహారాయలున్ను రామ రాజయ్యగారున్ను రాయరాణువసీమ కెల్లాను మంగలపన్ను సర్వమాన్యం చేసి మన్నించిరి గనుక మేమున్ను చినకొమ్మెర్ల మంగలపన్నును సర్వ మాన్యంగాను యిస్తిమి.

ఇందులో శకములేదు. ఇతరస్థళం ప్రకారము శకము ౧౪౭౫ అవుతున్నది.

గండికోటకు దక్షిణము నాగఝరివద్ద రాగివృక్షానికి యీశాన్యం పుట్టుశిలపైన నుండేది.

ఆనంద సం॥ మాఘ, శు ౨ లు, శు॥ నాగఝరి చెన్నరాయనికి తళిగె తిరువారాధనకు మేకకొనచెలమవద్దనుండి దొనదాకను సూరప్ప బావి ఉత్తరం అంచు మొదలుగాను తిమ్మరాజుగారి తోటదాకాను యీ రెండుతోటలున్ను రంగపతిరాజుకు పుణ్యముగాను ఆరవీటి కృష్ణప్ప, తిమ్మరాజు, నాగరాజు, వెంకట్రాజు, కొండ్రాజుగారలు సమర్పించిరి.

ఇందుకు శకం ౧౪౭౫ అవుతున్నది.

పొన్నతోటగ్రామాన చెన్నకేశవస్వామి దేవాలయానికి పడమర రాగితోటలో.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౬ అగునేటి రాక్షస సం॥ జ్యేష్ఠ, బ ౮ లు సదాశివరాయలు రాజ్యం సేయుచుండగాను పొన్న తోటగ్రామాన నున్న మహాజనాలకు కాశ్యపగోత్రం ఆపస్తంబసూత్రం

యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోదులు బ్రాహ్మలు యింకా నానాగోత్ర నానాశాఖాధ్యాయులైన విప్రవినోది బ్రాహ్మలు తమకు యీ గ్రామాన యిచ్చే వర్తన చెన్నకేశవస్వామి సంక్రాంతి మహోత్సవానికి సమర్పిస్తిమి.

౧ కిల్లేపట్టె దిగువ బ్రాహ్మణపల్లె గ్రామంలో ఆంజనేయుల దేవాలయము వద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౬ అగునేటి రాక్షస సం॥ మార్గశిర, శు ౨ గు॥ సదాశివరాయలు రాజ్యం నేయుచుండగాను పెనుగొండచావడి గండికోట సీమలోని గండ్లూరికి ఆగ్నేయం ఖండవోలు బ్రాహ్మణపల్లెకు ప్రతినామమైన విజయబుక్కరాయపుర మనెడి అగ్రహారము పూలూరు శంఖవరము అనెడి మూడువాడల మీదనున్న స్థితాశేష విద్వన్మహాజనాలు విప్రవినోదులకు యిచ్చే వర్తన యీ గ్రామాన నున్న మాధవదేవునికి సమర్పిస్తిమి.

కిల్లేపట్టె ఓబుళాపురం గ్రామానికి తూర్పుపొలి మేరలో నుండేది.

శాలిహానశకవరుషంబులు ౧౪౭౬ అగునేటి రాక్షస సం॥ మార్గశిర, శు ౨ లు గు॥ సదాశివదేవరాయలు రాజ్యం నేయుచుండగాను పెనుగొండచావడి గండికోట సీమలోని గండ్లూరికి దక్షిణభాగమందు అవుబళాపురానకు ప్రతినామమైన విజయబుక్కరాయపురానకు బ్రాహ్మణపల్లెకు పొలిమేరకు శాసనం.

౧ బైస్తవేముల గ్రామానకు తూర్పుమజరా జంగాలపల్లెకు యీశాన్యము కల్లుట్ల సరిహద్దున శిథిలమయి యుండేది.

శకసంవత్సరములు శిథిలమయి పోయినవి.

శ్రీమన్మహామండలేశ్వర గండమయ దేవ మహారాజుల కొమ్మారుడు వెంగళరాజు చవుక రాజుగారు గండికోట వీరయ్యకొడుకు......జనున్నాల కురివి వీరయ్యగారు, వీరు మొదలయిన అయ్యంగాండ్లకు వ్రాయించి• యిచ్చిన శాసనం.........పొలంలోతోట......చేను యిస్తిమి.

ఈ శాసనానకు రేగుంటకు పడమర కుమ్మరకుంటకు తూర్పున నుండేది.

౩ పైవేములకు ప్రతినామము అయిన ప్రసన్న రాఘవరాజపురం.

ఈ ప్రకారము యీ గ్రామము పొలిమేరలలో వ్రాయబడియున్నది.

౧ భీమగుండం గ్రామాన ఉత్తరం పగిలియున్న రాతికి.

శాలివాహనశకసంవత్సరములు ౧౪౭౭ అగునేటి రాక్షస సం॥ చైత్ర, బ ౧౦ లు విప్రవినోదులు అనే బ్రాహ్మణులు భీమగుండమునకు ప్రతినామము అయిన అచ్యుతరాయపురము చెన్నకేశవపెరుమాళ్లకు తమకు యీ గ్రామానయిచ్చే వర్తన చెన్నకేశవుని తెప్పతిరునాళ్ల మహోత్సవానికి ధారపోసి యిస్తిమి.

గొల్లల ఉప్పులపాడు గ్రామమునకు తూర్పు ఆంజనేయస్వామి దేవాలయంవద్ద నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౭ అగునేటి రాక్షస సం॥ ఆషాఢ, బ ౧౧ లు గొల్లల ఉప్పులపాటి చెన్నకేశవపెరుమాళ్లకు శ్రీమన్మహామండలేశ్వర నందెలతిమ్మరాజు మరిదళి నారప్పనాయనింగారు దండము సమర్పించి యిచ్చిన ధర్మశాసనము: స్వామి సదాశివదేవ మహారాయలుంగారు నాయంకరానకు పాలించిన గండికోట సీమలోని గొల్లల ఉప్పులపాటిగ్రామానను చెన్నకేశవపెరుమాళ్లకు నిత్యాను ఊళిగెం సేసేటందుకు నందెల నారప్పరాజయ్యగారికి పుణ్యముగాను డోలు నాగసరాల వారికి మాన్యము చేను ఖ ०॥० యిస్తిమి.

౧ ఈశాసనంవద్దనే యుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౭ అగునేటి రాక్షస సం కార్తీక, శు ౧౨ బు॥ ఆత్రేయగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులైన ఆరవీటి రామరాజ శ్రీ రంగరాజులుంగారి పుత్రులు

అళియ రామరాజుంగారు భారద్వాజస గోత్రం కాత్యాయనసూత్రం
యజుశ్శాఖాధ్యాయులైన పులివిందల నారసింహాభట్ల పుత్రులు నారా
యణయంగారికి ధారవోసి యిచ్చిన ధర్మశాసనం క్రమమెట్లన్నను:
సదాశివదేవమహారాయలు మా నాయంకరానకు పాలించిన గండికోట
సీమలోని గొల్లల ఉప్పలపాడు గ్రామానను తథాతిథి పుణ్యకాలమునందు
ధారవోసియిచ్చిన పొలం గోచర్మానకుగాను చేను ఖ ౪౫౦ యిస్తిమి.

౧ గండికోటదుర్గంలో మాధవస్వామి దేవాలయానకు ఆగ్నేయం
దమదమా బురుజుకు పడమర, పేటలో నుండే కుంట నుంచి కోటలో
మాధవస్వామి కోనేరుకు నీరువచ్చేటి తూముకు వేసినరాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగునేటి నళ సం॥ ఆషాఢ,
శు ౧౧ లు శ్రీమన్మమహామండలేశ్వర నందెల తిమ్మయదేవమహా
రాజులుంగారు గండికోట సీమలోను మహారాజతంతుల వల్లను నగరికి
(వచ్చే) కానువీసాలు సర్వమాన్యం జేస్తిమి. ఈ మహారాజతంతుల వల్లను
పూర్వమర్యాద దేవరకు యేయే గ్రామాన వచ్చిన కానికె కానువీసాలు
సర్వమున్ను ధారవోసి యిస్తిమి. ఎత్తుకొని, ఆయా గ్రామాల అంకా
ళదేవరకు ధూపదీప నైవేద్యాలున్ను పరుపుపారివేటలున్ను సాంగ్యంగా
చేయించుకొని యీ ధర్మము చెడకుండా నడుపుమని యిచ్చిన ధర్మ
శాసనం.

౧ చారివారి ఉప్పలపాడు గ్రామం ముందర హనుమంతుని దేవాలయం
యెదుట నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగునేటి నళ సం॥ కార్తీక,
శు ౧౫ లు ఆత్రేయసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన
సోమవంశోద్భవులైన ఆరవీటి కొండ్రాజుగారి పౌత్రులైన చినతిమ్మరాజు
గారి పుత్రులైన శ్రీమన్మహామండలేశ్వర చాంగలమఱ్ఱి కొండయదేవ
మహారాజులుంగారు......గిరి చెన్నకేశవదేవర కోవెలలోను ధర్మ
సత్రానికి యిచ్చినది. మా నాయంకరానకు చెల్లే చెన్నూరి సీమలోని
చారివారి ఉప్పలపాడు గ్రామానను చేను ఖ ౪౫ ధారపోసి యిస్తిమి.

౧ గండికోటపైన రఘునాధుని ప్రాకారం దక్షిణం ప్రాకారం రాతికి ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౯ అగునేటి పింగళ సం॥ పుష్య, శు ౧ లు గండికోటమీద నివాసుండయిన రఘునాయకుల దివ్య శ్రీచరణారవిందంబులకు స్వామిదాసానుదాసుడైన, ఆత్రేయగోత్రం ఆప స్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన, సోమవంశోద్భవులైన శ్రీ మన్మహామండలేశ్వర నంద్యాల అవుబళ రాజయ్యదేవ మహారాజులుగారి పుత్రులు చిన అవుబళేశ్వరదేవ మహారాజులుంగారు అనంతములైన దండములు సమర్పించి యిచ్చిన భూదానధర్మశాసనము: స్వామి సదాశివ మహారాయలు మా నాయంకరానకు పాలించిన ఉదయగిరి రాజ్యానకు లోనయివచ్చే గండికోట సీమలోను, పినాకినీనదికి ఉత్తరభాగాన పెద కొమ్మర్ల గ్రామానను దధ్యోదనానకు నెల ౧కి వగ ౫౧౫ ౦ లెక్కను యేడు ౧కి వగ ౭౫న్ను, అఖండ తిరువళికెలు ౨కి నెయ్యి దినం ౧కి మ ౦।౦ ర్ ౦।౦ లెక్కను యేడు ౧కి వగ ౭౫౦, చాతుపడి తెచ్చే వారికి వగ ౧౦, సంకీర్తనవారికి వగ ౩, తెప్పతిరునాళ్లమహోత్సవానకు వగ ౧న్ని, మకరసంక్రాంతిమహోత్సవానికి చెరువుపారువేటకున్ను వగ ౩న్ను, తోపుతిరునాళ్లకు ది ౧కి వగ ౫౧౫ లెక్కను ది ౮కి వగ ౩౬౧।।౦, చాతుపడికి ర్ ౧।।౦, ఉభయం వగ ౩ర్ ౩న్ను, ముక్కోటితిరునాళ్లమహోత్సవానికి దినములు ౮కి వగ ౩ర్౩ న్ను, ఉయ్యాలతిరునాళ్లకు ది ౮కి వగ ౨।।౮, విజయదశమిచెరువుమహోత్స వానకు ది ౧కి వగ ౩. తేరుతిరునాళ్లమహోత్సవానకు దినము ౧వగ ౪ లెక్కను దినాలు ౧౦కి వగ ౪౦, విశేష కైంకర్యానకు ర్ ౨, పల్లకిసేవకు ది ౧కిన్ని పణ్యారానకు, దివ్వెచమురుకున్ను, స్వామి ఊడిగాలవారికి సహా ది ౧కి ర్ ౧ లెక్కను యేడు ౧కి వగ ౩౦, విశేష చాతుపడికి ర్ ౮ ఉభయం వగ ౩౦ర్ ౮. అంతు వెచ్చం వగ ౧౧౮కున్ను యీ తథాతిథి పుణ్యకాలమందు పినాకినీనదీ తీరమందు సహిరణ్యోదక దానధారా పూర్వకంగాను ధారపోసి యిచ్చిన కైంకర్యానకు పెదకొమ్మర్ల గ్రామానను మొల్లచేని స్థళమున్ను తన్నివానిగడ్డ స్థళమున్ను దాసరి

వానిచేని స్థళం సహాగాను మూాటికిన్ని రొక్కం వగ ౧౧౫ న్ను అమ రించిన చేను ఖ ౩ ।। ధారవోసి యిస్తిమి.

౧ పెద్దముడియంగ్రామాన లక్ష్మీనృసింహుని దేవాలయంలో నుండేది. అక్షరములు శిథిలములై యున్నవి.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౯ అగునేటి నళ సం॥ చైత్ర, శు ౯ లు బ్రాహ్మణముడియం అగ్రహారమందు నృసింహపెరుమాళ్లకు గారయ్య, లి. నాగయ్య అనంతములైన దండములు సమర్పించి యిచ్చిన ధర్మశాసనము: స్వామిసదాశివదేవ రాయలుంగారు నంద్యాల తిమ్మ రాజయ్యగారి ఉమ్మలికి పాలించిన గండికోట సీమలో......తాణెంలో (తిమ్మ) రాజయ్యవారు నాకు అమరానకు ...... ముడియంగ్రామాన .........వరమున్ను, పెరుమాళ్ల పార్వేటమహోత్సవానకు తిమ్మ రాజయ్యగారికి పుణ్యముగాను.........

ఈవల అక్షరాలు శిథిలమైనవి గనుక చేసిన ధర్మం విశదము కాలేదు.

౧ కిల్లేపట్టి కోడూరుగ్రామాన చెన్నకేశవస్వామి దేవాలయం యెదుట నుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౯ అగునేటి పింగళ సం॥ మార్గశిర, బ ౧౧ లు గు। కోడూరి చెన్నరాయునికి దండము సమర్పించి స్వామిదాసుండు సోమవంశం ఆత్రేయగోత్రోద్భవులైన శ్రీమన్మహా మండలేశ్వర రామరాజతిరుమలరాజయదేవ మహారాజులయ్యగారి కార్య కర్తలైన యేనుగుల తిమ్మానాయని కొమారుడు కేశవనాయనిగారు వేయించిన భూదానధర్మశాసన క్రమమెట్లన్ననుః సదాశివదేవమహా రాజుంగారు తిరుమలరాజయ్యవారి నాయంకరానకు పాలించిన జగతాపి గుత్తి సీమకు చెల్లే పెన్నబడినున్న కోడూరిగ్రామాన అమలియవంశ ఉద్భవం (?) పెంచ్చకలదిన్నె పొలిమేరమోాయను ప్రాకు సౌమ్య సంవత్స రాన మాాలెపాటి తిమ్మయ్య ధారవోసిన పత్రం ఇచ్చిన ప్రమాణానను

పెరుమాళ్లకు చేను ఖ ౩॥౨, లక్ష్మీ దేవమ్మకు ఖ ౧, ఉభయంచేను ఖ ౪॥౨ చేనున్ను, కోవెల తిరుగువాకపాలెం వల్లవచ్చిన రొక్కమున్ను, తిరుమల రాజయ్యవారి నిరూపప్రమాణానను ఆపాళెము కాపులు మగ్గం ౧కి ర ౪ లెక్కను అంగడి ౧కి గ౹ మాడ లెక్కను కట్టడసేసి ధారవోసి యిస్తిమి.

భీమగుండంగ్రామాన చెన్నకేశవస్వామి దేవాలయంవద్ద చలి వెందల బండకు ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౭౯ అగునేటి పింగళ సం॥ చైత్ర, శు ౭ లు శ్రీవత్సగోత్రాపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన శ్రీమతు భోజనపల్లె తిరుమలయ్యగారి కొమారుడు నారాయణయ్యగారు చెన్నకేశవస్వామి సన్నిధిని ధర్మచలివెందలకు చేను ౧౨।౧ యిస్తిమి.

చారివారిఉప్పలపాడుగ్రామాన చెన్నకేశవుని దేవళములో గరుడస్తంభం వెనుకనుండేది.

చెన్నకేశవపెరుమాళ్లకు ఆత్రేయగోత్రపవిత్రులైన శ్రీమన్మహా మండలేశ్వర నంద్యాల అవుబళరాజయ్యగారిపౌత్రులైన చిన అవుబళ రాజయ్యగారి పుత్రులైన అవుబళేశ్వరదేవమహారాజులుంగారు ఉప్పల పాటను దేవునికి నిత్యదీపారాధన మూడువేళల ఆరగింపులకు సహా కట్టడ చేసినవి వగ ౨౦ వరహాలకున్ను చేను ఖ ౬ సర్వమాన్యంగాను ధారవోసి యిస్తిమి.

గుండ్లకుంటగ్రామాన చెన్నకేశవుని దేవళంలో

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సం॥ మార్గశిర, శు ౭ లు శ్రీమన్మహామండలేశ్వర రామరాజతిమ్మరాజయ్య దేవమహారాజులుంగారు అవుకు సీమలోకి చెల్లే హోరగ్రామములలో గుండ్లకుంటలో మంగలవారు అచ్చే పన్ను, సిద్ధాయములున్ను, అను

వెచ్చం, వెట్టి, వేములు, నగరికట్నాలు, దొమ్మరిపన్ను సహా సర్వ మాన్యంగాను ధర్మశాసనం వేయిస్తిమి.

౧ చినముడియం వీధిలో

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సం॥ మార్గశిర, శు ౭ లు శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిమ్మరాజయ్య దేవ మహారాజులుంగారు అవుకు సీమలో వరగ్రామము చినముడియ మందు మంగళ్లకు యిచ్చిన ధర్మశాసనము: సదాశివదేవమహారాయలు వారు విజయనగరమందు మంగల కొండోజుకు రాయసీమకు చెల్లే సీమలో నల్లాను మంగళ్లు పేట్టే సిద్ధాయంపన్ను, కానికె, కట్నం, అను వెచ్చం, దొమ్మరిపన్నుసహా సర్వమాన్యం చేసిన ధర్మశాసనాలు యిచ్చి పాలించిన ప్రయుక్తం, మాకుచెల్లే అవుకుసీమలోని వరగ్రామం చిన ముడియం మంగల ఓజులుకు కానికె, కట్నం, సిద్ధాయం, దొమ్మర పన్ను, బేడిగె, అనువెచ్చం, వెట్టి, వేములుసహా సర్వమాన్యంగా పాలిస్తిమి.

౧ నెమళ్లదిన్నె గ్రామాన విష్ణుదేవాలయంలో.

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సం॥ పుష్య, శు ౨ లు శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిమ్మరాజయ్యదేవ మహారాజులుగారు అవుకుసీమలోని నెమళ్లదిన్నె మంగళ్ల ఓజుకు పైన వ్రాసిన ప్రకారము పన్ను మొదలైనవి సర్వమాన్యంగా మన్నించిరి.

౧ వద్దిరాళ్ల గ్రామము సదాశివదేవ మహారాయలుంగారు బ్రాహ్మలకు సర్వమాన్య అగ్రహారంగా చేసి,

శాలివాహాశకవరుషంబులు ౧౪౮౧ సిద్ధార్థి సం॥ ఆశ్వీజ, శు ౧౫ లు నాగర అక్షరములతో సంస్కృతంతో తామ్రశాసనం వ్రాసి యిచ్చినారు. ఆ తామ్రశాసనం నకలు వహీలో దాఖలు అయియున్నది. ఆ తామ్రశాసనము వద్దిరాళ్ల గ్రామాన పూర్వము అగ్రహారము అను భవించినవారి వంశీకుడు రాచకొండ తిప్పాభట్లవద్ద ఉన్నది.

౧ చినవెణుతుర్ల గ్రామాన ఆంజనేయ దేవాలయం వద్ద,

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౩ అగునేటి రౌద్రి సం॥ ఆషాఢ, శు ౧౧ లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాలతిమ్మరాజయ్యగారు చినవెణుతుర్ల మారకాపురి శ్రీ చెన్నకేశవమూర్తికి, దధ్యన్నానకు సమర్పించిన శాసనము: శ్రీ సదాశివరాయలు మాకు నాయంకరానకు పాలించిన గండికోట దుర్గానకు చెల్లే సుంకం సమ్మంధం చినవెణుతుర్ల గ్రామకట్టము గ ౩, గాండ్లవల్ల గ ౧౫, ఉప్పరవారి గ ౪, ఉభయం గ ౮౫ యున్ను సమర్పిస్తిమి.

ఇతర వివరముల ననుసరించి యీ శాసనమునకు దుర్మతి సం॥ ఉండవలెను.

౧ కిల్లేపట్టి చొటిపల్లె గ్రామాన నరనారాయణస్వామి దేవాలయం వద్ద,

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౪ దుందుభి సం॥ ఆషాఢ, శు ౫ లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల నారప్పరాజు కృష్ణప్పదేవ మహారాజు లయ్యవారి కార్యకర్తలైన ముమ్మడినాయనింగారు ఆ నారప్పరాజయ్యవారిపాళెం సాలెమగ్గాలవారికి యిచ్చిన శిలాశాసనము గుత్తగా యిల్లు.

ఇంతే వ్రాసియున్నది. సాంతంగా వ్రాయలేదు.

౧ కిల్లేపట్టి సుగుమంచిపల్లె గ్రామాన చెన్నకేశవస్వామి దేవాలయంలో దక్షిణంగానుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౭ అగునేటి సిద్ధార్థి సం॥ జ్యేష్ఠ, బ ౧ లు సదాశివరాయలు రాజ్యము సేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమలరాజయ్య దేవమహారాజులుగారు అవుకు సీమయందు మంగళ్లకుయిచ్చిన ధర్మశాసనం క్రమమెట్లన్నను: సదాశివదేవ మహారాయలుగారు విజయనగరమందు మంగల కొండోజుకు రాయ

సింహాసనానికి చెల్లే సీమలోను మంగల ఓజరానకు సజపన్ను, కానికె, కట్నం, అనువెచ్చం, దొమ్మరిపన్ను, సిద్ధాయం, వెట్టి, వేములు సర్వ మాన్యంగాను యిచ్చిన ధర్మశాసనం నడుపగాను మాకు చెల్లే అవుకు సీమలోని హారోరగ్రామం గండికోటకు పడమర సుగుమంచిపల్లె మంగల ఓజులుకు కానికె, కట్నం, వెట్టి, వేములు, దొమ్మరిపన్ను, సిద్ధాయంపన్ను సర్వమాన్యంగా యిస్తిమి.

ఈ శాసనంలో యీ శకానికి సిద్ధార్థి సం॥ మని వ్రాసియున్నది. గనుక స్వల్పం వ్యత్యాసంగానున్నవి. ఇందుకు రక్తాక్షి సం॥ రం అవుతున్నది.

ఈ సదాశివరాయలువారి ప్రభుత్వాదారభ్యం యువరాజత్వం సర్వాధికారి అయిన కృష్ణరాయలవారి అల్లుడు ఆళిరామరాజు అధికార దక్షుండై యుండి, శాలివాహనశవరుషంబులు ౧౪౮౬ రక్తాక్షి సం॥మున యీరాయలకు కరభారం యిస్తూయున్న బిజాపురం, బిదరు, దౌలతాబాదు, ఆమదానగరు మొదలయిన పంచబాదషాహాదఖినివారు ఏకస్తులై అళిరామరాజుగారితో కృష్ణాతీరమైన రాక్షతంగడి అనే గ్రామం వద్ద యుద్ధముచేసి అళిరామరాజును దండుతోగూడ ముంచి పైనవ్రాసిన తురకబాదుషాహాలు విజయనగరానకువచ్చి రాయలువారి నగళ్లున్ను పట్టణమున్ను దేవాలయములున్ను కాలపెట్టి దోచి, దేశమున్ను దోచుకొన్నారు. అప్పట్లో సదాశివరాయలుకు కొంత దేశం యిచ్చినందున, తురకాణ్యంలోను సదాశివరాయలు కొన్నిసంవత్సరములు ప్రభుత్వం చేసినట్లుగా శిలాశాసనాలు ఉన్నవి. పైనవ్రాసిన నంద్యాలవారి వంశీకులు గండికోటరాజ్యం యేలుతూయుండిరి. వారితట్టున్నుంచి పెమ్మసాని తిమ్మానాయుడు గండికోటలోనుండి అధికారము చేస్తూయుండెను. సదాశివరాయలు తురకాణ్యంలో ప్రభుత్వంచేస్తూయుండగానున్ను అమరం అనుభవించేవారున్ను వేయించిన శిలాశాసనముల సారాంశను.

కల్లుట్లగ్రామానకు యీశాన్యం చెరువుకట్ట క్రింద.

క్రోధన సం॥ మార్గశిర, బ ౬ లు శ్రీమన్మహామండలేశ్వర జగతాపి కంచిరాజు ఎఱమచోడ మహారాజులయ్యగారు హనుమంతునికిన్ని గణాధిపతికిన్ని సేవచేసే మంగల తిమ్మోజుకు చేను ౧౨ మడి ౧౧ ఉభయం ౧౩ ఆకువక్కలు తాంబూలానకు పెట్టిన చేను ౹౻౩ అనుభవించేది.

ఇందుకు శకము ౧౪౮౭ అవుతున్నది.

౧ క్లిప్తేపట్టి సుగుమంచిపల్లె గ్రామానకు పడమర యీ గ్రామం పొలిమేర తాడిపరితి తాలూకు, బొందలదిన్నె పొలిమేర సందున పుట్టు బండకు ఉండేది.

ప్రభవ సం॥ ఆషాఢ, శు ౧౧ లు శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమలరాజయ్యదేవ మహారాజులుగారి కొమారుడు శ్రీరంగరాజులుంగారుతో తోడబుట్టిన అన్న రఘునాథరాజులుంగారికి పుణ్యముగాను రఘునాథపురం అనే నామాంకితంచేసి చెన్నమరాజు తమ్మప్పంగారికి యీ తథాతిథి పుణ్యకాలమునందు భవనాశీతీరమందు అహోబలేశ్వరుల సన్నిధిని ధారపోసి సుగుమంచి పల్లెకు ప్రతినామం అయిన రఘునాథపురం అగ్రహారం పొలిమేర.

ఇందుకు శకం ౧౪౮౯ అవుతున్నది.

క్లిప్తేపట్టి ఎఱ్రమడిగ్రామానకు యీశాన్యం సామీప్యమున వాగువద్ద కపిలబావివద్ద నుండేది.

ప్రభవ సం॥ కార్తీక, బ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర జంబులదిన్నె అచ్యుతరాజుదేవ మహారాజుంగారు గురుజాల అప్పళరెడ్డిగారి వెంకటయ్యకు యిచ్చిన శాసనము: మీ తండ్రి అప్పళరెడ్డి ఎరగుడి పసువుల నిమిత్తం పోయి చచ్చినందున నీకు ౧౨ ముంతల చేను యిస్తిమి.

౧ గుండ్లకుంట గ్రామాన చెన్నకేశవుని దేవాలయంలో అంత్యభాగం తాయి పగిలిపోయి యుండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౮౯ అగునేటి ప్రభవ సం॥ కార్తీక, శు ౨ లు సదాశివరాయలు రాజ్యముచేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయసగోత్ర పవిత్రులైన సోమవంశాధీశ్వరులైన పరమధార్మికులు అయిన పదవాక్య ప్రమాణజ్ఞులైన...

ఈవల జాయి పేటు యెత్తిపోయినది.

౧ తొర్రెవేముల గ్రామము చతుర్దిక్కు పొలిమేరలో నుండేది. అందులో నొకటి:

## వామనప్రతిమ

ప్రజోత్పత్తి సం॥ ఆషాఢ, శు ౧౨ లు తిరుమలదేవ మహారాయలు పురాణం బసవప్పగారికి ధారపోసి యిచ్చిన తొర్రెవేముల గ్రామానకు ప్రతినామము అయిన వెంగళ్రాజమ్మసముద్ర మనే అగ్రహారానకు చతుస్సీమకు వలయ శాసనం.

ఈ ప్రకారం యీ గ్రామానకు వలయముగా పొలిమేరలో వ్రాసియున్నది.

ఇందుకు శకము ౧౪౯౩ అవుతున్నది.

అంతు సదాశివరాయలవారి ప్రభుత్వంలోనున్న శాసనములు యీ పైమేనిమిది. లోగడ తురకల అవాంత్రములో కొన్ని అగ్రహారములున్ను కొన్ని నాయంకరానకు నడిచే గ్రామములు కొంత నగర కలిసి కొంత వారివారికి నడుస్తూ యుండెను.

౧౮ తరువాత తురకలు యీ దేశానికి శ్రీరంగరాయలును ఉంచి వారిగుండా కొంతపయికము ఒప్పించుకొని నందున శ్రీరంగరాయలు వారు పెనుగొండపట్టణమందు రత్నసింహాసనారూఢులై రాజ్యము జేయుచుండగాను, జంబులమడుగు తాలూకాలో వేయించిన శిలాశాసనముల యొక్క సారాంశము.

౧ పొన్నతోటగ్రామానకు పడమర చెన్నకేశవుని దేవాలయం వద్ద ఉండేది.

శాలివాహనశకవరుషంబులు ౧౪౯౬ అగునేటి భావ సం॥ జ్యేష్ఠ, శు ౧౫లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీరంగ రాయదేవమహారాయలు పెనుగొండపట్టణమందు వజ్రసింహాసనారూఢుడై పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన......గండికోటసీమలోని పొన్నతోట దిగువపట్టణం కృష్ణుని పడితరాలకు చెల్లే దేవతాగ్రామం నంద్యాల నారసింహారాజయ్యవారు బయినేయనకు పాలించిన గ్రామముచెరువు ఒడిపి తెగి ఖిలపడి యున్న నిమిత్తం మీరు ఒడిపి కట్టినందుకు దసమందం చేను ఖ ౦౻౩ మడి ఖ ౦౫౦ ఉభయం చేను మడి సహాగాను ఖ ౧।౩ యిస్తిమి.

గండికోట దుర్గంలో మాధవస్వామి దేవాలయానకు ఉత్తరం పాడుగా నున్నవీధిలో.

బహుధాన్య సం॥ ఆషాఢ, బ ౧౪లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల నారసింహారాజయ్యదేవ మహారాజులుంగారు బెస్తవారికి యిచ్చిన కమ్మ: దుర్గంలోను కొత్తగాను కట్టినవీధిలోను యిండ్లుకట్టుకొని కాపురము ఉండేటందుకు మరియేమిన్ని మీాకు అన్నుపన్ను లేకుండాను సర్వమాన్యం చేసినారం. మీారు మరియేమిన్ని విచారించక ఆవీధిలోను, యిండ్లు కట్టుకొని కాయికాలు చేసికొని సుఖాన నుండేది. వెట్టివేమి అన్నుపన్ను వడిగుత్త సర్వమాన్యంగా మన్నిస్తిమి.

ఇందుకు శకం ౧౫౦౦ అవుతున్నది.

౧ కిష్టేపట్టి సంకెపల్లెగ్రామానకు దక్షిణము సంకెపల్లె నాగమల్లదిన్నెలు యీ రెండు ఊళ్ల పొలిమేరసందున నుండేది.

వామన ప్రతిమ ఉన్నది.

ఎదుట్ల తిరుమలభట్లకు ధారాగ్రహీతమైన సంకెపల్లెకు ప్రతినామమైన శ్రీరంగరాజసముద్రం అగ్రహారం పొలిమేర.

ఈ శ్రీరంగరాయల ప్రభుత్వంలో గండికోట దేశం నంద్యాల రాజులకు చెల్లుతూ యుండెను.

తర్వాత శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీర వెంకటపతి మహారాయలుగారు పెనుగొండ పట్టణమందు రత్న సింహాసనారూఢులై పృథివీ రాజ్యము సేయుచుండగాను గండికోటసీమ నంద్యాలరాజులకు నడుస్తూయుండెను. వారితట్టునుంచి పెమ్మసాని తిమ్మానాయుడు, గండికోటలోనుండి అధికారం చేస్తూయుండెను. ఈ వెంకటపతిరాయల ప్రభుత్వములో జంబులమడుగు తాలూకాలో వేయించిన శిలాశాసనములయొక్క సారాంశము.

గండికోటకు తూర్పుగవని లోతట్టు యెదురుగానుండేది.

మన్మథ సం॥ శ్రావణ, బ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల అవుబళరాజుదేవ మహారాజులుగారు గండికోట చాకలరాముడు మొదలైన కులంవారికి యిచ్చిన శాసనం: పెద్దరాజుగారు మీకు పన్ను మన్నించినారు. గాన [1]నేమున్ను ఆతీరునే పన్ను అన్ను సర్వమాన్యంగాను మన్నించినారం. చౌడుసున్నానకు సుంకుం...కొర్రపాటి పొట్టిపాటి గ్రామాల సుంకం మన్నించినారం. మీా పుత్రపౌత్రపారంపర్యంతరము గాను మన్నిస్తిమి గనుక సుఖాన నుండేది.

శ్రీ నరసింహరాజువ్రాలు.

ఇందుకు శకం ౧౫౧౭ అవుతున్నది.

ఈ వెంకటపతిరాయలవారి ప్రభుత్వములోనే నంద్యాల కృష్ణమరాజుగారు గండికోట దేశము యేలుతూ యుండగాను పొత్తపినాడు పులుగులనాటి సంస్థాపకుడైన మట్లి ఎల్లమరాజు దేవచోడమహారాజులుగారు, వెంకటపతిరాయలవారి పక్షము కలిగి నంద్యాల కృష్ణమరాజుతో జంబుల

1. చూడుడు. నేము— మేము శ. ర. నా శబ్దమునకు ప్రథమా బహువచనము.

మడక వద్ద యుద్ధముచేసి కృష్ణమరాజును పట్టుకొని అభయమిచ్చి, వెంకటపతిరాయల తట్టునుంచి కొండ్రాజు తిరుపతిరాజువారు ఉభయలు సిద్ధవటమందు ప్రభుత్వము చేస్తూ యుండగాను, మట్లి ఎల్లమరాజుగారు పొత్తపినాటిలో ఊటుకూరు అనే గ్రామంవద్ద యుద్ధముచేసి సిద్ధవటం తమస్వాధీనము చేసికొనిరి. ఈ మట్లి ఎల్లమరాజుగారి కొమారుడు అనంత రాజు సిద్ధవటం ప్రభుత్వము చేస్తూయుండి సిద్ధవటంవద్ద ఒక చెరువు త్రవ్వించి మరిన్ని సిద్ధవటంలో సిద్ధేశ్వరుని దేవాలయం చుట్టూ ప్రాకారం కట్టించి ఆప్రాకారం తూర్పువాకిలివద్ద ప్రాకారమురాతికి శిలాశాసనము వేయించినారు.

శాలివాహనశకసంవత్సరంబులు ౧౫౭౦ అగునేటి విశ్వావసు సం॥ శిలాశాసనము వేయించినారు.

ఈ మట్లి అనంతరాజుగారు సిద్ధవటం, చెన్నూరు, కామలాపురం, బద్దెవోలు, పొత్తపినాడు, పులుగులనాడు యీ దేశములు ప్రభుత్వం చేస్తూయుండిరి. ఈ మట్లి అనంతరాజుగారి కొమారుడు తిరువేంగళనాథ రాజుగారు సిద్ధవటం ప్రాకారం పనులు సాంగంగా చేయించిరి.

నెమళ్లదిన్నె గ్రామాన విష్ణు దేవాలయంవద్ద.

శాలివాహనశకవరుషంబులు ౧౫౩౩ అగునేటి విరోధికృతు సం॥ మాఘ, బ ౧౦ లు సో॥న శ్రీ వీరవెంకటపతి దేవమహారాయలు చంద్రగిరి పట్టణమందు వజ్రసింహాసనారూఢుడై పృథివీసామ్రాజ్యము చేయుచుండ గాను శ్రీమధ్యజనాదిషట్కర్మనిరతులైన నెమలిదిన్నె అగ్రహారస్థితా శేషవిద్వన్మహాజనాలకు, శ్రీ మన్మహామండలేశ్వర జిల్లేళ్లరంగపతిరాజయ్య దేవ మహారాజులుంగారు కాసె ఇప్పపెంట అయ్యవారబత్తుని పౌత్రుడు కొండాబత్తుని పుత్రుడు తిరుమలయ్యకు యిచ్చిన ధర్మశాసనం. నెమళ్ల దిన్నె గ్రామాన చెన్నకేశ్వరుని నూతన విగ్రహము చేయించే నిమిత్తం ఆరెమానిమడి మీకు సర్వమాన్యంగాను నడపగలవారము.

ఈ జిల్లేళ్ల రంగపతిరాజుగారు గండికోట దేశములో కొంతసీమ అధికారము చేస్తూ ఉండెను. వీరియొక్క శాసనములు కొన్ని స్థళాల యందు ఉన్నవి. ఈ వెంకటపతిరాయలవారి ప్రభుత్వములోను దేవ బ్రాహ్మణులకు నడిచేటట్టి గ్రామములు కొంతనడుస్తూవచ్చినది.

తరువాత పైనవ్రాసిన పెమ్మసాని తిమ్మయనాయుడు రాయ సంస్థానం దినేదినే ఖిలపడుతూ వచ్చినందున స్వాతంత్రుడై తురకలకు పైకము చెల్లిస్తూయుండి జంబులమడుగులో వేయించిన శాసనములున్న దాన పత్రములయొక్క సారాంశము.

౧ తలమంచిపట్నము ఊరిముందర రచ్చరాగిమానుకు పశ్చిమాన సమీపమునందున ఉండేది.

దుందుభి సం॥ ఆశ్వీజ, బ ౧౨ లు శ్రీమతుపెమ్మసాని తిమ్మా నాయనివారి కార్యకర్తలైన దొండ్లేంటి రంగనాథునిగారు తలమంచిపట్నం మాధవాపురం, ఉప్పలపాడు, గొల్లపల్లె, వద్దిరాల, దనవాడ, కంబాల దిన్నె, దుగ్గనపల్లె, పెదకొమ్మర్ల, సీదుపల్లె, తొర్రవేముల, మయిలారం, వ్యాపరాల, మొదలైన గ్రామముల రెడ్డికరణాలకు యిచ్చిన శాసనము: మీ గ్రామమున కుందరబీడు దున్నేటందుకు మీకు కౌలుయిచ్చిన వివరం: చేను ౧౧కి గుత్త ౧ ౨ లెక్కను, కావలి పాతిక లెక్కను యెనిమిదియేండ్లు దనుకాను తప్పకుండాను నడపగలవారం.

ఇందుకు శకము ౧౪౮౮ అవుతున్నది.

దేవగుడిగ్రామాన తలకంటి దేవాలయము కప్పు అడుగున బండకు ఉండేది.

రుధిరోద్గారి సం॥ కార్తీక, శు 3 లు శ్రీమతు చదుపురేల లింగా రెడ్డికి పెమ్మసాని తిమ్మానాయడు దేవగుడి సుగుమంచిపల్లె అమరానకు యిచ్చియుండగాను, ఆ రెండుగ్రామాలున్న యేలుతూయుండి తలకంటి దేవి గోపురం ముందరి మంటపము ఆ చంద్రార్కస్థాయిగా కట్టించెను.

ఇందుకు శకము ౧౫౪౫ అవుతున్నది.

బుక్కపట్ణంలో పాంచాలపురుషులైన తాతాచార్యుల సంతతి అప్పళాచార్యులవద్దనున్న కాకితం దానపత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౫౬౬ అగునేటి తారణ సం॥ వైశాఖ, శు ౮ మి జయతిథియందు శ్రీమద్వేద మార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంతప్రవర్తక శఠమర్షణస గోత్రోద్భవులైన ఆపస్తంబసూత్రులైన యజుశ్శాఖాధ్యాయులైన తాతాచార్యుల వారి ప్రపౌత్రులైన తిరుమలరంగాచార్యుల పౌత్రులైన శ్రీనివాసాచార్యులవారి పుత్రులైన నరపతిసింహాసనాధ్యక్ష మహారాయ గురు పీఠకులైన తిరుమల బుక్కపట్ణం కుమారతాతాచార్యులవారికి ముసల్ల గోత్ర పవిత్రులైన వెంకటపతినాయనింగారి ప్రపౌత్రులైన గిరియప్ప నాయనింగారి పౌత్రులైన అక్కప్పనాయనింగారి పుత్రులైన నరపతిమహారాయ మన్నెరాజ శ్రీ పెమ్మసాని తిమ్మానాయనింగారు వ్రాయించి యిచ్చిన దేశసమయాచార పత్రిక: పూర్వం మీ తిరుమాళిఘెకు నరపతి కృష్ణదేవరాయ మహారాజయ్యగారి నాటనుంచి నడచే దేశసమయాచారం దేశం మ్లేచ్ఛాక్రాంతం అయినందున ఖిలపడి, మీ తిరుమాళిఘెకు నడచే గ్రామాసులు వరుషాశనములు మాకు నడిపించుమని ఆజ్ఞనేమిస్తిరి గనుక తమ ఆజ్ఞాప్రకారముగాను తమ సన్నిధిలో మేము పంచసంస్కారములను అయ్యేసమయమందు మాకు గోలుకొండ బాదుషావారు మనసబు యిచ్చిన గండికోట తాలూకు నాలుగులక్షలయాభై వేల సీమకు హారిసేవ, గురుసేవ, ముద్రకానికె, గుడికట్నం, బసివిముద్ర, తప్పు, ఒప్పు, దండన, ఖండన, పద్దు, పావాడం మొదలైన దేశసమయాచారం సహా తమకు సమర్పిస్తిమి గనుక తమ పూర్వులు పాంచాలపురుషులైన పెద్దయ్యవారలు కట్టించిన బుక్కపట్ణంలో మీకు తిరుమాళిఘెలో సింహాసనస్థళమందు ఉండి మీకు సమర్పించిన బుక్కపట్ణం మీ మీపుత్రపౌత్రపారంపర్యంతం అనుభవించుక సుఖాన నుండేది. దానపాలనయో అనే శ్లోకం సాంతంగా ఉన్నది. రాయసం కొండప్పవ్రాసిన పత్రిక. శ్రీ వెంకటేశ్వర. తిమ్మానాయనింగారి వ్రాలు. శ్రీ శ్రీ శ్రీ.

ఈ మొహరులో గండభేరుండపక్షి యున్నది.

౧ బాదుషాహా తట్టునుంచి సైదుమీరా హుసేను ఉరఫు నేకనామ ఖానుని వారు కర్ణాటక దేశానకు సుబేదారులుగా వచ్చిరి. అప్పుడు గండికోట పెమ్మసాని తిమ్మానాయనింగారు అధికారముచేస్తూయుండి పేష్కష్ పైకము యిస్తూయుండిరి. ఈ నేకనామఖానుని వారిది జంబుల మడుగు తాలూకాలో పాలూరిగ్రామాన కామెలమ్మ బావిదగ్గరనున్న శాసనము.

శాలివాహనశకవరుషంబులు ౧౫౬౭ (౧౫౭౭) అగునేటి క్రోధి సం॥ జ్యేష్ఠ, శు ౧౦ లు హజరతు సులతాను అబ్దుల్ల...ను బాదుషాహా సాహేబులవారు గోలకొండపట్టణంబున పృథివీ సామ్రాజ్యం చేయు చుండగాను హజరతు నేకనామఖాను సాహేబులవారు కర్ణాటక దేశమందు ప్రభుత్వంచేయుచుండగాను సాహేబులవారికి సుకృతంగాను పునరోద్ధా రికంచేసి కట్టించిన బావి శాసనము.

ఈ శాసనములో యీ శకమునకు క్రోధి సం॥ అని వ్రాసియున్నది. అయిన యిందుకు వ్యయ సం॥ అవుతున్నది.

౨౦ తరువాత అలంగీరు బాదుషాహా తట్టునుంచి మీరు జుమలా అనేటి బాదుషాహావారి వజీరు దక్షిణప్రదేశానకు వచ్చి యీ ప్రదేశము నందలి రాజుల పరంగానున్న దుర్గాలున్ను కోటలున్ను సాధించి దేశం కట్టుకొని జంబులమడక తాలూకా మైలవరంవద్ద బమ్మెతోపుఖానా జంగీసామానుతోకూడా వచ్చిదిగి అక్కడనుంచి గండికోటలోనున్న పెమ్మసాని తిమ్మానాయనికి గండికోట తాణా మాస్వాధీనంచేయవలసిన దని సమాచారము పంపించినంతట అందుకు తిమ్మానాయుడు బదులు సమాచారము పంపించినది. కోటలో మాకు ౧౨ సంవత్సరములు రస్తు ఉన్నది గనుక మీరు యుద్ధముచేసి కోటసాధించవలసినదని చెప్పిపంపించి నందున గండికోటలో రామబాణం అనే ఫిరంగిలో తొమ్మిది మణుగుల మందున్ను గుండున్ను వేసి రంజకం ముట్టించగానే ఆగుండు కోటకు యీశాన్యం రెండుపరువుల దూరములో నుండే మీరుజుమలా దండులో

పడగానే అందువల్ల బహుమంది ఛేదమై మీరుజుమలా నవాబు అక్కడ నుంచి గూడెంచెరువు గొరిగినూరివద్ద దిగెను.

అప్పుడు గండికోటలో ఈ ఫిరంగిశబ్దానకు గర్భిణిస్త్రీలకు గర్భ పతనములున్ను ఆసామీప్యమునందున్న కొందరు జనులున్ను మరణాన్ని బొంది యిండ్లు కొన్నిపడి యిండ్లలోనుండే భాండములున్నూ పడిపోయి నవి. ఈప్రకారము కోటలోనున్న బహుమంది మరణము అయిరి. అయితే మీరుజుమలానవాబు బహుదినములు యుద్ధముచేసినప్పటికిన్ని యీదుర్గం స్వాధీనంకాకుండా యుండినందున ఖానుమజుకూరు వారు, నలహామీద సాధించవలెనని తిమ్మానాయనికి గుత్తిదుర్గము యిస్తాము. గండికోటదుర్గము మా స్వాధీనం సేయువలసినదని సమాచారం పంపించి నంతట అందుకు తిమ్మానాయుడు ప్రథమం గుత్తిదుర్గం మా స్వాధీనము చేస్తే అక్కడ మా ఠాణా ఖాయంచేసిన పిదప గండికోటదుర్గం మీ స్వాధీనం చేస్తామని సమాచారం పంపించినంతట మీరుజుమలానవాబు ముందుగా గండికోటదుర్గం యిస్తే పిమ్మట గుత్తిదుర్గం యిస్తామనిన్ని నేను యిచ్చిన మాటకౌలు తప్పేదిలేదు అని చెప్పిపంపించినందున తిమ్మానాయుడున్ను వారివద్దనున్న తగువారున్ను యోచనచేసినది యేమంటే మీరుజుమలా దేశముయావత్తూ సాధించినాడు దినక్రమేణ యీ దుర్గమున్ను సాధించును గనుక మాకు గుత్తిదుర్గం యిస్తే యీ దుర్గం వారిస్వాధీనంచేసేది యుక్తం అని గండికోటలో నున్న దేవతా ఉత్సవ విగ్రహములున్ను, ఆభరణములు మొదలయినవి కొంత రాజు చెరువులోనున్న కొంత భూస్థాపితంచేసి తమ స్వగృహ రాణివాసులైన స్త్రీలనున్ను మానస్థులయిన వారిస్త్రీలనున్ను కోటవిడిచి వెలుపలికి వచ్చేటప్పుడు మీరుజుమలా యిచ్చిన కౌలును నమ్మి తిమ్మానాయడు తమమందితోకూడా కోటవిడిచి పేటలో దిగగానే మీరు జుమలా తమ మందితోకూడా వచ్చి కోటలోఠాణ్యాం కాయం చేసెను. అప్పుడు పేటలోనున్న తిమ్మానాయడు మీరుజుమలానవాబుతో గుత్తిఠాణ్యాం మావశానకు యుచ్చేలాగున పరవానా వ్రాసియివ్వమని సమాచారం పంపించగాను, మీరుజుమలా వద్దనున్నవారు గుత్తిదుర్గమువారికి యిస్తే

అసాధ్యము అవుతున్నది; గనుక అందుకు బదులుగా గండికోటకు తూర్పు కామలాపురంతాలూకు హనుమనగుత్తి అనే గ్రామం యియ్యవలసినది; అంతే కౌలుతప్పినట్టుగా నుండదు.' అనగానే అదేప్రకారము హనుమనగుత్తి అనే గ్రామము యిచ్చేలాగున పరమానా వ్రాసి తిమ్మానాయని వద్దకు పంపించినంతట, అప్పుడు తిమ్మానాయడు 'గుత్తిదుర్గము యిస్తామని మొదట కరారుచేసి యిప్పుడు హనుమనగుత్తి అనే పల్లె యిచ్చేటట్టు పరవానా వ్రాసిపంపించినావు; ఇందువల్ల నీవు వజీరు అనిపించుకొని అసత్యము ఆడి మమ్ము్మను జోగులలో కలిపినావుగదా, నీవున్ను యీ దుర్గములోనుంచి జోగిఅయిపోదువు' అని శాపముయిచ్చి, తిమ్మానాయడు తమవద్దనున్న మందికి సెలవుయిచ్చి, తిమ్మానాయడున్ను తన బంధువులున్ను కొందరురాజులున్ను కొందరు పట్రవాండ్లున్ను ధర్మవరం తట్టు లేచిపోయిరి. హనుమనగుత్తి అనే గ్రామం పెమ్మసాని తిమ్మానాయని సమ్మంధీకులు అనుభవిస్తూయుండిరి. మీరుజుమలానవాబు గండికోట దుర్గము సాధించినందుకు దాఖలా జంబులమడుగు తాలూకు కిల్లేపట్టి సుగుమంచిపల్లె గ్రామమునకు పడమర సుగుమంచిపల్లె పొలిమేర తాడిపరితి తాలూకు బొందలదిన్నె యీ రెండూళ్ల పొలిమేర సందున పుట్టుబండకు వ్రాసియుండే శిలాశాసనము.

శ్రీ శాలివాహనశకవరుషంబులు ౧౫౭౧ అగునేటి విక్రుతినామ సం॥ వరకు గండికోట పెమ్మసాని చినతిమ్మానాయడు యేలుతూయుండగాను గోలకొండనుంచి నవాబువచ్చి కోటసాధించి కట్టుకొనెను. నందన సంవత్సరాన యీాయూరు కోడూరుసమతు క్రిందపడెను. అప్పుడు సేకు చందా చేస్తూయుండెను. ఆ వెనుక మహమ్మదు రజా చేసెను; ఆ వెనుక గాజి మీరా చేసెను. నవాబు గండికోట సాధించిన వెనుక గుత్తి, గుఱ్ఱంకొండ, కంచి, వందవాసి, చెంగల్‌పట్టు, ఆరికాడు, ప్రళయకావేరి, మైలాపూరు, చెన్నపట్టణము మొదలయినవి సాధించెను; గనుక తూర్పు సముద్రం పర్యంతం గోలకొండ క్రిందచెల్లెను. ఆనాడే బిజాపురాన్నుంచి ఖానుఖానా పెనుగొండ, వేలూరు మొదలుగాను సాధించెను;అటు తరువాత క్షయ సంవత్సరాన ఢిల్లీశ్వరుడు వచ్చి గోలకొండ విజయపురం సాధించి

హిమసేతుపర్యంతం ఏకచ్ఛత్రాధీశ్వరుండై యేలెను; పార్థివ సంవత్సరం పర్యంతం మునుపు గోలకొండ కుతుబుశహావారిది, విజాపురం యెదుల శాహావారిది.

ఈ మీరుజుమలానవాబుగారు యేలుతూయుండగాను పైనవ్రాసిన నేకనాముఖాను అధికారదత్తుండై యుండెను. జుల్లఫికారఖాను అనేవాడు గండికోట ఖిల్లేదారుడై యుండెను. మీరుజుమలానవాబు గండికోట సాధించి ఠాణా ముస్తయిదుచేసి తాను పేటలో తూర్పుదిక్కున నగరిన్ని బావికట్టించి వెలుపట నిలిచి పూర్వమున్న కోటలో చుట్టూ మరియొక ప్రహరి వేయించవలెనని ౧౨ వేల పనిగాండ్లను పిలిపించి తూర్పుభాగాన ఉత్తరం జుల్లఫికారు బురుజుకట్ట ఆదిచేసి ఫత్తేదరవాజా బాగాకట్టించి ఆ దక్షిణం రాంగా రాజుచెరువులో చేసి ఆ పడమర అలంగిరబురుజు దాకాను ౨౪ యిరువైనాలుగు బురుజులు క్రొత్తగాకట్టి గారచేయించి రాయల చెరువు అనే దొన పడమర ఒక మహాలున్ను యిందుకు పడమర ఒక మహాలున్ను కట్టించి కోటపని చేసేవారిలో గర్భస్త్రీలు పనిచేస్తే ఆ స్త్రీలకు ఒకకూలిన్ని గర్భంలోనున్న శిశువుకు ఒకకూలి, ఈ ప్రకారము గర్భస్త్రీలకు రెండుకూలీలు యిస్తూయుండెను. గనుక దేశములో నున్న పనివాండ్లు బహుమందివచ్చి పనిచేసేవారు. అలంగీరబురుజు దనుకా కట్టించడానకు అయిదు యేండ్లు అయినది అని వాడుతున్నారు. అప్పుడు మీరుజుమూలా నవాబు వెంబడి బాదుషాహావారు పంపించిన ముఖ్యస్తులతో కూడా ఆ బురుజు యెక్కి మీరుజుమలా చెప్పినది యేమంటే, తూర్పు దక్షిణం గారపని సొంతం అయినట్టయితే బాదుషాహావారికన్ని యీ కోట సాధించడానికి అసాధ్యం అవుతున్నది. అనగానే అప్పుడు బాదుషాహా తట్టున గండికోటలోనున్న అఖబర్నవీసుకున్ను మీరుజుమలానవాబుకున్ను గిట్టకయుండినందుచేత ఆ అఖబర్నవీసు అలంగీరు బాదుషాహా వారికి అర్జదాస్తుచేసినది యేమంటే, మీరుజుమలా గండికోట దుర్గం చక్కగాకట్టించి కర్ణాటకదేశానికి తాను స్వతంత్రుడై యుండవలెను అని యోచించినాడు అని వ్రాసినందున, బాదుషాహావారు మీరుజుమలా పేర నీవు హుజూరుకు రావలెను అని పరవానా రాంగానే ఆ బురుజుకు అలం

గీరరజాబురుజు అని పేరుపెట్టి, పూర్వము తిమ్మానాయనివద్ద కోటనాయకులున్న సైన్యమున్ను తిమ్మానాయని వెంబడివస్తామని చెప్పిరి. అందుకు తిమ్మానాయడును, 'ఇంక మాకు రాజ్యము లభ్యంకానేరదు; మీరు మా వెంబడివస్తే యెవ్వరయినను యెదురై కార్యార్థం అయితే మాకు దోషము లభిస్తుంది' అని మందిగురికాండ్లకు సెలవుయిచ్చెను. ఆ మందిని మీరుజుమలా పిలువనంపించి ఆ యిప్పుది నాయకులకున్ను తన వెంబడి వచ్చిన సైదుజలాలునాయకుడు, సూరఖానునాయకు, సితాబఖాను నాయకు, నారాయణనాయకు అంతునలుగురు పూర్వం ఉన్న వారితో కూడా ౩౮ నాయకులకు నాలుగువేల మందిని సెలవుయిచ్చి ముడియం తాలూకు, పాలూరుతాలూకు యీ రెండున్నూ వారిజీతాలకుగాను యిచ్చి నేకనామఖాను అనే ఆయన మీరుజుమలాకు పిన్నమ్మ కుమారుడు గనుక ఆనేకనామఖానుకు కర్ణాటకదేశం విచారించుకుంటూ పదరహీ ౩౮ నాయకులకున్ను నాలుగువేల మందిని వారిస్వాధీనం చేసెను. మీరుజమలానవాబు పూర్వం మట్లివారు సిద్ధవటములో సిద్ధేశ్వరుని దేవాలయమునకు కట్టిన ప్రాకారానకు కొమ్మలు బురుజులు యేర్పరచి కోట ఆకృతిచేసెను. మీరుజుమలా గండికోటదుర్గమున్ను రాజ్యమున్ను నేకనామఖానుని వారివశానకు యిచ్చి తాను గోలకొండకు పోయి అక్కడ ఒకచెరువు తొవ్వించి అక్కడినుంచి అలంగీర బాదుపాహా వారికి అర్జీవ్రాసికొనిన వివరం యేమంటే, దఖనిమాటలతో

"అబ్ దునియా దేఖ్ చుకే కర్మ్ ధర్మ్ దేఖే।
అబ్ దునియా తర్క్ కర్ కర్ జుబ్బా పహిన్ కర్ మక్కే కుజాతే॥"

(ఇందుకు తెలుగున అర్థము-"ఇది వరకు యీ ప్రపంచసారమునున్ను, ధర్మకర్మములున్ను కంటిమయా! కాబట్టి యీ కార్యవర్జితులమయి సన్యసించి మక్కాకుపోతూన్నామయా" అనుటయే తెనుగున అర్థము), అని వ్రాసి తన వెంబడియున్న దివాణం మందికి సెలవుయిచ్చి అప్పుడు మీరుజుమలా చెప్పినది యేమంటే, 'నేను పెమ్మసాని తిమ్మానాయునికి యిచ్చిన కౌలుతప్పి అతణ్ణి జోగులలో కలిపినాను గనుక, భగవంతుడు నన్నున్ను ఫకీరును చేసెను'. అని ఓడయెక్కి మక్కాకు పోయెను.

పెమ్మసాని తిమ్మానాయుడు పెట్టినట్టి శాపము తప్పకుండా లభించినది. ఈ మీరుజుమలానాడే గండికోటలో నున్న మాధవస్వామి దేవళములో పశువధ చేసి దేవాలయమును చెరిపిరి. దేవ బ్రాహ్మణులకు నడిచే సర్వమాన్య అగ్రహారాలున్ను అమరనాయంకరముకు నడిచే గ్రామములున్ను నగరకలిపి దేశములోనుండే దేవబ్రాహ్మణులకు అల్ప స్వల్పముగా నడిపిస్తూయుండెను. నేకనామఖాను బాదుశాహావారి హుకుంప్రకారము నడుచుకుంటూయుండెను. పూర్వము మీరుజుమలా జుమ్మా మసీదుకు పాయా వేసియుండగాను ఆ మసీదు పనిసాంతం చేయించి అలంగీర్ బాదుశాహావారి హుకుం ప్రకారముగ గండికోటకు నైరృతి రెండు పరువుల దూరమున పినాకినీ చిత్రావతీ సంగమమునకు ఉత్తరము తన పేర నేకనామ బాదు కట్టించి ఆ మసీదులోనున్న ఖతిబుకున్ను ఆ గ్రామము జాగీరు యిచ్చెను. అప్పుడు గోలకొండవారు కిల్లా మావశానకు యివ్వమని వ్రాయగానే నేకనామఖానుడు మళ్లా ౬౦౦ మంది ఫౌంజు ఉంచి, కిల్లావారికి యియ్యలేదు. అప్పుడు ౬౦౦ అరబ్బీలు కోటలో నున్నవారికి జీతాలు యియ్యడానకు దేశమునుంచి పైకము చక్కగా వసూలు కాకయుండినందున వారికి ఆరునెలల జీతము బాకీ నిలిచియుండెను. కడమ కోట నాయకులకున్ను నాలుగువేల మందికి ముడియం పాలూరుతాలూకు జాగీరు నడుస్తూయుండెను గనుక వారు కాలోచితంగా జీవనము చేస్తూయుండిరి. ఈ అరబ్బీలు రొఖ జీతము వారికి బాకీ నిలచినందున వారు నేకనామఖానుని దేవడి బందుచేసినారు. అప్పుడు నేకనామఖానుని కుమారుడు మీరాసాహేబు అనేవాడు దేవడి నుంచి వెలపటికిరాగానే దరవాజామీద దంగా చేయడమునకు సిద్ధముగా నున్న అరబ్బీలు వానిని మెడపట్టి లోగా తోయగానే అతనిచేత నున్న బర్యతోను అరబ్బీలను కొట్టగానే ఆ దెబ్బబలంగా తగిలినంతట అరబ్బీల చేతనున్న ఇనుము సోటాతో కొట్టగానే నేకనామఖానుని కొమారుడు తత్కాలమందే దైవగతిని బొందెను. అప్పుడు నేకనామఖానుడు, బహు దుఃఖముతో కోటనాయకులను పిలిపించి దంగాలేపమనిన్ని, వారు నా కొమారుణ్ణి చంపినారు, నేను మిమ్ములను నమ్మియుంటిని అనగానే యీ

నాయకులు మనవిచేసినది యేమంటే: వారు జీతాల నిమిత్తము దంగా చేసినారుగాని వేరేలేదు; మీ కుమారుణ్ణి చంపినది అన్యాయము; అనగానే నేకనామఖానుడు, వారి జీతాలు అందలేనందున యీ యోగము సంభవించినది అని వారిజోలికి పోలేదు. అంతట దగ్గరనున్న తురకలు ఏకస్థులై కోట రెండు దరవాజాలున్ను వేసి రెండు ఫిరంగీలు యీ అరబ్బీల మీద బారుసేయగాను అప్పుడు తురకలకున్ను అరబ్బీలకున్ను యుద్ధమై బహుమంది తురకలను చంపి అరబ్బీలు యావత్తు యుద్ధములోనే నష్టమైరి.

పైన వ్రాసిన మీరుజుమలానాడు గండికోట సరకారు అని యీ సర్కారు క్రింద కొన్ని పరగణాలు చెల్లుతూయుండేది. జంబులమడుగు తాలూకా నిర్ణయము చేసినారు.

జుల్లపకారఖానుడు తాగాయతి గండికోట కిల్లేదారి చేస్తూయుండగాను గోలకొండ తానీశాహా వారివద్ద అక్కన్న మాదన్నగారు అధికారదక్షులై యుండి, వారితట్టునుంచి పొదిలి లింగప్ప అనే బ్రాహ్మణుడు యీ దేశానకు సుబేదారుడై యుండగాను జంబులమడుగు తాలూకా నిర్ణయమై జంబులమడుగువ్యవహారంచేసే రంగోరఘునాథపంతులు తరఫుదారు మహాల్లాతిహాయతర్ఫు జంబులమడుగుగారు వ్యవహారము చేసినట్టు చినదండ్లూరి మజరా గోపాలపురం శ్రోత్రియదారు కంచెనపల్లె కొండలరాయని వద్దఉండే దానపత్రములో

శాలివాహనశకవరుషంబులు ౧౬౦౩ అగునేటి దుందుభి సం॥ ఆశ్వీజ, శు ౧౫ లు వ్రాసినది ఉన్నది.

౧ అయినది సన్నదు.

జుల్లపకారఖానుని వారికే నౌసరత జంగు అనే కితాబు పాదుశాహా వారు యిచ్చిరి. అలంగీరబాదుశాహావారి ప్రభుత్వములో గండికోట కిల్లేదారి చేస్తూయుండి గండికోట జుమామసీదు ఖతీబు హాూన్నూరు బేగు మదారసాహేబు వారివద్దయున్న ఫారశీ సన్నదు అన్వయం.

గండికోట కిల్లేదారు జుల్లపకారఖాను మసీదు ఖతీబు ముస్తఫాకు గండికోటలోకి చెల్లే నేకనామబాదు అనే పల్లె యిచ్చినారు. సన్న జులుసు ౧౫ మొహర్రులో. యుండేది అలంగీరబాదుశాహా గాజీ ఫిదివి బయతికార ఫిదివి నుసరతజంగు జుల్లపకారఖాను బహాదర, సన్న ౧౧౦౯ అని యున్నది.

౧ గండికోటఖాజీ మహమ్మదు హాసనవద్ద యుండే సన్నదు అన్వయము. జుల్లపకారఖాను జంబులమడుగు పరగణా మీాద మొహసిను కాజీకి, రోజీనా ఒక రూపాయచేసి యిచ్చినారు. సన్న ౫౦ జులుసు. ఫారసిసన్నదు. మొహరులో పైన వ్రాసిన సన్నదు మొహరు ప్రకారముగానున్నది.

౧ కిల్లేపట్టి తిమ్మాపురంగ్రామానికి పడమర నిలువురాతికి ఉండే శాసనము.

శాలివాహనశకవరుషంబులు ౧౬౨౩ అగునేటి విషు సం॥ మార్గ శిర, శు ౧౫ లు శ్రీ మద్యజనాదిషట్కర్మ నిరతులైన యేటూరి సదాశివభట్లగారికి రాజశ్రీ నరోసపంతు తరఫుదారు మహల్లాయతి జంబులమడుగు వర్తెరాగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియగ్రామదాన శాసనపత్రిక :

హాజరతు నవాబుసాహేబు బళీగారికి సుకృతముగాను జంబుల మడుగు సమ్మతులో పెండ్లిజువ్వి గ్రామం పొలంలో అణకువగా యిచ్చిన పొలంలోను ఆ గ్రామానకు దక్షిణాన ఈదులవంకకు దక్షిణభాగమందు భూపాలుని చెరువు ఉత్తరాన లావనూరినుంచి పెండ్లిజువ్వికి పొయ్యే మార్గసమీపమందు బావి త్రొవ్వించి రాతికట్టడం కట్టించి వనము వేయించినందుకు ఆ యూరి రెడ్డికరణాలు ఆ బావి సమీపమునసే ముత్తుం బీటిచేను మీాకు మాన్యంచూపి దానపత్రిక యిచ్చినారు గనుక, మీారు ఆ ప్రయోజనములలో నుండి అక్కడ పల్లె కట్టించమనిన్ని, ఆ పల్లె తమకు శ్రోత్రియముగా దానపత్రం వ్రాయించి యిప్పించమనిన్ని,

ఆ పౌరోహిత సహితంగా మాకు యివ్వవలెననిన్ని మాతో తెలుపు కుంటిరి; గనుక అదే ప్రకారముగానే దానపత్రికలోను పల్లెకు పొలం నిర్ణయము చేసినది. ఉత్తరానకు ఈదులవంక పొలి మేర చేసుకొని అనంతపురానకు పెండ్లి జువ్వికి ఉండే పొలిమేరహద్దుచేసి బీరకాయల గంగమ్మకుంట దేవళము ఆది చేసికొని అమడకుంటల తూర్పు మేర చేసుకొని యీకడ ఆగ్నేయానకు యర్రకొనతలావు మేరచేసుకొని దక్షిణానకు లావనూరికి పెండ్లిజువ్వికి పొయ్యే మార్గం పొలి మేరచేసి భూపాలుని చెరువుకట్ట తూర్పుమార్గం ఆదిగా వాయువ్యానకు మీరు కట్టించిన బావికిగాను యిచ్చిన మాన్యానకు పశ్చిమం పొలిమేరచేసి ఆలోగానుండే పొలము యీ సంవత్సరానకు సాగినచేను, ఖ ౨౯ ౨॥౦, తోట ఖ౦।౧ ఉభయం చేను తోట సహాగాను ఖ ౨।౩॥ రెండుపుట్లు యెనమందున్ని రస యింటికి మాన్యాలు చేను ఖ ౦౪౩ పద్దెనమందుంగాక నిలిచినది తోట చేను సహాగాను ఖ ౧౪౦౪౦ ముప్పందున్నిరస యింటికి హొన్నులు ౫ ౧౫ పదిహేనువరహాలకు శ్రోత్రియం నిర్ణయం చేసి యీ స్థళానకు అణకువ అయిన గోభూమి, పాండుభూమి, బీడు, చెట్లు మొదలుగా నుండిన స్థళం సహితంగా తథాతిథి పుణ్యాకాలమందు శ్రీ నృసింహార్పితముగాను దాన పత్రం వ్రాసియిచ్చినారం. ఆ స్థళమందు మా కుమారుని పేర తిమ్మాపురము అనే గ్రామము కట్టించి ఆ పల్లెకుగా విడిచిన భూమి ప్రతి సంవత్సరమున్ను అనుభవించుకొని వీరికి అనుకూలు లయిన బ్రాహ్మలును సహవాసంగా నుంచుకొని మీకు నిర్ణయము చేసినది పదిహేను వరహాలు పెండ్లిజువ్విగ్రామానికి తగిలే బేరీజులోను అణుకువగా దివాణానాకు చెల్లిస్తూ నిరాచ్ఛేదనగా సుఖాననుండవలెను. దేశాహి, కానుగో, ఆసరిమజుందారుడు, సర్ దేశాహి, పాళెగాండ్లు, కావలికాండ్లు మొదలైనవారు గ్రామం పెండ్లిజువ్వికేగాని తిమ్మాపురానకు పనిలేదు. పల్లెస్థళం సుంకం మరియే బాధ్యం చేసే సాంమోతి జమా తోటి ఆగ్రామం చే(సికొనే)ది.

౧ ఈ ఆకనూరి నరసన్న పంతులుగారు కసుబా జంబులమడుగులో రాతితో కోటకట్టించి ఆ కోట ఆగ్నేయం బురుజుకు వెలిభాగం ఆంజనేయ ప్రతిమవద్ద శాసనం వేయించినది.

ఆకనూరి నరసన్నగారు విరోధి సంవత్సరాన కట్టించిన కోట.

ఇందుకు శకం ౧౬౩౧ అవుతున్నవి.

ఈకోట యీశాన్యం బురుజుకు ఉండేది.

ఖరసంవత్సరం ఆశ్వీజ బ ౧౦ లు రా. ఆకునూరి నరసన్న కట్టించినది; సిరిగిరిసెట్టి పెరుమాళ్లనాయకుడివల్ల.

౧ నైరృతిమూల బురుజుకు ఉండేది.

రాజశ్రీ ఆకునూరి నరసన్న పంతులవారు. ఈ కోటకట్టించిన బురుజు సిరిగిరిసెట్టి పెరుమాళ్లనాయకునికి యిచ్చినది.

దీని వైపున నుండేది.

ఖర సం॥ భాద్రపద, శు ౧ లు రా. ఆకునూరి నరసన్న కట్టించిన కోట బురుజు.

ఈ ఖర సం॥ శకం ౧౬౩౩ అవుతున్నది.

౨౨ తర్వాత దావూదుఖానుడు సుబాగిరిచేస్తూయుండగా గండికోట కల్లేదారి మహమ్మదు నబీఖానుడు చేస్తూయుండెను. ఈ కల్లేదారుడు వ్రాసి యిచ్చిన సన్నదులు ఫార్శీభాషలో గండికోటలో నున్నవారి వద్ద నుండేవాటి సారాంశము.

౧ బాదుశాహావారి వజీరు మహమ్మదు అమినఖానుడు సేఖ మహమ్మదు మొహసీను వల్లదు (వల్ద్) సెఖదావూదు వారికి కాజీ హోదా (హోద) నిర్ణయం చేసినారు. సన్నుజుల్సు ౪౫ మొహరులో నుండేది. అలంఘీరు బాదుశాహాగాజీ మురిదమహమ్మదు అమినఖాన బాహదర సన్ను ౧౧౧౩.

ఈ సన్నదుకాజీసద్దవున్నది.

౧ శాహా ముస్తఫా దరవేషువద్ద ఉండేది.

గండికోట కిల్లేదారుడు మహామ్మదు సఖీఖానుడు ముస్తఫాదర వేషువారికి జంబులమడుగుతాలూకా బెడదూరు, ఏటూరు ఈ రెండు గ్రామాలలో అయిదు తూముల చేను మాన్యం యిచ్చినారు. సన్న ౧౧౧౭ ఫసలి.

మొహరులో నుండేది.

శాహాఅలం బాదుశాహా గాజీ; ఖానాజాద మహమ్మదు సఖీఖాను. జులుస ౧

౧ హైదరుశాహా గండికోటలో పంజ ముబారక మకానులో నుండే వానివద్ద ఉండేది.

మహామ్మదు సఖీఖానుడు సాలికదరివేష వారికి గండికోటలో చేరియున్న అలియాబాదులో మొజీఖాను హావేలివద్ద అయిదు తూముల భూమి మాన్యం యిచ్చినారు. జులుసు ౨.

౨ మొహరులో పైన వ్రాసిన ప్రకారమే వ్రాసి సన్న ౧౧౧౯ అనియున్నది.

౧ మహామ్మదుహాసన్ రాయులచెరువు మసీది వారివద్ద ఉండేది.

మహామ్మదు సఖీఖానుడు బమోజీబు పరవానా అహామ్మదబేగు ఖాను వ సఖీఖాన్ కిల్లేదారు వగైరాలు వ్రాసియిచ్చిన ప్రకారం రాయుల చెరువువద్ద నుండే మసీదికి దీపారాధనకు.........

ఏటూరిలో మడి ఖ।౦, బెడదూరిలో మడి ఖ।౦, పెదకొమ్మెర్లలో చేను ఖ।, రాజుపాలెము చేను ౧౨, దాసులపాడులో చేను ౧౩, ఉప్పల పాడులో చేను ౧౩, దిగువపట్లములో మడి ౧౧, తొర్రివేములలో చేను ౧౧, బుక్కపట్లములో చేను ఖ। ఈ ప్రకారము మాన్యం యిచ్చినారు.

మొహరుపైన వ్రాసిన ప్రకారమె ఉన్న మొహరులో నుండే సన్న ౧౧౩౩.

౧ కాజీవద్దయుండేది.

యూవజఖానుడు కాజీకి మల్యాల పరగణామీంద రోజీనా ఒక రూపాయ వ్రాసియిచ్చినారు. మొహరులో నుండేది.

మహమ్మదుశాహా బాదుశాహా గాజీ పిదివి, రుస్తుమజంగు రుక్న దాలా యూవజఖాన బహదరు, సన్న ౧౧౩౩.

రెండో మొహరులో నుండేది.

మహమ్మదుశాహా బాదుశాహా పిదివి, యూనతఖాన సన్న ౧౧౩౨.

పైన వ్రాసిన హైదరుశాహావద్ద ఉండేది.

మహమ్మదు సఖీఖానుడు సిఖమహమ్మదుకు గండికోటలో అణుకువ అయిన సంకెచలమ తోట యిచ్చినాడు. సన్న జుల్సు ౩౮.

మొహరులో నుండేది.

అలంగీరబాదుశాహా, మురిద మహమ్మదు సఖీఖాన. సన్న ౧౧౩౫.

ఇదిగాక కొన్ని సన్నదులు మహమ్మదు సఖీఖానుని వారివద్ద యున్నవి. అందులో జుల్సు అని వ్రాసియున్నది.

ఈ మహమ్మదు సఖీఖానుడు అలంగీరబాదుశాహావారి దినములలో నున్ను గండికోట కిల్లేదారి చేస్తూయుండెను. వీరి దినములలో గండికోటకు పడమరవుండే కిల్లేపట్టి గ్రామాలున్ను ముడియం పాలూరు ఇవి కోటలో నున్నవారి జీతాలకుగాను నడుస్తూయుండెను.

౨౩ తరువాత కడప సుబేదారుడు అయిన మయాణా అబ్దుల్లా నబీఖానుడు ప్రబలుడై నాలుగువేల మందిన్ని నాలుగువేల గుర్రాలున్ను బహుతోపుఖానాతోకూడ, దిగువపట్నంవద్ద అర్ధందండు దిగి, అర్ధంమంది

గండికోటకు పడమర గండ్లూరిలోనుంచి కోటకు దక్షిణంగా నాగఝరి కోనకు పడమర కొండపైన ముఖాంవేసి ఫిరంగి యెక్కించి గండికోట కున్ను ప్యాటకున్ను తూర్పు మామిడికోనకు పోయేమార్గంలోను ఒక మోర్చా వేయించి ఫిరంగి యెక్కించి ఆరునెలలు లడాయి అయినది. కోటలోనున్న వారికి రస్తులేనందున మహమ్మద సఖీఖానుడు అబదుల్లా నబీఖానునికి సమాచారం పంపించినది వివరం యేమంటే: 'కోటలోనున్న మందికి ఆరునెలల జీతాలు బాకీయున్నది. అవి యిస్తేగాని కోటవిడిచేది లేదు; చేతి భత్యంతిని యింకా ఆరునెలలు అయినాను లడాయి చేసేమని మంది అంటున్నారు; గనుక వారి జీతములు యిస్తేను కోటమీస్వాధీనా నకు యిస్తున్నామని అంటున్నారు,' అని చెప్పి పంపించగానే అందుకు అబ్దుల్లా నబీఖానుడు మారు ఉత్తరం పంపించినది: 'వారి జీతముల పట్టీ వ్రాసిపంపిస్తే అదే ప్రకారం పైకం యిచ్చిపంపిస్తాము', అనగానే మహమ్మదు సఖీఖానుడు మందికి యియ్యవలసిన జీతములు, ౨౫౦౦౦౦ రెండు లక్షలయాభై వేల రూపాయలకు లెక్క వ్రాసిపంపించినంతట అబ్దుల్ నబీఖానుడు ఆ పైకము ఒంటెలమీద వేసి గండికోట పేటకు తూర్పు బల్లనేని హనుమంతరాయని దేవళమువద్ద తెచ్చియుంచగాను మహమ్మదు సఖీఖానుడు ఆ పైకం కోటలో నున్న మందికి బట్వాడాచేసి రసీదులు పుచ్చుకొని తన సరంజాము బాబస్తుతోకూడ కోటవిడిచి వెలు పలికివచ్చి కోట అబ్దుల్లా నబీఖానుని వశానకు యిచ్చి తాను గోలకొండకు లేచిపోయెను.

అబ్దుల్లా నబీఖానుడు గండికోటలో ఠాణా కాయముచేసి పూర్వం ఉన్న నాయకులనున్ను మందినిన్ని యథాప్రకారం ఉంచి తన కుమారుండైన అబ్దుల్లా కాదరఖానునికి గండికోట జాగీరుగా యిచ్చెను. గనుక అబ్దుల్లా కాదరుఖానుడు గండికోటలో ఠాణా కాయముచేసి, నాలుగు వేలమందిన్ని నాల్గువేల గుర్రాలనున్ను యిరువై నాలుగు యేనుగులున్ను ఉంచుకొని కోటలో రంగమహాలున్ను నౌబతీఖానా వగైరాకట్టించి మాధవస్వామి దేవళమువద్ద బురుజుపైననున్న మాధవచక్రం అనేఫిరంగి దిగువ దింపడానికి, కోటదరవాజాలు అయిదు దినములు వేసి ఆఫిరంగిని దింపి

అలంగీరుబురుజుకు పడమర తన పేరుతో బురుజు కట్టించి గచ్చుచేసి ఆ మాధవచక్రం అనేఫిరంగి ఆ బురుజుపైన యెక్కించెను. కోటకు ఈశాన్యము ౧ పరువున్నర దూరమున పెన్నకు ఉత్తరం పూర్వం రాజుపాళ్యానకు ఉత్తరం కాదరాబాదు అనేపేట కట్టించి అక్కడ ఒక బురుజున్ను కట్టించెను. ఇతడు మడకశిరా వగైరాకొన్ని దేశముల కట్టుకొనియుండెను. ఇతని దినములలో అయిన సన్నదుల సారాంశము.

౧ గండికోట ఖాజీవద్ద యుండేది.

ఈ అబ్దుల్ కాదరుఖానుని తమ్ముడు అబ్దుల్లాఫత్తాఖానుడు ఉండె, గనుక అతడు ఖాజీకి జంబులమడుగు పరగణామీద రోజీనా ఒక రూపాయయిచ్చేలాగున వ్రాసియిచ్చినారు. సన్న ౧౧౩౪ హిజరి, బాదు శాహాగాజీ, ఫిదివి అబ్దుల్లా ఫతా.

౧ దిగువపట్టంలో నుండే చెరువు దసవందం అనుభవించే మహమ్మదుఖానునివద్ద నుండేది.

మయణా అబ్దుల్లాఖానునివారు రోశనఖానునికి దిగువపట్టంలో చెరువు దసవందం సన్నదు వ్రాసియిచ్చినది. సన్న ౧౧౪౯ హిజరీలో;

మొహరులోనుండేది.

మహమ్మదుశాహా గాజీ, ఫిదవి అబదుల్ల కాదరఖాను సన్న ౧౧౩౬.

తరువాతను, అబ్దుల్లా నబీఖానుని పెద్ద కొమారుడు, అబ్దుల్లా కాదరుఖానుని అన్న అయిన అబ్దుల్లా మహమ్మదుఖాను వురఫీ గుడ్డి నవాబు కడప సుబా చేస్తూయుండగా,

శాలివాహనశకవరుషంబులు ౧౬౬౨ రౌద్రి సం॥లో రఘోజీ ఫతేసింగు అనే సరదారుడు మహారాష్ట్రులతట్టునుంచి దండుతోకూడా దక్షిణదేశానికి వచ్చి దేశంయావత్తున్ను దోచెను. గండికోటదుర్గం మాత్రం అతని స్వాధీనముకాలేదు. పిమ్మట గోలకొండనుంచి నవాబు అసబజాహా వచ్చి గండికోటకు తూర్పు రెండుపరువుల దూరమున పొన్న

త్రోట అనే గ్రామంపద్ద దండుతోకూడదిగి, అబ్దుల్లాకాదరుఖానుడు చని పోయియుండగాను గుడ్డినవాబు కడపనుంచి గండికోటకు వచ్చియుండెను. అప్పుడు అసబజాహావారు గండికోట దుర్గం తాామున్ను తమజనానాతో కూడ చూడవలెనని గుడ్డినవాబుతో మెరుక చేసినంతట గుడ్డినవాబు గండికోటలోనున్న అందరు మొగవాళ్లను వెలుపటికి రమ్మని హుకుం చేసి అసబజాహా తమయొక్క స్త్రీలతోకూడా దుర్గం తిరిగిచూచి వెలు పటికి వచ్చి గుడ్డినవాబుతో యీ దుర్గం బాదుశాహా దుర్గం గనుక మా తట్టున యీ కోటలో ఠాణాగా నుండవలెను అనగానే, అందుకు గుడ్డి నవాబు అబ్దుల్లాకాదరుఖానుని కొమాళ్లు ౧ గన్నిమియ్యా, ౧ గఫర్ మియ్యా, ౧ చిన్ననవాబు. ఈ ముగ్గురు చిన్నవాళ్లున్నారు అనగానే వారికి పెదపసుపుల, చినపసుపుల, ఉలవలపల్లె యీ మూడు గ్రామ ములు జహాగీరు యిచ్చి నవాబు అసబజాహాతట్టున కవిదిల్లఖానుడనే వానికి గండికోట కిల్లేదారి యిచ్చి అసబజాహావారు గోలకొండకు లేచి పోయినారు. అసబజాహా తట్టున కవిదిల్లఖానుడు గండికోట కిల్లేదారి చేస్తూయుండి కిశ్లేపట్టి గ్రామములున్ను మరియు పాలూరు జువికోట జాగీరు చెల్లుతూయుండె. అందువల్ల పైకము కోటలో నున్నవారికి జీతములు యిస్తూయుండెను. ఈ గుడ్డినవాబు కడప సుబేదారి చేసినది శాలివాహనశకవరుషంబులు ౧౬౫౮ నళ సం॥ ఆరంభము శాలివాహన శకవరుషంబులు ౧౬౬౯ ప్రభవ సంవత్సరము వరకు ౧౧ సంవత్సరములు చేసెను.

౨౫ తరువాత అబుదుల్లానబీఖానుని కుమారుడు మొసంఖాను పురుష మోచామియ్యా కడప సుబేదారి చేస్తూయుండగా, గండికోట దుర్గము అసబజాహా పరంగానే కవిదిల్లఖానుడు కిల్లేదారి చేస్తూయుండెను. ప్రమోదూత (శకం ౧౬౭౨) సంవత్సరమున నాసరజంగు దండుతోగూడ కనదు క్రింద పుదుచేరిపద్ద యుండగాను, యీ మోచామియ్యాయున్ను కందనవోలినవాబు హిమ్మతుబాహదురున్ను ఉభయులున్ను నాసరజంగు వెంబడి పుదుచ్చేరికి తమ స్తోమముతోకూడా పోయియుండగాను, అప్పుడు నాసరజంగు వద్దకు జమీందారులు వగైరాలు వస్తే నాసరజంగువద్దయున్న

చోపుదార్లు గరీబ్ పరవర సలామత్తు ఫలానా జమీందార్లు ముజరా చేస్తా రని హెచ్చరిక చెప్పేవారు. అప్పుడు కందనవోలినవాబు హిమ్మతు బాహాదరు తనవెంబడి తగు యిన్నూరు గుర్రాలు బమైహత్యారులు సిలేబఖ్తుతోకూడా నాసరజంగు మజిలిసి బిఛ్చానా పరియంతంవచ్చి అదబు బజాయించక, సమమైనవారు చేసేలాగున అజు సలాం అలేకం అనిపోయి కూర్చుండేవారు. ఈ ప్రకారం మొదటిదినంచేసి రెండోనాడున్ను అదే ప్రకారం మజిలీసువద్దకుపోయి అజు సలాం అలేకం అనగానే నాసర జంగుయొక్క ఆంతర్యములో యితడు బోగందాని గర్భవాసములో పుట్టినవాడున్ను బహు మొగరూరితో తనయోగ్యతానుసారం అదబ్ బజా యించక వస్తాడని హిమ్మతు బాహాదరనుచూచి అనినది యేమంటే: "క్యాం, కంచినికే బేటే బహుత్ మగరూరీ కర్తే" అని అనగానే హిమ్మతబాహాదరు నాసరజంగునుచూచి "క్యాం, ధోబినికే బేటే సమాల్ కర్ బాత్ కర్" అని అనగానే నాసరజంగు డాల్ తల్ వార్ తీసి కొని లేవగానే అప్పుడు ఆ మజిలీసులో నున్న వారందరు ఆయుధాలతో కూడ లేవగానే నాసరజంగువారికిన్ని హిమ్మతుబాహాదరు వారికిన్ని యుద్ధమైనందున హిమ్మతుబాహాదరు సాందుతో ఆ యుద్ధంలో నాసర జంగు తలకోసి హిమ్మతుబాహాదరున్నూ మోచామియ్యాయున్ను ఉభయులు ఆ దండు విడిచి కడపకు ప్రవేశించిరి.

అక్కడ నాసరజంగు వద్దయున్న వారందరు మసలతుచేసి నాసరు జంగు చనిపోయెను, దండు ఖలల్ అయిపోతున్నదని నాసరుజంగుయొక్క బావమరది అయిన హిదాయత్ మొహిదీన్ ఖానునికి పట్టం కట్టి అక్కడినుంచి వారు దండుతోకూడ కడపకు దక్షిణం రాచోటికివచ్చి దిగిరి. అంతట కందనవోలి నవాబు హిమ్మతుబాహాదరు తనదండుతో గూడ హిదాయతు మొహదీనుఖాను దండుమీద లేచిపోగా హర్కా రాలు హిదాయతు మొహదీనుఖానుడికి యెరుకసేయగానే హిదాయతు మొహదీనుఖానుడు దండుతోగూడ హిమ్మతుబాహాదరును నేటిదినము చంపినవారికి జాగీరులు మనసబులున్ను విశేషమైన బహుమానము లున్ను యిస్తామని చెప్పి, తాను అంబారీలో స్వారి అయి, నడుకుతూ

హిమ్మత్ బాహాదరుయొక్క అంబారి మొట్టించి యుద్ధమౌనప్పటి ఆయుద్ధ ములో హిదాయతు మొహదీనుఖానుడున్ను కందనవోలి హిమ్మతు బాహాదరున్ను ఉభయులున్ను కాలం చేసిరి. హిదాయతు మొహదీక్ ఖానుని దండు యీ దేశములో నిభాయించలేక తిరిగి తుంగభద్రానది దాటిపోయిరి.

గండికోటలోనున్న కిల్లేదారు కవిదిల్లఖానుడు కిల్లేదారిలో వ్రాసి యిచ్చిన ఫారశీ సన్నదులయొక్క సారాంశము.

౧ దిగువపట్టంలో చెరువులో దసవందము అనుభవించే హిమ్మత ఖానునివద్ద ఉండేది.

గండికోట సరకారులోని దిగువపట్టంలో చెరువు సికస్తు అయి యుండగా సుజాఅతఖార (?) మహమ్మదరోశనఖాన బమోజిబు సన్నదు అబుదుల్లా కాదరుఖాన మరహుమనాడు చెరువు మరమ్మతు చేయించి యుండగాను చెరువుక్రింద సాగినమడికి చాతుర్భాగం దసవందం నడి పించేది. చందు ౧౧ మొహరం సన్న ౧౧౫౭ హిజరి.

మొహరులో నుండేది.

మహమ్మదశాహా బాదశాహా గాజీ, ఫిదివి కవిదిల్లఖాన. సన్న ౧౧౫౬, సన్న జుల్సు ౨౬.

గండికోటలో పంజం ముబారకుమకానుదారు హైదరుశాహావద్ద నుండేది.

కవిదిల్లఖానుడు సేఖమహమ్మద దరివేశువారి కుమార్తెలకు జుల్సు ౨౮, సన్న ౧౧౫౮ హిజరీలో గండికోటలోను దేవరకోనలో అయిదు తూములు మాన్యము యిచ్చెను.

మొహరులో పైనవ్రాసిన ప్రకారంగా వ్రాసియున్నది.

౧ ఇతనివద్దనే రెండో సన్నదు.

కవిదిల్లఖానుడు సేఖుమహమ్మదు కొమారుడు బదరద్దీనుకు జుల్సు ౨౮ లో గండికోటలోని సంకెనిసెలమ తోట యిచ్చెను.

మొహరులోనే పైనవ్రాసిన ప్రకారమే యున్నది.

దిగువపట్ణం చెరువు దసవందం అనుభవించే వారివద్ద యుండేది. కవిదిల్లఖానుడు రోశనఖానునికి దిగువపట్ణంలో వనం వేసినందున ఆ వనము వారికే నడిచేలాగున సన్న ౧౧౬౨ హిజరీలో సన్నదు వ్రాసియిచ్చినారు. మొహరులో పైన వ్రాసినప్రకారమే యున్నది.

కవిదిల్లఖానుడు మహబూబ్ అల్లి దరవేశుగారికి రాజుపాళెములో యెనిమిదిముంతల తోట యిచ్చినారు. సన్న ౧౧౬౪, హిజరి ముతాబకు సన్న ౧౧౫౦ ఫసలి... మొహరు సదరి ప్రకారం........

పిమ్మట పైన వ్రాసిన మయూణా మోచామియ్యా కడప సుబేదారుడు కడపలో నిలచియుండగాను, లోగడ యితని అన్న అబదుల్లకాదరఖాను గండికోట జాగీరు అనుభవిస్తూయున్న వానికుమారుడు గన్నీమియ్యాకు కొంత పౌంజుయిచ్చి 'ఇప్పుడు గోలకొండవారి దొరతనము ఖలలుగాఉన్నది; గనుక గండికోటదుర్గము నీవు యుద్ధముచేసి తీసుకొనేది', అని సెలవు యియ్యగానే గన్నీమియ్యా దండుతోగూడ దిగువపట్ణంవద్దకి వచ్చి దిగినంతట్లో గండికోటలో నున్న కిల్లేదారుడు అయిన కవిదిల్లఖానుడు బనగానిపల్లి గుల్లూమియ్యాకు వ్రాసి వారివద్ద నుంచి 300 మందితో గుల్లుమియ్యాను, దుర్గములోనున్న రెండువేల మందిలో కొంత జనాన్నిన్ని నాయకులనున్ను కూర్చి గుల్లూమియ్యా స్వాధీనముచేసి వారిని గండికోటకు యీశాన్యం పరువుదూరమున నున్న కాదరాబాదు వద్దకుపోయి గన్నీమియ్యాతో యుద్ధము సేయగాను ఉభయ దండులో చాలా జనం నష్టమయి గన్నీమియ్యా గండికోటకు తూర్పు పేటకుతూర్పు తమటంచేలో దిగి అక్కడనుండి జెరు(?)చేసెను. అప్పుడు కోటలోనున్న కవిదిల్లఖానునికి కుమ్మకుగాను వచ్చిన బనగానపల్లె గుల్లుసాహేబు కిల్లేదారుడయిన కవిదిల్లఖానునితో చెప్పినది యేమంటే, 'గండికోట నా వశానకు యిస్తే లడాయిచేసి యింకా నాలుగు

వేల మందిని పిలిపిస్తాను' అనగానే దుర్గములోనున్న నాయకులు 'వీడు ఉంటే మాకు రావలసిన జీతములు మునిగిపోతున్నవి. వీడు చెడ్డవాడు. దుర్గము బలకాయిస్తాడు', అని కవిదిల్లఖానునికి తెలియజేసినందున, కవిదిల్లఖానుడు గుల్లుమియ్యా యున్న తావుకు మందిని పంపించి, 'నీవున్ను నీ మందితోకూడా పోవలసినది. నీవు కోటలో ఉండటానికి పనిలేదు. లేచి పోతే ఉత్తమం; లేనిపక్షాన మేము ఫిరంగి బారుచేసి కాలుస్తాము' అనగానే వాడు తనమందితోగూడ పడమటి గవనినుంచి ఒక జజాయిన్ని, ఒక శేఖలానున్ను తీసికొని హనుమద్గుండం మీదుగాను బనగానపల్లెకు ప్రవేశించెను. గండికోటలో కవిదిల్లఖానుడి దగ్గర పైకమున్ను జఖీరానున్ను లేనందున, గన్నీమియ్యాకు సంధానం పెట్టి, 'నేను అయితే కోట యివ్వవలెనని యున్నానుగాని, కోటలోనున్న మందికి రెండులక్షల రూపాయలు జీతము బాకీ యియ్యవలెను. వారి జీతములు పంపిస్తే కోట యిస్తాము, లేని పక్షమునకు మందిచేత భత్యముతిని లడాయిచేస్తామని యున్నాను,' అని చెప్పిపంపగానే, అందుకు గన్నీమియ్యాచేత పైకము లేనందుచేత మోచామియ్యాకు యీ సమాచారము వ్రాసిపంపించి నంతట, మోచామియ్యా గన్నీమియ్యాకు వ్రాసిపంపించినది యేమంటే, 'నీవే పైకము యిచ్చి దుర్గం స్వాధీనం చేసుకోవలసినది' అని వ్రాయగానే నా వద్ద పైకము లేదని వ్రాసెను. పిమ్మట మోచామియ్యా రెండు లక్షల రూపాయలు తీసికొని గండికోట పేటకు తూర్పు హనుమంతరాయని దేవళమువద్దనుంచి కవిదిల్లఖానునికి ఖబరు పంపించగానే కవిదిల్లఖానుడు తనమందిని పంపించి ఆ పైకము కోటలోనికి తెప్పించుకొని వారి వారి జీతము బేబాకిచేసి కవిదిల్లఖానుడు తన సామానుతోకూడా నంద్యాల మీదుగా గోలకొండకు పోయెను. మోచామియ్యా సేఖుజీ అనే వానికి కిల్లేదారి మొకరరు చేసెను. గన్నీమియ్యా తనవద్ద పైకం లేనందున తన జాగీరు గ్రామములలో పోయియుండెను. ఒక సంవత్సరము జరిగిన పిమ్మట మోచామియ్యా భార్య అయిన మదీనాబీబీకి దుర్గమున్ను, దుర్గం జాగీరు గ్రామములుసహా జాగీరుగా యిచ్చెను. ఈ మోచామియ్యా కడప

సుబేదారి చేసినది శాలివాహనశకవరుషంబులు ౧౬౭౪ ఆంగీరస సంవత్సరమువరకు ౯ యేండ్లు చేసెను.

తరువాత కడపలో నున్న సాహుకారు పన్నిసిలీంఖానున్నూ బాకరాసాహేబు వీరిరువురున్ను కడపలో నుండి లోగడ అబ్దుల్ల నబీ ఖానుని కొమారుడు సిద్ధవటం జాగీరు అనుభవిస్తూయున్న అబ్దుల్ల హామీదుఖానుని కుమారుడు అబ్దుల్ల మజీదుఖానునికి, శాలివాహనశక వరుషంబులు ౧౬౭౯ ఆంగీరస సంవత్సరములో పట్టము కట్టగానే, నావద్ద పైకములేదని మజీదుఖానుడు ఆ సాహుకార్లకు యెరుకచేసినందున, ఆ సాహుకార్లు 'నాలుగువేల గుర్రాలకు మేము జీతము యిప్పిస్తున్నాము నీవు దేశం సాధించి మాకు పైకము పంపిస్తూవచ్చేది' అని కరారునామా వ్రాసి పుచ్చుకొని నాలుగువేల గుర్రాలకు జీతం సాహుకార్లు యిస్తూ యుండిరి. ఇంతగా సాహుకార్లు చేయడమునకు కారణము యేమంటే, మోచామియ్యాకున్ను యీ సాహుకార్లకున్ను విరోధముగా నుండినందున మజీదుఖానుకు పట్టము కట్టించినారు. మజీదుఖానుడు దండుతో కూడా కడపనుంచి పోయి వేముల సంస్థానీకుడైన కొమారనాయునితో యుద్ధముచేసి అతణ్ణి సిద్ధవటములో కైదుచేసి, అక్కడినుండి మజీదు ఖానుడు గండికోట తీసుకోవలెనని గండికోటకు తూర్పు రెండు వరువుల దూరమున పొన్నతోట అనేగ్రామంవద్ద దిగెను.

అప్పుడు దుర్గములో నున్న మదీనాబీబీ గన్నీమియ్యాకు వ్రాసిన వివరము: 'నీకు అయిన ఋణము నేను తీరుస్తాను. ఇప్పుడు నీవు అయిదు వేల గుర్రాలతో వచ్చేది'-అని గన్నీమియ్యాపేర ఒక జాబున్ను ఆతనికి బదలు యిచ్చిన పఠాణీలకు ఒక జాబున్ను వ్రాసిపంపించగానే అదే ప్రకారము గన్నీమియ్యా అయిదువేల గుర్రాలు జమచేసి అయిదువేల గుర్రాలున్ను మందితోకూడా వేపరాళ్ల అనే గ్రామంవద్ద దిగి గన్నీ మియ్యా మజీదుఖానునికి ఉత్తరము వ్రాసినది యేమంటే, 'మోచా మియ్యా నాకు పట్టం కట్టవలెనని యుండెను. నేనున్ను బాధ్యస్తుణ్ణి ఆయితిని. ఇప్పుడు నీవు మోసముచేసి పట్టానికి కూర్చుంటివి. ఇప్పుడు

యుద్ధానికి వచ్చేది' అని వ్రాయగాను మజీదుఖానునివద్ద నున్నవారు 'యిప్పుడు ప్రథమం మీలో మీరు కార్యముచేస్తే యుక్తముగా నుండదు. వాడున్ను బాధ్యస్తుడు గనుక వానికిన్ని కొంత దేశం యివ్వవలెను గనుక తప్పక యివ్వవలసినది' అనగానే మజీదుఖానుడు అంగీకరించి గన్నిమియ్యాకు తాడిపరతి ౧, యాడకి ౧, కరూరు ౧, పామడి ౧, పెదకల్లూరు ౧, ఈ తాలూకాలు జాగీరు యిచ్చెను. గన్నిమియ్యా ఆ తాలూకాలు ఠాణా వేసేటందుకు పోయెను.

మజీదుఖానుడు గండికోట దుర్గానికి వచ్చి మదీనాబీబీని కైదుచేసి కోట స్వాధీనము చేసుకొని గండికోట జాగీరుగ్రామములు జప్తీచేసి గండికోట హావేలి తాలూకున్ను, జంబులమడుగు తాలూకు సహా ఏకంచేసి బాలవెంకటరెడ్డి అనేవానికి అమీలుదారీ నిర్ణయముచేసి గండికోటకు నాలుగు ఆమడలమీది ఉప్పలపాడు అనేది, అవుకురాజులది, అక్కడ మజీదుఖానుడు పోయి ఆరునెలలు యుద్ధముచేసి కౌలుమీదను ఆ కోట తీసికొని అక్కడినుంచి గుత్తిబళ్లారికిపోయి అక్కడినుంచి మడకశిర, శ్రీరంగపట్టం, కోలారు, వగైరా బారామహాలు దేశంమీదుగా సిద్ధవటానుకు వచ్చెను. లోగడ నాలుగుయేండ్లనుంచి నాలుగువేల సవార్లకున్ను మందికిన్ని కోటిరూపాయల వరకు యిచ్చియున్న సాహుకారులు మజీదుఖానున్ని 'ఆ పైకము నీవు రాగానే యిస్తామని కరారునామా వ్రాసియిచ్చి యుంటివి గనుక యిప్పుడు పయికం యియ్యవలసినది' అనగానే, అందుకు మజీదుఖానుడు 'అర్ధం పైకం యిప్పుడు యిస్తున్నాను,' అనినంతట సాహుకారులు అంగీకరించక నాలుగువేల స్వార్లకున్ను మందికిన్ని సాహుకారులు జీతములు యిస్తూయుండినందుచేత సాహుకార్లు వానిని వెంబడి తీసికొని మజీదుఖానుడు సిద్ధవటం కోటలో యుండగానే సాహుకార్లు దంగా చేసిరి. అప్పుడు మజీదుఖానుడు గుండ్లతో వేయించెను. మజీదుఖానుడు మహారాష్ట్రుల దండు కృష్ణానదీతీరమున నుండగాను వారికి ఉత్తరం వ్రాసినది యేమంటే, 'మీరు దండుతోకూడా వచ్చి యిప్పుడు నామీద దంగా చేసినవారికి శిక్షచేస్తే మీకు కోటిరూపాయలు యిస్తా' మని వ్రాసినంతట మహారాష్ట్రులు లక్ష గుర్రాలతో కూడావచ్చి కడప

బుగ్గవద్ద దిగి మజీదుఖానునికి వ్రాసినది: 'కరారు ప్రకారం పయికము పంపిస్తే దంగా చేసినవారిని కొట్టుతున్నాము' అని వ్రాయగానే మజీదు ఖానుడు వ్రాసినది: 'ప్రథమం దంగా చేసినవారిని కొట్టితే తర్వాత పయికం పంపిస్తా'మని వ్రాసినంతట, అందుకు వారు అంగీకరించక 'మొదట పయికం పంపిస్తే వారిని చంపుతున్నాము'అని, దంగాచేసినవారు కడపలో నుండగా వారి జోలికి పోలేదు. మరిన్ని 'అర్ధంపయికం పంపిస్తే వారితో యుద్ధానికి ప్రారంభము చేస్తామ'ని సమాచారం పంపిస్తే మజీదుఖానుడు పయికం పంపించలేదు. గనుక దంగా చేసినవారు కడపలో నుండగాను వారి తెరువుకు పోకుండా సిద్ధవటము మీందను మజీదఖానునితో యుద్ధము సేయడానకు నిశ్చయించి కడపకు తూర్పు పరువున్నర దూర మున బండికనమపద్దికి మరాటీలు పోగానే యీశ్వర సం॥లో పీర్లపండుగ శరగస్తునాడు మజీదుఖానుడు సిద్ధవటంనుంచి మందితోగూడా వెయ్యి గుఱ్ఱాలను వెంబడి తీసికొని అంబారి యెక్కివచ్చి బండికనమవద్ద మహా రాష్ట్రులతోడ యుద్ధముచేసి మజీదుఖానుడు నాటిదినమే చనిపోయెను. ఈ మజీదుఖానుడు కడపసుబేదారి చేసినది శాలివాహనశకవరుషంబులు ౧౬౯౫ శ్రీముఖ సం॥ ఆరభ్యం శాలివాహనశకవరుషంబులు ౧౬౯౯ యీశ్వర సం॥ వరకు ౪ యేండ్లు చేసెను. ఈ వచ్చినట్టి మహారాష్ట్రులు దేశం దోచినారు.

తరువాత మహారాష్ట్రులు మోచామియ్యా (?) కైదులో నుండగాను అతనికి పట్టంకట్టి మహారాష్ట్రులు తమకు కోటిరూపాయలు యివ్వ మనగానే, మోచామియ్యా మహారాష్ట్రులకు గుఱ్ఱంకొండ, రాచోటి, పులివెందల, వెంపల్లి, పారనపల్లె, జంబులమడుగు తాలూకాలు వారి స్వాధీనము చేసెను. వారు ఆరునెల లుండిరి. అప్పుడు గన్నీమియ్యా జంబులమడుగులో కొంత మందిన్ని గుఱ్ఱాలతో నుండగాను అప్పుల వాండ్లు వచ్చి గన్నీమియ్యాను తీసికొని కందనవోలిలో గిరావు ఉంచి యుండగాను, గండికోట దుర్గం మోచామియ్యా తన భార్య అయిన మదీనాబీబికి జాగీరు యిచ్చెను; కాని తాలూకా మహారాష్ట్రుల స్వాధీ నము అయియుండినందున కోటలో నున్నవారు చుట్టు గ్రామములో

నుండు రైతులను పట్టుకొనివచ్చి దండుగలు తీసికొంటూ యుండేవారు. జంబులమడుగులో మహారాష్ట్రులు ३०० స్వారులు ఉండిరి. అప్పుడు మదీనా బీబీ గన్నీమియ్యాను అయిదువందల గుఱ్ఱాలతోగూడ రావలసినది అనివ్రాసి వాడురాకమునుపే మోచామియ్యా తట్టున దుర్గానికి కిల్లేదారుడుగా అబ్దుల్ల అజీముఖానుడనేవాడు మయాణావారి దాయాదిని ఉంచియుండినందున, మదీనాబీబీ హుకుంలో నడుచుకుంటూ యుండి అత డున్ను కొంతమందిన్ని దుర్గంవిడిచి కాదరాబాదుకు పడమట పనకనపల్లె చెరువులో దిగియుండగాను జంబులమడకనుంచి మహారాష్ట్రుల గుఱ్ఱాలు వీరిమీదికి రాగానే వీరు ఒక బాణం విడిచినంతట ఆబాణం వారిలో నొక గుఱ్ఱానికి నోటిలో నుంచి పూర్వద్వారంగుండా వెళ్లిపోయెను. కడమ మహారాష్ట్రుల గుఱ్ఱాలు తిరిగి జంబులమడకకు ప్రవేశించిరి. దుర్గం వారు దుర్గం చేరిరి. పిమ్మట గన్నీమియ్యా కందనవోలినుంచి అయిదు నూరు గుఱ్ఱాలతోకూడా జంబులమడకకు రాగానే మహారాష్ట్రుల గుఱ్ఱాలు ఠాణా విడిచి కడపమార్గం పట్టి పోగా గన్నీమియ్యా వారిని కొకటం దాకా తరిమి తిరిగి రాత్రి రెండుజాములకు కాదరాబాదువద్ద వచ్చి దిగెను. మహారాష్ట్రుల గుఱ్ఱాలు తూర్పు దరిశి చందలూరు అనే గ్రామముల వద్ద మరాటీ పెద్ద దండు ఉండగా అక్కడికి పోయి సమాచారము తెలియ చేయగానే వారు అక్కడనుంచి యిరువై వేల గుఱ్ఱాలు నాలుగో నాడు అరుణోదయానికి గన్నీమియ్యా కాదరాబాదువద్ద నుండగాను మహారాష్ట్రులువచ్చి గన్నీమియ్యాదండును దోచుకొని కొందరిని చంపి నారు. అప్పుడు గన్నీమియ్యా చిన్ననవాబు ఉభయులు గుఱ్ఱాలుయెక్కి గండిబడిరాగా, ఫరాబాగువద్ద గండికోటవారు వచ్చి కోటలోనికి గన్నీమి య్యాను తీసుకొన్నారు. మహారాష్ట్రులు దేశందోచుకొని తమ దేశానికి లేచిపోయిరి. మోచామియ్యాకడప సుబాచేసినది. శాలివాహనశక వరుషంబులు ౧౬౮౦ బహుధాన్య సం॥ ఆరభ్యాం శాలివాహనశకవరు షంబులు ౧౬౮౨ విక్రమ సం॥ వరకు మూడుయేండ్లు చేసెను.

తదనంతరం మజీదుఖానుని కొమారుడు హాలింఖానుడు కడపసుబా చేస్తూయుండగాను, గోలకొండనుంచి నవాబు నిజామల్లీఖానుడు గండికోట

గండిమీదుగా దండుతో పశ్చిమరాజ్యానకు పోయేటప్పుడు, హాలీంఖానుడు నిజామల్లీఖానుని భేటీచేసికొని, నిజామల్లీఖానుడు గోలకొండలో ప్రవేశించిన పిమ్మటను, హాలీంఖానుని తమ్ముడైన సయ్యదుమియ్యాకు కొంత దండుయిచ్చినందున, సయ్యదుమియ్యా చిన్న పసుపులకు వచ్చి దిగి, గన్నీమియ్యాను పిలిపించి సిద్ధవటానికి పంపించినంతట, అక్కడ హాలీంఖానుడు గన్నీమియ్యాకు విషము పెట్టి చంపించెను. సయ్యదుమియ్యా నోసంపాళెగాండ్లమీద లడాయిచేసెను. అప్పుడు నోసంపాళెగాడు అయిన రంగారెడ్డి పైకము యిచ్చేలాగున కరారుచేయించుకొనెను. మోచామియ్యా సాకుకొన్న కొడుకు సరవరఖానుణ్ని రంగారెడ్డి పిలిపించి సయ్యదుమియ్యాతో యుద్ధముచేసి రమ్మని చెప్పినందున అదే ప్రకారము యుద్ధముచేసిరి. సదరు యుద్ధములోనే సయ్యదుమియ్యా సరవరఖానుడు ఉభయులున్ను చనిపోయిరి. గనుక నోసం రంగారెడ్డి కౌలు చేసికొనెను. అక్కడినుండి సయ్యదుమియ్యా గండికోటదుర్గ ప్రవేశించినంతట జంబులమడుగు తాలూకా సహా యితనివశం అయి జాగీరు అనుభవిస్తూయుండి, ఇతడు గంటికోట కిల్లేదరవాజా అంటే పశ్చిమంగవని చక్కచేయించి లోగడ మీరజుమలా నవాబు అలంగీరు బురుజుదాక గారపని చేయించియుండినందున, సయ్యదుమియ్యా ఆ బురుజు ఆదిచేసి కిల్లేదరవాజా దాక గారపని కిల్లేదరవాజాకు ఉత్తరంగా కొంత గారపనిన్ని చేయించి, గండికోటకు యీశాన్యం పెన్నదరిన ఫరాబాగు వద్ద కొండ ఊటనీళ్లు యేటికివచ్చే దిగువ హావుజున్ను, ఫవ్వారాకారంజా సన్ను, ౧౧౭౮ హిజరీలో బంగాళాతోటాను చేయించెను. ఈకారంజా బహు ఉన్నతముగా యెగురుతూ యున్నది. సయ్యదుమియ్యాకారంజాఫవ్వారా చేయించి ఆహావుజుకు తూర్పు ఉప్పుబండకు పారసీతో శాసనము వేయించినాడు. ఆ శాసనంలో పైన వ్రాసిన సన్ను ఉన్నది. మరిన్ని సయ్యదుమియ్యా గండికోటలో రెండు పాత ఫిరంగులు కొత్తగా చేయించెను. ఖర సంవత్సర మాఘమాసమునందు హాలీంఖానునికి సయ్యదుమియ్యాయందు సమాధానములేక కృత్రిమం చేసి జోడాబట్టలలో ఔషధమువేయించి జంబులమడుగుకు పంపించినంతట, సయ్యదుమియ్యా

ఆ బట్టలు తొడుగుకొనినంతట, శరీరం అంతాజ్వాల యెత్తి ఖర సం॥ మాఘ, శు ౧౧ లు సయ్యదుమియ్యా జంబులమడుగులో కాలముచేసెను. జంబులమడుగు తాలూకాకు బొలవెంకటరెడ్డికి అమీలుదారి యిచ్చెను. పిమ్మట మజీదుఖానుడి సాకుడు కొడుకు మఖనామియ్యాకు గండికోట దుర్గం కిల్లేదారి యిచ్చెను. తరువాత విళంబి సం॥మున హైదరునవాబు తట్టునుంచి మీరాసాహేబు అనే సరదారుడు దండుతోకూడా గండికోటకు పడమర అయిదు పరువుల దూరమున యేటూరు అనే గ్రామము వద్ద నాలుగువేల గుర్రాలు మందితోకూడా దిగి గండికోట దుర్గము యివ్వమని సమాచారము పంపించినంతటను, దుర్గం వారి వశానకు యియ్యలేదు. అక్కడనుంచి మీరాసాహేబు పోయి బహదరున్ను రాగానే, అక్కడ యుద్ధమై అక్కడనుంచి యీ సం॥ చైత్ర శు ౧౫ లు, నాడు సిద్ధవటం తీసికొని హాలీంఖానుని పట్టుకొని శ్రీరంగపట్ణానకు పోయిరి. అప్పుడు హాలీంఖానుని తట్టునుంచి గండికోటలో రుస్తుంఖానుడు అనే కిల్లేదారుడు ఉండగా హాలీంఖానుడు దుర్గము బహాదరువారి వశానకు యియ్యమని వ్రాసినంతట దుర్గము మీరాసాహేబు వశానకు యిచ్చెను. ఈ హాలీంఖానుడు కడప సుబేదారి చేసినది శాలివాహనశకవరుషంబులు ౧౬౮౩ విషు సంవత్సరం ఆరభ్యం శాలివాహానశకవరుషంబులు ౧౭౦౧ వికారి సం॥ చైత్ర శు ౧౫ లు వరకు ౧౮ యేండ్లు చేసెను.

౨౯ తరువాత బహాదరుతట్టు కడపరాజ్యం అయినది. గండికోట దుర్గం ఠాణా కాయంచేసి హాలీంఖానుని తట్టునున్న కిల్లేదారుణ్ణి మాత్రం అతని సామానుతో విడిచి కడమ కోటలోనున్న నాయకులను శ్రీరంగపట్ణానకు తీసికొని పోయెను. దుర్గములో బహాదరుతట్టునుంచి మీరజమాలుద్దీన అనే కిల్లేదారుడు ఉండెను. ఈ కోట నాయకులను శ్రీరంగపట్ణములో రెండు నెలలు ఉంచుకొని, మళ్లీ కొలువులో ఉంచి దుర్గానకు పంపించిరి. ఈ బహాదరు ప్రభుత్వములోనే బనగానపల్లె నుంచి ఒక ఫిరంగిన్ని రుద్రవరంనుంచి ఒక ఫిరంగిన్ని యింకా కొన్ని ఫిరంగులు తెచ్చి దుర్గములో నుంచిరి. కోటలో నాలుగువేల మంది ఉండిరి. మీరాసాహేబు దుర్గము దర్వాజా తూర్పు వెలపట పడకోటవద్ద రెండు బురు

జులు కట్టించెను. ఈ బహాదరు ప్రభుత్వము చేసినది శాలివాహనశక వరుషంబులు ౧౭౦౧ వికారి సం॥ ఆరభ్యాం శాలివాహనశకవరుషంబులు ౧౭౦౪ శుభకృతు సం॥ వరకు ౪ యేండ్లు చేసెను.

౩౦ తరువాత బహాదరు కుమారుడు టీపుసుల్తాను ప్రభుత్వంలో గండికోట దుర్గములో నాలుగువేలమంది యుండిరి. అప్పుడు గండికోట దుర్గానకు ఉత్తరం చింతమాని దొడ్డివద్ద గోడ పడిపోయి యుండగాను గార పని చేయించెను, బహాదరు టీపుసుల్తాన్‌వారి ప్రభుత్వములో దుర్గము కిల్లేదారి చేసినవార్లు: ౧ మీరజమాలుదీను, ౧ మీరఅల్లీరజా, సయ్యదుముర్తజా ఈముగ్గురున్ను కిల్లేదారి చేసిరి. టీపుసుల్తాను ప్రభుత్వము చేసిన శాలివాహనశకవరుషంబులు ౧౭౦౫ శోభకృతు సం॥ ఆరభ్యాం శాలివాహనశకవరుషంబులు ౧౭౧౨ సాధారణ సం॥ కార్తీక మాసము వరకు యేండ్లు ౭ నెలలు ౮ చేసెను.

౩౧ తరువాత గోలకొండ నిజామల్లీఖానుని తట్టునుండి బారామహాలు అనే సరదారున్ను బనగానపల్లె అసదల్లీఖానుడున్ను వచ్చి దొమ్మర నంద్యాల అనే గ్రామము గండికోట యీశాన్యము మూడు పరువుల దూరమున ౨౦ వేల గుర్రాలున్నూ మందితోగూడ దిగి, అసదల్లీఖానుడు మందితోగూడ పెద్దకొన తెట్టు వద్దకి రాగానే దుర్గములో నాలుగువేల మందిలో కొందరు దిగువపోయి అనంతుని కోనవద్ద బనగానపల్లె అసదల్లీఖానుడున్ను మందిన్ని బారామహాలు వారి మందిన్ని అనంతుని కోనవద్ద ఫిరంగీ నిలిపి వుండగాను దుర్గంవారు నాలుగువేల బారువాండ్లు వారిని చుట్టుకొని నిజాంవారితట్టు జనాన్ని బహుమందిని హతముచేసిరి. అంతట వారు నిభాయించలేక ఫిరంగిని తీసికొని దిగువ దొమ్మరనంద్యాలకు పోయిరి. దుర్గంవారు కొందరు దుర్గానికి వచ్చిరి. కొందరు తెట్టులోపలను ఉండిరి.

పిమ్మట నిజాంతట్టు ఆఫీజు అనే సరదారుడు సిద్ధవటమునకు పోయి ఆ కోటమీదను ముట్టడి వేసి యుండగాను బారామహాలు ఆఫీజు పేర ఉత్తరం వ్రాసి పిలిపించి పెద్ద జమీయతుతోకూడా గండికోట

దుర్గము తెట్టుమీాద లడాయిచేసి తెట్టుతీసికొని, అక్కడినుంచి పేటకు తూర్పు భాగమున దిగి, చినచెరువుకు పడమట మోర్చావేసి, దుర్గానకు దక్షిణము తెల్లరాళ్లగుట్టపైన రెండు ఫిరంగులును ఉంచి, గుండ్లుకోటపైన నిత్యం నన్నూరు యేనూరు గుండ్లు చలాయిస్తూ యుండగా, గండికోట జంబులమడుగు తాలూకు గ్రామములు మాత్రము నిజాంవారి తాణా అయినది; గండికోట మాత్రం స్వాధీనంకాలేదు. టీపుసుల్తాను ప్రభుత్వములో నుండగా దుర్గములో నున్నవారు నాలుగువేలు వెలుపట నున్నవారికి భత్యానికి యియ్యక దర్వాజా బందుచేసి దుర్గములో విడువక యుండినందున ఆ నాలుగువేల బారువాండ్లు శ్రీరంగపట్నానికి లేచి పోయిరి. అప్పుడు కోటలో నున్న నాలుగువేల మంది ఆరునెలలు లడాయిచేసి, కోటలో నున్న కిల్లేదారు సయ్యదు ముర్తజానున్ను ఆసబు సయ్యదు అలావద్దీనున్ను ఉభయులున్ను యేకమై, తమ సామానుతో దేశానికి పోనిస్తే కిల్లాయిస్తామని ఖరారు చేసికొని, దుర్గము ఆఫీజు వశానకు యిచ్చి, కిల్లేదారుడు అయిన సయ్యదుముర్తుజా శ్రీరంగపట్ణానకు పోగానే, టీపు సుల్తాను యితను ఫితూరిచేసిన వాడని యెంచి గల్లున వేయించెను. ఆసబు అలావద్దీనువద్ద దివాణం పైకం విస్తరించియుండగా తీసికొని గోలకొండకు పోయెను. ఆఫీజు గండికోట దుర్గము తాణాకాయము చేసి తాను గుర్రం కొండకు పోయి లడాయిలో అక్కడనే చనిపోయెను. బనగానపల్లె అసదల్లీ ఖానునికి యీా గండికోటదుర్గము స్వాధీనమయి యుండలేదు. ఈ నిజామల్లీఖానుని ప్రభుత్వములో గండికోట కిల్లేదారి చేసినవారి పేర్లు. ౧ ఆఫీజు సుబేదారుడు, ౧ దిలావరుజాలా దినములలో సిద్ది సాలంఖానుడు, ౧ కాదరసాహేబు, ౧ సయ్యదు ఖతలు; ౧ అమీర్ సాహేబు దినములలో కాదరసాహేబు; ౧ చందూలాలాదినములలో. మొత్తము ౬...ఇందులో ఆఫీసున్ను, అమీర్ సాహేబు, చందూలా వీరు కడప సుబేదారి చేస్తూ యున్నవారు. వీరల ప్రభుత్వంలో దుర్గములో నాలుగువేలమంది ఉండిరి. మొగలాయి ప్రభుత్వము శాలివాహనశకవరుషంబులు ౧౭౧౨ సాధారణ సం॥ మార్గశిరమాసం లగాయతు శాలివాహనశకవరుషంబులు ౧౭౨౨

రౌద్రి సం॥ ఆశ్వీజమాసం వరకు ౧౦ యేండ్లు చేసెను. ఇందులో కడప సుబేదారి చేసినవారు: ౧ ఆఫీసు సాధారణ సం॥ కార్తీక మాసం లగాయతు విరోధికృతు సం॥ వరకు యేడు ౧ నెలలు ౫; ౧ బనగాని పల్లె అసదల్లీఖానుడు పరీధావి మొదలు ఆనంద సం॥ వరకు యేండ్లు మూడు; ౧ అరబు అమీనుసాహేబు రక్తాక్షి, నళ సం॥ ౨; ౧ మల్లా అసదల్లీఖానుడు, పింగళ స॥ కాళయుక్తి సం॥ ౨; ౧ చందూలాలా సిద్ధార్థిరౌద్రి సం॥ ఆశ్వీజ మాసము వరకు యేడు ౧ నెలలు ౭.

తరువాత కుంపిణీ యింగ్లీసువారు శాలివాహనశకవరుషంబులు ౧౭౨౧ రౌద్రి సం॥ కార్తీకమాసంలో కడపరాజ్యము కట్టుకొని, గండి కోటలో రెండువేల బారున్ను యింగ్లీసు సరదారులున్ను వచ్చి ఆరు నెలలు ఉండి, పిమ్మట వేయిమంది కొన్ని దినములును, పిమ్మట నూరు సిఫాయీలు కొన్నిదినములును ఉండి, తరువాత పోలీసు ప్యాదాలు యిరవైమంది మాత్రము ఉండిరి. ఈ దుర్గములో తాణామంది లేనందున దుర్గములోనున్న వర్తకులు మొదలయినవారు జీవనోపాయము జరుగక పోయినందువల్ల విస్తారముగా యిండ్లు పాడు అయినవి. దుర్గముమాత్రము దురస్తుగానున్నది. ఇప్పుడు జంబులమడుగు తాలూకాలో గండికోట దుర్గము అణుకువ అయి గండికోటను ఒక మాజే అని వ్రాస్తున్నారు. రౌద్రికి A.D. ౧౮౦౦.

దుర్గములో లోగడనున్న ఫిరంగీల పేర్లు వివరము.

| | |
|---|---|
| ౧ యాడకక్కి-వీరభద్రుడనే ఫిరంగి | ౨ రామలక్ష్మణ ఫిరంగీలు |
| | ౧ వీరభద్రుని ఫిరంగి |
| ౧ పెద్దబురుజుమీదనుండేది ఫిరంగి | ౧ పెద్దపల్లి ఫిరంగి |
| | ౧ చినపల్లి ఫిరంగి |
| ౧ చిన్నగారబురుజు ఫిరంగి | ౧ ముద్దుకృష్ణుని ఫిరంగి |
| ౧ మాధవచక్రం ఫిరంగి | ౧ చిన్నముద్దుకృష్ణుని ఫిరంగి |
| ౧ హనుమంత ఫిరంగి | |

| | |
|---|---|
| ౨ మేకలపడవ ఫిరంగీలు | ౧ లంజపడవ ఫిరంగి |
| ౨ దూరాబాల ఫిరంగీలు | ౧ దలఫాదు ఫిరంగి |
| ౧ భూతనాథ ఫిరంగి | ౨ రామలక్ష్మణ తుండులు |
| ౧ జంబుచాల ఫిరంగి | ౧ పెద్దపల్లి తుండు |
| ౨ బంగాళాలోవున్న ఫిరంగీలు | ౧ చిన్నపల్లి తుండు |
| ౧ రామబాణం ఫిరంగి | ౧ హనుమంతుని తుండు |
| ౨ చిన్నకరీం కోటలోనున్న ఫిరంగీలు | ౧ రామబాణం తుండు |

వెరసి ఫిరంగీలు ౩౧ ముప్పదియొకటి.

ఈ ఫిరంగీలు కుంపిణీవారి ప్రభుత్వములో కోటలో ఫిరంగీలు ఉంచడానికి అసమాధానంచేత, పగలకొట్టి యినుము తీసికొని పోయినారు. ఈ ఫిరంగీలు పోయినవి పోగా ఇప్పుడు దుర్గములో రెండుపోత ఫిరంగీలు మాత్రము ఉన్నవి. వాటిమీద యిగ్లీషు అక్షరములు వ్రాసియున్నవి. అది ఫ్రాంసువారు చేసిన ఫిరంగీలు అని వాడుతున్నారు. ఇదిగాక దుర్గములోనున్న మందున్ను బాణములున్ను రాజచెరువులో కుంపెణీ వారు వేయించినారు. గుండ్లుమాత్రము ఒక కోఠీనిండా వేసియున్నవి. అవి కడపలో జల్లాకోర్టుకు దొంగలకు సంకెళ్లు చేయించడానకు జరూరు అయినప్పుడు తీసికొనిపోతున్నారు.

జఖేరాయుంచే కోఠీల వివరము

| | |
|---|---|
| ౧ జంగీసామాను ఫిరంగీగుండ్లుఉండేది. | ౧ ధాన్యముంచే కణజము. |
| ౩ జుమ్మామసీదులోకమాను ఉండేది. | ౧ మిరపకాయలు. |
| | ౧ పొగాకు. |
| | ౧ ఫిరంగిగుండ్లు. |
| | ౧ మందుకోఠీ. |

ఇవి యిప్పుడున్ను యున్నవి.

ఈ గండికోట దుర్గముపైన నుండునట్టి కోనేల వివరము:

౧ దుర్గానికి దక్షిణం సామీప్యం నాగఝరి అనేది కన్నికె లున్నందున నాగఝరి అనే నామము. ఈ బావి ఉదకం వంకగాపారి

కోటలోనున్న రాజు చెరు అనే గొప్ప దొనలో ప్రవేశించి చెరువునిండి, కోటగోడకు పశ్చిమంతట్టున మొహరీలనుంచి నీళ్లు వెళ్లి, దిగువరాజు చెరువు కోనమీదుగా నదిలో కలుస్తున్నది. కోనకు పశ్చిమం నదీ తీరమున అలియాబాదు అనే పల్లెయున్నది. అది మయాణావారి అమలులో పేట కట్టించి సాలెవాండ్లున్ను గాండ్లవాండ్లున్ను ఉండిరి. ఇంతలో అవాంతర ములచేతను రయితులు యెక్కడివారు అక్కడికి లేచిపోయినందున పల్లెపాడు అయినది. భూమిమాత్రం సాగు అవుతున్నది. అంతు కోనలు ౨, పల్లెబేచిరాకు ౧. ఈ పల్లెకు ఉత్తరం పెన్నకున్ను ఉత్తరం కొండపైన అగస్త్యేశ్వరుని కోనలో శివాలయం విష్ణ్వాలయములున్ను దేవ ఘాతములున్ను ఉన్నవి. ఈ దేవుని దీపారాధనకుగాను యీ దేవళానకు పశ్చిమం కోనస్థళంమాన్యంముగా యిచ్చినారు గనుక నడుస్తూ ఉన్నది.

౧ ఈ కోనకు పశ్చిమం న్యాలనూతల అనే గ్రామము గండి కోటలో మజరాగా నడుస్తూయుండి సుల్తాను ప్రభుత్వములో ఆలాయిదా గ్రామం అయినది.

పైన వ్రాసిన అలియాబాదుకు దక్షిణం నిచ్చుమల్లేశ్వరుని కోనలో పూర్వము శివాలయం ఉండి శిథిలమై పోయినది. ప్రస్తుతం ఆ కోన మాన్యంగా నడుస్తూయుండి ఖిలమైపోయెను. కోనలో సాగుకావడం లేదు.

౧ ఇందుకు దక్షిణం ముచ్చుకోన. ఇక్కడ లోగడ చెట్లు విస్తారంగా నుండినందున చీకటిగా నుండేది గనుక ముచ్చుకోన అనిపేరు. సాగు లేదు.

౧ గండ్లూరి వనానికి తూర్పున నుండే కొండకు అరపరువు దూరాన ఉండేది చింతలకోన. సాగు లేదు.

౧ ఇందుకు తూర్పు గురిగింజలు ఉండేది గురిగింజకోన.

౧ ఇందుకు పడమట మర్రిచెట్లు ఉండేది మర్రికోన.

౧ గురిగింజ కోనకు తూర్పు వెదురుపొద యుండగా వెదుళ్లకోన అని పేరు.

౧ ఇందుకు తూర్పు యెఱ్ఱకోన.

౧ ఇందుకు తూర్పు సంజీవిపల్లె అనేది యున్నది. అక్కడ చింత చెట్లు ఉండేవి గనుక చింతలకోన అని పేరు.

ఈ సంజీవపల్లెయొక్క కైఫీయతు: పూర్వం సదాశివరాయలు రాజ్యము సేయుచుండగా పెమ్మసానితిమ్మానాయడు గండికోట అధి కారము చేసేసమయమున పొట్టి ఓబనబోయని కుమారుడు యెఱ్ఱ బోయడు అనే కర్ణగొల్లవాడు — దుర్గములోను (కర్ణగొల్లలు) గురికాండ్రు ముద్రవారలయి యుండగా — దుర్గానికి దక్షిణము చౌకీయుండగా అక్కడ కొంత సమమయిన భూమి యుండినంతట అది కిర్దుచేసికొని యుండగాను, సదరు ప్రదేశమునకు నారబోయనపల్లె అని ఉండగా అది వారికే అనుభవము ఉండెను. ఈ సదాశివరాయల దినములలోనే యీ కర్ణగొల్లలు పెండ్లికి నగరికి వర్తన యిస్తూయుండగాను, పేదలు పెండ్లివర్తన ౧౦౧ మాడలు యివ్వడమునకు లేనివారు పెండ్లి లేకుండా వృద్ధులై యుండేవారు; గనుక రాయలువారు సదరు పెండ్లి వర్తనలు ౧౦౧ మాడలు తోసివేసి, పదహారు మాడలుగా నిర్ణయంచేసి, గండికోట సీమా మూలంలో యీనారబోయనికి పెండ్లికి రూకాను బియ్యం ముంతెడు, జమళ్ల నూరుపోకలు, నూరుఆకులుగా దిబ్యాలకు (?) యీనారబోయలకు నిర్ణ యం దిబ్యానకు రుకా, గంగమ్మను కొలిచేటందుకు మూడుదినములుకొలిస్తే కూడా పచ్చడము, అయిదుదినములు కొలిస్తే వరహాని పాగాపచ్చడము, ఏడుదినములు కొలిస్తే పాగాపచ్చడము బిరా; నేరపారాలు పరామరి శించుక మీా పుత్రపౌత్ర పారంపర్యంతం ఆచంద్రార్క స్థాయిగాను అనుభ వించుకొని సుఖాన బ్రతికేది, అని శాలివాహనశకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సం॥ కార్తిక శు ౫ లు శుక్రవారంనాడు [1]రాయల వారున్ను, అళిరామరాయలవారున్ను తామ్రశాసనము వ్రాసియిచ్చి

1. Friday, 29th October, A.D. 1546.

నారు. అందులో యీ పెండ్లి పూర్వోత్తరం మాత్రము వ్రాసియున్నది ఆ తామ్రశాసనం నకలు, కాగితము వారివద్ద నుండే నకలు, సన్నదు వహీలో వ్రాసినాను.

తరువాత మీరజుమలా నవాబునాడు పైన వ్రాసిన నారబోయని వంశీకుడు సంజీవనాయకుడు అనేవాడు దుర్గంలో నాయకత చేస్తూయుండగా వీరి మందికిన్ని పీడికిన్ని నడిచే ముడియం, పాలూరుగ్రామములు ౧౦౦ మంది జీతాలకున్ను, వీరి తాంబూలానకున్ను సాలెవారి ఉప్పల పాడు నడుస్తూయుండెను. ఆ చౌకీవద్ద తనపేరుతో సంజీవపల్లె అనికట్టించి అమరంగా తదారభ్యం నడిచినది. మయాణా అబదుల్ మియానాడు అయిదు వరహాలు యిచ్చేలాగున నిర్ణయం చేసిరి. పిమ్మట మయాణా సైదుమియా నాడు ౨౫ వరహాలు జీతం చెల్లు కట్టుతూయుండిరి. తరువాత బహాదరు కమాంమీాసులోను ౩౦ వరహాలు జీతంలో చెల్లు కట్టుతూయుండిరి. మొగలాయిలోను రెండు యేండ్లు ౩౦ వరహాలకు నడచినది. పిమ్మట ఆ గ్రామాన పండిన ధాన్యంలో అర్థ యిస్తోయుండి నూరుమందితో యథాప్రకారంగానే కోటలో కొలుస్తూయుండిరి. పల్లె ఖిలమైనందున వస్త్రం యిచ్చి పల్లె బస్తీ చేయమని యిరవై వరహాలకు నిర్ణయముచేసి, అక్కడ పదిమంది కొలువు కొలిచేది, వారికి జీతము సరకారు యిచ్చేది, వారు చౌకివరిదీ కోటకువచ్చి చెప్పేది. పిమ్మట అమీర్ సాహేబున్ను యిరువై వరహాలకే నడిపించి, తదనంతరం చందూలాదినములలో యిరువైఅయిదు వరహాలు అయినది. తరువాత కుంపిణీవారి ప్రభుత్వం గ్రామం సరకారులో దాఖలుచేసి వారికి కొంత భూమి మాన్యం యిచ్చినారు.

౧ ఈ పల్లెకు పడమర ఒకపరువు దూరమున గురిగింజకోనకు ఉత్తరము కొట్టాలపల్లె అనే మజరాయొక్క కైఫీయతు: గ్రామరెడ్డి కరణాలు కోటనాయకుల వంశీకుడు అయిన దురవేసి సుబ్బాదాసరి అనే వానికి వ్రాసియిచ్చిన దానపత్రం నకలు సారాంశము.

శాలివాహనశకవరుషంబులు ౧౬౯౩ అగునేటి ఖర సం॥ మాఘ శు ౫ లు, మంగపట్ణంవారి అవాంత్రం నిమిత్తం, హాజరతు సయ్యదు మియాసాహేబులవారు మమ్ము వారిని, ఉభయత్రులా పిలిపించి, గురిగింజ కోన తలాపెన(?)చేలో పల్లె కట్టమని సెలవు యిస్తిమి; అదే ప్రకారం సుబ్బాదాసరి పల్లెకట్టి బురుజుగట్టి రెడ్లకరణాలగూర్చి పండ్రెండు ఆయ గాండ్లను గూర్చి పల్లేర్లు ఊడ్చి ఉరంబోసినందున పోతులగొట్టి సన్న యా(వే)టలుగొట్టి పొలంవెళుపున బలి చల్లించి ఆయగాండ్లకు బట్టలు కప్పి మాన్యము కావలెనని అడిగితిమి; సమ్మతించి బురుజుకు దక్షిణాన మెత్రచెలికె ప్రాకుయేండ్లబీడు ౧౮ నలుదూము చేను కరారు; దానికి మేర; పడమట గురిగింజకోన దోవ, తూర్పు మంగపట్ణం దోవ మేర; దర వేసి సుబ్బాదాసరికి నిశ్చయము చేసిన కొట్టాలపల్లె నీవు పుత్రపౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. తిరుపతి వేంక టేశ్వరులు వేటసన్నాహమువచ్చి గురిగింజకోనలో లక్ష్మిసమేతముగా భూమిలోనుంచి ఉద్భవించి దరవేసి సుబ్బాదాసునికి ప్రసన్నమై అనేక పూజలు కొనగలవాడై అనేక వరములు కొనగలవాడై యుండెను. మేము స్వామిదర్శనమునకు వచ్చి సేవింపుచేసి కోనస్థళం కోనలో నుండే కయ్యలు, కోనకు పడమట అణుకువ చెలికె ౧।౦ కుంచెడు స్వామికి మేము సమ్మతించి, ధీపారాధనకు పుష్పాలకు పారంపర్యంతం ఆచంద్రా ర్కస్థాయిగాను స్వామికి సమర్పిస్తిమి; గనుక సుఖాన అనుభవించేది. ఈ పల్లెకు కొట్టాలపల్లె అని నామము కలుగడానికి కారణము యేమంటే, యీ సుబ్బాదాసరి కొట్టాలు వేసుకొని ఉండినందున కొట్టాలపల్లె అని పేరు కలిగినది. ఈ పల్లెవద్ద కొంత సమమైన భూమి ఉండినందున చేను సాగు అవుతున్నది. ఈ సుబ్బాదాసరి అనేవాడు లోగడ కోటలో నాయ కుడై యుండి పిమ్మట విరక్తిచేత గురిగింజకోనలో లక్ష్మిసమేతముగా ఉద్భవించిన శ్రీ వేంకటేశ్వరులను పూజచేసుకొని ఆ కోనలోనున్ను, కొట్టాలపల్లెలోనున్ను సాగుచేసుకొని పెండ్లాము బిడ్డలతోగూడ కొట్టాల పల్లెలో కాపురం ఉన్నాడు. ఇతనికి యెనభై యేండ్లు కలవు. దుర్గం యొక్క మహిమ పూర్వంనుంచి తెలిసినవాడున్ను శరీరంలో కాయపుష్టి

కలిగినవాడున్ను అయినందున నిత్యం ఆరు ఆమడ అయినాను నడచి పోతూవుండినాడు. ఇప్పుడు గండికోటలోనున్న జంబులమడుగు తాలూకా లోనున్న యితనికి తెలిసినంత కైఫీయతు రెండోవానికి తెలియదు. మేము కైఫీయతు వ్రాయునప్పుడు యితడు చాలా మహిమలు తెలియ చేసినాడు.

౧ పైన వ్రాసిన చింతకోనకుతూర్పు అరపరువున ఊటకోన. ౧ దీనికి తూర్పుపరువు దూరమున నేరేళ్ల వృక్షములుండేది నేరేళ్లకోన. ౧ ఇందు ఉత్తరము దొనకోన. బొమ్మయపల్లెసాగు. ఇందుకు ఉత్తరం అనాదీయం బొమ్మయపల్లె అనే గ్రామమున్నది. అక్కడ చెర్వులున్ను కలవు. గనుక వరిసహా ఫలిస్తూయున్నది. ఈ గ్రామం పాడు అవుతూ వస్తే రెండు మూడు స్థళాల తిరుగకట్టినారు.

౧ దొనకోనకు పడమట దేవరకోన గండికోటలో నుండే ఫకీరుకు యినాముయిచ్చినారు గనుక నడుస్తున్నది.

౧ ఇందుకు దక్షిణము తమటముకోనకు నీళ్లువచ్చేది. ఈ కోనకు దక్షిణం మర్రికోన తలావుననుంచి కొండజవుకువంకవచ్చి తమటం కోనమీాదుగా వెళ్లి యీా స్థళాన ఉండే బావినిండి మిగిలిన నీళ్లు దిగువ తమటంకోనలో నుండే బావులు నిండి ఆ చెరువువంక కత్తవకట్టమీాదికి వెళ్లి వంక దిగువ పట్నం చెరువులోకి పోతున్నవి.

ఈ కోనలో కొండజవుకు వల్లను నీళ్లు ప్రవహించేది. అక్కడక్కడ బావులలో నీళ్లు నిలిచేదిన్ని వర్షాకాలంలో విస్తారంగా ప్రవహించేది. వేసంగికాలంలో అల్పాస్వల్పం ఊటవస్తే బావులలో నీళ్లు ఉండేది. కొంత సమమైన భూమివంకవద్దయుండే వాటిలోనున్న కొంత రాళ్లతో అరుగులు కట్టి దానిపైన పుట్టమన్ను మెరువు దున్నపోతుల మీాద మోసుకపోయిన్ని పశువులు నడవడానకు వల్లపడకుండా ఉండే గొప్పగట్లు మొదలయినవి దాటవలసివస్తే సదరహి మెరువు మూటలను తలమీాద మోసుకపోయి కొంతదూరపజు(?)లు నడవయుండే స్థళాన తల

మీాద మోసుకపోయి తోటలు చేస్తూఉన్నారు. వర్షాలు విస్తారమై వంక వల్ల భూమిన్ని అరుగులున్ను తెగి కొట్టుకొని పోతే మరల బహు ప్రయాసంమీాద మన్ను తెచ్చివేసి భూమికి సత్తువకలిగించి తోటలుచేస్తు న్నారు. కోనలో అయ్యేది వివరం.

| | | |
|---|---|---|
| ౧ పసుపు | ౧ బెండకాయలు | ౧ వంకాయలు |
| ౧ అరటితోటలు | ౧ పొట్లకాయలు | ౧ గుమ్మడికాయలు |
| ౧ నిమ్మ | ౧ బీరకాయలు | ౧ సొరకాయలు |
| ౧ కిత్తలి | ౧ చిక్కుడుకాయలు | ౧ భంగిచెట్లు |
| ౧ సీతాపండ్లు | ౧ చామకూర | ౧ పెండలం |
| ౧ పనసచెట్లు స్వల్పం | ౧ రాజగిరికూర | ౧ దోసకాయలు |
| ౧ కాకరకాయలు | ౧ పచ్చిమిరపకాయలు | ౧ ముల్లంగి |

వగైరా, పువ్వులు ఇవి అవుతున్నది.

ఇదిగాక ఉండే కోనలవివరం. ౧ నాగదరికోనకు తూర్పు సామీాప్యం బుర్రచెలెమె (చెలమ ?); ౧ దీనికి తూర్పున మేకకోన అను రెండు; ౧ దీనికి తూర్పు సంకచెలిమె అనేది అలావర్దీఖా అనేవానికి మాన్యం నడుస్తున్నది; ౧ ఇందుకు తూర్పు మంగలవానికోన; ౧ ఇందుకు తూర్పుమామిడికోన; ౧ ఇందుకు ఉత్తరం భైరవునికోనతోట, మూాల మానితోట, గుదినవాడితోట. ఈ నాలుగుతోటలు[1] బావులునిండి వంక యీాతోటలకు ఉత్తరము ఉప్పులకోనకు వెళ్లి ఉత్తరం హజారికోన ఆఖేరుతోటలు పొలం దగ్గర ఉప్పరవాని రాఘవేంద్రాచార్యుల మాన్యం మీాదుగా వెళ్లి పెద్దకోన గుండాలనీళ్లు ఫరాబాగుతోట కారంజీలోనుంచి పెన్నలోను కలుస్తూయున్నది.

ఈ కోనలకును పైనవ్రాసిన ప్రకారమే పనులను చేయవలయును. పైనవ్రాసిన ఫలములే అవుతున్నవి; అయితే కాడారంభము కావడంలేదు. సంజీవపల్లె, కొట్టాలపల్లె, బొమ్మయపల్లె యీా పల్లెలలో మాత్రము కాడా రంభం అవుతున్నది. బొమ్మయపల్లెలో నీరారంభమున్ను అవుతున్నది. ఈ పల్లె కొండదిగువగానున్నది. కడమపల్లెలు కొండ పైనయున్నవి.

1. Only three gardens are mentioned.

ఈ గండికోటకు చెల్లే మజరాలు.

౧ కొట్టాలపల్లె, ౧ అలియాబాదు. ఇదిగాక అలాయిదా మాజే అయిన ౧ సంజీవపల్లె, ౨ ఇందుకుతూర్పు రెండు పల్లెలుండి పాడు అయినవి. ౧ గోపాలపురం, ౧ మంగలవానిపల్లె, అంతు ౨; ౧ న్యాలమూతల, (అంతు పల్లెలు) ౮.

గండికోటలో లోగడనున్న మాధవస్వామి దేవళమున్ను రఘునాయకుల దేవళమున్ను దేశం తురకాణ్యం అయిన దారభ్యం పూజ లేకుండా ఖిలమైయున్నవి. కుంఫిణి ప్రభుత్వంలో అక్కడక్కడ దేవాలయములు, జీర్ణోద్ధారణము చేయించి యీ స్థళమున్ను జీర్ణోద్ధారణము చేయిస్తే కీర్తికలదు.

ఈ దుర్గానకువుండే కనమలవివరం: ౭ ఎద్దులునడచే కనమలు, ౧ దుర్గానకు పడమట దక్షిణం అలియాంబాదునుంచి బావవారితావు గుట్ట పడమట కొబ్బేపట్టి వగైరా పశ్చిమ దేశాన్నుంచి వచ్చే మార్గం; ౧ కోటకు దక్షిణం బోయదిన్నెకనుమ; ౧ కోటకు దక్షిణం కుడితట్టు నేరేళ్ల కనుమ; ౧ కోటకు తూర్పున బొమ్మనపల్లె మార్గం కత్తితరిదోవ; ౧ దుర్గానకు తూర్పుదేశమునుంచి దిగువపట్నం మీదుగావచ్చే బండ్ల మార్గం; ౧ తామలగుండానకు పొయ్యే మార్గం, పెద్దకోన మీదుగా పొయ్యేది; ౧ దుర్గము పడమట దర్వాజా కనుమ పశ్చిమానకు పొయ్యేది.

మనుష్యులు కాలినడకగా నడిచే కనుమలు : ౧ పేటకు ఉత్తరం బేరివారి కనుమ; పెన్నకు పొయ్యేమార్గం నదిలో తలిపెరగుండు మీదుగా ప్రవహించే నదిదాటి అగస్త్యేశ్వరుని కోనకుపోయి అక్కడనుంచి న్యాలనూతలకు పొయ్యేమార్గం; ౧ దుర్గానకు తూర్పు అనంతపద్మనాభుని దేవళముమీదుగా కాదరాబాదుకు పొయ్యేమార్గం; ౧ రాచెరువుకోన దోవ, కోటకు దక్షిణం పశ్చిమానకు పొయ్యేమార్గం; ౧ దుర్గానకు పశ్చిమం. పిల్లకనుమ. ఈ కనుమ బహు యెక్కుడు గనుక పిల్లకనుమ అనే పేరు. ౧ కోటకు దక్షిణం ఆవుకోన నారువదోవ; ౧ కోటకు దక్షిణం

గురిగింజకోన నుండి దక్షిణం కొత్రపాడు మంగపట్నానకు పొయ్యేమార్గం; ౧ కోటకు దక్షిణం సెట్టివారి పల్లెకు పొయ్యేమార్గం; ౧ దీనికి తూర్పు ఎద్దుకట్టవులదోవ; ౧ దీనికి తూర్పు సెట్టివారి పల్లెనుంచి సంజీవపల్లెకు వచ్చేమార్గం; ౧ బొమ్మపల్లెనుంచి పడమట దుర్గానికివచ్చే దొవికనుమ.

ఈ దుర్గం కొండ అరణ్యంలోనున్న పెన్నకు ఉత్తరం ఉండే కొండలలోనున్న విశేషవృక్షములు లేవు. సామాన్యముగా ఉండేవాటి వివరము.

| | | | |
|---|---|---|---|
| ౧ నిరుద్ది | ౧ పొలికి | ౧ చంద్ర | ౧ నేరేడు |
| ౧ బిక్కిలి | ౧ గొటికి | ౧ మద్ది | ౧ వేప |
| ౧ యలిమి | ౧ కొండజిల్లేడు | ౧ కలిమి | ౧ రేల |
| ౧ పచ్చార | ౧ చిల్లు | ౧ చింత(స్వల్పం) | ౧ జువ్వి |
| ౧ చిగర | ౧ తూకిలి | ౧ దిరిసెన | ౧ మామిడి |
| ౧ బలుసు | ౧ పలవరేణి | ౧ బేట | |

ఇవిగాక యింకను కొన్ని సామాన్య వృక్షములున్ను కలవు. ఈ వృముక్షలు కూచాలకు పనికివచ్చేదిగాని వేరేలేదు. ఈ దుర్గములోనున్న కొండకున్ను ఎెర్రమల అనేపేరు. పినాకిని గండికి ఉత్తరమునన్నుండే కొండకున్ను యెర్రమల అనేపేరు. మధ్యగండి అయినందున రెండు కొండలుగా అగుపడుతున్నవి. గండికోట ఉన్న కొండ తూర్పుపడమర రెండు ఆమడ, పెన్నకు ఉత్తరంగా నుండునది మూడు ఆమడలున్నది. అందుమీాద ధొడియం, మలమీాదికంభాలదిన్నె, న్యాలనూతల, మురపంది యీా గ్రామములయందు విస్తారంగా సీరారంభం కొండల జౌకువల్ల అవుతున్నది. బూడపల్లెలో కాడారంభంగాని సీరారంభం లేదు.

గండికోటకు పడమర కిల్లేపట్టి ఓబళాపురం ఆది చేసికొని లావ నూరుదాకా మూడు పరువులు ఒక కొండయున్నది. అందు భానుకొండ అనిన్ని భానుకోట అనిన్ని పేరు. గండికోటకు ఉత్తరం యీాశాన్యం విదిక్కున నోసం ఆదిచేసుకొని కలవటాలవరకు తూర్పుపడమర అయిదు

పరువులున్ను ఉత్తర దక్షిణం నాలుగు పరువులున్ను కొండలున్నవి. ఈ రెండు కొండలయందున్ను విశేషవృక్షములు లేవు; సామాన్యమైన అల్పాస్వల్పం కలవు.

గండికోట ఎర్రమలలో చిరతలు, పందులు, పెద్దపులులు (స్వల్పం), తోడేళ్లు, నక్కలు, యేదులు, కపులు, లావకులు, కెరజాలు, గొండంగులు కలవు. ఈ దుర్గం కేవలం తృణకాష్టజలసమృద్ధిగా కేవలం సౌకర్యం కలిగిన స్థళం.

జంబులమడుగు తాలూకాలో నుండే గ్రామముల వివరం. సంమత్తు జంబులమడుగు, ఖాలీసాగ్రామములు మజరా.

| నెం. | మజరాల పేరు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | పెరసి |
|---|---|---|---|---|---|---|
| ౧ | కసుబాజంబులమడుగు | | | | | |
| | ౧ బస్తీ | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ రామిరెడ్డిపల్లె మజరా | ౦ | ౦ | ౦ | ౦ | ౦ |
| ౨ | మవుజేకన్నలూరు బస్తీ | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩ | మవుజేగొరిగెనూరు బస్తీ | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪ | మవుజేదానవులపాడు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |

ఇవియే యిందుగల మజరాల పేర్లున్ను అడంగలు వివరములు.

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | పెరసి |
|---|---|---|---|---|---|---|
| ౫ | మ॥ దేవగుడి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౬ | మ॥ సుగుమంచిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౭ | మ॥ బొల్లవరం | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్న | ... | ... | ... | ... | ... |
| | మజరాచౌటిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౮ | మ॥ మాలెపాడు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౯ | మ॥ సిరిగిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| ౧౦ | మ॥ పెదదండ్లూరు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరా | ... | ... | ... | ... | ... |
| | సన్నువరాళ్ళపల్లె | ... | ... | ... | ... | ... |
| ౧౧ | గుడంచెరువు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరాసంజీవ పల్లె | ... | ... | ... | ... | ... |
| | ఆయకట్టుకుదాఖలులేదు | ... | ... | ... | ... | ... |
| ౧౨ | పొన్నతోట | ౧ | ౦ | ౧ | ౧ | ౩ |
| | ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | కత్తిపల్లె | ... | ... | ... | ... | ... |
| | తిమ్మాపురం | ... | ... | ... | ... | ... |
| | బేచిరాకు | ... | ... | ... | ... | ... |
| ౧౩ | బొమ్మపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౪ | మ॥ గండికోట | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరాగొట్టాలపల్లె | ... | .. | ... | ... | ... |
| | పురపు గురిగింజకోన | ... | ... | ... | ... | ... |
| ౧౫ | మ॥ సంజీవిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | పురపు నారబోయనిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౧౬ | మ॥ దిగువపట్నం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౭ | మ॥ కాదరాబాదు | ౧ | ౦ | ౩ | ౦ | ౪ |
| | ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| | ౩ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ పాతపేట | ... | ... | ... | ... | ... |
| | ౧ కొత్తపేట | ... | ... | ... | ... | ... |
| | ౧ కబాడపాళెము | ... | ... | ... | ... | ... |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| ౧౮ | మ॥ మలమీదికంభాలదిన్నె | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ బొగ్గులదాసరిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ బోగాలకట్ట | ... | ... | ... | ... | ... |
| ౧౯ | ధోడియం | ౧ | ౧ | ౪ | ౦ | ౬ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౪ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ బస్తీ | ... | ... | ... | ... | ... |
| | ౧ మదిరెడ్డిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ రామచంద్రాపురము | ... | ... | ... | ... | ... |
| | ౧ నిరాహాణిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ బేచిరాకు సిద్దారెడ్డి | ... | ... | ... | ... | ... |
| ౨౦ | మ॥ మురపంది | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ బూమసానిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ కృష్ణాపురం | ... | ... | ... | ... | ... |
| ౨౧ | మ॥ పొన్నంపల్లె | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౧ మ॥ గంగులనారాయణపల్లె | ... | ... | ... | ... | ... |
| ౨౨ | మవుజేతొర్రెవేముల | ౧ | ౦ | ౧ | ౧ | ౩ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| | ౧ బేచిరాకు నారావర్ఘుల పల్లె అగ్రహారం | ... | ... | ... | ... | ... |
| | ౧ కట్టక్రిందిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౨౩ | మవుజే వేపరాల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౪ | మ॥ దొమ్మరనంద్యాల | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్యిన | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరా కరమలవానిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౨౫ | మ॥ మోరగుడి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౬ | మ॥ సాలెవారి ఉప్పలపాడు | ౧ | ౦ | ౦ | ౧ | ౨ |
| | ౧ అయ్యిన | ... | ... | ... | ... | ... |
| | ౧ బేచిరాకు వరదరాజుపల్లె ఆయకట్టుకు దాఖలులేదు | ... | ... | ... | ... | ... |
| ౨౭ | మ॥ బోడిపల్లె | ౧ | ... | ... | ౧ | ౨ |
| | ౧ అయ్యిన | ... | ... | ... | ... | ... |
| | ౧ మ॥ గంగనపల్లె బేచిరాకు ఆయకట్టుకు దాఖలులేదు | ... | ... | ... | ... | ... |
| ౨౮ | మ॥ పెద్దకొమ్మెర్ల | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్యిన | ... | ... | ... | ... | ... |
| | ౧ మ॥హనుమంతరాయని పేట ఆయకట్టుకుదాఖలులేదు | ... | ... | ... | ... | ... |
| ౨౯ | మ॥ చినకొమ్మెర్ల | ౧ | ౦ | ౨ | ౧ | ౪ |
| | ౧ అయ్యిన మజరాలు ౨ | ... | ... | ... | ... | ... |
| | ౧ బేచిరాకు మజరా ఆయకట్టుకు దాఖలులేదు | ... | ... | ... | ... | ... |
| ౩౦ | మ॥ దుగ్గనపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | ౧ అయ్యిన | ... | ... | ... | ... | ... |

| గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | శెరసి |
|---|---|---|---|---|---|
| ౨ మజరాలు (బుడాపురములోనికి) ౧ బుడ్డారెడ్డిపల్లె ౧ వెంకటాపురం | ... | ... | ... | ... | ... |
| ౩౧ మవుజే తలమంచిపట్నము | ౧ | ౦ | ౧ | ౨ | ౪ |
| ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| ౧ మజరా నవాబుపేట | ... | ... | ... | ... | ... |
| ౨ బేచిరాకు | ... | ... | ... | ... | ... |
| ౧ తిమ్మారెడ్డిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౧ దేశంవారిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౩౨ మవుజే మాధవాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౩ మవుజే గొల్లల ఉప్పలపాడు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౪ మ॥ వద్దిరాలు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౫ మ॥ ధన్నవాడ | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౬ మ॥ తోళ్లమడుగు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| ౧ మజరా ముమ్మయపల్లె | ... | ... | ... | ... | ... |
| ౩౭ మ॥ కోరువానిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౮ మ॥ అయ్యవారికలవటాల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩౯ మ॥ నందిపాడు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౦ మ॥ కోటపాడు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| ౧ అయ్ను | ... | ... | ... | ... | ... |
| ౧ మజరా కేశినేనిపల్లె బస్తీ | ... | ... | ... | ... | ... |
| ౪౧ మ॥ చినవెణుతుర్ల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| ౪౨ | మ॥ బెస్తవేముల | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరా గాజులపల్లె బస్తి | ... | ... | ... | ... | ... |
| ౪౩ | మ॥ కల్లుట్ల | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | పైమాయిషీ అయినతర్వాత | | | | | |
| | ౨ మజరాలు | | | | | |
| | (రెండు సంవత్సరాలకు) | | | | | |
| | ౧ నరసాపురం | ... | .. | ... | ... | ... |
| | ౧ వెంకటాపురం | ... | ... | ... | ... | ... |
| ౪౪ | మ॥ భూతమాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౫ | మ॥ భీమగుండం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౬ | మ॥ కొండసుంకెసల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౭ | మ॥ దిగువ కలవటాల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౮ | మ॥ పాపాయపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪౯ | మ॥ నాగిరెడ్డిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | | ౪౯ | ౦ | ౨౯ | ౮ | ౮౭ |

ఏకోనసప్తతు జంబులమడుగు తాలూకాగ్రామములు, మజరాలు, బేచిరాకు గ్రామములు సహా.

జంబులమడుగు తాలూకాలో ఉండే శ్రోత్రియ గ్రామముల వివరము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ౧ | మాధవాపురము | ౧ | ౦ | ౧ | ౦ | ౧ |
| ౨ | మ॥ అంబవరం | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్ని | ... | ... | ... | ... | ... |
| | ౧ మ॥ కొండాపురం | ... | ... | ... | ... | ... |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| ౩ | మ॥ కొత్తగుంటపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪ | మ॥ వేపగుంటపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౫ | మ॥ న్యాయనూతల | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౬ | లింగాపురం లోగడ ఆయకట్టుకు | ౦ | ౧ | ౦ | ౦ | ౧ |
| | కాదరాబాదు మజరాదాఖలు | ... | ... | ... | ... | ... |
| | తరం జమాబంది వేళ | | | | | |
| | అలాహిదా మవుజే దాఖలు | ... | ... | ... | ... | ... |
| ౭ | మ॥ మైలవరము | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౮ | మ॥ కోన అనంతాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౯ | మవుజె గొల్లపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౦ | చెన్నపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౧ | మవుజే వెంకటాపురం లోగడ ఆయకట్టుకు బెస్తవేముల దాఖలు | ౦ | ౧ | ౧ | ౦ | ౧ |
| ౧౨ | మవుజే అయ్యవారికంభాలదిన్నె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | వెరసి. | ౧౦ | ౨ | ౧ | ౦ | ౧౩ |

జాగీరుగ్రామములు, తేరి జంబులమడుగు తాలూకాలోనివి

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ౧ | మ॥ తూగుట్లపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨ | మ॥ దూపల్లి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | వెరసి. | ౨ | ౦ | ౦ | ౦ | ౨ |

జుమలా తేరి జంబులమడుగు సమ్మతు బస్తీ:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ౪౯ | ఖాలీసా గ్రామములు | ౪౯ | ౦ | ౨౪ | ౧౦ | ౮౩ |
| ౧౨ | శ్రోత్రియం | ౧౦ | ౨ | ౧ | ౦ | ౧౩ |
| ౨ | జాగీరు | ౨ | ౦ | ౦ | ౦ | ౩ |
| | వెరసి | ౬౧ | ౨ | ౨౫ | ౧౦ | ౯౯ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| | సమ్మతు కొజ్జేపట్టె | | | | | |
| ౧ | కసుబా యేటూరు | ... | ... | ... | ... | ... |
| | ౧ అయిన కసుబా | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | ౪ మజరాలు | ౦ | ౦ | ౪ | ౦ | ౪ |
| | ౧ వెంకటాపురం | ... | ... | ... | ... | ... |
| | ౧ రామిరెడ్డిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ న్యాదర పేట | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరా అగ్రహారం కోనలోపల్లి ఆయకట్టు దాఖలు | ... | ... | ... | ... | ... |
| | వెరసి. | ౧ | ౦ | ౪ | ౦ | ౫ |
| ౨ | మ॥ అనంతపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩ | మ॥ పెండ్లిజువ్వి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪ | మ॥ లావనూరు | ౧ | ౦ | ౧ | ౧ | ౩ |
| | ౧ అయిన | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ న్యాసంపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ నాగేళ్లపల్లె బేచిరాకు | ... | ... | ... | ... | ... |
| ౫ | మ॥ లింగనేనిపల్లె | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయిన్న | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ పాలూరు | ... | ... | ... | ... | ... |
| | ౧ అగ్రహారం ఘట్టుపేట ఆయకట్టు దాఖలా | ... | ... | ... | ... | ... |
| ౬ | మ॥ వెనకెకాలువ | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | ఖెరసీ |
|---|---|---|---|---|---|---|
| ౭ | మ॥ పొట్టిపాడు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్నె | ... | ... | ... | ... | ... |
| | ౧ మజరా పెద్దిరెడ్డి తిమ్మయపల్లె | ... | ... | ... | ... | ... |
| ౮ | మ॥ యనమలచింతల | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్నె | ... | ... | ... | ... | ... |
| | ౧ మ॥ చవ్వానాగయపల్లెబస్తి | ... | ... | ... | ... | ... |
| ౯ | బెడదూరు | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయ్నె | ... | ... | ... | ... | ... |
| | ౨ మజరాలు (బస్తి) | ... | ... | ... | ... | ... |
| | ౧ కొత్తపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ వెంకటరెడ్డిపల్లె | ... | ... | ... | ... | ... |
| ౧౦ | మ॥ కానావారిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౧ | మ॥ బురుజుపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౨ | మ॥ రేగడిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౩ | మ॥ కమ్మవారి బ్రాహ్మణపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౪ | మ॥ జోగాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౫ | మ॥ సుగుమంచిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౬ | మవుజే నాగమల్లదిన్నె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౭ | మవుజే కోడూరు | ౧ | ౦ | ౩ | ౦ | ౪ |
| | ౧ అయ్నె | ... | ... | ... | ... | ... |
| | ౩ మజరాలు | ... | ... | ... | ... | ... |
| | ౧ సిగరపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ నున్నవానిపల్లె | ... | ... | ... | ... | ... |
| | ౧ దలూతపల్లె | ... | ... | ... | ... | ... |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| ౧౮ | మవుజే యెర్రగుడి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౯ | మవుజే చామలూరు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౦ | మవుజే తాళ్లప్రొద్దుటూరు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౧ | మవుజే బుక్కపట్ణం | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయ్ని | .... | .... | .... | ... | .... |
| | ౨ మజరాలు బస్తి | .... | .... | .... | .... | .... |
| | ౧ దంతాపురం | .... | .... | .... | .... | .... |
| | ౧ చినవెంకటపల్లె | .... | .... | .... | .... | .... |
| ౨౨ | మవుజే గంగాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౩ | మవుజే బొమ్మెపల్లె | ౧ | ౦ | ౦ | ౧ | ౨ |
| | ౧ అయ్ని | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా బేచిరాకు తిమ్మయపల్లె, ఆయకట్టుకు దాఖలులేదు | .... | .... | .... | .... | .... |
| ౨౪ | మవుజే చవుటిపల్లె | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్ని | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా లేపల్లె | .... | .... | .... | .... | .... |
| ౨౫ | మవుజే గండ్లూరు | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౧ అయ్ని | .... | .... | .... | .... | .... |
| | ౨ మజరాలు | .... | .... | .... | .... | .... |
| | ౧ జంగాలపల్లె | .... | .... | .... | .... | .... |
| | ౧ తాళ్లపల్లె | .... | .... | .... | .... | .... |
| ౨౬ | మవుజే దిగువ బ్రాహ్మణపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨౭ | మవుజే రాఘవాపురం ఏకోను కెళ్లేపట్టి ఖాలీసా | ౧ | ౦ | ౧ | ౦ | ౧ |
| | గ్రామములు వెరసి | ౨౭ | ౦ | ౧౯ | ౨ | ౪౮ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| | **శ్రోత్రియం కిల్లేపట్టి మౌజే యేటూరు** | | | | | |
| ౧ | మ॥ తిమ్మాపురం, లోగడ పెండ్లి జువ్వి గ్రామములో మజరాగా ఉండెను | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౨ | మవుజే డొంకపల్లె లోగడ పొట్టిపాడులో మజరాగా ఉండెను | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩ | మవుజే చెన్నమనేనిపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪ | మవుజే శివపురం లోగడ యనమలచింతల మజరా | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౫ | మవుజే సంకెపల్లి | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయ్ని | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా కృష్ణాపురం | .... | .... | .... | .... | .... |
| ౬ | మవుజే కొపోలు | ౧ | ౦ | ౦ | ౧ | ౨ |
| | ౧ అయ్ని | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా తిరుమలాపురం | .... | .... | .... | .... | .... |
| ౭ | మవుజే ఫకీరుపేట | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౮ | మవుజే నేకనాంపేట | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౯ | మవుజే ఓబళాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౦ | మవుజే ఓబనపేట | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౧ | మవుజే కొండాపురం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౨ | మవుజే మురగంపల్లి, లోగడ కోడూరు మజరా | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | ఏకోను కిల్లేపట్టి అయ్ని ఖాలీసా | ౧౩ | ౦ | ౨ | ౦ | ౧౫ |
| | శ్రోత్రియ గ్రామములు | ౨౭ | ౦ | ౧౯ | ౨ | ౪౮ |
| | వెరసి. | ౪౦ | ౦ | ౨౧ | ౨ | ౬౩ |

| నెం. | గ్రామముల పేర్లు | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | పెరసి |
|---|---|---|---|---|---|---|
| | **సమ్మతుపాలూరు** | | | | | |
| ౧ | ౧ కసుబే పాలూరు | ౧ | ౦ | ౨ | ౦ | ౩ |
| | ౨ మజరాలు | .... | .... | .... | .... | .... |
| | ౧ నాగరాజపల్లెబస్తి | .... | .... | .... | .... | .... |
| | ౧ వెంకటాపురం, బేచిరాకు | .... | .... | .... | .... | .... |
| ౨ | మవుజే పెద్దముడియం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౩ | మవుజే వెంగంపల్లి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౪ | మవుజే సుద్దపల్లి | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౫ | మవుజే జంగాలపల్లె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౬ | మవుజే ఉప్పాలూరు | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్ను | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా కొట్టాలపల్లె } పురుషు తోటయపల్లె } | .... | .... | .... | .... | .... |
| ౭ | మవుజే నెమళ్లదిన్నె | ౧ | ౦ | ౧ | ౦ | ౨ |
| | ౧ అయిన్ను | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా కొట్టాలపల్లె | .... | .... | .... | .... | .... |
| ౮ | మవుజే గరిశలూరు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౯ | మవుజే బలపనగూడూరు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౦ | మవుజే చిన్నముడియం | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౧ | మవుజే చిదిపిరాళ్లదిన్నె | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౨ | మవుజే బోడితిప్పనపాడు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| ౧౩ | మవుజే గుండ్లకుంట | ౧ | ౦ | ౦ | ౧ | ౨ |
| | ౧ అయిన్ను | .... | .... | .... | .... | .... |
| | ౧ మజరా బేచిరాకు | .... | .... | .... | .... | .... |

| నెం. | గ్రామముల వివరము | బస్తీ | బేచిరాకు | మజరా | బేచిరాకు | వెరసి |
|---|---|---|---|---|---|---|
| | డొంకలకుంటపల్లి, ఆయకట్టుకు దాఖలు లేదు. జుమలా సంమతు పాలూరులో ఖాలిసా గ్రామం శ్రోత్రియం గోపాలపురములో | ౧౩ | ౦ | ౪ | ౧ | ౧౮ |
| | ఆయకట్టు మజరా పాలూరు హాలు మవుజేదాఖలు అయినవి. | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | వెరసి. | ౧౩ | ౦ | ౪ | ౧ | ౧౮ |
| | ఏకోన సమ్మతు పాలూరు తేరీజు ఖాలీసా గ్రామము వగైరాలు | .... | .... | .... | .... | .... |
| | సమ్మతు జంబులమడుగు | ౪౯ | ౦ | ౨౯ | ౮ | ౮౬ |
| | సమ్మతు కిబ్లేపట్టి | ౨౭ | ౦ | ౨౯ | ౨ | ౫౮ |
| | సమ్మతు పాలూరు | ౧౩ | ౦ | ౪ | ౧ | ౧౮ |
| | వెరసి. | ౮౯ | ౦ | ౬౨ | ౧౧ | ౧౬౨ |
| | శ్రోత్రియం | | | | | |
| | సమ్మతు జంబులమడుగు | ౧౨ | ౦ | ౧ | ౦ | ౧౩ |
| | సమ్మతు కిబ్లేపట్టి | ౧౨ | ౧ | ౨ | ౦ | ౧౫ |
| | సమ్మతు పాలూరు | ౧ | ౦ | ౦ | ౦ | ౧ |
| | వెరసి. | ౨౫ | ౧ | ౩ | ౦ | ౨౯ |
| | జుమలా తేరీజు | | | | | |
| | ఖాలీసా గ్రామములు | ౮౯ | ౦ | ౬౨ | ౧౧ | ౧౬౨ |
| | శ్రోత్రియం | ౨౫ | ౧ | ౩ | ౦ | ౨౯ |
| | జాగీరు సమ్మతు జంబులమడుగు | ౨ | ౦ | ౦ | ౦ | ౨ |
| | | ౧౧౬ | ౧ | ౬౫ | ౧౧ | ౧౯౩ |
| | అయిన సాబకు మవుజేలు | ౧౦౯ | ౦ | ౧ | ౦ | ౧౧౦ |
| | పై మాయిషీ అయినప్పుడు షామిలాలు అయిన మజరాలు, శ్రోత్రియం, తరం, జమాబంది కాలములో అలాయిదా అయినది. | ౪ | ౦ | ౩ | ౦ | ౭ |

అయిన సాబకు మజరాలు ౬౦

సాజకుబాపత్తు ౫౮

హాలిరెండు సంవత్సరములకు మునుపు అయినది ౨

జంబులమడుగు సమ్మతులో ముట్లపల్లెలో బస్తి ౬౦

సర్వ అగ్రహారాలు ౩

ఇనామతిలో దాఖలు

జంబులమడుగు సమ్మతులో తొర్రివేములగ్రామములో నారావర్ధులపల్లె

బేచిరాకు ౧

కిల్లేపట్టి సమ్మతులోని ౨

౧ యేటూరులోని కానకానపల్లె
౧ వెనకె కాలువలోని ఘుట్టిపల్లె

ఇక్కడిదే హార్జూడాపట్టి వ్రాయడం అయినది ౩

ఈ గ్రామములు పైవ్రాసిన పట్టీలోనుండే వాటి కైఫీయతు వ్రాసి హాజూరికి రవాణాచేసినాను. అదిచూడగా కైఫీయతు తెలుసును.

గండికోట దుర్గానకు తూర్పుదక్షిణంగా నుండే గ్రామములు ములికినాడు అని, దుర్గానికి ఉత్తరంగానుండే గ్రామములు రేనాడు అని, దుర్గానికి పశ్చిమముగా పెన్నదరినుండె గ్రామములు పెన్నదాడి అని, చిత్రావతీనదీతీరమున నుండే గ్రామములకు చిరబడి అని పూర్వోత్తరంగా నామముకలిగి శిలాశాసనములలోనున్న అదేప్రకారం వ్రాస్తూవచ్చినారు. గండికోటదుర్గం తురకారణ్యం అయిన తరువాత దుర్గానికి పశ్చిమముగా నుండే గానికి తురకభాషతో పశ్చిమదిక్కుకు కిల్లే అని నామము గనుక ఆ గానికి కిల్లేదరవాజా అని వాడుకయున్నా, దుర్గానికి పశ్చిమముగా పినాకినీ చిత్రావతీ తీరముననుండే గ్రామములకు లోగడ నామము విడిచి

కిల్లేపట్టి అనగా పశ్చిమప్రాంత్యానుండే గ్రామములు అని నామము అయినందున కిల్లేపట్టి అని తురకారణ్యము అయిన దారభ్యాం ప్రకటన అయినది.

జంబులమడుగు తాలూకాలో మిద్దెయిండ్లు కట్టే నడత; అయితే కొన్నిపల్లెలలో అల్పాస్వల్పం కొట్టాలు మాత్రము కట్టియున్నవి.

జంబులమడుగు తాలూకా బాదా ౧౪ కలంపట్టీ ప్రకారము.

౧ కొండపైనుండేటటువంటి కోటలు

మొదటి కలం ౧ దుర్గాలు ౨

౧ గండికోటదుర్గం చీరబంది, గచ్చుగిరి దురస్తు.

౧ కిల్లేపట్టి కోడూరుగ్రామానకు దక్షిణం మూడుపరువుల దూరమున కొండపైన దబూడపల్లె అనే మజరాలో సంగబంది సికిస్తు.

౨ కిల్లాలు సికిస్తు సంగబంది

౧ ధోడియం

౧ మలమీదికంభాలదిన్నె

రెండోకలం దిగువనుండే కోటలు

౬ పెద్దకోటలు సంగబంది

| | |
|---|---|
| ౧ కసుబా జంబులమడుగు | ౧ వెనకెకాలువ |
| ౧ కొండసుంకెల | ౧ లావనూరు సికిస్తు |
| ౧ పెదదండ్లూరులోచెల్లే మజరా సున్నపరాళ్లపల్లె | ౧ పెద్దముడియం |

౨౬ చిన్నకోటలు ౪ బురుజులు ఉండేవి కొన్నిన్ని, సంగబంది కొన్నిన్ని, మట్టివి సహా.

| | | |
|---|---|---|
| ౧ తోళ్లమడుగు | ౧ వద్దిరాల | ౧ పెద్దకొమ్మర్ల |
| ౧ కొరవానిపల్లె | ౧ తలమంచిపట్నం సికిస్తు | ౧ చినవెణుతుర్ల |

౧ యేటూరు సికిస్తు :

| అంతు నాల్గు | | బురుజులు వుండేటివి ౭ ఏడు. |
|---|---|---|
| ౧ చామలూరు | | ౧ యనమలచింతల |
| ౧ బుక్కపట్నం సంగబంది మట్టి సహా | | ౧ బెడదూరు |
| ౧ అనంతపురం | | ౧ గండ్లూరు సికిస్తి మట్టిది |
| ౧ గొల్లపల్లె | | ౧ పొట్టిపాడు |
| | | ౧ సుగుమంచిపల్లె |
| | | ౧ కోడూరు మట్టిది |
| | | ౧ రేగడపల్లె |

అంతు నాల్గు బురుజులు వుండేటివి ౧౮. ఇవిగాక మట్టి ప్రహరీగా నుండేవి.

| | | |
|---|---|---|
| ౧ దిగువకలవటాల సికిస్తు | ౧ బెడుదూరి మజరా కొత్తపల్లె | ౧ అంబవరం |
| ౧ నందిపాడు | ౧ గంగాపురం | ౧ సంకెపల్లె |
| ౧ చౌటిపల్లె, రాయి మన్యూ సహా | ౧ ధర్మాపురం | మట్టివి. |

3౨ ఇవిగాక కొన్ని గ్రామములకు ఒక బురుజుమాత్రం ఉండేవి కలవు.

3 మూడోకలం. సంతకూడే గ్రామములు:

౧ కసుబా జంబులమడుగు, శుక్రవారం సంత

౧ కాదరాబాదు, భానువారం సంత

౧ యేటూరు, అంగారకవారం సంత

గండికోటదుర్గం, లోగడ గురువారం సంత సాగుతుండెను. ఇప్పుడు తాణాలేక కోట కేవలం పాడు అవుతూవచ్చినది; గనుక సంతసాగడం నిలచినది.

నాలుగోకలం దేవస్థానముల వివరం: ౩ తసదీకు నడిచేది తపిసీలు.

| | పడితరంయేర ౧ కి | | | రథోత్సవానికి | | | వెరసి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పు. | మై. | కా. | పు. | మై. | కా. | పు. | మై. | కా |
| ౧ కసుబా జంబులమడుగు శ్రీనారాపురం వెంకట రమణస్వామికి | ౫౬ | ౩౦ | ౦ | ౧౫౦ | ౦ | ౩ | ౨౦౬ | ౩౧ | ౩ |
| ౨ కసుబాలో పెన్నదరిన ఉండే భీమేశ్వరునికి | ౨౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | ౨౦ | ౦ | ౦ |
| ౩ కిల్లేపట్టిలో యేటూరి చెన్న కేశవస్వామికి | ౧౦ | ౦ | ౦ | ౧౩ | ౧౫ | ౦ | ౨౩ | ౧౫ | ౦ |
| వెరసి. | ౮౬ | ౩౦ | ౦ | ౧౬౩ | ౧౫ | ౩ | ౨౫౦ | ౦ | ౦ |

౪ తసదీకులేని దేవస్థానములు అల్పాస్వల్పం మాన్యం పూజార్లకున్న, గ్రామస్తులు దీపారాధన నడిపేవి.

౧ చినకొమ్మర్ల చెన్న కేశవస్వామి
౧ పెదకొమ్మర్ల చెన్న కేశవస్వామి
౧ చినవెలుతుర్ల చెన్న కేశవస్వామి

౨ కొండ సుంకేసులలో
౧ కంభంరాయుడు
౧ నరసింహస్వామి

కాదరాబాదు

౧ కొత్తపేట వెంకటరమణస్వామి

౧ నరసింహస్వామి

౧ ధోడియం
౧ సాలెవారి ఉప్పలపాడు
౧ దొమ్మరనంద్యాల
౧ భీమగుండం
ఈ నాలుగు గ్రామములలోను చెన్నకేశవస్వామి

౨ పెద్దముడియం

౧ రామస్వామి

౧ నరసింహులు

౧ పాలూరు
౧ గుండ్లకుంట
ఈ రెండు గ్రామాలలోను చెన్నకేశవులు

౧ యేటూరు భోగేశ్వరస్వామి

౧ కొండూరు చెన్నకేశవులు

౧ బెడుదూరి కొండపైన వెంకటరమణస్వామి

౧ యనమలచింతల
౧ పొట్టిపాడు
ఈ రెండు గ్రామాలలో చెన్నకేశవులు

వెనకెకాలువలోని అగ్రహారం గట్టుపేట గట్టుపైన పరసింహస్వామి.

౧ లావనూరు
౧ అనంతపురం
౧ గండ్లూరు
౧ ఓబనపేట
ఈ గ్రామములలో చెన్నకేశవులు.

౧ బుక్కపట్నం – నరసింహులు.

౧ తాళ్ల పొద్దుటూరు – చెన్నకేశవస్వామి.

౧ గండికోట దరవాజాలో – ఆంజనేయులు.

అంతు తనదికు లేనివి ౨౯. ఇవిగాక గండికోట దుర్గముపైన గొప్ప దేవస్థానం. ౧ మాధవరాయస్వామి, ౧ రఘునాథస్వామి. ఈ రెండు దేవాలయములు ఖిలమై మూర్తులు భిన్నమై పూజలు లేక యున్నవి.

అంతు దేవస్థానములు ౩౩.

౫ అయిదోకలం ప్రసిద్ధిఅయిన పర్వతములు.

౧ ఎర్రమల అనేది సిరిగిరిపల్లె ఆదిచేసుకొని కోరువానిపల్లెవరకు, తూర్పు పడమర మూడుఆమడ, ఉత్తరదక్షిణం రెండుపరువులు. ఈ కొండ పైననే గండికోట దుర్గం ఉన్నది.

౧ నోసం ఆదిచేసుకొని కలవటాల వరకు అయిదు పరువులు నిడివి, ఒక పరువు వెడల్పు.

౧ ఓబళాపురం ఆదిచేసుకొని లావనూరువరకు మూడుపరువులు వెడల్పున్ను నిడివి ఒక పరువుగా నున్నది. దీనికి పేరు భానుమల కొండ అనిన్ని భానుకోటమల అనిన్ని వాడుక. ఈ కొండలో నుండే ముఖ్యమైనవాటి పేర్లు పైన వ్రాసినాను. ఈ మలలోని వృక్షములు గొప్ప మహాల్లు వగైరా కట్టడానకు ఉపయోగమయినవి కావు. తగుమాత్రమై కూసా(చా)లకు పనికివస్తున్నవి.

౬ ఆరోకలం. శ్రోత్రియం అగ్రహారములు వగైరా.

౭ సర్వాగ్రహారములు.

౧ తొర్రివేముల మజరా నారావర్షులపల్లె బేచిరాకు అగ్రహారం. ఈ బ్రాహ్మలు యిప్పుడు వేపరేల వద్దనుండి అనుభవిస్తున్నారు.

ఒక సంవత్సరం కృష్ణరాయడు అనే ఆయన చేసిన అగ్రహారము సర్వేశ్వరసోమయాజులు, అనంతసోమయాజులు వగైరాలకు చేసిన వ్యాపరాలలోని అగ్రహారములున్ను ఆ అగ్రహారీకులున్ను అనుభవిస్తూయున్న వృత్తులు ౧౩.

౧ యేటూరిలో కానలోపల్లె అనే అగ్రహారము. యేటూరి కరణం వెంకటచలం చేసినది. ఆ అగ్రహారం బెడదూరు అక్షింతల అశ్వార్థ (అశ్వత్థ) సోమయాజులు వగైరాలకు యిచ్చిన వృత్తులు ౮.

౧ వెనకెకాలువలో గట్టుపేట అగ్రహారం ఆకనూరి నరసన్న పంతలు జేసినది. రంగాచార్యులు శేషాచార్యులు వగైరాల వృత్తులు ౨౧ 3 అయిన

౪ అగ్రహార గ్రామములు. అలాయిదాగా లేనివి. ఆ అగ్రహారముల లోను అణకువఅయి అగ్రహార వృత్తులు అనుభవిస్తూవచ్చే అగ్రహారములు

౧ శ్రోత్రియం ధర్మాపురంలోని కంచెనపల్లె కృష్ణప్ప చేసినది. వెంకట నారాయణభట్లు, కుండమన తిరుమలాచార్యులు వగైరా వృత్తులు ౧౨.

౧ దేవగుడిలోని కానగో సీనప్ప చేసిన అగ్రహారము. వెంకటరామ సోమయాజులు, నివర్తి పుల్లంభట్ల వగైరా వృత్తులు ౮.

౧ సిరిగెపల్లెలోని కరణం చేసినది అగ్రహారం కుందవరం. శేషం భట్లు దేవరగుడి చుచ్చిభట్లు వగైరా వృత్తులు ౮.

౧ సుగుమంచి పల్లెలో మయాణావారి ప్రభుత్వములో దేవజీశైలతు అనేవాడు చేసిన అగ్రహారం. కల్లె నరసింహ సోమయాజులు పుల్లావధాని వగయిరా వృత్తులు ౧౪.

ఈ నాలుగు అగ్రహారము అలాయిదా మూజేకు దాఖలా లేదు. ఆయా గ్రామములలో మాత్రం దాఖలు అయియున్నవి.

౨౬ శ్రోత్రియములు.

౧ ఓబనపేట, కోదండపాణి రఘునాథాచార్యులకు.

౧ ఫకీరుపేట, తురక సయ్యుదు మూసాకు.

౧ నేకనాంపేట, తురక నూరబేగుకు.

౧ తిమ్మాపురం యేటూరు సుబ్బాభట్ల బసవంభట్లు, యోగానంద భట్లకు, నారాయణభట్లకు.

౧ డొంకెపల్లె శ్రీ శంకరాచార్యులు స్వాములవారి మఠానకు.

౧ ధర్మాపురం కెంచనపల్లె సీనప్ప రామన్నకు.

౧ న్యాలనూతల కడప రామాచార్యులకు.

౧ చెన్నంపల్లె చెన్నూరి రంగాచార్యులకు.

౧ గొల్లపల్లె శ్రీ శంకరాచార్యులస్వాములవారి మఠానకు.

౧ మైలవరం శ్రీ లక్ష్మీన్నృసింహ దీక్షితులకు.

౧ కొత్తకుంటపల్లె కోనప్ప రాఘువప్పకు.

౧ వేరుకుంటపల్లె షడ్దర్శనం శ్రీగిరి సోమయాజులకు.

౧ అంబవరం వెంకటరామ సోమయాజులకు.

౧ కోన అనంతపురం రంగాచార్యులు శ్రీనివాసాచార్యులకు.

౧ అయ్యవారికంభాలదిన్నె గంగాధరభట్లు విశ్వేశ్వరభట్లు వెంకట నారాయణభట్లకు.

౧ చెన్నమనేనిపల్లె వెల్లటూరి చట్టిరాఘువేంద్రాచార్యులకు.

౧ ముచ్చుమర్రి బెడదూరి నైషధం సుబ్రహ్మణ్యసోమయాజులకు, ఓబుళ శాస్త్రుల నరసంభట్లకు.

౧ ఓబుళాపురం వరదాచార్యులు అప్పళాచార్యులకు.

౧ కొండాపురం పెద్దిశ్రీనివాసాచార్యులు చినశ్రీనివాసాచార్యులకు.

౧ సంకెపల్లి కృష్ణశాస్త్రులు వెంకట్రామశాస్త్రులకు.

౧ కొప్పోలు సుమతి కృష్ణాచార్యులకు.

౧ గోపాళపురం అక్షింతల నృసింహశాస్త్రులకు.

౧ లింగాపురం కడప ధూమాచార్యులకు.

౧ వెంకటాపురం గరుడాచలం భట్లకు.

౧ శివపురం, బెడదూరి సుబ్రహ్మణ్య సోమయాజులు ఆశ్వత్థ సోమయాజులు నారాయణసోమయాజులకు.

౧ మురగంపల్లె, బొమ్మలాటలాడే వారికిన్ని జాతివార్తలు చెప్పే వారికిన్ని సహా

౭ ఏడోకలం పాళ్యాలు: పాళ్యాలు యీ తాలూకాలో లేవు; దిగరు తాలూకా పాళెగార్లకు యీ తాలూకాలో గ్రామముల లేవు; చింతకుంట తాలూకు మల్యాలగ్రామము పాళెగార్లు కూనపులి వెంకటపతినాయనికి లోగడ కావలియున్నందున కర్నల్ మండ్రోసాహేబు వారి సన్నదు ప్రకారం ఈ జంబులమడుగు తాలూకాలో కొంతకావలి సంబంధం మాన్యం భూమి ౧౨ గ్రామములలో నడుస్తూయున్నది. ఈ పాళెగాడి కొమారుడు తాలూకు మజకూరు సున్నపురాళ్ల పల్లెలో నున్నారు.

౮ ఎనిమిదోకలం జాగీరు గ్రామములు:

౧ తూగుట్టపల్లె, కసుబా జంబులమడుగులో నుండే పీరుజ్యాదా రఫీ సాహేబుకు సర్వమాన్యం గ్రామం.

౧ దప్పల్లి, కాదరాబాదులోని దుత పేటలో నుండే షేఖల్లీ వగయిరా ఫకీర్లకు సర్వమాన్యం గ్రామం.

౯ తొమ్మిదో కలం మజీదుల వగయిరా.

౧౨ అయిన మజీదులు తసదీకు లేదు.

౩ కసుబా జంబులమడుగులో

౧ నబీషహా మహాజీదు

౧ తబీబ హుసేన మహాజీదు

౧ పాడు మహాజీదు

౩ గండికోటలో

౧ పెద్దమహాజీదు హరొన్నూరు బేగుది.

౧ అల్లాబేగు అఘూరఖానా మహాజీదు.

౧ ముర్తిజా సాహేబు మసీదు.

౧ ఇమ్మూమియ్యా మసీదు.

౧ మట్టి మసీదు.

౧ రంగమహాలు వద్ద మసీదు.

౧ పెద్దబావివద్ద మసీదు.

౧ నాగదరివద్ద దరగామసీదు.

౧ బుక్కపట్ణంలో ఫరీద నాయకుని మసీదు.

౪ దరగాహ్.

౧ తసదీకు నడిచేది. కసుబా జంబులమడుగులో నవాబు అబ్దుల్ల సయ్యాదు మియ్యా మయూణావారి కబరు; ఇందుకు తసదీకు చేందు ౧కి ఫతీలు ౩౯, మైలి ౧౬, కాసులు ౬౪ నడుస్తూ ఉన్నది.

౪ తసదీకు లేనిది.

౧ కసుబాజంబులమడుగులో రఫీసాహేబు దరగా.

౧ కాదరాబాదులోని పాతపేటలోని ఘూలిఫకీరు దరగా.

౧ గండికోటలో దస్తగిరిసాహేబు దరగా.
ఈ దగా అంటే నిమాజకట్టలు :

౧ కసుబా జంబులమడుగులో ;

౧ గండికోటలో ;

౧ కాదరాబాదులో ;

౧ బారమునారా అనేది గండికోట తూర్పుదరవాజా లోతట్టున నున్నది.

౮ మఠములు :

౧ కసుబా జంబులమడుగులో

౨ కాదరాబాదులో
౧ పొన్నతోటలో
౧ పెద్దముడియములో
౧ జంగాలపల్లెలో
ఈ ఆరున్ను జంగాలమఠములు

౧ నాగిరెడ్డిపల్లెలో
౧ గొల్లపల్లెలో
ఈ రెండు బ్రాహ్మణమఠములు

౧౦ పదోకలం

౧ బంగారు, వెండి, వజ్రం, యినుము, సూరాకారం అయ్యే ప్రదేశము లలో ప్రస్తుతం వెండి, బంగారు, యినుము కావడము లేదు.

౧ వజ్రములు లోగడ కొండసుంకెల కాదరాబాదు యీ రెండు గ్రామములలో గనులు సాగుతూ యుండి యీావల బహుదినముల క్రిందట గనులు సాగడం నిలిచిపోయినది. అయితే సూరాకారం మాత్రం పెదదండ్లూరులో మాత్రం అవుతున్నది.

౧౧ పదకొండోకలం.

పెద్దచెరువులు, చిన్నచెరువులు ఉండేవిన్ని అణకట్టలున్న కాలువ లున్న (ఉండేవి) నదీతీరమునుండే గ్రామములు; పినాకినీతీరమున ఉండేవి.

౫ జంబులమడుగు సమ్మతులో
౧ కసుబాజంబులమడుగు
౧ తూర్పుసుగుమంచిపల్లె
౧ దేవగుడి
౧ పెద్దదండ్లూరు
౧ దానవులపాడు

౧ ధర్మాపురం
౧ అంబవరం మజరా కొండాపురం
౧ గూడంచెరువు
౧ గోరిగెనూరు
౧ మోరగుడి
౧ దొమ్మరనంద్యాల
౧ వ్యాపరాల
౧ మైలవరం
౧ పొన్నతోట మజరా కొత్తపల్లె
౧ కాదరాబాదు
౧ దిగువపట్లం

౩ కిష్టేపట్టిలోని పినాకినీతీరమందు:

౧ సుగుమంచిపల్లె.

౧ యర్రగుడి

౧ బుక్కపట్ణం

౩ చిత్రావతీనదీతీరమున

౧ యనమనచింతల

౧ యేటూరు

౧ చవిటిపల్లె

౭ పాలూరుసమ్మతు కుముద్వతీరమున నుండేవి.

౧ పాలూరు
౧ ఉప్పలూరు
౧ చిన్నముడియం
౧ నెమళ్లదిన్నె
౧ పెద్దముడియం
౧ బలపనగూడూరు
౧ గరిశలూరు
వెరసి. ౭.

౨ పెద్దచెఱువులు

౧ పెదదండ్లూరు
౧ తలమంచిపట్ణం

ఇందు క్రింద వరి పండేదికలదు.

౨౪ చిన్నచెరువులు ఇరువదినాలుగు

౧ లావనూరు
౧ పెదదండ్లూరు
౧ గూడంచెర్వు
౧ దిగువపట్ణం
౧ కాదరాబాదు
౨ తొర్రవేముల
౨ తూర్పుబోంపల్లె
౧ వేమకుంటపల్లె
౧ కొత్తకుంటపల్లె

| | | |
|---|---|---|
| ౧ కోన అనంతాపురం | ౧ కల్లుట్ల | ౧ మురపంది |
| ౨ వద్దిరాల | ౧ అయ్యవారికంభాలదిన్నె | ౧ చౌటిపల్లె |
| ౧ బెస్తవేముల | ౨ భూతమూపురం | ౧ మజరా రేపల్లె |
| ౧ చినవెణుతుర్ల | ౧ నందిపాడు | ౧ మలమీది |
| | వెరసి. ౨౪. | కంభాలదిన్నె |

ఈ చెరువుల క్రింద వరి ఫలం అవుతున్నది.

ఇవిగాక ఆయాగ్రామములయందు పసులు నీళ్లు త్రాగేటందుకు కుంటలున్ను కలవు.

నదిలో తలపెర యేర్పరచియుండే కాలువలు చిత్రావతీనదిలో కిఌప్లేపట్టి.

| | | |
|---|---|---|
| ౧ వెనకెకాలువ | ౧ అనంతపురం | ౧ ఓబనపేట |
| ౧ పొట్టిపాడు | ౧ యేటూరు | ౧ గుండ్లూరు |
| ౧ మొనమనచింతల | ౧ ముచ్చుమర్రి | ౧ చవిటిపల్లె |
| ౨ బెడదూరు | ౧ కొండాపురం | |

౧౨ ఇది దురుస్తు

౪ సికిస్తు పినాకినీనదిలో ఉండినది, కుంపిణీప్రభుత్వం రక్తాక్షి సంవత్సరములోను పెద్దవెల్లువవచ్చి ఖిలపడిపోయినది.

౧ కిఌప్లేపట్టిలోని సుగుమంచిపల్లె

౧ గూడంచెరువు

౨ పొన్నతోట

౨ పినాకినీనదిలో దురస్తుగానుండే కాలువలు

౧ కిఌప్లేపట్టిలోని

౧ తాళ్లపొద్దుటూరు

౧ బుక్కపట్నం

౩ పాగా ౧ కి ౧౻ రూపాయి మొదలు ౩ రూపాయలు వరకు గంజి(?)

౪ ధోవతులు :

| | |
|---|---|
| ౧ తోరంచువి | ౧ శాలువ జవి |
| ౧ పట్టంచువి (నల్లవి) | ౧ పట్టంచు (పసుపు) |

ఈ నాలుగున్ను ధోవతిచాపు ౧ కి ౨ మొదలు ౪ వరకు. ఇవి నేసే గ్రామములు

| | |
|---|---|
| ౧ జంబులమడుగు | ౧ కాదరాబాదు |
| ౧ మొరగుడి | ౧ బుక్కపట్టం |
| ౧ దొమ్మరనంద్యాల | ౧ వ్యాపరాల |

సాదాపోర్వ్యాలు ముదుగు ౦౪ మొదలు ౧౹౽ వరకు

ఇవి నేసే గ్రామములు.

| | | |
|---|---|---|
| ౧ గోరిగెనూరు | ౧ అంబవరం | ౧ మొరగుడి |
| ౧ కన్నెలూరు | ౧ దొమ్మరనంద్యాల | ౧ సాలెవారి ఉప్పలపాడు |

ఇది గాక యీ ముదుగుపోర్వ్యాలు సాలెవాండ్లు, మంగలవాండ్లు, మాలవాండ్లు, మాదిగెవాండ్లు నేసేది కలదు.

౬ రేషమంఅంచు చీరలు ౧ కి ౧౹౹౹ మొదలు ౩ వరకు బుక్కపట్టం గ్రామాన అవుతున్నవి.

౭ ముదుగుపాటి డోరియాలు ౧ రూపాయపాటివి బోడితిప్పనపాటిలో అవుతున్నవి.

౮ అంగవస్త్రాలు ౦౹౦ మొదలు ౦౹౹౦ వరకు అయ్యే గ్రామములు

| | | |
|---|---|---|
| ౧ జంబులమడుగు | ౧ గోరిగెనూరు | ౧ లావనూరు |
| ౧ కన్నెలూరు | ౧ అంబవరం | ౧ వ్యాపరాల |

౯ సాదారుమాళ్లు ౧ కి రు. ౦౻౦ ఆది రు. ౦౪ వరకు మొరగుడిలో అవుతున్నవి.

అంతు తెల్ల బాపతులు అయ్యేతరాలు ౯ తొమ్మిది.

౨ జముఖానా ౧ కి ౨౫౦ రూపాయలు ఆది ౪ నాలుగు రూపాయల దాకా పెద్దముడియంలో అవుతున్నది.

నల్ల తరాలవి:

౧ నల్లగంగాసాగరం

౧ ఉడుతవన్నె అంటే నల్లవి తెల్లవి మిశ్రితంగానుండేవి.

ఈ రెండుతరాలవి చీర ౧ కి ౨ ఆది ౪ వరకు

అయ్యేగ్రామాలు.

౧ బుక్కపట్ణం ౧ కోడూరు ౧ కొండాపురం
౧ తాళ్లపొద్దుటూరు ౧ ఓబనపేట ౧ గంగాపురం

చిట్టితరం జంబులమడుగులో అయ్యేవి.

౧ చీరలు
౧ పెద్దచీర ౧ కి ౧౫ ఆది ౩ వరకు
౨ కిరగణి ౧।౦ వరకు
౧ చిట్టి ౧ కి ౧ మొదలు ౨ వరకు
౩ చిన్నవాండ్లు కప్పుకొనే ఫడతీలు ౧ కి ౦।౦ ఆది ౦।-।। వరకు
౪ రజాలు ౧ కి ౨ రూపాయలు ఆది ౨।౦ రూపాయలు వరకు

ఈ ప్రకారముగా అవుతున్నది.

౧౩ పదమూడోకలం తాలూకాలో పండే జినుస్సుల వివరము.

౧ వరి:

౧ గరకసన్నలు
౧ బుడమ
౧ పిషాణం
౧ పంచగన్నెలు
౧ కేసరి
౧ తెలబాలు
౧ చెన్నంగి
౧ వంకి
౧ యర్రబక్కలు

౪ జొన్నలువర్గాలు:

౧ తోటజొన్న ౧ పచ్చజొన్న ౧ చిత్తజొన్న ౧ యెఱ్ఱజొన్న

కాయ ధాన్యములు:

| | | | |
|---|---|---|---|
| ౧ గోధుమలు | ౧ శనగలు | ౧ పెసలు | ౧ అనుములు |
| ౧ ఉద్దులు | ౧ రాగులు | ౧ కందులు | ౧ అలసందలు |
| ౧ నూవు | ౧ యళగసి (?) | ౧ కుసుమలు | ౧ ఆరిక |
| ౧ చామ | ౧ కొఱ్ఱబరిగె | ౧ సజ్జలు | ౧ ఆముదాలు |
| | వెరసి. ౧౬. | | ౧ ప త్తియు |

మసాలా జినుసులు

| | | | |
|---|---|---|---|
| ౧ జిలకర | ౧ మెంతి | ౧ ధనియా | } ౧ మిరపకాయలు |
| ౧ పసుపు | ౧ తెల్లగడ్డలు | ౧ యఱ్ఱగడ్డలు | |
| ౧ పొగాకు | ౧ ఓమం | ౧ భంగి | ౧ తమలపాకులు |

ఈ కిస్లేపట్టిలో కమ్మెరి ఆకులు, తూర్పుప్రాంత్యాన తెల్ల ఆకులు.

౧౪ గో కలము బారామార్గాలు

చెన్నపట్నాన్నుంచి గుత్తిబళ్లారికి మార్గం - సాలవనం కుంఫిణీవారు వేయించినది.

౧ కసుబా జంబులమడుగు నుంచి పాలూరు ముడియం మీదుగా కర్నూలు హైదరాబాదుకు పొయ్యేది.

౧ నగరం సీమ నుంచి వాలాజాపేటకు పొయ్యేమార్గం తలమంచిపట్నం మీదుగా పోతున్నది.

అంతు కలములు ౧౪ పదునాలుగు సరి. బ తారీఖు 30 మాహే యేప్రిలు సన్న ౧౮౧౩ యిసవి. (వ్రాసినది నారాయణరావు ముతసద్దీ యిలాకే కర్నులు కాలిన్ మెక్కెంజీసాహేబు, సర్వేయరు జనరలు.

మర్తబు:

# *హనుమద్గుండం కైఫీయతు

౯౬. తరువాత మలగంగ దేవచోడ మహారాజుల వంశీకుడు, అప్రతిమల్ల గణపతి దేవచోడ మహారాజు కొన్ని దినములు రాజ్యం యేలినాడు. తదనంతరం ఇతని కొమారుడు, అహోబళయ్య దేవచోడ మహారాజులు రాజ్యం యేలినారు. ఇందుకు దాఖలా సదరు (గోటూరు) భైరవస్వామి దేవాలయముమీాద మలగంగ దేవచోడ మహారాజులు వేయించిన శాసనపురాతికి దిగువరాయిమీాద వ్రాసినది.

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౪౨ అగునేటి ప్లవంగనామ సం॥ వైశాఖ బ॥ ౩౦ లు గురువారము, స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర అప్రతిమల్ల గణపతి దేవచోడ మహారాజులుంగారి కుమారుడు, అహోబళయ్య దేవచోడ మహారాజులు తమ తండ్రి గణపతిరాజుకున్ను తమ తల్లి అహోబళమ్మకున్ను పుణ్యముగాను గోటూరు భైరదేవర......ను కాలవా ౧౧౪ వరిమడి యెర్రకాలువను, ౧౧౪ పూర్వాన యీా దేవరకు, ............చేను యెనమందమున్ను, యిరుసాను వరిమడి రెడ్డి కాల్వను......మున్నా యిరుసాను, ఉత్తమగండ్ల కాల్వను, మడి నల్తు మున్నా యిరుసాను, చెరువుకిందను మూాటికి పదిహేమున్ను యిరుసాను మడిన్ని వెలసెను. ప......భయరవరెడ్డిన్ని, ముత్యాల భైరవ రెడ్డిన్ని పట్టుదమయిన (?) సమస్తప్రజలున్ను చీ......యిస్తిమి గాన, యీా ధర్మానకు యెవరు 'కల్తచేసినా, పంచమహాపాతకాల పోదురు. గంగ......పొందిన పాపాన పోదురు.

ఈ ప్రకారం రాజ్యము చేయుచుండగా ఈ ప్రాంత్యాల సుంకం తీర్పుకునే కడ్వాలుకు కసుబాగో(?) సుంకం తీరుతూాయుండెను. తదనంతరం కొన్ని దినములకు, విజయనగరసింహాసనాధీశ్వరులయిన ప్రౌఢదేవరాయలు, ఇతని కొమారుడు విజయదేవరాయలు ఈ యిరువవరును ఈ అహోబళ దేవచోడరాజుతో యుద్ధానకు చతురంగబలసమేతంగా వచ్చి అఘోరమైన యుద్ధముచేసి జయించిరి. ఆ సందిగ్ధంలో పట్టణం పాడు అయినది. ఉన్న వర్తకులు మొదలైనవారు కొందరు దేశాంతరగతులై

* M. 131 Fol. 55-A to 59-A.

కొందరు ఇందుకు పడమర సామీప్యమున ఊరు కట్టుకొని, కాపురం ఉండియున్నారు.

౧౮. తరువాత విద్యానగర సింహాసనారూఢులైన శ్రీకృష్ణదేవ మహారాయలువారు రాజ్యం యేలుతూ ఉండగా గోటూరు అగ్రహారము చేసి బ్రాహ్మణులకు సర్వమాన్యముగా గృహోపకరణాలు సహాగా, హిరణ్యోదక దానధారాపూర్వకముగా ధారబోసి యిచ్చినారని, అగ్రహారికులు కైఫీయతు వ్రాయించినారు. ఈ రీతిని అనుభవిస్తూఉండగా పుష్పగిరిన్ని గోటూరున్ను ఒకటిగానే యుండెను. అప్పుడు పుష్పగిరిలో యుండే చెన్నకేశవస్వామి మొదలైన దేవుళ్లకు ఉత్సవాలు అయితే గోటూరిలోకివచ్చి...అయిపొయ్యేది కలదు. ఈ ప్రకారము ఉండగా ఆ కృష్ణరాయలువారు, పుష్పగిరి మహాక్షేత్రం పినాకినీతీరమునందు ఉండబడిన మహాస్థళాలు చూచి అచ్చట తీర్థస్నానములుచేసి, స్వామిని సేవించవలయును అని హితపురోహితులతో, చతురంగబలంతో యీ మార్గంగా వచ్చి స్వామి సన్నిధానమునకు పోతూవుండగా, తత్పూర్వం ఆస్థళమందు శివార్చకులు, తంబళవారనే కులంవారు మిక్కిలి అయిశ్వర్యమున్నూ, ఆచారవంతులయి అరువైనాలుగు అందలాలవారు, చాలా ప్రసిద్ధిగానుండి, యీరాయలువారు వచ్చే సమయంలో సదరు తంబళవారు ప్రపంచరీతిగా పృథివీపతులు దేవస్థళాలకు వచ్చి నంతట వార్లకు నడచుకొనే మర్యాదలు వినయవిధేయులు గాకుండాను, అట్లు నడుచుట కుద్యుక్తులు గాకుండాను, తాము సంధ్యాద్యనుష్ఠానములు చేసుకొంటున్నూ స్వజాతి స్వరూపం పరిచయులకేగాని, అన్యులకు బ్రహ్మవంశస్థులనిపించే రీతులుగల నడవడికెలను అనుసరించుకొని యుండగా, యీ రాయలవారు యీ తంబళవారియొక్క ఆచారమున్నూ వీరు ఉండే రీతులున్ను తత్కాలమునందు దృష్టిగోచరానకు, బ్రాహ్మలనే భ్రమసి అంజలిచేయగా వారు రాయలువారిగుండా అంజలిచేయించుకొనేటందుకు అర్హులము కామని లేశమాత్రము తెలుసుకోక, అయిశ్వర్యాతిశయమువల్ల పుట్టిన అహంకారబుదులయి అప్పుడయినా స్వజాతిత్వం ప్రకటమయ్యే నడతలు ఉండ చూపక రాయలువారు చెప్పిన అంజలి 'ఈశ్వరార్పణము, ఈశ్వరుడు

అష్ట అయిశ్వర్యములు శాశ్వతముగా కలుగజేయు గాక,' అని చెప్పినందున, రాయలువారు, 'వీరు యీ ప్రకారం అనిన హేతువు యేమి ? ' అని ఆలోచనచేసి స్థళజ్ఞులవల్ల వీరి వర్తమానము విచారణ చేయగా అల్పజాతులు యీ స్థళమందు, ఈలాగంటి బ్రాహ్మణకర్మం అనుసరించడానకున్ను, ఉండడాడానకున్ను అర్హులుకారని తెలిసి, వీరియొక్క అహంకారము నివర్తిచేయవలెనని తలచినవారయి వారికి తగిన శిక్ష తత్కాలమునందే చేయించి, ఆప్రదేశమునందు బ్రాహ్మణ అగ్రహారం నిర్మించినట్టు అయితే దేవతాసాన్నిధ్యమున వేదపారాయణములు మొదలయిన ఉత్సవాలకు అనుకూలంగా నడుచుననిన్ని మనసానిశ్చయించుకొని, పుష్పగిరి క్షేత్రమునందు ఉండే దేవతాదర్శనములు చేసి తత్తత్స్థళములందు అనేకములయిన దానములున్ను చేసి, తదనంతరమున గోటూరుకువచ్చి అచ్చట ఉండే అగ్రహారీకులను మీకు అగ్రహారముగా పినాకినీతీరమునందు సర్వమాన్యంగా వృత్తులు యేర్పరచి యిస్తున్నాము గనుక, గోటూరు అగ్రహారమున్ను పుష్పగిరి అగ్రహారమున్ను రెండూ అనుభవించుకొని రెండు స్థళములయందున్నూ కాపురస్థులుగా నుండవలసినదని శ్రుతపరచగా ఈ బ్రాహ్మణులకు మిక్కిలి సంతోషమయి సులభముగా పినాకినీ స్నానమున్ను, దేవతాదర్శనమున్ను సదాఘటన అయ్యేటందుకు ఆకర మవుతున్నది అని అంగీకరించి రాయలవారితో 'అదేప్రకారం చేయవలెను, ఆజ్ఞానుసారం అనువర్తిస్తున్నాము' అని చెప్పగా, అప్పుడు రాయలవారు అగ్రహారము నిర్మించి గృహోపకరణములతో సహా దానాదత్తము చేసి యిచ్చినారు.

అప్పుడు బ్రాహ్మణులు గోటూరులో కొందరు, పుష్పగిరిలో కొందరు కాపురముగా అగ్రహారం అనుభవిస్తూ ఉండిరి. ఇందుకు దాఖలా యేమంటే గోటూరు పుష్పగిరిలో నుండునట్టి శాసనములు.[1]

౧ గోటూరు భైరవస్వామిదేవాలయమునకు లియ్యమైన దక్షిణ భాగం రాతిమీద శాసనము :

1. Kaifiyat of Hanumadgundam, See also L. R. Vol 37. pp. 245-8.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు, ౧౪౪౦ అగునేటి బహుధాన్య సంవత్సర ఆషాఢ శు॥ ౧౨ లు ఆదివారం శ్రీమతు పుష్పగిరి స్థితాశేష విద్వన్మహాజనాలున్ను గోటూరి ముమ్మడి రెడ్డి కొమారుడు ముమ్మడిరెడ్డికి యిచ్చిన శాసనము. మా గోటూరు చెన్నూరునందుపొలిమేర వత్సకు (?) అయియుండగాను నీవు పొలిమేర ఖారీచేయించినందుకు, మేము పెట్టిన పొలిమేర మాన్యం కడమళ్ల కాల్వకు ఉత్తరపొలిమేరను చేను ఖ। చేనున్నూ, యెరగుడికాల్వ నేరేడు కాల్వ, ఉత్తమగండకాలువలోను మడి ౧౩ మడిన్ని ఆచంద్రార్కస్థాయిగాను, అనుభవించువాడవు. ఇందుకు యెవరు తప్పినా, పంచమహాపాతకాలపోగలవారు. శ్రీమంగళమహా శ్రీ శ్రీంజేయును.

*పుష్పగిరిలో వైద్యనాథస్వామి దేవాలయము ముందరపాతి యుండేరాయిమీద వ్రాసియుండే వయినము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౬౨ (A.D. 1540) అగునేటి శార్వరి సం॥ ఆశ్వయుజ శు॥ ౧౫ లు గు॥ శ్రీమద్రాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప అచ్యుతదేవమహారాయలు విజయనగరమునందు వజ్రసింహాసనారూఢులైై పృథివీరాజ్యము సేయుచుండగాను, శ్రీ మద్యజనాదిషట్కర్మ నిరతులయిన పుష్పగిరి అగ్రహారవిద్వన్మహాజనాలకున్నూ, చంద్రగిరి సోమరసయ్య పుత్రుడు, అచ్యుతదేవమహారాయలవారి దళవాయి, తిమ్మరసయ్యవారు యిచ్చిన సర్వమాన్యపు ధర్మశాసన క్రమమెట్లన్ననూ: స్వామి అచ్యుతదేవమహారాయలు మాకు నాయంకరానకు పాలించిన గండికోట సీమలోను, మీ పుష్పగిరి అగ్రహారమునందే పూర్వాన నడిచిన గండికోట దుర్గాధిపతులు కొనేటటువండి దుర్గదణాయనివర్తన, చిల్లర నానావగల కొనెడి బేడిగెలున్ను నేము పుష్పగిరిస్థళ భాస్కరక్షేత్ర పంచనదీసంగమం దక్షిణ వారణాసి విశేషస్థళం అని, మా స్వామి అచ్యుతదేవమహారాయులకు విన్నపం చేసి, స్వామి ఆనతిని మా స్వామి అచ్యుతదేవమహారాయులకు పుణ్యముగానున్ను, మా తండ్రి సోమరసయ్యకారికిన్ని, మా తల్లి

* See also M. No. 267 pp. 126–7.

కాళమమ్మవారికిన్ని పుణ్యముగాను, యీ తథాతిథి పుణ్యకాలమునందు విరూపాక్ష విఠలేశ్వర దేవుని సన్నిధిని తుంగభద్రాతీరమందు, పుష్పగిరి అగ్రహారము అందుల గ్రామగ్రాసం గోటూరు మొదలుగాను, గండికోట దుర్గానకు అచ్చివచ్చే రొక్కం అంతవట్టున్ను గండికోట స్థళమందు వహిశుద్ధిచేయించి సర్వమాన్యముగాను పుష్పగిరి అగ్రహారం మహాజనాలకు త్రివాచకంగాను, ధారబోసి యిస్తిమి. ఈ ధర్మానకు ముందర దుర్గాధిపతులు కానికెకట్టళ్లు తప్పిగొనిరా తమ తల్లితండ్రిని కాశీలో వధించిన పాపానబోవువారు; గంగకర్త గోబ్రాహ్మణుల వధించిన పాపాన పోవువారు ; ఇట్లని యిచ్చిన ధర్మశాసనము.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం ॥

స్వదత్తాంపరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాంజాయతేక్రిమిః ॥

ఒప్పం శ్రీగిరిమల్లికార్జున. మంగళమహాశ్రీశ్రీంజేయును.

గోటూరు మజరా పీరుజాదాపేటకు ఉత్తరం చెరువుకట్టలోతట్టు నీళ్లలో మునిగియున్న రాతి మీది శాసనము :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౭౩ అగునేటి ఆనందనామ సం॥ చైత్ర, శు ౫ లు మన్వాదిపుణ్యకాలమునందు గోటూరు చెన్నరాయునికి పేరుగుబ్బా శివనాయని కొడుకు భూమయ్య ధారబోసి యిచ్చిన ధర్మశాసనం.

పుష్పగిరి గోటూరు స్థితాశేషవిద్వన్మహాజనాలున్ను పేరు సుబ్బాశివనాయడు కొండపాలం పోయి ఊరి గొడ్లను దొంగలు తోలుక పోగాను పోట్లాడీ చచ్చిన నిమిత్తం నెత్రుపట్టు అని పెట్టిన మాన్యం కాచిబేటి స్థళం చేనులోను, వెలిచేని పొలిమేరకు పడమర, పూర్వపుదంప నిడువుకు దక్షిణం చేను యిద్దుము మహాజనాలు మాకు సర్వమాన్య ముగా పాలించిరి గనుక, యీ చేను యిద్దుమున్ను, స్వామి చెన్న కేశవుల విశేషనైవేద్యానకు సర్వమాన్యముగాను ధారబోసి దండము సమ ర్పిస్తిమి. పుష్పగిరి గోటూరు మహాజనాలు సమ్మతినిన్ని త్రివాచకంగాను రెడ్డికరణాల సమ్మతిని, తమ అన్నదమ్ముల సమ్మతిని ధారవోసి యిస్తిమి. ఈ ధారబోత ఆచంద్రార్కస్థాయిగాను తమ పుత్రపౌత్ర పారంపర్యం గాను స్వామి సేవ కలుగవలసి ధారబోసి సమర్పించి యిచ్చిన ధర్మ శాసనము.

---

# భీమగుండం శాసనములు*

జంబులమడుగు తాలూకాలో మవుజే పెదముడియములో శాసనములు, శిలాశాసనముల నకళ్లు.

మవుజే భీమగుండం గ్రామములో శాసనములయొక్క నకళ్లు.

౧ వీథిలో సావడివద్ద పాతియున్న శిథిలమైన శిలాశాసనము.

శుభకృతునామ సంవత్సరం చైత్ర శుద్ధ ౧ లు, స్వస్తి సమస్త లోకనిస్తారక స్వాయంభువనైక మారోమహామ్నాయ మాయావినోది మంత్ర తంత్ర కోలాహల చతుర్వేదమూర్తి హరిహర బ్రహ్మస్వరూప అంధకాసుర, తారకాసుర అసుర నరహ్యాది అద్యరి (?) కూరాయరాయ మహా...స్వర్గమర్త్య పాతాళ త్రిభువనైక వహాఢక్కడ (మరుక) మృగ త్రిశూలధారి ఓరుగంటి ప్రతాపరుద్రుని ...... ధర్మని కార్ధిశిరను దగ్గెరమ......మున్నూట అరువై రాష్ట్రాలకున్ను మూలప్రా ...... నాథుని......ముఖమంటపమున్ను, నరసింహానినాయని ......చంద్ర కొమారుడు, మొదలైన యాభైయారు దేశముల ...... (ఈవల అక్షరములు శిథిలమైపోయినవి)

౨ దీనికి తూర్పు చెన్న కేశవుని దేవాలయం జగతికట్టుకు పగిలినశాసనము.

సర్వధారినామ సంవత్సర కార్తీక శుద్ధ ౧౫ లు శ్రీమన్మహా మండలేశ్వర గంటి కోనేటిరాజయ్యదేవ మహారాజుంగారు నాయని వారికి పుణ్యముగాను రాయలచెర్వు లింగాబత్తునికి యిచ్చిన, భూదాన పత్రం. భీమగుండం చెన్న కేశవ పెరుమాళ్లను చేసినందుకు కొమ్మెర్ల త్రోవను చింతకుంటవారి పుట్ట వంపుకొన నీకు చేను ౧౦౪ మాన్యం యిచ్చినాము గనుక, మీ పుత్రపౌత్రపారంపర్యంతరం, అనుభవించేది అని యిచ్చిన ధర్మశాసనము. ఇందుకు యెవ్వరు తప్పినా కాశీలో గోహత్య చేసిన పాపాన బోదురు.

---

* See M. Vol. 254, fol. 11-A to 25-B. Also found in L. R. Vol. 37 pp. 263-291.

3 దీనికి దక్షిణం చలివెందలబండకు శాసనము :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౭౯ అగునేటి పింగళనామ సంవత్సరం చైత్ర శుద్ధ ౭ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాయలు, విద్యానగరమునందు రత్నసింహాసనారూఢుడై, పృథ్వీసామ్రాజ్యము చేయుచూయుండగాను, శ్రీవత్సగోత్రం, ఆపస్తంభసూత్రం, యజుశ్శాఖాధ్యాయులైన శ్రీమతు భోజనపల్లె తిరుమలయ్యగారి కుమారుడు, నారాయణయ్యగారు చెన్నకేశవస్వామి సన్నిధిని, తమతల్లి తిరుమలమ్మగారికి పుణ్యంగాను,......వేయించిన ధర్మశాసనం: చలివెందల గ్రామానకు పడమర, కొత్తనూతి గ్రామానకు ఉత్తరాన చెన్నకేశవునకు వేయించిన పువ్వుల తోట; గ్రామానకు తూర్పున, కుందేళ్ల గొంది చెరువు తూర్పు ౧౨౧ చెరువు; ఇందుకు యెవరు ఆచ్ఛేదన చేసినాగాని, మాతృగమనం చేసిన పాపాన బోదురు, గురుపత్నిని పట్టుకొన్న పాపాన బోదురు, కాశీలో తనతండ్రిని వధించిన పాపాన బోదురు.

౪ దీనికి ఉత్తరం పగిలిన రెండు తునకలమీద శాసనము :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన సకవరుషంబులు ౧౪౭౭ అగునేటి రాక్షసనామ సంవత్సర చైత్ర బహుళ ౧౦ లు శ్రీమద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర సదాశివదేవ మహారాయలు విద్యానగరమునందు, రత్నసింహాసనారూఢుడై పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను, కాశ్యపగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన, విప్రవినోది వల్లభయ్య కుమారుడు చాగలమఱ్ఱి పరువతయ్యాను, వశిష్ఠగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన, పెదకేశవయ్యగారి కుమారుడు నరసయ్యాను, కాశ్యపగోత్రులైన, ఆపస్తంభసూత్రులైన, వారణాసి వల్లభయ్య కుమారుడు మహాదేవయ్యాను, వీరు మొదలైన విప్రవినోదులు, భీమగుండానకు, ప్రతినామధేయమైన అచ్యుతరాయపురం, చెన్నకేశవ పెరుమాళ్లకు దండం సమర్పించి యిచ్చిన ధర్మశాసన క్రమం యెట్లన్నను : భీమగుండానను.

మా విప్రవినోదులకు యిచ్చే త్యాగవర్తనల అంతవట్టు తెప్పతిరునాళ్ల మహోత్సవానకు, పారువేట మహోత్సవాల ధూపదీపనైవేద్యాలకు ధారవోసి యిస్తిమి. కాశ్యపగోత్రులైన, ఆపస్తంభసూత్ర శుక్ల యజుశ్శాఖాధ్యాయులైన, విప్రవినోది వల్లభయ్య కొమారుడు చాగల మర్రి పరవతయ్యాను, వసిష్ఠగోత్రం, ఆపస్తంబసూత్రం శుక్లయజుశ్శాఖాధ్యాయులైన, విప్రవినోది పెదకేశవయ్య కొమారుడు, చెన్నూరు నరసయ్యాను, కాశ్యపగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన వారణాసి వల్లభయ్య కొమారుడు, మాధవయ్యాను, వీరు మొదలయిన విప్రవినోదులు, భీమగుండమునకు ప్రతినామధేయమైనట్టి అచ్యుతరాయపురం చెన్నకేశవ పెరుమాళ్లకు, దండం సమర్పించి యిచ్చిన ధర్మశాసనము: భీమగుండానకు మా విప్రవినోదులకు యిచ్చే త్యాగవర్తనలు అంతమట్టు పెరుమాళ్లకు తెప్పతిరునాళ్ల మహోత్సవము, పారువేట మహోత్సవాలకు, ధూపదీపనైవేద్యాలకు ధారవోసి యిస్తిమి. కాశ్యపగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన వల్లభయ్య కుమారుడు చాగలమర్రి పరవతయ్య, వశిష్ఠగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన, పెదకేశవయ్యగారి కుమారుడు చెన్నూరు చినకేశవయ్య, కాశ్యపగోత్రం, ఆపస్తంభసూత్రం, శుక్లయజుశ్శాఖాధ్యాయులైన వారణాసి వల్లభయ్య కుమారుడు మాధవయ్యాను విప్రవినోదులు భీమగుండావకు ప్రతినామధేయమైన అచ్యుతరాయపురం చెన్నకేశవస్వామికి దండం సమర్పించి యిచ్చిన ధర్మశాసనము. శుక్లయజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోదులు అందరికిన్ని పుణ్యముగాను, తెప్పతిరునాళ్ల పార్వేట మహోత్సవం, ధూపదీపనైవేద్యాలకు, పణ్యారానకు మొదలైన షోడశోపచారాలకున్ను ఆచంద్రార్కస్థాయిగాను నడిచేటట్టుగాను, త్రివాచకముగాను, త్రికరణశుద్ధిగాను, త్యాగవర్తనలు ధారవోసి యిచ్చిన ధర్మశాసనము. భీమగుండానకు విప్రవినోదులు యెవ్వరు వచ్చినా, విప్రవినోదుల కులంవారు యెవ్వరు వచ్చినాను, ప్రతిపాలించకున్నా వారి పితాళ్లను గయలో వదించిన పాపాన బోదురు. మాతృగమనం చేసిన పాపాన బోదురు.

శ్లో॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
చాగలమఱ్ఱి పరవతయ్య వ్రాలు.

మవుజే దిగువకలవటాల గ్రామమునకు, వాయవ్యభాగాన (దిగుడు) బావి ఉన్నది. ఆ దిగుడుబావికి ఉత్తరం వైపున నల్లబండమీాది శాసనము :

(Repetition: See for the text of the inscription Gaṇḍikōṭadurgam Kaifiyat above pp. 21-23)

ఈ రాతికి రెండోవైపు శాసనము :

ఏతము ఎత్తేవారికి చేను సుంకెసుల త్రోవను, - ప - పీరునికి ఉత్తరానను, సుంకెసుల పొలిమేరను, పన్నిద్దుము చేను. తోటకు యిరుసాను, కొతారులోను వైజుత్రోడి కట్టాను, ఆచంద్రార్క-స్థాయిగాను యిస్తిమి. అత్తేసుసెట్టికామన, మారకనారు...కన్నాయభక్తుని కస వాయ, బొమ్మాయ భక్తుని తిమ్మాయ, ఈ నలువురున్ను యీా ధర్మ గాడికి విడువక నీళ్లుమొత్తి అనుభవించువారు. ఎత్తకుంశేను, గోవులు వచ్చి ఉదకము త్రాగక మగిడిపోయిన దోషాన పోదురు. ఈ ధర్మం చెరిపిన వారికి, బ్రహ్మహత్యను, గోవులను, గురువును, తల్లిని, తండ్రిని పెద్ద కొడుకును, యింతవట్టువారిని చంపినవాండ్లు. ఈ పాపానను గాడిదె కడుపునాను, పంది కడుపునాను పుట్టును. మీాదను సూర్యచంద్రులు కలంతకాలము పురుగుల గుంటపడును. ఈ ధర్మం పాలించినవారికి, బ్రహ్మ ప్రతిష్ఠాపితము అవును. ఈ ధర్మగాడి ప్రతిష్ఠ చేసిన తిప్పినాయని గారికి రాజ్యాభివృద్ధిన్ని, ధనధాన్యాభివృద్ధిన్ని, పుత్రపౌత్రాభివృద్ధిన్ని, సకల ధర్మాలున్ను సిద్ధించును. ఉమామహేశ్వరాభ్యాన్నమః। శ్రీలక్ష్మీ కాంతాయ నమః। వసంతవల్లభాయ నమః। సూర్యచంద్రాయ నమః। విఘ్నేశ్వరాయ సమః। మంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ వృషభము.

మవుజే కొండసుంకెసుల గ్రామాన కోటలో నృసింహాస్వామి దేవాలయములో పగిలిన శాసనము.

(Repetition : See for the text Gandikōtadurgam Kaifiyat,p. 19-20)

మవుజే కోరువాని పల్లె ఆంజనేయ దేవాలయంలోను వాతిన శాసనము:
(A smmary of this inscription is given in the Gaṇḍikōṭadu rgam - Kaifiyat See, p 46-47.)

శుభమస్తు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౬౭ అగునేటి విశ్వావసు సంవత్సరం, ఆషాఢ శుద్ధ. ౫ లు బుధవారము,[1] శ్రీమన్మహారాజ, రాజాధిరాజ, రాజపరమేశ్వర. శ్రీవీరప్రతాప, శ్రీవీరసదాశివదేవమహారాయలు విజయనగరమునందు వజ్రసింహాసనారూఢుండై పృథ్వీసామ్రాజ్యం చేయుచుండగాను, శ్రీ మన్మహామండలేశ్వర ఆత్రేయ గోత్ర, ఆపస్తంభసూత్ర, యజుశ్శాఖాధ్యాయులయిన, సత్యభాషా హరిశ్చంద్రులైన, సోమవంశాధీశ్వరులయిన, ఆరవీటి రామరాజు తిమ్మయదేవమహారాజుల కొమారుడు, చినతిమ్మయదేవ మహారాజులుంగారు అగస్త్యగోత్ర, ఆశ్వలాయనసూత్ర, ఋక్శాఖాధ్యాయులయిన, యజన యాజన అధ్యయన అధ్యాపక దాన దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులయిన అనంతపురం తిప్పాభట్ల పౌత్రులైన చిట్టయ్యగారి పుత్రులు, కవి అవుబళయ్యగారికి యిచ్చిన భూదాన ధర్మశాసనం. సదాశివదేవ రాయలు మాకు నాయంకరానకు పాలించి యిచ్చిన రేనాటిసీమలోను, అవుకుసీమకు చెల్లే కోరువానిపల్లె ప్రతినామమైన చినతిమ్మరాజు పురము శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయగోత్ర, ఆపస్తంభసూత్ర, యజుశ్శాఖాధ్యాయులైన, సోమవంశాధీశ్వరులైన, సత్యభాషా హరిశ్చంద్రులైన, ఆరవీటి రామరాజు తిమ్మయదేవమహారాజుల కొమారుడు చినతిమ్మయదేవ మహారాజులు అగస్త్యగోత్ర, ఆశ్వలాయనసూత్ర ఋక్శాఖాధ్యాయులైన, యజనాది షట్కర్మ నిరతులైన, అనంతపురం తిప్పాభట్ల పౌత్రులు చిట్టయ్యగారి పుత్రులు అవుబళయ్యవారికి యీ తథాతిథిని కోరువానిపల్లె ప్రతినామమైన చినతిమ్మరాజ పురము, ధారబోసి యిస్తిమి. శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయగోత్ర, అపస్తంభసూత్ర, యజుశ్శాఖాధ్యాయులైన, సోమవంశాధీశ్వరులైన, అంతెంబరగండ,

1. 24th June A.D. 1545.

బిరుదుమన్నియవిభాళ, నానావర్ణ మండలీకరగండ, గండరగండ, ధరణీవరాహేంతి బిరుదాంకులైన, సత్యభాషా హరిశ్చంద్రులైన, ఆరవీటి రామరాజు తిమ్మయదేవమహారాజుల కొమరులు, చినతిమ్మయదేవమహారాజులవారు, అగస్త్యగోత్ర, ఆశ్వలాయనసూత్ర, ఋక్శాఖాధ్యాయులైన, యజనాది షట్కర్మనిరతులైన, నందవరకులకలశార్ణవ పూర్ణచంద్రులయిన, అనంతపురం తిప్పాభట్టుగారి పౌత్రులు, చిట్టయ్యగారి పుత్రులు, అవుబళయ్యగారికి ఈ కోరువానిపల్లె ప్రతినామమైనట్టి చినతిమ్మరాజపురమం చతుస్సీమలకు లోనైన, నిధినిక్షేప జలపాషాణ, అక్షీణ, ఆగామి, సిద్ధసాధ్యంబు లనేటి, అష్టభోగ తేజస్వామ్యాలున్నూ, ఈ సోమగ్రహణ మహాపుణ్యకాలమునందు, తిరువెంకటాద్రి సన్నిధిని, సువర్ణముఖితీరమందు, సహిరణ్యోదకదానధారా పూర్వకముగాను, శ్రీ కృష్ణార్పణం అవునట్టుగాను, సర్వమాన్యంగాను, త్రివాచకంగాను ధారపోసి యిస్తిమి. గాన, మీరు మీ పుత్రపౌత్ర పారంపర్యంగాను, ఆచంద్రార్కస్థాయిగాను, సుఖాన అనుభవించి బ్రతుకమని యిచ్చిన భూదాన ధర్మశాసనం.

శ్లో॥ ఏకైవ భగినీలోకే సర్వేషా మేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

ఇందుకు యెవ్వరు తప్పినాను తమ తలిదండ్రుల వారణాశిలో వధించిన పాపాన బోవువారు. మంగళం మహాశ్రీ శ్రీ శ్రీ శ్రీంజేయును.

ఈ శాసనం నోసం తాలూకు దాఖలు.

మవుజే చెన్నంపల్లె గ్రామంలో దేసిరెడ్డి అనే గొల్లవాని మారీ ఫత్తున, నాగరలిపి తామ్రశాసనములు ఉన్నవట. అవి గ్రామంలో హాజరు లేవు. నోసంతాలూకు ముక్కమల్లలో దాచినాను అని చెప్పి నాడు. ఆయొక్క తామ్రశాసనం అన్వయముగా వీనిదగ్గర కాగితముల పైన వ్రాసియున్న దానియొక్క నకలు. ఈ శాసనం ఉండే గ్రామం నోసంతాలూకు.

శ్రీగణాధిపతయే నమః।

నమ స్తుంగ శిరః చుంబి చంద్రచామర చారవే।
త్రైలోక్యనగరారంభ మూల స్తంభాయశంభవే ॥ ౧ ॥
అవ్యాదవ్యాహ తైశ్వర్య కరిణో వారణాననః
వరద స్తీంద్రతిమిరమిహిరో హరనందనః ॥ ౨ ॥
శ్రీమా నాదివరాహో వః శ్రియం కుర్యాత్తు భూయసీం।
గాఢమాలింగితా యేన మేదినీ మోదతే సదా ॥ ౩ ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౨౩౧ అగునేటి శుక్లనామ సంవత్సరం, కార్తిక బహుళ ౮ లు, భానువారము, చెన్నంపల్లె దేసుగాడు కోవిలకుంట్లకు వచ్చి, ముక్కమల్లలో భవిర శేషాచార్యులవారిదగ్గిర తామ్రశాసనంలో, నాగిరం లిపితో, సంస్కృతంలో యున్నందున, అది తెనుగుతో వ్రాసియివ్వవలెనని, నానాప్రకారాల చెప్పుకోగా అందుకు బనగానపల్లె...యాచార్యులవారు దయచేసి ఆ శాసనమును తెనుగున వ్రాసియిచ్చినారు గనుక దానివివరం:

మొదట మహాఉన్నతమయినవంటి చంద్రవంశమునందు యదు రాయడైన ప్రభువు ఉండెను. యదువంశోద్భవుడైనటువంటి శ్రీకృష్ణ స్వామిచేతను భూపాలన చేయబడెను. ఆ యదురాయని కులమునందు సంపత్కరమైనటువంటి, ఆకాశం పర్యంతం వ్యాప్తమయిన గుణాలు గలిగి నటువంటి, నిర్దోషం గలిగినటువంటి సంగముడనే పేరుగలిగినటువంటి

రాజు, దిక్కులు, చంద్రుడు, ధ్రువనక్షత్రం యెంత పర్యంతం ఉంటున్నవో తావత్పరియంతం, జనులకు హితముగోరినషువంటివాడు అవుతూ యుండెను. ఆయనకు బుక్కరాయడనేవాడు పుట్టెను. బహుభాగ్యం చేతను, సమస్త శత్రువులైనషువంటివారిని సంహారం చేయగలవాడైవషు వంటి, శేషదేవుని అనుగ్రహానికి పాత్రుడయినషువంటి, రాజశ్రేష్ఠుడయి నషువంటివాడు. ఇషువంటి రాజుకు గౌరి యనేటషువంటి పత్ని ఉండెను. ఆ యమయందు హరిహర అనేటషువంటి కుమారుడు ఉండెను. ఆయన శిష్టపరిపాలనచేస్తూ, దుష్టనిగ్రహం చేస్తూయుండెను. కాని, ఇతోధికమైన మాటలు వినక యుండెను. అతని పెండ్లాము అంబ అనియుండెను. ఆయమకు ప్రతాపదేవరాయలు పుట్టెను. ఆయన అతిశయ గుణాలచేతను, పూర్ణ మయినషునంటి రామస్వామి వలెనే పరాక్రమం కలిగినషువంటివాడు. గుర్రాలు యెక్కిన తురకవాండ్లను దూదివలె భస్మం చేస్తూయుండెను. ఇషువంటి రాజుకు అంబిక అనే పెండ్లాము ఉండెను. ఆయమకు విజయ అనేటషువంటి రాజు పుట్టెను. ఆయన విద్యావినయ విజ్ఞానాది గుణాల యందు సముద్రస్నాన మయినషువంటివాడు. ఆయన పెండ్లాము నారాయణి అనే ఆయమకు ప్రౌఢప్రతాప దేవరాయలు పుట్టెను. ఆయ నకు బలాదేవి అనే ఆయమ పట్టపు పెండ్లాము ఉండెను. ఆయమ రుద్రు నికి పార్వతి, ఇంద్రునికి శచీదేవి యేప్రకారం అనుకూలంగా ఉండిరో, ఆ ప్రకారము ఉండెను. రూపసౌభాగ్యలావణ్యములు కలిగినషువంటి తిలోత్తమ అనే అప్సరస్త్రీని గెలిచినషువంటిది. ఎవ్వరి పాతివ్రత్య సంపత్తు చూచి అత్రి పెండ్లాము అనసూయ అనే అషువంటి ఆయమకు సహించకపోయెను. వారి యిద్దరి పూర్వప్రాచీన పుణ్యాల పరిపక్వం చేతను, మల్లికార్జునుడనే అషువంటి దేవునియొక్క, శ్రీశైలపర్వతమునందు వాసం కలిగినషువంటివాడు, వరము నిమిత్తమై వెళ్లినందున, కృతు (?) డనే కొడుకు పుట్టెను. తండ్రి సమీపమునందు, కాంతి సంపత్కరమైనషు వంటి, ధీరుడైనషువంటి, పరమధర్మం కలిగినషువంటి ఇమ్మడి ప్రౌఢుడనే రాజు, జగతుకు రాజై యుండెను. ఆయన రాజాధిరాజు తేజస్సు కలిగి నషువంటి యే రాజో ఆయనకు ఉత్తముడైనవాడు. మాటల చేతను

ప్రజ్ఞ గలవాడు, సర్పాలకు గరుత్మంతునివలె, శత్రులను సంహారంచేసే విషయమునందు సింహస్థానం కలిగినటువంటివాడు, ఏనుగుల గుంపుకు సింహం వలెనే• వేట కలిగినటువంటివాడు, పరరాజులకు భయంకరం కలిగినటువంటివాడు, హిందూరాయడని భట్రాజులచేత పొగడించు కొంటూ యుండేవాడు ; తుంగభద్రకు పైగా ఉన్నటువంటి ఆనెగొంది అనే పట్టణములో, తండ్రి సంబంధమయినటువంటి సింహాసనం పొంది, ప్రసిద్ధమైనటువంటి భూసంరక్షణ చేస్తూయుండెను. ఆ పుణ్యాత్మునికి శ్రేష్ఠుడయినటువంటి దేవరాయ మహీపతి, ఇమ్మడి ప్రౌఢ మహిమో జ్వలం కలిగినటువంటి రాజు ప్రకాశిస్తూయుండెను. (సు)ధర్మస్థానమునందు ఉన్నటువంటి దేవేంద్రరాజు శాలివాహనశకంచేత నిర్మాణం చేయకలిగి నటువంటి సంవత్సరాలు ౧౩౭౨ ప్రమోదూత సంవత్సరం భాద్రపద బహుళమందు, త్రయోదశి దివసమునందు, నరసింహతిలా అనే హోమ మునందు, విశేషంగా తిలహోమ పూర్ణాహుతి, పుణ్యకాలమునందు, బహుపుణ్యశ్రేష్ఠుడైనటువంటి, రాజాధిరాజయినటువంటి, ఇమ్మడి ప్రౌఢ దేవభూపాలుడు, వేదశాస్త్రార్థాలు తెలిసినటువంటివాడు, షట్శాస్త్రిలనే మటువంటి, సముద్రంవలె కలిగినటువంటి లోకబాంధవ్యం కలిగినటువంటి, వేదమార్గానికి ప్రతిష్ఠ చేయించగలఅటువంటి, ఆర్యశ్రేష్ఠుడైనటు వంటి, బుద్ధిమంతుడైనటువంటి, నిరంతరమందు మాటలనే భూషణాలు కలిగినటువంటి రఘుభట్టార్యుల కుమారుడయినటువంటి, వెంకటార్యు డనేటి భట్టశ్రేష్ఠుడనేటువంటి, జ్ఞానం కలిగినటువంటి బ్రాహ్మడికి ధన నిక్షేపార్థగుత్తి నిర్ణయపరచుకున్న తదనంతరమునందు, గుత్తిలో అంత ఖ్యాతమైనటువంటి, పయిరుతో ఫలించినటువంటి, స్వనామంచేత ఇమ్మడి ప్రౌఢదేవేంద్రపురం అని విశేషంగా నామం కలిగినటువంటి, ముఖ్యంగా ధన సంరక్షణ నిమిత్తమై యక్షగణాలచేత తథా సిద్ధ సాధ్యులచేత యుక్తం కలిగినటువంటి అప్సరస్త్రీలచేత యుక్తమైనటువంటి, జల పాషాణాలచేతను, నిర్మితమయినటువంటి ఉదకమై, భూమి కలిగినటువంటి, ఉత్తరానికి పాషాణంమీద దేవతారేఖలచేత యుక్తమైనటువంటి, యినూరు వరహాలకు యోగ్యం కలిగినటువంటి గ్రామం సహిరణ్యోదక

దాన ధారాపూర్వకముగా, యధావిధ్యుక్తముచేతను, సర్వమాన్యాగ్రహారం చంద్రమౌళీశ్వర సన్నిధానమునందు, భోజనంచేసేదానికి బ్రాహ్మణులకు యిచ్చేఅందుకు, నక్షత్రాలు యెంత పర్యంతం ఉంటున్నవో అంత పర్యంతం పుత్రపౌత్ర పారంపర్యంతరం అనుభవించుకొని సుఖాన ఉండేది. అని దానం తీసుకొని సంతుష్టుడై పరమసంతోషంచేత రాజును, చిరంజీవి అయివుండమని ఆశీర్వాదం చేసియుండెను తదనంతరం ఆ ఆర్యులు శ్రీవత్సగోత్రమయినటువంటి, శ్రీఆశ్వలాయనసూత్రమైనటువంటి, బుద్ధిమంతుడైనటువంటి, లక్ష్మణార్య కుమారుడయినటువంటి, చండిభట్లు అనే బ్రాహ్మణునికి వృత్తి ఒకటి యిచ్చెను. కాశ్యపగోత్రులయినటువంటి ఋక్శాఖులయినటువంటి పుట్టిభట్లకుమారుడయినటువంటి పొట్టిభట్లకు ఒక వృత్తి యిచ్చెను. శ్రీవత్సగోత్రులయినటువంటి, ఋక్శాఖు (ఋక్శాఖు?) లయినటువంటి, బుద్ధిమంతులయినటువంటి, హరొమ్మణ్ణ పేరు కలిగినటువంటి బ్రాహ్మడికి వృత్తి ఒకటి యిచ్చెను. ఆత్రేయగోత్రులయినటువంటి, యజుశ్శాఖులయినటువంటి, మాధవరాయని కుమారుడయినటువంటి వానికి వృత్తి ఒకటి, శ్రీ వత్సగోత్రులైనటువంటి ఋగ్వేదులైనటువంటి రామాభట్ల కుమారుడైనటువంటి తిమ్మిభట్లకు ఒక వృత్తి. యాగంచేసినటువంటి వృద్ధణార్యుల కుమారుడైనటువంటి శాస్త్రంవ్రాసే అటువంటి, శోభితమైన బుద్ధిగలిగినటువంటి, విద్వత్తునుంచు సామర్థ్యం కలిగినటువంటి బ్రాహ్మణునకు వృత్తి ఒకటి, మరకతమల్లయ్య అనే వానికి వృత్తి ఒకటి.

శ్లో॥ ఏకైవ భగినీ లోకే సర్వేషా మేవ భూభుజా।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా. ॥ ౧ ॥

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం. ॥ ౨ ॥

సామాన్యోయం ధర్మసేతుః నృపాణాం
కాలేకాలేపాలనీయోభవద్భిః।
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్ర(ః) ॥ 3 ॥

శ్రీ విరూపాక్ష

౧ ఈ ప్రకారం మాకు తెలిసే కలాలు వ్రాసినది. ఈ లిఖితం రాగిశాసనంలో ఉన్నప్రకారం యెత్తి వ్రాసినది.

వీనిదగ్గిర నున్న రెండోపత్రం యొక్క వివరము.

శుక్లనామ సంవత్సరం భాద్రపద శుద్ధ ౧౦ లు ముక్కమల్లలో నుండిన శ్రీ మద్యజన యాజన అధ్యయన వేదమార్గప్రతిష్ఠాపనాచార్యు లయిన, ఉభయ వేదాంత ప్రవర్తకులైన, శ్రీ భట్టర శేషాచార్యులవారి వద్ద వున్న తామ్రశాసనం - నాగరం - గీర్వాణ భాషలో నుండగా ఆ శాసనం ప్రకారం చూచి యెత్తి వ్రాసినది. బాళబండు అక్షరాలు. అందులో అక్షరాలు యెత్తి వ్రాసిన తాబలకా ఆతాబులో(?) యున్న వర్తమానం, గీర్వాణ పదాలు, వర్ణాలు నాకు తోచినంత యెత్తి వ్రాసిన కలము.

ప్రౌఢ దేవరాయలకు పూర్వము ఆశ్రితుడు తిమ్మానిధానులు అనే వారికి గోపిపల్లె అనే గ్రామము, శ్రోత్రియం అనే అళయ కలము. ప్రతాప దేవరాయల తట్టున నూగూరు అనే ఆయనకు మల్లయ అనే ఆయన మనవి చేసికొన్నది. నేను కుటుంబస్తుణ్ణి, అన్నపానాదులకు చాలదు, అని మనవి చేసికోగా ఆయన ప్రతాపదేవరాయలతో మనవి చేసిన శ్రోత్రియంలో ఖండస్థితి భూమి మల్లయ్యకు యిచ్చినట్టు కలము.

ఆశ్రోత్రియుడు దేవరాయలువారితో మనివిచేసినది పూర్వందానం వాక్యం చేసి మల్లయ్య అనేవానికి ఖండస్థితి జీవనం యిస్తిరి. నా జీవనము చాలదు. అని మనివి చేసినట్టు కలము : అందుకు వారు సెలవు యిచ్చినది. మా యేలుబడి ఆవుల దొడ్డి స్థళం, పులిఅడుగుల స్థలం, అనేది యిఘు(క)యుక్తమైన స్థలాలు యిమ్మనిన కలము.

ఆశ్రోత్రియదారుడు సమ్మతము అయి ఒకరికి ఒకరు యిమ్మని పిలుచుకవచ్చి ఉభయత్రులు సెలవు(?) తీసుకవచ్చినది అనే కలము.

నాగయ అనే ఆయన యఱ్ఱయదాసరి అనే ఆయన ప్రత్యేకంగా నున్న పేర్ల కలము.

వీరు యిద్దరు గ్రామం పాలన చేసుక, గ్రామం ఆయకట్టు యేర్పరచుక, ఆయన నిర్దేశంచేసి శిలా శాసనం వేయించి, పులిఅడుగు స్థలంలో పశ్చిమం గట్టున మద్దిమాను మొదట వేసినది. అనేకలము.

ఊరికి తూర్పు తిమ్మానాయనిపేట చెరువుకు ఉత్తరం, గుట్టసారువకు దక్షిణం గురుతురాయి యున్నదనే కలము. ఈ ప్రకారము నాకు తోచిన నకలు యేర్పరచి వొత్తి వ్రాసినది. ఇక అందులో వున్నవర్ణాలు ఆశయం నాకు తెలియదు. నాకు పోలిక తోచిన గురుతుకలాలు వొత్తి వ్రాసినాను. అసలు యేమియున్నది పెద్దలైన వారు చూచి ఆశయంచేసి ఉద్ధారం చేయవలెను. నాకు తోచినది యిక యేమియున్నదో తెలిసినదికాదు. ఆ శాసనములోను శ్రీ విరూపాక్ష అని దస్కతు ఉన్నది, పూర్ణ ఆశయం లేదు. అక్కడక్కడ వెతకి కొంచెం నకలు వ్రాసినది పెద్దలైనవారు చూచి ఉద్ధారం చేయవలయును, ఇందులకు అసలు శాసనము ఉన్నది స్థిరము.

మవుజే నందిపాటి గ్రామములో శాసనములు

చెన్నకేశవుల దేవాలయము యెదుట గరుడస్తంభము అరుగున రాతికి శాసనము.*

౧. దీనికి పశ్చిమం శాసనం రాయి:

౨. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౪౯ అగునేటి......శ్రీమన్మహామండలేశ్వర బుక్కరాజు తిమ్మయ్యదేవమహారాయలుగారు,......మాకు రాయలు పాలించిన అవుకు సీమకు చెల్లేనందిపాటిగ్రామములోను కేశవనాథ పెరుమాళ్ళనగరు కొత్తగా కట్టేటందుకు, మీకు దసమందము చేను, కేశవనాయనిపల్లె చెరువుకు పడమర ఖం౧౪ బీడు దండు చెరువు చలివెందల తూర్పు కుంటవద్ద ౧౧ ఆ పడమర కుంట వెనుక ౧౧ ఉభయం వరిమడి ౧౨ ఉభయం వరిమడి ౧౨ అక్షరాలా చేనుమడి ఉభయం ఖం౧౪ ౨ మీకు సర్వమాన్యము

---

* See Gaṇḍıkōṭa - durgam Kaıfiyat, p. 36.

యిస్తిమి. మీా పుత్రపౌత్ర పారంపర్యముగాను, ఆచంద్రార్కస్థాయి గాను, అనుభవించి బ్రతికేది. ఇందుకు యెవరు తప్పినాను, తమతల్లి దండ్రులను, వారణాసిలో వధించిన పాపమున బోవువారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

3. దీనికి పశ్చిమమున పాతిన నల్లరాయి శాసనము :

శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు, ౧౪౬౬ అగునేటి క్రోధినామ సంవత్సర కార్తీక బహుళ ౧౨ లు శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప, శ్రీసదాశివదేవ మహారాయలు, విజయనగరమందు, వజ్రసింహాసనాసీనులై పృథ్వీ సామ్రాజ్యంబు యేలుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయ గోత్రపవిత్రులైన, సోమవంశాధీశ్వరులైన ఆరవీటి బుక్కరాజం గారి ప్రపౌత్రులైన రామరాజుగారి పౌత్రులున్ను తిమ్మరాజు గారి పుత్రులయిన చినతిమ్మయదేవమహారాజులుంగారు చండికాదేవి వర ప్రసాదులైన భట్టు గిరినాథుని పౌత్రులు, భట్టు రామరాజు పుత్రులు, భట్టు రామరాజు హనుమరాజుంగారికి యిచ్చిన ధర్మశాసనము ; మానా యంకరానకు చెల్లే అవుకు సీమలో నందిపాటిగ్రామము, సదాశివదేవ మహారాయుల ఆనతిని మీాకు భట్టుఅగ్రహారముగాను, ధారబోసి యిస్తిమి. త్రివాచకముగాను సర్వమాన్యము చేసి యిస్తిమి. మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను, ఆచంద్రార్కస్థాయిగాను, నందిపాటి గ్రామము సర్వమాన్యముగాను అనుభవించేది. ఇందుకు యెవరు తప్పి నాను, మానము లేనివారు.

శ్లో॥ స్వదత్తాం పరదత్తాంవా। యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సాహస్రాణి। విష్టాయాం జాయతేక్రిమిః ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

దీనికి ఉత్తరమున పాతిన నల్లరాయి శాసనము:

౮. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౭౯ అగు నేటి పింగళనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ ౧౧ లు శ్రీమన్మహారాజాధిరాజరాజపరమేశ్వర, శ్రీ వీరప్రతాప, శ్రీవీరసదాశివదేవరాయ మహారాయలుంగారు విజయనగరమునందు, వజ్రసింహాసనారూఢులై పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను, శ్రీమన్మహామండలేశ్వర రామ రాజు తిరుమల రాజయ్యదేవ మహారాజులుంగారు అవుకు సీమలో నందిపాటి మంగల బసవోజుకు యిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను: శ్రీ సదాశివదేవమహారాయలుగారు, విజయనగరమునందు, మంగల నందిపాటి బసవోజుకు రాయసంస్థానానకు చెల్లే అవుకుసీమలోనున్న నంది పాటి మంగలవోజరికానకు పన్ను వెట్టివేములు, ఆమ వెచ్చము, దొమ్మరి పన్ను, సిద్దాయం సర్యమాన్యము యిచ్చినందున మేము సర్వమాన్యము గాను యిస్తిమి. ఆచంద్రార్కస్థాయిగా యిస్తిమి, ఇందుకు యెవరు తప్పి కొన్నాను, తల్లిదండ్రుల వారణాసిలో కుతికెలుకోసిన పాపమున బోవు దురు, శునకమాంసము, సుర సేవించిన పాపమునబోదురు.

మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీం జేయును.

దీనికి దక్షిణమున బావివద్దపాతిన యెర్రరాయి శాసనము:

౫. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౬౫౫ అగునేటి నళనామసంవత్సర వైశాఖ శుద్ధ ౫ ల సర్కా నందిపాటిలో జడ్డు బుచ్చన కట్టించిన భావి: శ్రీశ్రీ..................

మవుజే కోటపాటి గ్రామమున నుండే శిలా శాసనములు:

వీధిలో సావడి దగ్గర అరుగుపైన పాతిన శాసనము:

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౪౬౬ అగునేటి క్రోధినామ సంవత్సర, కార్తీక శుద్ధ ౧౨ లు శ్రీమన్మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివ దేవ మహారాయలు విద్యానగరమునందు వజ్రసింహాసనారూఢులై

పృధివిసామ్రాజ్యం చేయుచుండగాను, శ్రీ మన్మహామండలేశ్వర, సోమ వంశాధీశ్వరులైన, ఆత్రేయగోత్ర పవిత్రులైన, ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రులును, రామరాజుగారి పౌత్రులును, తిమ్మరాజుగారి పుత్రులును, చినతిమ్మయ దేవమహారాజులుంగారు, యజన యాజన అధ్యయన, అధ్యాపక, దాన, దానప్రతిగ్రహ షట్కర్మనిరతులైన కోటపాటి కేసినేని పల్లె స్థితాశేషవిద్వన్మహాజనాలకున్నూ యిచ్చిన ధర్మశాసనము :—

మా నాయంకరానకు చెల్లె అవుకుసీమలోని కోటపాటి కేసినేని పల్లె రెండు అగ్రహారాలనున్ను, మీాకు నగరికి పెట్టే, శ్రోత్రియ కట్నము, కానికె, వెట్టివేములు, సర్వమున్ను సదాశివరాయల ఆనతిని సర్వ మాన్యము చేస్తిమి. సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను ధార వోస్తిమి. త్రివాచకముగాను ధారవోస్తిమి. గాన మీా పుత్రపౌత్రపారం పర్యముగాను, ఆచంద్రార్కస్థాయిగాను, మీా కోటపాటి కేసినేనిపల్లె ఈ రెంకు అగ్రహారములున్ను సర్వమాన్యముగా అనుభవించవలయును. ఇందుకు యెవరు తప్పినాను, మానములేని వారు.

శ్లో॥ ఏకైవ భగినీలోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా ॥

---

# పెదదండ్లూరు శాసనము*

పెదదండ్లూరులో యుండే కుమ్మరసెట్టి పల్లె వెంకటపతిగాని దగ్గిర వున్న తామ్రశాసనము నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౪౩౬ అగునేటి చాంద్రమాన జయనామ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ లు. శ్రీ మన్మహారాజాధిరాజ రాజ శ్రీమండలేశ్వరులైన సకల ధర్మప్రతిపాలకులైన శ్రీమద్యజన, యాజన, అధ్యయన, అధ్యాపక, దాన, దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన చౌడూరి తిరుమల సోమయాజులవారికి, చిక్క ఒడయలు, శ్రీ విరూపాక్షేశ్వరుని దేవాలయంలో ఆవనూరి అనంత శాస్త్రులతో ప్రసంగంజేసి జయించిరి గనుక యిందుకు బహుమానం యిచ్చిన గ్రామాదుల వివరము. ౧ అక్కమాంబాపురము, ౧ పలుగుపాడు, ౧ చాముండీశ్వరీపురము వెరసి గ్రామములు ౩ అంతు మూడు గ్రామములున్ను యేక భోగంగా యిస్తిమి గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యంతం ఆ చంద్రార్కస్థాయిగా అనుభవించవలసినది. చాముండేశ్వరీ పురానికి ప్రతినామధేయమైనటువంటి చౌడూరికి ఖ ౮౨ భూమికి ౩ తట్లు పొలిమేరలు యేర్పరచినారు.

* * *

కంచనపల్లి రామన్న సీనప్పగార్ల దగ్గరనున్న దేవరగుడి అగ్రహారం మాన్యం దానపత్రం. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౭౩ అగునేటి నందన సంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ లు శ్రీ మద్యజన, యాజన షట్కర్మ నిరతులైన భాస్కరభట్ల కుమారుడు సోమయాజులవారికి దేవరగుడి రెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన అగ్రహార భూదాన ధర్మశాసన పత్రికె॥ మా గ్రామములోను అగ్రహారం చేస్తున్నామనిరి గనుక అదేప్రకారం మా యిష్టదేవతస్వామికి ప్రీతిగాను యీ తథాతిథి (పుణ్య) కాలమందు స్థళనిర్దేశం చేసిన వివరం -

---

* M. Vol. 254 fol. 79b to 81a; L.R. 37 p. 355,

మొల్లప్ప - చేను స్థళం ఖ॥ ౧౫౮ మడి సుకమంచిపల్లె పొలిమేర హద్దు చేన్కు మడి ఖ॥ ౦।।౨ వుభయం చేనుమడి ఖ॥ ౧।।౧ అక్షరాలా పుట్టి పదహారుడుం సీరారంభం కాడారంభాలు సహిరణ్యోదక దాన పూర్వకముగాను ఇచ్చినాము గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యం ఆ చంద్రార్క స్థాయిగాను అనుభవించేది. మీా మనస్సు వచ్చిన వారికి అగ్రహార వృత్తులు చేసుక సర్వమాన్యంగా అనుభవించుకొనేది.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

చదిపిరాళ్ల పెద్దిరెడ్డిగారి జప్పరెడ్డి, లింగారెడ్డి వారి కోదండ రామరెడ్డి, బోడ్రెడ్డిగారి దత్తారెడ్డి వీరల సమ్మతిన కరణం జోగిరాజు వ్రాసిన భూదాన ధర్మశాసన పత్రికె॥ శివరాముని వ్రాలు. సూరన్న కొమారుడు కోదండరామయ్య వ్రాలు, బోడ్రెడ్డిగారి దత్తారెడ్డి వ్రాలు॥

# సిద్ధవటం శిలాశాసనములు.

(కడప తుకిడి సిద్ధవటం తాలూకు కొన్ని గ్రామములలో వుండే శిలా శాసనముల)

సిద్ధవటం తాలూకాలో ఉండే శాసనాలు : కసుబా సిద్ధవటంలో వుండే కోటలో సిద్ధేశ్వరుని పాడు దేవాలయంలో పలక రాతికి శాసనం.

౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౬౦౭ అగునేటి క్రోధన సంవత్సర ఫాల్గుణ శుద్ధ ౧౫ లు శ్రీ సిద్ధేశ్వర స్వామికి కామాక్షమ్మకు నలమూరు బుచ్చిరెగాడ్డిరు నిరంతరం సేవ.

స్వస్తిశ్రీ శాలివాహనశక వరుషంబులు ౧౬౦౭ అగునేటి అక్షయ సంవత్సర మాఘ ౧౫ లు శ్రీ సిద్ధేశ్వర స్వామికి కామాక్షమ్మకు కలువాయి అక్కిరెడ్డి గంగిరెడ్డి రామిరెడ్డిగారు నిరంతర సేవ.

శ్రీ సాంబశివునికి కామాక్షమ్మకు నలమూరు కృష్ణమ్మ సదాసేవ, నిరంతర సేవ.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౬౦౬ అగునేటి క్రోధన సంవత్సర మాఘ బ॥ 30 లు శ్రీసిద్ధేశ్వరస్వామికి కామాక్షమ్మకు ఆదూరి రాచమరెడ్డి మల్లురెడ్డి మల్లుఅయ్య నిరంతర సేవ.

స్వస్తిశ్రీ పిజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౦౬ క్రోధన సంపత్సర మాఘ బ॥ 30 లు శ్రీ సిద్ధేశ్వరస్వామికి కామాక్షమ్మకు పాపిరెడ్డి ఆయన కొమారుడు నిరంతర సేవ.

౨. ఈ శాసనానికి పడమర గోపురం రాతికి పశ్చిమ ద్వారమందు ఉండే అరవ శాసనం.

౩. ఈ రాతికి పొందినట్టుగా ఉత్తరంగా నుండేది. ఇందులో నుండే శకం ౧౧౬౬ శాసనం అరవం. ఇక్కడ కొన్ని అక్షరాలు శిలథిం. గోపురానికి తూర్పుతట్టున గోపురంపైన ఉండే హాళెకన్నడ మిశ్రిత అక్షరముల శిథిల శాసనం.

౪. స్వస్తిశ్రీ శకవరుషంబులు...పుష్య సంక్రాంతి నిమిత్తం స్వస్తిశ్రీ త్రిభువన చక్రవర్తి వీరరాజా ప్రలోథప వీరవిజయ(?) మెరపాక నాడు పొత్తపినాడు స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాంచీపురమందు కప్పముగొని మలుమల్లు దేవుని అలిమల్లు దేవుని గెలిచి పడమటను తుంగభద్రాయలికను చెల్లే కులోత్తుంగ [రాజేంద్ర చోళునకు కొట్టి నల్ల సిద్ధప్ప సోదరుడు సిద్ధప్ప పుత్రుడగు మధురాంతక పొత్తపి చోళ... గజసాహిణి రాజేంద్రచోళ] అంబల్లయతే మధురాంతక పొత్తపి చోళ గెల్లసి సమస్త(సే)నాధిపతి, తంత్రపాల పెత్తి నాయకుండు...చోడ మండల...ఇక్కడ అక్షరాలు అగుపడలేదు.

౫. ఈ దేవాలయానకు నైరుతి కోట అలంగంలో బిసిమిల్లా సాహెబు గుమ్మటం పైన వుండే * శాసనం పార్సీ గుంబజు కట్టినది సన్న ౧౧౮౬ హాజిరి.

(చూడుడు అనుబంధము పార్సిశాసనములు 1)

౬. కోట తూర్పు ద్వారానకు వెలుపలి కోట గోడకు ఉండే పగిలిన శాసనం.

స్వస్తి, శాకేఽశ్వాంబక బాణ భూ పరిమితే వర్షేచ విశ్వావసా
వాన్నత్యేనచిరాయుషాచ గుణభాజాచంద్ర తారం భువి।
యస్యానంతనృపేణ తేన జనకే నై వోటుకూరీరణే
ప్రాప్త స్సిద్ధవటోయ ముజ్వల శిలాశాలోవిశాలః కృతః॥

సీ॥ శాలివాహన నామ శకవరుషములు వేయు
నేనూట యిరువదియేడు చనిన
విశ్వావసు వసంగ వెలయు వత్సరమున
సకల హిందూ రాజ్య సార్వభౌమ
వీరవెంకటరాయ విభుండు చంద్రగిరీంద్ర
సీమ సామ్రాజ్యంబు చేయునపుడు
భానువంశాంభోజభాను డంభోరాశి
గంభీరు డైవరగండ మూర్తి ॥ ౧ ॥

బిరుద సామజసింహ భీమకేతన భర్త
దేవచోడాన్వయ భూ విభుండు
రణ భూబలీభూతరావెల వెలికొండ
వెంకటాద్రి మహీశవీరవరుండు
జంబులమడక భూ సంగ్రామ జయశాలి
కటకపురీచూర కార హారి
నందెల కృష్ణమ నరనాథ భయదాన
దత్త దోర్దండ విచక్షణుండు ॥ ౨

అఖిల కర్ణాట సింహాసనాధీశ్వర
దక్షిణబాహాభిధానధారి
విదళిత కొండ్రాజు వెంకటాద్రి విభుండు
చెన్నూరి హరణ సంపన్నగృహుండు
విబుధ స్తుత కకుస్థవిజయ ప్రబంధాది
కావ్య నిబంధన గ్రంథకర్త
శ్రీ మదెల్లమరాజు చెరువు తటాక సం
ఘటనాను భావసం ఘటిత యశుడు ॥ 3 ॥

ద్రవిడ భూ మధురాది ధాటీ చలద్రయు
బలరక్షణాక్షీణ బాహుబలుండు
పెనుగొండసమర యూవనపాదుశాగర్వ
ఖర్వీకరణ చణా ఖర్వభుజుండు
రంగమాంబాకుమారవతంస రత్నంబు
పరభీమబిరుదుల బాయిబంది
వినుతావనీశ్వర వేశ్యాభుజంగుండు
బల్లర గండాంక భాసురుండు. ॥ ౪ ॥

మన్నెహంవీరుండు మగలరాయండు రాచ
బెబ్బులి పరరాజభీకరుండు
మట్ల తిర్వేంగళ మానవాధిపరత్న
రత్నాకరు డనంతరాజశౌరి
తమ తండ్రి యెల్లభూ రమణుండు కొండ్రాజు
తిరుపతి రాజుపై బెరిగి కొట్టి
తన కత్తి మొన దెచ్చుకొనిన సిద్ధవటంబు
చెలమ పట్టున పెద్ద చెరువుజేసి. ॥ ౫ ॥

హృదయముప్పొంగ సిద్ధవ టేశ్వరునకు
ఔపచారికమైన సాలాంతరముగ
పురముచుట్టును వరణమై పరిణమింప
ధాత్రి గట్టించె నా చంద్ర తారకముగ ॥ శ్రీ ॥

ఈ శాసనానికి తూర్పు కందకం అంచున వుండే రాతికి వుండే శాసనం పగిలి వున్నది.

సూర్యుడు – త్రిశూలం – వృషభం – దీపస్తంభము – అర్ధచంద్రుడు

౭. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౯౬౭ అగు విరోధికృతునామ సంవత్సర మాఘ శు ౫ బుధవారం। సు ॥ప॥ యిసని సభైన అలపుచ మాహింసవాలు రపాయు తన మాలిపంన్తా సులుతాను అలి పగుహా కెయు సిద్ధవటముగారి సము ఖాన రయారివ ...... వ బాజె కసు బే మజుకూరు యి ...... అర్జు చేసుకొన్న వివరం। తమాము కలమరువులో లేని ఆకుల గుత్త యీ స్త లాన నడుస్తున్నది। ఇవి నిమిత్తముతో బరంజిమ చేత రైతులు చాలాగా బురా అవుతున్నారు। ఆ గుత్త పైకం గ్రామంమీాద పంచి వేసుక యిచ్చేము। అని తెలుపు కోంగా ఆలాగే మనస్సుకు తెచ్చుకుని ఆ ఆకుల గుత్తి పైకము కసుబా రైతుల మీాద పంచివేసినారం యిందుకు యెవ్వరు తప్పి నడిపించినా రాజుగారి పాదాల తోడు. అని శాసనం వ్రాయించిరి.

ఈ శాసనానకు తూర్పు కోటకు వెలుపల హాలీముఖాను తయ్యారు జేసి జీర్ణోద్ధారం చేయించిన మసీదు వద్ద శిథిలమై ఉండే శాసనం.

౮. శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౫౭౧ అగునేటి ప్రమాది సంవత్సరమాఖ శు ౧౫ లు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప [వీరవేంకటపతి దేవమహా]రాయలు సింహాసనస్థుడై పృథివీరాజ్యము చేయుచుండ గాను......ఆచంద్రార్క తారంగాను నడిచేలాగున ఇచ్చిన మాన్య ధర్మశాసనం। యీ ధర్మానకు యెవ్వరు అన్యాయముగా నడిచినా గంగ కర్తను గోహత్య బ్రాహ్మణులను వధించ్చిన పాపాన పోదురు. పాపానకు లోనై తప్పిరా వారిబిడ...అని యిచ్చిన ధర్మశాసనం.

ఇందుకు తూర్పున మసీదులో యీ హాలీంఖాను జీర్ణోద్ధారం చేయించిన సేఖు ఆలి కట్టించిన మసీదులో వున్న పార్శీశాసనం.

సన్న హాలీమఖాను జీర్ణోద్ధారం చేసిన సన్న ౧౧౮౧ హిజిరి.

(చూ. అనుబం. పార్సిశాసనములు 2)

౧౦. ఇందుకు ఉత్తరం ఆశార శరిఫ అనేది హాలిమఖాను అవ్వ కరిసాబ బీబీ జీర్ణోద్ధారం చేయించిన శాసనం వుండేది పోయెనుగాని సన్న అసా(?)రులో వుండే అబదులర(?) అన్న కుమారుడు అబ్దుల్ రహిమాను చెప్పిన సన్న ౧౧౫౫ హిజిరి.

ఇందుకు తూర్పున పేటలో నవాయతుపురంలో హాలీంఖాను దివాన్ గయాసాహెబు మసీదులో వుండే పార్శీ సన్న ౧౧౭౪ హిజిరీలో మసీదు కట్టించినది. ఇది శిలపైన వ్రాయలేదుగాని ఆ మసీదులో సదరు యిండ్లు గట్టించిన గయాసాహెబు దివాన్‌గారి అన్న కుమారుడు మునవరుసాహెబు వద్దవున్న కాకితం నకలు.

(చూ. అనుబం. పార్సిశాసనములు 3)

౧౧. కోటకు తూర్పున దర్వాజా యెదురుగా అవరంగజీబు యొక్క దరోగా సయ్యెదు మహమ్మదు కట్టించిన మశీదు సన్న ౧౧౧౩ హిజరి. పార్శీ శాసనం.

(చూ. అనుబం. పార్సిశాసనములు 4)

౧౨. కోటకు పడమర దరవేశ మహమ్మదు కాదరి మశీదులో వుండే పార్శీ సన్న ౧౧౧౪ హిజిరి.

(చూ. అనుబం పార్సిశాసనములు 5)

మ॥ జ్యోతి యిలాకే శిద్ధవటం: సదరహు గ్రామానికి ఉత్తరం గ్రామం వెలుపలవున్న సిద్దేశ్వరుని దేవాలయం ప్రాకారం లోతట్టున నిల్చివున్న నిలివెడుపొడవు రాయిమీద శాసనం.*

---

* See S.I.I., X No. 312 A. R. No. 563 of 1915.

౧౩. శ్రీస్వస్తి సమస్త ప్రశస్తి హితం శ్రీమనుమహామండలేశ్వరం త్రైలోక్యమల్ల భుజబళ వీరనారాయణ అవుమ్బరాభరణ కలుకడపురాధీశ్వర అష్టమహాసిద్ధి సిద్ధదేవ(వట) దేవర దివ్యశ్రీపాదారాధకులైన రాయదేవ మహారాజుల నిజభృత్యుండైన స్వస్తి సమస్తలోక సంస్తుత్య విభవామరేంద్ర అభిమానశూద్రక విబుధజనమిత్ర వశిష్ఠ(మన్మ)కుల గోత్ర త్యాగసముద్ర ఆశ్రితజనపారిజాత కామినీజనజయంత తురగరేవంత సజ్జనాధార పరనారీదూర స్వామిద్రోహరగండ గడియంకభీమ కోదండపరశురామ రణరంగభైరవ కారుణ్యసాగర యేకాంగవీర పాపజనదూర వైరినాయకగోత్ర[ని]కు[త్రి]వజ్రభుజదండ చలమెత్తుగండ రిపునాయకశిరఃఖండన దాయసంహార మండలికజగదాళ రాయభూపాలు దక్షిణభుజాదండ తరనుకుకర (సితరనంకుకర)గండ జ్యోతినాథుని దివ్యశ్రీపాదారాధకులైన జంతిరామినాయకుండు తన్నేలిన తకసగంగరస దేవమహారాజులు పృథివీ రాజ్యం చేయుచున్న నాటి శకవరషంబులు ౧౧౬౯ అగు నేటి ప్లవంగ సంవత్సరమున పుష్య శుద్ధ త్రయోదశి వడవారమునాడు * జ్యోతినాథుని గుడి గోపురము కట్టించె [తికప్రోలు నిరుగలసాని గుడీగట్టించె బేటూర రెండు చెఱువులు త్రవ్వించె గుడి గటించె అగ్రహారము విడిచె.]

మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ.

దేవాలయమండపములో నేలపరుపు రాతికి ఉన్న శాసనం.

తారణ సంవత్సర శ్రావణ శుద్ధ ౧౧ సోమవారంనాడు కందెపు కొండప్ప కుమారుడు వీరప్ప సిద్ధేశ్వరస్వామికి సదాశేవ.

ఈ దేవాలయమునకు పశ్చిమభాగమున పినాకిని నది ఒడ్డున కట్టిన ఆలేరు కట్టుకు ఉన్న సోపానాల మీాది శాసనములు.

రాయసం కొండమరసయ్య కట్టించిన ఆలేరు.

అని వ్రాసినవి ఆరు శాసనములు వున్నవి.

* S. I. I., X. No. 312 Saturday, 12 May A.D. 1247.

౧౫. మ॥ మాచుపల్లె యిలాకే సిద్ధవటం సదరహా గ్రామాలలో ఎల్లమ్మ దేవాలయం మొదటనున్న శిథిలమైన శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౪౩ అగు నేటి విషు సంవత్సర......మాచుపల్లి యేక వీరా పరమేశ్వరికి శ్రీకృష్ణదేవ మహారాయలు పృథివిరాజ్యము సేయుచున్నండగాను శ్రీ...తిమ్మరసయ్యంగారి కుమారుడు......శ్రీకృష్ణదేవ మహారాయలు మానాయంకరానకు పాలించిన సిద్ధవటం సీమలోను... మాచుపల్లె కృష్ణదేవమహారాయులకున్ను తమ తండ్రి తిమ్మరసయ్యంగారి కిన్ని పుణ్యంగాను సహిరణ్యోదక దానధారా పూర్వకముగా నిధినిక్షేప జలపాషాణ అక్షీణి ఆగామి సిద్ధసాధ్య అష్టభోగ తేజ స్వామ్యంగాను ఆ గ్రామముకు చెల్లేపొలిమేరలోనైన సీమ షోడశోపచారములకున్ను... ...స్థళసుంకంపల్ల.. సహితంగాను ధారపోసి యిస్తిమి...మాచుపల్లె యేక వీరా పరమేశ్వరి నై వేద్యాది షోడశోపచార పూజలవధరించును. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను...పాపానబోవువారు. తమ తల్లితండ్రిని వారణాశిలో వధించిన పాపాన బోవుదురు.

శ్లో॥ స్వదత్తాం పరదత్తాంవా యొహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

ఇందు క్రింద మజరావు(బు) క్కాయపల్లెకు పశ్చిమాన జొన్న చేలో నున్న శాసనం.

సూర్యుడు – చంద్రుడు

శుభమస్తు। ప్రమాది సంవత్సర ఆషాఢ శు॥ ౧౧, శ్రీమన్మహామండలేశ్వర గుమ్మడూరి అవుబళయ్యదేవ మహారాజులుంగారు కడప శ్రీపతి కొండసానికి యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను, మాకు గురవరాజు చినసంగమరాజుగారు ఉమ్మళికి పాలించిన సిద్ధవటం సీమలోని మాచుపల్లెగ్రామాన కడప తిరువెంకటనాథుని సేవకు దాసివైన నిమిత్తము నీకు నేము మాన్యము బెట్టిన చేను బండ్లమ్మకుంట స్థళానకు ఉత్తరం గంగుల పుల్లయగుడి స్థళం చేను ౧౧౩ ముంతేల చేను యిస్తిమి. మీ పుత్రపౌత్ర పారంపర్యముగాను కడప తిరువెంగళనాథుని సేవచేసి అనుభవించేది. ఇందుకు యెవ్వరు తప్పినాను గంగకడను గోబ్రాహ్మణ్ణి వధియించిన పాపాన బోవుదురు।

ఈ గ్రామంలోకి అడకమైన దక్షిణభాగమందు పావు పరుగు దూరాన గుండ్లపాటి గ్రామ నెత్తంవద్ద భావికి పశ్చిమాన నున్న శాసనం. అరవంతో వ్రాసి వున్న శాసనం

తక్కువోలు మ॥ యిలాకే సిద్ధవటము. సదరహుగ్రామంపైకి మజరా భాజిపల్లెకు ఉత్తర భాగమందు చెన్న కేశవస్వామి దేవాలయం యెదుట పాతియున్న రాయిమీది శాసనం నకలు.

స్వస్తిశ్రీమతుకీలక సంవత్సర (A.D, 1248)...అవుదుంబరాభరణ క్షత్రియ ప్రవిత్ర అష్టమహాసిద్ధి సిద్ధదేవర దివ్య శ్రీపాదపద్మారాధకుం డైన తక్కస గంగయదేవ మహారాజులు స్వస్తి సమస్తలోక సంస్తుత్య విభవామరేంద్ర అభిమాన శూద్రక......మంగళమహా...

ఈ రాతికి రెండో పార్శ్వమునను

లక్షయాతారు(ధ్యాయి) సంతానము వారాణసి విద్యాశివుని బ్రహ్మేశ్వర దేవునికి అత్యపనాయుడు తమ మామ జంతి రామినాయనికి పుణ్యంగాను జోతిదేవరకు మంత్ర పుష్పము బెట్టను చేను మల్లయ...... దేవరసవే ముసకము(?)...

ఈ రాతికి మూడో పార్శ్వ మందు -

శ్రీ శ్రీ శక వరుషంబులు ౧౧౭౦..

గర్భగుడికి దక్షిణపు వైపు గోడకు వెలపటి శాసనము.

నందననామ సంవత్సర ఆషాఢ బ 30 కడప రామానుజ కూటానకు తక్కవోలి గ్రామకట్నమును, తావరాలున్న కొత్తిమక్కవీరమరాజు తిమ్మయ్య ఆచంద్రార్కముగా ధార బోశి యిచ్చెను. ఇందుకు తప్పిన వారు గో బ్రాహ్మని చంపిన పాపాన బోవువారు.

ఇక్కడికి ఉత్తరం వైపున ఒక శాసనం అరవం తెనుగు నాగరం లిపులలో నున్నది. రాయి పగిలి అక్షరములు ఖిలమై పోయియున్నది.

మ॥ కడపయ పల్లె యిలాకే సిద్ధవటం సదరహు గ్రామాన పొలములో నున్న శాసనం నకలు.

స్వస్తిశ్రీ శక వరుషంబులు ౧౨౨౮ అగు నేటి క్రోధి సంవత్సర మాఘ శు ౧ లు స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర......బ్రహ్మరాక్షస గంగరాజు (గండపెండేర ?) తిరుపతి (త్రిపురారి ?) దేవమహారాజులు... పామూరి పట్టణం రాజధాని చేసుకుని సుకసంకథా వినోదంబున పృథివీ రాజ్యంచేయుచుండి తమకు ఆయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధిగాను స్వస్తిశ్రీ శ్వేత చెన్నమల్లికార్జున దివ్యశ్రీపాదపద్మారాధకులైన స్వస్తిశ్రీ...

ఇక్కడ అక్షరములు శిథిలమైనవి.

మ. పొన్నోలు యిలాకే సిద్ధవటం సదరహు గ్రామం వెలుపట పశ్చిమాన బావికి వేసిన రాయి మీాది శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౬౬3 అగు నేటి ఖర సంవత్సర కార్తిక బ ౧౦ లు శ్రీమతు అఖిలాండ కోటి బ్రహ్మండనాయకునికి అర్పితంగాను కల్లెపల్లె నిమ్మకాయల అమ్మారెడ్డి కుమారుడు నల్లప్పరెడ్డి పొన్నపొలములోచేయించిన శిలాకూపం.

ఈ గ్రామానికి ఉత్తరం అర పరుగు దూరాన చరికొండ దగ్గిర కపిలబావివద్ద ఉన్న శాసనం.

విజయ సంవత్సర వైశాఖ శు 3 లు శ్రీ మన్మహామండలేశ్వర రవి రాజు సూరయ దేవ మహారాజుల కుమారుడు రంగరాజుంగారు సెట్టి పల్లె త్రిపురాంతక దేవునికి యిచ్చిన దాన పత్రం. మాకు సలక రాజు తిరుమలరాజుగారు నాయంకరానకు పాలించిన సిద్ధవటం సీమలోనికి చెల్లే తక్కవోలను త్రిపురాంతక దేవుని నైవేద్యాలకు తక్కవోలి పొలానను పోలెపల్లి కృష్ణమరాజువారి యిస్తువపై యేరు పడమర ౧౨ ఇద్దుము చేనున్న అక్షత...పుణ్యకాలమందు? ధారబోసి యిస్తిమి. ఇందుకు యెవ్వరు తప్పినాను గంగకడను గోబ్రాహ్మణుణ్ణి వధియించిన పాపాన బోవువారు.

శ్లో॥ స్వదత్తాద్ద్విగుణం పుణ్యం। పరదత్తాను పాలనం॥
పరదత్తాపహారేణ। స్వదత్తం నిష్ఫలంభవేత్॥

మవుజే పొన్నతోట తాలూకు మజరా చలమారెడ్డి పల్లె వూళ్లో బావి దగ్గరి శాసనం.

కామరసు తిమ్మరసయ్యంగారు పొన్నవోలను చెర్వు కట్టించి నందుకున్న ఇష్టకామేశ్వర భైరవేశ్వర స్థానంవారు పిట్టయెత్తుమాన్యానకుంగాను కామరసు తిమ్మరసయ్యంగారికి పెట్టిన మడి ఖ 3 మూడు పుట్లుమడి.

మవుజే ఒంటిమిట్ట తాలూకే సిద్ధవటం సదరహు గ్రామములో కోదండరామస్వామి గుడిలోను వుండే శిలాశాసనాలు. దేవునకు తూర్పున మహాద్వారం గాలిగోపురానకు లోతట్టున నుండేది.

సూర్యుడు – చక్రం – తెంగలనామము – శంఖము – అర్ధచంద్రుడు

శుభమస్తు॥ శ్రీరామచంద్రాయనమః। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సంవత్సర ఆషాఢ శు. ౧౨ సో. శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివ దేవ మహారాయులు విద్యానగర

మందు రత్నసింహాసనారూఢుడై పృథివీ సామ్రాజ్యము చేయుచుండ గాను శ్రీ మన్మహామండలేశ్వర పాండవకులధుర్య కల్యాణరాజ్యస్థాపనా చార్య, హరొాసబిరుదరగండ, గండరగూళి, (గండ)భేరుండ మన్యవిభా ళాది మహాబిరుదాంక అభినవసాహసాంక సత్యభాషావ్రతపరాయణ చాళుక్య నారాయణులైన ఆత్రేయగోత్ర పవిత్రులైన సోమవంశా ధీశ్వరులైన ఆరవేటిరామరాజు పౌత్రులైన శ్రీరంగరాజు పుత్రులైన రామరాజయ్య, గుత్తిఏటి తిరుమలరాజయ్య దేవమహారాజులు సదాశివ దేవమహారాయలకు దక్షిణభుజాదండులై తమ అల్లుండు కాస్యపగోత్ర సూర్యవంశాధీశ్వరుండైన మద్రాజు పౌత్రుండైన ఓబళ్రాజు పుత్రుండైన నాగరాజయ్య దేవమహారాజులయ్యవారు ఉదయగిరి రాజ్యానకు లోనైన నాయంకరానకు చెల్లే సిద్ధవటం సీమలోని శ్రీ మద్దేవ దేవోత్తమ దేవతా సార్వభౌమ సకలలోక శరణ్య శరణాగత వజ్రపంజరుండైన దేవ వేశ్యాభుజంగుండైన జాంబవంత ప్రతిష్ఠితులైన శ్రీ ఒంటిమిట్ట రఘు నాయకులకు నిత్యకట్టబడి అమృత పళ్లకు అంగరంగవైభవాలకు గోపుర ప్రాకారాలకు తేరు తిరునాళ్ల మహోత్సవాలకున్నూ సదాశివదేవమహా రాయల ఆనతిని ఒంటిమెట్టుగ్రామమున్ను ఈ గ్రామానకు చెల్లే పల్లె లున్నూ చతుస్సీమకులోనైన పొలమున్నూ ప్రథమద్వాదశి పుణ్యకాల మందు సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను అష్టభోగ తేజ స్స్వామ్య సహితముగాను ఆచంద్రార్క స్థాయి అవునట్లుగాను ధారపోసి సమర్పించి యిచ్చిన శిలా ధర్మశాసనము. ఈ ధర్మానకు యెవ్వరు తప్పిన తప్పించినా గంగలోను బ్రాహ్మణులను తమ తల్లితండ్రాదులను వధియించిన పాపాన బోవుదురు.

శ్లో॥ దానపాలన యోర్మధ్యే। దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి। పాలనాదచ్చుతం పదం॥

స్వదత్తాం పరదత్తాంవా। యోహరేత వసుంధరా।
షష్ఠిర్వరుషస హస్రాణి। విష్టాయాం జాయతేక్రిమిః॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం। పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ। స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

సామాన్యోయం ధర్మసేతు నృపాణాం।
కాలే కాలేపాలనియ్యో భవద్భిః।
సర్వానే వాన్ భావినః పార్థివేంద్రాన్।
భూయోభూయోయాచ తే రామచంద్రః॥

ఈ శాసనానకు దక్షిణంగా ఉండే శాసనం.

చంద్రుడు – చక్రం – తెంగలనామం – శంఖం – సూర్యుడు

శుభమస్తు। శ్రీరామచంద్రాయనమః. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౩ అగునేటి ఆనందనామ సంవత్సరం శ్రావణ శు. ౧౨ లు శ్రీమన్మహా రాజాధిరాజరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులై పృథివిరాజ్యం చేయుచూనుండగాను శ్రీమన్మహా మండలేశ్వర అంతెంబరగండ ధరణీవరాహ సత్యవ్రత పరాయణ చాళుక్య నారాయణులైన ఆత్రేయసగోత్ర సోమవంశాధీశ్వరులైన అరవేటి రామరాజు పౌత్రులైన శ్రీరంగరాజు పుత్రులైన గుత్తి తిరుమలయ్య దేవమహారాజులుంగారు సదాశివ దేవమహారాయలకు దక్షిణ భుజాదండుండై ప్రధానికం చేయుచున్నతమ నాయంకరానకు చెల్లే ఉదయగిరి రాజ్యానకు లోనైన సిద్ధవటం సీమలోని సకల దేవతా సార్వభౌముండై సకలలోక కల్యాణుండైన జాంబవంత ప్రతిష్ఠితులైన ఒంటిమిట్ట శ్రీరఘునాయకులకు నిత్య కట్టడ అమృత పళ్లుకున్ను అంగరంగ వైభవాలకున్ను మాసోత్సవ పంచ పర్వాలకున్ను నేముధార పోసి యిచ్చిన పొత్త పినాటిలోని పులపుత్తూరు గ్రామమున్ను యిందుకు చెల్లే రేణు తల పల్లెనున్ను కంచిరాజయ శ్రీరాజు అయ్య ధారపోసి యిచ్చిన ఒంటిమిట్టలోని భోగి పల్లెను అంతు పల్లెలు ౩న్ను ఒంటి మిట్ట స్థళానను చెర్వుక్రింద చెల్లి వచ్చే మడి కు ౮౦-కి అర్చున వృత్తికు ౫౦– పోగా నిలిచిన మడికు ౩౦ లున్ను యీ పల్లెలు మూడున్ను, మడికిన్ని కలిసిన అష్టభోజ తేజ స్వామ్యములు సహితంగాను శ్రావణ శు ౧౨ పుణ్యకాలమందు సహిరణ్యోదక దాన ధారా పూర్వకంగాను ధార

పోసి సమర్పించినందుకు శ్రీవత్స గోత్రం ఆపస్తంబ సూత్రం యజు శ్శాఖాధ్యాయులైన కల్లూరి లింగరాజు తిమ్మయ్యకుమారుడు లింగ పంగారు ఆ చంద్రార్కస్థాయిగాను వేయించిన శిలాశాసనము. ఈ శిలా శాసన పద్ధతికి యెవ్వరు తప్పినడిచినాను గంగలోను బ్రాహ్మణ వధ చేసిన పాపాన బోవువారు కాశిలోను మాతృవధ చేసిన పాపాన బోవు వారు. గయలోను శునకమాంసం సేవించిన పాపాన బోవువారు.

శ్లో॥ దాన పాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥
స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం।
షష్టి ర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥
స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

శ్రీ శ్రీ శ్రీ

ఇందుకు దిగువ క్రొత్తగాను వ్రాసి యుండేది.

3. శ్రీరామ. స్వస్తిశ్రీ శాలివాహన శకం ౧౭౦౫ అగునేటి శోభకృతు సంవత్సర మార్గశిర శు ౧౨ లు శ్రీ కోదండరామస్వామి పాద పద్మముల సన్నిధికి అత్యంత ప్రియభక్తులు సగిలి పాయకట్టుకు కసుబా మల్లేనిపట్నం మాడుపూరు తాలూకా ౧౫ గ్రామా దులు రెడ్డి కరణాలు తమ మనసుపూరితంగా వ్రాయించి యిచ్చిన ధర్మశాసన పత్రిక క్రమం. తమరు తళిహె దీపారాధన కయిం కర్యానికిగా గ్రామం ౧కి నెల ౧కి ర్‌ ౬ లెక్కను నిష్కర్ష చేసుకుని సమ ర్పిస్తిమి గనుక మా పుత్ర పౌత్ర పార్యంతం నడిపించగలవారము. గ్రామం ౧కి సంవత్సరం ౧కి ర్‌ ౬ లెక్కను ఆ చంద్రార్కస్థాయిగా నడిపించగల వారం. ఇట్లని మా ధర్మము సాక్షిగా వ్రాసి యిచ్చిన శిలా అక్షరములు శాసనం. కరణాల సమ్మతిని పెకడ్రాజు చెంచు ఒప్పితము, త్రిపతిరాజు రామ క్రిష్టప్ప ఒప్పితము.

శ్లో॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం। పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ। స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

ఈ రక్షసమ్మతిని మాడపురి పెద్ద వీరారెడ్డి ఒప్పితం। చందువాయి మల్లారెడ్డి ఒప్పితం।

శ్లో॥ స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥
శ్రీరామార్పితం॥

ఈ శాసనానికి దక్షిణం గోపురంరాతికి ఉండే శాసనం.

౪. స్వస్తిశ్రీ శాలివాహన శక వరుషంబులు ౧౭౦౪ అగునేటి శుభకృతు సంవత్సర భాద్రపద శు ౧౫ లు శ్రీరామస్వామి సన్నిధికి ప్రియభక్తు (లైన) లు బోయిన పల్లె నరసయ్యగారిపుత్రులు పెద్ద నరసయ్య చిన్ననరసయ్యగారు సన్నిధి దీపారాధన కయింకర్యానకు గాను సంవత్సరానకు ౧౦ రూపాయలు వర్షాశనం సమర్పిస్తిమి. గనుక మా పుత్ర పౌత్ర పారంపర్యంతం నడిపించ గలవారము.

౫. శాసనానకు దక్షిణంగా ఉండే శాసనం.

శుభమస్తు. శ్రీరామ। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౦౫ అగునేటి శోభకృతు సంవత్సర మాఘ శు ౧౨ లు శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయిన కోదండ రామస్వామి దివ్య శ్రీపాదపద్మముల సన్నిధికి ప్రియభక్తులు సిద్ధవట సీమ కోటగ్రామాదులు ౧౨, పడమట గ్రామాలు ౬, దక్షిణ గ్రామాలు ౧౪, తూర్పు గ్రామాలు ౧౭, సకలి పాయకట్టు ౧౭, ఓబుళం పాయకట్టు ౧౪, పొత్తూరు పాయకట్టు ౭ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ తిథౌ - ఈ గ్రామ యజమానస్య గోత్రస్య నామధేయస్య - తస్య సహ కుటుంబస్య పుత్ర సభ్రాతృ సబాంధవ స ఆశ్రిత విద్వజ్జన క్షేమస్థైర్య విజయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృధ్యర్థం ఇష్ట కామ్యార్థ సిద్ధ్యర్థం షోడశోపచార పూజాం కరిష్యే ॥.

ఈ గోపురానకు ఉత్తరం ప్రాకారం లోతట్టు రాతిపైన వ్రాసి యుండేది.

విరోధి సంవత్సర చైత్ర బ ౧౦ లు శ్రీ మన్మహామండలేశ్వర మహ్లై అనంతరాజయ్య దేవచోడ మహారాజు లయ్యావారు ఒంటిమెట్ట రఘునాయకుల తేరునాడు వడ్ల కరమలవారు పచ్చడాలు కట్టుకుని తేరు యెక్కరాదని బలిజవారు అడ్డగించి రని మేము తిరుపతిలో నుండగాను ఒంటిమెట్ట వడ్ల కరమల వారు వచ్చిమాతో విన్నపంచేయగాను, తిరుపతిలో నుండే వారిని జియ్యంగారిని పిలిపించి తిరుపతి మర్యాద యెట్లాగని అడిగితిమి. అందుకు వారు చెప్పిన మాట మునుపు పెద్ద తిరుమల రాజయ్యవారు తిరుపతిలో నడిపించిన మర్యాదను వడ్ల కరమల వారికి కట్టడచేసివుండే మర్యాదన తిరుపూజా ప్రీతిగా తిరుపతిలో నడిచే మర్యాద. వడ్లకరమల వారు పచ్చడాలు కట్టుకుని గంధం పూసుకుని తమ తమకు గలిగిన ఆకు వొప్పులు శృంగారించుకొని పనికొరముట్లు పట్టుకుని తేరుమీద యెక్కుకుని రని ఒప్ప నాడినారు. మేము ఆ మర్యాదనే కట్టడ చేసినారం. ఆ మర్యాదనే మీరు సమ్మతితో నడిచేది.

దక్షిణద్వారం గోపురం లోతట్టున మహాద్వారంలో రాతికి వ్రాసినది.

౭. హేవిళంబి సంవత్సర ఆషాఢ శు ౧౧ లు మహ్లై తిరువేంగళనాథరాజు శ్రీరఘునాయకులకు జల్లిపల్లి రామాభట్లను సహస్రనామ పూజ ఆ చంద్రార్కంగా ధార పోసి యిచ్చినారు.

౮. గర్భగుడికి వెలుపట గోడరాతికి ఉండేది.

విజయ సంవత్సర ఆషాఢ శు ౧౨ సోమవారం పుణ్యకాలము నాడు మహ్లై తిరువెంగళనాథ రాజుగారు శ్రీ రఘునాయకులకు ఆచంద్రార్కంగాను జల్లెపల్లె రామభట్లను సహస్రనామ పూజ సాగించెను.

శ్రీరామార్పణం శ్రీ శ్రీ శ్రీ.

మవుజే కోనరాజుపల్లె తాలూకే సిద్ధవటం. సదరి మవుజేలో చెల్లే మజరా తూర్పుభాగమందు అరకోసుదూరమందు వుండే గుండిగాని పల్లెకు పశ్చిమం అరకోసున గొల్లవాండ్ల యిండ్లకు వుత్తరంగా స్థాపించి వున్న శాసనం.

ప్రమాదినామ సంవత్సర పుష్య బ॥ ౧౫ పేరునాయనికుమారాలు తౌవించిన భావి. కళయం రాముడు జంత్తానుబి(?)

మవుజే చింత్తరాజుపల్లె తా॥ సిద్ధవటం. సదరిగ్రామానకు [illegible] మజరా పత్రపల్లె భూమిలో పల్లెకు వాయవ్యం యిత్యాదులకు తూర్పు దేసానికొండకు దక్షిణం బొలెయెద్దు సూర్యాప్య [illegible] బొలినమెస్సను సంవాది (సమాధి) చేసిన స్థళం.

సూర్యుడు – దీపస్తంభము – వృషభము – దీపస్తంభము – కపిలగోవు – [illegible]

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౬౨౦ అగునేటి విళంబి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౫ లు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరరంగ రాయలు పెనుగొండ రత్న సింహాసనారూఢుండై పృథివీసామ్రాజ్యము చేయుచుండగాను ఉదయగిరి సీమకు చెల్లే సిద్ధవటం సీమలోను శ్రీమన్మహా మండలేశ్వర మట్ల అనంతరాజ దేవమహారాజు లయ్యవారు మానాయంకరానకు చెల్లే చిత్త్రమాజు పల్లెలోను శ్రీమన్మహానాయంకాచార్యులైన గుర్రమ్మజకుంట నలమల్లినాయని బుచ్చమనాయనిగారు రాచాల పసుల చిన్నమ నాయనిగారి నలబాలి యెద్దుమల్లెకు పూజం చెల్లె మల్లె చేను దక్షిణం వంకనన బుచ్చమ నాయనిగారు రాచావులపసుల చిన్నమనాయని గారి యెద్దుమాలెకు పంచంప్రయోజనాలకు । యీ చేనితలం సూర్యగ్రహణ పుణ్యకాలమందు మేము సర్వమాన్యంగాను ఇస్తిమి. గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్క-స్థాయిగా మీకు ఇస్తిమిగాన త్రివాచకంగాను ఇస్తిమి. మీరు అనుభవింప గలవారు। ఇందుకు యెవ్వరు తప్పినాను గంగకర్తను గోవు

బ్రాహ్మణుల వధియించిన పాపానబోవువారు। వారణాశిలో తమ తల్లి తండ్రిని వధియించిన పాపాన బోవువారు.

సిద్ధవటంతాలూకా సగిలిపాయకట్టు చుండువాయి మజరా పాత నూతమలా * బేచిరాకు గ్రామం భావిక దక్షిణం చేనిలో ఉండే శాసనం.

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౪౮౧ అగునేటి సిద్ధార్థి సంవత్సర శ్రావణ శు॥ ౧౫ బుధవారమునాడు స్వస్తిశ్రీ మత్పర్వత దక్షిణ ద్వార సమస్త తీర్థపరిపాలితులైన శ్రీ సిద్ధనాథ దేవునికి స్వస్తిశ్రీమన్మహా మండలేశ్వర కాశతియ్య ప్రతాపసద్ర దేవమహారాయలు సుఖసంకథా వినోదంబున పృథ్వీరాజ్యము చేయుచుండగాను స్వస్తిశ్రీమన్మహా ప్రధాని కస్తూకాల నాయునింగారు అట్టయ తెంకంగారు పొత్తపిభూమి సకలి భూమి ములికినాటిభూమియునుగా రాజ్యము చేయుచునుండి వారి తమ్ముడు గుర్రయ తిరంకనాని ములికినాటిలోని కడపనుండి సోమగ్రహణ కాలమందు తీర్థమాడి సభూతభూమిలోని చెంతువాయ చతుస్సీమయందూను రాచప్రోలియము అరగా(గో)ను పన్నులు కానికెలు సర్వార్థమైన (?) సకళాయ సహాయము గాను శ్రీ సిద్ధనాథ దేవునికి మధ్యాహ్న అవసరము టపగూరానేకు (ఉపహారానకు ?) ఆచంద్రార్కస్థాయిగాను మహారాజులకు పుణ్యముగాను సర్వమాన్యముగాను ధారాపూర్వకము చేసి ఇస్తిమి. మంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీంజేయును.

శ్లో॥ స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥
స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥

ఈ శాసనం దేవరగుడి కరణం దరిశనముక్తి వళారెదితియదిళభూమొని(?) సిద్ధయకొడుకు ముక్తవ్రాలు. శివమస్తు.

* See for a summary of the inscription Gaṇḍikōṭa-durgam-kaifiyat p. 18 A.R. No. 5 of 1939—40.

ఒక అమిదడిప మోనుచెలంగిలి. (?)

మోజే చుండువాయి తాలూకే సిద్ధవటం. సదరు గ్రామంలో ఎల్లమాంబగుడిలో ఉండే శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౪ అగునేటి నందననామ సంవత్సర చైత్ర శు॥ ౧౫ లు చుండు వాయి మహాస్థళమందు పినాకినీ తీరవాసురాలైన అరుపరంజ్యోతి స్వరూపమైన గ్రామదైవం ఎల్లమ్మకు గ్రామ అధికారి ... రణాలు తల్లిహెందీపారాధనకు యిచ్చిన భూదాన పత్రిక। నాగంవారిపల్లెకు నైఋతిభాగాన పెల్లయెత్తుకు ౧౪౦ మడి, పొం... దక్షిణం కు ౧౪౦ కూర్మగిరి మల్లేశ్వరునికి మడి మొల్లపూబావి ఉత్తరం నాగం పెద్దయ్య తీయించిన గడ్డతీరుకు ౦౪౽ యిచ్చినాము। ఇందుకు యెవ్వరు ఆఛ్ఛే(చ్ఛే)దన చేసినా కాశీలో గోహత్య బ్రహ్మహత్య స్త్రీహత్య చేసిన పాపాన పోదురు. తుర్కలు అ(ఛే)న చేసిరైనా మక్కాలో పందిని తిన్నట్టు.

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

గడ్డిలేరు ౨ స్థళాలుకు 3-కి(?) నాగంపెద్దయ్య ౦|౽౪౦ కరణాలవి|మూరం రెడ్డి రామన్న ౧|౽౪౦ కడుముల మొల్లప్పవిన్ని ఒడ్డెసిద్దువి వుభయం ౧౬ వీసాలు.

ఈ గ్రామానికి తూర్పు బెడుసుపల్లె మజరాకు పడమర పినాకిని నదికి వుత్తరం బైలుబేడు భూమిలో నుండే హళేకన్నడ అక్షరాల శాసనం.

చంద్రుడు – దివిటీ – శ్రీ – శ్రీ – సూర్యుడు

స్వస్తిశ్రీ చరణ సరోరుహ విహిత హితవిలోచన నేత్ర త్రిలోచన ప్రముఖాఖిల శ్రీ పృథ్వీశ్వరకారిత కావేరీ తీర కరికాలకుల రత్న ప్రదీప కాహితకుమారాంకుశ దాయాద్య? (మండలిక) (దిశాపట్ట) కీర్తి నారా

యణ కాంచీపురవరాధీశ్వర పృథ్వీశ్వరఃసౌతల(?) గండరగండ సెవాని చోడుఘురత ద్రావిడర్బంవాండ(?) గండడియ... .....పురవరాధీశ్వరు డుయ్యాస సెగళవా తిమకాళి(తిమకుళ)తిళక మహారాజులు కాంచీ పురంబున సుఖసంకథా వినోదమున రాజ్యము శాయంగా, శ్రీమన్మహా మండలేశ్వర, సమస్త సేనాధిపతి మహాప్రధాని కామరాజుల కుమారుండు పిసారతు స్వస్తి సమస్త ప్రశస్త సహితం అలితూరిఘుర వరాధీశ్వరం సత్యమాంధాత విఃభగః......శరణాగత వజ్ర పంజర పరనారి.........వననెకలక్ష్మీనందన్న నంకకా(ఋ)ం శ్రీమన్మహాసామం తర్పృస్తుల కాళీశ్వరానాయుండైన కంటమనాయకుండు తన అర్థాంగి లక్ష్మీచియసాని పేర మహాగ్రామముఖ్యులైన చెడునూరి అరుళాలిభట్టు చతుర్ముఖ భల్ప జాత(?) సంనూరు వృత్తులకుం జాలునంత క్షేత్రము కావలి కొండకు నేలపడమట కిర్గస మొగడ్సఃు(?) ఉత్తరమున ముటాసలి నై ఋతికిం గత్తిఅూల మానసపుకాకి ముగ్గులు దక్షిణాన పన్న మేర తూర్పున కల్లాది పెన్నకూటవ పడుమటికిని తూర్పుపొలిమేరగానుచియా పురములా(?)ని పడ(?)పెరను అగ్రహారము సర్వబాధాపరిహారము తన పరి వారము పగ్గడ బంతారిలెంక సహితము ఇచ్చి తనతో తమ్ముండు కామ రాజు తిరుకాలతి దేవుని బేవారపూ ఖరసంవత్సర పుష్యరముం మకర సంక్రాంతినాఁ ౧౧౧|౦ కి॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥
సామాన్యోయం ధర్మసేతుర్నృపాణాం।
కాలేకాలే పాలనీయో భవద్భిః।
సర్వానేతాఃా భావినః శ్రీపార్థివేంద్రాః।
భూయోభూయోయాచతే రామచంద్రః॥

జామదగ్నివత్స్యగోత్ర వాసన అయ్యన వంశమున అరుళాళ భట్టు చతుర్ముఖభట్టు॥

................. ..........

శకవరుషంబులు ౧౧౪౩ మంగళమహాశ్రీ॥

మవుజే మల్లినేని పట్నం నగలిపాయకట్టు తాలూకే సిద్ధవటం, గ్రామానికి దక్షిణం పావుకోసుమీాదను మామిడిల్లురయ్యాతు చేనిలో నుండే శాసనం. అక్షరాలు శిధిలమైవున్నవి. ఇందులో తూర్పుభాగం ప్రాచీన శాసన అక్షరం శిధిలమైనది. వాటిలో అంత్యభాగమందు స్వదత్తాంపరదత్తాంవా అనే శ్లోకము మాత్రము ఉన్నది. ఈ రాతి వెనుక వ్రాసియుండేది నవీన శాసనం శిథిలమై యున్నది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౫౭ అగునేటి మన్మథ సంవత్సరం మాఘ బ॥ ౧౪ లు రామా భట్లయ్యవారి కార్యకర్తలైన లింగరసయ్య(గా)రు[1] విస్సరాజ అక య్యకు ఇచ్చిన ధర్మశాసనం। సిద్ధవటం సిద్ధేశ్వరుని నగలి......... కుమారస్వామి దేవరకు చరవలినిత్య నైవేద్యదీపానకు చిన్ననగలిలోని మల్లనాయనిపట్నం గ్రామంలోని చేను ౧౪ అక్షరాలాను నాలుగు తూముల చేను. శివరాత్రి పుణ్యకాలమందు రామాభట్లయ్యవారికి (పుణ్యముగాను?) సర్వమాన్యంగాను ధారపోసి యిస్తిమి.

ఈ శాసనానకు ఉత్తరం నదరిగ్రామంలో క్రొత్త బావికి ఉత్తరం విష్ణుదేవాలయం పాడుపడిన స్థళములోను ఉండే శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౬ అగునేటి రాక్షస సంవత్సర వైశాఖ శు॥ ౧౧ గురువారం[2] శ్రీమద్రా జాధిరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప సదాశివదేవ మహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యము చేయుచుండగాను సిద్ధవటం సీమలోనికి చేల్లే చినమల్లినేనిపట్టణము లోనున్నా వేంచేసియున్న అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన చతుర్దశభువనాధీశ్వరులైన శ్రీ చెన్నకేశవమూర్తికి కాస్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోది ప్రళయకాల

1. నాగరసయ్య. A. R. No. 38 of 1939-40.

2. కా[ర్తిక] శు॥ ౧౧ గురువారం A. R. No. 39 of 1939-10

గోవిందగిరి పౌత్రులైన రుద్రయ్యగారి పుత్రులైన గోవిందయ్యం గారు, వశిష్ఠగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోది దేవవల్లభయ్యగారి ప్రపౌత్రులైన మల్లయ్యగారి పౌత్రులైన దేవ వల్లభయ్యను............చేయించిన పాపాన బోవువారు. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుల పాదమే.

ఈ రాతికి రెండోతట్టువుండేది అక్షరాలు శిథిలమై పోయివుండేది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవర్షంబులు ౧౭౪౬ అగునేటి స్వభానుసంవత్సర పుష్య బ॥ ౩౦ శ్రీ......సిద్ధవటం సీమ లోని మల్లినేని పట్నం గ్రామ......యీ గ్రామము......సంక్రమణ పుణ్యకాలమందు వ్రాసి యిస్తిమి। ఈ ధర్మానకు యెవరు తప్పినాను గంగోత్రిలో గోవును జంపిన పాపాన బోదురు.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

గ్రామానికి తూర్పు ఒకకోసు యెడె(?) కొండలో కొలికొండ్ల మోరకు తూర్పు సన్న మోరయేటి పినాకిని వద్ద గుంటికి నవీన అక్ష రాలు శిథిలమైయుండే ప్రథమ భాగం అక్షరాలు పోయియున్నవి.

శ్రీరామా। ముసనర్మానుధ కేర్తి తే గుర(కి?)ణి రకము గ్రానచ్చింయి శెంత ఖలగాత్మి సాలుద్నంచార్య నూనిట యిదించెంసిడీన సిలడెలు జాల తుక్కమమంక్రయిాను నాసిచెన్నవ్రాలు పానరపకేతి ప్పామునక్షిణి. ఇక్కడ అక్షరాలు శిథిలమై పోయినవి.

ఈ శాసనానకు తూర్పున పూర్వమందు యినుపకొలిమి యుండే మోరకు ఉత్తరం పెద్దమోరకిత్తిరాళ్ల మడువు అంటే పెన్నానదికి తూర్పున గుంటి శాసనం.

ఒంటి మెట్టరఘునాయకులకు పెన్నకు తూర్పున పౌన్నాపల్లె పొలంలోను గుడను... ఇక్కడ అక్షరాలు శిథిలమై పోయినవి.

పగిలి పాయికట్టు సమాజె తుమూరి తా॥ సిద్ధవటం గ్రామములో ఎల్లమ్మ దేవాలయానికి దక్షిణం వాయువ్యాశ్వర పాంచవటం లింగంవద్ద వుండె హాళెకన్నడ శిథిలమైన శాసనం.*

సూర్యుడు చంద్రుడు

౧. స్వస్తిచరణ సరోరుహ విహితి(హిత)విలోచన త్రిలోచన ప్రముఖాకిల పృథ్వీశ్వరకరిత కావేరీతీర కలికాలకులకంతక్క ప్రదిప అపరిమిత ప్రతి(తా?)మ(ప?)సతతసమభ్యర్చిత లక్ష్మీశ్వర రయుంజయూరు పురవరాధీశ్వర కంచిపుర త్రినేత్ర కాస్యపగోత్ర అతి చతుర కామిని జనమంత తురగారోహ రేవంత వితరణవిరూప విక్రమాదిత్య తెంకణాదిత్య బగివొబ్బ గండ గవిణ తారాతినృపాలకులసధరకులిశధర శరణాగత వజ్రపంజర దాయాదమండళి(క) దిశాపట్టకవైరిగ(ఘ)రట్ట కీర్తి నారాయణ రాజ పరాయణ అయ్య సిద్ధ (సింగ) సాహసోత్తుంగ అహితక............
... ... ... కుశసూర్యవంశోద్భవ ... ... ...
అ పరపంహా(?)... ... ...హార... ... ... ...
కందుకః క్రీ... ... ...వణకటకచళ... ... ... ...
... ... ... ... ... ...ంచి ... ... ...
... ... ... ... ... ...యహా ... ... ...
... ... ... ... ... ...కంద్రు ... ... ...
... ... ... ... ... ...ండప్ర ... ... ...
... ... ... ... ... ...వర ... ... ...
... ... ... ... ... ...దిశా ... ... ...
ఈ రాతికి రెండో ప్రక్కను వ్రాసి వుండేది.

పిణతచార్యసూర్య కులాసంక్రందన పాటకి(లీ?)పుత్రపాటకి(లి)నారాయణ శ్రీఅలాడనాథమనుమతనాథ సిండెరాయదకు త్రిమలతాంవనిరాయ గండగోపాల శ్రీసిద్ధనాథదేవరదివ్యశ్రీపాదపద్మారాధకనామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వరభుజబళవీరబిజ్జదేవ చోడ మహా

* A. R. No. 62 of 1939–40. [Śaka 999 Naḷa] ba 15 Thursday

...జోతియాంత సకలి సీమలో మద్దూరు చతుస్సీమ సహాగా యిష్ట కామేశ్వరకున్ను భైరవదేవరకు పూజపురస్కారమునకు కానికెసిద్ధాయం లోనుగా ఆ చంద్రార్క తారస్థావిగా చెల్లునట్టుగా యీ దినము ధారాపూర్వకము చేసి యిస్తిని. ఈ గుడి దేవరదియాళము(దేవళము) స్థానికుండు ఉమాదలిచి జొన్న చేను కొ ౧౦ పంనుమువిత్తుల పట్టలి యూరను ఇస్తిని। ఇందుకు యీ దేవరకు ఇచంగా(?) తప్పక చెల్లుకట్టుగా యిస్తిని. ఈ ధర్మానకు విరోధం తలచిన వారి రు...వ బ్రహ్మహత్య మంగళమహాశ్రీ। ఇతి శ్రీ సిద్ధనాగని కంణమాచరి వ్రాలు.

ఈ శాసనానికి తూర్పుగా చేరినట్లు ఉండే శాసనం.

సూర్యుడు - చంద్రుడు - వృషభం - త్రిశూలము

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౫౪ అగునేటి ఖర సంవత్సర చైత్ర సు॥ ౧౫ లు శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ అచ్యుత దేవమహా రాయలు విజయనగరమందు వీర సింహాసనారూఢుడై సకల సామ్రా జ్యము చేయుచుండగాను శ్రీశైల దక్షిణద్వార శ్రీ సిద్ధవట ఇష్టకామే శ్వర భైరవేశ్వరులకు సిద్ధవటం సీమ సుంకమణియగారు పాపరాజు కొండయ్య దండంబెట్టి ఇచ్చిన ధర్మశాసన క్రమమెట్లన్నను సిద్ధవటానకు చెల్లే సకిలిసీమలోని భైరవేశ్వరులకు చెల్లివచ్చే మద్దూరి గ్రామం స్థావరకట్నం స్థానంవారు దిక్కుల కానుక వచ్చే పసకపైయలు కాలుచు కుండలకును వచ్చేసుంఖం మద్దూరి గ్రామంలోను అడుపసరం వేయలి కొలచు గూడ్లకువచ్చే సుంఖం గ్రామంలోను కాంపు(?)లు అనుపసరం వేయలు కొలుచుగూడ్ల...వచ్చే సుంఖం మొదలైనవి సోమగ్రహణ పుణ్యకాల మందు అచ్యుతరాయలకు పుణ్యంగా ధారబోసి యిచ్చిన శిలాశాసనం. ఇందుకు యెవరు తప్పినాను వారణాశిలో గోబ్రాహ్మణుని చంపిన పాపాన బోవువారు. మంగళమహా శ్రీ శ్రీ శ్రీ.

త్రిశూలము

ఈ శాసనానికి వుత్తరం చెర్వుకింద పొలిమేర రాతికి వుండేని.

సూర్యుడు – లింగం – చంద్రుడు

మద్దూరు వరికుంట పొలిమేర పడమటికొండ కుంభకర్ణం బోటిన గరగు.

సదరి పాయకట్టులోని వీరూరు తాలూకే మజుకూరు గ్రామానికి తూర్పున బైలులో వీరభద్రదేవునికి ఉత్తరానవుండే శాసనం.

సూర్యుడు – చంద్రుడు

*శుభమస్తు, స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౯ అగునేటి సర్వజితు సంవత్సర వైశాఖ శు॥ ౧౫ సో తమ యిరువై నాలుగు కులాలవారి ఆనతిని సరస్వతి మల్లదేవరాజు తలగళ తిరుమల రాజున్నూ కూతురి తిరుమలయ్య గోవిందయ్యగారున్ను మొదలైన తమ యిరువైనాలుగు కులాల వారున్ను బోడి లింగయ్యకు యిచ్చిన ధర్మశాసనం. వీరూరి మహాలింగయ్యకున్ను వీరేశ్వరునికిన్ని పెరుమాళ్లకున్ను మొగలి దేవికిన్ని మొదలైన గ్రామదైవాలకు పత్రిపుష్పం చేశ్తేటట్టుగాను తోంట బెట్టి దేవళాలకు పత్రిపుష్పం పెట్టె అందుకున్నూ సురవ్రారి పరదేశికి మిూశోడట్టు అన్న దానం పెట్టేటందుకున్నూ ఆ గ్రామం అయ్యావళి ముఖ్యమైన చాలుమూల సమస్త పెకుంద్ర మందరున్నూ నిర్నయంపెట్టి సాగించిన వివరం. సకిలి సీమలోని వీరూరిగ్రామం తమ యిరువైనాలుగు కులాలవారికిన్ని యిచ్చిన వర్తన అంతనున్ను మా యిరువై నాలుగుకులాల వారికి పుణ్యముగాను ధారాపూర్వకంగాను ధారబోసి యిస్తిమి. లింగయ్య దేవుని ధర్మశాసనం ఆచంద్రార్కస్థావిగాను ధారబోసి యిస్తిమి, లోని పుణ్యాంయీాడే రేటట్టుగాను యిస్తిమి. ఇందుకు యెవ్వరు వ్రూ–వ(?)దంటాకో గోహత్య బ్రహ్మత్య చేసిన పాపాన బోవువారు. వారణాసిలో తమ తల్లిదండ్రాదులను సంహారించిన పాపాన బోవువారు. గనుక ఆ చంద్రార్కస్థావిగాను

* A. R. No. 69 of 1939—40.

సాగించేది, మేము చేసిన పుణ్యాం ఈడేరే టట్లుగాను నీవు యీడేర్చి మా యిరువై నాలుగు కులాల వారికి వచ్చేవర్తన అనుభవించి సుఖాన నుండేది. శ్రీ మంగళమహా శ్రీ శ్రీ జేయును.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

ఈ పుణ్యానకు యెవ్వరు తప్పినానున్ను, మా యిరువైనాలుగు కులాల వారికి వెలి గనుక యీ పుణ్యానకు లోనై నడిచేది.

సకిలి పాయకట్టు వర్రికుంట తాలుకు సిద్ధవటం గ్రామములోని నీలకంఠేశ్వరుని దేవాలయానకు ప్రాకారంలోతట్టు ఉత్తర భాగమందు పగిలివుండే శాసనం. అక్షరాలు శిథిలమైవున్నవి.

సూర్యుడు – వృషభం – చంద్రుడు

*స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౨౬ క్రోధి సంవత్సర చైత్ర శు॥ ౭ గు. నాండు స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర మండలిక బ్రహ్మ రాక్షసగండపెండార అంబదేవ మహారాజుల కొడుకు త్రిపురాంతరి(క) దేవుండు స్వస్తిశ్రీ శ్రీపర్వత దక్షిణద్వార సమస్త తీర్థపరిపాలితుండైన శ్రీ సిద్ధనాథదేవర అంగభోగానకు సకిలి భూమిలోని వరికుంట అనెడి వూరు చతురుసీ(స్సీ)మాను. సాదసుంకణా స(ష)ష్ఠాయసహితము సర్వమాన్యంగాను ధారాపూర్వకంచేసి ఆచంద్రార్కస్థావి(యి) అయిన వృత్తిగాను ఇచ్చిరి. ఈ వూరి వుత్పత్తిగొని(?) మధ్యాహ్న సంధ్యా(ధ్య)యందు దేవర అంగభోగం నడపను వరికుంటగ్రామం వివరం సేసే పడికట్టన క్రమము. అంగవస్త్రాలు మూ(డు) నెలలకు నుగర(నగర?) నాలుగు మాడలు। శ్రీగందం నిత్యం పలిమెడు కర్పూరం గం. కస్తూరిగ గం–దుగలంయెత్తు। దీపాలకు......ఆరగింపను। రేయి ఆరగింపను...ఖ౫౧ పెసలు కొ. ౧। మండిగెలు గోధుములు(వ)(ప)ప్పుకొ(త్తి?)మిరి సో ౧ నెల

* See for a summary of the inscription Gaṇḍikōṭa - durgam Kaifiyat, p. 17.

వంతి పోకలు ౫౦ ఆకులు ౧౦౦ పూలదండలు తొమ్మిది। నంబి అర్చనాంగ ముఖ నాలుగుపుట్ల మడిన్ని రెండు పీసాల చేనున్ను, ఆచంద్రార్కం చెల్లగలది. ఇది దరిశన ముక్తి వేశారి మోరలి నాయనికొడుకు వసంతరాయని వ్రాలు.

## (శ్రీ) శ్రీరంజేయును.

ఈ దేవాలయానకు తూర్పు సామీప్యంగా చెన్నకేశవస్వామి పాడుగుడి బైటిలో వుండే శాసనం.

అవిఘ్నమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౧ అగునేటి ఖర సంవత్సర జే(జ్యే)ష్ఠ శు॥ ౧౫ లు స్వస్తిశ్రీపర్వత దక్షిణ ద్వారదరిశనముక్తి దేవశిఖామణి దేవవేశ్యాభుజంగుండైన శ్రీజో(జ్యో)తి సిద్ధేశ్వరుని స్థానంవారున్నూ అధికారి కసవరాజుగారున్ను వరికుంట కొండ్రెడ్డి లగిమిరెడ్డి ఊరకరణం చిట్టయ్యా పాపయ్యాగారున్ను పాళం తిరుమలయ్యాకు యిచ్చిన ధర్మశాసన క్రమమెట్లన్నను - వరికుంట కేశవ పెరుమాళ్లగుడి చిద్రమైవుండగాను క్రొత్తగా గుడిశిఖరమున్నూ అర్ధమంటపమున్ను కట్టించే అందుకు ఉప్పర తిప్పన బోయినికి కట్టుగుత్త ల్ ౧౨౦ కి నంబితిమ్మయ పెట్టినది ల్ ౪౧ రూకలు ఇచ్చినందుకు ఆ కేశవ పెరుమాళ్లగుడి కాణాచికిగాను యిస్తిమి, పెరుమాళ్లకు చెర్వువెనుక మడి ఖ ౦। వెలిచేను ౧౨ కోరు కల్లాలప్పుడు మేరవాని మొదలుంగా సర్వమాన్యం ఇస్తిమి. పెరుమాళ్ల నిత్య సమారాధన ధూపదీపనైవేద్యాలు తప్పకుండాను దేవునికి సమారాధనచేసి యీ కాణాచి పుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాహిం(యి)గా అనుభవించగల వాండవు.

ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను గోబ్రాహ్మణవధ చేసిన పాపాన బోవువారు అని మా గుడి శిద(సిద్ధ)య చేతాను, వరికుంట ఊరకరణం పాపయచేతను వ్రాయించ్చిన ధర్మశాసనం.

గ్రామానికి ఉత్తరం పావుకోసు మీాదను సదరు గ్రామం సీమ్ల హద్దురాయి అట్లూరు పొలిమెరలో నుండేది.

సూర్యుడు — చంద్రుడు

వరికుంట చెర్వుసీమ్ల హద్దు రాయి। యువ సంవత్సర కార్తిక బ॥ ౫ లు బొబళ్ల లచ్చిరెడ్డి (ఇక్కడ మతలబు పోయినది.)

సకిలి పాయకట్టు అట్లూరు తా॥ సిద్ధవటం సదరు గ్రామానికి దక్షిణం మజరా పాత అట్లూరికి ఉత్తరం ఈశ్వరపాడు గుడిదిన్నె-నారాయణచారి తోటలో పగిలియుండే శాసనం.

సూర్యుడు - దీపము - వృషభం - చంద్రుడు

*స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శకవరుషంబులు ౧౧౯౦ అగునేటి విభవ సంవత్సర ఫాల్గుణ శు॥ ౧౫ గు.* స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర విమలకీర్తిశ్వర అనుమకొండ పురవరాధీశ్వర వుమ(ఉమా) మహేశ్వరు...మూారురాయ జగద్దళ ప్రతిపక్షరాయ వంశ నిర్మూల రాయస్థాపనాచార్య మేరుమండక దేశయ్య(?) చలమెత్తు గండ కదనప్రచండ ఒడ్డియరాయ దిస్థాపన(?)వైరి ఘనతర (ఘురట్ట) కీర్తి నారాయణ ఆశ్రిత కల్పవృక్ష అతివిషమరాయ సిక్షా(క్షా)దక్ష శ్రీ స్వయంభ(భూ)నాధ దేవదివ్య శ్రీపాదపద్మారాధక...ప్రసాదక నామారి (మాది?) సమస్త ప్రశస్తి సహితుండైన శ్రీమతు కాకతియ్య రుద్రదేవ మహారాజులు అనుమకొండ దేశమందలి ఓరుగంటి పట్టణమందు సుఖసంకథా వినోదమున పృథివీరాజ్యం సేయగాను శ్రీ మహారాజుల భృత్యుండు స్వస్తి అనేక నామావళి విరాజమాన మానోస్త(న్నత?) అపమ(?) మహాదండ ప్రథమసిఖావంత పరబళక్రి(కృ)తాంత ప్రాకారాంత వీరావతార దామోదర సైన్యే(న్య)దశమాల(దిశాపట్ట?) మండలిక బ్రహ్మ రాక్షససి(చ)లమేత్తుగండ మూారురాయ జగద్దళ గండపెండార త్రిపు

* See A. R. No. 1 1939—40 Gandıkōta - durgam Kaıfiyat p. 14.

రారి దేవుండు ఆపున్మనాం (ఆ పున్నమా?) దివసం రథోత్సవమున స్వస్తిశ్రీపర్వత దక్షిణ ద్వార స్ఫురదుదయగిరి శిఖర వైశాఖ మాస మహాశ్చర్య భూతాది దివ్య తేజోమయదివ్యపరంజో(జ్యో)తి అదికన్న? మాత్ర అధికమా(ము)క్తి ప్రదాయక దరిశనముక్తి శ్రీమతు సమస్త తీర్థ పరిపాలితుండైన శ్రీ సిద్ధనాధ దేవుని దివ్య శ్రీపాదపద్మంబులకు సాష్టాంగ నమస్కారము జేసి తనకు ఆయురారోగ్య అయిశ్వర్యాది జయాభివృద్ధిగావలయునని సకిలిభూమి... చతుస్సీమాను నాదంపురం గ్రామ... సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను

ఇక్కడ అక్షరాలు రాయిపగిలిపోయియున్నది గనుక తెలియలేదు.

ఈ శాసనానకు వుత్తరం పొందినట్టుగా వుండే శాసనం.

సూర్యుడు — చంద్రుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౪ అగునేటి పరాభవ సంవత్సర ఆషాఢ బ॥ ౨ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివ దేవరాయ మహారాయ లుంగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢుండై పృథివీరాజ్యము చేయుచుండగాను రాయల ఆనతి మీదా(ద)ను రామరాజు ముదలను మ(మా)ద్రాజు నాగరాజ్య దేవమహారాజులు... వేయించిన శిలాశాసన నము - అద్లి(?) ౧ కి, మంగళ కొండోజగారికి క(ప్ప)పన్ను కానికె పెజకూడం (?) దొమ్మరిపన్నుసహా సర్వమాన్యంగాను యిహరించి (వివరించి?) విడిచినది. యీ ధర్మానకు యెవ్వరు తప్పినాను కుక్క మాంసం సురా సేవించిన వారు. మంగలవాని కొడుకులు.

వేములూరు అనేగ్రామానికి పడమట సకిలియేటికి తూర్పు చింత మానువద్ద నాగులరాతికి శిథిలమైవుండే శాసనం। ఈ మొదటి ప్రక్కన మాతృకలో విశేషించి ప్రతిమలు వ్రాసియున్నందున వాటికి నకలు వ్రాయలేదు.

ఈ రాతికి రెండో ప్రక్కను శాసన అక్షరములు ప్రథమభాగం శిథిలమై అంతిమ భాగంలో ఉండేది.

శకవరుషంబులు ౧౦౬౧ అగునేటి......నాడు కమండిల్య (కౌండిన్య)సగోత్ర...భీమభట్టునకు మాధవభట్టునకు ఆదిత్యభట్టునకు... మల్లిభట్టునకు పెరుమాళ్లభట్టునకు.........। పంచాదిత్యభట్టునకు కాశ్యపగోత్ర బ్రహ్మదేవభట్టునకు ఆత్రేయసగోత్ర పాలేభట్టునకు నారాయణభట్టునకు పిన్ననారాయణభట్టునకు కాశ్యపగోత్ర త్రివిక్రమ భట్టునకు శ్రీరామభట్టునకు కౌశికసగోత్రవిద్యామూర్తిభట్టునకు కామ దేవభట్టునకు ఆదిత్యభట్టునకు రాఘవభట్టునకు మల్లిదేవభట్టునకు పిన్న కామభట్టునకు కాశ్యపగోత్ర నారాయణ భట్టునకు మూలస్థానందేవర వృత్తికి ఖైరవేశ్వరదేవర వృత్తికి రెంట్టికి స్థానాధిపతి సిద్ధవటు పురు షోత్తమ దేవరకు నోర(?)వృత్తిని రాచమహాజనాల సమ్మతమున పొది రెట్టిః కు ౧౦౦ సర్వమాన్యము। పు(పూ?)లకు వృత్తి తూమెడు।

## नंबर छेवीस दाखल खुद बुक २४.

సగిలి పాయకట్టు జొన్నవరం గ్రామానికి తూర్పున చెర్వులో పూర్వం ఉన్న నత్తపాడుస్థళంలో ఆంజనేయులకు యెదురుగా ఉండే శాసనం।

శుభమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౬౪ అగునేటి శుభకృతు సంవత్సర ఆషాఢ బ ౧౨ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివ రాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివిసామ్రా జ్యము సేయుచుండగాను రాయలు ఆనతిమీాదను రామరాజు ముదలను మం(మా)డ్రాజు నాగరాజయ్యదేవ మహారాజులయ్యగారు వేయించిన శిలాశాసనము. జొన్నవరము మంగలవాండ్లకు పన్నుకానికె వెట్టి దొమ్మరిపన్నుసహా సర్వమాన్యంగా యిస్తిమి. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను కుక్కమాంసం సురాపానం సేవించినవారు। మంగలవాని కొడుకులు.

౧. సగిలి వాయకట్టు మాడపూరు అనే గ్రామములో ఉండే శాసనాలు. గ్రామానికి పడమర మాధవరాయ దేవళం పాడుదిన్నె పైన పాడు పడిన దేవళానకు ఉత్తరంగా వుండే శాసనం.

సూర్యుడు — శుభమస్తు — చంద్రుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౧ అగునేటి విరోధి సంవత్సర కార్తిక శు ౧౧ లు శ్రీమతు పోతినాయని నాగమ నాయనింగారు రామాణ్యం(యణం) మాధవయ్యంగారికి యిచ్చిన భూదాన ధర్మ శాసనం. రాయసం కొండమరసయ్య కుమారుడు అయ్యప నాయకులు మాకు పాలించి యిచ్చిన ఉదయగిరి దుర్గానికి చెల్లే మాడపూరి పెద్దచెరువు కిందను రావులపల్లం పెగడరాజు వారి మాన్యం మడికి తూర్పు మాన్యము ౧౩ ముత్తుంమడి...రఘునాథుని సన్నిధిని అయ్యపెద్ద(పయ్య) నాయంకులకు పుణ్యముగాను ధార పోసి యిస్తిమి. మీ పుత్ర పౌత్ర పారంపర్యమును ఆ చంద్రార్క స్థావి(యి)గాను అనుభవించ్చి బ్రతుకువారు। ఈ ధర్మానకు యెవ్వరు గనుక తప్పినాను వారణాశిలోను తమ తల్లితండ్రాదులను వధియించిన పాపాన బోవువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఈ శాసనానకు దక్షిణంగా మాధవస్వామికి తూర్పువుండే శిథిలమైన శాసనం.

౨. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౪ అగునేటి (నందన) సంవత్సర మార్గశిర శు ౧౪ లు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప అచ్చుత దేవమహారాయలు విజయనగరమందు రత్నసింహాసనారూఢుండై పృథివీ సామ్రాజ్యము చేయుచుండగాను రాయసం కొండమరసయ్య కుమారుడు అయ్యప సంక్రాంతి పుణ్యకాలమందు పోతి నాయని నాగమనాయనిగారు............ పోతినాయనిగారు మాడపూరు మాధవస్వామికి గ్రామ(మ)ము...

............చేసియి స్తిమి।... .. చతుస్సీమలో కలిగిన నిధినిక్షే పములున్న దేవునికి.....టట్టుగానున్న ధారపోసి యిచ్చిన ధర్మ శాసనం. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను వారి తల్లితండ్రాదులను కొడుకులను గంగకట్టను గో(బ్రాహ్మణ్ణి వధించిన పాపాన బోవువారు.

౩. గ్రామానికి వాయువ్యం కొత్తకుంట కట్టవద్దవుండే పొలిమేర రాతి శాసనం.

సూర్యుడు - చంద్రుడు

అగ్రహారం మాడపూరు కమలకూరు సందు పొలిమేరహద్దు.

కొత్తకుంట కట్ట, పూర్వం రాతికి ఉత్తరం. గోవులపల్లెగురువప్ప వానసి శాసనం.

౪. ఈ శాసనానికి దక్షణంగా వుండే శాసనం.

సూర్యుడు - చంద్రుడు

స్వభాను సంవత్సర చైత్ర బ 3 గు గోన బసివినాయనింగారు కమళకూరి మాడుపూరి పొలిమేర తీర్చినరెడ్లు, పెబులపీటి పోతుల తిప్పా రెడ్డి, దిర్సువంచ బొమ్మిరెడ్డికస్వరెడ్డి, గొడుగునూరి లింగారెడ్డి, పెనసగిలి మల్నేని పట్నంమాంచిరెడ్డి, వుప్పాటూరి గంగిరెడ్డి మొా(ము)దలయిన గ్రామాదుల వారు తీర్చిరి। శ్రీ శ్రీ శ్రీ బండిరట్టు జబ్బుణోజు నరికిన శాసనం.

ఈ రాతికి రెండో పక్కను ఉండేది। గొడుగు పోలడు।

సూర్యుడు - చంద్రుడు

౫. ఈ గ్రామములో మల్లేశ్వరుని పానవట్టానకు ఉండేది।

పి. చోళదేవిటి.

సగిలి పాయకట్టు కోడూరు అనే గ్రామం పొలిమేరలో గ్రామా నికి పశ్చిమం నాలుగు పరుగుల దూరంగల గోపాలస్వామి కొండమీది దేవాలయానికి పొయ్యే మార్గంలో, లొకిగుండాన్నుంచి నీళ్లు ఉండే

దానికి దక్షిణంగా నడిచే మాగ్రం(ర్గం)లో బండపైన వుండే హాళేకన్నడ అక్షర శాసనం.

శా। ౧. శ్రీమతు పందు(?)గురి మల్లెయ్య గోపినాథ దేవరకు కాయు(?) తమ తండ్రి దేసింగ రాజుకు పుణ్యముగాను నరకించెను.

ఇందుకు పడమట బండపైన అక్కడక్కడ వ్రాసివుండేది.

ఇందుకు పడమట గోపాలస్వామి దేవాలయం తూర్పు ద్వారానకు ఉత్తర భాగాన దిగువరాతికి శాసనం.

౮. కోనేటి తిమ్మరాజు కుమాళ్లు పెద్ద ఓబుళరాజు చిన ఓబుళరాజు గోపీనాథునికి దండము సమర్పించిరి.

ఇందుకు పొందినట్లు యీ రాతిపైన నుండేది.

౯. పొందూరి బోడి బత్తుని పాపాబత్తుండు గోపీనాథునికి దండము సమర్పించెను.

ఈ రాతికి ఉత్తరం ద్వారం ముందర ఉండే దిగువ రాతికి శాసనం.

౧౦. శ్రీ కొండ గోపాలస్వామికి...యిచ్చిన ధర్మం: నైవేద్యానికి దినమునకు ల్ ౧ పరిచారకులకు ల్ ౹ ......

ఈ దేవాలయానకు దక్షిణభాగాన పుట్టుబండపైననుండేది...

౧౧. కసవారికి యిచ్చినది గుడికి దక్షిణంచోట.

ఇందుకు తూర్పు యీ రాతికి వుండేది.

౧౨. శ్రీ రామా ప్రమాదీచనామ సంవత్సర చైత్ర శు ౧౫ గురువారం చిత్రా నక్షత్రాన శ్రీ కొండ గోపాలకృష్ణమ్మ గరుడకంభప్రతిష్ఠ. నేలటూరి పెద్దగోపన కొమారుడు వెంగన చేయించిన కైంకర్యం. నేలటూరి వెంగ్గన బండికట్టు లంకాబత్తుండు కిశెనవిను మెండు చేను మాన్యం ఇస్తిమి.

తుమ్మలపల్లి చిన్న తిమ్మయ్య కొమారుడు చిన్న తిరుమలయ్య గోపాలస్వామికి నిత్యంసేవా.

దేవాలయానకు తూర్పు గొల్లవాని గుడి దక్షిణంగా నుండే శాసనం.

౧౩. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౧ అగునేటి స్వభాను సంవత్సర చైత్ర శు ౧౫ గురువారం చిన నగిలి సీమలోని కొండ గోపినాథ దేవునికి రూపిరెడ్డి మాదిరెడ్డి కొడుకు తిమ్మయ్య తీర్థమున్ను ఆరగింపున్నూ దేవునికి...ప్రిద(?) పుణ్యముగాను.

ఈ రాతికి రెండో ప్రక్కను వుండేది.

చిన్నా రెడ్డి తిమ్మిరెడ్డి కొడుకు తిమ్మప్ప గోపీనాథునికి యిచ్చెను. కొండూరి ఊరకరణం చిడమరాజు కుమారుడు తిమ్మయ్య గోపీనాథ దేవునికి దండం సమర్పించెను.

ఈ రాతికి మూడో పక్కను వుండేది...

రాయిన్ని నరికించెను ఇంత వట్టున్న మా తండ్రి మాదిరెడ్డికిన్ని తల్లి మాదసానికిన్ని పుణ్యముగాను చేయించెను. శ్రీ శ్రీ శ్రీ జేయును.

దేవాలయానకు పడమట ద్యా(దే)వరగుండంలో తూగు తట్టు పుట్టుబండపైన వుండేది.

సూర్యుడు — చంద్రుడు

౧౪. శ్రీరామచంద్రాయనమః. వరికుంట బెకరిశెట్టిగారుల బమ్మిల పూజ నింటికి వారి క్షేత్రము। ఆచంద్రసాహిగాను.

ఈ దేవాలయానకు పడమట సిద్ధవటమార్గంలో పుట్టుబండ పైన అక్కడక్కడ వేరే వేరే వ్రాసివుండేది.

ఈ శాసనానకు పడమర పొలికిమానివద్ద శాసనం.

౧౮. కొండరాజు వెంకటరాజు తిమ్మరాజుగారికి పుణ్యంగాను.

ఈ దేవళానికి తూర్పుమార్గానికి దక్షిణం ముచ్చుకొనవాగు ఉత్తరపు గడ్డగుండుకు ఉండేది.

శూలము – డమరుకము

ఈ గోపాలస్వామి కొండకు వుత్తరం సాలంకమల్లేశ్వరుని గుడికి పడమర చంద్రశేఖరుని గవి పుట్టుబండకు వుండేది.

స్థలకరణం చెన్నప్ప లింగము

౧౯.

ఇందుకు పడమర యీగవి వద్ద నిలువురాతికి

నగిలిపాయకట్టు కొండూరిలో వుండే శాసనాలు.

గ్రామానికి దక్షిణం మజరా మహమ్మదుభాయి పల్లెకున్ను ఇరికి చెట్టుకున్ను పడమర రేగిచెట్టుజంబిచెట్టుకు తూర్పున అట్లూరు మజరా కవిలింగయపల్లె కొండూరు పొలిమేరసందు శాసనం.

సూర్యుడు – చక్రము – శూలము – త్రిపుండ్రము – శంఖము – చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౫ అగునేటి విజయ సంవత్సర భాద్రపద బ ౧౨ లు కొండూరు కవిలింగయ పల్లె సందుకట్టునవారు కొండూరు వారు వివాదపడి తీర్చి తేరుగడచేసే టందుకు కొండూరి పొలిమేరకాపు దేవిరెడ్డి వుళికిరెడ్డి ప్రమాణ పూర్వకంగా తొక్కేటట్టుగా నిర్ణయం. హాజరతు బీబీ సాహేబులవారి ముతసద్దీ రాజ శ్రీ దేవిడి వెంకటరాయని వారి ముఖాంత్రం పొలిమేర నిర్ణయం.

మడపూరి పీరారెడ్డి, కరణం శేషయ్య; పేమలూరి చెంచురెడ్డి, కరణం తిమ్మయ్య; మాతుకూరి వొబిళ్ల గోపిరెడ్డి చింతలయ; మల్లినేని పట్నం నాటాలనూకాలరెడ్డి, అయ్యవారప్ప; తూడూరి గురివిరెడ్డి; మద్దూరి గరుడారెడ్డి; తిరువెంగళ కుంభగిరి మునలిరెడ్డి, సుబ్బయ్య మొదలైన పిన్న పెద్దలు నిశ్చయించేసినది ౨౧ దినం జయకమ్మ కట్టుకుని పశ్వాది పశువులలో ప్రమాణనీతి(?) జయకమ్మ వ్రాయించి, కొండపైన కోనేటిలో స్నానంచేసి అరిద్ర(ఆర్ద్ర?) వస్త్రములతోను స్వామి సాన్నిధ్యమందు అఖండ దీపం ముట్టించి తీర్థప్రసాదాలు తీసుకుని పువులదండ మెడను వేసుక పొలిమేర తొక్కి ౨౧ దినం జయించి వేసిన హద్దుల వివరం. గోపాలస్వామి దేవళం దక్షిణం కొండబండ ౧, ముచ్చుకోన వాకిటి బండ ౧, గురుగపెంట మూలబండ ౧, రెండు కోనల తలగడ ౧, కోన వాకిట ౧, ఓబుళరాజు కుంట అలుగున ౧, తూరుగిండి తూర్పున మెల్ల మాని పడమట ౧, పేటబాటను ౧, పోలేరమ్మ పాటిమీద జమ్మిమాని తూర్పు యీ శాసనం (యీశాన్యం?) ౧ ఆద। పొలిమేర హద్దురాయి కాలువలో ౧, వుభయం ౧౧ న్నూ ఇవి లోగడరాళ్లుదుల్లూ(?). ఈ శాసనం కటోజు యర్రా బత్తుడు వ్రాసినది.

అహాషాం పాయకట్టు పాంతప్రభువులవీడులో నుండే శాసనాలు। పాడు గుళ్లవద్ద వీరభద్రుడు బైలులో నుండే దానికి పడమర ఉండేది ప్రథమ భాగం శాసనం పగిలి అంతిమ భాగమందు ఉండేది.

హాళే కన్నడ అక్షరములు.

౧. ...కొలకుట్ల శ్రీ మాధవేశ్వర... దేవస్థానములకు పడు సుమ రెడ్డి కుంట............కమసేసి యీ చంద్రార్కస్థావి...ధర్మము కాని కామిరెడ్డికి...పుణ్యముగాను చెల్లించు వారము। ఈ స్థానాపతిఅయ్యా దేవర పూజా(దిక ?)ము నడిపి యీవృత్తి యనుభవింపుడు। దీనికి వక్ర మైనవారు పంచమహాపాతకములు చేసినవారు. మంగళమహా శ్రీ శ్రీ

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్ఠిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

దీని వ్రాసినవాడు। దేవని కొడుకు కామయ॥

౨. ఈ శాసనానికి తూర్పు శిథిలమై వుండే శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪ ౬౮ అగునేటి పరాభవ సంవత్సర ......లు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలయ్యవారి ఆనతిని అళిరామరాజయ్యవారి ముదలను నంద్యేల తిమ్మరాజుంగారు వేయించిన శిలాశాసనం. తమకు చెల్లే అమర గ్రామములు ఉంబళి గ్రామాలు(?)...భండారు వాడగ్రామాలు అగ్రహారం దేవస్థానాలకు సర్వమాన్యంగాను నడుస్తూవుండగాను మంగలవారు యిచ్చే సిద్ధాయం కానికె దొంబరపన్ను సహ సర్వమాన్యంగాను యిస్తిమి। యీధర్మా నకు। ... (ఇక్కడ అక్షరములు పోయినవి।)

ఈ శాసనానికి పడమర గ్రామానికి పడమర మల్లేశ్వర శివా లయం పాడుదిన్నెలో వీరులరాళ్లపైన శాసనాలు వున్నవి. వాటిలో ఒకరాతిపైన శ్రీ (స్త్రీ)పురుష ప్రతిమలు దిగువ వొక తపస్వి యివి కూర్చుండి యున్నవి। వాటిపైన వ్రాసియుండేది. బికదయ్య లింకాని తాత మల్లజియ్య......

ఈ శాసనానికి తూర్పు గ్రామానికి తూర్పు మజరా వెంకటా పురం పొలిమేర గట్టున మన్నెంపోలు అనే కాపు చేసిన చేను గడ్డన వుండే శాసనం।

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౯ అగునేటి హేవళంబి సంవత్సర కార్తిక శు ౫ గు శ్రీ మద్రాజాధి రాజ రాజ పరమేశ్వర వీరప్రతాప అచ్యుతదేవ మహారాయలు విజయ నగరమందు వజ్రసింహాసనారూఢుండై పృథివి సాంబ్రా(మ్రా)జ్యము చేయుచుండగాను శ్రీమతు ప్రభువుల వీటి స్థితాశేష విద్వన్మహాజనాలున్ను, చిన్నపురెడ్డి గంగిరెడ్డి, దొంతళ ఓబుళురెడ్డిన్ని మొదలైన కాంపులున్నూ కొలకుంట్ల మాధవదేవరమ్మ(?)ముఖ మండపాన కూర్చుని సంతోషం (గా) యాభైయ్యారు దేశాల వారున్ను, యాల్కెజవి పెద్ద గొల్లి (?) వోబుళయా వీరు మొదలైనవారు ప్రభువులవీటి చాకల తిప్పన కొడుకు పెద్దచెన్ను, బసువన్న నాగన, దాదన భూమన, చిన్నచెన్ను, పోలుపావన యిచ్చిన ధర్మశిలాశాసనం...ఇక్కడ అక్షరములు శిథిలమై పోయినవి.

శ్రోత్త ప్రభువుల వీటి ఉత్తరం యెగ్గువకుంటకు ఉత్తరం పొలిమేరసందుకట్టు శిథిలమైన శాసనం.

సౌమ్య సంవత్సర కార్తి శు ౧ సోమవారం స్వస్తిశ్రీ వీర అరియ కంన్ని మహా దేవరాయ వొడయలు పృథివీరాజ్యం చేయుచుండగాను... ఇక్కడ అక్షరములు శిథిలమైనవి.

అహాహాం పాయకట్టు వీరపల్లె అనేగ్రామమున నుండే శాసనాలు. గ్రామానికి నైరు(ఋ)తి అరపరువు దూరమున లంకమలకు తూర్పు రంగపల్లెపాడు అనే బేచిరాకు గ్రామములో పాడుపడిన బావివద్ద నంది ఉండే రాతికి హళేకన్నడ అక్షరముల శాసనం.*

సూర్యుడు – వృషభం – చంద్రుడు

అవిఘ్నమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుజయ శాలివానశక వరుషంబులు ౧౪౬౮ అగునేటి అక్షయ సంవత్సర జేష్ఠ శు ౧ ఆదివారాన స్వస్తినిజ నామాదిక మాహాళికా ప్రశస్తి సహితం శ్రీమన్మహామండ

* See Gaṇḍikōṭadurgam Kaifiyat p. 13.

శేశ్వరం గండ పెండారు (కువర) మురారి (నాయక) నారాయణ బ్రహ్మ రాక్షస జన్నయ్యదేవ మహారాజులు పానుంగల్లు పల్లినాండు పూగి నాడు ఎఱువ సకిలి ములికినాడు భూరజది (?) ముఖ్యమైన సమస్త దేశములున్ను పృథివి రాజ్యంచేసి యేలు భూమండలాన శ్రీమన్మహా ప్రధాని సమస్తఆ (బాహత్తర?) నియోగాధిపతి సంపన్న పెరుమాళ్ళి దేవుండు జన్నయదేవ మహారాజు పంపున ఆది(ద?) రాజునకు పుణ్యముగాను శ్రీ లంక దేవ లంకమల్లేశ్వరదేవరల అంగరంగ భోగ నివేద్య... కార్యానకు వృత్తానకు.........సదరు ళ(ల)ంక దేవరి పురము......వృత్తానకున్ను లెంకటూరు అనావృత్తి(?) ఆ చంద్రార్క స్థావి (యి) గాను ఆ లింగానకు ధారా పూర్వకం చేసి యిచ్చి నిటూరు ఎకించిన రట్టడి ప్రేమ మాన్యమునకున్ను పిడయుడు పాధి... సామాన్యము పూర్వమర్యాద మంగళమహా శ్రీ శ్రీ శ్రీ.

స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుంధరాం।
షష్టి ర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥

... ..అకరస్యకరీరస్యగోసహస్రం......।
.........................దస్మితి॥

ప్రవృత్తకరచంద్ర.........
.........................రోదిఫలమశ్నుతే॥

ఈ ధర్మానెవ్వరేహిన్లు (హీనులు?) దలంచిన వా......లంక ఆకారనరవుండు(?) ఆపక్షయము సేయంగలవాండు.

గ్రామానికి నైరు(ఋ)తి నాలుగు పరుగులదూరమున లంకమ లలో భిన్ననామము కలిగిన మచ్చులంక మల్లేశ్వరుని దేవాలయమునకు

ఉత్తరం కోటపేటను గుడికి పొందినట్టుగా ఉండే పర్వతం గుంటిపైన. అరవం అక్షరాలుతో ఉండే శాసనం.

ఈ దేవాలయమునకు యెదురుగా ద్వారం కడపలో దిగువ పరిచి వుండే (రాతిమీదవుండే శాసనం.) ...... శా(సే)వ

ఓయూరి మల్లమరాజు అబయవా...

మచ్చులంకేశ్వరునికి తుమ్మపువెంకటాద్రి సత(సదా)సేవ చింతమ్మ సతళ(సదాసే)వ.

ఈ దేవాలయానకు పడమర విభీషణుని గుండానకు తూర్పు కొండపెట్టువద్ద ఉండేది.

యోగానంద నృసింహుని సేవ కందాళ్ల నృసింహయ్య కైంకర్యం.

వీరపల్లికి యీశాన్యం కోనసముద్రంచెరువు లోతట్టు యీ రెండు గ్రామముల పొలిమేర సందున వుండేది.

సూర్యుడు. లింగం, పానవట్టం. చంద్రుడు.

మల్లారెడ్డి బైట్టి(?)న లంకదేవునికి పోసినధారా వొరిత్త. యిందుకు యెవ్వరు తప్పినాను గంగకర్త గోవును చంపిన పాపాన బోవువారు. లంక దేవునికి తప్పిన పాపాన బోవువారు...(ఇక్కడ అరక్షములు శిథిలమైనవి)

ఈ శాసనమునకు ఉత్తరం సామీప్యంగా వీరపల్లి బదవోలు తాలూకు మవుజే వనంపులలో చెల్లే మజరా బేచిరాకు కంతాపురం పొలంహద్దు కరణాలజోడి మాన్యంలో ఉండే హళే కన్నడ అక్షరాలు శిథిలమైన శాసనం.*

లింగం. వృషభం.

అవిఘ్నమస్తు. స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర మురారి గండ పెండార నాయకనారాయణ బ్రహ్మరాక్షస జన్నయదేవ మహారాజులు...లుర సుఖసంకథావినోదంబుల రాజ్యంచేయన(గా)ను స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౧౯౨ అగునేటి ప్రమోదూత సంవత్సర జేష్ఠ బ... సోమవారంనాడు దేసెది ......పుణ్యాంగాను......(త్త)లెయనందు లంకటూరి గ్రామము లంకమల్లేశ్వరునికి నైవేద్య...నందాదీపానకు ధారాపూర్వకముగా ధారబోసి యిస్తిమి. ఇందుకు యెవ్వరు చేటు దలంచినాను గంగకర్తను గోబ్రాహ్మణులను జంపిన పాపాన బోవువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరా।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

అహాషాం పాయకట్టు వెంకటసెట్టిపల్లె గ్రామములో సాలెమారా వోబుళయపెరటిలో వృషభం వుండేరాతికి హాళే కన్నడ అక్షరములు మిశ్రితమైన తెలుగు శాసనం। అక్షరములు శిథిలమై వున్నవి.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ శకవరుషంబులు.....సంవత్సర.....పుష్య శు ౧౧ గు॥ నాడు స్వస్తియ నామావళి విరాజమాన మానోన్నత అరలి మహాదేవ మహారాజు...పరబళ అతి శిమ(శయ) వీరావతార వాసువం పట్టణాది మండలికబ్రహ్మరాక్షస నాయకనారాయణ సేనాధిపతి... శ్రీ పరబళ సిద్ధక (సాధక ?) స్వస్తిశ్రీ జన్నయ మహారాజులు......... శ్రీమన్మహామండలేశ్వర।......(ఇక్కడ మతలబు పోయినవి।) ధారా పూర్వకము చేసెను। ఆచంద్రార్కముగాను ఎతిజతి(?) స్తానము। ఇదత్తికి

* See Gaṇḍikōtadurgam-kaifiyat p. 14.

సెవ్వరోళొళు అన్యాయముదలంచినవారు లంకమత్సలంకేశ్వర దేవ రఛే(చే)ంతాను ఆకాశభైరవుని ఛేం(చేం)తాను ఛే(చె)డంగలవారు। గంగాతీరమున గోవుల వధియించినవారు। ఇదత్తి సుధర్మముగ నడిపిన వారు ధన్యులగుదురు। శ్రీమంతులగుదురు। దేవర కారుణ్యాము వడయు దురు। మంగళమహా శ్రీ శ్రీ శ్రీ.

స్వదత్తాం పరదత్తాంవా యోహరేతవసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాంజాయతే క్రిమిః॥

స్వదత్తాద్ద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

గంగాసాగర యెమని (యమున)యు సంగమదొళు కోటి కవిలెయుం బ్రాహ్మణరం లింగిగళం సలెనిలె కుందదె కొందవర్గళిప్పరితందన ళిదురు। అంతువహిం ౧-కి శాసనాలు ౨౩ కసుబా శిద్ధవటం తాలూకాలో వుండే సన్నదులు, తామ్ర శాసనము వగైరా నకళ్లు.

కసుబా సిద్ధవటంలో దరవెశ మహమ్మదు కాదరి వారి మను మడు సయ్యదు అబదు(బ్దు)ల్ ఫతావారి వద్ద వున్నసనదుకు నకలు.

(చూ. అనుబం. పార్శిశాసనములు 6)

## శేఖ రహిమతుల్లా

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౨౯ అగునేటి సర్వజితు నామసంవత్సర వైశాఖ బ ౨ లు సాహెబు మహర ఖాన దరివేసు మహమ్మదు పేరుజాదా సాహెబులవారికి హవేలి సిధవట్ట(ద్ధవట)ము గ్రామాదులవారు క॥ ఒంటి మిట్ట ॥౧॥ మ॥ మల్నేనిపట్నం।౧। మ॥ తకోోలు ౧ మ॥ జ్యోతి ౧। మ॥ ఒంటి తాటిపల్లి ౧। మ॥ జన్నవరం ౧। శి(సి)ద్ధవటం కుంటలు ౪। మ॥ పాళె

ముకు కుంటలు ౧పే। మొదలైన గ్రామాల రెడ్డికరణాలు వ్రాయించ్చి యిచ్చిన భూదాన పత్రిక.

మశ(స)కత్తు రఫాఅతు పనహా ఆమీాన్ బాలాఘాటువారు నూరు బిగువులు జమీాన్ మా గ్రామంపొలంలో యినాం యిప్పించ మని శ(సె)లవు యిచ్చినారు. గనుక అలాగే హాజరతిగారికి సవాబుగాను బీడుజమీాన్ లాయఖు జిరాయతు ॥

| ఒంటిమిట్టను కుంటలు | మల్నే నిపట్నం కుంటలు | చేను తక్కోలు చేను కుంటలు |
|---|---|---|
| చేను ౧౦౦ | ౪౦ | ౨౫ |
| మడి ౩౦ | —— | |
| —— ౧౩౦ | | |

జో(జ్యో)తి చేను కుంటలు ౨౦ వ(ఒ)ంటి తాటి పల్లె చేను కుంటలు ౨౫ శి(సి)ద్ధ వట్టం కుంటలు ౨౦ పాళెం మజీద యినాం యిచ్చి నాం। సాహెబులవారికి అవలాదు అఫవాదు పరియంతము అనుభవించు కుంటూ ఉండ వలెను.

(1) छ. चैद्र. १६ माहे सफर हिजीरी.

కలువాయి గంగిరెడ్డి వ్రాలు। వంటి తాటిపల్లి ముసల్మ (లమ) రెడ్డి పాపిరెడ్డి కాంగ శి(సి)ద్ధారెడ్డి సమ్మతి వ్రాలు। కరణం చెన్నయ వ్రాలు। మలినేని పట్టం బసిరెడ్డి। ఒంటిమిట్ట యెర్ర (ఎఱ్ఱ)రెడ్డి వ్రాలు కరణాలు। వెంకటరామ వ్రాలు। తక్కోలు వో (ఓ)బి రెడ్డి వ్రాలు। తిమ్మరెడ్డి వ్రాలు। జో(్య)తి భూలోక రెడ్డి సమ్మతిని కరణం శీ(సీ)తా రామయ్య వ్రాలు। శి(సి)ద్ద వటం పాలెం వో (ఓ)బిళి రెడ్డి సమ్మతిని కరణం చం (చె)న్నయ వ్రాలు। జుమలా యిన్నూట అరువై కుంటయి

సాహేబుల వారి అవలాదు అఫవాదు పరియంత్రము అనుభవించు కుంటూ సుఖాన వుండవలెను।

(2) छं. १६ माहे सफर सन १११९ हिजीरी.

అడుగున పైన వ్రాసిన రెడ్డి కరణాలు చే వ్రాళ్లు పునరోక్తిగా వ్రాసి యున్నందున తిరిగి వ్రాయలేదు.

(చూ. అనుబం పార్శ్వశాసనములు 7)

ఈ సన్నదు నవాబు సాదుల్లా ఖానుడు సన్ను ౧౧౩౯ పసలిలో దరివేశ మహమ్మదు అనే వానికి వంటూటపలి (ఒంటితాటిపల్లి?) గ్రామం మాన్యంగా యిచ్చినారు.

(చూ. అనుబం. పార్శ్వశాసనములు 8)

కసుబా శి(సి)ద్ధ వటంలో శేఖ అలి ఖతీబ మజీద చౌకమహమ్మదు వాుసేను వారివద్ద కాగితం నకలు.

రాజా కిశరసింగు కిల్లాదారు। పౌజుదారు క। మజుకురు శి(సి)ద్ధ వట్ట(ట)ం।

బహూధాన్య నామ సంవత్సర జే(జ్యే)ష్ఠ బ ౧౦ లు రాజశ్రీ నేద నూరి రంగప్ప యిజార తేదారు క॥ శి(సి)ద్ధ వట్ట(ట)ము రెడ్డి కరణాలు నూజాయయతు దస్తుర రమోల్లా అల్లీకి వ్రాయించి యిచ్చిన ధర్మ శాసనం। స్న। వ్ర(?)తె స్వాలె(సాల్ ? ఎ-) అలిఫక। సిద్ధవటం లోను వజారతు రొకుబాలు పనహా శుఫకతు యిఖలాసు దస్తుగా హా... సా వోబులవారు కసుబె మజుకూరి లోను మీాకు యినాము యిచ్చినారు। గనుక అందుకు స్థళ వివరములు సన్నదులు।

మ। వా. శిద్ధ ? . ము...కిశారపురం బస్వినేని మాలెచేలలో ౩౦ గారి ల(?)దగ్గిర చేను కుంటలు...ఖాసాకు చేనుకుంటలు ౨౦ కచ్చకాయ యంత వాగు దగ్గర చేనుకుంటలు ౫ బోగం యిండ్లదగ్గర రాచించ్చయ చెర్వునీరు ముంపున గుడివారి మడిస్థళం కొండకింద కుంటలు(మొత్తం)౨. (వెరసి) ౫౭ ఈ ప్రకారం స్థలం నిర్దేశం చేసి

యిచ్చినాము గనుక యీ ప్రకారం మీ పుత్రపౌత్ర పారంపర్యముగా యినాము అనుభవించుక మశీదులోను ఖజ(ద)మతు చేసుకుంటు సుఖాన వుండేది। సన । బ। సాలులు ౮౨.

* मोतबुस्रुद

కసుబా శి(సి)ద్ధ వట(ం)లో జ్యోశి(స్యు)లు అయ్యంభట్లు కొమారుడు అప్పాభట్లువారివద్ద వుండే ఫతేశింగు కిల్లేదార్లు యిచ్చినసనదు ॥

ఫతే శింగ్గ (సింగు) కిల్లేదారు ఫవుజదారు శి(సి)ద్ధ వటం గారు.

(చూ. అనుబం. పార్శీశాసనములు 9)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౬౩౬ అగునేటి జయనామ సంవత్సర భాద్రపద శు ౧౫లు మహారాజశ్రీ గారు శ్రీ మద్యజనాది షట్కర్మనిరతులైన శి(సి)ద్ధవటం చంద్రశేఖర జోస్సు (జ్యోస్యు)లు వారికి వ్రాయించి యిచ్చిన భూదాన పత్రికె। కసుబే మజుకూరులోను చెర్వులోను వుదయ శి(సి)ంగు మడి స్థళం నాల్గు కుంటలు మడి సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను మా తల్లిగార్కి సుకృతంగాను మాన్యం శెల్వు (సెలవు) యిచ్చినాము। మీ పుత్రపౌత్రపారంపర్యంతం ఆ చంద్రార్క స్థావి(యి)గా అనుభవించుక సుఖాన వుండేది.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం ॥

కసుబాశి(సి)ద్ధవటంలో కానుగోనాయుబు నరసింగరావు భాకరే వారి వద్దవున్న సన్నదుకు నకలు దాన పత్రాలు నహాగాను.

౧. దానపత్రం. మొహరు. శ్రీరామ.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౭ అగు నేటి పార్థివనామసంవత్సర చైత్ర శు ౫లు రాజశ్రీ కానగో బాపారాయని వారికి శ్రీ మన్మహామండలేశ్వర మట్లు తిరువెంగళనాథ రాజదేవచోడ మహారాజులుగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మ

శాసన క్రమమెట్లన్నను: శ్రీగిరిద్వారమునకు ఉపద్వారమైన సిద్ధవటం సీమలో వో(ఓ)బుళంపాయకట్టు బొడియం బొడియచెర్ల గ్రామం మీాకు అగ్రహారంచేయించి వుండి అగ్రహారంపొలంలో చెరువు వేయిస్తున్నాము। ఆ చెర్వులోతట్టున మన్య(మన్నె)కావలిమాన్యం స్థళాలువున్నవి గదా ఆ పొలంతమకు మాన్యముగా శెల్వు(సెలవు) యివ్వవలెనని పలకరించు కుంటిరి గనుక అదే ప్రకారం గ్రామాన మాకు నడిచే మాన్యం కుంటలు ౧౨ కుంటలు। పన్నెండు కుంటలున్నూ మీాకు యీా పుణ్యకాలమందు సహిరణ్యోదక దానపూర్వకముగాను మాన్యం శెల్వు(సెలవు) యిచ్చి నారం. మీా పుత్రపౌత్రపారంపర్యంగా అనుభవించుకుని సుఖానవుండ వలెను.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

మట్లు వెంకట రామరాజా

సూర్యుడు. చంద్రుడు.

౨. శ్రీరామ

తెనుగుతో మొహరు దస్కతు సహాగావున్నది.

బహుధాన్య సంవత్సర ఆశ్వీజ శు ౫ లు శ్రీ మన్మహామండలేశ్వర మట్లి వెంకటరామరాజ దేవచోడమహారాజులుగారు పులుగులనాటి శీ(సీ) మామూలంరెడ్డి కరణాలకు మండవల(మండల ?)సుంకర్లకు పుత్తెంచిన ప్రయోజనం। బ్రాహ్మణ కరణాలకు నమస్కారం। తర్వాత కానుగో రుసుము మాన్యాలు రాజశ్రీ బాపారాయని వారి ముఖాంత్రం శెల్వు (సెలవు) యిచ్చినారం। నిర్ణయ ప్రకారం। వీరి రుసుమురూకలు వీరి గుమాస్తా వశాన చెల్లిస్తూవచ్చేది। ఫిర్యాదు రాకుండా నడుచుకునేది।

శ్రీరామా

3. తెనుగుతో మొహరు దస్కతులు వున్నవి।

శ్రీరామ। వ(వ్య)య సంవత్సర కార్తిక బ ౫ లు గళ్లాగురువనికి(?) శ్రీ మన్మహామండలేశ్వర మట్ల తిరువెంగళనాథరాజు దేవచోడ మహా,

రాజులుంగారు నమస్కారం। రాజశ్రీ కానుగోయి బాపారాయనివారికి బొడియచర్లలో నడిచే మాన్యానకు అడ్డిచేసినారట। వారు యిందు నిమిత్యం పలకరించుకున్నారు గనుక వారి మాన్యంవారికి శే(సె)లవు యిచ్చినారం। వారు ఆ మాన్యం యెవ్వరికి చెప్పినారో వారికి నడిపించి యిందుల ఫిర్యాదు రాకుండా నడుచుకునేది।

౪. మోర్త బసుద మొహరు (తెనుగు)

శ్రీకృష్ణ।

బహుధాన్యనామ సంవత్సర చైత్ర శు ౧౨ లు శ్రీమతు సకల గుణ సంపన్నులైన కోవూరి సూరప్పకు చుట్టూరి ముసలినాయడు దండములు। తర్వాత బొడియచెర్లగ్రామమున రాజశ్రీ కానగో బాపారాయనివారు చెరువు కట్టిస్తున్నారట. అక్కడ కావలిపాలం వున్నది। వారు చెరువువేసినప్పుడు ఆ చెర్వుపూచి తలచ పని లేదు॥ తెలిసేది। తాజాకలం: ఆ చేనువారికి యినాము ఆ చేను పూచి తలచ పనిలేదు.

మోర్తబసుద – మట్ల వెంకటరామరాజు – శ్రీరామ = మొహరు

౫. బహుధాన్యనామ సంవత్సర ఆశ్వీజ శు ౫ లు శ్రీ మన్మహా మండలేశ్వర (మట్లి) వెంకటరామరాజు దేవచోడ మహారాజులంగారు పొత్తపినాటి సీమామూలం రెడ్డి కరణాలకు సుంకంమండవా(పా)న్డ్యాల కరణాలకు పుత్తెంచిన ప్రయోజనం। బ్రాహ్మణ కరణాలకు నమస్కారం। తర్వాత కానుగోరుసుము మాన్యాలకు రాజశ్రీ బాపారాయనివారి ముఖాం తరంగా శెల్వు(సెలవు) యిచ్చినారం। నిర్ణయప్రకారం వీరి గుమస్తాలవశాన చెల్లిస్తూవచ్చేది। ఇది మాకు అవశ్యక ప్రయోజనం। ఫిర్యాదురాకుండా నడుచుకునేది।

౬. ములసి(ముసలి)నాయనిగారి తాకీదు సనదు.

శ్రీకృష్ణా

ఈ మొహరులో శ్రీకృష్ణా। చుండూరు ముసలినాయడు (అని వున్నది)

రాజశ్రీ చుండూరు ముసలినాయనిగారు కొప్పర్తి తిమ్మారెడ్డికి పుత్తెంచిన ప్రయోజనం(౦)। తర్వాత। మీ గ్రామానకు మాకు రాగల రుసుము కట్లెళ్లకుగాను నరసింగరాయనిపేట హండేబడేనాయకుణి(ని) గారికి గ ౨౩౧౮ యిరువై మూడు వరహాలు నాలుగురూకలు యిచ్చి నందుకు మేము విచారించి రాబ(జ)శ్రీ బాపరాయవివారికి తిరుగా యిప్పించి నాము। మాకు ౨౩౧౮ గ్రామాన జమచేసి అంపించేది। రాజశ్రీ రాయని వారితో కూడినది మాకు అగత్యము। వారి గ్రామంతో కూడినందుకు సుదామదు(?) శ్రోత్రియం ప్రకారం చక్కగా నడిపించేది। జాస్తి ఉప ద్రవం యియ్య పనిలేదు తెలిసేది.

సదరహునాయనిగారిది।

శ్రీకృష్ణా చుండూరు ముసలినాయుడు

౭. ప్రమాది సంవత్సర కార్తిక శు ౧౦ లు రాజశ్రీ చుండూరు ముసలినాయనిగారు నరసింగరాయనిపేట కాపులకు వ్రాయించి యిచ్చిన కౌలునామా। రాజశ్రీ బాపారాయని వారు మీకు కౌలువ్రాయించి యిచ్చినారు గదా। వారు యిచ్చిన కౌలే మేము యిచ్చినట్లుగా గ్రహిం చేది। మీరు మరియేవిశయాన్న(ష)యూనను) యితర యోచన శా(చే)యక ఖాతరజమాతో మా కౌలు విశ్వసించి మీరు సుఖంగా గ్రామములోవుండి సై(సే)ద్య నాద్యంచేసుకుని సుఖానవుండేది। మీకు యెవ్వరైనా తంటలు తగాదాలు చేస్తే మేమువిచారించి బాగుచేసి యిస్తున్నాము। కౌలు విశ్వసించి గ్రామములో సుఖానవుండి సాగుబడి సంతన విస్తారంగా చేసుకుని సుఖానవుండేది। తెలిసేది.

శ్రీరామ మొహరు

౮. సిద్ధార్థి సంవత్సర చైత్ర శు ౧౩ లు శ్రీమతు కోవూరి సుబ్బ రాయనికి శ్రీ మన్మహామండలేశ్వర మట్లీ కుమార వెంకట రాఘవరాజు దేవచోడ మహారాజులుంగారు నమస్కారం। తర్వాత। సిద్ధవటం పర గాణాలో కురగుంటపల్లె యిలాకాలో బ్రాహ్మణ పల్లె అగ్రహారములో నగరి దసవందం మడి కుంటలు ౧౮ పద్యనిమిదికి రెండు పాళ్లకు కు ౧౨

పండ్రెండు కుంటలు రాజశ్రీ నరసింగరావు భాస్కరాగారికి పూర్వోత్తరం పెద్దలు యిచ్చి వున్న(ం)దులకు పటి పరంక్రు(కృ)షి యేమి అక్కర లేకుండా దయచేసి నడిపిస్తూ వున్నందులకు, హాలి రెండు సంవత్సరాల నుంచి తిరుగా సన్నదు కావలెనని తకరారుచేసి। పింగళ సంవత్సరం కాళ యుక్తి సంవత్సరం వారి సొమ్ము తీసుకున్నారుట। మీాకు నిమిత్య(త్త)ం యేమి? పూర్వోత్తరం నుంచి యే ప్రకారం నడుస్తూ వచ్చిన ద్యో(దో) ఆ ప్రకారం నిరాచ్ఛేదనగా నడిపిస్తూ వచ్చేది। బాడియచర్ల కావలి మాన్యం సుదామదు ప్రకారం చక్కగా నడిపించేది। ఇందుల పిర్యాదు రానియ్య పనిలేదు। తాకీదు వ్రాసుకుని అసలు తిరుగా యిచ్చేది। హాలి ముందర యే అములుదారుడు వచ్చినా ఈ సన్నదు ప్రకారం నడిపించేది। తెలిసేది।

ఇందులో వుండే మొహరు అక్షరములు చక్కగా తెలియలేదు। తెనుగు మొహరు।

వెంకట రామరాజుల యొక్క కొమారుడు అప్పయరాజు పిడికొమారుడు వెంకటరాఘవరాజు వ్రాసిన తాకీదు.

మొహరు శ్రీరామ

౯. శ్రీ మద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యులైన వింజమురి అప్పళా చార్యుల వారికి శ్రీ మన్మహామండలేశ్వర మట్లి కుమార వెంకట రాఘవరాజ దేవచోడ మహారాజులుగారు దండం। తర్వాత। శి(సి)ద్ధ వటం శీ(సీ)మలో నగరి దస(శ)వందంలో మడి కుంటలు ౧౮ పద్యోనిమిది కుంటలకి రెండుపాళ్ల కుంటలు ౧౨। పన్నెండు కుంటలు రాజశ్రీ నరసింగ రావు భాస్కరాగారికి పెద్దలు దయచేసి యిచ్చిన నాటి నుంచి చక్కగా నడిచినందుకు యిటు(టీ)వల రెండు మూడు సంవత్సరములనుంచ్చి గ్రామ ములో లుకసాను వచ్చినదని రాయని వారికి వు(ఉ)పద్రవంచేసి వారి రైతులచేత పరంకృషి మీారే తీసుకుంటూ వున్నారట. మీాకు నిమిత్యం యేమివున్నది। ఇది వరకు తీసుకున్న సొమ్ము రాయని వారికి యిప్పించి

ముందర వారి జోలి రయ్యతులజోలి తలచపని లేదు। ఇందుల ఫిర్యాదు రానియ్య పనిలేదు। శీగ్ర(ఘ్ర)ంగా వారి సొమ్ము రైతులచేత తీసుకున్న పరంకృషి వారికి యిప్పించేది। తెలియవలెను। వ్రాయగల ప్రయోజనము లకు వ్రాయించి పంపిస్తూరావలెను। సిద్ధార్థి సంవత్సర చైత్ర శు ౧౩ లు। ఈ తాకీదు వ్రాసుకొని అసలు తిరుగా యిచ్చేది। అంతు మట్లు వాగు వ్రాయించిన సనదులు

జూపల్లి సంస్థానం వారు వ్రాయించియిచ్చినవి.

శ్రీ లక్ష్మి నృసింహ్వ

౧. యువనామ సం॥ పుష్య శు ౨ లు భా(పా)పారావు భాకర తానుగోగారికి జూపల్లి లక్ష్మిరాయనిగ్గా (ంగా)రు వ్రాయించి యిచ్చిన కరారు నామా। సన్న ౧౧౬౫ ఫసలి మీాకు యీా సంస్థానంతో కూడిన వ్యవహారములకు దివాణాలలో బాగుచేయవలసిన వ్యవహారము లకు మీా ఆధీనం చేస్తిమి గనుక యేయే వ్యవహారములకు (యేయే ప్రకారముగా నడిపించవలయునో ఆ ప్రకారం) *మీా గుండా నడిపించు కుంటూ రాగల వారము। మిమ్ములను వి(మి)నహా చేసి మరి వఖ(ఒక)రి గుండా యే ప్రయోజనమున్ను నడిపించుకునేది లేదు। ఇందుకుశ్రీ లక్ష్మి నృశింహ్వ (సింహు)లే సాక్షి। యి(ఇ)త్తు యీారి మీాద వున్నది। సంస్థా నం ముందరికి తెచ్చి సర్వ నిర్వాహకం చేయవలసిన భారం మీాది। ఇది వ్రాయించిన కరారు నామా॥

(చూ. అనుబం. పార్శ్వశాసనములు 10)

ముహారు

౨. శ్రీ లక్ష్మి నృశింహ్వ (సింహ). స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౬౭౯ అగునేటి బహుధాన్య నంవత్సర

---

* This not found in the original, but as it is necessary to make the context intelligible, it is retained.

ఆషాడ శుధ(ద్ధ) ౧౩ లు కానుగో బా(పా)పా రాయని వారికి జూపల్లి లక్ష్మానాయనిగారు వ్రాయించి యిచ్చిన దానపత్రం॥

పోంగూరు పొలంలోను గొర్తులు

| | | |
|---|---|---|
| మూర్పు పొలంలో యిరువైగొర్తి వెలిపొలం | — | ౨౦ |
| సర్వరాజు బావిక్రింద పొలం | — | ౧ |
| చెర్వుక్రిందమకు(?) మడి | — | ఖ౧౩* |
| జుమలా గొర్తులు | — | ౨౧౧౩ |

ఈ ప్రకారంగా సెలవు యిచినాము ఈ మాన్య పొలం వగైరా విసా(స్తా)రంగా ఫలపర్చుకుని, అందుల వచ్చిన సకల ఫలాదులున్ను మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను ఆ చంద్రార్క స్థావి(యి)గాను అనుభవించుకుంట్టు సుఖమై యుండవలెను.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛే(చ్ఛ్రే)యోను పాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

శ్రీ లక్ష్మినృశిం(సిం)హః

3. యువనామ సంవత్సర పుష్య శు ౧౨ లు బాపారావు భాకరె కానుగో వారికి, జూపల్లి లక్ష్మినాయనిగారు వ్రాయించి యిచ్చిన కరారు నామా। సన్న ౧౬౬౫ [1665 error for 1165] ఫసలి మీామనో వృత్తికి సాలీనా యిన్నూట య్యాబైవరహాల చొప్పున నిర్నయంచేసి అందుకు యిన్నూరు వరహాలు దుత్తలూరు గ్రామాదుల మీాద, తన ఖాలో తక్కువ య్యాభైవరహాలకు పోంగూరి వూరికి తూర్పు పొలంలో యువ సంవత్సరం వరకు సాగుబడి అయిన పొలంగాక విట(బీటి) పొలం హద్దునిర్నయం: తూర్పు యినే దక్షిణానకు మహిమలూరి బాట,పడమటికి పుల్లవానితోపు, ఉత్తరానకు నందవరందోవ। ఈ మధ్యవున్న చెతు స్సీమ బీడుబావులు, కుసలమ్మపాటి తోపులో వెంకాజీ పంతులు బావి,

* This is not found in the original of LR Vol.

దారి దక్షణాం సాటవావారిబావి మహిమలూరి సర్వరాజు తోపు, చిన్న మంచినీళ్ళబావి యీ మూడుబావులు శెల్వు(సెలవు) యిచ్చి నారము, ఈ పొలం బావులవల్ల ఫలపరచి తనఖాపైకం యెల్లప్పటికి మొకరరు చేయించినారము। ఏసాలు సొమ్ము ఆ సాలున రాబె(బ)ట్టు కుని అనుభవించి మా ప్రయోజనంపట్ల రుజువున నడిపించుకుంటూ సుఖాన నుండేది॥

శ్రీ లక్ష్మి నృశింహ్వా

ర. యువ సం॥ పుష్య శు ౨ లు బాపారావు భాకరే కానుగో వారికి జూపల్లి లక్ష్మా నాయనిగారు వ్రాయించి యిచ్చిన కౌలునామా। ......న్న౧౧౬౫ ఫసలి కసుబా పొంగూరిలో అప్పారాయనింగారి పేరట పేట కట్టించేము। కౌలు కావలెనని మందలిస్తిరి గనుక మీరు పిలువ నంప్పిచ్చి ప్యా(పే)టలో వుంచ్చిన వర్తకులకు హాలుసాలు తాగాయతు అయిదు సంవత్సరములకు పన్నురుసుములు వగైరాలు మాఫుచేసి నడిపిస్తున్నారము। విస్తారం వర్తకులను పిల్వనంపించి ప్యా(పే)ట ఆబాదాని చేసి అయిందాకుప్యా(పే)ట వగను వచ్చిన హాస లులో అప్పారాయనింగారు సగం సొమ్ము మీరు సగం సొమ్ము తీసు కుంటూ మీ పుత్ర పౌత్ర పారంపర్యంతముగాను అనుభవించుకొంటూ విస్తారం ఆ బాదాను చేయించేది. ఈ ప్యా(పే)టకు స్థళ నిర్ణయము: తూర్పుకు అలుగు వాగు, దక్షిణానకు పల్లెపాడు - కేతగుంట వారికి వేసిన కట్టవాలు, మరమట్టికి (పడమటికి) కట్టదగ్గిరి నుంచి కేతుగుంటకు పొయ్యేబాట, ఉత్తరానకు అయ్యపరెడ్డి గారి యిండ్లు। ఈ చతు స్సీమలో యిరువైగొర్లపొలం శెల్వు (సెలవు)యిచ్చినారము। యీప్యా (పే)టలోకి వచ్చే వర్తకులు పషు(శు)వులు మేశే(సే)టందుకు సుదామదు ప్రకారం పొలం। ప్యా(పే)టలో వున్న వర్తకుల పశువులకు గ్రామంలో వారితోపాటు। యీ చొప్పున నిర్ణయంచేయించినారము। విస్తారం బస్తి చేసి అందులో వచ్చిన ఫలం సదరహీ ప్రకారం అనుభవించి సుఖాన నుండేది। ఇది వ్రాయించి యిచ్చిన కౌలునామా వహీ. ఇందుకు లక్ష్మి నృశింహ్వా (సింహు)లే సాక్షి॥

శ్రీ లక్ష్మీ నృశింహస్వా(సింహః)

౫. రాజశ్రీ జూపల్లి లక్ష్మారాయనింగారు గుండమడకల యేరు కసుబా భైరవరం అప్పసముద్రం గ్రామాదుల కాపులకు మాజీ కరణాలకు దండం। సన్ను ౧౧౬౫ ఫసలి మవుజే మజకూర్ల దేశము ఖమన్ను కావలి నెలకావలి రుసుము కట్నము మిరాశి అయివజు మవుజే మజుకూర్లకు రాజశ్రీ బాపారాయనింగారికి సాలినా హొన్నులు ౨౦౦ ఇన్నూరు వరహాలు తనఖా చేసి నారం ముకందాయం ప్రాప్తిని వారికి ముట్టనిప్పిస్తూ వారు వ్రాసిన ప్రకారం నడుచుకుంటు వచ్చేది। కర్చువెచ్చాలకు కావలసిన చీటి వ్రాసి పంపిస్తే యిప్పిస్తూ వచ్చేది। యువనామ సం॥ పుష్య శు ౨ లు ॥

౬. శ్రీమతు సకల గుణ సంపన్నులైన శ్రీ మహామ్మేరు సమానాధీరులైన రాజమాన్య రాజపూజితులైన రాజశ్రీ కానుగో బాపారాయని గారికి రావు చంగమనాయనింగారు దండం। మే మున్న శ్రావణ బ ౮ ల వరకు కుశలం। తమ సంతోషాతిశయములకున్నూ, వ్రాయించి పంపిస్తూ రావలెను। తర్వాత తమరు హాజరతు నవాబు సాహెబుల వారితో కూడా తర్లి వచ్చి మారెళ్ల తాలూకాలో ప్రవేసి(శి)ంచినారని విన్నందున చాలా సంతోషమాయెను। మారెళ్లసీమ సరిహద్దున మా తాలూకా గ్రామాదులు వున్నవి। కహింకబాడం(?) హద్దు తప్పిరాకుండా దయచేయించగలందులకు తమతో వార్త లండి రమ్మని రావూరి లక్ష్మానాయని గారిని అంపించినాము లమ్కరు తాలూకు వారు హద్దు తప్పిరాకుండా దయచేయించ వలెను। స్నెహ్యా(హ)ం వున్నయెడల తెలిసినవారికి విశేషించి వ్రాయించి పంపించవలసినది యేమి వున్నది। ఇత్యాది వర్తమానములు అంతర్యమందున వుంచి నానాటి శుభాభ్యుదయములకు వ్రాయించిపంపిస్తూ రావలెను. అంతు జూపల్లి సంస్థానీకులు సనదులు ॥ వగైరా ౬.

గ్రామస్థులు వ్రాసి యిచ్చిన దాన పత్రాలు :

ఈ మొహారు అబ్దుల్‌రజాకుమియా వారిది

౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౩ అగు నేటి ప్రజోత్పత్తినామ సంవత్సర జే(శ్యే)ష్ఠ శు ౧౦ లు మహారాజశ్రీ వెంకటరావు విశ్వాజి భాకరు కానుగో కులుకర్నాటకు గారికి ఇప్పపెంట ఆరు గ్రామాదులలో చెల్లే మోజే బుగ్గలెపల్లె అధికారి, రెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియదాన పత్రికె: సన్ను ౧౧౬౦ ఫసలి మాగ్రామములో ఉత్తర భాగాన బాడెపల్లి బచ్చిరెడ్డి చెర్లో(రువు లో)తట్టు చేను ఆ చెరువు క్రింద పంపులు (?) ఆ ఉత్తరం చింతమాకుల పాడుసహాగాను మీకు పల్లెగట్టుకు నిర్దేశం చేసియిచ్చిన వివరం। ఈ పొలానకు హద్దు(లు): వు·త్తరం హద్దు అల్లకడ్డ కాలవహద్దు, తూర్పునకు హద్దు కడపనుంచి ఇప్ప పెంటకు పొయ్యే వెలగచెట్టు (పొయ్యేదారిలో వెలగచెట్టు దగ్గరి) రసూలు ఖానుని పొలంహద్దు, దక్షణానకు హద్దు రెడ్డి మాన్యంచేను బయ్యనపల్లెదోవ హద్దు, పడమటికి హద్దు కాళువపంతుల వారి పల్లెకు ఇటన(?) చేను పంపు వూ(ఊ)టుకూరి నుంచి వచ్చిన దోవ హద్దు, ఈ నాలుగు హద్దులకు లోగావున్న పొలం, బీడువంకలు దిన్నెలు సహాగాను ఖం ౹౭ ౧కి పల్లెకట్టుకు చేను ౭౧ వనానకు ౭౧ రెడ్డి మాన్యానకు ౭౧ వు(ఉ)భయం చేను ౭౩ గాక నిలిచిన చేను ౦౪౩కి గుత్త(త్తి)గ నిర్ణయం ప్రతి సంవత్సరం ౧టికి గగ* ౪౬ అక్షరాలా పంద్రామోడిన నల్బైఆరు వరహాలు మడియాలకట్టు గుత్తగాను యీ వ్రాసిన హద్దులలోగా మీరు పల్లెకట్టుకుని బావులు తోవు (తవ్వు)కొని కుంటలు వేయించుకుని కారు వైశాఖాలకు, ఆకుతోటలు చెరుకు, రస వర్గాలు, యే పైరులు చేసుకున్నా యేమి ఫలంపెట్టుకున్నా యెల్లప(ప్ప)టికి యిదే మీకు నిర్ణయంగాను, యిది గాక రుసుములు, వాజె ఖర్చులు, పంప్పకాలు, వట్టి బాబులు, దేశీలుగాను పని లేకుండా నిర్ణయంచేసి మీకు శ్రోత్రియంగా యిస్తిమి గనుక మేము నడిపించగలవారం(ము). మా కౌలు నమ్మి విస్తారంగా ఫలం చేసుకుని మీ పుత్రపౌత్ర పారంపర్యతరం సుఖాన అనుభవించుకునేది।

* గగ = గద్యలు double గగ indicates plural.

ఇందుకు రెడ్డి కరణాలు హద్దులు తప్పితం చేసిరైనా కాశీలో గోహత్య చేసిన పాపానపోవుదురు। తురకలు తప్పితం చేసిరైనా ఖుదా సాక్షి వు(ఉ)న్నది. ఇటనడపా(?) యిష్ట దేవతాధర్మ సాక్షిగా వ్రాయించిన శ్రోత్రియ దాన పత్రిక.

ఈ పొలానకు బశి(సి)రెడ్డి చెర్లోకి సింగరయ్య కాలువనీళ్లు వంక తూర్పున వచ్చే రెండు వంతుల నీళ్లల్లోనున్ను ప్రతి సంవత్సరం జొన్న వి త్తినదారభ్యం ఆరు నెలలు పాతిక పాలునీళ్లు యివ్వగలవారం. ఆరు నెలలు వెళ్లిన వెనుక నీళ్ళకు మీాకు పనిలేదు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥
దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

అధికారిరెడ్డి కరణాల సమ్మతిని స్వహస్తం కరణం యల్లప్ప వ్రాసినది. నోత్రెడ్డి గంగిరెడ్డి అపాపిరెడ్డిగారు సమ్మతించి కలంముట్టిన గుర్తు. మాన్యం. వనంపల్లెకు తీసివేసిన పొలానకు ఆచ్ఛేదనం చేయగల వారం కాము। యీా గుత్తలోకి అనుకువ కాదు. అధికారి మోటుభాయి నిశాని.

बा तारीख ८ माहे रजेब सन ११६० फसली प्रजोत्पत्ती नाम संवछर जेष्ट शुद्ध १० दसमी.
नंबर ९९.
नबर ९७.

శ్రీరామా కరారినిశాని

౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౨౭ అగు నేటి మన్మధనామ సంవత్సర కార్తిక శు ౧౫ లు మహారాజశ్రీ వెంకటరావు భాకరాకానుగో కులకర్ణి కుల్కర్నాటక దేశ ముఖ సరదేశముఖ మహాలాని హాయని గారికి చెన్నూరు పరగాణాలో

చెల్లేమవుజె యేపుగంటిపల్లె అధికారి రెడ్డికరణాలు వ్రాసి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక : సన్ను ౧౧౨౭కి ఫసలి మా గ్రామాముం పొలం లోను మీారు పల్లె కట్టించేమని అడిగితిరి గనుక అందుకు స్థళనిర్దుశం చేసిన వివరం: దక్షిణాన పెద్ద చెర్వోకు లోతట్టు నీరు మునుక చెట్ల తలగుండాలు రేఖలుగా, పడమటి మడి అలుగు హద్దుగాను, మా మిళ్ల పల్లె పొలిమెర వెలిగాను తూర్పు పాలకొండ్రాయనికి పొయ్యే క్రొత్త దోవ గుంతగుండములోగా కొండయెక్కుడు రాళ్లు హద్దుగాను, ఉత్తరానకు పెద్ద చెరువు నీరుమునుక మరి అధ్రపాకు సాగిన యీాదు పుల మట్టుకు పొట్ట లింగయ వారి చేను వెలిగాను, యీా చేని గట్కు (గట్టుకు) చక్కనగా పడమటి అల్లు హద్దుగా దక్షిణానకు మామిళ్ల పల్లెకు క్రొత్త పల్లె పొలి మేరగా ఆకు తిప్ప బోడు హద్దుగా ఈ నాలుగు తట్లుకు లోగానున్న గుండాలు, బీటి చెల(లి)కెలు మాన్యాలు, గుత్త పొలం అనాది పాండవ బీడు, కి(ఖి)ల పడిన నెలములోను మీారు పల్లె కట్టించేము। అని శెల్వో (సెలవు) యిస్తిరి గనుక, అదే ప్రకారం యీా వ్రాసిన హద్దులలోను పల్లె కట్టించినందుకు మాన్యం ౯౧ రెడ్డి మాన్యం, ౯౧వనము మాన్యం, ౯౧ పల్లె అడు(గు?), ౯౧ వుభయం ౯౪ గాక మిగిలిన పొలానకు యీా మాన్యం ధేఖీలుగా సర్వమక్తాగాను గ ౫ం వరహాలు...పంద్రామోడిన యాభై వరహాలకుగాను శ్రోత్రియముగా యిచ్చినారము। గనుక ప్రతి సంవత్సరానకు రుసుములు వాజా ఖర్చులు పంపకాలు పట్టిబాబులు మేరలు దేఖీలుగా శ్రోత్రియం మడి యెల్లప్ప టికి గుత్తగా ౫ం వరహాలకు యిచ్చినాము। గనుక మీాకు వ్రాసి యిచ్చిన పొలం హద్దులోను చెర్వో కుంటలు బావులు వనములు చెరుకు ఆకు తోటలు, వరి మడి, రస వర్గాలు, దేఖీలుగా కారు వైశాఖాల మీారు యేమి ఫల పరచు కున్నా యెల్లప్పటికి మీాకు నిర్ణయ ప్రకారం నడిపించ గలవారము। మీా పుత్ర పౌత్ర పారం పర్యంతరం సుఖాన అను భవించుకునేది. ఇట(టు) అ)ని మా ధర్మం సాక్షిగా వ్రాసి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రము। ఇందుకు రెడ్డి కరణాలు హింద్దువులు తప్పితము

చేసి రాయనా కాశీలో గోహత్య చేసిన పాపాన బోదురు। తురకలు విరోధముచేసినైరైనా మక్కాలో సు(సూ)కరం చంప్పిన పాపాన బోదురు॥

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥
దానపాలనయోర్మధ్యే దానా(చ్ఛ్రే)యోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥
స్వదత్తా పుత్రికా ధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా॥

రెడ్డి కరణాల చే(వ్రా)లు। గంగి రెడ్డి వ్రాలు। కరణం శేషాచలం వ్రాలు। పాలయ వ్రాలు। నల్లవో(ఓ)బయ్య సమ్మతిని గంగి రెడ్డి వ్రాలు। అనంతరామయ్య వ్రాలు। కొండయ్య వ్రాలు॥

మునుపు వ్రాసి యిచ్చిన దాన పత్రము పోయినందున తిరిగి వ్రాసి యియ్యమని అడిగితిరి గనుక చిత్రభాను సంవత్సర ఆశ్వీజ శు ౧౨ లు గంగిరెడ్డి పాలరెడ్డి వో(ఓ)బయ్యగారి సమక్షమాన కరణం అనంతరామయ్య శేషాచలంగారు వ్రాసి యిచ్చినారు.

శ్రీ గోపాలస్వామికి

3. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౯౮ అగునేటి దుర్ముఖినామ సం॥ పుష్య శు ౧౫ గురువారం సోమోపరాగ పుణ్యకాలమందు మహారాజరాబశ్రీ వెంకటరావు భాకరా కానుగో కులకర్ణి కులకర్నాటక దేశముఖి దేశపాండ్యా సరదేశముఖ మహాలానిహాయగారికి ఇప్పపెంట తాలూకా బుగ్గలపల్లె రెడ్డికరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ ధర్మశాసన పత్రిక. క్రితం మాపొలంలో నాగరెడ్డి వో(ఓ)బయముఖాంత్రం పల్లెకట్టించి చతుర్సాయల పొలానకు హద్దులు నిష్కర్షచేసి శ్రోత్రియం వ్రాసి యిచ్చి వుండే గనుక అందుకు కాలోపకాలాలచేత నిర్నయప్రకారం నడవనందున యీ సంవత్సరము మంమును పిలిపించ్చి పునరోక్తిగా శ్రోత్రియం నిర్ధా

రణ చేయుని శెల్వు(సెలవు) యిస్తిరి గనుక అదే ప్రకారం మేము సమ్మతించ్చి వ్రాసి యిచ్చిన వివరం. ఈ సంవత్సరం ఆరభ్యాం సంవత్సరం ౧కి అక్షరాలా పంద్రాన హణాన్నులు ౨౫ ఇరువై అయిదు వరహాలకు కరారుగా వ్రాసి యిస్తిమి గనుక మీరా పుత్రపౌత్ర పారంపర్యంతంగా ఆ చంద్రార్క స్థాపి(యి)గాను సుఖాన అనుభవించుకుని వుండేది. ఈ ధర్మం (యీశ్వర) * ప్రీతిగా మాస్వధర్మ సాక్షిగా వ్రాసియిచ్చిన శ్రోత్రియ దాన పత్రిక వహి.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
దానపాల నయోర్మధ్వే దానాఛ్రే(చ్ఛ్రే)యోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

గురువరెడ్డి సమ్మతిని మెల్లారెడ్డి వ్రాలు. కరణం కసవరాజు కేశవుల వ్రాలు, జనపెద్ద బుచ్చన సాక్షి వ్రాలు। దాసరి యర్లారెడ్డి సాక్షి వ్రాలు సానంరెడ్డి గంగిరెడ్డి సాక్షివ్రాలు.

8. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౦ అగునేటి సౌమ్య సంవత్సర ఆషాఢ బ ౧౦ లు మహారాజరాజ శ్రీ వెంకటరావు బాపారావుభాకరా కానుగో కులకర్ణి కులకర్నాటక గారికి ఇప్పపెంట ఆరు గ్రామాదులలో చెల్లే మౌజే బుగ్గపల్లె అధికారి రెడ్డికరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక. సన్ను ౧౨౧౭ వహ్మాంమ్న(హమ్మ)దు పాలుసరా మా గ్రామాదులకు దక్షిణం రావులుకట్ట హద్దు, ఆ పడమట ఇప్పపేంట దోవహద్దు, బిగ్గరివాని బావిన(ని!)చేను హద్దు, ఉత్తరం రాళ్లువంక ఊటుకూరి పొలిమేర హద్దు, తూర్పు వూటుకూరు పొలము బ్రహ్మమొళ్లవంక ఈ దక్షిణం రాల కొండువారు వేసిన గె(గ)ట్టు హద్దు। ఈ చె(చ)తుర్దిక్కులలో వుండే పొలం మీాకు పల్లె కట్టుకునేటందుకు. వివరము చేను ఖం ౪౦ బాదు

* Not found in the Original M/s.

పల్లె అడుగుకు ౧౧, పల్లెకట్టు మాన్యం ౧౧, వుభయం ౧౨ గాక నిలచి నది ౧౫౩ కి సంవత్సరం ౧కి ౨౫ వరహాలు పం(ద్రా)ను అక్షరాలు పం(ద్రా)ను యిరువై అయిదు వరహాలు ఈ కౌలు మరియాదకట్టు గుత్తప్రకారం నడువగలవారము. ఈ వ్రాసిన హద్దులకు లోగా మీరు బావులు తొ(త్రొ)వ్వించుకుని పల్లెగట్టుకుని కారు వైశాఖాల ఫలం పెట్టుకొని యెల్లప్పటికి యిదే మీకు నిర్ణయంగాను యిదికాక రుసుము ఖర్చు పంపకాలు బాజుఖర్చు పంపకాలు లేకుండా వ్రాసి యిచ్చిన శ్రోత్రియము. మీ పుత్రపౌత్ర పారంపర్యంతరము, ఆ చంద్రార్క స్థావి(యి)గాను సుఖాన అనుభవించుకొనేది। ఇందుకు రెడ్డి కరణాలు హద్దు తప్పినట్టులైనా కాశీలో గోహత్య చేసిన పాపాన బోదురు। తురకలు తప్పినరైనా పందిని తిన్న పాపాన బోదురు। ఈ ధర్మం యిష్టదేవత సాక్షిగా వ్రాసియిచ్చిన దాన పత్రిక.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

పాలరెడ్లు కరణాల సమ్మతిన స్వహస్తం కరణం రామన్న వ్రాలు. పోలారెడ్డి మల్లారెడ్డివ్రాలు సానమరెడ్డి గంగిరెడ్డి సాక్షివ్రాలు। మన మండ్ర వెంకట నారాయణ భట్లవ్రాలు.

అంతు గ్రామస్తులు వ్రాసి యిచ్చిన దాన పత్రికలు ౫. ఇంకా కొన్ని కాగితాలు మీద యుండేవిన్ని శిథిలమై యున్నవి.

పెద్ద పలిపాళెగారడు పెద్దినాతాని బావమరిది చెంచుఅనేవాని వద్దయుండే తాంబ్ర శాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౬౭౬ అగు నట్టుగాను (నేటి) స్వభాను సంవత్సర జ్యేష్ఠ బ ౧౦ లు కాడ పోతి

నాయడు పాపి నాయడు యల్లమ నాయడు చెంచునాయడు బుచ్చమ్మ గారు రాచాల కదిరయ్య కొమారుడు కదిరయ్యకు వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక క్రమ మెట్లన్నను, కొండమ నాయని కొమార్తె తిమ్మక్కకున్ను నీకున్ను వివాహ మహోత్సవకాలమందు ఇచ్చిన భూదాన పత్రిక వివరం। పణుకు రాతి కొత్త బావిలో పాళ్లు కొండమ నాయని భాగం ల్౻ం ముప్పాతి కెపాలు, రాచాలము సలమ భాగం ల్౹ం పాతికె పాలు లెఖ్ఖ(క్క)ను బావి త్రోవ్వించుక అనుభవిస్తావుండిరి గనుక కొండమ నాయని ల్౻ పాలు మీకు వ్రాసి యిచ్చినారం గనుక అనుభవించుకునేది। ఇట్లని మారాజీని వ్రాయించిన భూదాన పత్రిక మా మాటనమ్మి విస్తారంగా ఫల పర్చుక మీ పుత్ర పౌత్ర పారం పర్యంతరం ఆ చంద్రార్క స్థాని(యి)గా అనుభవిస్తూ రావలెను। ఇందుకు సాక్షులు జక్కె తిమ్మా నాయడు, అమిల్నేని వెంకటపతి నాయడు వినుకోలు వెంకట నాయకుడు। వో(ఓ)గలూరి శేష రెడ్డి పీసుల మొదకకు కరణం ముక్కపెరుమాళ్లు వ్రాసిన భూదాన పత్రికె।

పోతి నాయడు పాపి నాయడు యల్లమ నాయడు చెంచు నాయడు వ్రాలు। బుచ్చెమ్మ సమ్మతిని గంగినాయని వ్రాలు।

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

ఒంటిమిట్టలో వుండే తామ్రశాసనాల నకళ్లు। గ్రామం మాదిగె గోపునివద్ద వుండే తామ్రశాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౩ అగునేటి రౌద్రి సంవత్సర వైశాఖ శు ౧౫లు స్వస్తి సమస్తలోక నిస్తారక త్రిభువనభవన నిర్మితాధార.....శ్రీ అనంత శాస్త్రపురాణ పారావార గా(గ)ంభీర దిర। ధీరో ధా(ద్ధా)రక జగహితకర్తారక సత్కార ప్రతిభక్తి యుక్తారక త్రైలోక్యాధిప కే(క) అతులిక ప్రతాప అనంతబ్రహ్మాండ అండజ పిండజ అతలాలితులా యుక్తకార్మెపుహ వటవర పేంపోటపురాధీశ్వర శ్రీమన్మహాజ్యోతిప్రకాసేకతలైన

కమతేశ్వర దేవర దివ్యశ్రీపాదపద్మారాధకులైనటువంటి కంటిరుంజయు యోగవాగంబులున్ను పులితోలు సెక(ర)ంబు పులులకో(ం)తంబు గరుడధ్వజంబున్ను కనక(క)కాహాళ్లు పసిటి(డి) వింజామరలున్న కనకదండె అందలమున్ను ధాతకు మణులకిరీటము లోహాస(న)ము పంచమహావాద్యంబులను గలప్ప......వి డెం(బై)బ నాలుగు అహాణంబులకు మొదలైన తిరుపం కొరుపతి కాళహస్తి చంద్రగిరి......

ఇది మొదలైన డెబ్బైనాలుగు అహాణాల అయిద్దాతి పంచాహాణంవారు గురు(ర)ముకొండ సింహాసనం శ్రీ కాళికా దేవి ముఖమంటపములో వజ్రసింహాసనారూఢులై కూర్చుండి వొ(ఒ)ంటి మెట్ట దొహరి పానయ కొడుకు యెల్లయ మనకులసకల కార్యం అనేకం వృ(వు)ద్ధరించినాడు గనుక అందరూ యిచ్చిన తాంబ్రపుశాసనం॥ దాతికి రూకా ముద్దకొలిమికి రూకా కశాగుటణకు రూకా తప్పక యిచ్చేది, పెండ్లికి రూకానూ తొడుక విడెముంను యీ మర్యాదను కట్టడచేసి మన్నించి నీకు యిస్తిమి గనుక నీబిడ్డ బిడ్డతరమున్నూ అహాణ వ(వా)రిపనులకు వచ్చి యీ సామ్యం అనుభవించి బ్రతుకువాండవు. ఈ మర్యాదను నడపక యెవ్వరు తప్పినాను మహామాయకు తప్పనవారు సి(శి)వాచార కులాచారులు కానివారు। అని యిచ్చిన తాంబ్రశాసనం.

కోదండరామస్వామి గుడిలో అర్చకుడు కొరకొండ వెంకటాచలం వారి సమ్మంధీకుడు వరదాచార్ల వద్ద వుండే తాంబ్ర శాసనం.

స్వస్తిశ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౪ అగునేటి విరోధికృతు నంవత్సర ఆశ్వీజ శు ౧౦ లు శుక్రవారం శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన వ(ఒ)ంటిమిట్ట శ్రీ కోదండరామస్వామి సన్నిధికి దాసానదాసుడు ఆత్రేయగోత్రుడైన చెన్నూరి శీ(సీ)నప్పపంతులు తమ సన్నిధికి నిత్యం అఖండ దీపారాధనకుగాను దినం ౧-టికి శేరు నెయ్యి లెఖ్ఖ సిద్ధవటం మండవమీద నిష్కర్షజేసి సమర్పిస్తిమి గనుక ఈ మండవ పనిలో యెవ్వరు వున్నా యీ ధర్మం అభ్యంతరం చేయక ఈ అర్చకుడు కొర్కొండ వెంకటాచలం వశానయిచ్చి నడిపించ గల

వారు. ఇది యెవ్వరు అభ్యంతరం చేసినాగాని కాశీలో గోబ్రాహ్మణ మాతృవధ చేసిన పాపాన బోవువారు. శీ(సీ)నప్పపంతులు వ్రాలు.

౯. ఇందుకు రెండో ప్రక్కను వ్రాసి వుండేది.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన వ(ఒ)ంటిమిట్ట శ్రీ కోదండరామస్వామికి దాసానుదాసులైనమహారాజ శ్రీ చెన్నూరికి శీ(సీ)నప్ప పంతులవారి ధర్మం। స్వస్తిశ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౪ అగునేటి విరోధికృతునామ సంవత్సర భాద్రపద శు ౨ లు సన్నిధికి నిత్య నైవేద్యానకు కడపచావిడిమీద దినం ఒకటింటికి ర్౫౦ లెఖ్ఖను నేమకంచేసి చేసిన ధర్మశాసన పత్రిక ఈ ధర్మం అర్చకుడు కోర్కొండ వెంకటాచలం ముఖాంత్రం నడిపించగలవారము। యె(ఎ)వ్వరు అభ్యంతరం చేసినా కాశీలో గోబ్రాహ్మణ మాతృవధ చేసిన పాపాన బోవు వారు.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

చింతరాజుపల్లె పాళెంవెంకటపతినాయని వద్ద వున్న కాకితపు కౌలుకు నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౮ అగునేటి వ్యయనామ సంవత్సర వైశాఖ శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజకంఠీరవ రాజకందర్ప మహారాజాధిరాజ రాజపరమేశ్వర రాజపూజితులగు మహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగర సింహాసనమున పృథ్వీసాంబ్రా(మ్రా)జ్యము చేయుచుండగాను గురిగింజకుంట నలమల నేని కుమారపెద్ద బుచ్చినాయని వారికి వ్రాయించి యిచ్చిన కౌలు నిరూపం॥ మహారాజ శ్రీ కృష్ణరాయలయ్యగారికిన్ని తరికొండ తిమ్మా నాయని కుమార రామనాయనికి కాక వొ(వ)చ్చివప్పుడు మీరు వారిలో కలిస్తిరి అని సంశయించి మీకు నడుస్తూవున్న గ్రామాదులు నగర జప్తీ చేయించిరి గనుక కోటకొండ పెద్ద వో(ఓ)బళరాజు విప్పపెంట కుమారజంగమరెడ్డి కడప గోపాలబుద్ధారెడ్డి, వొ(ఒ)ంగిమాళ్ల పెద్దిరెడ్డి

వీరబల్లెయర మూచిరెడ్డి గడికోట చాగసాని పెద్ద నల్లపరెడ్డి, యీ మొదలైన దేశస్థులున్ను మహారాజశ్రీ రాయలవారి ముద్రకర్త ఉదయ గిరి మలహారి శంకర పంతులు కొమారుడు ఆనందగోపాలపంతులు వారు మాతో విన్నపం చేసిరి గనుక చిత్తగించి మీాకు నడుస్తూవున్న గ్రామా దులు విప్పపెంటలోకి చెల్లే ఆరు గ్రామాదులున్నూ విప్పపెంట ౧, పొంగి మాళ్ల ౧, విరుపల్లె ౧, సోమవరం పెద్దపీడు ౧, గడిపా(కో)బ ౧, చింత రాజు పాళ్యెం ౧ మలినేనిపట్నం ౧ యీా పధనాలుగు గ్రామాదులున్న* మోఖా చెన్నూరు పరగణే సిద్ధవటంతాలూకు యెనభైనాలుగు గ్రామా దులు కావలి నిర్ణయం: కామ్రుగుంట్రకు ల్ ౨, మడకకు ల్ ౨, మగ్గానకు ల్ ౨, వర్తకుల యిండ్లకు ల్ ౨, మడి అన్ని ఆధాన్యం చెన్నూరి తాలూకు ౧౪ గ్రామాదులు సిద్ధవటం తాలూకు ౮౪ అనిన్ని గ్రామానకు మడి నూర్యకుమారుని కనమరుసుము, బెరికట్టన రుసుము, దొంగలసాని రుసుము, తరుపల్లె బాట రుసుం, పీరుపల్లె వంగిమాళ్ల వీటి రుసుములు ఒక్కలు పెరికెకు ల్ ౹ రసగ్గానకు నగకు ల్ ౹ వస్త్రాలనగకు ల్ ౦౹౽ తిరు పతి పరుషకు స్వారికిని ౪ జనం ౧కి నేబులు ౧ భూసాన్క ల్ ౦౹౽ యీా చొప్పున నడిపించుక మాకవులు నమ్మి సుఖానవుండమని వ్రాయించి యిచ్చిన కవుల నిరుపం. శ్రీరామ.

మవుజే వు(ఉ)ప్పటూరు సగిలిపాయకట్టు, తాలూకు సిద్ధవటం సదరహీ గ్రామస్థులు మలినేనిపట్నం పొలిమేర వివాదపడినందున వు(ఉ)ప్పటూరి వారు త్రొక్కిన పొలిమేర జయలేఖ నకలు॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౦౮ అగునేటి పరాభవనామ సంవత్సర వైశాఖ శు 3 భానువారం చిట్టయ పల్లె పొలిమేర సందుకట్టు నిమిత్యం వు(ఉ)ప్పటూరివారూ మలినేని పట్ణంవారూ వివాదపడి హుజూరుకు వచ్చి మనవిచేసుకొంటిమి గనుక

---

* The number of villages is said to be six (ఆరు) and their names are spcified. How the total can be fourteen is not intelligible.

హాజరతు మీర్జా ఇమాంబేకు(గు)సాహెబుల వారు మా అర్జీఖా తరుకు తెచ్చి ఆతగాడా తేరుగడ చేస్తున్నామని దయచేసి సిద్ధవటం శ్రీమామూలం రెడ్డి కరణాలను పిన్నపెద్దల పిలుపించి తేరుగడచేయించిన వివరం॥ వు(ఉ)ప్పుటూరి కరణం పెద్ద భానప్పచేత పొలిమేర తొక్కక పొయ్యేటట్టు కరారు చేసిరి గనుక అందుకు పెద్ద భానప్ప తొక్కిన వివరం చిట్టయ పల్లెపూర(ఊరి) భావిదగ్గిర స్థా(స్నా)నంచేసి గంధాక్షతలు పెట్టుకుని రామాయణ పొస్తు(పుస్త)కమును పూజించి ఆ రామాయణం నెత్తిన బెట్టుకొని చిట్టయ పల్లె వుత్తరం మాపూరి పొలిమేర వు(ఉ)ప్పుటూరి పొలిమేర తూమూరి పొలిమేర సరిహద్దుకు పోయి పొలిమేర గట్టు బడిగావచ్చి, చిట్టయ పల్లెలో జేసుకుని దక్షిణంవీధి బడిగా పోయి, మాపూరి పొలిమేర వు(ఉ)ప్పుటూరి పొలిమేర చెందువాయి పొలిమేర ఈ మూడు పొలిమేరల సరిహద్దు తొక్కి వారి యింటి మట్టుకు శిశు పశువులను అర్జీ వ్రాయించి ౨౧ దినం జయ కమ్మలు కట్టి హాోకు పాకులు లేకుండా జయించిరి। గనుక మేము రెడ్డి కరణాలము ఆయ మేర గాండ్లతోకూడా సమ్మతించి వ్రాయించి యిచ్చిన జయలేఖ కాగితము॥ గురువప్ప వ్రాలు। పాపయ్యవ్రాలు। వెంకటేశంవ్రాలు। బందార్లపల్లె రామన్నవ్రాలు। శ్రీపతిరాజురామన్నవ్రాలు। రెంటా పాపిరెడ్డి సమ్మతిని పల్లెం కూపాలువ్రాలు। పోతిరెడ్డి వెంకటరెడ్డి చిన వోబుళ సమ్మతిని మునివా(రె?)డ్డి వ్రాలు। జోగన్నవ్రాలు। దున్నుతుల పాపిరెడ్డి యెల్లా రెడ్డి సమ్మతిని పెద్దమారువ్రాలు। వ(ఒ)ంటిమిట్ట చిన్నపరెడ్డి వ్రాలు॥

గంగ పేమూరి శిద్ధారెడ్డి సమ్మతిని
సుబ్బయ్య వ్రాలు
మాదువూరి వీరారెడ్డి సమ్మతిని
చెంచు వ్రాలు
చంద్ర పడియ పోలిరెడ్డి వ్రాలు
గొడుగునూరి రాజగోపాళు వ్రాలు।
విమూరి ఫకీరిరెడ్డి వ్రాలు।

ముత్తుకూరి హనుమంత రెడ్డివ్రాలు।
వేములూరి రెడ్డెప వ్రాలు
తాదూరి గురువారెడ్డి వ్రాలు
చెంచువాయ మల్లారెడ్డి వ్రాలు
శాఖరాజపల్లె యెర్రపరెడ్డి వ్రాలు
కాలువ పల్లె అప్పన్న వ్రాలు
మందపల్లె చలమానాయని వ్రాలు।

గ్రామానికి యీశాన్యం వరిమళ్లల్లో శిథిలమై యుండే శాసనం

సూర్యుడు. లింగం. చంద్రుడు.

మూడు ధూపహర్తులు. చవరీలు.

పురుష ప్రతిమె. వృషభం.

శుభమస్తు। స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీ పృథివీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వర......వీరణ భువనేకమల్ల (ఇక్కడ అక్షరములు బొత్తిగా శిథిలమై పోయినవి॥

ఈ రాతికి రెండోప్రక్కను ఉండేది.

సూర్యుడు. త్రిశూలం. లింగం. చంద్రుడు.

కపిలపత్స

(ఇక్కడన్నూ అక్షరములు శిథిలమై పోయినవి.)

మహర్ కడపకు పడమర బుగ్గవంకకు పశ్చిమం ఉండే మవుజే గూడూరు గ్రామములో ఖిలమైన హనుమంతరాయని దేవాలయము నకు తూర్పు వీరభద్రస్వామికి నడిచే మాన్యం హనుమంతరాయని చేనులో పడియుండే రాయిమీాది శాసనం.

సూర్యుడు. వృషభం. చామర. చంద్రుడు.

శుభమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరు షంబులు ౧౪౩౯ అగునేటి ఈశ్వర సంవత్సర జే(ఙ్య)ష్ఠ బ ౩౦ సూర్య గ్రహణ పుణ్యాకాలమందు, శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ కృష్ణదేవమహారాయలు భద్రసింహాసనారూఢుండై పృథివీ రాజ్యము చేయుచుండగాను సాళువ తిమ్మరసయ్యగారు శ్రీకృష్ణ దేవమహారాయలు తమకు నాయంకరానకు పాలించిన గండికోట సీమ లోను తమకు నడిచిన వు(ఉ)భయ...సుంకం సిద్ధ(వటం) సిద్ధేశ్వరునికి చెల్లే గూడూరుగ్రామ ౧కి తమకు వచ్చే సుంకానకు యీా గ్రామాన గల అంతమట్టున్నూ స్థావరము గ్రామ సహా వటదర్శనముకు మల్లేశం

పసిడికాపులు పడస ..గ్రామం వారు పసరంపేయగొన్న...... అంత వట్టున్న శ్రీ కృష్ణదేవమహారాయలకు పుణ్యముగాను శ్రీ సిద్ధేశ్వరునికి ఆచంద్రార్క స్థాయిగాను దీపారాధనకు నడుపువారు. ఈ ధర్మానకు మెవ్వరు గనుక తప్పినాను వారణాశిలోను గోవుబ్రాహ్మణుని వధియించిన పాపాన బోవువారు. తమ మానం దురాతగొవులకు(?) యిచ్చిన వారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

మంగళ మహాశ్రీశ్రీ

మవుజే తాడిగొట్లగ్రామములో ఉండే శాసనాలు: గ్రామములో చింతమాని వద్ద ఉండే శాసనం. అక్షరములు శిథిలమైనవి.

చంద్రుడు. కపిలవత్స. చామరం. సూర్యుడు.

* స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౧౬౩ అగునేటి ప్రజోత్పత్తి సంవత్సర ఆశ్వీజ శుద్ధ ప్రతిపద బృహస్పతి వారమును సూర్యగ్రహణ పుణ్యకాలమందు స్వస్తి సమస్తప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర మండలిక బ్రహ్మరాక్షస గండపెండేర త్రిపురారి దేవమహారాజుబంటు స్వస్తి త్యనేకగుణమహావిభూషణ సత్యమాంధాత రి...భగారేంద్ర సంతత ప్రచండశత్రుమదగజకేసరి స్వామి ద్రోహిరగండ నందగోపి... మహాపర మండలచూఅకార పరనారీపుత్ర ససూద్రక మాగతసోరంగ భగవసామ విరత్రాక(?) సర్వజన సంస్తూయ......గరంశ్రీ ఆపు...దివ్య శ్రీ...క్రుందువ సాముగూడకీ పురముగా జేసి కౌశిక గోత్రక్షన(?) ఆదిత్యభట్ట...వం మంచిభట్టు ఆదిత్యభట్లు కూచిచ పన్నారిభట్లు

* See Gaṇḍikōtadurgam-kaifiyat p. 18.

అనంతభట్లు ..అప్పయ్య కౌశికగోత్ర నాగంభట్లు మహెకొ మదివ అపన ఆదిత్యభట్లు......పుత్రుండు కూను...ధారాపూర్వకంగాను.........

సామాన్యోయం ధర్మసేతుః నృపాణాం।
కాలేకాలే పాల నియో భ వద్భిః।
సర్వా నేతాౕ భావినః పార్థి వేంద్రాౕ ।
భూయో భూయో యాచతే రామచంద్రః॥

గ్రామానికి తూర్పు చెన్నకేశవస్వామి పాడుదేవాలయం మెదుట శిథిలమైవుండే శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౪౪౮ అగుటినే యువ సంవత్సర జే(్య)ష్ఠ...శ్రీమన్మహా రాజాధిరాజ రాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీకృష్ణ(ష్ణ)దేవ మహారాయలు విద్యానగర మందు వజ్రసింహాసనారూఢుండై పృధివీ సాంబ్రా(మ్రా)జం చేయుచుండ గాను......సిద్ధవటం జ్యోతి మల్లేశ్వరునికి చెల్లే తాడిగోట్లపల్లె గ్రామము ఇక్కడ బొత్తిగా రాయిపగిలి పోయివున్నది).

మాజె కొపర్తి గ్రామానికి పడమర పాడుమజరా అంకనపల్లె కట్టు కాలువవద్ద శిథిలమై వుండెది.

కసుబా చెన్నూరికి దక్షిణం అరపరుగు దూరమున నాగేశ్వరుని పాడు దేవాలయమునకు దక్షిణంగా నుండే శాసనం.*

చంద్రుడు. సూకరం. సూర్యుడు.

సేవంతే యమనర్ఘ్య మర్ఘ్య సహితా మాణిక్య మాళీప్రభా ।
భాజీ సంనతి శాలినై వసిరసా దేవాస్స్వయం పాదయోః ।
భక్త్యుద్రే(ద్రే)క వశాది వాత్తవిలసత్ సస్నేహ దీపాంకురా ।
విఘ్నేశోవిదధాతు వస్సకరుణా కల్లోలితాంగః శ్రియః ॥ ౧

శ్రోత్రం యస్య నభస్సమీర నివహశ్శ్వాసో భవత్తేజసాం ।
రూపం నేత్రయుగం జలానిమహితో వేషస్యపాదాగ్రతః ।
దంష్ట్రాగ్గే(గ్రే) మహతీ మహీవిలసితా పోత్రప్రదేశేదిశః ।
పాయా దాదివరాహరూపలసితో విష్ణోశ్చిరం వస్సురః ॥ ౨

తుషారగిరి మస్తకే లలిత తుంగశృంగే మహీ
లసన్నవఘనావలి ద్విరద జృంభ కుంభస్తలే ।
హరేరివపయోధిజా లసితపోత్ర దంష్ట్రాగ్రగా
కరోతు కృపయా శివం హరి రసౌ వరాహస్సదా ॥ ౩

దేవీ శివాయ భవతా భామినీ పరమేష్ఠినః ।
స్మరతాం విప్రవర్గాణాం శారదా వరదా ముదా ॥ ౪

చక్షుత్రిపియో దివానక్తం కుర్యాత్తే జగతాంశివం ।
దదతాం గ్రామరాజస్య విధ్యర్కా లోకవందితౌ ॥ ౫

యస్యక్షోణీశవర్గ పృథుతరమకుట న్యస్త మాణిక్యచక్ర ।
ఖ్యాతిస్తోమావలీఢ ద్విగుణ నఖ(?)రుచే రాజరాజోత్తమస్య ।
ఖ్యాతశ్రీకాకతియ్యాన్వయజలధిసం(?)ధా ధామ రుద్రాదివస్య ।
శ్రీకీర్తి ధర్మపత్నీ గుణగణనికరై ర్వ్యాప్తలోకత్రయస్య ॥

సపాలయ న్మహీం సర్వా మ్మనువరిం(?)దాత్మ సన్నిభః ।
రుద్రదేవ మహారాజో ధర్మసాధ్వో వివర్ధతే ॥

* See SII. X 506; Gaṇḍikōṭadurgam Kaifiyat p. 18.

స్వస్తి సమధిగతపంచమహాశబ్ద మహామండలేశ్వరమకుట మరీచిరంజితపాదయుగళ చవుశ(చౌష)ష్టికళాకుశల మూరురాయ జగద్దళ ప్రతిపక్షరాయవంశనిర్మూలన రాయస్థాపనాచార్య మేరు మందరధైర్య బల్మె త్తి(చలమర్తి)గండ కదనప్రచండ ఒడ్డియరాయ దిశాపట్ట సేవణథట్టువిభాళ అనుమకొండపురవరాధీశ్వర వీరలక్ష్మినిజే శ్వర శ్రీ స్వయంభూదేవదివ్యశ్రీపాదపద్మారాధక పరబలసాధక నామాది ప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్య ప్రతాప రుద్రదేవ మహారాజులు సుఖసంకథావినోదంబుగా రాజ్యంబు చేయు చుండి ఘండికోటను ములికినాటిదేశములకున్ను తన ప్రియకుమారు లైన జుట్టయ ల్లెంక గొంకయరెడ్డిగారికిన్ని నాజ్యాభిక్తులం జేసె.

తస్యరుద్రమహీశస్య జుట్టయో గుణశాలినః।
యథాకుమారోరుద్రస్య కుమారః శక్తి మార్గసుధీః ॥

రాజ్యతస్మి న్నతి......లీలాశైలాన సామ్యదదతి।
.........రణ్యా......పదపాచిరామానద్య సంప్య
ర్స్వారితి తిపరిపూరి నరిన్యపదీప్తి రణపణ్యామ గ్రాపురంతి
కాంతిపురం సకలజలదయ రిర్వివారాకరస్య ॥

న్స్వార్జితే కర్స్వార సామ్యే వనవతిసితే జుట్టి లెంకస్యలోకే।
గ్రామాదశాగ్రహారే సురుగురుసదృశా మూర్తిమంతే ద్విసాగ్ర
వేదాయేనేవ పూర్వం త్రిపురవిజయేన స్థాపితా సూనునాయే।
తే సర్వే రుద్రదేవా ప్రియసుత భవతా జూటిలెంకేన నిత్యం
శ్రీశైలప్రాంతదేవి(శే)। సుమసితలసతే సిద్ధనాథస్యమధ్యే ॥

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౩౬ అగునేటి ప్రమాదీచ సంవ త్సర శ్రావణ శు॥ ౧౨ బుధవారంనాడు స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజుల కుమారుండు మూర్లోక గండ మూర్తిముకుంద కుంతరి(లీ)...ర్ణత్ర ప్రతిజ్ఞాపరశు(రామ) బిరుదంక రుద్ర బిరుదబ్రహ్మరాక్షస ఘండికోటదుర్గవిభాళ మల్లిదేవద(త)ల గొండు గండ స్వయంభూనాథ దేవదివ్యశ్రీపాదపద్మారాధక మహారాయకంఠకాల

నాయకుండైన జుట్టయ్యలెంకంగారు ములికినాటిసీమలోని ముక్కంటినాడు పెట్లు (ముక్కంటికాడు వెట్టి ?) అష్టభోగ తేజ స్వామ్యముగాను యిచ్చిన చేరనూరను మహాగ్రహారము పూర్వదత్త క్రమము పరామరిసించి సర్వ బాధాపరిహారముగాను సుంకసాదము మొదలైన సర్వాదాయము సహితముగాను అష్టభోగ తేజ స్వామ్యముగాను తన స్వామి ప్రతాపరుద్ర మహారాజులకు పుణ్యముగాను అయన సంక్రమణ కాలమందు గ్రామాధి రాజ చేరనూరి అశేషవిద్వన్మహాజనులకు గండికోటను రాజ్యము చెయ్యు చుండగాను సర్వమాన్యముగాను ధారాపూర్వకముగా పరిపాలించిన (చెను). మంగళ మహాశ్రీశ్రీ జేయును.

స్వస్తి సమస్త ప్రతిద్వంది(ద్వి ?) సామంతసీ మంతినీ(సీ)మంత సిందూరవిరామేణ అజ్ఞ(జ్ఞా)రామేణ బలవదరి(ద్రి)పుపక్ష క్షయకాలరు ద్రేణ (...రుద్రేణ) ప్రబల తరవైరి వీరవారణ...వహాసీ (వాహినీ) నీ దన(ఘన) దోర్దండ మండలితఖడ్గాభిరామేణ ప్రతిగ్న(జ్ఞా)పరశురామేణ ప్రత్యర్థి పృథివీపతినికరమూర్ఛదరణ్య త్రిపురదహన దశప్ర... తాపాన(ల?) త్రినేత్రేణ కుంతత్రినేత్రే ణారివిలాసినీకర్ణ పూరకీర్తి పల్లవేన మల్లి దేవ ప్రతి మల్లేన దిగ్గజకర్ణవ్యజన విజృమాన జల్భ(జృంభ ?) ప్రతాపానల జ్వాల మ్లానాయమానవైరివీరవిలాసినీహృదయతాప సోష్మదీర్ఘశ్వాస పరితప్యమాన ప్రవాహాదైన్య విశ్ర(శ?)ష్ట కార్యకలాపశంకితబ్రహ్మరాక్ష సేన బిరుదబ్రహ్మరాక్షసేన స్వష్టానష్టాపిత...(ఈవల రెండు పంక్తులు అక్షరములు శిథిలమై పోయినవి ॥

ఈ దేవాలయమునకు దగ్గిర తూర్పున పాతివుండే శిలాశాసనం. శుభమస్తు ॥

పాయాదో్వ గణనాయకః పశుపతే శద్రేద్రే(రగ్రే ?)చిరం సంస్థితో ।
వామార్ధాంగ విరాజితాం గిరిసుతాం జ్ఞాత్వానిజాంమాతు(త ?)రం ।
తుండాగ్రం ప్రవిసార్య సంస్మితముఖః పీత్వాస్తనం చాపరం ।
పాతుః ప్రీతమనా స్తనం మృగయతే విఘ్నాంతకః సర్వదా ॥

దా(ద?)ంష్ట్రాగ్రే(గ్రే)ణధరాముర స్యభిమతా లక్ష్మీం కరాంభోరుహే
ష్వంభోజం జలజం సుదర్శన మధో కౌమో దికం(దకీం) ధారయన్ ।
సర్వాంగేషుచ సప్తతంతునివహా న్యాగ్రాన్యమస్తా ప్రమా(?)।
న్యా(పా?)యాదాది వరాహ రూపరుచిరః కారుణ్యరత్నాకరః ॥

నాగాజినధరంనాగ నాగేశం నాగభూషణం ।
నాగారిం నగరాజాత్మ జార్ధం నగచరం భవేత్ ॥

యస్యద్వందు(ద్వం) మూర్ధ్ని గంగాచ గౌరీ
వామార్ధాంగే భాతినిత్యానపాయ ।
పాయాత్సోవః పార్వతీశో మహీశః ।
సద్భక్తానామాహితైశ్వర్య హేతూః ॥

శ్రీవిష్ణుపాద సంభూతా జాహ్నవ్యాః సోదరః శుచిః ।
చతుర్థవర్ణ సంజాతో లోకేగుణగణోన్నత ॥

తత్రార్ణవాధికో వంశో బహురాజకరంసదా
సత్యభారగుణోపేతో జాతో జూపల్లి సౌజ్ఞ(సంజ్ఞ)కః ।
తస్మిన్కులే సముద్భూతో రాజారామ మహీపతిః ।
తస్య పత్నిపోచమాంబా పాతివ్రత్యపరాయణా ।
తత్పుత్రో సింగభూపాల స్తాద్విక్రమ్యా పరాఙ్ముఖః ।
మర్గస్థా అపకంపంతే... శాత్రవః ప్రాణలోలుపః ॥
తస్యాని (సీత్)ధర్మనిరతా ధర్మపత్నీగుణాన్వితా ।
ధర్మాంబా నామతః సత్యవాక్యాచార్య సుతప్రజా ॥
తస్యాం సింగమహీపాల(లా?) దభూతా మాత్మసంభవా ।
తిప్పాది సర్వరామోఖ్యో రూపౌదార్య గుణాన్వితౌ ॥
తత్రాగ్రజః సింగమహీశసూను స్తిప్పాధిపో భార్గవ బాహుసారః ।
తురంగమారుహ్యధృతాస్త్రశస్త్రో జిగాయ శత్రూన్‌రణరంగ భూమా॥
తస్యానుజః సర్వగుణాభిరామః ప్రత్యర్థి పృథ్వీపతిలోకభీమః ।
నిజాన్వయాంభోని(ధి?)జపుణ్య సేమో। విరాజతే సింగమహీశరామః॥

తస్యాసీ దరవిందసుందరముఖీ మందస్మితా మానినీ।
చల్లాంబా సహధర్మిణీ సువచనా బంధుప్రజాహ్లాదినీ।
దేవబ్రాహ్మణ వందనార్చన సదాచారాత్మజామోదిని।
సాధ్వీ సజ్జన సంస్తుతైక చరితా రెంబల్లె వంశోద్భవా॥
తస్మాద్రామమహీపాల చల్లాంబాయాస్సుతాస్త్రయః।
శుక్తేరివ మణిశ్రేష్ఠా జాతా రమ్యగుణాన్వితాః॥
జూపల్లి రామభూపాల స్త్రిభిఃపుత్రైర్విరాజతే।
గుణత్రయ సమాయుక్తః పుమానివ పురాతనః॥

సరామ భూపః శివప(ప)వ(?) సాక్షాత్సాచల్లమాంబా గిరిజాసమానా।
తదాత్మజోయం పెదసింగభూపో విరాజతే స్కంద ఇవద్వితీయః॥
సింగక్ష్మాపాలధాటీ తురగఖురపుటోద్భజ్జతక్ష్మాతలోద్య।
ద్ధూళీపాలినిపితే(?) చతురుదధిజలే రేణుమాత్రావశేషే।
జాతేనిద్రావిఘాతే నదజలనిధిభిస్తో...

(ఈ రాయిమీదనే దక్షిణ భాగమందు వుండేది గండభేరుండ పక్షి నాలుగు హస్తములను నాలుగు శింహాములు పాదముల రెంటను రెండు గజములు వున్నవి॥)

ర్జితః శాంర్ద(ఙ్గ)ధన్వా శత్వ స్త్రీబాష్పపూరై।
రనవరతమహో దానధారాంబు సిద్ధైః॥

తస్యానుజః శ్చిన్న సింగః పరాక్రమ నయాన్వితః
శివపాదార్చనరతో రాజతే జగతీతలే॥

సత్యాచార గుణానురాగ కరుణా కీర్తి ప్రతాపోన్నతం।
మన్యంతే చినశింగభూప మతుల పాత్రైక పత్నీవ్రతం।
సత్యే ధర్మతనూభవం భుజబలే భీమం రణే చార్జునం।
సందర్శే నకులం తథాప్రవిమల స్త్రా(జ్ఞా) నేచ తస్యానుజం॥

తస్యానుజ శ్చండరవిప్రతాపో విలాసినీమానసపుష్ప చాపః।
నమంచితాత్కి-య్య(?)కులప్రదీపః ప్రకాశతే జోపరి(లి)మల్లభూపః॥

పెదసింగమహీపాల కీర్తివల్లీ నభోగతా।
చంద్రబింబ ఫలం సూతే నక్షత్ర(త్రాః) కుసుమానిచ ॥

తస్యసింగ మహీశస్య సింగాంబా సహధర్మిణీ।
శౌరీ రివ మహాలక్ష్మీః శంకర స్యేవ పార్వతీ ॥

కరవాల భైరవాంకో గర్వితరిపు సింహ్వా(హ) గండభేరుండః।
గండరగండ పదాంకః ఖండిత గోపాలమానమదశౌర్యః।
పులియమార్కొలుగండః ప్రతిభటరాజన్య కమలవేతండః।
సజయతి వితరణ శౌండః సింగనృపః శత్రు తిమిరమార్తాండః॥

పెదసింగ మహీపాలః శౌర్యధైర్యక్షమాన్వితః
పాతిచెర్యాన్నరు నగర వలనేకగ్రామ(?) సంయుతః
కదాచిన్నాగ నాథస్య దర్శనార్థం సమాగతః
శ్లదం(శైవం?) దేవాలయుంద్రుష్ట్వా నూతనంకర్తుముత్సుకః।
వేదాబ్ధియుగ సోమాఖ్యే శాలివాహన వత్సరే। *
వృష సంవత్సరే మాసే మాధవే పూర్ణిమాతిథౌ।
శివాలయం సంతనోతి శిలామయ ముదారధీః॥

ఈ రాయి మీదనే తూర్పుభాగమున వుండేది. ఇక్కడ పెద్ద పులి ప్రతిమె వ్రాసియున్నది.

శత్రూముద్ధృత్యకైలాస వాసార్థందశ పూరుషాన్।
ప్రాసాదగర్భ భవనాకర రంగమధ్యే
స్తంబాధ్వమంటప శుభాయతనం శివస్య।
ప్రాకారగోపురయుతం విరచయ్య తస్య।
కైలాస శృంగవసతిం శిథిలీ కరోతి॥

తటాకం తస్యనికటం తనోత్యభినవం దృఢం।
ఐహికాముష్మికఫల సాధనం శింగభూపతిః॥

---

* The above date answers to SS. 1444 which corresponds to A. D. 1522.

స్వస్తిశ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౬ అగు నేటి తారణ సంవత్సర మాఘ బ ౧౪ సో॥ శివరాత్రి పుణ్యకాలమందు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ కృష్ణదేవరాయ మహారాయలు విజయనగరమందు వజ్రసింహ్వా(హా)సనాసీనులై పృథివీ రాజ్యం చెయ్యుచున్నూ వుండగాను శ్రీమద్విప్పర్లాదిత్య మహిమానుకూల కరవాల భైరవ గండరగండ గండభేరుండ వు(ఉ)ద్దండ పురి(లి)యమారోక్కలుగండ కటకహన్నిబరగండ హత్తుమువ్వరగండ తేరాసామంత బారామండలీకరగండ దుష్టగొవుల మానమర్దన దివిచూరకార ర్త్రకఛత్రాద్య నేక బిరుద ప్రశస్తి సహితులైన జూపల్లి రామానాయనింగారి కుమాళ్లు పెదసింగమ నాయనింగారు తమకు కృష్ణదేవరాయ మహారాయలు నాయంకరానకుం బాలించిన వు(ఉ)దయగిరి రాజ్యానకుం జెల్లేటి ఘండికోట సీమలోని ములికినాటి స్థళమందుల చెర్యూనరి పోట్ల దుర్తి సీమలు యేలుచున్నూ ఆ చెర్యూనరికి దక్షిణభాగమందు నాగేశ్వర దేవునికి గర్భగృహం ఘంటావేది అంతరాళమంటప రంగమంటప నందిమంటప ప్రాకారగోపురాలు కట్టించి సమర్పించి అందుకు దక్షిణ భాగమందు మహాతటాకమున్ను కట్టించి ఆ నాగేశ్వర దేవరకు అఖండ దీపారాధన త్రికాల నైవేద్యాలకు అమృతపల్లున్నూ గంధ పుష్పాద్యుపచారాలున్నూ నడిచేటట్టుగాను చెర్యూనరను—

(ఈ రాయి మీదను మీదను వుత్తరపుతట్టు వుండేది॥......
భైరవ ప్రతిమె......).

కాలిన వంపున మోదుగుమాని చేని స్త్థళం మల్లానాయనింగారు సమర్పించిన సైతం చేను ఖ ౧ న ౨ క్రితధాత సంవత్సరాన చినసింగమనాయనింగారు సమర్పించినది లోమడిచేను స్త్థళం న ౫ పూర్వదత్తి పిన్న చెరువులోను న ౩ వు(ఉ)భయం చేను ఖ ౧ న ౧౦ వరిమడి యీ చెరువు వెనకపాటికి తూర్పు నిడుదొంపులు మల్లయ్యాంగారు సమర్పణజేసిన దిస్త సైతం ఖ ౧ న ౨ పూర్వదత్తియిందుకు ఫడుమర న ౫ తూము మొదలు న ౩ వుభయం ఖ ౧ న ౧౦ వెరళి

పొలం నిర్నేల సహా ఖ ౩ ఈ నాగేశ్వరునికి వైభవం చేసే భోగరాణువులకు తాళసడ్డ స్థళం ఖ ౨ న ౧౫౦ వరిమడిపాటి తూర్పుసి ఖ ౩ వుభయము ఖ ౫ న ౧౫౦ అటు వెరశి ఖ ౮ న ౧౫౦ యెనిమిది పుట్లు తూమెడున్నర సక్షేత్రం తథాతిధి పుణ్యకాలమందు తమ తండ్రిం గారు రామానాయనింగారికి పుణ్యము గాను సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను ఆచంద్రార్క స్థాయిగాను నిధ్యాద్యష్టభోగ తేజ స్వామ్యములున్ను సాగివచ్చేటట్టుగాను సర్వమాన్యముగా త్రివాచకం గాను ధారవోసి సమర్పణ చేసిరి ॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

బహుభిర్వసుధాదత్తా రాజభిః సగరాదిభిః।
యస్యయస్య యథాభూమి స్తస్యతస్యహితత్ఫలం ॥

సామాన్యోయం ధర్మ సేతుం నృపాణాం।
కాలే కాలే పాలనీ యోభవద్భిః।
సర్వానేతా న్భావినః పార్థివేంద్రా।
న్భూయోభూయో యాచతే రామచంద్రః ॥

నగరి పురోహితుండు అల్లాడభట్లు కొండంభట్లు తమకు యిచ్చిన దుగ్గనపల్లెను వెలిచేను న ౧ వరిమడి న ౧ వుభయం న ౨ సమర్పణ చేసెను। పంజూల మల్లయ్యంగారు తమకు యిచ్చిన సావి నేని పల్లెను వెలిచేను న ౧ వరి మడికుంట కిందను న ౧ వుభయం న ౨ యిద్దుము సమర్పణము చేసెను ॥ వు(ఉ)త్తరం। పిల్లలమఱి ఆటి(?) రామరాజు కుమారుండు రంగయ్య శాసన కంభం లిఖించి నాగేశ్వర దేవునికి త్రి సంధ్యలాను అనంత్తాలైన దండములు సమర్పించెను ॥ ఈ దేవర నగరి పని వద్ద నుండి పరిపూర్ణం సేవి(యి)ంచిన తుల్వ(?) సీమన నాగేశ్వరునికి దండం సమర్పించెను। తూర్పు। కాక భక్తులు, చవ్వాభక్తుని కుమారుండు కోటిభక్తుడున్ను పర్వతభక్తుని కుమారుండు చిన వీరాభక్తుడున్ను నాగేశ్వరుని గుడి శిఖరం మండపం

మొదలుగాను కట్టి నాగేశ్వరునికి త్రికాలమున అనంతాలైన దండములు సమర్పించిరి ॥ దక్షిణం ॥ మల్లానాయనింగారు తమతండ్రింగారు రామ నాయనింగారికి పుణ్యముగాను నాగేశ్వర దేవరకు తామ్ర స్వరూపాలు చంద్ర శేఖర విగ్రహాలైన పార్వతీ పరమేశ్వరులను నేటి శివరాత్రి పుణ్యకాలమందు అనంతములైన దండాలు బెట్టి తన సేవగాను సమర్పణ చేసెను శ్రీ శ్రీ శ్రీ ॥

ఈ దేవళం యొక్క నంది మంటపములో దక్షిణభాగం వున్న స్తంభానకు వ్రాసియుండే అరవం ।

ఈ స్తంభానికి దక్షిణభాగం ఈ దేవాలయముకే అస్తి ఫారం ఆనందనిలయం దిగువ చుట్టూ మూడు పంక్తులు అరవ గ్రంథాక్షరాలు మిశ్రమముగా కొన్ని శిథిలమై యుండేవి ।

ఉత్తర భాగం ఉండేది సోమ సూత్రం వరకు ।

సోమ సూత్రం మొదలుకొని పశ్చిమ వాయవ్య మూలం మట్టుకు। పశ్చిమభాగం బొత్తిగా అగపడలేదు। దక్షిణ భాగమందు మధ్య శానాచోట్ల అక్షరముల ఆకారమేలేను కొంత వుండినది॥

కోటలో కసుబా మసీదుకు పూర్వం యేటి వద్ద ఉన్న గుడి యొక్క రాళ్లు, తీసుకుని వచ్చి అరుగుకు దక్షణపు పార్శ్వం వేసి యుండే రాయిమీాద ఉన్న గ్రంథాక్షరాలతో మిశ్రమం అయిన అరవంతో ఉండేది॥

ఈ అరుగుకే యీా రాతికి పడమర శిథిలమై యుండేది। కసుబా చెన్నూరికి దక్షిణం పరుగుదూరమున మవుజే చిన్నమాసుపల్లె వద్ద దక్షిణం ఉండే ఆంజనేయదేవాలయం వద్ద ధ్వజస్తంభానికి పడమర వుండే శాసనం।

చంద్రుడు. శంఖు. హనుమంత ప్రతిమె. చక్రం. సూర్యుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౩౬ సందమెలె నడవ భావనామ సంవత్సర చైత్ర శు ౧ సో॥ లు శ్రీమన్మహా రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణరాయ మహా

రాయరు పుష్పగిరియలి చెన్నకేశవదేవరిగె కొట్ట గ్రామద ధర్మశాసన చెన్నకేశవ దేవర పూజ పునస్కార అమృత పడి నైవేద్యక్కె ములికి నాటిసీమదొళగె చెన్నూరి సీమవళిగిన చిక్కమాచు పల్లె గ్రామవను తథా తిథి మన్వాది పుణ్యకాలదలు సహిరణ్యోదక దాన ధారా పూర్వకవాగి సమర్పిశిదెవు। ఆ చిక్క మాచుపల్లె గ్రామద చతుస్సీమ వళగాద గ. జిధలు వాని తకి(?) నిధి నిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్య గళెంబ అష్టభోగ తేజస్వామ్య ఎనుండి దను। ఆగు మాడి కొండు చెన్నకేశవదేవర పూజ పునస్కార అమృత పడినై వేద్యవను చన్నాగి నడసలుళ్లవ దెందు బరదుకొట్ట ధర్మశాసనం॥ శ్రీవిరూపాక్షాయ మంగళం మహా శ్రీ శ్రీంజేయును॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥

కసుబా చెన్నూరికి నిరరుతి భాగమందు మొగ్గనపల్లెకు నిరరుతి భాగమందు కాల్వకు దక్షిణపుగడ్డన ఉప్పరపల్లెలో తిప్పిరెడ్డి రాగి తోటవద్ద పాతియుండే శిలాశాసనము.

చంద్రుడు. చక్రం. శంఖం. సూర్యుడు.

సిద్ధార్థినామ సంవత్సర ఫాల్గుణ శు ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వర చినతిమ్మరాజు కొండ్రాజయ్యదేవమహారాజులుంగారు రెజాంబి జగన్నాథయ్యగారికి మిట్ట చెన్నుపల్లె సమర్పించినారం। శ్రీ వరదరాజ॥

హనుమత్ప్రతిమ

చెన్నూరికి పరుగున్నర దూరమున నిరరుతిభాగమున ఉండే మవుజే తోళ్లగంగనపల్లెకు ఉత్తరం రెడ్డిగుంటకు ఉత్తరం ఉండే బావికి వేసిన పడమటి రాయిమీద వ్రాసియుండే శాసనం॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౫
అగునేటి స్వభానునామ సంవత్సర వైశాఖ శు ౧౫ బుధవార పుణ్య
కాలమందు శ్రీమతు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన శ్రీవెంకటా
చలస్వామికి ప్రీతిగాను దుగ్గనపల్లె తిప్పారెడ్డి తమ తండ్రి నాగిరెడ్డికిన్ని
తమ తల్లి గంగమ్మకున్ను పుణ్యముగాను తోళ్లగంగనపల్లెలో కట్టించిన
శిలాకూపము ॥ శ్రీరస్తు ॥

కసుబా చెన్నూరికి తూర్పు పరుగుదూరమున మవుజే గుర్రం
పాడు ఈశాన్యభాగమందు చెన్నకేశవస్వామి దేవాలయంవద్దయుండే
ఆంజనేయస్వామి శిలావిగ్రహానకు వెనక పార్శ్వం లిఖించి యుండేది.

సూర్యుడు. శంఖం. తిరుమణి. చక్రం. చంద్రుడు.

అవిఘ్నమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక
వరుషంబు ౧౪౫౩ అగునేటి ఖరసంవత్సర ఆశ్వీజ బ ౫ లు శ్రీమన్మహా
రాజాధిరాజ వీరప్రతాపశ్రీ అచుతరాయదేవమహారాయ పృథివి......
భుం...జు...తిరుమలరాజుగారికి నాయంకరానకు పాలించిన చెన్నూరు
నాయంకరాని...గుర్రంపాడు గ్రామం......జు సోమరాజు జగతాభి
(పి)దామరాజు గుర్రంపాడు నాయంకరానకు పాలించిన నిమిత్యం ఆ
గుర్రంపాటి కేశవపెరుమాళ్లకు దశమి మహోత్సవానకు శ్రీమన్మహా
మండలేశ్వర జగతాపి సోమరాజు కుమారుడు తిరుమలయ్యగారు తమ
యేలిక సలకంరాజు తిమ్మరాజుగారికి పుణ్యముగాను గుర్రంపాటి స్థళం-
గుర్రంపాటి కేశవపెరుమాళ్ల దశమిమహోత్సవాలకు ధారబోసి
యిస్తిమిగాన అందున స్థానీకులు దశమిమహోత్సవాలకు నడుపుకునేది।
అం...పణ్యారం ౦। నైవేద్యం ౦। చమురు తిరుమద్యాలకు ఆ చమురుకు
సహా ౯ రూక లెఖ్ఖిన నడుపుకునేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

మంగళమహాశ్రీ శ్రీంజేయును ॥ శ్రీ శ్రీ శ్రీ ॥

ఈ దేవాలయము వద్దనే ధ్వజస్తంభమునకు పడమర పాతివుండే శాసనం.

చంద్రుడు. సూర్యుడు.

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషం బులు ౧౫౦౦ అగునేటి బహుధాన్యనామ సంవత్సర ఆశ్వీజ శు। (౧)౫ సోమగ్రహణ పుణ్యకాలమందు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర శ్రీరంగదేవమహారాయలు పెనుగొండ పట్టణ మందు వజ్రసింహాసనారూఢులయి పృధివిసాంబ్రా(మ్రా)జ్యము యేలు చుండగాను శ్రీమన్మహామండలేశ్వర (కాశ్యప) గోత్ర ఆపస్తంభసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన మట్లికోనమరాజుంగారి పౌత్రులయిన యల్లమ రాజుగారి పుత్రులయిన తిరుమలరాజయ్యదేవచోడమహారాజులుంగారు భారద్వాజసగోత్ర ఆశ్వలాయనసూత్ర రు(ఋ)క్ శాఖాధ్యాయు లయిన వెల్లాల తిమ్మాజోశ్యులగారి పౌత్రులయిన తిరుమల సోమయా జులగారి పుత్రులయిన సిద్ధాంత సార్వభౌములయిన వెంకటసోమయా జులుంగారికి యిచ్చిన భూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను శ్రీరంగదేవ మహారాయలు మాకు అమర నాయంకరానకు పాలించిన సిద్ధవటం సీమానికి(సీమకు) చెల్లే గుర్రంపాటి గ్రామమందు తమ తమ్ముడు వరద రాజుకు పుణ్యంగాను సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను-(ఈవల అక్షరములు శిథిలమై యెంతమాత్రమున్ను అగుపడలేదు ॥)

ఈ దేవాలయం ముందర పాతివుండే రాయిమీదను సదరు శాసనానకు దక్షిణము—

శంఖు. చక్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౧౬ అగునేటి భావసంవత్సర కార్తిక శు ౧ ...ను చెన్నకేశవ దేవుని ప్రతిష్ఠ పుణ్యకాలాన ద్వా(దే)వర నైవేద్యానకు శేషాచలం గొంకరమ నాయని కొమారుడు తిరుమలనాయనింగారు......నగరికి దేవర... మల్లినాయనింగారు సద్రమ(?)రాయ వడయలకు రాజ్యంచెల్లేదిగాన(?)

తమతల్లితండ్రాదులకు పుణ్యముగాను గుర్రంపాటి కొమా_ర్తై కుంటలో_స్త
..........

ఈ రాతికి వెనకతట్టు వ్రాసియుండేది.

పూర్ణ చంద్రుడు. అర్థ చంద్రుడు.

మడిగడ్డస్థళాన సుక్షేత్రం...చేను ఖ ౦౪౦ యం ఖ ౦౪౦ క్షేత్రం ఆచంద్రార్కస్థాయిగాను సర్వమాన్యముగాను ధారాపూర్వకముగాను చేసి యి_స్తిమి। ఈ క్రమాన యి_స్తిమి। మంగళమహాశ్రీశ్రీం జేయును॥ మల్లినాయని వప్పము। తిరుమలనాయని వప్పము॥

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

ఈ ధర్మం యెవ్వరు చెరిచినాను పెద్దకొడుకు కపాలము కోసికట్టినవారు॥

గుర్రంపాటికి పడమట అరపరుగు దూరమున బావికి వేసియుండే శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

స్వ_స్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౭౦౮ అగునేటి ప్లవంగనామ సంవత్సరం వైశాఖ శు। ౧౫ ఇందువారమందు చెన్నూరు కరణాలు వీసాలవారును లింగారెడ్డి ప్యా(పే)టకు పడమర వీర్ల దేవళానకు తూర్పు తువ్వచేలో తొవ్వించిన బావి శ్రీమద్వశాస్త్ర సంపన్నులయిన అశ్వలాయన సూత్ర వెల్లూరి శ్రీనివాసాచార్యులవారి పుత్రులయిన నీలాచార్యులవారికి ధారాగ్రహీతంగాను కట్టించి యిచ్చిన శిలాశాసన రూపం॥

చెన్నూరికి అరపరుగు దూరముననుండే మవుజే కనుప_ర్తికి పరుగు దూరమున ఈశాన్యభాగమందు లంకమలకు పొయ్యేమార్గంలోను రేగులబావివద్దయుండే శాసనం॥

సర్వజిత్తు నామ సంవత్సర జేష్ఠ శు ౧౨ లు బంగారు చినబయ్యంన గారు తమతండ్రి జోగన్నగారికి తమతల్లి సిద్ధమ్మగారికి పుణ్యముగాను నడకో నేరు కట్టించిరి,

సూర్యుడు. చంద్రుడు.

సదరు మవుజే కనుపర్తికి చెల్లేమజరా బలిసింగుపల్లె యీగ్రామా నికే సీతారామ పురమని వాడుక కలదు. ఈ గ్రామములో యీశాన్య భాగమందు ఉండే బావిమీది శాసనం ॥

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౬౭౯ అగునేటి స్వభానునామ సంవత్సరం మాఘ శు। ౧౯ లు కనుపర్తికి చెల్లే సీతారామపురములోను పరమేశ్వర ప్రీతిగాను దేపీ పుత్రుడైన బలి సింగు కట్టిన బావి ధర్మశాసనం శాశ్వతం.

మ ॥ బయ్యనగారి పల్లెకు అరఘు(గ)డియదూరమున వజ్రాలదొన వద్ద మందబైటను దిగువపడివుండే శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౯౮౬ అగునేటి ప్లవంగనామ సంవత్సరం...యాఖూబు శేఖు మదారుకు పుణ్యం గాను...చెర్వు - (ఈవలి అక్షరములు శిధిలమైపోయినవి గనుక తెలియ లేదు.)

మ ॥ గోటూరు కసుబాకు ఆజ్ఞే(గ్నే)య భాగమందు భైరవేశ్వర దేవాలయమునకు అంటివుండే దక్షిణపు భాగపు రాతికి శాసనం. (See Hanumadgundam, p. 133)

ఈ దేవాలయముకే పశ్చిమ భాగమందు అంటివుండే రాయి.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యు(దయ) శాలివాహన శకవరుషంబులు ౧౩౧౬ అగునేటి యీశ్వర సంవత్సర మాఘ శు। ౯ గు ॥ స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర అప్రతిమల్ల గంగయ దేవచోడ మహారాజులు తమ

తండ్రి మల్లదేవరాజుకున్ను తమ తల్లి మల్దేవమ్మకున్ను పుణ్యముగాను గోటూరి భైరవ దేవరగుడి గట్టిన కాసెబొమ్మయ బత్తునికి నేరేటికాటి కాల్వ యరుగుడి కాల్వ ఉత్తమ గండ్లకాల్వ గండ చెరువు మల్దేవికుంటల క్రిందను మడి ఖ ౦।౦ యేషుము వరిమడి. ఊరిఅష్టాదశ ప్రజలున్ను నారపరెడ్డి పాపిరెడ్డిగారున్ను సమ్మతిని యిస్తిమి। ఈ ధర్మశాసనానకు యెవ్వరు కల్లచేసినాను పంచమహాపాతకాలు పొందగలవారు। తమ తమ పెద్ద కొడుకులను జంపిన పాతికాన పోయినవారు। శ్రీ మంగళ మహా శ్రీ శ్రీం జేయును॥

ఈ రాతికి దిగువరాయి మీద వుండేది.

(Repeated See Hanumadguṇḍam, p. 139)

ఈ దేవాలయమునకు సామీప్యమున దక్షిణభాగమందు మజరా పీరు జ్యా(జా)దా పేటకు తూర్పు వేములమ్మ ద్వారానకు అనుగున వేసిన రాయిమీద వుండే శాసనము॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౮ పరాభవ సంవత్సర శ్రావణ బ ౫ లు గోటూరిగ్రామ కరణం రామన్న కొడుకు పెద్దిరాజు అమ్మవారి నిత్యసేవ॥

ఈ దేవళానికే దక్షిణ భాగమందు లియ్యమయిన రాతిమీద యుండే శాసనము॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౮ అగునేటి పరాభవ సంవత్సర శ్రావణ బ ౫ లు శ్రీమతు గోటూరిరెడ్డి కరణాలున్ను గ్రామంలో వున్న కాంపులు అందరున్ను వేములమ్మకు యిచ్చిన ధర్మశాసనం: వోబళరెడ్డి నలివెంకటయ్యపాలు ౧।౦, ఆకొండయ ౧।౦, ఆవెంగయగారిది ౧౪౦, తమ పెద్దలకు పుణ్యముగాను యీ దేవళం కట్టించి ప్రతిష్ఠచేసిరి గనుక అమ్మవారికి తళిగె దీపారాధన నడిచే టందుకు వాంగుగడ్డను కరిణీక మాన్యం చేనికి తూర్పు ౧౧ చేనన్ను రాజుకాల్వమి(?) ఆపాయమడి ౧౧ న్ను ఉభయం పొలం ౨ ఇద్దుము।

గ్రామ సమ్మతముగా సర్వమాన్యముగా యిచ్చినారము॥ ఇందుకు యెవ్వరు కల్లఆడినా వారివారి తల్లిదండ్రాదులను కాశీలో గొంతుకోసిన పాపాన బోదురు॥ ఇట్లని వ్రాయించి యిచ్చిన ధర్మ శాసనం॥

సదరు శకములో గ్రామకరణం మల్లయగారి గురువప్పగారి రామయ్య కొమాళ్లు సీతయపెద్దిరాజుగారు అమ్మవారి నిత్యసేవ॥

మజరా వీరజ్యా(జా)దాపేటకు ఉత్తరం చెరువులోతట్టు కాల్వ నీళ్లల్లో చెన్నాబత్తుని బావికి యీశాన్యభాగమందు ఉండిన కాలువ మీద శాసనం॥*

మజరా వీరుజ్యా(జా)దాపేట కోటకు వాయువ్యం చెరువుకట్టను ఉండే బావికి వేసియుండే రాతిమీద శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౯ అగునేటి సర్వజితు సంవత్సర చైత్ర బ ౫ ఆదివారం శ్రీమతు గోటూరి పరాబు వీరాబత్తుని నప్తృలయిన మసలాబత్తుని పౌత్రులయిన రాచా ఒత్తుని పుత్రులయిన చెన్నాబత్తుడు వీరాబత్తుమగారు మామాన్యం పేటకు తూర్పు వీరభద్రస్వామికి వేములమ్మకు అర్పితంగాను పెద్దబావి తూర్పున సేవి(యి)ంచిన శిలాకూపం॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

ఈ ధర్మానకు యెవ్వరు ఆక్షేపణ చేసినా కాశీలో గోవుల చంపిన పాపాన బోదురు। కాకకొండకు పేటకాడ బావిచేసినప్పుడు యిచ్చినది। చెర్వుతూరుపు సారవకయ్య ఒకటి యిచ్చినాము గనుగ అనుభవించేది.

ఊరికి సామీప్యమున ఆగ్నేయ భాగము వీరభద్రస్వామి దేవాలయం లియ్యమయిన రాతిమీన ఉన్న శాసనము.

* Inscriptions at Goturu. See Hanumadgundam, pp. 143-44

శ్రీమతు మింగడ సిద్ధపరెడ్డి కొడుకు మూరమరెడ్డి వీరభద్ర దేవరగుడి కట్టించెను।

అంతువ. ౧ కి శాసనములు ౫౨.

## సిద్ధవటం॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాన శకవరుషంబులు ౧౨౮౧ అగునేటి సిద్ధార్థి సంవత్సరం శ్రావణ శు ౧ లు స్వస్తిశ్రీ పర్వత దక్షిణ పినాకినీ తీర సిద్ధాశ్రమ భూమియందు స్వస్తిశ్రీమన్మహా రాజ చోళమహారాయలు మల్లవంశోద్భవు దిగ్విజయంబు చేసి సర్వ రాజ్య పరిపాలన చేస్తూయుండి అనంత మహారాజు తమ్ముడు భీనపాచం నోవి(?)లోనుండి సోమగ్రహణ కార్తిక శుద్ధ ౧౫ యందు శిద్ధవట్టానకు వాళచప్పంన దేశములయందు రాజులచేత కానుకలు గొని యశస్సు ఆచంద్రార్కస్థాయిగాను, సిద్ధవటేశ్వరస్వామికి ప్రతికాల మహోత్స వమునకు సంతోషించి శాశ్వతముగా పూజోపచారం చేయించెను॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఇది యెవరైనా మహారాజులు యీ ధర్మం నడిపించవలసినది॥

## మాచుపల్లె పాయకట్టు కైఫియతు

కైఫీయ్యతు పాయకట్టు కసుబే మాచుపల్లె యిలాఖే సిద్ధవటము॥ సదరహుగ్రామం కుల్కర్ణీ సుబ్బయ్య యిరువైఏను సంవత్సరముల వయస్సు కలవాడు జాతిలో నందవైదీకి వ్రాయించినది। రెడ్డి వెంకట రెడ్డి ఉభయులు వ్రాయించినది.

తక్కవోలు కరణం వెంకన్న ౧ పొన్నలూరికరణం జోశ్యతి శ్యానప్ప (వ్రాయించినది).

కర్నాట దేశమున లియ్యమైయుండెటి మధ్యరాష్ట్రమందుల శ్రీశైల మహాక్షేత్రమునకు దక్షిణ ఉపద్వారమైన సిద్ధవట మహా

క్షేత్రమునకు పశ్చిమ భాగమందు దక్షిణవాహిని అయిన పినాకిని నదికి పశ్చిమమున ఒక పర్వతము కలదు। ఆ స్థళమందు పూర్వము న జామదగ్ని ఋషితపస్సు చేసుకుంటూ యుండేవారు। ఆగిరి గహ్వార మందు జమదగ్ని ప్రతిష్ఠ అయినది శ్రీ నృసింహస్వామి కలదు। ఆసా మీాప్యమందునే ఒక నీరుబుగ్గకలదు। ఆయుదకము బహుస్వచ్ఛమైనది. సర్వదా ఒక కపిలెనీరు ప్రవహిస్తూ ఉంటున్నవి। వర్షాకాలముయందు విశేషించి ప్రవహించును. ఆ నీరు పశుపక్షి మృగాదులకు మాత్రమే కాని సస్యాదులకు ఉపయోగం లేదు. ఆ నీరు ఒక సన్నవంకను పోయి పినాకినీనదీసంగమం అవుతున్నది। కలియుగములో కొన్నినాళ్లు జరిగిన పిమ్మట విక్రమదేవచోళమహారాజు రాజ్యపరిపాలన చేసేటప్పుడు ఒకనాటి కాలమందు జామదగ్ని ఋష్యాశ్రమము చూడవలెనని వచ్చి ఆ స్థళ రమణీయ్యమును చూచి ఆ గిరిగహ్వారమందుల శ్రీ నృసింహులనుసేవించి యీా స్థళమందు గ్రామ నిర్మాణము చెయ్యవలెననే బుద్ధి ఉదయించి అరణ్యమునరికించి గుండ్లపాడు అనే అభిధానముగా గ్రామ నిర్మాణము చేయించినారు। ఇప్పుడు ఆ గ్రామనైత్తం పట్టున దవాలయము లేనిది ఒక యీాశ్వర లింగము వున్నది. ఆ స్వామీాప్యమందు అరవంగ్రంథా క్షరం లిఖించినది ఒక శిలాశాసనం వున్నది। ఈ గ్రామం కలుకడ పట్టణ రాజధానియందు సింహాసనాధీశ్వరుడైన శ్రీమన్మహామండ లేశ్వర త్రైలోక్యమల్ల భుజబల వీరనారాయణదేవు రాజ్యభారం వహించియున్నప్పుడు యీా ప్రాంత్యమైన దేశము గంగరసదేవమహా రాజు యేలుతూ యుండగా వారి యేలుబడిలో జరిగినది. ఈ గ్రామము పేరు వ్రాసియుండలేదు. కాని యీా గంగరసదేవ మహారాజులు యీా రాజ్యం యేలినందుకు రుజువు యీా రాజువద్ద ప్రబలుడై యుండేటి రామినాయకుడి మేనల్లుడు అచ్చప్పనాయుడు తన మామ జంతిరామి నాయనికి పుణ్యంగాను జ్యోతిసిద్ధేశ్వర దేవునికి మంత్రపుష్పం పెట్టే నిమిత్తం చేను ధర్మం చేసినట్లుగా వ్రాసిన శాసనం కొంచం ఖిలమైనది శకం ౧౧౭౦ అగు కీలక సంవత్సరమున వ్రాసియున్నది. ఆ శాసనం గుండ్లపాడుకు పశ్చిమ భాగమందు పరుగుదూరమున ఒక పర్వతందరిని

పూర్వమందు తక్కవోలు అనేగ్రామం ఉండేది। ఆ గ్రామమునకు ప్రాగ్భాగమందు పురాణతరమైన శ్రీ చెన్నరాయస్వామి దేవాలయ ప్రాకారములోగా పాతివున్నది.

ఆ దేవాలయం గర్భగుడి దక్షిణం వైపు గోడకు వెలపటను ఒక శాసనం ఉన్నది। శకం వ్రాయలేదు।

నందన సంవత్సర ఆషాఢ బ ౩౦ లు కడప రామానుజకూటానకు తక్కవోలిగ్రామ కట్నముస్న తావరాలు సహా క్షాత్రియుక్తవీరమ రాజుతిమ్మయ్య అనే ఆయన ధారపోసి యిచ్చినట్లుగా వ్రాసివున్నది॥

గంగయదేవ మహారాజుల యేలుబడికి రుజువు గుండ్లపాటికి ఆగ్నేయమందు కించిదీశాన్యంవైపున అరపరుగు దూరమున ధమ(?) జ్యోతి సిద్ధేశ్వరుని దేవాలయములో గోపురంవద్ద ప్రాకారముకు లోగా నిలిపియున్న శాసనం శకం ౧౧౬౯ ప్లవంగ సంవత్సర పుష్య శుద్ధ ౧౩ లు కలుకడపట్టణ రాజధానియందు సింహాసనస్తుడైన త్రైలోక్యమల్లభుజబల వీరనారాయణ దేవుని కాలమందు గంగరస దేవమహారాజులు రాజ్యంచేయుచుండగాను రాయదేవుని నిజభృత్యుండైన జంతిరామినాయకుడు జోతినాథుని గుడిగోపురం కట్టించి అగ్రహారము విడిచెను అని వ్రాసి ఉన్నది.*

తరువాతను కాకతియ్య ప్రతాపరుద్రదవమహారాజులు ఒరుగల్లుపట్నమునందు ఉండి రాజ్యభారం వహించి యున్నప్పుడు శ్రీమన్మహామండలేశ్వర బ్రహ్మరాక్షస గంగరాజు తిరుపతిదేవమహారాజులు(?) పామూరి పట్టణము రాజధాని చేసుక సుఖసంకథావినోదంబున పృథివీ రాజ్యముచేయుచుండి తమకు ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధిగాను

* See SII. X 312, A.R. No. 563 of 1915 జ్యేష్ట శుధ త్రయోదశి శుడవారము.

స్వస్తిశ్రీ స్వేతచెన్నమల్లిఖార్జున దివ్యపాదపద్మారాధకులైన స్వస్తిశ్రీ అని యీప్రకారం వ్రాసివున్న శిలాశాసనం ఒకటి పైచెప్పిన కడపయ పల్లె పొలంలో ఉన్నది॥

ఈ రాతికి రెండోవైపున నాలుగు పంక్తులు వ్రాసినట్టు కనబడు తున్నవి. రాయి బెటలు మెత్తిపోయినందున అక్షరములు లేచిపోయి నవి గనుక క్రియాపర్యవసానం కనుపించలేదు।

శకం ౧౨౭౬ క్రోధి సంవత్సర మా॥ శు ౧ లు తరువాత గుండ్లపాటి గ్రామము ముక్కావురికి ప్రజలకు జయంతప్పియున్నందున ఆ గ్రామములో వుండే కాపు మాలిరెడ్డి అనేవాడు గుండ్లపాటి స్థళము విడిచి అక్కడికి ఉత్తరభాగమందు పినానికి నదీతీరమున పొలంలో యిల్లు కట్టుకుని ఉండెను॥

## పెరనిపాడు శాసనములు

పెరనిపాటి స్థళమందు గగ్గితిప్పకు పడమటి భాగమందు ఆట భైరవదేవర విగ్రహము సామీప్యమున వ(ఒ)క్కదరిన శిలాశాసన ములు రెండు ఉన్నవి.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౫౦ అగు నేటి కీలక సంవత్సర శ్రావణ శు ౧౫ లు శ్రీ మన్మహారాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ దేవరాయ మహారాయలు చతుస్సముద్రా ధీశ్వరులై విజయనగరమందును స్థిరమున సింహాసనా రూఢులై రాజ్యపరిపాలనము చేస్తూయుండగాను శ్రీమన్మహామండ లేశ్వర అత్యంబరగండ సంబెట పిన్నయదేవమహారాజు పెరనిపాటను రాజ్యంచేయచూనుండగాను పిన్నయనగరికి కోటపెట్టి ముకుందసెట్టి కొడుకు హెగ్గడన్నగా(తా)ను సమస్త రాజ్యానకు కర్తుడగుచు గగ్గితిప్ప

పడమటను పందుము తోటను మామిడిచెట్లు జువ్వలు చింతలు......
మద్రులు యివిమొదలైన తోట ౧ టిన్ని వనం పెట్టి బావి త్రవ్వించి ఆట్ల భైరవ దేవరకు ముత్తుంచేను ధారబోసి ఆపూజచేసే తమ్ముడికి పెండ్లి చేసెను। పిన్నయకు వారి తల్లి తిప్పలదేవికిన్ని సోమయకున్ను పుణ్యం గాను అన్నగారు(?) నిలిపిన ధర్మశాసనం। ఈ ధర్మశాసనం పాలించిన వారికి మహాపుణ్యం। చెరిపిన వారికి నరకలోకం।

దీనికి ఉత్తర వైపున శాసనము ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౦ అగు నేటి కీలక సంవత్సర శ్రావణ శు॥ ౧౫ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీదేవరాయమహారాయలు చతుస్సముద్రాధీశ్వరుడై విజయనగరమందు సింహాసనారూఢుండై రాజ్యం చేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర అంత్యంబరగండ సంబె(ట)టి పిన్నయదేవమహారాజులు పెరనిపాటను రాజ్యం సేయుచుండగాను పిన్నయ నగరికి కోటపెట్టి ముకుంద సెట్టి కొడుకు హెగ్గడన్నగారు సమస్తమైన రాజ్యానకు కర్తుడైవుండి గగ్గితిప్ప పడమట ఆట్లభైరవ దేవర నిలిపి బావి తవ్వించి తోటలో నుద్యానవనం పేటాను పిన్నయకున్ను వారి తల్లి తిప్పల దేవమ్మగారికిన్ని పిన్నయ కుమారుడు శివరాజు గారికిన్ని పుణ్యంగాను హెగ్గడన్నగారు నిలిపిన శాసనం। ఈ దేవస్థానానకు బావి తోటను ఆచంద్రార్క స్థాయిగాను చెల్లించి పాలించిన వారికి మహాఫలం॥

మల్లభూపాలుడు అనే ఆయన వీరుమడక గ్రామానకు పూర్వభాగమందు అనంతునే నామంచేసి చెరువుకట్టించెను। ఆ చెరువువద్ద వు(ఉ)న్న శాసనములో చెప్పియున్న మల్లభూపాలుని వంశం శాసనం శిథిలం అయినందున శకం వివరముగా తెలియలేదు।

## వంశము యొక్క వివరములు

### సూర్యవంశము




ఈ మల్లభూపాలుడు కంచి నగరంమీద దాడిచేసినాడు
వీరు మడక చెఱువు కట్టించిన మల్ల భూపాలుడు.

శాసనములో వ్రాసిన దానిలో కొన్ని శ్లోకములు.

వేణుమల్ల మహీపాల సర్వభూప శిరోమణి।
పుణ్యాత్పుణ్య తమంలోకే తటాకస్యచ(నం)దనం॥

ఆయుర్వృద్ధికరం నృణాం కీర్తి సంపత్కరం శుభం।
తటాకబంధనాత్పుణ్యం(న) భూతోన భవిష్యతి॥

మేరోదసవదే భృత్వా(?) పాండ్యరాయ విదారకః।
అనంతాఖ్య శ్రీసముద్రం తటాకం కృతవాన్ కృతిం॥

సరోజలం బ......తూర్ణం వృద్ధోయవ్వన।
అనంతాఖ్య సముద్రస్య తటాకస్యా మృతోపమా॥

పట్టణే వీరుమడకె (రాజ్యే) పూర్వభాగే శుభస్థలే।
మాతాపితృహితార్థాయ ఛ...భగవతోహరిః॥

భూతలే కృతవా న్భూపాసేతుం సీతాపతిర్యథా॥
రాజాధిరాజేశ్వర దేవరాయ పుత్రే సముద్రత్రితయాధినాథే।
స్వకీర్తిముద్రాంకిత భూభుజేంద్ర ధాత్రీంతథా శాసతిరామచంద్రే

శాకేశా అంగాగ్నివిశ్వే నభసి శుభదినే శుక్లపక్షే క్షయాబ్దే।*
ద్వాదశ్యాం భానువారె సుకృతి మహా(ద)నంతాఖ్యంసముద్రాన్।
శ్రీమద్రాచన్న పుత్రశ్వ .....కులపతిర్మల్ల భూపాలచంద్రః।
స్వాంభాయాం శుద్ధభక్త్యాన్ సపదంచితవాన్ సన్మహూర్తే తటాకం।

మద్వంశజోమహీపాలః పరవంశోధ్య వామ
మధర్మం యేపాలయంతి...పుణ్యాతమ స్నతా॥ (?)

అని ఈ ప్రకారంగా వ్రాసివున్నది.

జిల్లేళ్ల గ్రామములోను హనుమంత దేవుని విగ్రహంవద్ద శిలాశాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౩౭౧ అగునేటి ప్రమాది సంవత్సర మార్గశిర శు। ౫ లు శ్రీమన్మమహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీప్రౌఢదేవరాయ మహారాయల కుమారుడు మల్లికార్జున మహారాయలు విజయనగరమునందు సింహాసనారూఢుండై పృథివీ రాజ్యంచేయుచుండంగాను స్వస్తిశ్రీ చతుర్దశభువనాధీశ్వర శ్రీ అహోబళవీర నారసింహ దేవునికి శ్రీమన్మహామండలేశ్వర ...పిన్నయదేవ మహారాజుల కుమారుడు గోపయదేవ మహారాజులు యిచ్చిన ధర్మశాసనము। మూనాయంకరానకు చెల్లే జిల్లేళ్లగ్రామమున్ను

* 1337 + 78 = 1415.

మహారాయలకు పుణ్యంగాను సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను ఆచంద్రార్కస్థాయిగాను శ్రీ అహోబళేశ్వరులకు ప్రతిదినమున్ను ఆరగింప చేసి ఆ ఆరగించిన వారున్ను ఈ కైంకర్యాలు చేసిన మాకున్ను శ్రీ అహోబళేశ్వరులు ఆచంద్రార్క స్థాయిగాను... ..

ఈ ప్రకారముగాను వ్రాసివున్నది।

తదనంతరమందునను సాళువ నరసింహారాయ దేవమహారాయలు గారు విజయనగరమందు సింహాసనారూఢుండై రాజ్యపరిపాలన చేసి నప్పుడు ఈ రాజ్యం యావత్తూ యేలినారు। ఇందుకు రుజువు తాలూకు మజుకూరు గ్రామాదులలో శిలాశాసనములు.

సాళువ నరసింగరాయ వడయలుగారు శ్రీమన్మహామండలేశ్వర జగతాపి కంచిరాజుగారికి తాలూకు మజుకూరు పైకీ మవుజే వనిపెంట గ్రామము స్వాధీనము చేసియుండగాను జగతాపి కంచిరాజుగారి తట్టున నుంచి చల్లా పినతిప్పనాయని కొమారుడు వీరమనాయనింగారు కనిపెట్టి గ్రామము వ్యవహారము చేస్తూవుండి యీ వూరి చెన్నరాయస్వామికి పగటి అవసరాలకుగాను చెరువు వెనుక కోటరాలకయిమడిలో కొంత మాన్యం యిచ్చి శిలాశాసనము వ్రాయించి యిచ్చినాడు. మవుజే వనిపెంట గ్రామమునకు పూర్వభాగమందు చెన్నరాయని దేవాలయము లోను శిలాశాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౦౮ అగునేటి పరాభవ సంవత్సర భాద్రపద శు। ౧౨ ఆదివారం చల్లా పిన తిప్పనాయని కొమారుడు వీరమనాయనిగారు సాళువ నరసింగరాయ వ(ఒ)డయులకున్ను మా యేలిక జగతాపి కంచిరాజుకున్ను పుణ్యంగాను వనిపెంట చెన్నరాయ దేవరకు పగలు అవసరానకు చెరువు వెనుక కోటరాలకయ్యలోని మడిపుట్ట(?) మడిధారపోసి యిస్తిమిగాన అష్ట భోగ తేజస్వామ్యముతోను ఆచంద్రార్కస్థాయిగా ఆరగించువారు। అని వ్రాసియున్నది॥

మవుజే రామేశ్వరము రామయ దేవుని దేవాలయములో రంగ మంటపముకు దక్షిణభాగమందు శిలాశాసనము ఉన్నది।

శాలివాహనశకవరుషములు ౧౪౨౦ అగునేటి కాళయుక్తి సంవత్సర మార్గశిర బ॥ ౩౦ లు దినమందున వ్రాసియున్నది.

మజుకూరు కొత్తూరి పాయకట్టులో మవుజే పట్టపురావిగ్రామా నకు ఉత్తర భాగమందు పినాకినీ నదీ తీరమందున పాడు దేవాలయం పట్టున ఉండే శిలాశాసనం ॥*

అక్షరాలు శిథిలమై పోయియున్నది గనుక యిచ్చిన భూమి నిర్ణయం తెలియలేదు।

ఇదిగాక యీ చోళరాయల వంశీకుడైన భుజబల బిజ్జదేవ చోళమహారాయులు కొన్నిదినములు రాజ్యభారం చేసినట్లుగా తాలూకు మజుకూరు సగిలి పాయకట్టు తుమూరు అనే గ్రామములో ఈశ్వరుని పాడు దేవాలయం వద్ద శిలాశాసనం దాఖలా ఉన్నది॥** కాని శాసన ములో శక సంవత్సరములు ఉన్న స్థళంలో అక్షరాలు శిథిలమై యున్నది। గనుక శక సంవత్సర నిర్ణయములు తెలియలేదు॥ ఈ శాసనము దిగువ వ్రాసివున్నది.

స్వస్తి చరణ సరోరుహ విహిత విలోచన త్రిలోచన ప్రము ఖాఖిల పృథివీశ్వరకారిత కావేరీ తీర కలికాకుల రత్నప్రదీప అపరిమిత ప్రతాప సతత సౌమ్యభ్యర్చిత లక్ష్మీన్నిశ్వర మె(ఒ)ర యూరిపురవరా ధీశ్వర కాంచీపుర త్రినేత్ర కాస్యపగోత్ర అతిచతుర కామినీజన జయంత తురగరేవంత వితరణ...విక్రమాదిత్య జగదొబ్బగండ గర్వితారాతి కుధరకులిశధర శరణాగత వజ్రపంజర దాయాద్యమండలికదిశాపట్ట కీర్తి నారాయణ రాజనీతిపరాయణ అయ్యనసింహ సాహ సోత్తుంగ......

---

* A. R. No. 49 of 1939-40. see p. 241 above.

** A.R. No. 62 of 1939—60

(ఇక్కడ రాయి కొంత శిథిలమైపోయివున్నది॥) గండగోపాల శ్రీ సిద్ధ నాథ దేవర శ్రీపాద పద్మారాధక నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర భుజబల బిజ్జదేవచోళ మహారాజులు [శకాబ్దము ౯౯౯ నళ] ...... శుద్ధ ౧౫ గురువారమునాడు* చిజావరముధారా పూర్వకముగా యిస్తిమి। ఇచ్చి సర్వబాధా పరిహారముగాను నగిలి దేశము సమర్పిస్తిమి।

ఈ ప్రకారం శాసనములో వ్రాసివున్నది।

తర్వాత త్రిభువనచక్రవర్తి చోళమండలమందలి పశ్చిమరాజ్య మైన పాకనాడు పొత్తపినాడు సిద్ధవటసీమలు యేలుచూ వుండగా కాంచీదేశమందు మలుమల్లదేవ అల్లుమల్లదేవు అనే వారు ప్రభుత్వం చేస్తూ వున్నంతట, స్వస్తి శక రెయాండ ౧౧౫౫ అధిరాజేంద్ర చోళ మండలమందు పైన వ్రాసిన మలుమల్లదేవు అలుమల్లదేవుని జయించి కప్పం తీసుకుని, పశ్చిమ తుంగభద్రా నదికి వు(ఉ)త్తర దేశాధిపతి అయిన కులోత్తుంగ చోళరాజును నరికి పూడ్చి మరిన్ని యేలుతూవుండే మధురాంతకపొత్తపిచోళరాజునున్ను జయించి సంతోషముతో తన సిద్ధపనాయకుని మేనల్లుడు అరువలమారి అణ్ణం బండారిన్ని సిద్ధప్ప నాయని అన్న సమస్తసేనాధిపతి అయిన తంత్రపాల పెత్తి(ద్ది)నాయడు తన్ను యేలే దొరకున్ను తమకున్ను బాగయ్యేటట్టున్ను గానున్ను సిద్ధవటంలో సిద్ధేశ్వరుని దేవాలయంలో పశ్చిమ గోపురం చేయించెను।

ఇందుకు దాఖలా సిద్ధవటం కసుబా కోటలో సిద్ధేశ్వరుని పాడు దేవాలయ పశ్చిమగోపురం రాతికి అరవగ్రంథాక్షరాలతో వుండే శాస నానకు తెనుగుతో వ్రాసినాము। అరవకడ్డాలు(?)॥

స్వస్తిశ్రీ త్రిభువన చక్రవర్తి రాజేంద్రగ......

స్వస్తిశ్రీ శకరేయాండ ౧౧౫౫ అధిరాజేంద్ర చోళ మండ లత్తిల్ మేర్ పాకనాటు పొత్తపినాటు వొడయూర్ సిద్ధవటం వొ(ఒడ

* ba 15 according to A.R.E 1939—40 p. 41.

యార్ కోవిల్ మేలే తిరుగోపుర వాశల్ శేవితారగళ శ్రీ మానుం వీర (మన్మహా)మండలేశ్వరం కాంచీ పురత్తిల్ కప్పంకొండం అలుమల్ల దేవనెయుం జయుం పణ్ణి మేర్కు తుంగభద్రా ఆళు వంశల్ ఆండవడక్కు గదిక్కు కులోత్తుంగ రాజేంద్ర చోళ యనే పట్టి...అంజెల్ల ఆండ మధరాంతకయ పొత్తప్పచోళ గెల్లశిత ఆరెయామోదగళిల్ తమ్మ(మ్మ?)శిత్తప్ప(సిద్దప్ప)నాయకన్ మరుమగన్ అరువలమారి అంణ భండారి శిత్త(సిద్ధ)ప్పనాయకన్ తమయ్య ఆన సమస్త సేనాధిపతియాన తంత్రపాల పెద్దినాయకన్ తన్నై ఆండ నాయళక్కుం(?)తంగళైకం నంనాగడె తిరుగోపురవాశల్ సేవిత్తాన్ ॥

ఈ ప్రకారం అరవ అక్షరాలు వ్రాసివున్నది ॥

ఇదిగాక యీ గోపురం పైననే హాళే కన్నడ అక్షరాలతో శిథిలమైన శాసనం ఉన్నది ॥

శ్రీ మన్మహామండలేశ్వర త్రైలోక్య మల్ల భుజబల వీరనారాయణ రాయదేవ మహారాయలు కలుకడ పురమందు పృథ్వీసామ్రాజ్యాధిపతులై వుండగాను, తక్కరస గంగదేవ మహారాజులు రాజ్యపరిపాలన చేస్తూ వుండగా, వారికి నిజ భృత్యులైన జంత్రిరామనాయకుండు జ్యోతి సిద్ధనాథునిగుడి కట్టించి అగ్రహారము విడిచి శకవరుషంబులు ౧౧౬౪ ప్లవంగ సంవత్సర పుష్య శు ౧౩ బుధవారంనాడు శిలా శాసనం వ్రాయించి వేసినారు ॥*

---

* A.R. No. 563 of 1915. SII. X 312.

Similar inscription is stated to be found on the site of the deserted village of Guṇḍlapādu, whereas this is said to be inscribed on the western gōpura of the ruined temple of Siddhēśavara in the fort of Sindhavaṭam. This inscription is dated Śaka 1164 Plavanga, Pushya śu 13, Wednesday. The Guṇḍlapapāḍu inscription is dated Śaka 1170 Kīlaka SII X 312 is dated 1169 Plavanga Jyeshṭa śu Vaḍḍavāra.

తాలూకు మజుకూరు సిద్ధవటానకు పశ్చిమం రెండు పరుగుల దూరమున పినాకినీ నదీ తీరమున మౌజే జ్యోతీ అనే గ్రామానకు దక్షిణభాగమందు జ్యోతి సిద్ధనాథుని దేవాలయంలో వుండే శాసనం.

* స్వస్తి సమస్త ప్రస(శ)స్తి సహితం శ్రీమన్మహామండలేశ్వరం త్రైలోక్యమల్ల భుజబళ వీరనారాయణ అవుదుంబరాభరణ కలుకడ పురవరాధీశ్వర అష్టమహాసిద్ధి సిద్ధ(వట) దేవర దివ్య శ్రీపాద(పద్మా) రాధకులైన రాయదేవ మహారాజులు నిజభృత్యండైన స్వస్తి సమస్త లోక సంస్తుత్య విభవామరేంద్ర అభిమానశూద్రక విభుధజనమిత్ర వసిష్ఠ(? మన్మ) కుల గోత్ర త్యాగసముద్ర ఆశ్రిత(అచక) జనపారిజాత కామినీజన జయంత సచ్చినాధార(సుజనాధార ?) నరాధూర (?) స్వామి ద్రోహరగండ గడియంకభీమ కోదండపరశురామ రణరంగభైరవ కారుణ్యాసాగర యేకాంగవీర పాపజనదూర వైరినాయకగోత్రకుత్రవజ్ర భుజాదండ చలమెత్తుగండ రిపునాయకశిరఃఖండన దాయసంహారమండలిక జగదాళ రాయభూపాలదక్షిణభుజాదండ తరనుకుక్కుర (సితరనంకుకర)గండ జ్యోతినాథుని దివ్య శ్రీపాద (పద్మా) రాధకులైన జంతిరామి నాయకుండు తన్నేలిన తక్కురస గంగరసదేవమహారాజులు పృథివీ రాజ్యము సేయుచున్న నాటి శకవరుషంబులు ౧౧౬౯ అగు ప్లవంగ సంవత్సరమున పుష్య శు॥ ౧౩ బుధవారము (జ్యేష్టసుధత్రయోదశి వడవారము) నాడు జ్యోతినాథుని (కోటగోపురము గటించె. కప్రోల నీరు గలసాని) గుడికట్టించె బేటూరరెండు చెఱువులు త్రవించె గుడిగటించె అగ్రహారమువిడిచె మంగళమహా ॥ శ్రీ శ్రీ శ్రీ ॥

ఈ గంగరాజు యేలుబడిలోనే తాలూకు ఒరమాచుపల్లెలో విష్ణుదేవాలయంవద్ద శిథిలమైన శాసనం.**

శకవరుషంబులు ౧౧౭౦ కీలక సంవత్సరమందు స్వస్తిశ్రీమతు అవుదుంబరాభరణ క్షుత్రపవిత్ర అష్టమహాసిద్ధి సిద్ధదేవర దివ్య శ్రీపాద

* See SII. X. 312. A. R. No. 563 of 1915.

** See, for a summary p. 291—3 above.

పద్మారాధకులైన తక్కరస గంగయ దేవమహారాజుల నిజభృత్యుండైన స్వస్తిసమస్తలోకసంస్తుత్య విభవామరేంద్ర అభిమానశూద్రక బ్రహ్మేశ్వర దేవునికి జ్యోతినాధదేవునికి మంత్రపుష్పం పెట్టేనిమిత్తం అచ్చప్పనాయకుడు తన మామ జంతిరామినాయనికి పుణ్యముగాను చేను యిచ్చినట్లుగా వ్రాసియున్నది॥*

గణపతిదేవుమహా(రాజు) సింహాసనారూఢుండై పృథ్వీ సాంబ్రా(మ్రా)జ్యము చేయుచుండగాను వీరి అగ్రసేనాధిపతి అయిన గండపెండేర గంగయ దేవమహారాజులు పృథివీ పాలనచేస్తూఉన్న...ఇతని తోడ పుట్టువ కుమారుడు జన్నిగ దేవమహారాజు రాజ్యభారం చేస్తూవుండగా దువ్వూరు తాలూకు మాజే మైతకూరు అనే గ్రామం గంగరాజులగారి పట్టణము(పేరటను?) ఉ౮ వృత్తులు బ్రాహ్మలకు శ్రోత్రియంగా ధారబోశి యిచ్చిన శకవరుషంబులు, సోమంచంద్రకరీశశాంకకలితే ౧౧౮౧ సిద్ధార్థి సంవత్సర పుష్య శు॥ ౧౧ మకర సంక్రాంతి పుణ్యకాలమందు ధారబోసి సదరహుమైతకూరిగ్రామములో నడివీధి శిలాశాసనం భూస్థాపితం చేసియున్నది॥ ఇందుకు దిగువ పైన ఉండే శ్లోకములు ఉన్నవి.

ఈ రాజుదే దువ్వూరుతాలూకు మాజే అన్నలూరు బేచిరాకు గ్రామ నె·త్తమందు వుండే శాసనము.*

See Gaṇḍikōṭadurgam Kaifiyat p. 13.

(తరువాత) మల్లా సీమ నెల్లూరి రాజులు యేలుబడిలోకి చల్లుతూవుండగా వారి మహాప్రధానులైన దేవపరాజు పెరుమాళ రాజున్ను, పొత్తయ్యను పెరియ పిళ్లెనాయడున్ను కార్యదక్షులై వుండిరి। ఇందుకు దాఖలా తాలూకు మజుకూరు వోబళంపాయకట్టు మాజే జువ్వులపల్లె గ్రామానకు దక్షిణం పినాకినీనదీతీరమందు పాడుదేవాలయం పట్టున శిథిలమై వుండే శిలా శాసనము యొక్క సారాంశము. ప్రథమభాగం కొంతరాయి పగిలి పోయి వున్నది। గనుక సింహాసనాధిపతులైన వారి పేరు తెలియలేదు।**

* See, for a summary Gaṇḍikōṭadurgam Kaifiyat p. 12—13.

* See above p. 243.

త॥ అహాషాంపాయకట్టు పీరపల్లెనై ఋతి లంకమలకు తూరు రంగం పల్లె బేచిరాకు గ్రామనైత్రమునందు పాడుబావి వద్ద ఉండే శిలా శాసనము[1] ఇక్కడ జన్నిగ దేవుని మహాప్రధాని సమస్త(బాహాత్త?) రనియోగాధిపతి నామాంక మాలికా ప్రశస్తి సహితం శ్రీ మహామండ లేశ్వర గండసంపన్న పెరుమాళ దేవుండు అనియున్నది।

ఈ గ్రామానకు నైఋతి భాగమున నాలుగు పరువుల దూరమున పీరపల్లె పొలిమేరలోను లంకమలలో కొండపేట సమచ్చు లంకేశ్వరుని కొద్ది పాటి దేవాలయమున్ను ఇందుకు ఉత్తరం దేవునికుండం సర్వదా ఉదకం ప్రవహిస్తూ యుండేది కలదు। ఇందుకు పడమర అర పరువు దూరమున విభీషణుని గుండంలో సర్వదా నీరు ప్రవహించేది కలదు।

పూర్వం అహాషాం పాయకట్టు ప్రభువులవీడు అనే గ్రామమందు ప్రభువుల బ్రహ్మిరెడ్డి వారి వంశీకులు ఒడ్డెరాజులు యీ గ్రామానకు దక్షిణం ఆరు పరువుల దూరమున తాలూకు మజుకూరు సగిలి పాయ కట్టులో చెల్లే మౌజే మాడపూరు గ్రామానకు వాయువ్య భాగమందు పూర్వమందు ఒడ్డెరాజుల యేనుగలు కట్టి ఉండేవి।[2]

ఈ ప్రకారము ఒడ్డెరాజులు కొంత దేశము యేలుతూన్నంతట అనుముకొండ దేశమండలి ఓరగంటి పట్ణమందు సింహాసనాసీనుండైన ప్రతాపరుద్ర దేవమహారాజు* పృథివీరాజ్యము సేయుచున్న ఈ దేశము ఆక్రమించి సదరహూ వ్రాసిన ఒడ్డెప్రభువులతో యుద్ధముచేసి వారిని పరాజయమున ఓడించి తాము విజయలక్ష్మిని పొందిన పిమ్మట ప్రతాపరుద్రునికి[3] భృత్యుండైన గండపెండార త్రిపురాదిదేవుండు ప్రభుత్వం చేస్తూయుండి మహాశ్చర్య(?) భూతాది దివ్యతేజోమయ దివ్యపరం జ్యోతి అధికముక్తి ప్రదాయక దరిశనముక్తి శ్రీమతు సమస్త పాలి

---

1. Gaṇḍikōṭadurgam Kaifiyat p. 13.
2. Gaṇḍikōṭadurgam Kaifiyat p. 13-14.
3. Pratāparudra is a mistake for Rudra.

తుండైన శ్రీ సిద్ధనాథదేవుని దివ్య శ్రీపాద పద్మంబులకు సాష్టాంగ నమస్కారముచేసి తమకు ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధియు గావలయునని...చతుస్సీమాను ప్రసాదపురంగ్రామం సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను యిచ్చినారు। ఇందుకు దాఖలా తాలూకు మజకూరు సగిలిపాయకట్టున మౌజే అట్లూరు గ్రామానకు దక్షిణ భాగమందు మజరా పాత అట్లూరికి ఉత్తర భాగమందు ఈశ్వరుని పాడు దేవాలయం వద్ద శిలాశాసనం ఉన్నది। అందుల సారాంశము.[1]

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౧౯౦ అగునేటి విభవ[2] సంవత్సర ఫాల్గుణ శు। ౧౫ గురువారం స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర విమలకీర్తీశ్వర అనుమకొండ పురవరాధీశ్వర వు(ఉ)మామహేశ్వర(?) మూరురాయ జగద్దళ ప్రతిపక్షరాయ వంశనిర్మూల రాయ స్థాపనాచార్య మేరుమండలిక దేశీయ్య చలమెత్తుగండ కదనప్రచండ వ(ఒ)డ్డె రాయధిస్తాపన(?) వైరిఘునతర(వైరిఘురట్ట) కీర్తి నారాయణ ఆశ్రితకల్ప వృక్ష అతివిషమహాయశిక్షాదక్ష శ్రీస్వయంభూనాథదేవ దివ్యశ్రీపాదపద్మారాధక...ప్రసాద నామాది సమస్తప్రశస్తి సహితుండైన శ్రీమతు కాకతీయ్య రుద్రదేవమహారాజులు అనుమకొండ దేశమండలి వో(ఓ)రుగంటి పట్టణమందు సుఖసంకథా వినోదంబున పృథివీరాజ్యము చేయగాను, శ్రీ మహారాజుల భృత్యుండు స్వస్తి అనేక నామావళీవిరాజమాన మానోన్నత ఆ...మహాదండ ప్రథమ శిఖావంత(?) పరబలకృతాంత ప్రకారాంత వీరావతార దామోదరసైన్య దశహాల(దిశాపట్ట ?) మండలిక బ్రహ్మరాక్షస చలమెత్తుగండ మూరురాయ జగద్దళ గండపెండార త్రిపురారిదేవుండు ఆ పున్నమనాటి దివసం రథోత్సవమువ స్వస్తి శ్రీపర్వతదక్షిణద్వారస్ఫురదుదయగిరిశిఖర వైశాఖమాస మాహశ్వర(?) భూతాతి దివ్యతేజోమయ దివ్యపరంజ్యోతి అధికన్నమాత్ర(?) అధికముక్తిప్రదాయక దరిశనముక్తి శ్రీమతు

1. Gaṇḍikōṭadurgam Kaifiyat p. 14.

2. A. R. No. 1 of 1939–40 (ప్ర)భవ.

సమస్త తీర్థ పరిపాలితుండైన శ్రీ సిద్ధనాథ దేవుని దివ్యశ్రీపాద పద్మంబులకు సాష్టాంగ నమస్కారంచేసి తమకు ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధి గావలయునని సగిలి భూమి...చతుస్సీమాను ప్రసాదపురంగ్రామం సహిరణ్యోదకదాన ధారాపూర్వకంగాను సమర్పిస్తిమి॥

ఈ ప్రతాప రుద్రదేవమహారాజుల ప్రభుత్వంలోనే బ్రహ్మరాక్షస జన్నయ్యదేవమహారాజు ఈ దేశం పాలనచేస్తూయుండి లంకటూరు అనే గ్రామం లంకమల్లేశ్వరునికి నైవేద్య సంధ్యాదీపములకు ధారాపూర్వకముగాను ఇచ్చిన శకవరుషంబులు ౧౧౯౨ నేయప్రమోదూత సంవత్సర జేష్ఠబహుళ సోమవారం. ఇందుకు దాఖలా తాలూకు మజుకూరు అహాషాం పాయకట్టులో మౌజే వీరపల్లెగ్రామానకు యీశాన్యభాగమందు వీరపల్లె పొలిమేర బద్దెవోలు తాలూకు మౌజే వనంపులలో చెల్లేమజరా జేచిరాకు భకుంతాపురం పొలంహద్దు కరణాల జోడిమాన్యములో నున్న హాళే కన్నడం అక్షరాలతో శిలాశాసనం ఉన్నది.[1]

ఈ ప్రతాపరుద్రదేవ మహారాజులు పృథివీరాజ్యం యేలుచుండగానె శ్రీమతుగండ పెండేర అంబదేవ మహారాజులు యీదేశం యేలుచూయుండగాను....శకం ౧౨౧౨ అగునేటి వికృతి సంవత్సర భాద్రపద శు ౭ గురువారమున ఓబళం పాయకట్టున ఓబళంబొడ్డెచర్ల బ్రాహ్మణపల్లె యీమూడు గ్రామముల ముగ్గు(గ్గ)డను చెర్వుకట్ట లోతట్టున శిలాశాసనం ఉన్నది.[2]

కడపయపల్లె గ్రామానికి దక్షిణభాగమందు పొలంలో ఉండే శాసన సారాంశము।

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౨౬ అగునేటి క్రోధి సంవత్సర మాఘ శు। ౧ లు శ్రీమన్మహామండలేశ్వర బ్రహ్మరాక్షస గంగరాజు తిరుపతి దేవమహారాజులు పామూరిపట్టణము రాజధాని చేసుక సుఖ

1. See Gaṇḍikōṭadurgam Kaifiyat p. 14.
2. Ibid. p. 15.

సంకథా వినోదంబున పృథివీ రాజ్యము చేయుచుండి తమకు ఆయురా రోగ్య అయిశ్వర్యాభివృద్ధిగాను స్వస్తిశ్రీ శ్వేతచెన్న మల్లికార్జున దివ్య శ్రీపాదపద్మారాధకులైన స్వస్తిశ్రీ......

(ఇక్కడ రాయి పగిలిపోయి ఉన్నది.)

వరికుంట అనే గ్రామాన నీలకంఠేశ్వరుని దేవాలయంలోని శిలాశాసనం యొక్క సారాంశము.

సకిలి భూమిలోని చండువాయి చతుస్సీమలోని సకలాయం సహితముగా శ్రీసిద్ధనాథదేవునికి మధ్యాహ్న అవసరానకు సర్వమాన్యం గాను యిచ్చినారు। ఇందుకు దాఖలా సకిలి పాయకట్టు మాజేచండు వాయి గ్రామానకు వు(ఉ)త్తరం మజరాబేచిరాకు పాతనూతనముల నెత్తం భూమి బావివద్దయుండే శిలాశాసనం యొక్క సారాంశము ॥[1]

విద్యానగర సింహాసనాధీశ్వరులైన వీరశ్రీ బుక్కరాయ మహా రాయల యేలుబడి అయిన తరువాతను ఆయన కొమారుడు హరి హరదేవ మహారాయలు రాజ్యమేలిరి. తరువాత ఆయన కుమా రుడు ప్రౌఢదేవరాయమహారాయలు రాజ్య మేలిరి. ఇందుకు దాఖలా తాలూకు మజుకూరు వూటు(?) మవుజే కురుగుంటు పల్లెపైకి దొంగలసాని గ్రామానికి పశ్చిమ భాగమందు పినానికినీ తీర మందు పాడుదేవాలయము వద్ద ఆంజనేయ విగ్రహానకు వెనక పార్శ్వ మందు వు(ఉ)న్న శాసనం ॥[2]

శ్రీ శకాబ్దంబులు ౧౩౩౯ అగునేటి హేవళంబి సంవత్సర ప్రౌఢ దేవరాయమహారాయలు అని వ్రాసియున్నది.

ఈ తరువాతను కొన్ని అక్షరములు శిథిలమైనందున తెలియ లేదు ॥[3]

---

1. See, Gaṇḍikōṭadurgam Kaifiyat p. 17. A. R. No. 65 of 1939—40.
2. A.R. No. 5 of 1939–40.
3. A. R. No. 14. of 1939–40.

కృష్ణదేవరాయలవారి ప్రభుత్వంలోనే నలకంపమరాజు తమ్ముడు చిన సంగమరాజు అనే అతడు శ్రీమన్మహామండలేశ్వర గుమ్ముడూరి ఓబళదేవరాజుకు ఉమ్మళికెగాను మాచుపల్లె గ్రామం యిచ్చియుండగా ఆ ఓబళయ్య దేవమహారాజు కడప తిరువెంగళనాథుని దేవదాసియైన కొండసానికి మాన్యముగాను ముత్తుముచేను యిచ్చెను. ఈ ప్రకారం యీ గ్రామం మజరా వుక్కాయపల్లెలో శాసనం వున్నది. శకంలేదు సంవత్సరం మాత్రం ఉన్నది.

ఈ కృష్ణదేవరాయలవారి అన్న(తమ్ముడు) శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీర అచ్యుతదేవమహారాయలు విజయ నగరమందు రత్న సింహాసనారూఢుండై పృథివీసామ్రాజ్యము చేయు చుండగాను నలకరాజు పినతిరుమలయ్య రాజుగారికి సిద్ధవటం సీమ అధికారం యిచ్చియుండగాను వారి కార్యకర్తలైన నయనారయ్య అనే యతడు కరిగిరి గ్రామమందు ముక్తికోటీశ్వరునికి పూజానైవేద్యదీపా రాధనలకుగాను ముత్తుముచేనున్ను యిరువై గుంటలు మడిన్ని యిచ్చినాడు ‖

ఈ ప్రకారం తాలూకు మజుకూరుపైకి ఊటుగ్రామం గుండ్లమడ అగ్రహారమందు ముక్తికోటీశ్వర దేవస్థానంలో ధ్వజస్తంభమువద్ద ఉన్న శాసనం. అందుల సారాంశము। *

శాలివాహన శకవరుషంబులు ౧౪౫౭ అగునేటి మన్మథ సంవత్సర చైత్ర శు॥ ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర నలకరాజు పిన తిరుమలయ్య దేవమహారాజుల కార్యకర్తలైన నయనారయ్యవారు కైలాస వాసియైన శ్రీ సిద్ధవటం సీమలోని కరిగిరిగ్రామమందు ముక్తికోటీశ్వర నాథదేవునికి పూజ దీపారాధన నైవేద్యాలు నడిచేటట్లు సింగంపల్లెలో నచయ్యరుకు దక్షిణాన ముత్తుము చేను యిరువై గుంటలు మడి యిచ్చి నట్లుగా వ్రాసివున్నది ‖

---

* A. R. No. 23. of 1939-40.

అచ్యుత దేవరాయలవారి తదనంతరమందు వీరశ్రీ సదాశివదేవ మహారాయలు విద్యానగర సింహాసనాధీశ్వరుడై పృథివీరాజ్యము యేలుచుండగా కృష్ణరాయలవారి అల్లుడైన అళియరాను రాజు యువరాజత్వం చేస్తూయున్నప్పుడు సదాశివదేవమహారాయలకు దక్షిణ భుజాదండులైన ఆత్రేయగోత్ర సోమవంశోద్భవులైన రామరాజుగారి పౌత్రులైన ఆరవేటి రామరాజయ్య గుత్తి తిరుమలరాజయ్య దేవమహారాజులుగారి మేనల్లుడైన కాశ్యపగోత్ర సూర్యవంశాధీశ్వరుడైన మాద్రాజు పౌత్రులైన అవుబళరాజు పుత్రుడైన నాగరాజయ్య దేవమహారాజులగారికి వు(ఉ)దయగిరి రాజ్యానికి లోనైన నాయంకరానకు చెల్లే సిద్ధవటం సీమలోని జాంబవంత ప్రతిష్ఠితులైన వ(ఒ)ంటిమిట్ట రఘునాయకులకు అమృతపడ్లకు గోపురప్రాకారాలకు తేరుతిరుణాళ్లకు సదాశివదేవ మహారాయలవారి ఆసతిని పొత్తపినాటి సీమలోని భోగపల్లె అంతుపల్లెలు మూడున్ను వ(ఒ)ంటిమిట్ట స్థళానను చెరువుకింద చెల్లివచ్చేమడి అర్చన వృత్తికుంటలు ౫౦ యీశై పోగా నిలిచిన మడి ౩౦ గుంటలున్ను యీ పల్లెలు ౩ కిన్ని మడికిన్ని కలిగిన అష్టభోగ తేజస్వామ్యములు సహితంగాను ధారాపూర్వకముగా శాలివాహన శకవర్షమ్ములు ౧౪౭౭ ఆనందనామ సంవత్సర శ్రావణ శు॥ ౧౨ పుణ్యకాలమందు యిచ్చిరి. ఇందుకు దాఖలా తాబూకు మజుకూరు వంటిమిట్టపూటు గ్రామంలో కోదండరామస్వామి దేవాలయంలో తూర్పు మహాద్వారంలోతట్టున శాసనం వున్నది॥*

శాలివాహన శకంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తినామ సంవత్సర ఆషాఢ శు॥ ౧౨ సోమవారం వీరశ్రీ సదాశివదేవ మహారాయల కాలమందే సదరహు సూర్యవంశోద్భవుడైన నాగరాజయ్య దేవమహారాజులవారికి వు(ఉ)దయగిరి రాజ్యానకు లోనైన నాయంకరానకు చెల్లే సిద్ధవటం సీమలోని వ(ఒ)ంటిమిట్ట శ్రీరఘునాయకులకు అంగరంగ వైభవాలకున్ను గోపురమంటప ప్రాకార రథోత్సవం మొదలైన వుత్సవాలకు వ(ఒ)ంటిమిట్టగ్రామమున్ను యీ గ్రామానకు చెల్లే పల్లె

* A. R. 411 of 1911.

లున్నూ చతుస్సీమకులోనైన పొలము ధారాపూర్వకముగా యిచ్చినారు। ఇందుకు దాఖలా సదరహు వ్రాసిన శాసనానకు వు(ఉ)త్తర భాగమందు శాసనం వున్నది। ఇదిగాక వీరశ్రీ సదాశివ దేవమహారాయలవారు రాజ్యం మేలేటప్పుడు కాస్యపగోత్ర సూర్యవంశోద్భవులైన సదరహు నాగరాజయ్య దేవమహారాజులుగారు వు(ఉ)దయగిరి రాజ్యానికి లోనైన నాయంకరానకు చెల్లే సిద్ధవటం సీమలోని జాంబవంత ప్రతిష్ఠితంబైన వ(ఒ)ంటిమిట్ట రఘునాయకులకు అమృతపళ్లకు గోపుర ప్రాకారాలకు తేరుతిరునాళ్ళకున్ను సదాశివదేవమహారాయలుంగారి ఆనతిని తాలూకు మజుకూరిలో చెల్లేటి మవుజే గంగపేరూరు గ్రామం చతుస్సీమకు లోనైన పొలం సహోధారబోసి యిచ్చినారు।

ఇందుకు దాఖలా మవుజే మజకూరులో గ్రామానికి పూర్వభాగమందు నిల్వపాతి ఉన్న రాయిమీద శాసనం ॥*

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౮౧ అగునేటి సిద్ధార్థి సంవత్సర ఆషాఢ శు ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప సదాశివమహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులైౖ పృథివి సామ్రాజ్యము చేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర పాండవకులధుర్య కల్యాణరాజ్యస్థాపనాచార్యహరణబిరుదరగండ గండరగోళిబిరుద మన్య విభాళాది మహాబిరుదాంక అభినవసాహసాంక సత్యభాషావ్రత పరాయణ చాళుక్యనారాయణులైన ఆత్రేయగోత్ర పవిత్రులైన సోమవంశాధీశ్వరులైన అశ్వపతి గజపతి నరపతి మూరురాయస్థాపనాచార్యులైన ఆరవేటి రామరాజు పౌత్రులైన శ్రీరంగరాజ పుత్రులైన రామరాజయ్య దేవమహారాజులుంగారు సదాశివదేవరాయలకు దక్షిణ భుజాదండులై తమ అల్లుడు కాస్యసగోత్ర సూర్యవంశాధీశ్వరుడైన మంచ్రాజు పౌత్రుడైన బొబళరాజ పుత్రుడైన నాగరాజయ్య దేవమహారాజులయ్యవారు వు(ఉ)దయగిరి రాజ్యానకు లోనైన నాయంకరానకు చెల్లే సిద్ధవటం సీమలోన శ్రీమద్దేవదేవోత్తమ తేవతాసార్వభౌమ సకల లోకశరణ్య

* A. R. No. 19. of 1939-40.

శరణాగత వజ్రపంజరుండైన జాంబవంత ప్రతిష్ఠితులైన శ్రీవ(ఒ)ంటిమిట్ట రఘునాయకుల నిత్యకటర(?) అమృత వళ్లకు అంగరంగ వైభవాలకు గోపురప్రాకారములకు తేరుతిరుణాళ్ళకు సదాశివదేవమహారాయలవారి ఆనతిని గంగపేరూరు గ్రామమున్ను ఈ గ్రామానకు చెల్లే చతుస్సీమకు లోనైన పొలమున్ను ప్రథమ ద్వాదశీ పుణ్యకాలమందు హిరణ్యోదక దానధారాపూర్వకముగాను అష్టభోగ తేజస్వామ్య సహితంగాను ఆచంద్రార్కస్థాయి అగునట్లుగానున్ను ధారబోసి వ్రాయించి యిచ్చిన శిలాధర్మ శాసనం.

# కడప తుకిడి
# దూపాడు శిలాశాసనములు

దూపాడు తాలూకు త్రిపురాంతక గ్రామానకు పశ్చిమం అర కోసుమీాదను కొండమీాద యున్న శాసనం॥ దేవాలయానకు పడమటి ద్వారానకు వుత్తరము గోడకు నిలువపెట్టిన శాసనము.*

స్వస్తి సమస్తభువనాశ్రయ(ం) శ్రీపృథివీపతి(వల్లభ) మహారాజాధిరాజరాజపరమేశ్వర పరమహాపరస్వర (పరమమాహేశ్వరం) సత్యాశ్రయ కులతిలక(ం) చాళుక్యాభరణ(ం) శ్రీమత్రిభువనమండలేశ్వర (మల్లదేవర) వీరవిజయరాజ్యముత్తరో త్తరాభి(వృద్ధి) ప్రవర్ద్ధమాన(ం) ఆచంద్రద్రార్క్కు తారా(ంబరం)సెల్లుత్తిమిరె జయంతి మనెయడి నాసలు ఘురద్వ (జయంతిపుర నెలవీడినోళు) సుకసంకటాదినాడండి (సుఖసంకథావినోదదిం) రాజ్యముత్తదింత (రో త్తరదిం) (గెయ్యుత్తమిరె) పాదపద్మపూజలి (తత్పాదప ద్మోపజీవి) సమగె(ధి)గత పంచమహాద్ధ(శబ్ద) సామంతాధిపతి మహాప్రచండనాయకం విబుధవరదాయకం సుజనప్రసన్న(ం) యడడమత్త (నుడిదుమత్తెన్నం) గోత్రపవిత్ర పరాంగనామం(పు)త్రం తురంగంత (రేవంత) ద్వేదికా(వైరికృ)తాంతం పాసతో(సాహాసో)త్తుంగ నయ్యన శి(సి)ంగనామాత్య(ది) సమస్త ప్రశస్థ(స్తి) సహితం శ్రీమన్మహాప్రధాన అనంతపాల దండరసరు శ్రీమ(తి)త్ చాళుక్య విక్రమవర్ష దళు ౫౧ నేటి(నెయ) పరాభవనామ సంవత్సర జేష్టాది(ష్ఠద) మాసాన(వాస్య) సోమవారదందు సూర్యగ్రహణ నిమిత్తడిం(దిం) శ్రీపగ(ర్వ)త మహాద్వ, (ద్వార)ర శ్రీత్రిపురాంతకమహాదేవర అంగరంగభోగక(క్కు)ం ధూపదీపక(క్కు)ంబైగం(గిన) నైవేద్యక(క్కు)ంబైది(గి)న పూజక(క్కు)ం కద (ఖండ) స్ఫుడి(టి)త బీర్ణోద్ధారక(క్కు)ం మోడ్డె(ట్టె)వాడి నాడోక్ర

---

* Mac. Mss. M. 265 (15-3-25) **Brown Fol. 3 vol. 13, p. 161; Wilson Vol. 2 p. CXXIV. See, A. R. No. 276 of 1905, SII IX-i No. 212**

నకు యెవ్వరు తప్పితే తమ తల్లి దండ్రులను గోబ్రాహ్మణులను వారణాసిలో వధియించిన పాపానబోవువారు। ఇంత వట్టు మారకాపుర స్థళాన యెత్తిన పరికె, కూరా, కట్టెలు, మజ్జిగె సత్రానకు యిస్తిమి। తిరుణాళలోను మారకాపుర స్థళాన అయిన సుంకమున్ను యిస్తిమి. కట్టడియైన పళ్లు ఆరింటికి స్థానంవారు అధికారి కరణాలకు పడి ౧ గాక నిలిచిన ౫ పళ్లు స్మార్తులైన పరదేశి బ్రాహ్మణులకు ప్రసాపడ సత్తర్వగా బెట్టించేది ॥

శ్రీస్వామియైన చెన్నరాయస్వామి కోవెల గోపురం వెలపట దక్షిణపు తట్టుకు తూర్పుకోణానవున్న ప్రాకారం అందు ఉండే శిలాశాసనానకు నకలు :

* ౯. శుభమస్తు। శ్రీమతే రామానుజాయనమః। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౬ అగునేటి ఆనంద సంవత్సర కార్తిక శు। ౧౨ లు శ్రీమద్రాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యము చేయుచునుండగాను శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన శ్రీమారకాపురం శ్రీ చెన్నరాయలదేవరు పాదపద్మంబులకు శ్రీ మన్మహామండలేశ్వర రామరాజు కొండయ్య కొమారుడు తిమ్మరాజు దండం సమర్పించియిచ్చిన భూదాన ధర్మశాసన క్రమ మెట్లన్నను। మాకు నాయంకరానకు సదాశివదేవరాయలు పాలించ నవధరించిన దూపాటి సీమలోని గుండ్లకమ్మదరి నాగులవరం గ్రామం పండ్రెండు సంక్రాంతుల మహోత్సవాలకున్ను ధారబోసి సమర్పిస్తిమి. ఈ సంక్రాంతుల మహోత్సవాలయందు కోనేటి తీరమందు స్వామివేంచేసి ఆరగించిన పదార్థములవల్లను ధర్మకర్త్రాంశం చతుర్భాగమున్ను వాధూలగోత్రోద్భవులైన కందాళ్ల భావనాచార్యుల వారి కొమాళ్లు శ్రీరంగాచార్యుల అయ్యవార్ల దివ్య శ్రీచరణారవింద

* A. R. No. 15, of 1905 donors name given as Timmarāju son of Rāmarāju-Konētayya.

ములకు, దేవరదాసుడు శ్రీమన్మహామండలేశ్వర రామరాజు కొండయ్య కుమారుడు తిమ్మరాజు సండం సమర్పించి యీతథాతిథి ఉత్థానద్వాదశి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానపూర్వకముగాను ధారబోసి యిస్తిమి గాన దేవర వారి పుత్ర పౌత్ర పారంపర్యముగాను అనుభవించ గలవారు.

దానపాలనయోర్మధ్యే దానా చ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥
ఏకైవభగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

శ్రీశ్రీం జేయును.

శ్రీ చెన్నకేశవస్వామివారి దేవాలయం ఉత్తరపు ప్రాకారాన వెలపట మధ్యరంగానకున్ను ద్వారపాలకులకున్ను ఉత్తరం దానిమ్మ చెట్టు దగ్గిరవున్న శిలాశాసనానకు నకలు:*

౧౦. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౮౨ అగునేటి రౌద్రినామ సంవత్సర మార్గశిర శు॥ ౧ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప సదాశివదేవమహారాయలుగారు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యముచేయుచుండగాను శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య పరమహంస పరివ్రాజకాచార్య ఉభయ వేదాంతాచార్యులైన యంబెరుమానారుజియ్యంగారున్ను శ్రీమన్మహామండలేశ్వర సిద్ధిరాజు తిమ్మరాజయ్యగారి కార్యకర్తలైన కదిరి నాగప్ప(యు)న్ను రాచకరణం వరదయ్య(యు)న్ను మన్నెంవారున్ను, స్థలకరణాలున్ను, వేయించిన శాసనం క్రమమెట్లన్నను శ్రీ చెన్నరాయల కోవెలను కందాచారంవారికి ప్రాకు నడిచే కట్టడి యేడు ౧కి నెలలు ౧౨ ప్రాప్తిని ధ్రువంగాను మేము నిర్ణయ పరచిన యేడు ఒకటింటికి నెలలు ౧౦ ప్రాప్తిని కట్టడిచేస్తిమి॥ మేళాలు గంగయ, మద్దెల

* A. R. 158 of 1905. Given Raudri Śaka year 1481.

తిమ్మయమాదయ, మద్దెలబయ్యన,నందువనాగయ,సుంకుబసువయ,వింజామరవారు, అరిగెలభేరి చెన్ను మేళాలు సహాగాను మేళాలవారు జనులు ౯౦ కి వారి జీతం ప్రాకు నడిచే నెలలు ౧౨ పద్రెండైన యేడు ౧ కి హాా ౫౨౦ అక్షరాల యేనూటయిరవై వరహాలకు చెన్నరాయల నగరికి విడిచిన నెలలు ౨ కి హాా ౮౮ యెనభై యెనిమిది వరహాలు పోయి వారికి ధర(?) నెలలు ౧౦ కి హాాన్నులు ౪౩౨ అక్షరాల నాలుగు వందల ముప్పైరెండు వరహాలకు పీరిజీతానకు ఉత్తరవు గజపడి ప్రసాదం హాా ౮౩, తిరుపణ్యారాలు హాా ౨౬, కొండాపురం హాా ౧౨౩, తెల్లబాడు హాా ౧౫౦, కొండెపల్లి హాా ౫౦, అంతు హాా ౪౩౨ నన్నూటముప్పైరెండు వరహాలకు కొల్వగలవారు; కడమ చిల్లర కందాచారం వారు పది నెలలు ప్రాప్తిన పుచ్చుక యేడాదిన్ని కొలువగలవారు; చెన్నరాయల నగర నడిచే కందాచారం వారి నివర్తన, ఉడుగర, ఉచితం తిరుపణ్యారాలు, గంధం యెవ్వరు అడిగినాను తమ ఆండ్లను భోగంవారి పలకవానికి యిచ్చిన వారు.

శ్రీ చన్నకేశవస్వామి దేవాలయం మధ్యరంగములో తిరుమంటపం దక్షిణ స్తంభంమీాద వున్న శిలాశాసనానకు నకలు:*

౧౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౯౧ అగునేటి శుక్ల సంవత్సర ఆషాఢ శు॥ ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన శ్రీ చెన్నకేశవరాయలను రేచర్లగోత్రపవిత్రులైన వెలుగోటి పెదతిమ్మానాయనింగారి పౌత్రులైన కొమారతిమ్మానాయనింగారి పుత్రులైన చెన్నప్పనాయనింగారు అనంతములైన దండములు సమర్పించి యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమల రాజయ్యదేవమహారాజులుంగారు మానాయంకరానకు పాలించ

* A. R. No. 166 of 1905.

యిచ్చిన కొచ్చర్లకోట సీమకులోనైన మారకాపురం గ్రామానను మానగరి ఆకులమంత్రాయానకు చేరివచ్చే రొక్కం యీతధాతిథి ప్రథమ ద్వాదశి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారా పూర్వకము గాను ధారబోసి సమర్పిస్తిమి। ఆమంత్రాయం పొలివొట్టు యేర్పరచి స్వామికి పొలివొట్టు గట్టిన వివరం దినం ఒక్కంటికి గట్టిమూక చొప్పు నను దోసిపడి కట్టడచేసిన విధి। లక్ష్మీసహితులై రంగమంటపమందు తిరు వారాధన అవధరించే కాలమందు దోసిలిపడి మా కైంకర్యముగాను ఆరగించినందులోను మాకువచ్చే ధర్మకర్తాంశం చాతుర్భాగకం మా ఆచార్యులు కందాళ్ల అన్నగారాచార్యుల అయ్యవారికి ధారబోసి సమర్పిస్తిమి। స్థానంవారికి ఒక అంశంకూడా రెండుఅంశాలు పోను కడమరెండు అంశాలున్ను స్వామి భండారానకు ఈ మర్యాదను పొలి వొట్టు గట్టి సమర్పించిన ధర్మశాసనం.

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

శ్రీ చెన్నరాయుల కల్యాణమంటపం ముందర నరసింహస్వామి గుడి ముందర వుండే నిలువు స్తంభంమీద వున్న శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౫౬౭ అగునేటి తారణ సంవత్సర మార్గశిర బ॥ ౧౧ లు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన శ్రీమారకాపురి శ్రీ చెన్నకేశవరాయుల దివ్య శ్రీపాదపద్మాలకు ఆశ్వలాయనసూత్ర ఋక్శాకాధ్యయన కౌశిక గోత్రోద్భవులైన మొనమంద్ర కృష్ణసోమయాజుల నప్తృలున్ను నాగం భట్ల పౌత్రులున్ను మొల్లంభట్ల పుత్రులైన కమలనాభుడు సాష్టాంగ దండం బెట్టి సమర్పించిన అంకణం॥

దూపాడు తాలుకా పయికిమవుజే నరసయపాళెం గ్రామం చెరువువద్ద వనంలో ప్రాగ్భాగమందు ఉన్న శిలాశాసనమునకు నకలు :

శుభమస్తు। స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౮౫ అగు నేటి రుధురోద్గారినామ సంవత్సర మాఘ శు। ౧౩ లు శ్రీమన్మమహామండలేశ్వర రామరాజు శ్రీరంగరాజయ్య దేవమహారాజులుంగారు కంజర్ల నరసయ్యగారికి యిచ్చిన భూదాన ధర్మ శిలాశాసన క్రమమెట్లన్నను; సదాశివదేవ మహారాయలుంగారు మానాయంకరానకు పాలించియిచ్చిన పినయేరువసీమలో దూపాటి సీమలో చెల్లివచ్చే మనుబల్లిగ్రామంలోను పాయదొక్క కడిదో-చేసిన నిలువురాళ్ల పొలానకు, పొలైన(?) పొలానకు మేరలు తూర్పుకు చక్కరాళ్ల బోడున్ను చింతబోడున్ను, దక్షిణానకు వీరయ కుంట యెండలబోడున్ను పడమటికి బోయడొంక ఉత్తరానకు రాళ్లవాగు ఈ చతుస్సీమలోనైన నిడురాళ్ల పొలానకు ప్రతినామమైన శ్రీరంగరాజ పురము పూర్వం నళ సంవత్సర ఆషాఢ శు। ౧౩ ల నాడు, తుంగభద్రాతీరమందు విఠలేశ్వరుని సన్నిధిని సహిరణ్యోదక దాన ధారాపూర్వకముగాను సర్వమాన్యముగాను సుంకస్థావరకుల(?) లోను త్రికరణ త్రివాచకములుగాను ధారబోసి యిస్తిమి గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను సుఖాన అనుభవించమని వేయించిన శిలాశాసనము।

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను వారి తల్లిదండ్రాదులను వారణాసిలో వధియించిన పాపాన బోవువారు। గంగాతీరమందు గోవధచేసిన పాపాన పోవువారు।

గుండు మొహారు పార్శ్వమొహారు

పార్శ్వదస్కతు నెంబరు ౫౫

బానాఖబోడ మల్లన్న వ వీరన్న తాలూకు చాపలమద్దు పెంట వోళకసవరం వగైరా మ॥ దూపాడున్న ౧౩౦౦ వసలి మీ తాలూకు

గ్రామాలు సుదామదు ప్రకారం బహాలు వుంచి సాలియ్యానా బేరీజు జప్తీరూకలు యినాములు దేశీలు.

ఆ రెండు అరెదా(?)లు ౨౩౩౯౧౦౧ అక్షరాల యిన్నూటముప్పై ఏమూడు వరహాల పదిరూకల పాతికె బేరీజు మొకర్రరు చేసి యిచ్చినారం మీా తాలూకు గ్రామాలు విస్తారం కిర్దుఆబాదు చేసి రయ్యతు రజాబందివుంచి సదరహా ప్రకారం బేరీజుసాలుబసాలు కిస్తుబందీల ప్రకారం యేసాలుది ఆసాలుకు ఝూడాగా చెల్లించి రసీదులు హాసలుచేసుకుని సరకారు హుకుంలో సరగరంగావుండేది।

ఆరెంద స్తురి

కంభంతాలూకు కొన్నిగ్రామాల శిలాశాసనాలకు నకళ్లు తెనుగు అక్షరాలు.

కంభంతాలూకు పైకి మవుజే బాదినేనిపల్లె గ్రామానకు దక్షిణంగా తోపుకాలువ దగ్గిర వుండే శిలాశాసనానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౩౭౫ అగునేటి యీశ్వరనామ సంవత్సర మాఖ శు॥ ౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప దేవమహారాయలు పెనుగొండలో నిజ రాజధానిగాను వజ్రసింహాసనారూఢులై పట్టణమందు సామ్రాజ్యము చేయుచుండగాను రేచర్ల గోత్రోద్భవులైన వెలుగోటి చిట్టికొండమ నాయడుంగారి పౌత్రులున్ను కొమార తిమ్మానాయడుంగారి పుత్రులున్నూ అయిన పెదకొండమ నాయుడుంగారు బాదినేపల్లెకు ప్రతినామమైన తిరుమలదేవరాయపురం స్థితా శేష విద్వన్మహాజనములు అయిన ఓరుగంటి అక్కులయ్య శాస్త్రిల్లవారికి బాదినెపల్లె సర్వాగ్రహారంగా ధారాగ్రహీతంగా యిచ్చిన ధర్మ శిలాశాసన పత్రిక క్రమం యెట్లన్నను శ్రీమన్మహామండలేశ్వర జిల్లేళ్ల రంగపతి రాజయ్యదేవమహారాజులుంగారు మానాయంకరానకు పాలించియిచ్చిన తొండమారయ గుళ్ల సీమలోకి చెల్లే బాదినేనిపల్లె కుంటకు రెడ్డిచర్ల పొలములోనుంచి నూర

వారపల్లె పొలంలో వెళ్లితోపుకాల్వ త్రవ్వించి నీళ్లు తెచ్చేటందుకు యీ కాలువ త్రవ్వించినంతమేరకు యీ కాలువను నీళ్లు పారినంత పొలం మీకు సహిరణ్యోదక దానధారాపూర్వకముగా వ్రాయించి యిస్తిమి। గనుక ఆ కాలువ త్రవ్వించి బాదినేనిపల్లె కుంటకు నీళ్లు రప్పించుక కుంటక్రింద పండిన పొలం మీ పుత్రపౌత్రపారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని సుఖాన నుండవలెను॥

కంభం తాలూకు పైకి మవుజే రెడ్డిచర్ల గ్రామములో వల్లభ రాయణి దేవళం దగ్గిర నిల్వురాతికి ఉండే శిలాశాసనానకు నకలు:

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౧౯ అగునేటి హేవళంబినామ సంవత్సర చైత్ర బ॥ ౧౦ శుక్రవారం। శ్రీమహామండలేశ్వర అప్రతీకమల్ల రెడ్డిచర్ల రాఘవరాజు కుమారుడు అవుబళరాజుగారు శ్రీమన్మహామండలేశ్వర అప్రతీకమల్ల రెడ్డిచర్ల పినసూరపురాజు కొమారుడు పినబసవరాజువారు, ఐన యిద్దరు యేక స్తులై రెడ్డిచెర్లకాపులు పుష్పగిరి కోనారెడ్డి, దాసరిరెడ్డి, పోలెండ తాతి రెడ్డి పాపయ్య, సూరాబయ్యన, రెడ్డిచర్ల సూరా పెద్దవీరారెడ్డి మొద లైన కాపులకు యిచ్చిన దశవందం శిలాశాసన క్రమమెట్లన్నను, రెడ్డి చెర్ల చెర్వుపై కట్టవేయించేటందుకున్నూ మీకు చెరువు క్రింద దశ వందం ఖ 3 పుట్ల మడి సర్వమాన్యంగాను యిచ్చినారం। చెర్వుకట్టను - కట్లును పరిపూర్ణంగాను పనిచేయించి మీ పుత్రపౌత్ర పారంపర్యంతంగా ఆచంద్రార్కస్థాయిగాను యీ మూడు పుట్లమడిన్ని సర్వమాన్యంగాను అనుభవించి బ్రతికేది। మీకు యిచ్చిన మూడు పుట్ల దశవంధం మడిన్ని ఒప్పివుచ్చుకున్న వారిలో పాళ్లవారు పాలుగుళ్ళ యెల్లా రెడ్డి పాపిరెడ్డిన్ని, సొంటుంలింగయ, వెంగరెడ్డి లింగయ, ఉప్పర్ల పల్లె తిమ్మారెడ్డి, ఉప్పర చిట్టయగారున్ను యీదశవందానకులో నైన వారు। ఈ మూడు పుట్ల దశవందం మడిన్ని గ్రామకరణాల లెక్క ప్రకారాన సర్వమాన్యంగాను అనుభవించుక బ్రతికేది.

ఈ మూడు పుట్ల దశవందం మడిన్ని అనుభవించే కాపులలోను యెవ్వరు గనుక లేకున్నాను గ్రామాన ఉన్న దశవందీకులే మూడు పుట్ల దశవందం మడిన్ని అనుభవించి చెరువు మీద పని కొదవ లేకుండాను యేటా యేటా పని చేయించగలవారు। ఈ దశవంధం మడి మీదను అన్యాయంచేసి రొఖ్ఖధాన్యాలు యెవరున్నూ అడగ రాదు। ఈ పుణ్యానకు యెవ్వరు తప్పినడిచినా గంగకరుతను బ్రాహ్మణులను వధియించిన పాపాన బోవువారు। తల్లి దండ్రుల వారణాసిలో వధియించిన పాపాన బోవువారు। ఇట్లని వేయించిన దశవందం శిలా శాసనము ॥

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

సూర్య చంద్రులు కలంతకాలమున్ను ఈ దశవందం మూడు పుట్ల మడిన్ని సర్వమాన్యంగా నడపగలవారము। శ్రీ శ్రీ శ్రీంజేయును ॥

కంభం తాలూకు పైకి మవుజే రెడ్డిచెర్లగ్రామమములో వల్లభ రాయణి దేవళం దగ్గిర నిలువుగా పాతి వున్న శిలా శాసనమునకు నకలు।

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౭౬ అగునేటి ఆనందనామ సంవత్సర కార్తిక బ ౧౧ సోమవారం శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప శ్రీ సదాశివదేవమహా రాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యము చేయుచునుండగాను శ్రీమన్మహామండలేశ్వర రామరాజు ఎఱతిరుమల్రా జయ్యగారికి చెల్లే యెర్ర్వ సీమలో తొండమూరయగుళ్లకు చెల్లినచ్చే రెడ్డిచెర్లసము...ధిరాయణికి కాస్యపగోత్రులైన ఆపస్తంబ సూత్రులైన యజుశ్శాఖాధ్యయనులైన చాగలమర్రి విప్రవినోది ...ది...మకు మాదు వల్లభయ పుత్రులైన అనంతయ...గారున్ను వశిష్ఠగోత్రులైన ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యయనులైన చెన్నూరు విప్రవినోది జదకవయు

గారి కుమారుడు గోవిందయ్య పుత్రులైన గోవిందయ్యగారున్ను యేక స్థులై వసంతవల్లభ రాయణికి గోకులష్టమినాడు చెరువారగించేటందుకు రెడ్డి చెర్ల మహాజనులు విప్రవినోదులు అందరికిన్ని యిచ్చేవర్తన దేవునికి ధార బోసి యిస్తిమి గనుక యీ పుణ్యానకు యే విప్రవినోది తప్పినాను వార ణాసిలో గోవును బ్రాహ్మణులను తమ తల్లిదండ్రులను వధియించిన పాపాన బోవువారు। సురాపానం శునకమాంసం సేవించిన పాపాన బోవువారు। అనంతయ వ్రాలు శాసనం మంచిన......

ఆంజనేయస్వామి

దూపాటి తాలూకుపైకి మవుజే బొడ్డిచర్లగ్రామంలో దక్షి ణపుతట్టు ఆంజనేయస్వామి దేవాలయానికి దక్షిణపు ద్వారానకు పశ్చిమపు తట్టు నల్లనిలువురాతికి వుండే శిలాశాసనానికి నకలు తెనుగు అక్షరాలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౬౨ అగునేటి రౌద్రినామ సంవత్సర శ్రావణ శు। ౧౦ లు కోటసీనులో తర్లు పాటికి పశ్చిమం దూపాటి సీమగడి సర్దు గుండికా నదీతీరమాను ఉత్తర వాహిని పుణ్యక్షేత్రమందు బొడ్డిచర్ల శ్రీవారి దేవాలయం శిథిలమై పోయియుండగా మహారాజరాజశ్రీ వెలుగోటి కుమారయేచమనాయని వారు పునహాకు పోయివచ్చే సమయమందున యీ స్వామివారి దర్శనం చేసుకుని యీ స్థళం మహాజాగ్రత స్థళం అని దేవాలయం కట్టించవలె నని తమ తాలూకు సేనాపతి దీవి అచ్చన్నగారిని ఉంచి కట్టించిన గర్భగృహం, ముఖమంటపము, కట్టించి, శ్రీస్వామివారికి, ప్రీతిగా తమ జహాగీరులో తుర్లబాటిలో నైవేద్యదీపారాధనకు కయిలి తూమెడు వెలిగడ చేను, వరిమడి కుంచెడు యీ ప్రకారం భూదానం యిచ్చినారు. తర్లుబాటి చెర్వు క్రింద స్వామివారి అర్చకునికి కయిలుకొలిచేటప్పుడు కితుకు(?) మూడు దేవదోసిళ్లు యిప్పించేది.

దూపాడుతాలూకుపైకి మవుజే బొడ్డిచెర్ల గ్రామానకు ఆగ్నేయ భాగమందు గ్రామానకు సమీపాన గుండ్లకమ్మ నది ఒడ్డున పశ్చిమంగా

పాడు అయిన ఈశ్వర దేవాలయానకు ఆగ్నేయమూల సరకారు తోటలో నేలమీద పడివుండే, నల్ల రాతికి ఉండే శిలాశాసనం నకలు, తెనుగు అక్షరాలు :

చంద్రుడు, లింగం. సూర్యుడు.

స్వస్తిశ్రీ మహామండలేశ్వర కాకతియ్య గణపతి దేవమహారాజులు వోరుగంటి పృథ్వీరాజ్యం సేయగాను స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౧౭౯ అగునేటి పింగళనామ సంవత్సర పుష్య బ॥ ౩ మంగళ్వారం సంక్రాంతినాడు, శ్రీమన్మహాపిరాని(ప్రధాని) నూపుల రామదేవుని అదికార్యంబులుల (అధికారంబున?)మూడి సిదే(?) బోడుచెల్లి రామనాథ దేవరకు ధూపదీప నైవేద్యాలకు బొట్టవెల్వు అంగడి నిత్యేకత మ॥ ౧డు గాను(?) ధారాపూర్వకమునగాను ఇరమానికా॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

దూపాడు తాలూకు పైకి మాజే మారకాపురం గ్రామానకు ఆగ్నేయమూల గుట్టను సరాబుబాలు మాన్యం నెంబరు ౪౮౨ ఎర్రవాగు చేను పడమటను కలియగుట్టను నిలువుగా పాతివున్న శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర అరిరాయవిభాళ భాషగెతప్పువరాయరగండ పూర్వదక్షిణపశ్చిమసముద్రాధీశ్వర శ్రీవీరప్రతాపదేవమహారాయలు విజయనగరమందు స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౬౯ అగునేటి సర్వజితు సంవత్సర కార్తిక బ॥ ౧౦ గురువారంనాడు పట్టాభిషిక్తుడై వజ్రసింహాసనారూఢుడై కూర్చుండి పృథివీసామ్రాజ్యము చేయుచుండగాను శ్రీపర్వత శ్రీగిరి మల్లికార్జున దేవర దండప్రదక్షిణాల దండమయ్యగారికి కోటచెరువు సీమ

లోని మారకాపురాన శ్రీమల్లికార్జున దేవునికి ప్రీతిగాను ధారపోసి సమర్పి స్తిని(ంచిన)కవిలెను మణు(?) ఖ ౧ పుట్టెను, చెర్వు వెనుక వరిమడి మర్తువ ౧ ఒకటిన్ని ఆచంద్రార్కస్థాయిగా చెల్లగలది. ఈ ధర్మానకు యెవ్వరు వక్రంగాక చెల్లించేది. ఈ ధర్మానకు యెవరు వక్రించినాను పర్వతం నాలుగు వాకిండ్లను పంచమహాపాతకాలు చేసిన పాపాన బోవువారు:

ఏకైవ భగినీలోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

స్వదత్తాద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥

మారకాపురం గ్రామానకు వుత్తరం పావుకోసుమీద కొచ్చర్ల కోటదోవకు తూర్పు సాతానినర్సు చేని నెంబరు...పడమటి గట్టున నున్న శిలాశాసనానకు నకలు:

ఆలంపనాగారు కాళయుక్తి సంవత్సర కార్తిక శు। ౧౫ లు రాజశ్రీ త్రిపురారిభట్లు మహాదేవ జోస్యులవారికి యిచ్చిన మాన్యం కోట తూర్పు దోవ పర్మడ(పడ్మట) యీశాన్యాలకులోను అయిన పొలం కుచ్చెర్లు అయిదు॥

దూపాడు తాలూకు పైకి త్రిపురాంతకము గ్రామములోనుండే తంబళ్ల మరువప్పవద్దయున్న తాంబ్రశాసనానకు నకలు॥ వకటి మవుజే జమ్మనపల్లె, కొలభీమనపాడు యీ రెండు గ్రామములలో వుండిన శిలా శాసనానకు నకళ్లు రెండు। అంతు శాసనాలు నకళ్లు మూడు॥

దూపాడు తాలూకాపైకి మవుజే జమ్మనపల్లె గ్రామానకు వాయువ్యమూలను గుండారెడ్డి వెంగళరెడ్డి యినాంపొట్లమాన్యం మూన ......అరెడి......అసరి.........రెడ్డి అన్నామాచిరెడ్డి......... జగతిపతిపొంద్దుగల .....తిర్మలరాజుంగారు......కొదొరరాచిని...... గానుపొలం...గాను మీా పిల్ల పిల్లతర ఆచంద్రార్క...తిరుమలరాజు అనుమతి ఇప్రజల ఉ...ను సమ్మతానను...నీకు రెండు కుచ్చెళ్లు మాన్యంగాను ఇస్తిమి ఆక్షేత్రం లెస్సగా ఫలపరచుకొని అందులఫలం పుత్రపౌత్ర పారంపర్యంతరం......ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించు సుఖాన ఉండేది। ఇందుకు యెవ్వరు తప్పినా వారణాసిలో తమ తల్లి తండ్రిని చంపిన పాపాన పోవువారు॥

దూపాడు తాలూకు పైకి మవుజే త్రిపురాంతకంగ్రామములో తంబళ్ల గురువప్ప తావున వుండే తామ్రశిలా(?)శాసనానకు నకలు :

స్వస్తిశ్రీ సమస్త భువన విఖ్యాత పంచశతవీరశాసనలబ్ధానేక గుణగణాలంకృత సత్యశౌచాచార చారుచారిత్ర నయవినయవిమల విజ్ఞాన వీరబలింజధర్మప్రతిపాలన, విశుద్ధ గుడ్డ ధ్వజవిరాజత వీరమనో నయనవల్లభ వీరలక్ష్మీసమాలింగితవిశాలవక్షస్థల త్రిభువన పరాక్రమో న్నత, వాసుదేవ ఖండలీమూలభద్ర వంశోద్భవ, అహిచ్ఛత్ర వినిర్గా(ర్గ?) తరుం(?) శరణాగతవజ్రపంజరరుం। లోకైకమాన్యవరుం। కలహానంప న్నరుం। కదన ప్రచండరుం। కనక కంచుళిక శైలాభరణ భూషితరుం। ఇద్దమారిగె బిద్దనిక్కువరుం। బావరమారినె బళియనట్టువరుం। హేణాం కనల గుణకెగుప్పెనలసముద్రనెంబవరుం। దనిపినదళు చంద్రనెంబ వరుం। కుళదొళు ఆదిత్యనెంబవరుం। చలదొళు దుర్యోధనెంబవరుం, శౌచ

దళి గాంగేయ నెంబవరుం సత్యదలి ధర్మపుత్ర నెంబవరుం, త్యాగదళి కర్ణ నెంబవరుం। భోగదలి దేవేంద్ర నెంబవరుం। సాహసదలి అర్జున నెంబవరుం। అతీతఅనాగత వర్తమానదలి సహదేవ నెంబవరుం। ఉపాయదలి నారాయణ నెంబవరుం। అయ్యావళియ అయివత్తుఐనూర్వరు స్వామిగళుం శ్రీబ్రహ్మవిష్ణుమహేశ్వరుల దివ్యశ్రీపాదపద్మారాధకులైన యాభైయ్యార్వరు అఖిలదేశాల చాలుమూల సమస్తమైన పెక్కండ్రున్ను స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౦౯ అగునేటి ప్రభవ సంవత్సర కార్తిక శు। ౧౫ ఆదివారం కృత్తికాయోగ పుణ్యకాలమందు శ్రీత్రిపురాంతక ముఖమంటపానను వజ్రశింహాసనారూఢులై కూర్చుండి గౌరీశ్వర దేవర ఉపహారాలకున్ను ఊరమాడలున్ను మూలవీసాలున్ను నిత్యవృద్ధిగాను ఇస్తిమిగాన యీ ధర్మము తప్పకుండాను దేశాలయందు యెత్తి తెచ్చి, గౌరీశ్వర దేవరను పూజసేయను ఉపహారాలు నడుపను కామశివులయ్యగార్కి నిళిపితిమిగాన వారికి తప్పక పెట్టేది। పెట్టక యీ ధర్మములు యెవ్వరు చెరుపతలచినాను శ్రీపర్వతానను శ్రీత్రిపురాంతకానను వారణాశినిన్ని కురుక్షేత్రముననున్ను అనంతకోటి బ్రాహ్మలను గంగిగోవులను చంపి తన పెద్ద కొడుకు కపాలాన గుడిచిన మహాపాతకానం బడువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దూపాడు తాలూకు పైకి మవుజే కొలభీమనపాడు గ్రామానకు నైరుతిమూలను చక్కిలం లింగరాజుగుంట ఉత్తరపుకొమ్మున తూర్పు దిక్కు బీడునేల మీద పడియున్న శిలాశాసనానకు నకలు: పాత తెనుగు అక్షరాల శాసనం।

తాడిమఱ్ఱితాలూకాలో గ్రామాంతరమందు ఉండే కొన్ని గ్రామాదులయొక్క శిలాశాసనాలకున్ను దానపత్రాలకున్ను నకళ్లు:

ఈ శిలాశాసనం చేయేటిదుర్గం(లోనిది) తాడిమఱ్ఱికి వాయవ్య భాగమున చేయ్యేటిదుర్గం నాలుగు పరుగుల దూరానవున్నది। సదరహి దుర్గం మీాదను మధ్యభాగమందు ఒక దొన ఉన్నది। దొనకె బండకు శాసనం వ్రాసియున్నది। గనుక ఆ శాసనానకు నకలు అదే ప్రకారం వ్రాయబడ్డది।

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౩౮౯ అనే సర్వజితు సంవత్సర మార్గశిర బ। ౧౦ సోమవారద శ్రీమన్మహా నాయంకాచార్యరాద శాకెపెమ్మనాయకర మగ లక్షినాయకరు పండ మ్యారనాదళీ యెండబ(?) ప్రతినామవాద గిరిదుర్గవు చిరంతరకాలవు ఖిలవాగియిరలాగె ఒందాన ఒందుదిన సుఖసంకథా వినోద దండా హోలు కెరె పాలచెర్వుదిందా బెట్టిమార్గదిందా ఒందుదుర్గవన యేరినోడి అనేక సామంతమంత్రి పురోహితాంతర్వవంత(?) సేనానాయక సంధివిగ్రహా ప్రముఖానఖిలక పరివారవు పరిద్యతనాగి మహావిభూత యేలాదలగం కోట్టు పుత్రమిత్రకళత్రాదిగళుసహానాగి యెల్లరుకూడి అలోచిసికొండు యీా దుర్గవను పాటిసబేకు యెందు సంకల్పవ మాడికొండు తథాతిథి యలు సుముహూర్తవమాడి కోటెకొత్తళ అళువెరి అగుళు(గళుడేం) డేకిణీ మకరిబిబ్బీ(?) వోబే(హాఘే)రణి దొణేగళదిందా జలదుర్గవను, దుర్గస్థళ దుర్గవెంబహాగె, గిరిదుర్గవనుపాటిసి దుర్గ నవరణేయిందలు శింఘూరిశి(సింగారిసి) యీా దుర్గపండమెరు పాలేరు సీలేరు ధళుకేరు వళ్లగె మొదలాద మార్గెణె(?) గళను బళితవమాడి లాయిదల్లు తేజీ సాంబ్రాణి మోదలాదంథా ఆనెమంది బల అంతగలను కట్టి మండలాధిపతి యాగి దుష్టనిగ్రహ శిష్టప్రతి(పరి)పాలకరాగి శత్రుగళ సంహారిసి శరణ అంద అవరను కాదు, తనగె మత్త్యారుయెదురు యిలందే రాజ్యవను అళిసుతాగి యిద్దెవగెవహావాన, శుభ్ర భద్రతటాక మహాగ్రహార వెంబ హాదనాల్కుగలు సప్తసంతానవను బడదు స్వామ్యమాత్య సుహృత్

కోశరాష్ట్ర దుర్గావళియంబ సప్తాంగదల్లు సామభేదదానదండమాయో పాయ మహేంద్రజాల వెంబ సప్తోపాయవను అరితుప్రభుమంత్రోత్సహా శక్తిత్రయ దిందా యీదుర్గవనుపాటి(శి)సి దుర్గదల్లు ధనధాన్యదిందా వస్తు వాహానదిందా, అలకాపురి అమరావతి సరియాగలు మెంబ హీగె దుర్గవను రూపుమాడి శరణాగత వజ్రపంజరనెంబ బిరుదేతాలి దేవబ్రాహ్మ ప్రతా పాలిసి బాకెవంశకులవార్ధి మద్భిదా? చంద్రవనాగి ఆచంద్రార్క-స్థాయి నాగి పుత్రపౌత్రపరంపరయెనాగి అష్ట అయిశ్వర్యదల్లు అల్లి ఒరిసి దింథా శాసనకె మంగళమహా శ్రీశ్రీం జేయును॥

శ్రీరామప్రియగుహ్యానాయకకులే జాతోమహాపెమ్మయ
స్తత్పుత్రోమహా సీయ్యకీర్తి విభవః దాతా త్త్రి)పారంగతః।
శ్రీక్షీరాతటినీ తటే నవవిధ ప్రాకారసాధోజ్వలం।
దుర్గం భూమి భృతాంసమక్షమకరోత్ శ్రీలంకభూపస్సుధీః॥

వసు (౮) బ్రహ్మ (౧) బాణ (౫) శీతాంశు (౧) గణితె శకవత్సరే। వత్సరే దుర్మఖిఖ్యాతి మాసిం కార్తికనామకః పక్షేవ శుక్లపక్షేతు ఉత్థాన ద్వాదశీ వర్తే(యుతే)॥

ఈ శాసనం తాడిమర్రితాలూకాలో మవుజే చిల్లేవారిపల్లె గ్రామానకు తూర్పు కాటమేశ్వరుని ఆలయానకు తూర్పు పెద్ద యెర్ర గుండు రాతికి ఉండే శాసనానకు నకులు:

ప్రమాదీచనామ సంవత్సర మాఖ బ॥ ౩౦ శ్రీమన్మహానాయంకా చార్యులైన రాజశ్రీ సాకె.ఇమ్మడి కొండప్పనాయనిగారు చిల్లేవారిపల్లె తిప్పారెడ్డికి(యిచ్చిన) జయరేఖా నిరూప క్రమమెట్లన్నను: అడుగుల కాటమయ్యకు బోనాలు చెల్లించే నిమిత్తం సీవున్ను దాడితోట నాగిరెడ్డి సుంకరెడ్డిగారు ఉభయత్రులు మేము ముందుగా చెల్లించవలెను, తాము ముందుగా చెల్లించవలెనని బహుకాలమునుంచి మదనపడి వుండి, ఉభయ వాదులున్ను మా సముఖానకువచ్చి తెలుపగా సకలమైన పిన్నపెద్దలు యీ అర్ధానకు విచారించి వారు అనిన వివరము: పురాతన వ్యాజ్యాన్ని

అన్యాయము చేయకూడదు దైవముముందు తేటకావలెను। అని తాడిపత్రి శ్రీనీలకంఠేశ్వరస్వామివారి దేవాలయం ముందు వారు వీరు సమంగా నూనె నేతితో దృష్టి దీపాల ఉంచగా యెవరిదీపము ముందుగా పోతే వారిది ఓటమి యెవరి దీపంతడవుగా నిలచినట్టు ఆయెనా వారిది జయము, అని నిర్ణయము సేయగాను ఈ అర్థానకు ఉభయవాదులు సమ్మతపడి శివరాత్రి పుణ్యకాలమందు తథా నిర్ణయప్రకారముగాను చెరిముప్పావు నూనె తెచ్చి సమంగా దృష్టిదీపాలు ఉంచగా దాడితోటవారి దీపము తక్కువపడి పోయినది, నిలిచిన దీపం శానాతడవుగా నిలిచెను గనుక సకలమైనవారు నిదానించి దాడితోటవారిని ఓటమి చేసి నీది గెలుపు చేసిరి గనుక ఈ అర్థము శిలాశాసనంగాను ఆచంద్రార్కస్థాయిగాను మీ వంశమువారు పూర్వోత్తరంగాను అడుగులకాటమయ్యకు మీదె ముందుగా బోనం చెల్లవలెను। ఇందుకు యెవ్వరు తిరుగబడినా కాని, పునహా వ్యాజ్యంకావలెను అనిన వారు(కాని) (కులంయిం)టివారు కారు। పంచజన్మాల(నా?)కు జన్మించినవారు అని వేసిన శిలాశాసనము॥

ఇది కాగితం మీద వ్రాసియుండే సనదు। తాడిమర్రితాలూకాలో మవుజే తుంపర గ్రామానకు తూర్పు ఆంజనేయస్వామికి నడిచే నె ౧ కి తళిహె దీపరాధన అఖండములు మొదలైనవి వ్రాసియిచ్చిన సనదుకు నకలు॥

శ్రీమతు సకలగుణసంపన్న గంగనపల్లె పత్తిపాటి వెంకటపతికి॥ రా॥ రామభావు సుబ్బరావు ఆ॥ మ॥ చెయ్యేడుదుర్గము సన్న ౧౧౮౬ ఫ్సలి మవుజే తుంపెర శ్రీఅఖండాలు ౨ తళిగె దీపారాధనానకు అయివజు నెల ౧ కి గ ౧౦౧ చొప్పున సెలవు యిచ్చినాము గనుక నెలనెలకు యిటావచ్చేది। గంగనవల్లె జమాబంది అయివజులో ముజరా యిస్తూవున్నాము గాన తెలిసేది।

येणे प्रमाणे चालवीत जाणें दुर्मुखी नाम संवछर.

మహారాష్ట్రింతో పైనవ్రాసిన ప్రకారం నడుచుకోవలసి(శి)నదని వ్రాసియున్నది।

సూర్మ్యఖినామ సం॥

(చూ. అనుబం. పార్శ్వశాసనములు 26)

శ్రీ వెంకటపతి

ఈ కాగితంమీద వ్రాసియుండే నకలు తాడిమర్రి తాలూకాలో మవుజే చెయ్యేటి దుర్గంలో చెన్న కేశవస్వామి దేవస్థానానకు వ్రాసి యిచ్చిన దానపత్రానకు నకలు॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౬౭౦ అగునేటి బహుధాన్యనామ సంవత్సర మార్గశిర బ॥ ౩౦ శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండనాయకులైన (చెన్న కేశస్వామివారికి) చెయ్యేటిదుర్గం శ్రీఅచ్యుత గోత్రోద్భవులైన; శ్రీమన్మహానాయంకాచార్యులైన సాకె కొన్నప్పనాయని పౌత్రులైన చిన్నప్పనాయని పుత్రులగు రామప్ప నాయడు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక: దుర్గం కోటలో వేంచేసివుండగా ఖిలపడియుండిరి గనుక పునహా ప్రతిష్ఠచేసి తళిహై దీపారాధన నిమిత్తమై యీ గ్రామంలింగన్న చెర్వుక్రింద పెద్ద కాలువమడి తూమెడు, నల్ల గొండ్లచేను ౧౧ ఒక రూక ఈ ప్రకారం మాన్యం సమర్పించుకున్నాము గనుక కృపచేసి నడిపించుకోవ లెనని వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మ శాసన పత్రిక।

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

(చూ. అనుబం. పార్శ్వశాసనములు 27)

ఈ దానపత్రం తాడిమర్రిలో చెన్న కేశవస్వామికి పూజ చేసే అర్చకుడు చెన్నప్ప దగ్గర హాజరు ఉన్నది॥

ఈ దానపత్రం తాడిమర్రితాలూకాలో మవుజే వెలిపుట్లగ్రామ ములో కరణం అప్పన్నగారి యొద్దనున్న దానపత్రానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౫౯౮ అగునేటి నళనామ సంవత్సర శ్రావణ శు। ౭ శుక్రవారం శ్రీమద్రాజాధిరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప వీరరామప్పయ్యదేవమహారాయలు అయ్యగారు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యము సేయుచుండగాను కలుమూరు గోత్రులైన వెల్లుట్ల కూచితిమ్మనాయని పాపినాయని పుత్రులు వెంకటగిరి వెంకటాద్రి య(వె)ంకటపతిగారు జనులు ముగ్గురు తమలో తాము యేకస్థులై కౌండిన్యసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన యెల్లుట్ల గ్రామకరణం తుంపర పద్మరాజు ఓబన కొమారుడు తమ్మణ్ణ పుత్రులైన సూరప్పకు యిచ్చిన పొలిమేరభూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను: మాపాళెము పట్టు యెల్లుట్లగ్రామానకు దాడితోటకు పొలిమేరత్రొక్కుటకు వచ్చినందులకు తూర్పునకు మొబ్బుకోన ఆదిగాను పశ్చిమానకు మదిగుబ్బకు, దక్షిణం నైరుతిమూలనుండే చిల్లవారిపల్లె పొలిమేర పాలమాని మెనువు ముగ్గుడం అంత్యంగాను, పొలిమెరబారి జయస్థుడవై జయించిన పొలానకు శిలాశాసనాలు వేయించి నిర్వహించినారు, గనుక గుత్తి రాజ్యం పండమేటిగ్రామం మామాగాణికి చెల్లువడి చెయ్యేటి సీమలోని వీరమల్లయ పప్పూరికి తూర్పున వుండే మా పాళెంపట్టు వెల్లుట్లు గ్రామమందు కలుమూరుగోత్రులైన వెల్లుట్ల కూచి తిమ్మానాయని పాపినాయని పుత్రులు వెంకటగిరి వెంకటాద్రి వెంకటపతిగారు జనులుముగ్గురు తమలో తాము యేకస్థులై కౌండిన్యసగోత్ర ఆపస్తంబ సూత్రయజుశ్శాఖాధ్యయనులైన వెల్లుట్ల కరణం తుంపర వోబన్న కుమారుడు తమ్మణ్ణకు పుత్రులైన సూరప్పకు సోమోపరాగ పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను సద్యఃఫలితంగాను ధారపోసి యిచ్చినది. ఆయకట్టు ప్రకారంగాను నీవు పొలిమేర బారిన మొబ్బుకొన అంచు ఉత్తరంవాగుకు తూర్పున చేను గం ॥౦ చేనున్నూ గ్రామానకు పడమర నీవు త్రవ్వించిన బావిస్థళం యలిపాటి ౧౧౪౦ తోటానున్ను కలుమూరి గోత్రులైన వెల్లుట్ల కూచితిమ్మానాయని పాపినాయని పుత్రులు వెంకటగిరి వెంకటాద్రి వెంకటపతిగారు జనులుముగ్గురు యేక

స్థులై కౌండిన్యగోత్ర ఆపస్తంభసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన వెల్లుట్ల కరణం తుంపర వోబన్నకుమారుడు తిమ్మణ్ణకు పుత్రులైన సూరప్పకు ధారబోసి యిస్తిమి గాన యీమూడు చేలల్లోనున్నూ యెలిపాటిలో తూమెడు యిరసతోటానున్నూ కలిగిన నిధి నిక్షేప జలపాషాణ అక్షీణ సిద్ధ సాధ్యంబులనియేటి, అష్టభోగ తేజ స్వామ్యములున్ను, సకలోత్పత్తి సమస్త బలిసహితంగాను మీా పుత్రపౌత్ర పారంపర్యంతంగాను ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించగలవారు అని మేము మాసమ్మతిని ఒప్పి వ్రాయించిన పొలిమెర భూదానధర్మ సాధనము॥

బద్దివోలుతాలూకు పైకి గ్రామాలయందు ఉండిన శిలాశాసనాలకు నకళ్లు: తెనుగు అక్షరాలు జనవరి ౨౩ తా ౧౮౧౩ సం॥ తఖ్తాకు దాఖలు అయినది.

ఈ శిలాశాసనం రాయి బద్దివోలు తాలూకు సమ్మత్తు పోరుమామిళ్లపైకి మవుజే కత్తరకండ్ల మజరాఅయిన చెన్నవరం బస్తి గ్రామానకు దక్షిణం సమీాపాన శ్రీచెన్నకేశవస్వామి దేవళం తూర్పు ద్వారానకు సన్నిధానమందు బయలులో నిల్వురాతికి ఉండే శిలాశాసనానకు నకలు॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౪౪ అగునేటి పార్థివనామ సంవత్సర పుష్య శు। ౧౫ లు శ్రీమతు అన్నాజీ అయ్యవారి యొక్క కార్యకర్తలైన దేలారు కృష్ణయ్యకొడుకు వెంగళయ్యగారు కత్తరకండ్ల చెన్నకేశవదేవరకు యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను :* శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలు రత్న సింహాసనారూఢులై పృథివీ రాజ్యం సేయగాను అవసరము దేవరసయ్యగారికి పాలించిన గండికోట దుర్గానకు చెల్లే చెన్నవరం కత్తరకండ్లను పూర్వాన ఉండే చేనుమడిన్ని దేవునికి అఖండ తిరువళ్లిగెకు దేవునికి అమృతపళ్లకు అంగరంగ వైభవానకు

3. A. R. No. 403. of 1926,

సాగించి దీనికి అఖండ తిరువళిహెూకు చెన్నవరాన కలిగిన వారికి వఘుర, వఘురికి, నల్లెమమెన్నుకు ఆ చెవరానికిన్ని సుంకంవారికి గ్రామాన కట్టు కట్టుళ్లకు సహాజం పన్ను గాను గస్తవిరాలు మార్గస్థావరాలు పరస్థళంగారులు యేమి సరకు తెచ్చి ఆ గ్రామాన అమ్మినా కొనినా దేవునికి ఉభయమార్గ సుంకంపెట్టేటట్టుగాను సాగిస్తిమి। అవసరందెమరసు అన్నాజీ అయ్యలు గారికి పుణ్యంగాను సోమగ్రహణపుణ్యకాలమందు ఆచంద్రార్కస్థాయిగాను సూర్యచంద్రాదులు కలంతకాలం సర్వమాన్యంగాను ధారబోసి యిచ్చిన ధర్మ శాసనం ఈ పుణ్యానకు సీమ పారుపత్యం చేసే వారున్నూ అధికారి రాచకరణాలు। సుంకం మణే గాండ్లు రెడ్లు కరణాలు యెవ్వరు తప్పినాను గంగాతీరమందు గో బ్రాహ్మణులను వధియించిన పాపాన బోవువారు। తమ దల్లిదండ్రులను వారణాసిలోను వధియించిన దోషాన బోవువారు। తమ చెల్లెండ్లకు తప్పిన వారు। శునక మాంసం సురా సేవించినవారు।

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

శ్రీమంగళమహాశ్రీ శ్రీంజేయును ॥

శ్రీమతు పోరుమామిళ్ల పాపలోజు పీరాబత్తుని కొడుకు ఓబు లోజు లిఖించిన శాసనం।

పైనవ్రాసిన శిలాశాసనం రాయివద్దనుండే శిలాశాసనానకు నకలు:*

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౪౭ అగునేటి పార్థివ సంవత్సర పుష్య శు॥ ౧౫ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణదేవమహారాయలు విజయ నగరమందు వజ్రసింహాసనారూఢుడై పృథివీ సామ్రాజ్యము చేయుచుండ గాను గార్గేయగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యయనులైన సర్వ

* A R. 403 of 1926.

క్రతువాజపేయయాజులైన పడవీడు విరూపాక్ష దీక్షితులగారి కుమారుడు అన్నాజయ్యవారు కత్తరకండ్ల చెన్నకేశ్వర దేవరకు యిచ్చిన భూదాన ధర్మశాశన క్రమమెట్లన్నను శ్రీ వీరకృష్ణదేవ మహారాయలు దేమరసయ్యగారికి నాయంకరానకు పాలించ నవధరించిన గండికోట సీమకు చెల్లే సగిలి సీమన పారుపత్యం చేస్తున్నా దేవుని అంగరంగ వైభవాలకున్ను అమృతపళ్లకున్ను మాకు చెల్లే కత్తరకండ్ల పొలంలోను దేవునికి పూర్వాన చెల్లే పొలానకు పడమర వెంగళ కుంట పొలానకు తూర్పు, ఉత్తర దక్షిణాలకు వచ్చే వాగు నాగుల మడి వాగు మేరగాను చతుస్సీమకున్నా యీ వ్రాసిన మెరలలోను సీరారంభానకు తెగిన వెగిలిచేను ఖ ౨ రెండు పుట్లు యిదేఅక్షరాలను యిరు పుట్టి సహాగాను చతుస్సీమలోనుగానుగల బీడు వెగిళ్లలోనునిధి నిక్షేప పాషాణ ఆగామి సిద్ధ సాధ్యంబు లనియెడు అష్టభోగ తేజ స్వామ్యాములున్ను సోమగ్రహణ పుణ్యకాలమందు రాయలకున్ను దేమరసయ్యగారికిన్ని పుణ్యముగాను సహిరణ్యోదక దానధారాపూర్వముగాను ఆచంద్రార్క స్థాయిగాను త్రివాచకంగాను ధారబోసి యిస్తిమి, గనుక యీ ధర్మానకు యెవ్వరు అయినా తప్పినాను కాశీలో బ్రాహ్మణులను వధియించిన పాపాన బోవువారు ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥
స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

శ్రీ శ్రీ యీ భూదానానకు యెవ్వరు తప్పినా వానాలిని గుఱ్రం పట్టే వానికి గొడుగు పట్టే వానికిన్ని యిచ్చినవారు ॥

బద్దివోలు తాలూకు పైకి పోరు మామిళ్ల సమ్మత్తు పైకి మవుజే కత్తరకండ్ల గ్రామానకు మజరా అయిన చెన్నవరం బస్తీ గ్రామానకు

దక్షిణం శ్రీచెన్నకేశవస్వామి దేవళం తూర్పు ద్వారానకు దక్షిణం తట్టు దేవళం ప్రాకారానకు వ్రాసి యుండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౨ అగునేటి విరోధినామ సంవత్సర వైశాఖ శు ౧౫ లు శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ కృష్ణరాయ దేవమహారాయలు పృథివీసామ్రాజ్యం చేస్తున్న రాయసం అయ్యప్పర సయ్యవారికి నాయంకరానకు పాలించినవధరించిన ఉదయగిరి దుర్గానకు చెల్లే సగిలీసీమ అయ్యప్పరసయ్యగారు తమ కార్యకర్తలైన సిద్ధవటం ఎల్లమరసయ్య వారికి నాయంకరానకు పాలిస్తేను ఎల్లమరసయ్యవారు తమ నాయంకరానకు చెల్లే సగిలిసీమలోను నువుసలపాడు అనే గ్రామం కర్తర కండ్ల శ్రీ చెన్నకేశవరాయనికి శ్రీవత్ససగోత్రం ఆశ్వలాయన సూత్రం ఋక్శాఖాధ్యాయులైన సిద్ధవటం ఎల్లమరసయ్యగారు సోమగ్రహణ పుణ్యకాలమందు సిద్ధేశ్వరుని సన్నధి పినాకినీతీరమందు అయ్యప్పర సయ్యవారి తల్లిగారికి అచ్చమ్మకు పుణ్యంగాను నువుసలపాడు అనే గ్రామము దారబోసి యిస్తిమి। ఈ నువుసల పాటికి చెల్లే చ(తుస్సీశ్మీ)మ పొలానకున్ను లోనైన సిరారంభం కాడారంభం సుంకం సువర్ణాదాయం ఫలవృక్షాలు మొదలైనవి శ్రీవత్ససగోత్రం ఆశ్వలాయన సూత్రం ఋక్శాఖాధ్యాయులైన సిద్ధవటం ఎల్లమరసయ్యగారు అయ్యప్పర సయ్యగారి తల్లిగారైన అచ్చమ్మగారికి పుణ్యంగాను ధారబోశి యిస్తిమి। శ్రీ వత్సగోత్రం ఆశ్వలాయన సూత్రం ఋక్శాఖాధ్యాయులైన సిద్ధవటం ఎల్లమరసయ్యగారు అయ్యప్పరసయ్యగారికి తల్లిగారైన అచ్చమ్మకు పుణ్యంగాను కర్తరకాండ్ల చన్నకేశ్వరాయనికి నవుసలపాడు అనేగ్రామం సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను ఆచంద్రార్కస్థాయిగాను ధార బోసి యిస్తిమి। నిధి నిక్షేప జల తరు పాషాణ ఆగామి సిద్ధ సాధ్యంబు లనిమెడు అష్టభోగ తేజ స్వామ్యములున్ను లోనుగాను త్రివాచకముగాను ధారబోసి యిస్తిమి ॥

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

పుండరీక శిలాంక్షో(?) క్షీరాబ్ధిసుతసంయుతం।
కత్తరకండ్ల పురాధీశం చెన్నరాయం స్మరామ్యహం॥

యథావతు దత్తానకు యెవ్వరు తప్పినా శునకమాంసం సురాను నరుని కపాలికన పెట్టుకుని గార్ధభం యెక్కుకుని ఉత్తరపు ముఖమై వంగిసేవించిన పాపాన బోవువారు। తమ తల్లి చెల్లెలికి తప్పిన పాపాన బోవువారు॥*

ఈ శిలాశాసనం రాయి బద్దెవోలుతాలూకుపైకి సమ్మతు పోరు మామిళ్లపైకి మవుజే కత్తరకండ్ల బస్తీగ్రామానకు పశ్చిమం సమీపాన సాంబశివుని దేవాలయానకు పశ్చిమం సగిలేటికి తూర్పు సమీపాన సర్కారు జిరాయతు జమీను నెంబరు ౩౦౩ సదరహి సరకారు జిరాయతు జమీనుకు తూర్పు సమీపమందు భూమిమీద పడివుండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౯ అగునేటి పరాభవనామ సంవత్సర చైత్ర శు। ౧౧ లు, శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలయ్యవారి ఆనతిని అళియరామరాజయ్యదేవమహారాజుల అయ్యవారి మోదలను నందెల తిమ్మరాజుగారు వేయించిన శిలాశాసనము. తమ గండికోట సీమకు చెల్లే అమరగ్రామాలు ఉమ్మళికగ్రామాలు బండారవాడగ్రామాలు అగ్రహారాలు దేవస్థానాలు సహసర్వమాన్యంగాను మాన్యాలవారు అచ్చే సిద్ధాయం కావలికానిక దొమ్మర పన్ను లేక చేస్తిమి గనుక యీ ధర్మానకు యెవ్వరు తప్పినవాడుఅయి, పన్ను కొన్నాను తమ తల్లితండ్రుల వారణాసిలో వధియించిన పాపాన బోవువారు, ఒక తల్లికిన్ని ఒక తండ్రికిన్ని తప్పినవారు॥

బద్దవోలుతాలూకా పైకి కలచపాటి సమ్మతుపైకి, మవుజే తల్లపాడు బస్తీగ్రామానకు పశ్చిమం పావుకోనుమీదను సరకారు జమీను ఖ ౦।౦ అందుకు నెంబరు ౪౯ సదరు జమీను ఖుషికి యీ జమీ

* A. R. No. 402 of 1926.

నుకు సమీపాన తిమ్మనగారి కుంటకు తూర్పుకాలువ గడ్డను ఉండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౭౦ అగునేటి సాధారణనామ సంవత్సర మాఘ శు। ౧౫ లు శ్రీమన్మహా నాయంకాచార్యులైన వొన్నం ఆదినాయని కుమారుండు పెదఓబుళు నాయనింగారు బోడెరెడ్డి చినఓబయ్య మూరారెడ్డి సురుబియ్య కమ్మన పోతయంగారికి యిచ్చిన దశవందంమాన్యపు శాసనం క్రమ మెట్లన్నను.

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ సదాశివ రాయ దేవమహారాయలు విజయనగరమందు పృధివీ సకల సామ్రాజ్యం చేయుచుండగాను సింహాసనానకు చెల్లే గండికోటరాజ్యంలోని సకిలిసీమలో చెల్లెను(?) నందేల తిమ్మరాజయ్య దేవమహారాజులుంగారు మాకు పాలిం చిన మా పూర్వమైన నాయంకరానకు చెల్లే కల్చుపాటికి చెల్లే తెల్లపాడు పొలంలోని మేళ్లకుంట తెగివుండగాను కుంటకట్టించమని మీకు సాగించిన వివరం: లోతుత్రొవ్వించి పైకట్ట వేరే తూముకట్టించి, రూపు చేసేటందుకు ప(పె?)ల్లెత్తుమాన్యం తెల్లపాటికి ఉత్తరం చేను ౧౩ ముంత్తుంను కనుమేటి కాలువత్రొవ్వించి కుంటకు నీళ్లు తెచ్చేటందుకు మాన్యం తెల్లపాటికి ఉత్తరం చేను ఖ ౦।౧ అ(రెం)మును కూడి వెలిచేను ఖ ౦।౪ తొమ్మందుం మీకు మాన్యం యిస్తిమి। కుంట వెనుక నీళ్లు పారకట్టిన మడి, నగరికి నాలుగు పాళ్లు ౪, మీకు వకపాలు, దసవందం మాన్యం యిస్తిమి। ఇందుకు తప్పక పెల్లెత్తుమాన్యం దసవందంమాన్యం కాల్వమాన్యాలు మీ పుత్ర పౌత్ర పారంపర్యంతంగాను ఆచంద్రార్కస్థాయిగాను యిస్తిమి। కుంటకు కాలువకు రూపుచేసుకుని యీ మాన్యాలు అనుభవించి బ్రతికేది। ఇందుకు యెవ్వరు తప్పినాను తమ తమ (తలి)తండ్రులను గోవులను బ్రాహ్మలను వారణాసిలోను వధియించిన పాపాన బోవువారు అని ఆదినారాయనింగారిక్ని అక్కమ్మగారికిన్ని పుణ్యంగాను సాగించియిచ్చిన శాసనం। ఆలికట్ల అగసాల నరసయ్యకు తెల్లపాటి భైరవున్ణి చేసి నందుకు మెళ్లకుంట క్రింద మాన్యం వరిమడి తూమెడు ఖ ౦౧౧ :

ఈ శిలాశాసనం రాయి। బద్వేలు తాలూకాపైకి బద్వేలు సమ్మెత్తుపైకి మవుజే పల్లురాళ్లపల్లె బస్త్రీగ్రామానకు మజరా అయిన బేచిరాకు పెద్దకోడూరు గ్రామములో దుర్గాంబ దేవళములోనుండే శిలాశాసనానకు నకలు *:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౭౪ గ్గి అగునేటి పరీధావినామ సంవత్సర ఆశ్వీజ శు। ౧౦ శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగర మందు వజ్రసింహాసనారూఢుడై పృథివీ సకల సామ్రాజ్యము చేయుచుండ గాను ఆత్రేయగోత్రులైన శ్రీమన్మహామండలేశ్వర నందెలవరదరాజుల అవుబళదేవమహారాజుల ఆనతిని వీరణాల బసవయ్యకొడుకు జంగం నర్వయ్య పెద్దకోడూరు అంకాళపరమేశ్వరికి యిచ్చిన ధర్మశాసనము క్రమమెట్లన్నను పెద్దకోడూరు ఒంటుకు చెల్లేపల్లెలు సహాగాను మహాం కాళిదేవతా ప్రయోజనాలకు, వచ్చేదిగాని శివ్యాలు(?)దేవికి వచ్చే అంత ఉంటున్నది। దేవరతీర్థ రథోత్సవ సిద్ధయోగము సాగేటందుకు గాను అవుబళదేవమహారాజులవారికి పుణ్యముగాను సోమోపరాగ పుణ్యకాలమందు సర్వమాన్యముగాను ధారబోసి యిచ్చిన ధర్మశాసనము। పెద్దకోడూరు అంకాళదేవికి యిచ్చిన ధర్మశాసనము। ఈ ధర్మశాసనానకు ఉత్సవాలు సిద్ధయోగాలు తీర్థంసాగకుండాను చెరిచి యీ కానికెకు యెవ్వరు ఆశించిరి వారు గంగాతీరమందు గోవును చంపిన వారు। బ్రాహ్మణ్ణి చంపిన పాపాన పోదురు. శునకమాంసం సురాపానం సేవించినవారు। ఈ ధర్మశాసనానకు యెవ్వరు తప్పినాను పంపిసాయనికి తమ మానము యిచ్చినవారు। ఇట్లని వేయించిన ధర్మశాసనము। మంగళమహాశ్రీ జేయును॥

పెద్దకోడూరు గ్రామములోను శ్రీచెన్నకేశవస్వామి దేవాలయ ముఖ ప్రాకారము లోతట్టు కంచురాయిమీద ఉండే శిలాశానకు నకలు :

* A. R. No. 406 of 1926.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౬౯ అగునేటి పరాభవనామ సంవత్సర చైత్ర శు॥ ౧౧ సోమవారం, పెద్ద కోడూరు చెన్నకేశవ దేవునికిన్ని సోమేశ్వర దేవునికిన్ని డోల్లు నాగ సరాలు ఉడిగానకు పెట్టిన మాన్యం చేలుమళ్లకున్నూ నీకు మంగలి మాన్యానకు చెల్లివచ్చే చేలుమళ్లు తోటలు కుంటలకు కావలికానికి రొక్క-ధాన్యాలు సర్వమున్ను మన్నించి సర్వమాన్యం యిస్తిమి। ఈ కొలువు మాన్యాలు మీకు యెంతకాలం చెల్లివచ్చునో అంతకాల మున్ను చెల్లివచ్చేటట్టుగాను మా పెద్దలకు పుణ్యముగాను, సర్వమాన్యం చేస్తిమి। ఈ ధర్మశాసనము మర్యాద మా పుత్ర పౌత్ర పారం పర్యం గాను నడపగలవారము। ఇట్లని యిచ్చివేయుంచిన ధర్మశాసనము। ఈ ధర్మశాసన మర్యాదకు యెవ్వరు తప్పి నడిచినాను వారు కుక్క-మాంసానకు ఆశపడే వారు అవుదురు॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

శ్రీ శ్రీ శ్రీ జేయును.*

పెద్ద కోడూరు గ్రామములో నున్న శ్రీచెన్నకేశవస్వామి దేవాలయం తూర్పు వాకిలి ముందర ప్రాకారానకులోగా నేలమీద పడియుండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౯ అగునేటి పరాభవనామ సంవత్సర చైత్ర శు ౧౧ సోమవారము, మహారాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలు అయ్యవారి ఆనతిని, అళియ రామరాజయ్య దేవ మహారాజుల అయ్యవారి ముదల నంద్యాల తిమ్మరాజయ్యగారు వేయించిన శిలాశాసనము। తమ గండికోట సీమకు చెల్లే అమరగ్రామాలు

* A. R. No. 405 of 1926,

ఉంబళి గ్రామాలు, బండారవాడ గ్రామాలు, అగ్రహారగ్రామాలు, అగ్రహార దేవస్థానాలు సర్వమాన్యంగాను యీ స్వామికి అఖండ దీపారాధన నిత్యోత్సవ మాసోత్సవ గరుడోత్సవ రథోత్సవ నైవేద్యములు... నడిపించక యెవరు చెరుచుతారో వారు గంగాతీరమందు గోవును చంపినట్లు తల్లిని ఆశించిన పాపాన బోదురు। యింతే ధర్మ శాసనం॥ మంగళమహా శ్రీ శ్రీ శ్రీ.

పెద్ద కోడూరు కొండమీద భైరవుని దేవాలయంలో భైరవుని సన్నిధిని నేలమీద పడియుండే శిలాశాసనానకు నకలు :

అవిఘ్నమస్తు। శ్రీహరిహరనాథాయనమః। శ్రీ క్షేత్రాధిపతయేనమః। *స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౩౧౮ అగునేటి ధాతు సంవత్సర భాద్రపద శు। ౧౦ శ్రీమన్మహామండలేశ్వర శ్రీవీర దేవరాయ ఒడయలు ఉదయగిరి పృథివీరాజ్యము చేయుచుండగాను శ్రీమతు బిరుదరాజులక్కయ దేవమహాజులున్ను, అల్లాళ దేవ మహారాజులున్ను సకలి పెద్దకోడూరు యేలుచుండంగాను, ఆయూరికొండమీద భైరవ దేవస్థానము భిన్నమై యుండగాను గోలి అవుబళనాథుండు ఆ భైరవదేవర గుడి లెస్సగాక......

(ఈ శాసనం పూర్తిగా వ్రాసియుండనందున వ్రాయలేదు.)

శ్రీరామ । నకలు ।

ఈ దానపత్రం మవుజే కత్తరగండ్ల బద్దెవోలుతాలూకా సమ్మతు పోరుమామిళ్ళ తాలూకు బద్దివోలు సదరుగ్రామములో బొమ్మా చెన్నారెడ్డి వద్దయున్న దానపత్రానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౫౭౭ అగునేటి మన్మథనామ సంవత్సర మాఘ బ। ౧౦ లు శ్రీమద్రాజాధి

* A. R. No. 408 of 1926 Date - S'. 1318, Dhatu Vaiśākha śu. 10, Wednesday. The inscription appears to be complete.

రాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీరంగరాయదేవమహారాయ లయ్యాగారు పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను, శ్రీమతు కత్తెరగండ్ల సమతుకరణాలు గోపిరాజు ఎల్లయ। అబ్బరాజుపాపయ, లాయంమంగన, బంగడి వెంగయ, గుమ్మాకోనయగారు బొమ్మా చెన్నయకు వ్రాయించి యిచ్చిన రెడ్డి మాన్యం। నీవు మా నలుగురితో మా రెడ్డిమాన్యం కావలెనని మనవి చేసుకుంటివి, గనుక మేము నలుగురం సమ్మతించిన వివరం: కసుబా కత్తెరగండ్ల మా రెడ్డిమాన్యము రెడ్డికత్తువక్రింద వరి మడి ౧౨, భూతలగడ్డను మడి ఖ ౦౹౩, జంబుగుంత్తన మడి ఖ ౦౹౦, గరంగుచేను ఖ ౦౧౨, చెన్నవరం రెడ్డిమాన్యం రేగడిచేను ఖ ౦౹౦ బాలరాజుపలె రెడ్డిమాన్యం మురుకూటిమాను చేను ఖ ౦౹౩, శ్రీనివాస పురం చేను ఖ ౦౹౦౪౦, యెర్రమిట్టకాడ రెడ్డిమాన్యం బూరగమాని చేను స్థళాలు ౨కి చేను ఖ ౦౪౦, ఉండవల్లి రెడ్డిమాన్యం ఖ ౦౹౦, రాజు పాళెం రెడ్డిమాన్యం ౧౨ అంతుచేను మడి సహాగాను మీ పుత్రపౌత్ర పారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకుని మా నల్గురి కరణాలకు ఒద్దికగానుండి అనుభవించుకునేది। ఇట్లని మా ఖుద్దు రాజీన వ్రాయించి యిచ్చిన రెడ్డిమాన్యం। ఇందుకు సాక్షులు కనకదండి సోమోసులభట్లు, వెల్లాల రంగప్ప, చొక్కరాజుగోపయ, కాపులు బిజువేముల బాలిరెడ్డి, బొంతాపాపిరెడ్డి వీరల సమ్మతిని బుక్కరాజు సూరప్ప వ్రాసిన రెడ్డిమాన్యము॥

సమతుకరణాల కరణీకపాళ్ల వివరం। గోపరాజు ఎల్లయ భాగం అక్షరాల మూడు వీసాలు। కత్తెరకండ్ల అబ్బరాజు పాపయగారి భాగం ౧ - వీసం। లాయంమంగనగారి భాగం ౦౹౦ గుమాకోనయగారి భాగం ౦౹౦, బంగడి వెంగయగారి భాగం ౦౹౦। గోపరాజు పుల్లయ వ్రాలు। కోనయ వ్రాలు। లాయం మంగన వ్రాలు। పాపయ వ్రాలు। బంగడి వెంగయ వ్రాలు।

పౌరోహితులు కత్తెరగండ్ల నారాయణభట్లు ఆచెలంభట్లు వడ్ల కమ్మర్లు మారాజు గంగాబత్తుడు। ఆ వెంకట। సరాబుశంకరయ।

తంబళ్ల వీరడు। కుమ్మర నరసిగాడు। మంగల పెద్దిగాడు। రాముడు। చాకలశరభడు। వెంకటిగాడు మాలగురువడు। జంగడు। మాదిగెలు। నారెపోగు సింగరిగాడు। వసుకోట వీరడు॥

శ్రీరామ। నకలు।

(శకాబ్దం ౧౩౮౮) పరాభవనామ సంవత్సర ఆశ్వీజ బ। ౧౦ లు శ్రీమత్తు కత్తెరగండ్ల సమతు కరణాలు గుమ్మా పాపయ బంగడి రామయ। లాయంబుచ్చి మంగన। గోపరాజు ఎల్లయ। అబ్బరాజు బుట్టయగారు। బొమ్మాపెద్ద అయ్యలు రెడ్డికి వ్రాయించి యిచ్చిన పొలిమేర భూదాన పత్రికె: మాకు పొలిమేర హద్దు త్రొక్కులాటపడి రాధ్యాంతం అయి ఉంటిమి। మాకు పూర్వం పొలిమేర మాన్యం ఉన్నది అని మందలి స్తిరి, గనుక నిన్ను మేము ప్రౌఢదేవరాయల తావుకు వెంటబెట్టుకుని పోతే, మీరు పూర్వం పొలిమేరకాపు అని మనవి చేస్తిమి, గనుక అందుకు పౌఢదేవరాయలుగారు సెలవు యిచ్చినారు। నీవు పూర్వం పొలిమేర కాపువు అని వచ్చినావు, ఇప్పుడు పొలిమేర త్రొక్కులాటపడియున్నది కదా। ఇప్పుడు పొలిమేర త్రొక్కితే అదేప్రకారం నీకు సీమిరాసి సెలవు యిస్తున్నాను అని చెప్పిరి। అదే ప్రకారం పొలిమేర త్రొక్కితివి, గనుక నీకు సెలవు యిచ్చినది సమతు దరోబస్తు మాన్యాలు వున్నవి అని మనవి చేస్తివి గనుక అదే ప్రకారం సెలవు యిచ్చిన వివరం: కసుబా, కత్తెరగండ్ల పొలిమేరమాన్యము గరుగుచేను ఖ ౦౧౨, చెన్నవరం పొలిమేర మాన్యం గర్గు ౦౻౦, బిమానిచేను ౧౧౻౦, శ్రీనివాసపురం పొలిమేర మాన్యం తువ్వచేను ౧౧౻౦, యవుబల్లె పొలిమేర మాన్యం వెలగమాని చేను ౧౩౻౦, సింగలరాజుపల్లె పొలిమేరమాన్యం ౧౧౻౦, దండాలవారిపల్లె మాన్యం తుమ్మవానిచేను ౧౨౻౦, బాలరాజుపల్లె పొలిమేరమాన్యం రేగడిచేను ౧౻౦, కొండ్రాజుపల్లె పొలిమేర మాన్యం వాగుచేను ౧౨౼౦, బసనపల్లె పొలిమేరమాన్యం యెఱ్ఱచేను ౧౨౻౦, ఉండ్లవెల్లి మాన్యం ౧౧, తాతినేనిపల్లెమాన్యం ౧౩౻౦, కోడిగండ్లపాటి పొలిమేరమాన్యం రేగడిచేను ౧౧, రాజుపాళెంమాన్యం

౧౫౦, అంతుచేను ఖ ౧౭౮ ।౦ మీా పుత్రపౌత్రపారంపర్యంతరం అనుభ వించుకునేది. సాక్షులు: వెల్లాల పెదరంగయ కుమారుడు చెన్నప్ప, వెంకటేశుడు। బిజువేముల రంగారెడ్డి। ఆపోలిరెడ్డి వీరల సమ్మతిని కోడూరు తాతయ వ్రాసిన పొలిమేర భూదాన పత్రికె। గుమ్మా పాపయ్య వ్రాలు। గోపరాజు ఎల్లయ వ్రాలు। రామయ వ్రాలు। అబ్బరాజు బుట్టయ వ్రాలు।

ఈ భూదాన పత్రికె మవుజే కత్తెరకండ్ల సమ్మతు పోరుమామిళ్ల తాలూకు బద్దెవోలు సదరహీ గ్రామములో బొమ్మా చెన్నా రెడ్డివద్ద వున్న భూదాన పత్రానకు నకలు. మార్చి తె ౫ ది ౧౮౧౩ సం॥ తఖ్తాకు దాఖలు అయినది.

(చూ. అనుబం. పార్శిశాసనములు 27)

మవుజే బొల్లేపల్లె తాలూకు గిద్దలూరు, సదరహీ గ్రామానకు పశ్చిమాన రెండు కోసులమీాద అడవిలోను సరకారు చేను నంబరు ౨౧౧ దండు చెంచురెడ్డిచేనుకు కొంచెము దక్షిణభాగాన సమీాపంగా సరకారు చేను నంబరు ౨౧౨ మూర్తిరెడ్డి చేనుకు పశ్చిమం, సమీా పాన కందనోలు తాలూకా వెలుగోడు గ్రామానకు పొయ్యే మార్గాన సదరహీ మూర్తిరెడ్డి చెంచురెడ్డి చేలవద్ద వుండే కోమటివాని భావివద్ద నల్లరాతికి ఉండే శిలాశాసనానకు నకలు ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౭౦ అగునేటి ప్లవంగనామ సంవత్సర వైశాఖ బ॥ ౭ లు వేముల కొండిసెట్టి కుమారుడు జంగంసెట్టి బొల్లేపల్లి అడవి మార్గాన వీరునిపెంట దగ్గర త్రొవ్వించిన బావి ॥ శ్రీరామజయం ॥

తఖ్తాకు దాఖలు అయినది। ౧౮౧౨ సంవత్సరం నవంబరు నెల తే ౧౨ ది॥

మహానందిపల్లె బేచిరాకు అయిన గ్రామం। సమతు బస్వాపురం, తాలూకు గిద్దలూరు; సదరు బేచిరాకు అయిన గ్రామానకు ఈశాన్య

భాగాన అరకోసు మీాదను మహానందీశ్వరుని దేవళం ఉన్నది। ఈ దేవళంలో మహానందీశ్వరునికి పశ్చిమం కోనేరు। ఈ కోనేటికి పశ్చిమం ద్వారానకు లోతట్టు ద్వారప్రాకారానకు దగ్గిర యినపదీప స్తంభం నిలువుగా పాతి ఉండేది। అందుమీాద వ్రాసిన శాసనము నకలు :*

శ్రీ మహానందీశ్వరుని దేవళములో ఇనుప దీప స్తంభానకు తెనుగు అక్షరాలతో వ్రాసియుండిన శాసనానకు నకలు। అదే ప్రకారం వ్రాయడమైనది ॥ అక్షరాలు తెనుగు ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౩౨ అగునేటి వికృతి సంవత్సర మాఘ బ॥ ౧౩ శుక్రవారం శ్రీమన్మహా మండలేశ్వర అప్రతిమల్ల-చోడవంశోద్భవ, నందేల పురవరాధీశ్వర, మహానందీశ్వర శ్రీపాదపద్మారాధక, కొచ్చెర్లకోట వీరక్షేత్ర భారతి మల్ల, వెలుగోటి గంగరాజు చంద్రరాజుగారి కొమారుడు పిన తిప్పారాజు కుమారుని కుమారుడు తిప్పరాజుగారి ముత్తతంబరాజుగారి అమ్మగారు మహానందీశ్వరుని సన్నిధియందు, దీప స్తంభం ప్రతిష్ఠ చేయించినది ॥ శ్రీశ్రీశ్రీ

గిద్దలూరు తాలూకా పుల్లల చెర్వు సమతు పైకి మవుజే అక్క పల్లె గ్రామానకు శిలాశాసనాల వివరం॥ గ్రామానకు యీశాన్యభాగ మందు అరకోసుమీాద పాపవినాశేశ్వరుని దేవళం దగ్గిర యుండే శాసనపు రాళ్లు 3 కి నకలు :

ప్రథమ శిలాశాసనం నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౨౯౪ అగునేటి పరీధావినామ సంవత్సర శ్రావణ శు॥ ౧౫ సోమవారం, స్వస్తిశ్రీ మన్మమహామండలేశ్వర అరిరాయవిభాళ(విభాళ)భాసిత ప్రభు(భాసగె తప్పువ)రాయరగండ మూరురాయగండ పూర్వపశ్చిమఉత్తరదక్షిణ చతు

* A. R. No. 173 of 1913.

స్సము ద్రాధీశ్వరుండైన శ్రీవీరబుక్కరాయ ఒడయలు విజయనగరము నిజ రాజధానిగాను సర్వజనానురాగుండై పృథివీరాజ్యము సేయుచునుండగాను బుక్కరాయ ఒడయలవారి సర్వప్రధానియైన చిక్కఒడయలు బుక్కరాయనికిన్ని తనకున్నూ రాజ్యాభివృద్ధి అవునట్టుగాను ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధి అవునట్టుగాను ధనకనకవస్తువాహన సమృద్ధి అవునట్టుగాను ఏర్వదేశములోను అను పాపవినాశదేవరకు అంగరంగ భోగాలకున్నూ అష్ట భోగస్వామ్యముగాను చెంగలవీడు ధారాపూర్వకముచేసి యిచ్చెను.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

శ్రీవీరబుక్కరాయనికిన్ని పుణ్యముగాను చిక్కఒడయలు శ్రీపాపవినాశ దేవరకున్ను చిమకా చెర్వు వెనుక మాంమిళ్లనుడుగు అర్మ(?)ల దేవుని ఉపా(హా)రానకు ఆచంద్రార్కస్థాయిగాను యిచ్చెను ॥

రెండో శాసనం నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౨౭౪ [శా. శ. ౧౨౮౪] అగునేటి పరీధావినామ సంవతర శ్రావణ శు॥ ౧౫ సోమవారం స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర ఆది రాయవిభావి(అరిరాయ విభాళ)భాసిత ప్రభు(బాసగెతప్పువ)రాయరగండ మూరురాయరగండ పూర్వపశ్చిమఉత్తర దక్షిణ చతుస్సముద్రాధీశ్వరుండైన శ్రీ వీరహరి హరరాయని కొమారుడు శ్రీ వీరబుక్కరాయ వడియలు విజయనగరం నిజరాజధానిగాను సర్వజనాను రాగుండై పృథివీసామ్రాజ్యం చేయుచున్నూ తమ తండ్రి హరిహరరాయనికిన్ని తమకున్నూ రాజ్యాభివృద్ధి అవునట్టుగాను ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధి అవునట్టుగాను ధనకనక వస్తువాహన సమృద్ధి అవునట్టుగాను ఏరువ దేశములోను అను(?) పాప వినాశన దేవరకున్నూ అంగరంగవైభవాలకున్ను అష్టభోగస్వామ్యము

గాను వినుకొండసీమలో వింజనంపాడు ధారాపూర్వకము చేసి ఆచం
ద్రార్క-స్థాయిగాను యిచ్చెను।

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్త నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

మూడో శాసనానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౨
అగునేటి శార్వరి సంవత్సర ఆషాఢ శు॥ ౧౧ మంగళ్వారం, శ్రీమదఖండ
జగదారాధ్యులైన తురుమిళ్ల జమదగ్ని ఆశ్రమస్థాన శ్రీపాపవినాశేశ్వర
దేవరదివ్యశ్రీపాదపద్మంబులకు, కాశ్యపగోత్ర ఆశ్వాలాయనసూత్ర
ఋక్శాఖాధ్యాయులైన పండరికామాభట్లగారి కుమారుడైన నాగప్ప
గారు సద్వినయ భయభక్తిన్ని సాష్టాంగ దండప్రణామములు సమ
ర్పించి యిచ్చిన గ్రామ ధర్మ శాసన క్రమమెట్లన్నను: శ్రీమన్మహా
రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప అచ్యుతదేవరాయలు విజయ
నగరమందు పృధివీ సామ్రాజ్యము చేయుచుండగాను, రాయల రాజ్య
భారధురంధరుడైన భూతనాథుని రామాభట్లయ్యగారి మేనల్లుడైన విష్ణు
వర్ధనగోత్ర ఆశ్వలాయన సూత్ర ఋక్శాఖాధ్యాయులైన మొండలూరి
తిమ్మాజోస్యుల వారి కుమారులైన వెంకటాద్రి అయ్యవారు ఉదయగిరి
దుర్గం సామ్రాజ్యం పాలనంబు చేస్తూ ఉండి మాకు పారుపత్యానకు
పాలించి యియ్య నవధరించిన ఏరువసీమకు చెల్లే తమిటికొండవద్ది
పోతవరం అనే గ్రామం యీతథాతిథి అయిన ప్రథమ యేకాదశి పుణ్య
కాలమందు శ్రీమదఖండ జగధారాధ్యులైన శ్రీపాపవినాశన దేవునికి
అంగరంగ వైభవాలకున్ను షోడశోపచారాలకున్ను అవునట్లుగాను
కాశ్యపగోత్ర ఆశ్వాలాయన సూత్ర ఋక్శాఖాధ్యాయులైన పండరి
కామాభట్లగారి కుమారుడైన నాగప్పగారు సహిరణ్యోదక దాన
ధారాపూర్వకముగాను వెంకటాద్రి అయ్యవారికి పుణ్యం అవునట్లుగాను

ధారబోసి యిచ్చిన పోతవరం గ్రామానగల నిధినిక్షేప జీవస్వానో(జలపాషాణ ?) అక్షీణి ఆగామిని సిద్ధసాధ్యంబులు మొదలైన అష్టభోగ తేజసామ్యత మైన శ్రీపాపవినాశ దేవునికి ఆచరద్రార్క-స్థాయిగాను అవధరించుమని కాశ్యపగోత్ర ఆశ్వలాయన సూత్ర ఋక్శాఖాధ్యాయులైన పండరి కామాభట్లగారి కుమారుడైన నాగప్పగారు పోతవరం గ్రామం పాపవినాశ దేవునికి సమర్పించి యిచ్చిన ధర్మశాసనం॥

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాప హారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

ఈ పుణ్యం తప్పినవారు గంగకాడ గోవును బ్రాహ్మణ్ణి తమ మాతాపితృలను వధియించిన పాపాన బోవువారు। ఈ పుణ్యం తప్పక నడిచిన వారు మితంలేని పుణ్యమును పొందువారు పండరి నాగప్ప వ్రాలు॥

తఖ్తాకు దాఖలు అయినది। జులాయి తేదీ॥ ౧౮౧౨ సంవత్సరం॥

గిద్దలూరు తాలూకులో కొన్ని జాగాలయందు ఉండిన శిలాశాసనాలకు నకళ్లు। తెనుగు అక్షరాలు॥

గిద్దలూరి తాలూకు సదరహి కసుబా తాలూకు మజుకూరు గ్రామానకు దక్షిణం తట్టు సగిలేరుకు ఉత్తరం యేటి ఒడ్డున పాతాళ నాగేశ్వర స్వామివారి దేవాలయం ముఖమంటపములో పూర్వద్వారానకు ఉత్తరం తట్టు రెండో స్తంభానకు నల్లరాతికి వ్రాసి యుండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౨౮౭ అగునేటి ప్లవంగనామ సంవత్సర ఆశ్వీయుజ శు ౧౦ లు గుడిపాటి కాళ్ల హొన్నూరుపాడు కసుబా గిద్దలూరు అధికారిరెడ్డి కరణాలు కుంచాల

రంగశాయి, వెంకటరామన్న, రెడ్లు దప్పిలి కొండా రెడ్డి, బొంతా పరా రెడ్డి వగైరాలు వ్రాయించి యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను, మా గ్రామంలోను శ్రీ స్వామి దేవాలయం కట్టి ప్రతిష్ఠ చేసినందుకు కసుబా గిద్దలూరు పొలములోను సర్వప్ప కట్టకు దక్షిణం చేను ౧౦౻౦ పన్నెండు ముంతలు మవుజే కొంగల వీటి పొలములోను యేటికి పశ్చిమం చేను ౧౪౦ కుంచెడు ఉభయం తూమెడు చేను శ్రీ స్వామికి ప్రీతిగాను యిస్తిమి। గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకుని సుఖాన ఉండేది ॥

సదరహీ స్తంభానకు పశ్చిమం స్తంభం మీద ఉండే శాసనం నకలు :

......సంవత్సరం। పాతాళ నాగేశ్వరులకు మూల రాఘవ భట్ల నిత్యసేవ శ్రీ తంద్రియప్రు భట్లు, తాత జగ్గు భట్లున్నూ నిత్యసేవ ॥

రెండో శిలా శాసనం।

మవుజే వేములపాటి గ్రామానకు చెల్లే మజరా అయిన తులసీ పురం గ్రామానకు ఆగ్నేయ భాగాన సమీపమందు కాసిం ఖానుని భావికి పడమర కంచురాతికి ఉండే శిలాశాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౪౩ అగునేటి శుభకృతునామ సంవత్సర నిజ శ్రావణ శు॥ ౨ గురువారం నాడు అబ్దుల్ ఖానుని వారి వంశీకులు అయిన కాసింఖానుని కుమారుడు కాసిం ఖానుడు చేసిన ధర్మ మెట్లన్నను - వంశ పారం పరియంతరం ఆచంద్రార్కస్థాయిగాను ధర్మము యీ డేర్పు కొనేకొరకు పుల్లలచెర్వు ఓబళయ్యకుల కర్ణి సమ్మతు ముండ్లపాడుగారి కర్ణీక మాన్యంలోను, వంగల గడ చేనుస్థళంచేను ౫ అయిదు వరహాలకు ఖరీదు చేసి తీసుకుని వనంచావడి కట్టిస్తిమి, గనుక ధర్మము యెవరు ఆక్షేపణ చేసి నా కాశిలో గోహత్య చేసిన పాపాన బోదురు। తురకలు చేస్తే మక్కాలో గోవునున్నూ

పంది నిన్ని వధియిస్తే యేమి పాపమో ఆ పాపాన బోదురు। ఇట్లని వ్రాసిన ధర్మ శాసనము ॥

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

పసరువాటి అమరాబత్తుడు వ్రాసినది ॥

మూడో శాసనం।

కసుబా గ్రిద్దలూరు గ్రామానకు తూర్పు సమీపాన కందులవాణి చేను నెంబరు ౨ యీ చేనులో భూమిమీద పడివుండే శిలాశాసనం కంచురాతిమీద ఉండిన దానికి నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౩ విజయనామ సంవత్సర మాఘ బ॥ ౧౧ అంగారకవారం శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర పూర్వ పశ్చిమ ఉత్తర దక్షిణ అష్టదిక్కు పర రాజ భయంకర......ఈ మట్టుకు అక్షరాలు అగుపడుతూవున్నవి। కడమ అక్షరాలు యేమిన్ని కనుపడలేదు। గనుక కనుపడినమట్టుకు వ్రాయుడమైనది ॥

తఖ్తాకు దాఖలు: ఆగష్టు నెల తేది ౫ సంవత్సరం ౧౮౧౨ ॥

మవుజే ఆకుపీడు సమ్మతు పుల్లలచెర్వు తాలూకు గ్రిద్దలూరు పదరహే గ్రామాన ఉండే శిలాశాసనాల వివరం ॥ పదరహే గ్రామానకు పావుకోసుమీద పశ్చిమాన పూర్వం బేచిరాకు అయిన యెర్కడ దిన్నెపాడు గ్రామం మధ్యమందు, నిలువు తెల్లరాతిమీద ఉండే శాసనానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౦౧౦ అగునేటి విభవనామ సంవత్సర కార్తిక శు॥ ౧౩ లు బుధవారం శ్రీమన్మహామండలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర ప్రతాప వీర అధి

రాజాధిరాజ రాజప్రభాసిత(?)రామర గండ వీర హరిహరరాయడు పృథివీ రాజ్యము చేయుచుండగాను ఆయనకుమారుడు శ్రీవీరభద్ర రాయడు రాజ్యము చేయుచుండి స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర నరగండ గాడ దేవ మహారాయలు దేవ మహారాయల కొమారుడైన మహా రాజులు రాణువతో కూమ చెరువుకు వచ్చి అందుకు గాను దొడ్ల వీటి పొలంలోను గుండ్లకమ్మ మొగదల కందకం త్రొవ్వించి యిందుకు కాలవ పెట్టినది చందిరెడ్డి సింగరిరెడ్డి మల్లారెడ్డి ద్వారం తిప్పారెడ్డి అన్నపురెడ్డి గోపిరెడ్డి ఎర్రడదిన్న దొరకు అప్పలరెడ్డి ఆ వీరరెడ్డి గుండ యాదవ మహారాజులకు చెల్లే మరియాదలు।

ఈ పర్యంతరం శిలాశాసనంలో అక్షరాలు తెలుస్తూ యున్నది। ఈవల పంక్తులు అక్షరాలు మలినమై రాయి బేట్లు లేచినందున అక్ష రాలు యేమి తెలియలేదు। గనుక తెలిసినమట్టుకు నకలు వ్రాసినాము।

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

*శిలాశాసనం సదరు ఆకవీడు గ్రామానకు వాయువ్య భాగా నకు అరకోసు మీాద ఆర వీటి కోటకు ఉత్తరం వాగు దగ్గిర పావు కోసు మీాద నిల్వురాతి చేను నెంబరు ౭౬ ఆనెకాళ్ల రంగప్పసెట్టి చేనికి ఉత్తరపు గట్టున నిల్వురాతికి ఉండే శాసనానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౧౫౮ అగునేటి విజయ సంవత్సర చైత్ర బ ౮ గురువారం శ్రీమతు దువ్వరాజు కుమారుడు సింగరాజు మూర్ల మడకపాడు అగ్రహారం, శ్రీశైలయాత్ర పోయి పాతాళగంగలో స్నానం చేసేటప్పుడు మల్లికార్జున స్వామివారి భక్తుడు మయిలారుమద్దు(పెద్ది?) అనే భక్తునికి పాతాళగంగలో యిచ్చినది॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

---

* **This inscription seems to be a forgery**

సదరు గ్రామానికి యమ భాగాన పావుకోసు మీాద బసగాని పల్లె దోవకు పడమట ఆంధ్ర వెంకట కట్టుబడి రేగడి చేను నె ౬౨౫ రు చేనికి, యీాశాన్యభాగం గట్టున నేలను పడి యుండే తెల్లరాతి మీాద నుండే శాసనానకు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౧౫౭ అగునేటి మన్మథనామ సంవత్సర చైత్ర బ ౧౫ గురువారం ఉత్తరాయణ పుణ్యకాలమందు కతమలినాయండు వెంకమనాయండు బ్రహ్మనాయం డును అనూరు దవ్వ మహారాజునకు దమ్మ్మ మనగను(ధర్మముగాను) మయిలారు పెద్దికిని, వారి తమ్ము?డు మారువ పెద్దికిని నరసింహ పెద్ది కిని ట(ప?)ట్టన పెద్దికిని ఆదిత్త్యునికిని మల్లికార్జునుని దీప సన్నిధిని ఆ చంద్రార్క స్థాయిగాను ధారబోసి యిచ్చెను॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

నాలుగో శాసనం।

సదరు గ్రామానకు ఈశాన్య భాగాన గ్రామ సమీాపమందు తెల్లనిలువు రాతి మీాద వుండే శాసనం నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪(౬?)౫ అగునేటి క్రోధినామ సంవత్సర పుష్య శు ౧౧ లు శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప వీరసదా శివరాయలు పృథ్వీసామ్రాజ్యం చేయుచుండగాను శ్రీ మన్మహా మండలేశ్వర వల్లభరాజు కృష్ణయ్యదేవమహారాజులుంగారు ఆకవీడు స్థితి యేలు చుండంగాను సూరాచెన్నారెడ్డి కొడుకు పోతయ, తిమ్మయ వేంగయ నర్సయ బసవయ్యం గారికిన్ని తమ తండ్రి చెన్నారెడ్డి రంగ స్వామికిన్ని పుణ్యముగాను ఊరికి తూర్పు స్థళాన నిర్ణయంచేసి యిచ్చిన పొలం। పది తూములు ముత్తుం మడి, వెలిచేను చెర్వుకు దక్షిణం కొమ్మున వెలిచేను ౦౦౪౨ బటి చేను యెర్రవాగుకు తూర్పున ౧౩

ముత్తమున్నూ ఉభయం ఖ ౦౹౹౦ పదిహేడుంచేనున్నూ దశ బంధం మాన్యాలున్ను అనుభవించి బ్రతికేది। ఇందుకు యెవ్వరు తప్పినా తల్లితండ్రుల చంపి గో బ్రాహ్మణ వధ చేసిన పాపాన బోదురు।

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

లోగడ సిద్దన తిరుమలయ్య పూరను ఇరవై రెండు అయితే ఒక కొల గడ ॥

కంభము తాలూకా పైకి ము॥ ఇర్మకల్లుగ్రామానకు ఊరికి దక్షిణము కొండమీదనుండె శ్రీ లక్ష్మీ నృసింహస్వామి దేవళంకు దక్షిణపు తట్టు సోపానాల క్రిందను శిలాశాసనము ఉన్నది. నకలు।

శ్రీమతే రామానుజాయ నమః॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౬ అగునేటి శోభకృతునామ సంవత్సర ఫాల్గుణ బ ౩౦ ఆదివారం శ్రీమత్ మహామండలేశ్వర రాజాధిరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప వీర సదాశివదేవ మహారాయలు విద్యానగరమందు వజ్రసింహాసనాసీనులయి పృథ్వీ సామ్రాజ్యము సేయుచుండగాను అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయిన ఆర్తత్రాణ పరాయణులయిన దుష్ట నిగ్రహ శిష్ట ప్రతిపాలకులయిన భక్తవత్సల శరణాగతాభరణులయిన పురాణ పురుషోత్తములయిన ఇర్మకంటిపుర నివాసులైన శ్రీ లక్ష్మీనృసింహుని దివ్య శ్రీ చరణారవిందంబులకు సోమవంశోద్భవులయిన ఆత్రేయసగోత్ర పవిత్రులయిన యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమత్ మహామండలేశ్వర నరసింహుల సింగరయ్య దేవ మహారాజులంగారి (ప్ర)పౌత్రులున్ను నరసింగరయ్యదేవ మహారాజులగారి పౌత్రులున్ను సింగరయ్యదేవ మహారాజుల గారి పుత్రులయిన అహోబళయ్యదేవ మహారాజులుంగారు అనంత వైభములకున్ను సమర్పించి యిచ్చిన భూదాన ధర్మ శాసన క్రమ మెట్లన్నను సదాశివదేవ మహారాయలుంగారు మహా

నాయంకరానకు పాలించ నవధరించిన తొండమూరయ సీమలో ద్వారకచెర్లకు చెల్లె నల్లకుంట్లకు ప్రతి నామధేయం వీరనారసింహ పురమనె అగ్రహారం నిత్యనై వేద్య దీపారాధన పంచ పర్వములకు ద్వాదశి సమారాధనములకున్నూ ఈ తథాతిథి యుగాది అమావాస్య పుణ్యకాలమందు తమతండ్రి నరసింగ రాజుగారికిన్ని రఘుపతిరాజుగారికిన్ని పుణ్యముగాను త్రివాచకముగాను త్రికరణ శుద్ధిగాను నరసింగ రాజుపురమనె అగ్రహారమును చతుస్సీమాను లోనుగాను సర్వమాన్య అగ్రహారంగాను సహిరణ్యోదక దానధారా పూర్వకముగాను ధారబోస్తిమి గనుక ఆయగ్ర హారానికి నిధినిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్యంబులని యెడు అష్టభోగస్వామ్యతలున్నూ ఆచంద్రార్కస్థాయిగాను ధారబోసి యిస్తిమి గనుక యిందుకు యెవ్వరు తప్పినానున్ను తమ తల్లి తండ్రుల నున్ను గో బ్రాహ్మణులనున్ను వారణాసిలో వధియించిన పాపాన బోదురు ॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికా ధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా ॥

శిలా ధర్మశాసనం దేవాలయానకు మహాద్వార సమీపమందు ఉన్నది॥
ఇది చోళ ప్రతిష్ఠ ॥

తాఖ్తాకు దాఖలు అయినది ।

యాడకి తాలూకు మవుజే జూటూరు గ్రామములో నున్న లాశాసనానకు నకళ్లు రెండు । తెనుగుఅక్షరాలతో నుండేవి ।

మవుజే జూటూరు తాలూకు యాడికి గ్రామములో కోట వాకిలికి పడమట సమీపాన కేశవస్వామి ఖిలమైన దేవాలయం ప్రాకారానకు దక్షిణం ద్వారానకు అనుకుని నిలువు నల్లరాతికి వుండే శిలా

శాసనానికి నకలు। తెనుగు అక్షరాలు గీర్వాణ శ్లోకం। ప్రాకృతం తెనుగు ॥

సూర్యుడు చంద్రుడు.

శ్రీమచ్ఛకాబ్దా నవ వార్ధి వేదా శశాంక సౌజ్ఞాకథితాస్థి...వా। శుశో(భేన)భనే సర్వజితాబ్ధి వేద్రైౖ చైత్రివ షష్ట్యామి నసోమవారే। శశాంక ఖే పంచమ వంశ సంభవో। భండారు చెన్న క్షితిపశ్చ నంద నః। కృష్ణానుజ స్తిమ్మమహీశ్వరో వా బావాధ్వింభో శందన వాయ సౌజ్ఞకః॥ విద్యానగరే కేశవేవ స్ఫురె వస్నుత్సన్నుత్య గీతాది విభవ శాసనం కృతవాం ప్రభుః॥ శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీకృష్ణదేవమహారాయులు ఆదెప్పనాయనిగారికిని పాలించిన గాతమగు త్రిశీమలోని పెన్న జూటూరు తమ దొర దాయి కృష్ణమ నాయనికి పాలించియుండగాను ఆ కృష్ణమనాయని తమ్ముడు తిప్పయ్య నాయడు జూటూరు కేశవరాయనికిని పరమేశ్వరునికిని అంగరంగవైభ వాలు సాగించి యీశ్వరుని మడికింగాను ఆబ...శ్రోత్రియ రొఖ్ఖమున సర్వమాన్యముచేసి భోగాలవారికిని యీ స్థానాలు రెంటికిం చెల్లెడి క్షేత్రములోను స్థానాల వారు రెడ్లు కరణాల ముందరను సమ్మతించి యిచ్చిన మడి ఖ ౦౪౩ పదముత్తుంచేను బొప్పుటెడు(?) మేము యిచ్చినది మడి ౧౩ ముత్తుం చేను పందుం। తోట ౦౧౧ తూమెడున్న కూర్చి యిస్తిమి। యీ క్షేత్రానకు సర్వమాన్యం రొఖ్ఖానకు యీ వైభ వానకు యెవ్వరు విఘ్నంసేయ నుద్యోగించినాను వారణాసిలోను గోహత్యలు బ్రహ్మహత్యలు చేసిన పాపాన బోదురు।

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ।

మవుజే జూటూరు తాలూకు యాడకి గ్రామం కోటవాకిలికి పడమట సమీపాన కేశవస్వామి ఖిలమైన దేవాలయం ప్రాకారానకు ఆనుకుని నిలువున ఉంచి యుండే శిలాశాసనానికి నకలు। తెనుగు అక్ష

రాలు। ఈ రాతికి తూర్పున నుండేది చావిడికి ఆనుకుని ఉత్తరం తెలుగు అక్షరాలు:

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౪ అగునేటి చిత్రభాను సంవత్సర భాద్రపద శు ౧౨ శుక్రవారం మహా రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప శ్రీ కృష్ణదేవ మహారాయలు పృథివి సామ్రాజ్యము పాలిస్తూ యుండగాను శ్రీ మన్మహాప్రధానులైన సాళువ తిమ్మరసయ్యగారికి పాలించిన గుత్తి సీమలోను శ్రీ మన్మహా మండలేశ్వర సాముద్రికంగండ వరదయ్య దేవమహారాజుల కొమారుడు పెద్ద తిమ్మారాజుగారు తమకు ఆ తిమ్మరసయ్య నాయంకరానకు యిచ్చిన పెన్న వూరిలోని బయిటరు కేశవనాథునికి ఉత్సవ విగ్రహాలు కొని తెచ్చి ప్రతిష్ఠ చేయించి దేవుని ముందర చావిడి మాను మంటప మున్నూ కట్టించి దశమి మహోత్సవాలకు యె ౧ కి షమ్మది(?)గ ౧౦ లెఖ్ఖయిచ్చి నైవేద్యానకు నందా దీపానకు యీ దేవునికి చేనుమడి తోట ఉత్సవాలకు ముఖ్యమైన అష్టభోగ తేజ స్వామ్యాలున్నూ క్రితం అచ్చే శ్రోత్రియ రొఖ్ఖాలు మాని సర్వ మాన్యాలు చేసి తమ తల్లి పాపసా నమ్మకున్నూ తమ తండ్రి వరదరాజయ్యకున్ను పుణ్యముగాను సోమ గ్రహణ పుణ్యకాలమందు ఆ చంద్రార్కస్థాయిగాను దారబోశి యిస్తిమి అని యిచ్చిన ధర్మశాసనం। ఇందుకు తప్పి యీ దేవుని స్వాస్త్వము లకు యెవ్వడు అడ్డపడినాను వాడు స్వయం మాతా గమనం చేసిన వాడున్ను గోహత్య బ్రహ్మత్య చేసిన వాడున్నూ తన మానము చండాలుడికి యిచ్చిన వాడున్ను అడ్డు అడ్డునకు కర్మ చేసిన వాడున్నూ శ్రీ మంగళ మహా శ్రీ శ్రీంజేయును ॥

అమరావతిలోను శ్రీ అమరేశ్వర దేవళం గాలిగోపరానకు లోకట్టు మంటపానకు తూర్పుగా నిల్వు స్తంభానకు ఉండే శిలాశాసనానకు నకలు:* గీర్వాణము।

---

* A. R. No. 258 of 1897, SII. Vol. VI. 226.

దద్యా దాద్యోవరాహ శ్రియమిహభవతాం శంకరాకార భాజో
దంష్ట్రా్రియాం యస్య సక్తా జయతి వసుమతీ ప్రోద్ధృతా నీరరాశేః।
కోటీరోపాంత దేశ ప్రణిహిత రజనీ నాథ రేఖాగ్ర కోటీ।
సంశ్లిష్టాంకైణగాత్ర చ్ఛవిరివనయనానందనోత్కర్ష హేతుః॥

తస్యా మందకిరాఖ్యాతా। విఖ్యాతా విభవోన్నతా।
సురకిన్నర దై త్యేంద్ర। ఫణీంద్ర నగరే ష్వపి॥

తాంపురీంపాల యామాసు స్సురసింధు సహోదరాః।
నృపావిక్రమసంపన్నా ధర్మజ్ఞా స్సత్యవాదినః॥

ఆసీద్వేమనృప స్తతో ధరణి భృత్కోటీర కోటీమణి।
శ్రేణీ రంజిత పాదపీఠనికటః ప్రోలాన్వవా యాంబుధేః।
ఏ నేందుప్రతిమేన నిర్మల కళాపూర్ణేన లోకత్రయీ।
జ్యోత్స్నా సోదర సద్యశోమృత భరై రానంద మాసాదితా॥

హేమాద్రి గురుతద్దానం కుటుంబస్స కళా మహీం।
కరద స్సాగర స్తస్య సభాగ్యో వేమభూపతిః॥

అన్నమాంబా తనూజేన కృతినా వేమభూభుజా।
అహోబలేశస్య గిరా నిత్యే శ్రీపర్వతేపిచ।
సోపానానాం ఘనారమ్యా సుదృఢా పంక్తి రాత్మనః॥

సమారురుక్షోః కైలాసం నిశ్రేణి రివ నిర్మితా।
బ్రహ్మకుండ్యాః కృష్ణ వేణ్యా గౌతమ్యా వేమభూవరః।
ఉపకంఠ మగ్రహారై రాకీర్ణ మకరోద్వి భుః॥

తస్య పుత్రో మహాభాగో నాభాగ సదృశో గుణైః॥

అన్నవోత మహీపాలో భూపాలకుల దేవతా।
యస్యత్యాగే మహాభాగే కర్ణః కర్ణపథం గతః।
దానే నామిత మానేన బలిర్బలి రభూ ద్భువి।
శౌర్యేణ చాతి వీర్యేణ శత్రవో మిత్ర భే దినః॥

భవంతి నిహతా యేన జన్యే ప్రర్జన్య సన్నిభాః ।
త్రిపురాంతక దేవేన దత్తమ్మత్త ద్విపాకులం ।
రాజ్యంప్రాజ్యం సుహృద్భాజ్యం భోజ్యం యః కురుతేర్థినాం ।
కుల క్రమాగత స్తస్య మంత్రిసేనాపతి స్స్వయం ॥

వైరివారణసింహో భూ న్మల్లినాథో మహాబలః ।
కుమారయివశక్రస్య విష్వ క్సేనో హరే రివ ।
తస్య వేమమహీశస్య జయలక్ష్మీ ప్రదస్సదా ।
తేన విఖ్యాత సారేణ పితుః కేత చమూపతేః ।
కుల ముత్తే జితం శౌర్య త్యాగ భోగ గుణోత్తరం ॥

యో బాహా ఘన మందరాద్రి మథిత ప్రత్యర్థి పృథ్వీ పతి ।
క్షీరాంభోనిధిజేందిరా పరివృఢ శ్రీ వీరనారాయణః ।
శ్రీ మత్కేతయ మల్లశౌరి రచయ శ్రీ వేమ పృథ్వీ పతే ।
ర్మం శ్రీ రాజ్య దురంధరా విజయతే కోదండరామో యుధి ॥

తస్య లంకాంబికాగర్భా జ్జాతో వేమ చమూపతిః ।
ప్రద్యుమ్న యివ కృష్ణస్య క్షీరాబ్ధే రివ చంద్రమాః ।
భాస్కరస్య యథా కర్ణో మహేశస్య గుహోయథా ।
లావణ్య కాంతి సత్యాగ శౌర్యైరానందదః పితుః ॥

కృష్ణా శ్రయత్వాత్సం హర్యో భూత్కైలాసస్య శివాశ్రయాత్ ।
యస్సర్వమంగళా వాసః ఖ్యాతత్వాచ్చ హిమాచలః ।
ఆశ్రయ త్వాదనంతానాం సువర్ణానాం సురాలయః
సోయం మల్లవేమాంకో గుణై రాక్రాంత భూధరః ॥

రామోపి నరసింహోయం లక్ష్మీ నాథోపి శంకరః ।
చిత్రం మల్లయ వేమాంకో రాజాపి రవి తేజసా ॥

కేతయ మల్లయ వేమక్షితి పతి రుద్దండ చండభుజదండః ।
యస్య కరకమల వారిణి జాయంతే పంచ పంచ సురతరవః ।
అనవోతమహీశబాహుదండః, ప్రథి తారాతి నికాయకాలదండః ।
భువి కేతయ మల్లవేమ శౌరి స్సదయం రక్షతిరమ్య ధాన్య వాటీం ॥

ఆయాతాయవనాయితి క్షితిభుజః శ్రుత్త్వైవ వార్తామహో।
దుర్గాణ్యశ్వభటాకులాని సభయా స్త్యక్త్వా వనాన్యావిశన్
శ్రీ మాన్మల్లయ వేమశౌరి రనహోతాధీశ భావాజ్జయా।
పాశ్చాత్యా జ్జగనొబ్బగండ బిరుదో నిర్జిత్య సంరాజితే॥

దాతారం తరసా హిరణ్యకశిపోః ప్రహ్లాద వాక్యాదర।
ప్రత్యక్షీకృత దివ్యరూప విభవ క్షేమంకరం దేహినాం।
శ్రీ నాథం జగనొబ్బగండబిరుదో దేవం నృసింహా భిధం।
శక్త్యాయోనుకరోతి మల్లయసుత శ్రీ వేమ సేనాధిపః॥

విష్వక్సేన విదారితాఖిలరిపు ర్యావల్లభో భూభృతాం।
నాథ స్సత్వ గుణోత్తరస్సువిబుధ శ్రేణీస్సముజ్జీవనః।
ఆయుష్మాన్ జగనొబ్బ గండబిరుదో గోపాల సంసేవితః।
సత్యం మల్లయ వేమ య స్సభవతి శ్రీవీరనారాయణః॥ ద్వ్యర్థి॥

విఖ్యాతై రనుయాతి సాగరమసౌ విష్ణుంగుణానాం గణైః।
పుత్రః కేశయ మల్ల యస్య విజయీ శ్రీవేమసేనాధిపః।
సత్యారాధన దీనరాజజనక స్వాం త్తస్థిత శ్రీధర।
శ్రీకాంతాధరపాలితక్షితిధరో లావణ్య రూపాన్వితః॥ త్ర్యర్థః॥

గోపాలాంచిత పాదపంకజయుగం శ్రీసత్యభామాన్వితం।
సాతత్యం హరిదీవ్యమాన శరణం నిత్యం సువర్ణాంచితం।
దానాధార మహీనభోగరుచిరం చాజ్ఞాతభావక్రమం।
వృత్త్యామల్లయ వేమయోను హరతే విష్ణుంశివం పద్మజం॥ చతురర్థః॥

లక్ష్మాంబాగర్భ రత్నాకర తుహిన రుచా శ్రీమతామల్లశౌరిః।
గోత్రేణాత్రాసవృత్రాసురరిపుయశసా వేమసేనాధిపేన।
ఐశ్వర్యాయాభివృద్ధ్యై ధనకనకధరా వస్తువాహం ద్విపానాం।
సాతత్యా దంనహోతక్షితిపతి తిలకస్యాయు రారోగ్య శి(సి)ద్ధ్యై॥

శాకాబ్దే గుణహ స్త్రినేత్ర వసుధా సంఖ్యే ప్లవే వత్సరే।
మాసే శ్రావణికే సితే ఫణిదినే వాచస్పతీ ర్వాసరే।
రాకాధీశ కిరీట రత్ననికరై ర్నీరాజితాంఘ్రిద్వయ
స్సశ్రీమానమరేశ్వరో భువిపుర్ణిత్యః ప్రతిష్ఠాపితః॥

యత్పాదాంబుజ లీనషట్పదతయా త్రైలోక్య సంసేవితా।
శ్రీమాన్భాతి పురందరోదివిశచీ గండస్థలీ మండనం।
బ్రహ్మాయం పరిపూజ్య సర్వజగతాం స్రష్టాప్రహృష్టోభవ।
కైలాసం ప్రవిహాయయాతి వసతి శ్రీధాన్యవాటీపురం॥

పీఠంయస్య రథ। స్తను శ్శరవరో గ్రైవేయకం శింజినీ
నిశ్వాసా హయసంహతి స్సువిపులే నేత్రే చ చక్రద్వయం।
ఇత్థంయేన కృతం పురా న్నిజపరిష్కారేణ సంభేదనం।
యోరక్షత్యనిశం జగంత్యవహితో హత్వాజగద్రోహిణః॥

శింజిన్యా చ రథం సదావహతి యో బాణేన సూతం ముదా।
సూతేనాశ్వసమూహ మద్భుతమిదం చాపేన చక్రద్వయం।
యో దేవస్స చరాచరాఖిల జగద్రక్షా ప్రతిష్ఠావిధా।
ప్రజ్ఞావానమరేశ్వరో విజయతే శ్రీధాన్యహాటీపురే॥

నిజవంశాబ్ధి చంద్రేణ మహేంద్రేణ మహౌజసా।
లక్కమాంబా తనూజేన కళాభోజేన భాస్వతా॥

పుత్రేణ మల్లినాథస్య శత్రుఖండన శాలినా।
సంగ్రామ హారిణా వేమశౌరిణావిజితారిణా॥

భక్త్యా సంపూజిత స్తేన సదే వైరమరేశ్వరః
సాన్నిధ్యమకరోదస్య సర్వకామార్థ సిద్ధయే॥

య మవందిత వాదాంక శ్రీరతీ మదవానఘ।
జయరాజకళాహావ జటాభార మనోహర॥

అత్రగత్వా మహాదేవం ప్రత్యాగత్వా జనార్దనం।
గత్వప్రత్యాగతార్థాభ్యాం బ్రహ్మాణం శ్రేయసేస్తువే॥

స్వస్తి సకలగుణగణాలంకార చంజీమలచూరకార విశ్వవిశ్వాంభరావహానదక్షు దక్షిణభుజాదండ జగనొబ్బగండ అన్యామండలీకరగండ రాయచేకోలుగండ అర్థి ప్రత్యర్థి హేమాద్రి దాననిరత ప్రజాపరిపాలన భరత అమరభరణ రూపనారాయణ వీరనారాయణ భుజబలభీమకోదండరామ అపరిమిత భూదాన పరశురామ అనేకనగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారామ సంగడిరక్షపాలక జగరక్షపాలక జగదగోపాళ గుజ్జరధట్టవిభాళ ఘనభుజవిరాజమానకరవాళ రాచూరిదుర్గవిభాళ అనవరత పురోహితకృతసోమపాన శ్రీపర్వత అహోబలనిర్మిత సోపాన దిక్కాంతా మనోహరకీర్తికుసుమామోద కుండిప్రభాసహ్యాజా గౌతమీ జలక్రీడా వినోద విరోధినృపదానవనరసింహ ప్రజ్ఞాతచతుర్విధోపాయ కేళాదిరాయ నిత్యపరిపాలితసత్య పల్లవాదిత్యరిపునరపతిగోధూమఘట్టనఘరట్ట అప్పయగోపయదిశాపట్ట సంగ్రామసముద్దండ చండభూజాసివిఖండితశత్రుకీలాలప్లవమానపిశాచగణ స్తూయమానయశోమండన అళగియవరదశిరఃఖండన దుర్మదవైరివీర భయంకర బసవశంకర అమరేశ్వరదేవ శ్రీచరణ సరసీరుహాదత్తబావదండెనగోవ బ్రహ్మకుండికృష్ణవేణీగోదావరీ మహానదీ తటద్వయతన్మధ్యదేశదత్తానేక అగ్రహార అగణ్యాపుణ్యాక్షేత్ర సత్రదత్తబహువిధాహార పరపురహరణ మృత్యుంజయ సంగ్రామ ధనంజయ ఉత్తుంగచతురంగ బలరిపు సేనాసాధక త్రిపురాంతకదేవదివ్యశ్రీపాదపద్మారాధక కేతయ మల్లినాథ పయఃరావావారపూర్ణిమాసుధాకరులైన శ్రీమతు వేమనంగారు శకవరుషంబులు ౧౭౦౩ అగు ప్లవసంవత్సర శ్రావణ బ॥ ౫ గురువారం స్వస్తి సమస్త ప్రశస్తి సహితులైన శ్రీమతు అనుపోతయరడ్డింగారికి ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధిన్ని ధనకనక వస్తువాహన సమృద్ధిన్ని పుత్రపౌత్ర అభివృద్ధిన్ని అవునట్లుగాను పంచారామంబులకుం ప్రథమారామంబైన అమరారామంబను శ్రీధాన్యవాటీ పురంబునకు నధీశ్వరుడైన అమరేశ్వర శ్రీమన్మహాదేవరను ఆచంద్రార్కముగాను పునఃప్రతిష్ఠ చేసిరి ॥ శ్రీమంగళమహా శ్రీ శ్రీం జేయును ॥

కంభంతాలూకు పైకి కొత్తకాకర్ల ఇడమకల్లు ఈ రెండు గ్రామాదులయందు ఉన్న శిలాశాసనాలకు నకళ్లు। తెనుగు అక్షరాలు :

కంభంతాలూకుపైకి మవుజే కొత్తకాకర్ల బస్తీగ్రామంలోను వీరేశ్వరదేవళానకు ఉత్తరభాగమందు ద్వారం దగ్గిర నిలువపాతిన రాయిమీద నున్న శాసనం॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౪ అగునేటి శోభకృతునామ సంవత్సర మాఘ శు। ౧౫ శుక్రవారం శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర సదాశివదేవ మహారాయలు విద్యానగరమందు పృధివీరాజ్యం చేయుచుండగాను, శ్రీమన్మహామండలేశ్వర నందెల సింగరయ్యదేవమహారాజుల కుమారుండు అవుబళయ్యదేవమహారాజులుంగారు తమ నాయంకరానకు రాయలు దయచేసిన తొండమారగుళ్ల సీమలో పెదకాకర్ల రామయ లింగం అంగరంగ వైభవాలకున్ను కాకర్లచెర్వు వెనుక అనికట్టు పొలాన ఖ ౦౫౦ వీరేశ్వరునికి అంగరంగ వైభవాలకున్నూ ఖ ౦౫౦ కూడా ఖ ౧ పుట్టెడు క్షేత్రం రాయలకు పుణ్యంగాను ధారాపూర్వకముగాను సమర్పిస్తిమి గనుక యీ పుణ్యానకు యెవ్వరు తప్పినాను గంగలో గోవును బ్రాహ్మణ్ణి వధియించిన పాపాన్ని పొందుదురు॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

స్వత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

శ్రీమంగళమహా శ్రీశ్రీం జేయును॥ శ్రీశ్రీశ్రీ॥

**మవుంజే పొద్దుటూరిలో సాలెలు తనికంట్టి అక్కన్న అనే అతని వద్ద నున్న దానపత్రముల యొక్క నకళ్లు.**

౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౨౨ అగునేటి విక్రమనామ సం॥ జ్యేష్ఠ శు ౫ లు శ్రీమతు పొద్దుటూరు అధికారి రెడ్లు కరణాలు తనికంట్టి సెట్టికుమారుడు చెంచుకు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసనపత్రిక. మీాకు మా గ్రామంలో మగ్గాలకు మాన్యంవుండిన్నీ మరిన్నీ భూదానముకావలెను అని అడిగితివి గనుక ఆ లాగున్నే నీకు మాన్యస్థళం నిర్దేశంచేసియిచ్చిన వివరం: రేగటను యర్రాత్రిచేను తూర్పు గోపవరంసంజీవరాయనిమాన్యం పడమటను ప్రాకు పోలిరెడ్డివారి యీాడ్వచేను స్థళం ౧౨ యిద్దుమున్నూ మీారు వైద్యులు అని నేసుకునే మగ్గాలకున్నూ సర్వమాన్యముగాను యిచ్చినారము గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యాయం ఆచంద్రార్క స్థాయిగాను సుఖానసుండవలెను, ఆచం వెంకటరెడ్డి, వెంపల్లె ముక్కలయ్యగారి వెంకటరెడ్డి, మోపూరి నలవోబుళురెడ్డి, బుచ్చిరాజుగారి నరసరాజు, రావులూరు పెదనారాయణ, రావులూరు గోపయగారి వెంకట వీరలసమ్మతిన రావులూరు రామరాజు కుమారుడు వెంకట వ్రాసిన దానపత్రం.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

శ్రీశ్రీశ్రీశ్రీ జేయును.

౨. సాలె అక్కన్నవద్దనున్న దానపత్రం శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౫౮ అగు నేటి నళనామ సం॥ మాఘ శు। ౧౩ లు రాజశ్రీ భీమరావు, రామేశ్వరంరెడ్లుకరణాలు తనకంట్టి చెంచు కుమారుడు వెంకటకు వ్రాయించి యిచ్చిన కాగిదెం. నీవు మా గ్రామంలోకి వచ్చి నేసుకునే మగ్గాలకు మాన్యంకావలెను అని అడిగితివి గనుక ఆలాగె మీారు వైద్యులని నేసుకునే మగ్గాలకు సర్వమాన్యం గాను సెలవు యిచ్చినారం.

మీ పుత్రపౌత్ర పారంపర్యంతరం మా గ్రామంలో మగ్గాలు పెట్టుకుని నేసుక సుఖాననుండేది.

3. ప్రాతకుంట రామిరెడ్డి, చాములు వేదయ్య, మద్దూరు జగ్గయ్య నాగరాజు, కన్యలూరు అయ్యావారు సమ్మతిన కరణం రావులూరు వెంకటాచలం వ్రాసిన కాగిదెం.

విశ్వావసునామ సంవత్సర పాల్గుణ శు॥ ౧౫ లు శ్రీమతు కొత్తపల్లె రెడ్డి కరణాలు తనకంటి వెంకటకు వ్రాసి యిచ్చిన మాన్యపుకమ్మ. మా గ్రామాన ౧౦౪ యిరస చేను నీకు మాన్యం వున్నగా(ఉండగా) ఆ చేను కొన్నాళ్లు అనుభవిస్తూయుండగా ఆ చేనుపట్టున గోపాళయగారు వనం వేయించమని సెలవు యిచ్చిరి గనుక అందుకు బదులుగాను గోరి తూర్పున బీడు ౧౦౪ యిరసచేను మాన్యం సెలవుయిచ్చినాము. ఆ చేను దున్నించుక ఫలంపెట్టుక సుఖాన అనుభవించేది.

రెడ్ల సమ్మతిన కరణం తిమ్మరాజువ్రాలు.

సుబ్బయ వ్రాలు
బొజ్జయ వ్రాలు
నర్సయ వ్రాలు

సాలె అక్కన్న వద్ద యున్న దానపత్రం రామేశ్వరం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౬౫౯ అగు నేటి పింగళనామ సం॥ చైత్ర శు॥ ౫ లు రాజశ్రీ భీమరావు రామేశ్వరం రెడ్లు కరణాలు తనకంట్టి చెంచుకుమారుడు వెంకటకు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక నీకు మాగ్రామంలో నేసుకునే మగ్గాలకు మాన్యంవుండిన్ని మరిన్ని భూదానం కావలెనని అడిగితివి గనుక ఆలాగున్నే నీకు మాన్యస్థళం నిర్దేశం చేసి యిచ్చిన వివరం. నీవు గాండ్ల వారి యింట్లో కాపదనం(కాపురం?) వుండి మాకు దగ్గరగా యిప్పించుమని అడిగితివి గనుక మీరువుండిన యింటికి పడమట మడిలో ౧౦౧౦

కయ్య మీారు వైద్యులు అని సర్వమాన్యంగాను యిచ్చినారం మీా పుత్ర పౌత్ర పారంపర్యంతరం అనుభవించుక సుఖానఉండేది.

చాముల వేదయ్య, పాతకుంట రామిరెడ్డి, మద్దూరు జగ్గయ్య నాగరాజు, కన్యలూరు అయ్యవారు వీరల సమ్మతిని కరణం రావులూరు వెంకటాచలం వ్రాసిన భూదానధర్మ శాసనపత్రిక.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయో ర్మధ్యే దానా చ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

౪. రూపావతారం వేంకటపతిశాస్త్రుర్ల వారి దగ్గరనున్న దాన పత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౦౮ అగునేటి పరాభవనామ సంవత్సర ఆశ్వయుజ శు। ౧౦ సోమవారం శ్రీ మద్యజనాదిషట్కర్మనిరతులైన వేదమూర్తులయిన ఆశ్వలాయనసూత్రులయిన భారద్వాజసగోత్రులయిన రూపావతారం వెంకటభొట్లువారికి పౌత్రులయిన పేరుభొట్లవారి పుత్రులయిన రామకృష్ణంభొట్లువారికి ప్రొద్దుటూరు అధికారి రెడ్లు కరణాలు వ్రాయించియిచ్చిన భూదాన శ్రోత్రియం ధర్మశాసన పత్రిక. మీారు మా గ్రామంలోను శ్రోత్రియం కావలెను. అని ఆశ్రయించి మందలించుకుంటిరి గనుక అదేప్రకారం మేము సమ్మతించి స్థళంనిర్దేశంచేసి యిచ్చినవివరం: తూర్పు కొత్తపల్లె పొలిమేరహద్దు; దక్షిణం ఆచం చన్నప్పరెడ్డి పొలిమేర మాన్యం మడిహద్దు; పడమటను సరదేశాయి గుత్తి నరసింగరాయనివారి మాన్యం మడిహద్దు, ఉత్తరం కోడూరు జగ్గంభొట్లువారి మాన్యం గరుగుచేనుహద్దు. ఈ చతుర్దిక్కులకు లోతట్టుపొలం కాడారంభం నీరారంభం పొలం ఖం ౪-౨ ౪కి వివరం: నీరారంభం కంచన మడిస్థళం ఖ ౦।౦, గాజుల హొన్నప్ప యీాడ్వమడి ఖ ౦।౦, ఉభయం ఖ ౦౪౦. కాడారంభం

దొర్విచేను వెంపల్లె మూగన్నగారి వేంకటరెడ్డిగారి పంపు ౧౦౪౦, పింజరిబాబుయీడ్వ ౧౦౪౦, బొల్లవరం బాటకు ఉత్తరం వెంపల్లె బొర్రయ్యగారి చినవెంకటరెడ్డి యీడ్వ చవుటచేను ౧౧, గొల్లబొల్లవరం గాశి యీడ్వచవుట చేను ౧౦౪, ఉభయం సాగు ౧౨౪౦; బీడుస్థళం చవుటచేను ఉత్తరం గర్గుదిన్నె ౧౦౹౦, బొల్లవరం బాట దక్షిణం ఉత్తరం చవుటబీడు ౧౧౹౦ ఉభయం బీడు ౧౧౹౦ ; ఉభయం కాడారంభం సాగు బీడుసహాగాను చేను ౧౩౻౦ కి పల్లె ఆయకట్టుకుగాను ౧౦౹ గాకనిల్వ చేను ౧౩౪ లోగడ మీకు సర్వమాన్యం యిచ్చినది దొర్విచేను ౧౧ గాకను శుద్ధం ౧౨౪ ఉభయంచేను మడి ఖ ౦౪౨౪ అక్షరాలా పన్నెండు తూములు యిరస ఇందుకు శ్రోత్రియం ౧౦౧౧ అక్షరాల పంద్రాను పదివరహాలు రూకానిర్ణయంచేసి యీతథాతథి పుణ్యకాలమందు సహిరణ్యోదకధారా పూర్వకముగా యిస్తిమి గనుక మీ పుత్ర పౌత్రపారంపర్యం ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకునేది. కార్తికం ౮౧౦ వైశాఖం ౨౧౦ కారద్దు నిర్ణయం॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

కరణం రావులూరు లింగరాజు వ్రాసిన దాన పత్రము.

ఆచం చిన్నమరెడ్డి వ్రాలు, కరణం రావులూరు చలం వ్రాలు, రావులూరు తిరుపతి వ్రాలు, రావులూరు లింగరాజు వ్రాలు, రావులూరు గరుడాచలం వ్రాలు, రావులూరు వెంకటాచలం వ్రాలు, వజ్జల తల శేషారెడ్డి వ్రాలు.

పొద్దుటూరు గరుడాద్రి చొక్కంభట్ల దగ్గరనున్న కాగితం రెండు నకలు :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౨౧ అగు నేటి సిద్ధార్థినామ సంవత్సర కార్తిక శు॥ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన వేదమూర్తులగు గరుడాద్రి అయ్యంభట్లు పుత్రు లయిన రామాశాస్త్రిలవారికి దూపావతారం బాలకృష్ణంభట్లు పుత్రు లయిన తిప్పాభట్లువారికిన్ని శ్రీమతు ప్రొద్దుటూరు అధికారి రెడ్లు కరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియం దాన పత్రిక: మీరు మా గ్రామంలో శ్రోత్రియం కావలెను అనియాచిస్తిరి గనుక అందుకు మేము నలుగురము సమ్మతించి శ్రోత్రియం గ్రామానకు స్థళం నిర్దేశం చేసి యిచ్చిన వివరం.

రామకృష్ణంభొట్లువారి శ్రోత్రియం గ్రామానకు పడమటను.

౧౪ వెంకాజపంతులవారి మడి, ౧౪ ఫకీరుసాహెబు మడిలోను మాన్యం శివాయ, ౧౨, ఎద్దుచేను స్థళం ౧౨, చవుటచేను తంబళవాని చేను దక్షిణం స్థళం ౧౩, బక్కరేగట పిండికూర బయ్యన్న యీడ్వ ఖ ౦౻౦.

అక్షరాలా కాడారంభం నీరారంభాలు పదిహేను తూములుకు మక్తా శ్రోత్రియం కవులు సకలసువర్నాదాయాలు దఖలు పదిహేను వరహాలకు కవులు నిష్కరుషచేసి యిచ్చినాము గనుక పల్లె గట్టించి మీ పుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను పల్లె వృద్ధి చేసుకొని సుఖాన అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మద్వంశజా పరమహీపతివంశజా వా
యే భూమి పాస్సతత ముజ్జ్వలధర్మచిత్తా
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి
తత్పాదుకద్వయం మహం శిరసా వహామి ॥

స్వదత్తా పుత్రికా ధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా॥

| రెడ్లు | కరణాలు |
| --- | --- |
| వెంపల్లె వెంకటరెడ్డి వ్రాలు | రావులూరు లింగరాజు వ్రాలు |
| బసిరెడ్డి వెంకటరెడ్డి వడ్డతల | రావులూరు సీతారామన్న వ్రాలు |
| రామిరెడ్డి సమ్మతిన కరణం | రావులూరు పులమరాజు వ్రాలు |
| పుల్లమరాజు వ్రాలు | రావులూరి అయ్యనారప్ప వ్రాలు |
| | రావులూరి నూరప్పగారి చెంచు వ్రాలు |
| | రావులూరి జోగిరాజు స॥ గురుమూర్తి |
| | వ్రాలు రావులూరి బొజ్జయ్య వ్రాలు |

ఘంటికోట వెంకన్నగారికి ప్రొద్దుటూరిలో నడుస్తూయున్న తసద్దీకు దానపత్రం అరెంతో వున్నందుకు నకలు వ్రాసినది.

యినీసుఖానాగడు సన్న ౧౬౯౦

(యిచ్చట రెండు మహారాష్ట్రము వ్రాసియున్నది)*

మవుజే ప్రొద్దుటూరిలో తురక ఆడుమనిషి గుల్బి అనే ఆమెవద్ద వున్న సన్నదు యొక్క నకలు.

నవాబు అబ్దులు సభీఖాను స్న ౧౧౨౨ హింజరి గ్యార్వీషవ్వాలు

మహమ్మదు మానుషుకు బిగువులు ౧౦ భూమి యినాం.

(చూ. అనుబం. పార్శిశాసనములు 28)

ముతసద్దియాంని మోహింమ్మతికి హాలు యిస్తికి బాలు రెడ్యానెం కూలుకర్ని యానె మవుజె పొద్దుటూరుపరగణే హవేలిఘండికోట సర్కారు మజుకూరు బిజానందు నూరసం యిహదెన్ను...మహమ్మదు మహన్సూను కు సెలవుయిచ్చినారము....లాయుఖు జిరా ఆయదు మహారునవె...

* K. Vol. 267 For 7-b 8-a in Manuscipt.

చేసేది. ఇందుకు వుజూరు సేయపనిలేదు. చాలా బాదు వీరికి నడచిన జయనక హాలు చేసినాము.

మహాఫకు సన్నదు మశానఃా...చేసేది.

ఖానా బూదు గయిఘరఖాను అలంగీరు పాదషాయగా మహామ్మదుమాసుముకు ౧౦ బీగువులు జమీనుకు దానపత్రం.

(చూ. అనుబం. పార్శిశాసనములు 29)

తెనుగు చెడిపోయినది.

మహామ్మదుఖాను మహామ్మదుమానుముకు ౧౦ బిగువులు జమీనుకు సాబకు పరవాణాబమోజీబుహుకుంచేసి తాఖీదు వ్రాసినది.

(చూ. అనుబం. పార్శిశాసనములు 30)

తెనుగు చెడిపోయినది.

మవుజె కొర్రపాడు గ్రామంలోనుండె యాదాపి వెంకట్రామాభట్లు తావున తాళేకుమీదనున్న దానపత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౪౭ అగునేటి విభవనామ సంవత్సర ఆషాఢ శు ౧౦ రాజశ్రీ రామేశ్వరం కర్తలైన స్థానికులు తిప్పజీల మొదలైనవారు శ్రీ మద్యజనాది షట్కర్మ నిరతులయిన యాదాపి నరసంభొట్ల అయ్యవార్లకు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసనపత్రిక ; శ్రీ రామేశ్వరులసాన్నిధ్యమందు మాన్యం కావలెనని అడిగితిరిగనుక స్థళం నిర్దేశంచేసి యిచ్చినవివరం: ఆచంగారి అయ్యవార్ల చక్రవర్తులవారి మాన్యం ౧-౨ యిద్దుం ఆ అంచునలోగా ప్రొద్దుటూరుపొలిమేర ఓరను దక్షిణం యిచ్చివుంటిమి. ఆ అంచున ౧-౨ యిద్దుం మీకు సర్వమాన్యం యిచ్చినాము. మీపుత్ర పౌత్ర పారంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఇందుకు సాక్షులు హరిహరాదులు; వీరల యెరుకను స్థానం వారి హస్తకుడు సూరపరాజు మల్లన్న వ్రాసినపత్రిక స్థానం వారి సం॥ తిప్ప జిలవ్రాలు.

వీరిదగ్గర నే మరియొక తాకేకుమీద వున్నది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౧౫ అగునేటి నందననామసంవత్సర వైశాఖ శుద్ధ 3 లు మహారాజరాజశ్రీ ఆచం రామిరెడ్డిఅయ్యగారు శ్రీమద్యజనాదిషట్కర్మనిరతులైన యాదాప్రి నరసంభొట్ల అయ్యవార్లకు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక. పుష్పగిరి మహాస్థళమందు రుద్రపాదం దగ్గెర మాకు మాన్యం కావలెనని అడిగితిరి గనుక అదేప్రకారం మాముఖాసాగ్రామం ప్రొద్దుటూరు పొలంలో బొల్లవరం పొలిమేరకు తూర్పున పొద్దుటూర త్రోవ ఉత్తరంచేనిస్థళం ౧౨ యిద్దుం, వడ్లవాడిమడికి దక్షిణం అంచు మడి ౧౨ యిద్దుంమడి సర్వమాన్యముగా యిచ్చినారం. మీ పుత్రపౌత్రపారంపర్యాయం ఆచంద్రార్కస్థాయిగా అనుభవించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఇందుకు సాక్షులు హరిహరాదులు; వీరల సమ్మతిని పొద్దుటూరు కరణం రావులూరు రామప్పయ్య వ్రాసిన పత్రిక రంగారెడ్డి అయ్యగారి సమ్మతిన రామిరెడ్డి అయ్యగారి వ్రాలు. శ్రీరామ.

మవుజే రామేశ్వరం కాపురస్థుడైన బ్రాహ్మడు గండికోట వెంకన్న తమ్ముడు తిమ్మప్పవద్దనున్న కాగద పత్రముల నకళ్లు

కౌలునామా శె॥ గండికోట నర్సన్న తాలూకు గంజిపేట చిదానంద నన్ను ౧౧౭౧ ఫసలి మాశె పొద్దుటూరిలో కానువాలా

షాన దావ్రూముఖానాగడగారి పేరిట ప్యాటకట్టిస్తూ వున్నాము. కౌలు యియ్యమని చెప్పుకుంటివి, గనుక అదే ప్రకారం నీకు కౌలు యిచ్చిన వివరం. కొత్తగావచ్చి యిండ్లుకట్టుకునే రైతులకు మూడు యేండ్ల పరియంతం పన్ను పనిలేకుండా సుంకం సౌదావగైరా హాసలు యేమి అయినా సగం యిచ్చేటట్టుగా కౌలు యిచ్చినాము. ఈ ప్రకారంగా నీవు రయితులకు కౌలు యిచ్చి పేట బస్తీ చేయించేది. ఇదిగాక తరుగు సంబంధం యేమివచ్చినా అర్ధాయం తీసుకుంటూవచ్చేది ; రుసుములు అర్ధాయం యిప్పిస్తూవచ్చేది ఇచ్చట మహారాష్ట్రభాషలో చేవ్రాలువ్రాసి యున్నది. మాదోభానుజీసూర్యప్రకాశరావు మజ్మూదారు.

హావాలుదారు వ కారుకూనాని వ దేశాయియాని వ స్థళ కరిణి యాని కిల్లెమా॥ గండికోటకు రాజశ్రీమాదోభానుజి సూర్యప్రకాశరావు మజుందారుగారు వ్రా॥ సు॥ స్న సమానిను అలఫ (1080) ఫుల్తావ ధాని గిరిశాస్త్రిలు వినిపించిరి. నాల్గుయేండ్ల క్రిందను అహమ్మదు బేగు వారు ముఖైవరహాలకు కొంచెంగాను పుట్టరాయనికాల్వస్థళం యిచ్చి యుండెను ; అందులో కొంత స్థళం...వేసినారు ; మరి నాల్గు తెగలవారికి కొంత స్వాస్థ్యంయిచ్చినాను ; కొంత తనకు అనుభవానకు వస్తుంది ; అందుకు అహమ్మద్దు బేగువారి కరణం ఆక్షేపణ చేస్తూయున్నాడు అని. అయితే మునుపు యేలాగు మరియాదచేసి నడిచినస్థళానకు మధ్యను కుచోద్యంచేసి ఆక్షేపణచేయను అహమ్మదు బేగువారి కరణం అందాజా యేమి ఉండెను ? ఈ జాబుకు ఆనఘరు మజకూరుకు తాకీదుచేసి పూర్వం యేలాగునడిచిందో ఆప్రకారాననే నిరాక్షేపముగాను యెల్ల ప్పటికి ఖలలు లేకుండా నడిపించేది, ఇందుల ఫిర్యాదు రానియ్యవద్దు, వీరిని రంజిసు చేయకుండానుచేసి సాలాబాదు తా॥ సాల్గుదస్తాకు నడచిన చొప్పున నడిపించేది. ఇచ్చట (మహారాష్ట్రభాషలో చేవ్రాలుగలదు.)

పొద్దుటూరులో మఠాలుకట్టుక యుండే జంగం అయ్యవార్ల తావుననున్న దానపత్రాలు చూచి నకలు వ్రాసినది. దావుతుఖానుని పేటలోనుండే మఠం జంగం వీరయ్య తావుననున్న దానపత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౩౦ అగునేటి కాళయుక్తినామ సంవత్సర ఆషాఢ శు॥ ౧౫ లు శ్రీమతు పొద్దుటూరు రెడ్డికరణాలు శ్రీమతు సజ్జన సిద్ధ శివాచారసంపన్నులైన రాచవీటి మఠం జ్యోతయ్య కుమారుడు వీరయ్యగారికి వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసనపత్రిక. మీరు మా గ్రామంలోను దావుతుఖానుని పేటలోను మఠం నిర్మాణం చేయించుకొని యుండి మాన్యం యిప్పించమని మందలించితిరి గనుక అందులకు మేము నలుగురము సమ్మతించి స్థళంనిర్దేశంచేసి యిచ్చిన వివరం: కట్ట క్రింద మడిస్థళంలోను దక్షిణపుతట్టున దొంపు ౧కి మాన్యం మడి ౭౨ యిద్దుం, కాడారంభం శేగటచామల బసవయ్య చేనులో స్థళం ౭౧ తూమెడు, ఉభయం మడి చేను ముత్తుం నీకు సర్వమాన్యముగాను యిచ్చినాము గనుక నీవు పుత్రపౌత్ర పారంపర్యాయం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక యుండవలెను ॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

రెడ్లు: వెంకటరెడ్డి వ్రాలు, వడ్లతల రామిరెడ్డి బసిరెడ్డి వెంకట రెడ్డి సమ్మతిన కరణం లింగరాజు వ్రాలు. కరణాలు: సీతారాముని వ్రాలు, పుల్లమరాజు వ్రాలు, రావులూరి అయ్యవారప్ప వ్రాలు.

పాతపేటలో వుండే మఠం చన్నమల్లప్ప కొమారుడు చన్న బసవప్ప దగ్గరనున్న దాన పత్రానకు నకలు:

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౯౬ అగునేటి జయనామ సంవత్సర కార్తిక శు॥ ౧౫ లు ప్రొద్దుటూరు మఠం మహాత్తుమఠం చన్నమల్లయ్య దేవరయ్యగారికి స్థళం పరస్థళం దేవర దేశం మహానాడుగారు సాంబశివునికి అర్పితముగా వ్రాయించి యిచ్చిన దాన పత్రం: రసవర్గం వక్కలు మిరియాలు దూది నూలు(?)నగలు ఉప్పుతండాలు భూసం వగయిరా దేశీలు గోనె ౧కి ౭౭ వీసం లెఖను రుసుం నిర్ణయం

చేసి యిప్పించినాము గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యాంతర ఆచంద్రా ర్కస్థాయిగా నడిపించగలవారము.

స్వదత్తా ద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

నూగురు దాసప్పఒప్పితం, చనవకసెట్టి హాళియప్ప వ్రాలు, చక్కెర వారి పయిరుదారుడు పట్ణంసెట్టి భట్టుకురికి సిద్ధప్ప వ్రాలు, జోవురిగె గంగప్ప వ్రాలు, వుప్పినను కందప్ప వ్రాలు, అడిక రాచప్ప వ్రాలు, నంబెళ్లో వ్రాలు, బళ్లారి కలియప్ప వ్రాలు, తోటపల్లె పొట్టి వ్రాలు, కంబణరాచోటి వ్రాలు,కసుభాశంభురెడ్డి సమ్మతి, కలివురద పేటతాణె బెంళ్లూరుకరణం లింగరాజు వ్రాలు, ఖెబ్బూబదరాచ్యు వ్రాలు, ఆకారపు బస్సెట్టి వ్రాలు, తిరుపతి వెంకటపతిగారి సమ్మతిన మిండగుద్దలి త్రిపురాంతకునివ్రాలు, రావులూరి లింగరాజు వ్రాలు, తోటపల్లె సావణ్ణ వ్రాలు, ఆచంశంభురెడ్డి వ్రాలు, గారుసెట్టి పాపన్న వ్రాలు, వడ్లతల కొండారెడ్డి సం॥, అరగంసెట్టి మల్లయ వ్రాలు, రావులూరి చలం వ్రాలు, భీమసెట్టి రామయ వ్రాలు, రావులూరి సీతా రాముని వ్రాలు, నలమల్లు చలం వ్రాలు, ఆకుల మల్లయ వ్రాలు, అణవరద రాచళ్ల వ్రాలు, మల్లెల ఓబయ వ్రాలు, దుగ్గాణి చన్నప్ప వ్రాలు, పాలూరు చిన్నదాసు వ్రాలు, జవ్వాజి పరదేశి వ్రాలు, కొల్బు కొండయ వ్రాలు, యుగటిరేవణసిద్దప్ప ఒప్పితం, హావేలిపసారద చన్న వీరప్ప వ్రాలు.

దుర్ముఖి సం॥ మాఘ శు। ౫ లు యీా సప్పగారి రేవణ సిద్ధప్ప గారి గుమస్తా వీరభద్రప్ప యిచ్చినది ౧౧౪, కంపిలిదాసప్పమగ గురు బసప్ప ఒప్పితం, కదెకోళ్లదపాడు బండ్లయంగన్న ఒప్పితం, కమలాపురం మణెగాడు హరిపురం వెంకప్ప వ్రాలు, ప్రొద్దుటూరు వెంపల్లె బొర్రయ గారి వెంకటరెడ్డి సమ్మతిన సీతారాముని వ్రాలు.

శ్రోత్రియందారులు దువ్వూరు పరగణాలో చెల్లే శ్రోత్రియం నంగ నూరుపల్లె గ్రామానకు బాధ్యులయిన శ్రోత్రియందారులు క్రిష్ణపాటి సుబ్బన సోమయాజులవారున్ను తధాకృష్ణంభట్లువారున్ను తమ తావున వున్న దానపత్రం తీసుకవచ్చి నకలు వ్రాయించినది.

స్వస్తిశ్రీ శాలివాహన శక ౧౭౩౩ అగు నేటి ప్రజోత్పత్తినామ నామ సం॥ ఆషాఢ శు। ౨ స్థిరవారం తమ కరణం విరూరినర్సుచేతను వ్రాయించినది.

నంగనూరు పల్లె శ్రోత్రియం దానపత్రం అసలులో ప్ర॥ అలంప నహా.........అక్కరసు భానుజీ పంతులవారు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౦౮ అగు నేటి దుందుభినామ సంవత్సర మాఘ శు॥ ౫ లు శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులయిన క్రిష్ణపాటి అప్పకొండు సోమయాజుల వారికి రాజశ్రీ లింగోజీ సంగరసు పంతులవారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక. దువ్వూరు పరగణాలోను నంగలూరు పల్లె గ్రామం మీాకు మిరా సైదుమాలు శేను నాటనుంచి తోంభై వరహాలకు నడుస్తూ ఉండగా మహారాజశ్రీ ..గారి సెలవుప్రకారం ఆలిహాజరతి...గారికి పుణ్యము గాను నంగలూరిపల్లె బేరీజులో ముప్హై వరహాలు తీసివేసి అరున్నై వర హాలుకు నిర్ణయించేసి శ్రోత్రియము వ్రాసి యిస్తిమి గనుక పల్లె ఫల పరచుకొని మీా పుత్రపౌత్రపారంపరియంతరం ఆచంద్రార్కస్థాయిగాను సుఖానను అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౦౦ అగు నేటి హేవళంబినామ సంవత్సర మాఘ శు। ౧౫లు శ్రీమద్యజ నాది షట్కర్మ నిరతులయిన క్రిష్టిపాటి సుబ్బాభట్లగారికి కంచనపల్లె రామచంద్ర రామాజిగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ భూదాన

ధర్మశాసన పత్రిక. పూర్వం దువ్వూరి సీమలో నంగలూరిపల్లె మీ పెద్దలనాటనుంచి శ్రోత్రియం నడుస్తూ ఉండి మధ్యే ఖిలపడియుండగా యథాప్రకారం మా గ్రామం మాకు యిప్పించమని మనవి చేసుకుంటిరి గనుక అదే ప్రకారం సమ్మతించి పూర్వం నడుస్తూ ఉన్న ప్రకారం పంద్రామోడి హొన్నులు ౧౦౧ నూటవక్క వరహాలకు శ్రోత్రియం నిర్ణయంచేసి యిస్తిమి గనుక మీ గ్రామం విస్తారంగా కిర్దుచేసుకుని సర్కారు పయికం సర్కారుకు చెల్లిస్తూ మీ పుత్ర పౌత్ర పారంపర్యాయం అనుభవించుక సుఖాన నుండేది.

మౌజె మణియరాంపల్లెలో బాలానాథుగారి దగ్గరనున్న కాగిత పత్రాలయొక్క నకళ్లు.

వర్తమాన వ్యవహారిక శాలివాహన శకవరుషంబులు ౧౬౩౭ హేవళంబినామసంవత్సర వైశాఖ శు ౧౫ లు రాజశ్రీ మణెరాంమిశ్రా గారికి దువ్వూరిపరగణాలో చెల్లే గుడిపాటిసముతు రెడ్డికరణాలు వ్రాసి యిచ్చిన పల్లెకట్టుమిరాసిస్వాస్త్యపుపట్టా. మా సముతులో భూమిరెడ్డిపల్లె గ్రామము బహుదినములనుంచి ఖిలపడి పొలంబీడుగ ఉండెగనుక ఆ స్థల మందు రామాపురం అనేపేరుపెట్టించి పల్లె కట్టించుమని చెప్పితిమి గనుక అందులకు మీరుసమ్మతించి పల్లెకట్టిస్తిరి గనుక ఆ పల్లెకు పొలంహద్దులు నిర్ణయంచేసినవివరం: పల్లెకు పూర్వము హద్దులు, తూర్పున చల్లబసువయ పల్లె పొలిమేర అంచుబోడయకుంటహద్దు, దక్షిణానకుగుడిపాడి చెన్న కేశవపెరుమాళ్లస్వామిమాన్యం ఉప్పలూరివారిమాన్యం గుడిపాటి ఖసుబా పొలిమేరహద్దు, పడమరరాజుపాళెము పొలిమేరకు కోమటివాని కుంటలో కరిణీకమాన్యముకొండహద్దు,ఉత్తరానకుసింగనపల్లెపొలిమేరకు వద్ది మానుపడియ హద్దుచేసి తురుకలమాన్యాలుహద్దు ఈ ప్రకారం చతుస్సీమహద్దులలోను పల్లె ఆయకట్టు పొలము ఖ ౩౻౦।౦ కి యిందుకు పూర్వానసున్న మాన్యాలు దోవడొంకలు ఖ ౧౻౧।౦ గాక నిలిచిన పొలము ఖ ౧॥ ౪ కి గ్రామనెత్తానకు మాన్యంబావి పడమరచేను ౧౩ బావిమాన్యపుచేను ౧౨ ఉభయంచేను ఖ ౦।౦ గాక నిలిచినపొలము

నగిరిది ఖ ౧౫౪ కి యీ వ్రాసిన సంవత్సరము మొదలుకొని దివాణము బేరీజులు రుసుములు బాజాఖర్చులు దేఖీలుగాను హేవళంబిసంవత్సరానకు హొన్నులు ౩౯౮౭ విళంబిసంవత్సరానకు హొన్నులు ౩౬౫౩, శార్వరిసంవత్సరానకు హొన్నులు ౩౬౫౩, ప్లవసంవత్సరానకు హొన్నులు ఖ ౩౬౫౩, శుభకృతుసంవత్సరానకు హొన్నులు ౪౪౫౭౯ శోభకృతు సంవత్సరానకు హొన్నులు ౪౪౫౭౯ ఈ ప్రకారం యేడేండ్లు ఆవల కిర్దుచేసుకుని ప్రతిసంవత్సరము పైకముచెల్లిస్తూవచ్చేది. అటుతర్వాతను క్రోధినామసంవత్సము మొదలుకొని దివాణము బేరీజు బాజాఖర్చు రుసుములు దేఖిలుగాను యేడు ౧కి హొన్నులు ౬౨౮౦ వరహాల చొప్పున నిర్ణయము చేసి యిచ్చినాము. విస్తారంగా పల్లెకిర్దు ఆబాదాను చేయించి యీ చొప్పున ప్రతి సంవత్సరము పైకంచెల్లిస్తూ మీ పుత్ర పౌత్ర పారంపర్యముగా మిరాసిగా అనుభవిస్తూ వచ్చేది. రెడ్లు . రాచుమల్ల చింపిరిరెడ్డి, గోపిరెడ్డి బాబయ సమ్మతిన కరణం స్వహస్తం పుల్లయ వ్రాలు, రామన్న వ్రాలు, చెన్నమరాజు వ్రాలు, చినవెంకట వ్రాలు శేషయ్య వ్రాలు. దస్కతు వెంకట్రావుదాసో గుమాస్తా నాడగాడు పరగణే మజుకూరు, దస్కతు వెంకట్రావు శ్రీనివాసు, గుమాస్తా దేశముఖు పరగణె మజుకూరు.

3 దస్కతు ఖజాంజికుర(?)రు గుమాస్తె కానుగో దస్కతు కృష్ణాజీపూ. చూడు గుమాస్తె సరమజుందారు పరగణెమజుకూరు గొహి(?)

పారషీమతలబు :

మహమ్మదు జమాలుఖాను పౌజుదారుగారు సన్న ౧౧౨౬ పసలి ౪. ౬౨ కి కౌలు. దీని కింద తెనుగు.

కౌలునామా బెస్మ మణెరాంమిశ్రాగారికి వ్రాయించి యిచ్చిన కౌలు ఖరారు. మజిరె భూమిరెడ్డిపల్లె సివారె మౌంజె గుడిపాడు పరగణె దువ్వూరు సర్కారు సిద్ధవటము తాలూకు కర్ణాటకు మూజాభు సుబె ఫరుకొందు హైదరాబాదు. మీకు మౌంజె గుడిపాటిరెడ్డి కరణాలు

కౌలు వ్రాసి యిచ్చిన ప్రకారం మజరె మజుకూరు బహుదినములు బేచరాకు అయి పౌలం అంతా పాండవ బీడుపడి యుండంగాను వొచ్చే పొయ్యే మార్గస్థుల దుడుకుదుర్జసము చేత ఖరాబు అయియుండంగాను అదినిమిత్తము మజిరెమజెకూరు నూతనంగా రయితులు తెచ్చి కుదిర్చి బస్తిచేసేటందుకు మీాకు కౌలు యిచ్చిన వివరము. మజిరె మజుకూరు పౌలము పూర్వము ఆయకట్టు ఖండీలు ఖ ౬౫౦।౦ అక్షరాలా మూడు పుట్లు పందుమునాలుగుముంతలు. అందుకు పొలిమేర సిర్ణయము తూర్పు పొలిమేర హద్దు చల్లా బసవయపల్లె, దక్షిణానకు పొలిమేర గుడిపాడు, పడమట పొలిమేర రాజుపాళెం పొలిమేర, ఉత్తరము పొలిమేర హద్దు చినసింగనపల్లె పొలిమేర. ఈ ప్రకారము పొలిమేర నిర్ణయము అయి యున్నది గనుక సదరహీ ఆయకట్టు పౌలములోను ఖదిం యినాములు వాగువంకలకు పోయినది ఖ ౧౫౧।౦ మిగిలిన పౌలము ఖ ౧౪౮౯౦ యిందులోను పల్లె కట్టేటందుకు మాన్యము ౯౩, బావిమాన్యం సమ్మంధం ౯౨ కూడా ఖ ౦।౦ పౌలంగాక నిలిచిన పౌలం ఖ ౧౪౮ ఇందుకు యీా పౌలంహాసీలు నిర్ణయం చేసిన వివరం: స్న ౧౧౨౨ ఫసలీ రుసుములు సా॥ అబవాఖు దేఖీలు బేరీజుహాన్నులు ౩౭౯౬, సన్న ౧౧౨౮ ఫసలీ తాగాయతు సన్న ౧౧౩౧ ఫసలీ కె(?)సాలు మదత్తు నాల్గుయేండ్లకు హరసాలు బేరీజుహాన్నులు ౩౯౪౩ చొప్పున యిస్తకబోలు సన్న ౧౧౩౨ సా॥ తాగాయతు సన్న ౧౧౩౩ ఫసలీ సాలుమద్దత్తు రెండు యేండ్లకు సాలు ౧ కి బేరీజుహాన్నులు ౮౮౪౬౹ నల్భైనాలుగు వరహాలు మూడ ఆరురూకలు ముప్పాతిక చొప్పున యిస్తకబోలు సన్న ౧౧౩౮ సాలునుండి చా(సా)లీన హాన్నులు ౬౨౯౦ లు చొప్పున రుసుములు అబవాబు దేఖీలు బిలుమక్తాగాను మొకరరు చేసినారము. ఖాతరుజమతోను మజిరె మజుకూరు రైతుల దెచ్చి కుదిర్చి విస్తారంగా సాగుబడి సంతనలు చేయించి గ్రామం ఆబాదానిచేయించుక యీా సదరహీ బేరీజు ప్రకారము సాలుబసాలు అమీాలానహాలు వ యిస్తకషాలు వశాన చెల్లిస్తూ వచ్చేది. ఇటని వ్రాయించి యిచ్చిన మిరాసి కౌలు సహీ(వా?)చందు ౧౬ జమాదస్సాని సనా రుజాలూానులాలా ॥

కవులునామా బ యిస మె యీశ్వరనామసంవత్సర ఆషాఢ శు ౭ రాజశ్రీ కృష్ణకొమారు తాలూకా మణేరాంసావుకారిగారికి శ్రీ॥ బాల వెంకటరెడ్డి ఆపరగణె దువ్వూరు వగై రాగారు వ్రాయించియిచ్చినకవులు. సన్న ౧౧౬౭ ఫసలీ మాంజె గుడిపాటిలో శ్రోత్రియం మణియరాంపల్లె సుదామదు దానపత్ర ప్రకారం సెలవుయిచ్చినారము. గ్రామం సాగుబడి విస్తారంగా చేసుకుని సర్కారుయాకలు ముక్కుందాయ ప్రాప్తిన చెల్లించి సుఖానసుండేది గాన తెలిసేది.

కవులునామా సర్వజితు నామసంవత్సర కార్తీక శు౹ ౧౦ లు మణేరాం మిశ్రాసావుకారికొమారుడు కృష్ణకొమారుకు అల్లీసాహేబు ఆ॥ ప॥ దువ్వూరుగారు వ్రాసియిచ్చినకవులు. సన్న ౧౧౭౬ ఫసలీ గుడి పాటి సముతులో మజరా మణెరాంపల్లె మీకు పూర్వోత్తరం హణాన్నలు ౬౫౦ అరువై అయిదు వరహాలకు నడుస్తూవచ్చినది గనుక ఆప్రకారం సాలీన యిచ్చి సాలు బసాలు అనుభవిస్తూవచ్చేది.

నవాబు అబ్దుల హాలీమఖానమయాణాగారి అమలమోరు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౩౭ అగునేటి మన్మధనామసంవత్సర ఫాల్గుణ శు ౧౨ లు మీర్జా మహమ్మదు ఆమీను వ భాగరథిరావు సరి మజుందారు మహాల్లాతు సిబ్బంది బాలా ఘాటల(వ)మణెరాంసావుకారు కృష్ణాజిరు పూర్ణబోధు వ కొమ్మరాజువెంకన్న వ చట్టిరామన్న వ కుంచగ్గిజోగె వ మణులూరు వెంకటనరుసు వ చింపిరెడ్డి కరణాలు చిన్నమరాజురామయ పుల్లయ గారికి రెడ్డికులకర్ణియ్యాని మ॥ గుడిపాడు ప॥ దువ్వూరు సర్కారు సిద్ధ వటం తాలూకుకర్ణాటకు ముజాపు సుబే పరఖందు బునియాదు హైదరా బాదు మర్హాజాగీరు సిబ్బంది బాలా ఘాటు వ్రాయించియిచ్చిన వివరము చెరువుదసమందం కవులు. మ॥ మజుకూరిలోను కొత్తగా చెరువుకట్టించే టందుకు మీకు కౌలు యిచ్చిన వివరము. చెరువు క్రిందకొత్తగా యెంత అచ్చుకట్టు మడి తేలుతున్నదో ఆ మడిలో రెండుపాళ్లు మడి దివాణానకు ఒక పాలుమడి దస మంద్దం కవులుకు దసమంద్దం నిర్ణయంచేసినాము(?)

మీారు మీామీా పాళ్లుచొప్పున దసమంద్దం మీా పుత్రపౌత్రపారం పర్యంతం ఆచంద్రార్కస్థాయిగా ఫలపరుచుకొని సుఖాన అనుభవిస్తూ వచ్చేది. దసమంద్దం పదహారు వీసాలకు తఫిసీలు.

మీార్జా మహమ్మదు ఆమీానువారి పాలికి పాతిక వీసంపాలు ౧౦।

భాగీరథిరావు శేషాద్రి సరిమజుందారు బాలాఘాటుగారికి ౧౦।- పాతికె వీసము పాలు, కృష్ణాజీపూర్ణ బోధంవారికి ని—వీసం పాలు, మణెరాంసావుకారుగారికి వి—వీసం పాలు, కుంచన్నజోగికి వి—వీసం పాలు, కొమ్మరాజు వెంకన్నగారికి వి—౺ అరవీసంపాలు, చట్టి రామన్న గారికి వి—౺అరవీసముపాలు, మణూరు వెంకట నరుసుకు వి—౺ అర వీసంపాలు కరణాలు, చిన్నమరాజు రామన్న పుల్లమరాజు గార్కి వి ౺ అరవీసము పాలు.

ఈ ప్రకారంగాను పదహారు వీసాలవారు దసమంద్దం అనుభవించు కుంటూా సుఖానసుండేది. రాచమల్లుచింపిరెడ్డి గోపిరెడ్డి వ్యాయ(?)గారి సమ్మతిన కరణం పుల్లమరాజు వ్రాసిన దసమంధం కవులు. చిన్నమరాజు వ్రాలు, రామన్న వ్రాలు, చినవెంకటవ్రాలు, శేషయవ్రాలు.

కౌలునామా రాజశ్రీ మణియరాం మిశ్రాగారికి భాగీరథి రావు శేషాద్రి, సరిమజుందారు బాలాఘాటు వ నాడ గౌడు అమీాలు, పరగణె దువ్వూరుగారు వ్రాసియిచ్చిన పల్లెకట్టు కౌలుపట్టా, సన్న సబాఅ శరుమయూా వ అలుపు. మవుజే గుడిపాటి సముతులో చెల్లే భూమి రెడ్డిపల్లె తమాముపాడు అయియుండంగా మ॥ మజుకూరురెడ్డి కరణాలు ఆ పల్లె కట్టించుమని స్వాస్త్యం యిస్తే మీారు రామాపురం అనే పల్లె కట్టిస్తిరి, గనుక దివాణంబేరీజు రుసుములు బాజె ఖర్చు దేశీలు సకల సువర్ణ ఆదాయం సహా మక్తాగా కౌలులో వ్రాసిన వివరము.

హేవళంబి సంవత్సరానకు ౩౫౧౬ విళంబి సంవత్సరానకు ౩౯౺౩, వికారి సంవత్సరానకు ౩౯౺౩ శార్వరి సంవత్సరానకు ౩౯౺౩, ప్లవ సంవత్సరానకు ౩౯౺౩ శుభకృతు సంవత్సరానకు ౪౪౺౬౻, శోభకృతు సంవత్సరానకు ౪౪౺౬౻.

ఈ ప్రకారం యేడుయేండ్లు అయిన తర్వాత క్రోధి సంవత్సరం మొదలుకొని బేరీజు రుసుములు బాజెఖర్చుసహా సకల సువర్ణాదాయం దేశీలు మక్తాగాను యేడు ౧ కి హొన్నులు ౬౨౧౦ అరువై రెండు వరహాల చొప్పున నడిపించేటట్టు మొకరరు చేసినారము; గనుక ఆ ప్రకారము మేము స్వాస్త్యం నడిపించగలవారము, కాబట్టి పల్లెకట్టించి ప్రజల కుదిరించి తమాము పొలము కిర్దుమామూరు ఆబాదాను చేసుకొని మీా పుత్రపౌత్ర పారంపర్యం ఫలపరుచుకొని సదరు బేరీజు పయికం సాలు బసాలు చెల్లిస్తూ సుఖానఉండేది.

హేవళంబినామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు చందు ౧౩, జమాదిలవ్వాలు, స్న ౧౧౨౬ ఫసలీ. భాగీరథిరావు శేషాద్రి మొహరు.

సూర్యుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౩౭ అగు నేటి మన్మథనామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౫ లు రాజశ్రీ మణియ రాంమిశ్రాసావుకారుగారికి గుడిపాటిరెడ్డి కరణాలు వ్రాసియిచ్చిన ఖరీదు కాగిదము. గుడిపాటి సముతులో మీారు రామాపురం అనే గ్రామం కట్టించి అక్కడ బావి త్రొవ్వించి వనంవేయించ్చే నిమిత్తం క్రయానకు పొలం అడిగితిరి గనుక ఆ బావికి తూర్పు పడమర చేను ౧౧ తూమెడు ఖరీదు నిర్ణయం గ ౫౧౦ అయిదు వరహాలకు యిచ్చినాము. ఆ స్థళమందు మీారు వనము వేయించి బావి త్రొవ్వించి విస్తారంగా ధర్మం చేకూర్చుకొని మీాపుత్రపౌత్రపారంపర్యంగా ఆ చంద్రార్కస్థాయిగాను ధర్మాభివృద్ధి చేయిస్తూవచ్చేది. ఇది మాస్వరుచిన(?) వ్రాసియిచ్చిన భూమి క్రయశుద్ధి కాగితము. రెడ్ల సమ్మతిన స్వహస్తము.

పుల్లమరాజు వ్రాసిన వ్రాలు, రామన్న వ్రాలు, చిన్నమరాజు వ్రాలు, శేషయ వ్రాలు, దువ్వూరి కరణం వెంకట సాక్షివ్రాలు, పెణ్ణిపాటి గురువరాజు సాక్షివ్రాలు, కామనూరి సుబ్బయ్య సాక్షివ్రాలు, సెట్టిపల్లె గురుమూర్తి సాక్షివ్రాలు.

మౌజె గొల్లంపల్లె శ్రోత్రియదార్లు వెల్లాల ఓబుళుశాస్త్రిబవారి దగ్గిర నున్న కాగిదపత్రాలు పరవానా బ మొహరు నవాబు మీారు ములక్కు.

పారసీ సన్నదు.*

ఇందుకింద తెనుగు.

ఆమీానిమాలు యిస్తకబాలు పరగణే దువ్వూరు, సర్కారు సిద్ధవట్టం రిచిదానదకె(?) సన్నుతిస్నా తిరైన అలవు వెల్లాల. ఓబుళు శివ రాముడు దరమజరె గొల్లపల్లె, మౌంజె గుడిపాడు, మౌంజె మజుకూరులో స్వయంకృషిగా వ్యవసాయం చేసుకుంటూ ఉన్నారు గనుక, బహు దినాలనుంచి సాలీనా అబవాబులు దేశీలుగా యిరువై యొక్క వరహాకు నడుస్తూయుండె గనుక, మేమున్ను అదే ప్రకారం సాలుబసాలు హమేశా నడిపించే అట్టు సెలవు యిచ్చినాము. సదరహీ బేరీజు ప్రకారము పుచ్చు కొని గ్రామంవారి వశాన ఉంచి నడిపిస్తూవచ్చేది. ఇందుకు ముజాహిం చేయక హమేశా నడపిస్తూవచ్చేది. చందు ౨౧, మాహె మ.్వాలు. సన్ను ౪౩ జులూసులాలా॥ రుజావు రస్నకదు కానుగో.

తా॥ మొకద్దమా వో రయ్యానీ కులకరణీమ్యానీ గుడిపాడు పరగణె దువ్వూరుకు, రాజశ్రీ రంగోరఘునాథ ఆమీాలు మకల్లాత సర్కారు సిద్ధవటముగారు ఆశీర్వాదము. మ్యానలవు మౌ॥ గొల్లపల్లె దాఖలా మౌ॥ మజుకూరు. వెల్లాల ఓబుళుశివరాముడురామునిగారికి స్వయం కృషిగా బహుకాలాలనుంచి అబవాబులు దేశీలుగాను యిరువై వొక్క వరహాకు శ్రోత్రియంనడుస్తూయున్నదని వజారతు పనహా సుందర దాసు దివానుగారు సాజకుచొప్పునను, కరారుపరవానా సెలవు యిచ్చి నారు. గనుక మేమున్ను ఆప్రకారముగానే బాదు బమోజీ పరవానా చొప్పున సదరహీ యిరువై వొక్క వరహాకు అబవాబు దేశీలు నిర్ణయము

*. The text Persian is not given in the Manuscript.

చేసి సెలవు యిచ్చినాము. నిరాచ్ఛేదనగా నడిపించేది. నకలు తీసుకొని అసలు తిరుగా యిచ్చేది.

దస్కతు గుమాస్తా కానుగో.

సూర్యుడు.

౩. ౧౮౩. రాజశ్రీ అక్కరసుభానుజీపంతులుగారు ఫాలతహ నాప యిబ్బతు దస్తుగాహ మమ్మసాదిక్కు కడప బాఫీయ్యతు ఖాపందు. సు॥ సన్న యిసవె సమానినో అలవు. శ్రీమద్య జనాదిషట్కర్మ నిరతులయిన వెల్లాల ఓబుళు తిమ్మప్ప వెంకటగారికి, దువ్వూరి సీమలోను గొల్లపల్లె అనే గ్రామం శ్రోత్రియము నడుస్తా యుండగాను యిపుడు అది అమాత్తం చేసుకొని జాస్తీపైకం తెమ్మన్నా రట. సాలాబాదు తాగాయతి సాలుగుదస్తా నడిచినందుకు యిస్సక్కీలు చేసే అందుకు యేమిమానాయున్నది అటు గనుక సాల్గుదస్తావరకు నడి పించిన చొప్పున శ్రోత్రియము నడిపించి జాస్తీ పుచ్చుకున్న పయికం తిరిగి యిచ్చేది. ఇందునిమిత్తము రా॥ మొకరరు లుబాశీగారు రోఖా సాదీలు చేసినారు. ఆ చొప్పున నడిపించేది. ఇందుల ఫిర్యాదు రానియ్య పని లేదు. రోఖాతాలీకు వ్రాసుకొని అసలుతిరుగా యిచ్చేది. చందు ౯, జమాది లవ్వలు సన్న.........

రాజశ్రీ మాదోభానుజీ మజుందారు.

ఈ సన్నదు కాగిదం శిథిలమై పోయినది.

౪. సన్నదు మయూణానవాబు కడప అబ్దులునబీఖాను దరసాలు శ్రోత్రియంపంద్రామోడీని గ॥ ౧౦౦ వరహాలకు నడిపించమని వ్రాసినారు.

సన్న ౧౧౪౭ హాజరి.

ఫారషీ*

* The text Persian is not given in the Manuscript

ఈ తరువాయను ఆరెము. (మరాటీ)*

మౌజె గుడిపాడు మజరా వెంకన్నపల్లెలోవుండే బావి దస వందము యినాముదారు ముంతల చలమన్న దగ్గరనున్న దానపత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౫ అగునేటి ఆనందనామ సంవత్సరం శ్రావణ బ॥ ౫ లు ముంతల చలమన్నకు వెంకన్నగారు వ్రాయించి యిచ్చిన బావి దసవందము. ఖుషికి గళ్లు యల్లయ విడదలచేను ౧౦౪౦ యిస్తిమి గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యంతం ఆ చంద్రార్కస్థాయిగాను అనుభవించుకొనేది.

శ్రీ వెంకటేశా.

మౌంజె చల్లబస్వయపల్లె శ్రోత్రియదారు కైప శ్రీ నృసింహులు వారి వద్దనున్న కాగిత పత్రముల నకళ్లు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౩౩ అగునేటి వికృతినామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన కైప నరసన్నగారికి, రాజశ్రీ రామదాసు తిమ్మారసు తర్ఫుదారుడు మహాల్లాతిహాయగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రిక. ప॥ దువ్వూరి సీమలో చెల్లె గుడిపాటి సముతులో మజురా చల్లబసవయపల్లె మీకు శ్రోత్రియం సకలసువర్ణాదాయాలు రుసుములు బాజేఖర్చులు సర్వం మఖ్తాగాను హొన్నులు ౫౨౧౦ యాబై వరహాలకు శ్రోత్రియం నిర్ణయంచేసి సెలువు యిచ్చినారం. సాలుబస్సాలు యీ నిర్ణయం జేసినప్రకారం సర్కారుకు రుసుములు బాజెఖర్చులు దేఖలు యాబైవరహాలు చెల్లించి విశేషంగా ఆ గ్రామంనుండి యేమి వచ్చినా మీ పుత్రపౌత్ర పారంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవిస్తూ ఉండేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాప హారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౩౩ అగునేటి వికృతినామ సంవత్సరం జ్యేష శు॥ ౧౫ లు శ్రీ ఘద్యజనాది షట్కర్మనిరతులయిన కైప నరసన్నగారికి గుడిపాటి రెడ్డికరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రిక. మహారాజరాజశ్రీ రామదాసు పంతులవారు మా సముతులోను గ్రామగ్రాసపల్లె చల్లబసవయపల్లె గ్రామం మీకు శ్రోత్రియం నిర్ణయంచేసి దాన పత్రం యిచ్చి మమ్ముల దానపత్రం వ్రాసి యిమ్మని సెలవుయిచ్చిరి, గనుక ఆప్రకారంగానె ఆ పల్లెకు బేరీజు నిర్ణయం హూన్నులు ౫౦౧౦ వరహాలకు సర్వమాన్యాగా రుసుములు బాజేఖర్చు దేశిలుగా హూన్నులు ౫౦ వరహాలకు దానపత్రం వ్రాసి యిచ్చిరి, గనుక మేము అదేప్రకారంగాను వ్రాసి యిస్తిమి, గనుక యీ పయికం దివాణానకు చెల్లించుకొని విశేషం ఖేమి ఉన్నా మీరు అనుభవించుకొనేది. మీ పుత్రపౌత్ర పారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొనేది. యీ పల్లెకు ఆయకట్టు నాలుగుతట్ల పొలిమేరకు లోగాను దేవబ్రాహ్మణమాన్యాలు కరిణీకమాన్యాలు అయగాండ్లమాన్యాలు దేశిలుగాను చాలాబాదు ప్రకారం నడిపించి సుఖాన అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

రెడ్లు॥ తిమ్మారెడ్డి చింపిరిరెడ్డిగారి సమ్మతిని కరణం రామన్న వ్రాసిన దానపత్రం॥ చిన్నమరాజు వ్రాలు, వెంకట వ్రాలు, పుల్లయ వ్రాలు.

నవాబు హాలీముఖాను వ్రాసిన పరవానా మా మూలుప్రకారము గాను హూన్నులు ౫౦ కి నడిపించుకొమ్మని వ్రాసినది. చ ౭, మాహె

రజబు ౧౧౮౦ హిజరి, సన్న ౧౧౭౬ ఫసలీ. ఇచ్చట ఫారషీ వ్రాసి యున్నది*।

సన్నదు నవాబు అబ్దులు నబీఖాను సన్న ౧౧౭౮ హిజరి సన్న ౧౧౭౦ ఫసలి.

ఇచ్చట ఫారసీ వ్రాసియున్నది.*।

మాంజె భల్లికెవారిపల్లె శ్రోత్రియందార్లు హయగ్రీవాచార్యులు వద్దనున్న కాగితపత్ర నకళ్లు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౫ అగునేటి శ్రీముఖనామ సంవత్సర జ్యేష్ఠ శు। ౧౫ లు, భల్లికె శేషాచార్యుల కొమాళ్లు నరసింహాచార్లు కృష్ణమాచార్లువారికి వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక. సన్ను ౧౧౬౩ ఫసలీ దువ్వూరి సీమలో చెల్లె కామనూరు సముతులో పొలములో పల్లె కట్టించేము, శ్రోత్రియం కావలెనని చెప్పుకుంటిరి, గనుక అదే ప్రకారం ఖానువాలె శాన ఖానె అజం పౌంజారుఖాను మహమ్మజ్మె సాహెబులవారికి ప్రీతిగాను హాజరతు గారికి సుకృతంగాను యఱ్ఱబల్లె దోవ పడమట యెండ్లబీడు మయిదుకూరు ఘడప్రకారం ౯౧, కోనూరుకుంటల పాప్తిని ఖ ౧౪౦ కి యినాములు గ్రామనెత్తానకు ౯౧, బావిమాన్యానకు ౯౨, మీకు సర్వమాన్యం ౯౮, కరిణీకమాన్యం ౯౨, లాజాతులవారికి ౯౧, జుములాయినాము ఖ ౦౪ గాక నిలిచినపొలం ఖ ౧ కి బీటిగుత్త ౯౧ కి హొన్నులు గం. ౪ లెక్కను సాగిన పొలానకు యీ సంవత్సర మారభ్యం యేడు సంవత్సరాలకు నిర్ణయంచేసి యిచ్చినాము. ఈ యేడు సంవత్సరాల లోను పొలం కిర్దు చేసి రయితుల కుదిర్చి పల్లెకట్టించి యెనిమిదో సంవత్సర మారభ్యం రుసుములు బాజేఖర్చులు సర్వంముక్తాగాను సాలీనా బేరీజు పంద్రామోడి గ। ౨౦౯౦ లకు మొకరరు చేసి యిచ్చినాము. సాలుబసాలు ముక్కుందాయ ప్రాప్తిన సర్కారుకు రూకలు చెల్లించుకుంటూ ఖాతరజమాతో పల్లె అబాదాను చేసుకుని మీ పుత్రపౌత్రపారంపర్యంతం

అనుభవించుకుంటూ వచ్చేది. ఈ సదరహి పొలానకు నరసింహాచార్ల వారికి సగం యీ ప్రకారం అనుభవించుకుంటూ యుండేది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౫ అగునేటి శ్రీముఖనామ సంవత్సర ఆషాఢ శు౹ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులయిన మధ్వశాస్త్రసంపన్నులైన హారితసగోత్రోద్భవులయిన భళ్లికె శేషాచార్యులవారి పుత్రులయిన నృసింహాచార్యుల గారికి ఆ కృష్ణమాచార్యులవారికి కామనూరి రెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియగ్రామ దానపత్రిక. మీరు గ్రామంలో శ్రోత్రియం గ్రామానకు పొలం కావలెనని అడిగితిరి, గనుక అదేప్రకారం పొ...న్కు యిచ్చిన వివరం. ఉత్తరం నేలటూరి పొలిమేర హద్దు, తూర్పు మెత్ర బల్లెనుంచి దువ్వూరికి పొయ్యేదోవ హద్దు, పశ్చిమం గార్ల వానిచేను హద్దు, దక్షిణం యీ...ఈ చతుస్సీమ మధ్యమందు లోగావున్న పొలం యెండ్లబీడు ఖ ౧౪కి మీ కిద్దరికి సర్వమాన్యంగాను యిచ్చినది చేను ౦౨, నూతిమాన్యం ౦౨, కరణాలకు మాన్యం ౦౨, గ్రామనెత్తం ౦౧, చిల్లర ౦౧, ఉభయం పొలం ఖ ౪౦ గాకనిల్చిన పొలం ఖ ౧ కి బీటి గుత్తలోకి ౫ ౪ లెఖ రొఖం ౫ ౧౦౦౦ ల్కు యేడు సంవత్సరాలకు నడపగలవారము ఎనిమిదో సంవత్సరం తాగాయతి ౦౧ కి ౫ ౧౦ లెక్క ౫ ౨౦ ల్కు రుసములు దేశీలు సర్వమక్తాగాను యీతధాతిథి పుణ్య కాలమందు కృష్ణార్పణముగా యిచ్చినాము. గనుక అక్కడ పల్లెకట్టుక రయితుల కుదిరించుక పొలంబీడు మీకు చెప్పిన ఖ ౧౪ పొలానకు లోతక్కువ చూపితిమి గనుక సుఖాన అనుభవించేది. పొలం బీడు చిక్క కుండా సాగుబడిచేసుక ముక్కందాయం ప్రాప్తి రూకలు చెల్లించుక మీ పుత్రపౌత్ర పారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగా సుఖానసుండేది. ఈ సంవత్సర మారభ్యం యేడుయేండ్లపరియంతం తెగుబడి అయిన పొలానకు ౦౧ కి ౫౪ లెక్కతీసుకోగలవారము. ఈ పొలంలో నృసింహాచార్యులవారికి సగం కృష్ణమాచార్యులవారి అన్నదమ్ములకు సగం ఈ లాగుగా అనుభవించుక సుఖానస్నుండేది॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం ॥

రెడ్లు ॥ నందెలకొండా రెడ్డి ॥ చల్లా వెంగళరెడ్డి ॥ సాకం బయ్యపు రెడ్డిగారి సమ్మతిన కరణం నందయ స్వహస్తం వ్రాలు ॥ ఆనందరాయని వ్రాలు॥ పాపరాజు వ్రాలు॥ వెంకటరామన్న వ్రాలు॥ తిమ్మరాజు వ్రాలు॥ తిరమల కొండయ వ్రాలు ॥

దువ్వూరు పరగణె పైకి శ్రోత్రియం మా॥ వెంగన్నగారి పల్లె శ్రోత్రియదారు దుర్భాక సుబ్బన సోమయాజులు, వెల్లాల చెంచుభొట్లు ఈ యుభయులవద్దనున్న దానపత్రం యొక్క నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౭౮౦ అగు నేటి బహుధాన్యనామసంవత్సర మార్గశిర బ ౩౦ శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన ఆపస్తంబ సూత్రులయిన యజుశ్శాఖాధ్యాయులైన శాలంకాయనస గోత్రోద్భవులయిన దుర్భాకవెంగనగారిపౌత్రులయిన వెంకటభొట్లగారిపుత్రులయిన విశ్వేశ్వర సోమయాజులవారికి ఆశ్వలాయన సూత్రులయిన ఋక్శాఖాధ్యాయులయిన భారద్వాజసగోత్రోద్భవులయిన వెల్లాల బుచ్చనసోమయాజులవారిపౌత్రులయిన దేవోత్తమసోమయాజులవారి పుత్రులుఅయిన ప్రసన్నశాస్త్రిలవారికి కామనూరు రెడ్లుకరణాలు వ్రాయించియిచ్చిన భూదానధర్మశాసనపత్రిక మీారు అగ్నిహోత్రాది సత్కర్మలుచేసుకొనేకొరకు వేదశాస్త్రపాఠాలు చెప్పుకునేటందుకు గ్రాసస్థితినిమిత్తం శ్రోత్రియగ్రామంకావలెనని అడిగితిరి, గనుక అదేప్రకారం రాజేశ్రీగారి సన్నదుప్రకారం కామనూరిలో చెల్లేమాచనపల్లెపొలంలోను తూర్పున బుక్కయపల్లెపొలం పొలిమేర హద్దు, దక్షిణం అన్నవరం పొలిమేరహద్దు, పశ్చిమం...ఉత్తరం...యీా చతుర్దిక్కుల పొలంలోను ఖ ౨ చేలోను సర్వమాన్యం ఖ ౦౪౦ మిగిలిన ఖ ౧౪౦ లోను చేను ౧౧ కి ౫౦౪౨ పదేసిరూకల లెక్కను ఖ ౧౪ కి పంద్రాను ౫ ౨౦౧౦ యిరువై వరహాలకు శ్రోత్రియం నిర్ణయము చేసి యీా సూర్యోపరాగ పుణ్యకాలమందు శ్రీ వెంకటేశ్వరులకు

ప్రీతిగాను శ్రీకృష్ణార్పణంగాను సహిరణ్యోదకధారాపూర్వముగాను యిస్తిమి. గనుక మీరు గ్రామంకట్టుకొని బావిత్రొవ్వించుకొని పొలం కిరుదు చేమామూరు చేసుకొని యీ వ్రాసిన శ్రోత్రియం రూకలు ముక్కుందాయ ప్రాప్తిగాను మాదివాణానికి చెల్లించుకొని మీ పుత్ర పౌత్రపారంపర్యంత్రం ఆచంద్రార్క స్థాయిగా సుఖాన అనుభవించు కొనేది.

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా॥
ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

కొండారెడ్డిగారి బయ్యపురెడ్డిగారి సమ్మతిన తిరుమల కొండయ వ్రాలు, ఆనందయ సమ్మతిన పాపరాజు వ్రాలు. తిమ్మరాజు సమ్మతిన సుబ్బయ వ్రాలు. నందయ వ్రాలు. వెంకట్రాముని వ్రాలు. బయ్యపరెడ్డి వ్రాలు.

అంతువహీ ౧ కి సన్నదులు ౩౮ ము పైమెనిమిది.

నొసము తాలూకాలో గ్రామములయొక్క శిలాశాసనముల నకళ్లు.

మాంజె గుళదుర్తికి ప్రతినామమయిన లక్కమాంబాపురం అనే గ్రామం అంకాళమ్మ దేవాలయం ముందర నిలవపాతియుండె రాతి మీది శాసనం.

సూర్యుడు. శూలము చంద్రుడు.

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౫౦౦ అగునేటి బహుధాన్యనామ సంవత్సర చైత్ర శు॥ ౧లు

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీరంగదేవమహారాయలుంగారు పెనుగొండయందు వజ్రసింహాసనారూఢులయి కూర్చుండి పృథివీ సామ్రాజ్యము చేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల తిమ్మరాజయ్య దేవమహారాజులుంగారు తమకునాయంకరము నకుపాలించిన.........గుళదుర్తి అనే సర్వమాన్యపు అగ్రహారమందు దేవినాయనికొండయ్య ప్రతిష్ఠచేసిన అంకాళపరమేశ్వరి మహారాజ ప్రయోజనాలవల్ల వచ్చినరొఖం అమృతపళ్లకు తీర్థపర్వాలకున్ను గుళదుర్తి తేవల్ల(?)పయిడి సర్వమాన్యముగా ఆచంద్రార్కస్థాయిగా ధారవోసియిస్తిమి। ఇందుకు యెవరుతప్పినా తమ తల్లితండ్రాదుల వారణాసిలో వధించిన పాపాన బోదురు. మాతృగమనంచేసిన పాపాన బోదురు. కరమలవారికిన్ని వడ్లవారికిన్ని సర్వమాన్యంచేసియిస్తిమి - అయిద్దాతి పంచాలం వారికినీ.

ఈ రాతిఅంచుననె ఉత్తరంగాపాతియుండె రాతిమీాది శాసనం.

చంద్రుడు. డమరుకమువంటిది. త్రిశూలమువంటిది. సూర్యుడు.

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగునేటి ధాతునామసంవత్సర పుష్య శు ౫ లు శ్రీమద్వజనాది షట్కర్మనిరతులయిన గుళదుర్తికి ప్రతినామమయిన లక్కమాంబాపురం స్థితాశేషవిద్వన్మహాజనాలకున్ను తమ .....దేవినాయని కొండయ్య దేవాలయంకట్టించి......అంకాళమ్మను ప్రతిష్ఠ......... ఆరగింపులకు యేదుముచేను...

ఈవల అక్షరాలు అగుపడలేదు.

ఊరిదక్షిణం సామిదేవరబండకు వ్రాసినది.

పూలయబీఊకడమ......

కసబాకు మూడుపరుగుల దూరమున మాంజె మాయలూరి వినాయకుని దేవాలయం ముందరపాతియుండే శాసనాల నకళ్లు.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౯ ప్లవంగనామసంవత్సరం.........శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీవీరసదాశివదేవమహారాయలువారు విజయ నగరమందు వజ్రసింహాసనారూఢులయి పృథివీసామ్రాజ్యము సేయుచుండ గాను శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల చినఓబుళయ్య దేవమహారాజు లుంగారు కోయిలకుంట సీమలోని మాయలూరు మంగలఓజులకు(యిచ్చిన) ధర్మశాసనక్రమ మెట్లన్నను శ్రీసదాశివదేవమహారాజులుంగారు విద్యా నగరమంగళకొండోజుకు రాయసింహాసనానకుచెల్లే సీమల నల్లాను మంగల ఓజరికానికి పెట్టేపన్ను కానిక కట్నాలు పెట్టే పయిడీలు మ(న్ని)ంచి సర్వమాన్యం ధర్మశాసనం యిచ్చిన ప్రకారానకు మానాయంకరానకు చెల్లే కోయిలకుంటసీమలోని మంగలఓజులకున్ను పన్ను కానుకలు పయి డీలు సర్వమాన్యంగాను మన్నిస్తిమి. మీా పుత్రపౌత్రపారంపర్యంగా ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకొని సుఖానబ్రతికేది. ఈ ధర్మానకు యెవరు తప్పినాను గో బ్రాహ్మల వారణాసిలోవధించిన పాపాన పోవు వారు, ఇట్లని యిచ్చిన ధర్మశాసనం.

ఈ రాతిఅంచునను ఉత్తరభాగమందుండె రాతిమీాది శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ ............విజయనామ సంవత్సర శ్రావణ శు॥ ............ బోడుకు మాదినాయనివారు కోయిల కుంటసీమ యేలుచూనుండి మాయలూరిమాచిరెడ్డి భీమరెడ్డి కొడుకులు చినరామయ్య బసువయ్యగారి మండపం...ఆ రామయ్య బసువయ్య... సర్వమాన్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను పుత్రపౌత్ర పారంపర్యంగా కట్టించి అందుకుగాను దేవరకుపుట్టెడు ఖ ౧ అక్షరాలా పుట్టెడు చేను. ఇందుకు యెవరుతప్పినాను గంగలో గోబ్రాహ్మల వధించిన పాపాన బోవువారు.

భీమేశ్వరుని దేవాలయంలో అడుగుబండమీాద.

సౌమ్యనామసంవత్సర పుష్య శు ౫ లు మాయలూరి భీమేశ్వర స్వామివారి వెలమాటి మహానందయ్య సదాసేవ.

కసబాకు ఉత్తరం మూడు పరుగులదూరమున మా॥ ఈజేటి గ్రామానకు పడమర వినాయకుని దేవాలయముపయిన ఉండె రాతిమీాద శాసనం.

శ్రీ గణాధిపతయే నమః॥ స్వస్తిశ్రీ సూర్య (విజయా ?)భ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౪ అగునేటి ఆంగీరసనామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౨ ఆ॥ శ్రీమతు నర్రావుల రామారాయనింగారు మారమ రెడ్డి కస్విరెడ్డికి యిచ్చిన ధర్మక్రయశాసనం. మాకు కృష్ణదేవమహా రాయలు నిరూపం పాలించిన ఇంజేరు వినాయకుని నగరుకట్టిం చంగ ధనం గడమపడితేను అందుకు యింజేటను మీాకు ఊరిపడమరను నడబావికి వాయవ్యాన క్రయంపెట్టిన చేను ౧౪౪ అక్షరాలా నల్తుం ఇరసచేను పెట్టి పుచ్చుకున్న ప్రగ ౧౬ అక్షరాలా పదారుమూళ్లున్ను దేవరగుడి కడమకు బెట్టి గుడీ పరిపూర్ణంగాను కట్టిస్తిమి. ఈచేను ఆచంద్రా ర్కస్థాయిగాను అష్టభోగ తేజస్వామ్యతగాను పుత్రపౌత్ర పారంపరియం గాను అనుభవించి బ్రదికేది. ఇందుకు యెవ్వరుతప్పలేదు.

స్వదత్తాం సరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాంజాయతే క్రిమిః॥

శ్రీశ్రీశ్రీ.........

**ఇందుకు వాయవ్యం సమీాపమందు నేలపడియుండే శాసనం.**

**సూర్యుడు. చంద్రుడు.**

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౬౧ అగునేటి వికారి సంవత్సర జ్యేష్ఠ బ ౩ శ్రీమతు యింజేటి స్థళకరణం కస్వ రాజుకుమారుడు పాణయ్య యింజేటి వెంకటరెడ్డికి మహాలెస్సగాను ఘనమైన నడబావికట్టించెను, ఈ భావికి భూమినాయని పాపినాయనిం గారు పెట్టిన మాన్యంచేను ఊరికి తూర్పు లింగందిన్నె త్రోవచేను

ఖ ౫ ను యింజేటి వెంకటరెడ్డికి నైవేద్యపణ్యారాలకున్ను అంగరంగవైభ వాలకున్ను ధారవోసియిచ్చిన చేను ఖ ౦౹౦. ఇందుకు యెవరుతప్పినాను తమతల్లిదండ్రులను గురువులను వారణాసిలోను చంపినపాపాన బోదురు సురాపానంచేసిన పాపాన బోదురు; కుక్కమాంసం తిన్నవారు. మంగళ మహాశ్రీశ్రీశ్రీం జేయును.

తిరువెంగళనాథస్వామి దేవాలయంలో దక్షిణభాగం గోడకు అంటియుండే రాతిమీాది శాసనం.

సూర్యుడు చంద్రుడు.

శుభకృత సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమతు యింజేటి వెంకటరెడ్డికి మల్లి వరదరాజు అంగరంగవైభవాలకు ధారవోసిన చేను చింతవనం పడమర ఖ ౻౧౪ రేగటను ౷౩౻ కూడాను చేను ఖ ౧ రేగట బీడు............ఖ ౧ కూడా ఖ ౨.

ఈ దేవాలయంలో మహాద్వారం లోతట్టు దక్షిణభాగానసుండె రాయిమీాది శాసనం :

సూర్యుడు. శంఖం. తిరుమణి. చక్రం. చంద్రుడు

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషం బులు ౧౪౫౫ అగునేటివిజయసంవత్సర మాఘ శు। ౧౫ గు॥ శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీర అచ్యుత రాయ మహారాయలుం(గారు) పృథివీరాజ్యం చేయుచుండి స్థానాపతి బాచరసయ్యవారికి నాయంకరానకు పాలించిన గ్రిద్దలూరి సీమలోనికి చెల్లే యింజేటి తిరువెంగళనాథునికి బాచరసయ్యవారి కొమారుడు రామప్ప గారు తమ తల్లితండ్రులకు పుణ్యంగాను యింజేటను చెల్లివచ్చే పెంట సుంక్కం యింజేటి తిరువెంగళనాథునికి అమృతపల్లుకున్ను నైవేద్య పంనెరాలకున్ను అంగరంగవైభవాలకున్ను సోమగ్రహణ పుణ్యకాలాన యింజేటి పెంటసుంకం ఆదిమార్గం మూలవీసాలుసహా ధారబోసి యిచ్చిన ధర్మశాసనం॥ ఇది నడపినవారికి పదివేలు పుణ్యాలు సిద్ధించును.

ఇందుకు ధర్మానకు యెవ్వరు కీడుదలంచినాను తమ తల్లిదంండ్రులను గురువులను వారణాసిలో జంపిన పాపాన బోవువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ధారబోయించిన తలిమెల సిరంగరాజుల కొడుకు పీరమరాజుకు పుణ్యాం॥

ఈ దేవాలయంలో ఉత్తరపుతట్టు పాతివుండే రాతిమీద శాసనం.

చంద్రుడు. చక్రం. తిరుమణి. శంఖం. సూర్యుడు.

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౫౨౨ అగునేటి వికారి సంవత్సర శ్రావణ బ॥ ౧౫ లు గు॥ యింజేటి తిరువెంగళనాధునికి చినయమ్మనూరి మోరతల అన్నపు రెడ్డి కొమారుడు...

ఈవల అక్షరాలు మొరసి పోయినందున అక్షరాలు తెలియ లేదు.

ఈ దేవాలయంలో మహాద్వారం లోతట్టు దక్షిణ పార్శ్వాన నుండు రాతిమీద శాసనం.

చంద్రుడు. సూర్యుడు. శంఖం. చక్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౫ అగునేటి ఆనంద సంవత్సరం చైత్ర బ॥ ౧౧ లు శ్రీమన్మహారాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివదేవమహారాయలు పృథివీసామ్రాజ్యం సేయుచుండంగాను అఖిలాండకోటి బ్రహాండనాయ కుండైన యింజేటి స్థళమున వేంచేసియున్న శ్రీ వెంకటనాథుని దివ్యశ్రీ పాదపద్మంబులకు దేవరదాసులు కాశ్యపగోత్రం ఆపస్తంభసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన వల్లభయ్యంగారి కొమారుడు గోవిందయ్యాను వసిష్ఠసగోత్ర ఆపస్తంభసూత్రయజుశ్శాఖాధ్యాయులైన కేశవయ్యగారి కొమారుడు కేశవయ్యాను వారి దాయాదులు వీరయ్య చెన్నయ్యం గారు మొదలయిన విప్రవినోదులు అనంతములైన దండములు సమ

ర్పించి యిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను మాకు యింజేటి స్థళమందు ఉన్న నానాగోత్ర నానాసూత్ర నానానామధేయులైన అశేషవిద్వజ్జన మహాజనాలున్నూ మాకు యేడొకటికి వచ్చేది గం ౪౩ అక్షరాలా మాడా ధరణయున్ను శ్రీరామజయంతి పుణ్యకాలమందు ధనుర్మాసాన ఒక ప్రొద్దు చేసేటందుకు ధారబోసి యిస్తిమి. చతుస్సముద్రం భూమండల మందు మావిప్రవినోదుల కులానకు పుణ్యాంగాను ధారబోసి యిస్తిమి గనుక ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. ఈ ధర్మానకు యెవరు తప్పినాను కాశిలోను తమ తల్లిదండ్రులను గోబ్రాహ్మలను వధించిన పాపాన పోవువారు ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం ॥

ఇందుకు ఉత్తరం ద్వారంవద్ద పాతివుండే రాతిమీది శాసనం.

చంద్రుడు. శంఖం. తిరుమణి. చక్రం. సూర్యుడు.

అవిఘ్నమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సంవత్సర చైత్ర బ। ౬ లు శ్రీ మన్మహారాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలుగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై కూర్చుండి పృథివీసామ్రాజ్యం సేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర రామరాజు వెంకటేశుని కొమారుడు కొండ్రాజయ్య దేవమహారాజులుం గారు యిచ్చిన ధర్మశాసనం. శ్రీ సదాశివమహారాయలుగారు మాకు నాయంకరానికి పాలించిన గిద్దలూరి సీమకు చెల్లె గ్రామాల మంగల ఓజులకు యిచ్చిన ధర్మశాసన క్రమమేదనిన శ్రీసదాశివదేవమహా రాయులు సిహాసనానకు చెల్లెసీమలోని మంగల ఓజరికాలు పెట్టిన పన్ను కానుక కట్నాలు మేముమన్నించి సర్వమాన్యంగాను చేసిన... ప్రకారాన మేమున్నూ మానాయంకరానకు చెల్లే గిద్దలూరి గ్రామాల మంగల ఓజులు పెట్టే కానుక కట్నాలు దొమ్మరి పన్ను వెజ్జ(ట్టి?) వేములుసహా సర్వమాన్యంగాను మన్నిస్తిమి. మీ పుత్రపౌత్రపారం

పర్యంగాను ఆచంద్రార్క స్థాయిగాను మన్ని స్తిమి, సుఖాన బ్రతికేది. ఈ ధర్మం యెవరు తప్పినాను తమ తల్లిదండ్రుల వారణాసిలో వధించిన పాపాన బోవువారు. ఇటని యిచ్చిన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

ఈవల యేమి అక్షరాలు తెలియలేదు.

మాయలూరికి ఉత్తరం సమీపంగా నుండె నోసంతాలూకు మా॥ సుద్దమల్ల గ్రామంలో విఘ్నేశ్వరుని దేవాలయమువద్ద వుండే శాసనం.

చంద్రుడు. శంఖు. చక్రం. సూర్యుడు. బసవన్న.

శ్రీమన్మహామండలేశ్వర శ్రీవీరహరిహరరాయలు విజయనగరమందు రాజ్యంజేయ స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౧౮* అగునేటి రక్తాక్షి సంవత్సర వైశాఖ శు। ౧౦ జొ ఆ॥ ఉద్రపాడ బళనాయనింగారు తమ తండ్రి రుద్రనాయనింగారికి పుణ్యంగాను సుద్దమల్ల జనార్దనదేవర నగరుకట్టించి గా.......మాన్యం ౧౩ ఆచంద్రార్క స్థాయిగా....... ఇందుకు యెవరు అన్యాయం చేసినా తమ తల్లితండ్రులను కొంచబోయినవారు, నరకలోకానికి బోయినవారు, పంచమహాపాతకం చేసినవారు మంగళమహా శ్రీశ్రీశ్రీ జేయును.

మాయలూరికి తూర్పు అరవరుగు దూరమున కసబాకు ఉత్తరం మూడు పరుగుల దూరం మా॥ రూపనగుడి చెన్నకేశవస్వామి దేవాలయం ధ్వజస్తంభం క్రింద నుండిన రాతిమీది శాసనం.

శుభమస్తు ॥ శోభకృతునామ సంవత్సర భాద్రపద శు। ౧౨ ల. శ్రీమన్ మహామండలేశ్వర వల్లభరాయ.........దేవమహారాజులుగారు

---

* Correctly S. 1306.

రూపులగుడి చెన్నకేశవస్వామికి...నలపుట్టెడు ఖ ౧ అక్షరాలా......
గోబ్రాహ్మలు......సురదాగిన పా..........

ఈవల అక్షరాలు కొంచెం శిథిలమయినందున అగుపడలేదు.

ఈ గ్రామానకు చెల్లే మజరా నరిసిరెడ్డిపల్లెలో దుర్గదేవాలయం ద్వారానకు శాసనం.

శుభకృతు సం॥ ఆషాఢ శు। ౧౧ గద్దె చౌడక్క కట్టించిన దుర్గి దేవాలయం.

శ్రీరామ

నొసంతాలూకా మవుజె పెదపసుపులలో నుండె శిలాశాసనములయొక్క నకలు.

కోటలో వీరభద్రదేవాలయంలో పగిలిపోయిన శాసనంయొక్క నకలు.

విజయనగరమందు రత్నసింహాసనారూఢుడై రాజ్యంచేయుచుండగాను...దండనాయక మహాప్రచండ కౌండిన్యసగోత్ర ఆపస్తంబసూత్రం రాచిరాజుగారి కొమారుడు సాళువ తిమ్మయ్యగారికి నేము యిచ్చిన ధర్మశాసనం. తథాతిథి సోమగ్రహణపుణ్యకాలమందు పంపాతీరమందు విరూపాక్షదేవుని సన్నిధిని నరసింగ్గరాయమహారాయనికి పసుపులు గ్రామమందు దక్షిణానకు చౌడూరు ...రెండు గ్రా...ం...ల పొలి మేరలు...పెదపసుపుల పొలంలోను మీకు ధారవోసి యిప్పించినది దొరెఘుడప్రమాణాన కుంటలు ౧౦౦ లెక్క ఖండక్షేత్రం.........ముపై ప్పుట్లు ఖండగ యిస్తిమి. కౌండిన్యసగోత్రం ఆశ్వలాయనసూత్రం కామరుసుంగారి కొమారుడు పెదతిమ్మయ్యగారికి దానధారాపూర్వకంబుగా యిస్తిమి. తమ తండ్రి కం(రా)చి రాజుగారికిన్ని తమ యిష్టదైవం తిరువెంగళనాథునికిన్ని పుణ్యంగాను పంపాతీరమున శ్రీవిరూపాక్షదేవుని సన్నిధిని యీ తథాతిథి సోమగ్రహణపుణ్యకాలమందు ధారపోసి యిస్తిమి గాన యీ ఖండక్షేత్రానకు చతుస్సీమలోను కలిగిన నిధి నిక్షేప జల పాషాణ అక్షీణ ఆగామి సిద్ధసాధ్యంబులనియెడు అష్టభోగ తేజ

స్వామ్యాలు సహితముగాను ముప్పైప్రుల్లి ఖండక్షేత్రమున్ను బాగు చేసుక అనుభవించుకోమ్మని యిచ్చిన ధర్మశాసనము. ఈ ధర్మానకు యెవ్వరూ ఘాతతలచినాను వారణాసిలోను గంగాతీరమందు గోబ్రాం హ్మణ్ని వధించిన పాపానబోదురు తమ పెద్దకొడుకు కపాళాన కాటుక పట్టి ఆ కాటుక తన ఆలి......

ఊరికి దక్షిణం పరుగు దూరాన గుళ్లకుంట నడబావివద్ద పగిలి మూడుతునకలు అయిన శాసనము.

శ్రీగణాధిపతయేనమః ॥

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే ॥
హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్స పాతువః।
హేమాద్రికలశా యత్ర ధాత్రీచ్ఛత్రశ్రియం దధౌ ॥

కల్యాణాయాస్తు తద్ధామ ప్రత్యూహా తిమిరాపహం।
యద్గజో ప్యగజోద్భూతం హరిణాపిచ పూజ్యతే ॥
అ స్తిక్షీరమయా ద్దేవైః మధ్యమా నాన్మహాంబుధేః।
నవనీత మివోద్భూత మపనీత తమోమహాత్ ॥

తస్యాసీ త్తనయ స్తపోభిరతులై రన్వర్థనామాబుధః।
పుత్త్రైరస్య పురూరవా భుజబలై రాయుద్విషాన్నిఘ్నతః।
తస్యాయు ర్నహుషోఽస్యతస్య పురుషోయుద్ధే యయాతిః క్షితౌ।
ఖ్యాత స్తస్యతు తుర్వసు ర్వసునిభ శ్శ్రీదేవయానీపతేః ॥

తద్వంశే దేవకీజానిః దిదీపే తిమ్మభూపతిః।
యశస్వీ తులువేంద్రేషు యదోఃకృష్ణయి వాన్వయే ॥
తతోభూ ద్బుక్కమాజాని రీశ్వరక్షితిపాలకః।
అత్రాస మగుణభ్రంశం మౌళిరత్నం మహీభుజాం ॥

నరసా దుదభూ త్తస్మాన్నరసావనిపాలకః।
దేవకీనందనాత్కామో దేవకీనందనాదివ ॥

కావేరీ మాశు బధ్వా బహుళజలరయాం తాం విలంఘ్యైవశత్రూన్ ।
జీవద్గ్రాహాం గృహీత్వా సమితి భుజబలాత్తం చరాజ్యంతదీయం।
కృత్వా శ్రీరంగపూర్వం తదపి నిజవశే పట్టణం యోబభాసె।
కీర్తిస్తంభం నిఖాయ త్రిభువనభవనస్తూయమానాపదానః॥

చేరంచోళం చ పాడ్యం తదపిచ మధురావల్లభం మానభూషం ।
వీర్యోదగ్రం తురుష్కం గజపతినృపతిం చాపి జిత్వా తదన్యాన్ ।
ఆగంగాతీర లంకా పదమచరమభూభృత్తటాంతం నితాంతం।
ఖ్యాత క్షోణీపతీనాం స్రజమివశిరసాం శాసనంయో వ్యతాసీత్ ॥

వివిధసుకృతోద్దామే రామేశ్వరప్రముఖే ముహుః।
ముదిత హృదయః స్థానేస్థానే విధత్తేయథావిధి।
బుధపరివృతో నానాదానా నియోభువి షోడశ।
త్రిభువన జనోద్గీతంస్ఫీతం యశః పునరుక్తయన్॥

తిప్పాజీనా గలాదేవ్యోః కౌసల్యాశ్రీ సుమిత్రయోః।
దేవ్యోరివనృసింహేంద్రా త్తస్మాత్సం క్షిరథాదివ।
వీరావినయినౌరామలక్ష్మణా వివనందనౌ।
జాతౌవీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతీ॥

వీరశ్రీనారసింహ స్సువిజయనగరే రత్నసింహాసనస్థః।
కీర్త్యామిత్యానిరస్యన్ నృగనలనహుషానప్యవన్యామధాన్యాన్।
ఆసేతోరాసుమేరో రవనిసురనతః సైర్వరమాచోదయాదే(?)।
రాపాశ్చాత్యాచలాంత్తా దఖిలహృదయమావర్జ్యరాజ్యంశశాస॥

శాలివాహననిర్ణీతే శకాబ్దే దశభిఃశతైః!
...చతుశ్చత్వారింశద్గణితేక్రమాత్ వత్సరేచిత్రభాను వాచ్యే॥

మాసేభాద్రపదే పూర్ణిమాయాం మహాతిథౌ।
తుంగభద్రాపగాతీరె విఠలేశ్వర సన్నిధౌ।
చైత్ర శ్రీకంఠ సూత్ర శ్రీహారితగోత్ర ధారిణే।
పద్మాపయోధరస్యా శిపంటశాఖాయశార్జిణే॥

వాసవస్యానుజాతాయవసుదేవస్య సూనవే ।
ఉత్తమాయశతాన్వవరానూలితవతేఖిలాం ॥
ధృత్వారాచయగోవింద రూపరూపమసంశయః ।
యమాసేవాద్రివాశీ నేశేపయయినె(?) ।
ఘండికోటాఖ్యసీమాయ రేనాటాచాశ్రితంస్థితం ।
పెదపసువులగ్రామాఖ్య దక్షిణాందిశమాశ్రితం ॥
ఉత్తరాశాం శ్రితందేవిగుడిస్థానాంచపాయతు ।
సాళువగోవిందరాజపురంనామమిదం శితం ।
అత్రేయాన్వయసంబంధ యీశ్వరపండితసూనవె ।
శ్రీమతే తిమ్మయాఖ్యాయ పండితాయయజు ర్విదే ॥*

దీనికి తూర్పు శాసనం.

స్వస్తిశ్రీ శకవరుష సావిరదమునూ్నరునాల్కనెయ దుందుభి సంవత్సర, మాఘ బ. ౩౦ సూర్యగ్రహణపుణ్యకాలదల్లు శ్రీ విరూపాక్షదేవరసన్నిధియల్లు శ్రీవీరదేవరాయవడయరు ఋక్‌శాఖాధ్యాయద కాశ్యపగోత్రద...అప్పగళవరు రాయసంవీరప్ప సర్వమాన్యవాగి ఆచంద్రార్కస్థాయియాగి కొట్టర సుఖదిం భోగిసువదు॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

కోటతూర్పువాకిలి ముందరగోడకు శాసనం.

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే ।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౭౫౪ అగునేటి పరీధావిసంవత్సర, ఆశ్వీజ శు. ౨ భానువారం హాజరతునవాబు జంశేదు ఖానుసాహెబువారి కొమారుడు యుసుఫుఖానుసాహెబువారు పెదపసువులగ్రామం కోటకు తూర్పువాకిలి కట్టించిరి; గనుక శాశ్వతబ్రహ్మకల్పాలుగాను ఆచంద్రార్కస్థాయిగాను వేయించిన శిలాశాసనము.

---

* The lines beginning with శాలివాహననిర్జితే are corrupt, and cannot be corrected.

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంబాయ శంభవే॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౬౭౫ అగునేటి శ్రీముఖనామసంవత్సర ఆషాఢ, శు. ౫, శుక్రవారం హజరతు అబ్దులు ఖాదరుఖాను నవాబుసాహెబులవారి కొమారుడు హజరతు అబ్దులుగనీ ఖానుసాహేబులవారు పరగణే పసుపులగ్రామాన్కు-కోటకు నైరృతిమూలను కట్టించిన బురుజు శిలాశాసనం.

కోటకుముందర జువ్విచెట్టు అరుగుదగ్గిర పూడిచివున్న శాసనము యొక్క- నకలు.

చంద్రుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౫౯౧ అగునేటి రౌద్రిసంవత్సర; మార్గశిర బ. ౧౦ లు దర బందగి హజరతు సరపు రాజుఖాను సాహేబుల వారు పెదపస్పులగ్రామమందు దొమ్మరివారికి యిచ్చిన భూధానధర్మశాసనక్రమ మెట్లన్నను, ఆదొమ్మరి భట్టూరిచేరెడ్డి గారి సాళువరాయని కొడుకు గోపాలరాయనికి యిచ్చిన మాన్య వివరం. ఈదినాన మీకొమారుడు నాగిరెడ్డిగాడు యీగ్రామాన గడయెక్కి- ఆడు చూపడి చచ్చిపోయె గనుక అదినిమిత్తంగాను మీకు బహుమానంగాను పొట్టి పాటితెరువున బడిగెద్దులకుంటవద్ద కొలపాటి నలుతుముచేను మీకు యిచ్చినారము; గనుక మీపుత్రపౌత్రపారంపర్యంత్తం ఆచంద్రార్క-స్థాయిగాను సుఖాన అనుభవించగలవాడవు. ఇటని యిచ్చిన ధర్మశాసనం. ఈధర్మానకు యెవ్వడు అవరోధముచేసినా వానినోట్లో గాడిద...కల్లువుప్పు.

మవుజె చినపసువులగ్రామములో శాసనముల నకళ్లు. ఊరివాకిలిలోతట్టు పాతియున్న శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౭౯౯ అగునేటి యీశ్వరసంవత్సర, చైత్రశు॥ 3 సోమవారము శ్రీమదా

జాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీరంగదేవరాయమహా రాయలు పెనుగొండనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీ సామ్రాజ్యము సేయుచుండగాను శ్రీమన్మహారాజాధిరాజ పాండే యస వంతరాజ శ్రీకందబరాయవడయలు అయ్యవారి కార్యకర్తకలయిన తాలి తిమ్మినాయనిగారు చినపసుపుల చెన్నకేశవదేవుని ముఖమంటప ములో కూర్చుండి ఇప్పపెంట కాశకొండాబత్తుని కొడుకు చినతిమ్మా బత్తునికి యిచ్చిన భూదాన ధర్మశాసనక్రమ మెట్లన్నను ; శ్రీరంగదేవ మహారాయ లయ్యవారు కదంబరాయని అయ్యవారికి ఉమ్మళికి పాలించిన ఉదయగిరి సీమలోనికి చెల్లే ఘంటికోటసీమలో పసపులమాగాణిలో కదంబరాయని అయ్యవారు మాకు అమరానకు యిచ్చిన చినపసుపుల గ్రామములో వీరభద్రదేవుని గుడ్కి తూర్పు బావి పాడు అయి నీళ్లు లేక రాతిచట్టపడి ఖిలపడి యుండగాను యీ బావిలో రాతిచట్ట నరికి నీరుజలసమృద్ధిగా నుండేటందుకు పసుపుల తెరువుకు పడమట పెద పసుపుల పొలిమేరకు ఉత్తరం యీ పొలిమేర పొలం ఖం ॥౦ పందుము చేను మీకు మాన్యం పెట్టితిమి. ఏలినవారికి పుత్రపౌత్రపారంపర్య మున్న పుణ్యంగాను నీవు యీ బావిలో రాతిచట్టనరికి జలసమృద్ధి చేసుకొని మీ పుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను యీ పందుంచేను అనుభవించేది. సూర్యచంద్రులు కలంతకాలము యేలిన వారికి పుణ్యముగాను జలసమృద్ధి చేసుకొని ఈ పందుముచేను సర్వమాన్యముగా అనుభవించేది. ఈ నూతిలో రాయిచట్ట నరికి నీవు జలసమృద్ధిచేసుక నుండగాను ఏలేవారు యెవరు తప్పికొన్నాను వారి తల్లిదండ్రిని వారణాసిలో వధించిన పాపానబోవువారు. ఈ మాన్యానకు ఏలినవారు తప్పక నడుపుకుంటేను ఈ భావి జలసమృద్ధి అయ్యిన పుణ్యం ఏలినవారికి పుత్రపౌత్రపారంపర్యం పుణ్యంసిద్ధించేని ; గనుక నీవు పుత్రపౌత్రపారంపర్యంగాను జలసమృద్ధిచేసుక పందుముచేను సర్వమాన్యముగా అనుభవించి బ్రతికేది. మలిరెడ్డి తాతిరెడ్డి కొనరెడ్డి కొండ్రెడ్డి మొదలయిన రెడ్డి కరణాల సమ్మతమయియుండు మేము యెవ్వరం గనుక యేరీతిన వారికి మరుగుపడ విన్నపంచేసినాను కులంవారంవంటివారం కాము. హీనజాతి వారం ఇందుకు యెవ్వరు తప్పినాను గాడిదెబిడ్డలున్ను కల్లుఫుప్పా తిన్న వారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

మహాజిదు దగ్గరది ద్వారమందు పాతినరాయిపై శాసనం జంశరఖాను.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౪౩ అగునేటి ప్లవనామ సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౦ నయనసూకు పుల్లసాని వహాలుసేనుగారికి చినపసుపుల దేశాయిరెడ్డి కరణాలు వ్రాసియిచ్చిన మసీదు మాన్యం దానపత్రం. మా గ్రామాన ఖాదారసూలు నిమత్తం మసీదు కట్టించినందుకు సాహేబు మెహర్బాను సాహెబులవారు సెలవుయిచ్చిరి; గనుక సెలవు యిచ్చిన ప్రకారము మారాజీన స్థళం నిర్దేశం చేసి యిచ్చిన వివరము. ఊరి తూర్పు కొత్తబావితోట చేనుస్థళం ఖం ||౦ మరిన్ని యీ చేను అంచున ౧౮।౦ అంతు చేనుతోటసహా కొలపాటి ఖ ౦౻౦ పదియేదుం చేను* స్థళం నిర్దేశంచేసి యిస్తిమి గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యంతంగా ఆచంద్రార్కస్థాయిగా అనుభవించగలవాడు అని వ్రాసియిచ్చిన దానపత్రం రెడ్లు కరణాలు సంమ్మతిన కరణం కంబగిరి వ్రాసిన దానపత్రం.

స్వత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

ఇందుకు హిందువులు ఆచ్ఛేదన(ఆక్షేపణ)చేసి రామెనా కాశిలో గోహత్య చేసిన పాపానబోదురు. తురుష్కలు ఆచ్ఛేదన(ఆక్షేపణ)చేసినట్టామెనా వరదారోజుకు కియ్యామతుకు జావాబుదేగ పె......

మవుజె మేడిదిన్నె గ్రామములోనుండే శిలాశాసనముల నకళ్లు ఆంజనేయస్వామి దేవాలయంలో యెదుట నిల్వపాతిన రాయిపై శాసనము యొక్క నకలు.

---

* The details do not work out correctly.

అభిష్నమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౪౭౭ అగునేటి ఆనంద సంవత్సరం చైత్ర శు॥ ౧౦ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీసామ్రాజ్యం సేయుచుండగాను ఉదయగిరి రాజ్యానకు చెల్లే ఘండికోట సీమకుచెల్లే మేడిదిన్నెకు ప్రతినామమయిన కృష్ణరాయసముద్రమనే అగ్రహారమందు శ్రీ అఖిలాండకోటిబ్రహ్మాండనాయకులయిన వేదవేదాంగవేద్యులయిన పురాణ పురుషోత్తములయిన శ్రీ చెన్నకేశవదేవునికిన్ని హనుమంతదేవునికి దశమిమహోత్సవాలకు శ్రీ హనుమానుకు దశమిమహోత్సవం ఊరుయేగేటందుకు కాశ్యపగోత్రం ఆపస్తంబసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోది మల్లయ్యగారి కొమాళ్లు పర్వతయ్యగారున్ను వశిష్ఠగోత్రం ఆపస్తంబసూత్రం విప్రవినోది కేశవయ్య కొమారుడు చెన్నయ్య జనులు ౨ న్ను యేకస్తులై యిచ్చిన ధర్మశాసనం. విప్రవినోదులకు యిచ్చే వర్తనలు శ్రీరామనవమి పుణ్యకాలమందు మా విప్రవినోదికులంవారికిన్ని పుణ్యంగాను తమ పుత్రపౌత్రపారంపరియం తము ఆచంద్రార్కస్థాయిగాను సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను మా విప్రవినోదికులాన కల్లాను పుణ్యంగాను త్రివాచకముగాను దారవోసి యిచ్చిన ధర్మశాసనం. ఈ ధర్మానకు మా విప్రవినోదికులంవారు యెవరు తప్పినాను తమ తల్లిదండ్రుల వారణాసిలో చంపిన పాపానబోదురు,

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తా పహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దీనికి దక్షిణం శాసనము.

సూర్యుడు. చంద్రుడు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౧* అగునేటి దుర్మతి సంవత్సర శ్రావణ బ॥ ౮ లు గుత్త యర్రమనాయని

* Date - Śaka and Cyclic years do not agree.

కొడుకు చెపల్లినాయనింగారు తమ తల్లిదండ్రులకు సుకృతంగాను మేడిదిన్నె హనుమంతుని తిరుకోవిల ఖిలపడియుండగాను అందుకు సున్నపుగచ్చుచేసి అనగా పునఃప్రతిష్ఠచేసి ఆచంద్రార్కస్థాయిగాను ఉత్తరోత్తరాభివృద్ధిగాను మేడిదిన్నెకు ఊరికి ఉత్తరం చింతతోపుకు ఉత్తరం దేవునికి అక్షరాలా పందుముచేసున్నూ ఆచంద్రార్కస్థాయిగాను అష్టభోగతేజసామ్యమున్ను అనుభవించువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

గ్రామానకు దక్షిణం పావుకోసుదూరమున పొలిమేరను బావి వద్ద పాతియున్న శాసనము యొక్క నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౩ అగునేటి ప్లవనామ సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౦ లు పుల్లసానికి వహుసేను గారికి మేడిదిన్నె దేశాయిరెడ్లు కరణాలు వ్రాయించియిచ్చిన మసీదు మాన్యం దానపత్రం. చినపసుపులలో ఖొదారనూలు నిమిత్తం మసీదు కట్టించినందుకు మాన్యం యివ్వమని ఖానుసాహేబు మెహర్బానుగాను... సాహెబులవాను సెలవుయిచ్చిరి; గనుక సెలవుప్రకారం మా రాజీన స్థళం నిర్దేశంచేసి యిచ్చిన వివరము చినపసుపులనుంచి గుండ్లకుంటకు పొయ్యేత్రోవ ఉత్తరం మడికాలు పుట్టచేను ౧౮౻౦ దీని తూర్పున ముడియంవారి బావిక్రింద ౧౦౹౨౦(౧౦౹౦?) ఉభయం కొలపాటి ఖ ౦౹౦ స్థళం నిర్దేశం చేసియిస్తిమి; గనుక మీ పుత్రపౌత్రపారంపరియంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించగలవారు అని వ్రాసియిచ్చిన దానపత్రం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

ఇందుకు హిందూలు ఆచ్ఛేదన చేసి రాయనా కాశిలో గోహత్యచేసిన పాపాన పోదురు తురుష్కులు ఆచ్ఛేదనచేసి రాయనా *ఫరదాజు కియ్యామత్తు*కు జవాబు దేగా ॥

కసుబా నోసములో నుండె శిలాశాసనములయొక్క నకళ్లు.

కోటలో నైరృతిభాగాన చింతమానుక్రింద శాసనము.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౧ అగునేటి వికారి సంవత్సర కార్త్తిక శు। ౧౨, శు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరఅచ్యుత దేవమహారాయలు విద్యానగరమునందు పృథ్వీసామ్రాజ్యము సేయుచున్నుండగాను ఘండికోట రాజ్యం రేనాటిసీమలోను శ్రీమతే రామానుజాయనమః శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య పరమహంస పరివ్రాజకాచార్య ఉభయ వేదాంతాచార్యులయిన శ్రీమత్ శఠకోపజియ్యంగారి మఠానకు చెల్లే మరఫురగ్రామమయిన నోసం అనేటి గ్రామానను దొమ్మరివారు యిరవైనాలుగు కులాలవారికిన్ని అచ్చిన దొమ్మరిపన్ను దొమ్మరి యత్తకలెవని(?) కాకిపద్మరాజు బంట్లై యిరవైనాలుగు కులాలవారికిన్ని పుణ్యంగాను నోసం చెన్నకేశవపెరుమాళ్లుకు అంగరంగ వైభవాల కున్నూ కార్త్తిక శు। ౧౧ పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారా పూర్వకముగాను యీసంవత్సరం ఆరభ్యంగాను యేడు ౧ కి దొమ్మరి పన్ను...అంతాను నాల్గుమాడలు కాకిపద్మరాజు ధారపోసి యిచ్చిన శిలాశాసనం ఆచంద్రార్కస్థాయిగాను వ్రాయించినాడు. ఈ ధర్మానకు యెవరు తప్పినాను గోబ్రాహ్మణులను తమ తల్లిదండ్రులను వారణాసిలో చంపిన పాపాన బోయినవారు.

శ్రీ చెన్నకేశ్వరుల కోటలో దేవాలయంలో గర్భగుడికి పశ్చిమ వాయవ్యంలో మూలను పాతియున్న నిలువు బండమీద శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

---

* This should be *fardayi qiyāmat.*

ఈ క్షేత్రాదం(?)త్తుడైన కోటగాని నగరివారికిన్ని కాపులకున్ను పని లేదు.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౨ అగునేటి ప్రమోదూత సంవత్సర చైత్ర బ॥ ౯ లు సోమవారం శ్రీమన్మహామండలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప శ్రీకృష్ణరాయ మహారాయలు పృధ్వీ రాజ్యమునందు ఘండికోట రాజ్యమందు రేనాటిసీమలోను శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య పరమహంస పరివ్రాజకాచార్యులయిన శ్రీమ॥...నారాయణ...... గారి పుత్రులు ధర్మయ్యంగారికి యిచ్చిన భూధాన ధర్మశాసన క్రమమెట్లన్నను, మా మఠానకు చెల్లేటి ఘండికోటసీమలో నొసం అనేటి గ్రామమందు పట్ణస్వామి కాంవరం చిట్టమసెట్టి కొమారుడు వరదసెట్టిగారు చెరువు కట్టించగాను వారికి కట్టుమాన్యం యిచ్చిన క్షేత్రం వరివడి కుంటలు ౧౬౭ న్నూ వెలిచేను ఖ ౧ న్నూ తోట ము ౨ న్ను నివేశనం ౧ న్ని చింతమాను ౧ న్ని అక్షరాలను వరిమడి కుంటలు నూట అరువైయేడున్ను వెలిచేను పుట్టెడు ఖ ఒకటిన్ను తోట రెండుముంతలున్ను నివేశనం వకటిన్ని చింతమాను ఒకటిన్ని యింతమట్టున్ను ప్రజాపతి సంవత్సర భాద్రపద శు। ౧౩ లక్ష్మీనారాయణ యోగపుణ్యకాలమునందు వరదసెట్టిగారిచేతను సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను ధారపోయించి యిప్పిస్తిమి, గాన ఇంతమట్టున్ను అష్టభోగ తేజస్వామ్యతలను ఆచంద్రార్కస్థాయిగాను పుత్రపౌత్రపారంపర్యంగాను సుఖాన అనుభవించేది.

దీనికి తూర్పు దిగువ పరువు బండపై శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

శ్రీమతేరామానుజాయ నమః.

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౬ అగునేటి ఆనంద సంవత్సర నిజ ఆషాఢ శు॥ ౧౨ లు శ్రీసదాశివ దేవమహారాయులు విజయనగరమందు వజ్రసింహాసనారూ

ఘులై పృథ్వీసామ్రాజ్యము సేయుచుండగాను గండికోటసీమలో నొసం అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన శ్రీవత్సాంకితులైన శ్రీలక్ష్మీ చెన్నకేశవపెరుమాళ్లకు ప్రథమశాఖులైన మల్లయ్య వల్లభయ్య అనంతములయిన సాష్టాంగదండములు సమర్పించి యిచ్చిన శిలాశాసనం. విప్రవినోదులకు నొసమందుల చెల్లే త్యాగవర్తనలు యేడు ౧ కి...... గమా౧ లెఖ నానాగోత్రాలవారైన మావిప్రవినోదులకు పుణ్యంగాను యీ సంవత్సర నిజ ఆషాఢ శు॥ ౧౧ పుణ్యకాలమందు నొసం చెన్నకేశవపెరుమాళ్లకు అనంతములయిన దండములు సమర్పించి యిచ్చిన శాసనం త్రివాచకంగాను త్రికరణశుద్ధిగాను నొసం అయ్యంగార్లు మా విప్రవినోదులకు యిచ్చే త్యాగవర్తనలు మా కులస్వాములకు పుణ్యంగాను నొసం కేశవరాయనికి ప్రతి పౌర్ణమి తిరువీథిమహోత్సవానకు సమర్పిస్తిమి. ఈ ధర్మవిరోధం యే విప్రవినోదిచేసినాను వారు తమ తల్లి దండ్రుల గోబ్రాహ్మణుల వారణాసిలో వధించిన పాపాన బోదురు.

నొసముకు ఉత్తరం అరపరుగుదూరాన మజరా అక్కంపల్లెకు పశ్చిమం చెరువుకట్టవద్ద నిలవపాతిన శాసనం.
శుభమస్తు ॥

శ్రీశంకరగురవేనమః । శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పదవాక్యప్రమాణ పారావారపారీణ యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణసమాధ్యష్టాంగయోగ నిష్ఠానుష్ఠాన తపశ్చక్రవర్తిఅనాద్యవిచ్ఛిన్నగురుపరంపరాప్రాప్తిషణ్మతస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థప్రకాశక సాంఖ్యత్రయప్రతిపాలక సకలనిగమాగమసారహృదయ వైదికమార్గప్రవర్తక సర్వతంత్రస్వతంత్రాది రాజధాని శ్రీవిద్యానగరమహారాజధాని కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య గురుభూమండలాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగగిరి ॥

ఇంతేశాసనం వ్రాసియున్నది.

వీరభద్రస్వామి దేవాలయం యెదుట పాతిన శాసనం ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౪ అగునేటి నందననామ సం॥ర పుష్య శు॥ ౧౦ గురువారం శ్రీమతు సాయణవరముకు ప్రతినామమైన ఆలి(ఆల్వ?) కొండగ్రామమందలి లక్ష్మీనారాయణ దేవుడు నాగేశ్వర దేవరకున్ను ఆల్వకొండగ్రామమందలి నానా గోత్ర నానాసూత్ర నానాశాఖ నానానామధేయులైన అశేషవిద్వన్మహాజనాలున్నూ యిచ్చిన భూదాన శిలాశాసనం. ఈ రెండు దేవస్థానాలకున్నూ అమృతపల్లెకు ఆకుమళ్లదోవకు ఉత్తరం ముత్యాలవాగు తూర్పు కొలబడి ౧౨ తోటను సహిరణ్యోదకధారాపూర్వకంగాను త్రివాచకంగాను ధారబోసియిస్తిమి. కుందవరం తిమ్మయ్యగారి ముఖాంతరం నడిచేటట్టుగాను ధారబోసి యిస్తిమి.

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్త నిష్ఫలం భవేత్ ॥

దీనికి పశ్చిమం పాతివున్న శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౮౬ అగునేటి క్రోధినామ సం॥ర కార్తిక శు॥ ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ సదాశివదేవమహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృధ్వీసామ్రాజ్యం సేయుచుండగాను శ్రీమన్మహామండలేశ్వర ఆత్రేయగోత్రం సోమవంశాధీశ్వరులయిన ఆత్రేయగోత్ర పవిత్రులైన ఆరవీటి బుక్కరాజుగారి ప్రపౌత్రులు రామరాజుగారి పౌత్రులైన తిమ్మరాజుగారి పుత్రులైన చిన తిమ్మయ్యదేవమహారాలుగారు యజనయాజన అధ్యయన అధ్యాపక దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన ఆల్వకొండ స్థితాశేష విద్వజ్జనాలకున్ను యిచ్చిన ధరశాసనం. మానాయంకరానకు చెల్లే అవుకు సీమలోని ఆల్వకొండ అగ్రహారాన నగరికిపెట్టే శ్రోత్రియం కట్న కానికెలు వెట్టివేములు సర్వమాన్యంగాను సహిణ్యోదక దానధారాపూర్వకంగాను త్రివాచకంగాను ఆచంద్రార్కస్థాయిగాను ధారబోస్తిమి.

గాన మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను అనుభవించేది. ఇందుకు యెవరు తప్పినా మానంలేనివారు.

ఏకైవ భగినీలోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

మవుజె ముక్కమళ్ల గ్రామంలో ఊరివాకిలి కెదట బావి ఉత్తరం వ్రాసియున్న శాసనం.

శుభమస్తు॥ శ్రీసోమనాథాయనమః॥

పాతు త్రైలోక్యజననీ పావనీ సురవాహినీ।
పయోధభిఃర్యోనిజేర్ధే(?) పయోధే రపి జీవనం॥

ప్రాగాసీ ద్వరగోళకే మరసదాచారైక రక్షామణిః।
శ్రీమా న్మూర్తిశివః శివాగమవచో వైదూర్య మేఘూరవః।
తస్యాభూ త్కవిభోగ్యభాగ్యవిభవో వైరాగ్యశంభు స్తనూ।
జాతస్థాపనసార్వభౌమపదవీం యోగాన్మహాయోగతః॥

యతీనాం నృపతీనాం చ నతానాం తనుతే స్థితిం(?)।
అష్టాంగ మపి సాష్టాంగం యోగం భోగం చ యత్పదం॥

తనయ స్తస్యవర్ణీశః తపో రాజ్య ధురంధరః।
దక్షిణామూర్తి రభవ ద్దక్షిణామూర్తి శంకరః॥

నిఖిలనిగమవిద్యా నీరజాంభోధినాథో
ధరణిదివిజశాఖి దక్షిణామూర్తిశంభుః।
వరద(?) మభయహ స్తం మాళిభాగే లతానాం
స్వపద మివ(విధ)త్తే చక్రవర్తిత్వహేతోః॥

రాజహంసకులో త్తంసాః యత్పదాంబుజసేవయా।
అనంతపదసంచారం దక్షం వీక్షం వితన్వతేః॥

భాతి తచ్చరణాంభోజభృంగ స్సంగయ నాయకః।
గురుభ క్తేః కులగృహం దేవినాయక నందనః॥

సహి ముక్కమళ్ల గ్రామం సంగ్రామజితశాత్రవః।
అమితాశాంతవిఖ్యాతి ఖ్యాతం రేనాటిసీవృతి ॥

పుణ్యశ్రీక స్సచ బహుఫలం పూర్త మిష్టం ద్విజానాం
(శ్రుత్వా) వాక్యం నిజకులగురో ర్దక్షిణామూర్తిశంభోః।
తస్య ప్రాంతే సరససలిలం పీృతయే ద్రోణభాజా
మంధుం గంధద్విపసమబలః సింధుబంధుం వ్యతానత్ ॥

శాకాబ్దే సింధు నాగాంబర శశిగణితే (1284) నాయకస్సంగయాఖ్యో
విఖ్యాత శ్రీ స్సవర్షే శుభకృతిమహితే మార్గశీర్షే(నుమాసే)।
సప్తమ్యా మిందువారే నిరుపమఫలదే హ్యుత్తమః పాదపూజాం
పుణ్యై స్తత్పూర్తజన్యై రతనుత సుకృతేః దక్షిణామూర్తిశంభోః॥

స్తుత్యం పుణ్యజనై స్తుపార శిశిర స్వచ్ఛాంబుపూరం జనా
మన్యంతే ధరణీపతిం త మభితః కూపం సరోమాననం।
ప్రాదుర్భూయ యత స్సహస్రపథగా చిత్రం గురో ర్దక్షిణా
మూర్తేః సంప్రతి కాంతి కీర్తిమహిమా స్వర్వాహినీగాహతః ॥

......పరిమితం క్షేత్రే పూర్వాద చ(?) మనోహరం।
ప్రాదా త్సద్ధర్మకూపస్య దేవినాయక నందనః ॥

భావినో యాచతే భూపాః ప్రాంజలిః సంగనాయకః।
పాలయంతు చ మద్ధర్మం గురుపాదసమర్పితం ॥

ఇదం కాచయభద్దేన(?) దక్షిణామూర్తి శాసినా।
రచితం శాసనం హేవ(?) దాసా దాచంద్రతారకం॥

స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

శ్రీసౌరాష్ట్ర సోమనాథాయనమః॥ మంగళం మహాశ్రీశ్రీశ్రీయుం
శేయును.

అంతు వహికి 33.

చెన్నూరుతాలూకా కొన్ని గ్రామములలో శిలాశాసనముల నకళ్లు వహీ ౧కి శాసనాలు ౨౪.

మవుజె పుట్టంపల్లె పరగణె చెన్నూరు సదరహీంగ్రామానకు ఆగ్నేయంవైపున ధనుకొండమ్మ అనే దేవత గుడివద్దనున్న రాయి మీాది శాసనం.

ఇష్టకామేశ్వర భైరవేశ్వర దేవునికి శ్రీమతు భారద్వాజసగోత్రం ఆశ్వలాయనసూత్రం కామరుసయ్యంగారి కుమారుడు పెదతిమ్మరుసయ్యంగారు యిచ్చిన ధర్మశాసనం శ్రీమన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరనృసింహారాయ మహారాయలు మాకు మురికినాటిలోన యేకభోగంగా ధారపోసి యిచ్చినది కడపకు దక్షిణం బండికనమకు పడమర పాలకొండమలమీాది పాలకొండ రాయని గుడికి ఉత్తరం గుంతిరాజు ఊటుకూరుకు తూర్పు అయిన యే(వే)పకుంటపల్లె అనే గ్రామం సిద్ధవటం యిష్టకామేశ్వర భైరవేశ్వర దేవునికి ఆరగింపు అవసరానకు సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను ధారపోసి యిచ్చినవివరం: ఈ గ్రామచతుస్సీమకు నైవేద్యానకు నిత్యా నాలుగుముంతల బియ్యమున్నూ......తాంబూళ్లమున్ను పరిమళశ్రీగంధమున్ను పుష్పాలున్నూ సమర్పించి నైవేద్యం సమర్పించి సిద్ధవటం ఇష్టకామేశ్వర భైరవేశ్వరుని గుడికాడ సత్రంబునకు పది ముంతలు బియ్యమున్ను మూాడుసోలలు పెసలున్ను సోలెడు నెయ్యిన్నీ రెండుకూరలున్ను తవ్వెండు...బానలమజ్జిగాను తాంబూలాలున్ను సహా నిత్యసత్రం కట్టడనడచే నేముపెట్టినది నిత్య అభిషేకం బ్రాహ్మణ సత్రానకు వండెబ్రాహ్మలకున్ను గ...శారికిన్ని.

ఈ రాతికి రెండో వైపున వున్నది.

కామరుసు అయ్యంగారి కుమారుడు పెదతిమ్మరుసు అయ్యంగారు సిద్ధవటం ఇష్టకామేశ్వరునికి అంగరంగభోగాలకున్ను సత్రానకున్ను సిద్ధవటం ఇష్టకామేశ్వర భైరవేశ్వరునికి పుణ్యంగాను ఆయే(వే)ప

కుంటపల్లె అనే గ్రామము సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను యిస్తిమిగాన ఆ యే(వే)పకుంటపల్లె అందలి నిధినిక్షేపజల పాషాణ అక్షీణ ఆగామి సిద్ధసాధ్యంబులనియెడి అష్టభోగ తేజసామ్యాలున్నూ అనుభవించి బ్రాహ్మలకు కట్టడచేసిన సత్రం మొదలైన అంగరంగ భోగాదులున్నూ ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. నైవేద్యానకు కట్టడచేసిన నాలుగుముంతల బియ్యాం నైవేద్యమున్ను మధ్యాహ్నమప్పటి అభిషేక కాల........సమర్పించి అందులోను బియ్యాం మరిముంతెడున్ను...అనుభవించేది...గుడివద్ది సత్రం...వారెఅనుభవించేది. ఈ నలుతుము యేపగుంటపల్లె గ్రామ పొలిమేర తూర్పుకు కడప తిరుమల దేవరపల్లి పొలిమేర దక్షిణమున్ను పోతులాట గుడిమిట్ట...పంపు మేర... దేవళంమేర పడమట ముత్తరాజు వారి అగ్రహారం పల్లెపొలిమేర మరి ఉత్తరానకు లోంతువాంగు మేరగాను పూరంగర పొలమాన్యంచేను గెరుసుగాను మేర ఈ చతుస్సీమాను పొలిమేరగాగల యే (వే)పకుంటపల్లె గ్రామమందలి దేవమాన్యాలు భటవృత్తిమాన్యాలు పాలకొండ రాయనికి యేదుంమడి వినాయక దేవరకు తూమెడుమడి పెరుమాళ్లకుతూమెడుమడి యెక్కలిదేవికి మడి తూమెడున్నూ యిరుస పోతురాజుకు మడితూమెడు పాలకొండరాయనికి చేనుయిద్దుము గణాధిపతికి చేనుయిరుస బ్రాహ్మణవృత్తి మాన్యాలు యల్లాల లింగంభట్లగారికి పుట్టియేదుమున్ను చేనుయేదుమున్ను, మల్లావోదులతిమ్మయ్యకు మడితూమెడున్ను చేనుతూమెడున్ను, అన్నమోజులు మడితూమెడు,భయిరావొజ్జల అన్నయ్యకు మడితూమెడు, కపవరాజు బుద్దయ్యకు మడిముత్తుమున్ను చేనుయిద్దుమున్ను, శ్రీవత్స గోత్రం ఆశ్వలాయనసూత్రం సోమరుసుకొడుకులు మల్లయ్యలక్కరుసుం గారికి మడియేదుమున్ను చేనుయిద్దుమున్ను, లింగరుసుంగారికి మడియేదుమున్ను చేనుయిద్దుమున్ను, శ్రీవత్సగోత్రం ఆశ్వలాయనసూత్రం గంగ రాజు తిమ్మయ్యకు మడినలుతుమున్ను చేనుయిద్దుమున్ను, అవుబళదేవుని వీరయ్యకు మడి యిద్దుం చేను తూమెడున్ను, అభిషేకంచేసే బ్రాహ్మనికి నలుతు మడి మాన్యం, గుడి తమ్మళి యేకాలాన ఆకాలాన దొరికిన బ్రాహ్మనికి మడి సాగించి అభిషేకం చేయింపువారు. సత్రానకు వండే

బ్రాహ్మలకు మరి యేదుమున్ను చేనుయిద్దుమున్ను చెల్లించి ఆ గ్రామాన యెత్తివచ్చే రొఖ్ఖంవల్లను నెలకునాలుగేసిరూకలలెక్కను పెట్టువారు. రెడ్డిమాన్యం మడి తొమ్మందుమున్ను చేను తొమ్మందుమున్ను కరిణీక మాన్యం మడియేదుమున్ను చేనుయేదుమున్ను, దసవందమాన్యం పూర్వ మర్యాద............

మవుజె మామిళ్లపల్లెలు చేన్నూరు సదరహిగ్రామానికి దక్షిణం రెండుపరుగులదూరమున బండ్లమడుగు చాకిరేవుగుట్టదరిని రాయి మీద శాసనం.

రామసాగరం యేటిపసిడికాలువ అగ్రహారంపొలం కాలవ మొగాళం.

మలుచింతకొమ్మదిన్నె పలుచెన్నూరు యిలాకె కడప సదహెమ మజుకూరులో జనార్దనస్వామిదేవాలయములో శిలాశాసనములు.

దేవాలయ మహాద్వారముకు లోతట్టున కుడిబాజూన అరుగుచేరువునఉన్న రొమ్ములపొడవు రాయిమీదనున్న తెనుగు శాసనం.

సూర్యుడు. శంఖం. తిరుమణి చక్రం. చంద్రుడు

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౪౭౮ అగు నేటి నళసంవత్సర మార్గశిర శు ౧౦ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరసదాశివదేవ మహారాయలు విజయనగరమందు రత్నసింహాసనారూఢుండై పృధ్వీసామ్రాజ్యం సేయుచుండంగాను శ్రీమన్మహామండలేశ్వర మంద్రాజు నాగరాజయ్య దేవ మహారాజులయ్యవారి కార్యకర్తలైన యల్లపనాయనింగారు తమ యేలిక నాగరాజయ్యగారికి బుణ్యంగాను చింతకొమ్మ దిన్నె జనార్దన పెరుమాళ్లకు యిచ్చిన ధర్మశాసనం. రామరాజ్య తిరుమల రాజయ్య నాగరాజయ్యంగారికి పుణ్యంగాను జనార్దన పెరుమాళ్లకు పగటి ఆరగింపుకు దీపారాధనకు సాంగంగాను చేసేటట్టుగాను సూర్యగ్రహణ

పుణ్యకాలమందు చింతకొమ్మదిన్నె చెర్వుక్రిందను ధారవోసి యిచ్చిన మడి ఖ ౪ ౦ న్ను మొదటికట్టను తువ్వను స్థళాలు ౨ న్ను పందుమ్మడి ధారవోసి ఆచంద్రార్కస్థాయిగాను నడపగలది. ఇందుకు యెవ్వరు తప్పి నాను గంగకడ గోబ్రాహ్మల జంపిన పాపాన తల్లిదండ్రుల చంపిన పాపాన బోవువారు అని యిచ్చిన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ధ్వజస్తంభమువద్ద వున్న శాసనము.

చంద్రుడు. శంఖం. తిరుమణి. చక్రం. సూర్యుడు.

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరు షంబులు ౧౪౫౩ అగునేటి ఖరసంవత్సర ఫాల్గుణ బ ౧౧ లు శ్రీమద్రా జాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీఅచ్యుత దేవమహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై సామ్రాజ్యం సేయుచుండ గాను దేవాదిదేవుండైన గుత్తిరాజు వూటుకూరి అందున ప్రసన్నమైన శ్రీ తిరువెంగళప్పనికి శ్రీవత్సగోత్రం ఆశ్వలాయన సూత్రం యజుశ్శాఖా ధ్యాయులైన శ్రీ వీరమరాజయంగారి కొమారుడు తిరుమలయ్యంగారు అనంతాలైన దండములు సమర్పించి యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను, అచ్యుత దేవమహారాజులు అయ్యపరుసయ్య వారి నాయంక రానకు పాలించిన ఘండికోట సీమ సాళ్వాక నరుసప్పయ్యంగారు పారు పత్యంసేయుచున్న మాగుత్తకు పాలించిన కడపసీమ ఉభయతూగ సుంఖానకు చెల్లే వూటుకూరితాణెంలోను చింతకొమ్మదిన్నె గ్రామ కట్టుం ల్ ౯౦ అక్షరాలా తొంబైరూకలున్ను శ్రీ దేవాదిదేవుండైన ఊటుకూరను ప్రసన్నమైన కోనేటప్పని దధ్యోదనం ప్రాతఃకాలమందు దధ్యోదనం అవసరం ఆరగించేటట్టుగాను ధారవోసి అయ్యపరుసు అయ్య వారికిన్ని (సాళ్వాక) నరసప్పయ్యవారికిన్ని మా తల్లిదండ్రులకున్ను పుణ్యంగాను సమర్పిస్తిమి గాన ఆచంద్రార్కస్థాయిగాను దేవుండు అవధరింపంగలవాడు. ఇట్లనియిచ్చిన ధర్మశాసనం. ఈ ధర్మానకు యెవ్వరు

తప్పినాను తమ తల్లిదండ్రులనున్ను గోవులనున్ను కాశిలోపల వధించిన పాపానం బోవువారు. గోబ్రాహ్మలను వధచేసిన పాపానం బోవువారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాంజాయతే క్రిమిః ॥

గ్రామాన్కు దక్షిణము చెరువుకట్టవద్ద గంగమ్మదేవాలయముకు యెదుట నిల్వపాతియున్న రాయిపై శాసనం.

శ్రీరాములు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౬౬౯ అగునేటి ప్రభవనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు హాజరతు దర బందగి దివాణాలగారు చింతకొమ్మదిన్న రెడ్డికరణాలకు ఈ స్థళములో నున్న కాపులకు కమ్మవారికి వ్రాయించియిచ్చినచెరువు దసవందవు మాన్యం. మన ఊరి చెరువుకట్ట శిథిలమైపోతూవుండె గనుక ఆ కట్ట మీాద పనిచేసేటట్టుగాను మీాకు నిర్ణయంచేస్తిమి గనుక మీారు ఆ లాగు ననే కట్టమీాద వడ్డెవాండ్లచేత పనిచేయిస్తిరి గనుక మీాకు మాన్యం యిచ్చినస్థళం మళ్ల తూర్పున తువ్వచేను ౧౩ ముత్తుము మీాకు ఖండ దసవందముగాను యిస్తిమి గనుక ఆ చేను మీారు అచ్చుకట్టుకొని నీరారంభం కాడారంభాలు యేమి పయిరు పెట్టుకున్నా నిరాచ్ఛేదనగా మీా పుత్ర పౌత్ర పారంపర్యంతరముగాను నడిపించగలవారము. ఇందులకు యెవ్వరు ఆచ్ఛేదనచేసి నడిపించకపోయినా కాశీపట్టణమందు గోహత్య చేసి నటువంటి పాతకానకుపోదురు. ఇందుకు సాక్షి కట్టమీాది గంగమ్మ.

పరగణా చెన్నూరు తాలూకు మ॥ గువ్వలచెరువు మవుజె కొంపల్లె రెండు గ్రామముల సరిహద్దు పొలిమేర నూర్య కొమారుని కనుమమీాదనున్న శిలాశాసనం యొక్క నకలు.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౬౭ అగునేటి క్రోధన సంవత్సర మాఘ బ| ౩౦ శు||లు శ్రీ మద్రాజాధిరాజ పరమేశ్వర శ్రీ విజయబుక్కరాయల కొమారుడు శ్రీ వీరప్రతాప దేవరాయ మహారాయలు విజయనగరమందు పృథివీరాజ్యం చేయుచుండగాను సోమవంశ క్షత్రకులపవిత్ర ఆత్రేయగోత్రము శ్రీ మన్మహామండలేశ్వర అ(ం)త్యంబరగండ మన్యగజపతి సంబెట పిన్నయ దేవమహారాజులుంగారి కుమారుండు తిరుమలయ్య దేవమహారాజులు తమ తండ్రి పిన్నయకున్ను తమ తల్లి విరూపాజియమ్మగారికిన్ని పుణ్యముగాను సూర్యగ్రహణ పుణ్యకాలమందు ఉదయగిరి రాజ్యమందు మురికినాటి లోపలను.........గిరియందు మాకు నాయంకరానకు చెల్లే ఊటుకూరి దక్షిణ భాగమందు ఆ యూటుకూరికి చెల్లే సూర్యకుమారుని కనుమ అనువు(సుంకము) ఆ యూటుకూరి చెన్న కేశవదేవుని అంగరంగభోగాలకున్ను సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను ఆచంద్రార్కస్థాయిగాను త్రివాచకముగాను ధారపోసి యిస్తిమి గాన యీ అనువునందు దినసుపన్ను ధాన్యాదులు మొదలైనట్టి వస్తువులు అన్నిన్ని ఆ దేవునికి చెల్లంగలవి. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను తమపాలిటి ధర్మదేవతకున్ను తప్పినవారు ||

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం |
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ||

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం |
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ||

ఈ కనుమ అరసి(న)వారు సూర్యకుమారునికి...

దినానకు దుగ్గాడి(ణి)న్ని ముంతెడు బియ్యమున్ను ఉపహారానకు పెట్టువారు. ఆ ధర్మానకు తప్పినవారు పంచమహాపాతకాలు చేసిన పాపాన బోయినవారు. ఈ ధర్మానకు తప్పినవారు తమ తల్లిదండ్రులాను తమ గురువులాను కాశిలో గంగాతీరమందు చంపిన పాపాన పోవువారు.

దీనికి దక్షిణం వైపున సగంపగిలి తున్క పోయినది. ఉన్న సగంతునక పై శాసనం.

కృష్ణదేవమహారాయలనాడు తిరుమలరాయడు పృథివీ(రాజ్యం) సేయుచుండగాను స్వస్తిశ్రీ......కంఠాదీశ...అనేకకోటి బ్రంహాండ నాయకుండైన......పాలకొండ...కోనసూర్య కొమారుని కనుమ చేరి యున్న శ్రీ ప్రసన్న తిరువెంగ...దివ్య శ్రీచరణారవిందములకు...... గోత్రులైన శ్రీ మన్మహామండలేశ్వర బుక్కరాజు రామయదేవ మహారాజుల కుమారుడు తిమ్మయ దేవమహారాజులు అనంతము లైన సాష్టాంగ దండప్రణామములు సమర్పించి యిచ్చిన గ్రామ దాన ధర్మశాసన క్రమమెట్లన్నను మురికినాటి సీమలోను మాకు నాయంకరానకు చెల్లె...కడపనపల్లె......యంగ్రా... దేవుని నిత్య......... యిచ్చిన ధర్మశాసనం॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

సామాన్యోయం ధర్మ సేతున్నృపాణాం
కాలెకాలె పాలనీయో భవద్భిః।
సర్వానేతా న్భావినః పార్థివేంద్రా
న్భూయో భూయో యాచతే రామచంద్రః॥

మ॥ చెన్నూరుతాలూకు మ॥ రుద్రాయపల్లె గ్రామానకు దక్షిణ భాగమందున పొలంలో శాసనం నకలు.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు *౧౪౪౬ అగునేటి తారణ సంవత్సర శ్రావణ బ॥ ౯ సో॥ శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయుల కార్యకర్త తిరుమలరాజయ్యగారు పృధివీరాజ్యం సేయుచుండగాను స్వస్తిశ్రీ కలియుగ...భక్త వాంఛిత వరప్రదానావతార అనేకకోటిబ్రహ్మాండనాయకులైన త్రైలోక్యదైవ శిఖామణులైన పాలకొండమలమీాద సూర్య కొమారుని కనుమమీాదను వేంచేసిన శ్రీప్రసన్న తిరువెంగళనాథుని దివ్య శ్రీచరణారవిందములకు ఆత్రేయగోత్రులైన శ్రీమన్మహామండలేశ్వర ఆరవీటి బుక్కరాజు రామయదేవ మహారాజుల కొమారుడు తిమ్మయదేవ మహారాజులు అనంతములైన సాష్టాంగదండములు సమర్పించి యిచ్చిన గ్రామ దాన ధర్మశాసన క్రమ మెట్లన్నను, ముదికినాటి సీమలోను మానాయంకరానకు చెల్లె ఊటుకూరు సీమలోని కడపనపల్లె అనేటిగ్రామము ప్రసన్న తిరువెంగళనాథదేవుని నిత్యనైవేద్యానకు నిధినిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్యంబు లనియేటి అష్టభోగ తేజస్వామ్యసహితమానట్టుగాను సర్వమాన్యంగాను నిత్యనైవేద్యాలుకు శ్రీకృష్ణజయంత్తి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారా పూర్వకముగాను సమర్పిస్తిమిగాన ఈ గ్రామం ఆచంద్రార్కస్థాయిగాను దేవుని నిత్య నైవేద్యాలకుగా సమర్పించిన ధర్మశాసనము.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

సామాన్యోయం ధర్మసేతు నృపాణాం
కాలేకాలేపాల నీయో భవద్భిః।
సర్వానేతా న్భావినః పార్థివేంద్రా
న్భూయోభూయో యాచతే రామచంద్రః॥

---

* A. R. No 614 of 1938-39.

పరగణే చెన్నూరు పైకి మవుజె కొంపల్లెలో కావలివాళ్లు యాకర్ణు పెదకదిరప్ప చినకదిరప్ప యఱ్ఱ కొండమనాయుడు వీరివద్దవున్న తామ్రశాసనం రెండు రేకుల మీది శాసనములు.

సూర్యుడు. చంద్రుడు.

శ్రీరామా.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౯ అగునేటి కాళయుక్తి సంవత్సర వైశాఖ శు। ౧౫ లు శ్రీమద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివదేవమహారాయలుగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీసామ్రాజ్యం సేయు చుండగాను శ్రీ మన్మహామండలేశ్వర గుత్తిరాజు తిమ్మరాజుగారున్ను ఊటుకూరు పధ్నాలుగు గ్రామములు అగ్రహారములు రెడ్లు కరణాలు శ్రీ మన్మహానాయంకాచార్యులైన నారెకదిరప్పనాయని కొమార లక్కినాయనికి వ్రాయించి యిచ్చిన కావలిమాన్యం మేరవర్తనలు కనుమ కావలికిగాను వ్రాయించి యిచ్చిన తామ్రశాసనము. కనుమకాపాడే నిమిత్తం నాగరెడ్డిపల్లె పొలంలో చేను ఖ ౦౪౦, కొలుములపల్లె పొలంలో గుర్రంగుంపు చెరువు క్రింద మడి ఖ ౦౪, గ్రామాదులు కాపాడె నిమిత్తం గ్రామాదులకు చేను మడి మేరవర్తనలు నిర్ణయం చేసినది. ఊటుకూరు చేను ఖ ౦।౦ మడి ఖ ౦।౦, చింతకొమ్మదిన్నకు చేను ఖ ౦।౩ మడి ఖ ౦। తోట ము ౪, రామసాగరం తిమ్మసముద్రాలకు చేను ఖ ౧౪ మడి ౧౪, కాపుర్తి అగ్రహారానకు చేను ౧౨ మడి ౧౩, అప్పరాజు పల్లెకు చేను ౧౨ తోటముంతలు ౧౨, పచ్చాపురం అగ్రహారానకు చేను ౧౦౪।, అక్కయ్యపల్లెకు చేను ౧౨ మడి ౧౪, బుగ్గలపల్లెకు చేను ౧౨, ప్రసన్నరాయనిపల్లెకు చేను ౧౦౪. గొల్లపల్లెకు చేను ౧౦, రొమ్ముల పల్లెకు చేను౧౪ మడి ౧౪, గోవులచెరువుకు చేను ౧౦, తాడిగొట్లుకు చేను ౧౦౪ మడి ౧౦కి ధాన్యం ఖ ౦౧౦। మడకకు ల్ ౧ మగ్గానకు ల్ ౧ పెండ్లికి ల్ ౧ ఈ ప్రకారం నిర్ణయంచేసి వ్రాయించి యిచ్చినారం గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్కస్థాయిగాను అను భవించుకు ఉండమని వ్రాయించి యిచ్చిన తామ్రశాసనం. పిమ్మరాజు

గారి వ్రాలు, రామసాగరపల్లె శస్వావర్ధులు వ్రాలు, ఊటుకూరి బుచ్చన భట్లు వ్రాలు, కరణం తిప్పరాజు వ్రాలు, పచ్చాపురం రామభట్ల వ్రాలు, కరణం కసవరాజు చెన్నప్ప వ్రాలు, ఊటుకూరి గురిని రెడ్డి వ్రాలు బొమ్మరాజు వ్రాలు అక్కమ్మరాజు వ్రాలు, చింతకొమ్మదిన్న గజ్జల బసిరెడ్డి వ్రాలు కరణం నారప్పరాజు వ్రాలు, చెన్నమరాజు వ్రాలు, కొప్పర్తి కానుల చెన్నశాస్త్రిల వ్రాలు కరణం రామరాజు వ్రాలు, తాడిగొట్ల చెన్నారెడ్డి వ్రాలు కరణం శేషాద్రి వ్రాలు, అప్పరాజు పల్లె బసిరెడ్డి వ్రాలు కరణం నారాయణప్ప వ్రాలు. అక్కయపల్లె అప్పిరెడ్డి వ్రాలు కరణం బొమ్మరాజు వేరమరాజు వ్రాలు, బుగ్గలపల్లె అన్నమరాజు వ్రాలు తిమ్మరాజు వ్రాలు, ప్రసన్నరాయని పల్లె కరణం అయ్యలరాజు తిప్పరాజు వ్రాలు, గొల్లపల్లె కరణం కసవరాజు బుచ్చిరాజు వ్రాలు, కొల్మలపల్లె పోలిరెడ్డి వ్రాలు కరణం సూరపరాజు వ్రాలు, గోవుల చెరువు కరణం కసవరాజు అప్పయ్య వ్రాలు. ఈ గ్రామాదుల అగ్రహారీకులు రెడ్లు కరణాల సమ్మతిన ఊటుకూరు అగసాల వెంకటగిరి చేత వ్రాయించి యిచ్చిన తామ్రశాసనము. సీతారామార్పణ మస్తు.

మ॥ గంగనపల్లె పరగణె చెన్నూరు సదరహు మవుజె మజుకూరులో వెంకటాచలపతి దేవాలయం గోడకు ఉన్న శిలాశాసనం॥

శుభమస్తు ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౩౫ అగునేటి పరాభవ సం॥ ఆషాఢ బ॥ ౧ లు శ్రీమన్మహామండలేశ్వర మట్ల తిరువెంగళనాథరాజు దేవచోడ మహారాజులు గారి కార్యకర్త......

ధ్వజస్తంభం కట్టపై రాయిమీాది శాసనము.

వికృతి సంవత్సర మాఘ శు॥ ౭ లు గంగనపల్లె వేంకటేశ్వరునికి యెర్రమరెడ్డి అప్పయ్య యెత్తించిన గరుడ కంభము.

మ॥ పెండ్లిమర్రి పరగణె చెన్నూరు సదరహు మ॥ మజుకూరుకు దక్షిణం వీరభద్రుని దేవాలయం ప్రాకారంలో శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౬౮ అగునేటి పరాభవ సంవత్సర చైత్ర బ॥ ౧౧ సో॥ శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాజయ్యవారి ఆనతిని అళియరామరాజయ్య దేవమహారాజయ్య వారి ముందరను నంద్యాల చినతిమ్మరాజయ్యవారు వేయించిన శిలాశాసనం. పెండ్లిమఱ్ఱి మంగలవారు అచ్చేపన్ను సిద్ధాయం కానికె కావలి వెచ్చం దొమ్మరిపన్ను సహాగాను సర్వమాన్యం చేస్తిమి, గాన యిందుకు యెవ్వరు తప్పినాను కాశీలో గోబ్రాహ్మణుల వధచేసిన పాపాన వోదురు.

మరిన్ని మనిషి ప్రతిమ పురుషుడు ౧, స్త్రీలు ౨, పులి ౧, జాగిలములు ౨ ఇవి యున్న రాయిపై శాసనం.*

కర్ణాటి కన్నమరెడ్డి కొడుకు వీరయ పులిపొడిచి వీరుడై నిలచెను.

మ॥ చిన్న దాసరిపల్లె పరగణె చెన్నూరు సదరహు మ॥ మజు కూరుకు దక్షిణం అరపరుగుదూరం పొలమల కొండలో నూతులకోన ఓబలదేవర గుడివద్ద నున్న శాసనములు.

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౯౧* అగునేటి సాధారణ సంవ త్సర కార్తిక శు। ౧ గురువారాన స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర భాషగె తప్పువరాయరగండ మూరురాయరగండ పూర్వదక్షిణ పశ్చిమ సముద్రా ధీశ్వర శ్రీ వీరబుక్క-రాయలు విజయనగరానను సుఖసంకథా వినోదం బున పృథ్వీరాజ్యంబు సేయుచుండగాను స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర మీసరగండ కఠారిసాళువ సంకిదేవమహారాజు కుమారుడు మంగయ దేవమహారాజు మురికినాటిలోను...పెండ్లిమఱ్ఱి యేలుచున్న తమ

1. A.R. No. 408 of 1938-29.
2. A. R. No. 338 of 1938-39

తండ్రి సంకిదేవరాజుకున్ను తమ తల్లి మల్లదేవమ్మగారికి పుణ్యముగాను వోగునూతుల శ్రీ అహోబళదేవరకు అంగరంగ భోగానకుగాను ఆ దేవర పేరను కట్టించిన పల్లెకు చతుస్సీమ......ధారవోసి యిస్తిమి.

ఇవతల అక్షరములు శిధిలమైనవి.

దీనికి ఉత్తరం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు (౧౪౫౬)* అగునేటి విజయ సంవత్సర జ్యేష్ఠ శు। ౧౫ లు శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ అచ్యుతరాయ మహా రాయలు పృధ్వీరాజ్యం సేయుచుండగాను ఆ రాయల కార్యకర్తలయిన బాచరుసునారు గండికోటసీమ యేలుచున్న ఆ గండికోట సీమలోను వొంగునూతుల అవుబళేశ్వరులకు చెల్లే ఆ ఓగునూతులపల్లెకున్ను నడచే దుర్గదణాయనివర్తన...స్తావగమకట్నాలు సుంకం మొదలైన అందు ధారబోసి యిచ్చిన ధర్మశాసన క్రమ మెట్లన్నను తాళపాక తిరుమ లయ్యగారు ఆనతియ్యగాను రాయల అప్పణపద్ధతి విరభ్వేరుని సన్నిధిని సర్వమాన్యంగాను ధారవోసి యిస్తిమి అని యిచ్చిన ధర్మశాసనం. ఈ దుర్గం యెవరు యేలినాను ఈ రీతిని తప్పక నడచువారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దీనికి దక్షిణాన పగిలిన శాసనం.*

......దుర్మతి సంత్సర శ్రావణ.........వీరప్రతాప శ్రీదేవ రాయ మహారాయలు విజయనగరమందు సుఖ సంఖథా వినోదంబున పృథ్వీరాజ్యంసేయగాను శ్రీమన్మహామండలేశ్వర అంత్యంబరగండ సంబెట......కుమారుడు సోమదేవరాజు మహారాజుల గర్భ రత్నా కర సుధాకర పిన్నయదేవుని కుమారుడు వల్లభయ్యదేవమహారాజు

1. A. R. No 337 of 1938–39.
2. A. R. No. 339 of 1938–39.

తమతండ్రి పిన్నమరాజుకున్ను తమతల్లి......తమకుల కోట్లకున్ను పుణ్యంగాను వోనూతుల ఓబళదేవర తిరుపతిని...పన్నిద్దరు ఆళ్వార్లకున్ను క్రొత్తగాను ప్రతిష్ఠచేసి ఆదేవుళ్లకు ఉపచారాలకున్ను యిచ్చిన ధర్మశాసనము. మాకునాయంకరానకు చెల్లేటి పెండ్లిమర్రి బుక్కాపురముచెరువులో కలెంరాజు వారి కాలువాను ఆ కాలువక్రింద పండె అంతవట్టు వరిమడిన్ని ఆ స్థళాననే మఃణువు(?)చేనున్ను తూమెడు తోటాను యింత వట్టు మాతాతలు పిన్నమరాజు సోమిదేవరాజు రామరాజుగారికిన్ని మాకుల కోట్లకున్ను పుణ్యంగాను ధారవోసి ఆచంద్రార్కస్థాయిగాను త్రివాచకంగాను యిస్తిమి యీ దేవళానకు నగళ్లు కట్టిన(క)ంద్ధవోలి కాశఅన్నోజుకొడుకు అనంత్తోజుకు పెట్టినటువంటి గృహారామక్షేత్రాలు. మాకు చెల్లే పెండ్లిమర్రి బుక్కాపురం చెరువుక్రింద కట్టంబొందిన కాన మడి మణువు ముత్తుము వరి మడిన్ని చెరువులోని సుద్దకాలువస్థలము వెలి చేనున్నూ ఆ స్థళానవె తూమెండు తోటాను యింతమట్టు ఆచంద్రార్కస్థాయిగాను ధారపోసియిస్తిమి. ఈ క్షేత్రాలకు అష్టభోగతేజస్వామ్యంగాను చెల్లంగలవి. శ్రీమన్మహామండలేశ్వర అంత్యంబరగండ సంబెట వల్లభయ్యదేవమహారాజుల ప్రధాని మల్లినాయని కొడుకు్క సర్వెప్పనాయుడు వల్లభరాయని ఆనతి క్రమానను వారికుల గోట్లకున్ను పుణ్యంగాను లక్ష్మీదేవి నగరు పన్నిద్దరు ఆళ్వార్లనగరున్ను కట్టించెను.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

మ॥ అనిమెల పరగణె వెంపల్లె యిలాకె కడప. సదరహుమజుకూరికి దక్షిణం పాపఘ్ని నదీతీరమందు సంగమేశ్వరుని దేవాలయం వద్ద శిలాశాసనముల నకళ్లు.

దేవాలయముకు ఉత్తరం ప్రాకారం వెలుపట శమీవృక్షము క్రిందనున్న శిలాశాసనము యొక్క నకలు.*

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౫౩ అగునేటి ఖర సంవత్సర వైశాఖ బ॥ ౧౦ సో॥ శ్రీమతు స్వస్తి శ్రీపర్వత శ్రీ స్వయంభూ శ్రీ లింగచక్రవర్తి శ్రీమల్లికార్జున దేవర దివ్యశ్రీపాదపద్మారాధకులైన శ్రీకైలాసగిరి నున్న ద్యావాపృథ్వీ మహాత్మ్య ముఖ్యమైన సిద్ధభిక్షావర్తి అయ్యా మొదలైన స్వస్తి సమస్త జన వినుత పంచాశతకోటి భూమండల విస్తీర్ణ...భూరిగుణగణాలం కృతులున్ను సత్య ఆచారచారిత్రులునైన వీర్యవిపులవిజ్ఞానవీరసింహా సన వీరభుజ వీరభలోల(టో ?)త్సాహ విజయ ధర్మప్రతిపాలకులైన స్వస్తి సమస్త నిజనామాంకమాలికా ప్రశస్తసహితులైన శ్రీమద్గణేశ్వర గౌరీశ్వర దేవర దివ్యశ్రీపాదపద్మారాధకులైన అయ్యా(వళీ) ముఖ్యమైన చాలుమూల సమస్త యాభై ఆరు దేశాల సెట్లు పెక్కండ్రున్ను శ్రీమద్దేవాదిదేవ దేవతాసార్వభౌమ సర్వదానందపరిపూర్ణం సప్త రుషివరదుండైన శ్రీ అనిమెల సంగమేశ్వర దేవునికిన్ని దేవవేశ్యాభు జంగుడైన దక్షయజ్ఞవినాశనుండైన భద్రకాళీమనోరంజితుడైన శ్రీ అనిమెల శ్రీ వీరభద్ర దేవునికిన్ని యిచ్చిన మగతు(మ?)ధర్మశాసన క్రమమెట్లన్నను: పులివెందల కనుమ చింతకనుమ గండికనుమ పెండ్లిమర్రిని నడచే ఆదిమార్గాన నడచే దూదికంటం మూలపెరిక రసవర్గాలు పోకలు మిర్యాలు అల్లం నువ్వులు జవళిక చాయి ముఖ్యమై బియ్యం జొన్నలు రాగులు మొదలైన గోనె ఒక్కంటికి సంగమేశ్వరు నికి దీపారాధన నైవేద్యానకు ల్ ౧౮ వీరేశ్వరుని నైవేద్యానకు ధారపోసియిస్తిమి. ఈ మర్యాదను తప్పక నడపగలవారము. ఆచంద్రా ర్కంగాను యిస్తిమి ఈ ధర్మం యెవరు తప్పినాను వారికి దేశాలవారి చలవాది వాడిమిండఢు.

---

* A. R. No. 201 of 1937-38.

తూర్పుద్వారం వద్ది శాసనం వెలపల యెడమబాజున వున్న శాసనం నకలు.*

శుభమస్తు॥

సమస్తుంగ శిరశ్చుంచి చంద్రచామర చారవే।
త్రైలోక్య నగరాంభ మూల స్తంభాయ శంభవే॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలిశాహన శకవరుషంబులు ౧౪౬౫ అగునేటి శోభకృతు సంవత్సర భాద్రపద శు॥ ౨ సోమవారం శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢుండై పృథ్వీసామ్రాజ్యం సేయుచుండగాను కాశ్యపగోత్రం ఆపస్తంబ సూత్రం యజుశ్శాఖాధ్యాయులై సూర్యవంశోద్భవులైన శ్రీమన్మహామండలేశ్వర బొమ్మరాజుగారి పౌత్రులయిన మంగరాజుగారి పుత్రులయిన గురవయదేవచోళమహారాజులుంగారు తుంగభద్రానదీతీరమందు శ్రీ విరూపాక్షదేవుని సన్నిధిని శ్రీరంగరాజు రామరాజుంగారి మూలాన శ్రీ సదాశివమహారాజులచేత రెండు తామ్రశాసనాలు పుచ్చుకొని శ్రీమద్దేవాదిదేవ దేవతాసార్వభౌమ సచ్చిదానందపరిపూర్ణ సప్తఋషివరదుండైన అనిమెల సంగమేశ్వరదేవునికి ఔభళమ యయితమ్మ అనె దేవుళ్లు యిద్దరున్ను సంగరాజు పినసంగరాజు తమ్మరాజు రుద్రరాజు బసవరాజు పెదచిట్టిరాజు చినచిట్టిరాజు పొట్టిసంగరాజు పాపసంగరాజు అనె తొంమ్మండ్రు కుమాళ్లు సమీపస్తులై యుండంగాను అఘనాశనీ పావనీ సంగమస్థళాన శివరాత్రి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారాపూర్వకంగా ధారపోసియిచ్చిన గ్రామాలు అనిమెలనందిమంగలాలకు ఒక తామ్రశాసనం వెంపల్లి పాళ్లేళ్లకు ఒక తామ్రశాసనం గండికోటసీమలోనిది అనిమెల దొరగంటి సీమలోనిది పాలెం కూటవగుళ సీమలోనిది వెంపల్లినందిమంగలాలు యీ నాలుగు గ్రామాలం గల నిధినిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్యాలనేటి అష్టభోగతేజస్వామ్యా

* A. R. No. 197 of 1937-38.

లున్ను దేవభోగ్యంగా సమర్పించి అంగరంగ వైభవాలున్ను డ్వైబె రెండు వినియోగాలున్న ఆచంద్రార్కంగా సాగేటట్టుగా కట్టడచేసి త్రివాచికంగా ధారపోసియిచ్చిన ధర్మశిలాశాసనం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥

శాకే భూత రసాబ్ధిచంద్రగణితేబ్దె శోభకృత్సుజ్వలే।
పక్షే భాద్రపదే ద్వితీయతిథియుగ్వారే విధోగుర్వరాట్ ॥

పాపఘ్నీయుత పావనీతటజుషే శ్రీసంగమేశాయసచం(?)।
క్ష్వాదాచతురోధ్రువంరుదయిత(?)గ్రామాణ్ మహావైభవం॥

శ్రీ శ్రీ శ్రీ యుంజేయును.

ద్వారాన కుడి బాజున నున్న శాసనము యొక్క నకలు.

శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరు షంబులు ౧౫౧౮* అగునేటి నందన సంవత్సర అధిక ఆషాఢ శు। ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరవెంకటపతి దేవ మహారాయలు పెనుగొండస్థళమందు వజ్రసింహాసనారూఢుండై పృథ్వీ సామ్రాజ్యం సేయుచుండగాను శ్రీమద్దేవాదిదేవ దేవతాసార్వభౌమ సచ్చిదానంద సప్తఋషివరదుండైన అనిమెల సంగమేశ్వర దేవుని అంగరంగవైభవాలకు కాశ్యపగోత్రం ఆపస్తంభసూత్రం యజుశ్శాఖా ధ్యాయులైన సూర్యవంశోద్భవులైన శ్రీమన్మహామండలేశ్వర గురవ రాజు బసవరాజుగారి పుత్రులైన గంగాధరరాజు దేవచోడమహారాజులుం

* A. R. No. 198 of 1937–38.

గారు సోమగ్రహణపుణ్యకాలాన అఘనాశనీ పాపఘ్నితీరమందు సమర్పించియిచ్చిన చేను అనిమెలను చేను ఖ ౧ పుట్టెండున్ను వరిమడి ఖ ౦౪ పందుమున్ను ఉత్తమస్థళం యిస్తిమి......మొరకలగొంది చేను ఖ ౧ న్ను గంగిరెడ్డిపల్లె స్థళం ఖ ౧౪ తోటలగెడ్డ స్థళం వనంసహా ఖ ౧ రాయలవారు పెట్టినది చింత్తలచేను స్థళం సహా ఖ ౭ పూజలు చేసే జంగం పినబసువయ్యకు వేపమానుస్థళం ఖ ౪౩ న్ను ఉభయంచేను సర్వమాన్యం యిస్తిమి దేవళం దగ్గిరనుండు...దేవుని పొలంలోనుపల్లె నుండికాంపులు......కున్ను సర్వమాన్యం యిస్తిమి. ఇందుక్కు తప్పక నడపగలవారం అని మెలప్రసన్న వెంకటేశ్వర దేవునికి అనిమెలనుచేను ఖ ।౦॥ పాళేన మడి ఖ ౦।౦ న్ను నైవేద్యదీపారాధనకు సమర్పిస్తిమి. ఈ చేలు మళ్లకు మానగరివారు వాత్యలు(?)సేయరాదు. దేవునిముద్ర నడవగలది. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను సంగమేశ్వరుని పాదాలకు తప్పాలు.

స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి సష్టాయాం జాయతే క్రిమిః॥

ఈ రాతికి రెండో వైపునను,

పాళెంగ్రామానను వరిమడి సల్లాజానంమ్మ మడిస్థళం రామిరెడ్డిగారి తిప్పిరెడ్డి దసవంద మాన్యానకు ఉత్తరం కరణం జియ్యనగారి మాన్యానకు దక్షిణం రెడ్డికరణాల మాన్యాలకు నడుము వరిమడి గట్టి ౩౦ ముప్పై వరహాలకున్ను ఖ ౧౪ అక్షరాల పుట్టెడు పందుము వరిమడి యిస్తిమి. కార్తిక ఫలానకు ౧౧ టికి పంగం కాణికి సహా ౯ ౨ న్ను, వడ్లు ఖ ౦। టికి విక్రయం ౯ ౬ లున్ను ఉభయం కార్తీక ఫలానకు ౯ ౮ లున్ను వైశాఖ ఫలానకు ౧౧ కి పంగం ౯ ౦౪ లెఖ వడ్లు ౧౩౪ టికి విక్రయం ౯ ౩౪ ఉభయంవైశాఖ ఫలానకు ౯ ౪ లున్ను ఉభయం ఫలాలు రెంటాను రొక్కం ౧౧ టికి గుత్త ౯ ౧౨ లెక్క వరిమడి ఖ ౧౪ టికి యేడొక్కంటికి గట్టి ౩౦ వరహాలకున్ను వరిమడి అమరించి యిస్తిమి. ఉభయం అనిమెలపాళెం గ్రామాలు రెంటాను

చేను వరిమడి గట్టి ౨౦ వరహాలకున్ను మీాకు యి_స్తిమి గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను సంగమేశ్వర దేవుని సన్నిధిని వీణెకిన్నెర వినుపించి యీా చేనుమడి అనుభవించు వారు. ఇందుకు యెవ్వరుతప్పినాను సంగమేశ్వర దేవునికి తప్పిన వారు. ఇట్లని యిచ్చిన ధర్మశాసనం.

మా॥ మొయిళ్లకాలువ తాలూకు చెన్నూరు గ్రామానకు నైఋతి భాగమందు తిరువెంగళనాథస్వామి దేవాలయం ధ్వజ_స్తంభానకు తూర్పుకు పాతియుండె రాయిమీాది శాసనం.

చక్రం. సూర్యుడు. తిరుమణి. శంఖం. చంద్రుడు.

శ్రీమతే రామానుజాయనమః॥ స్వ_స్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౮* అగునేటి దుర్ముఖి సంవత్సర ఆషాఢ శు॥ ౧౧ లు శ్రీమహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ అచ్యుతరాయదేవరాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢుండై పృధ్వీరాజ్యముసేయుచుండగాను ఉదయగిరివీరణొడయల తింమ్మరాజుగారికుమారుడు రాయసంవెంగళప్పగారు యిచ్చిన ధర్మశాసనక్రమమెట్లన్నను రాయలు కొండికాలింగరాజయ్యవారికి నాయంకరానకుం బాలించిన కల్లూరిసీమలోను లింగరాజయ్యవారు మాకుముదలవెట్టిన మొయిళ్లకాలువను తిరువెంగళనాథుని నూతన ప్రతిష్ఠచేసి, దేవస్థానం గల్పించి తిరువెంగళనాథునికి అమృతపళ్లకున్ను అఖండతిరువళికకున్ను దశమిమహోత్సవాలకున్ను ధారవోసి యిచ్చిన చేను ర్య(రే)గట ఖ ౧ న్ను మడివులవిందమాని స్థళం ఖ ౪ స్థళ సుంకమున్ను దొమ్మరివారిచేత ధారవోయించిన దొమ్మరి పన్ను రంపతాడును మహాజనాల చేతను ధారవోయించిన చేను ఖ ౦। మడి ఖ ౦। న్ను దేవస్థానం ఉభయపార్శ్వాలలోను నేము వేయించిన వనం నారికేళాలు మామిళ్లు పనసలు ఉసిరికెలు వెలంగలు చింతలు నేరెళ్లు మొదలైన ఫలవృక్షాలున్ను యింతవట్టున్ను మా గురువులు తాళ

* A. R. No. 393. of 1938-39.

మాలింటిపాటి చేను ౧౨ ఉభయం ఖ ।౦ మాన్యం మడి గోరంట్ల మడిలో మడి ౧౧॥ అంతు చేను మడి ఖ ।౧॥౦ అంతు దఫాల రెంట్ల చేను మడి ఖ ౧।౨॥। కి హొన్నులు శ్రోత్రియం ౭౨ అక్షరాలా డెబ్బై రెండు వరహాలకు శ్రోత్రియం నిర్ణయంచేసి హిరణ్యోదకధారా పూర్వకముగా యిస్తిమి గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యం అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

నల్లప రెడ్డి వ్రాలు ౧ బసిరెడ్డి వ్రాలు ౧ కరణం కట్టా వెంకటపతి వ్రాలు ౧ సుబ్బయ్య వ్రాలు.

౧ గుడిపాటి పాపన్న వ్రాలు
౧ సంగమేశ్వరుని వ్రాలు

ఇప్పుడున్న యీ గ్రామం ౭౫ మిట్ట వరహాలు సరకారుకు యిస్తున్నారు. ఇది గాక తాలూకు మజుకూరు మ నందలూరు అనే గ్రామం వీరికె శ్రోత్రియంగా మయానా ప్రభుత్వం అయి యిందుకు విళంబి సంవత్సరం వరకు నడిచి బాహదూరు అ.ముల్లో గ్రామం సరకారు దాఖలా అయినది. పూర్వం జమీందార్లు వ్రాసియిచ్చిన దానపత్రం హాజరున్నది.

స్వస్తిశ్రీ శ్రీ వెంకటేశప్రసన్న శ్రీమధ్వశాస్త్ర అభిజ్ఞులయిన భల్లకి కొనేరాచార్యుల వారి పుత్రులయిన నరసింహాచార్ల వారికి.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౮౨ అగునేటి విక్రమనామ సంవత్సర శ్రావణ శు॥ ౧౫ లు కామలాపురం జమీందార్లు అప్పలరెడ్డి మూలగిరి కృష్ణప్ప అ॥ ప॥ కా॥ గారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియం దానపత్రిక. మా పరగణాలో మీరు శ్రోత్రియ గ్రామం కావలెనని అపేక్షిస్తిరి గనుకను। నందలూరు గ్రామం మేము అలాగె పనినిర్ణయం చేసిన వివరం: మీరు ఆ గ్రామంలో యిల్లుకట్టుకొని

వ్యాఖ్యానం చెప్పుకుంటూవుండి ప్రతి సంవత్సరం దివాణానకు రుసుములు యినాములు వర్షాశనాలు శివాలయ(శివాయ)జమాబంది సాలీలవారి నజరుబాబులు అష్టభోగ తేజస్వామ్యాలు సహాగాను మొకరరు హూన్నులు పంద్రా మోడీన ౪౦ వరహాలకు యిషలుకు కారువై శాఖలాను యిచ్చినారం. ఈ పై కం ముక్కుందాయ ప్రాప్తిన దివాణానకు చెల్లించి రశిరిగి (?) .........మీపుత్రపౌత్రపారంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను సుఖాన అనుభవించుకయుండవలెను. ఇటని స్వ(హస్తా)న వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక వహీ.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం ।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

స్వహస్తం క్రిష్ణప్ప వ్రాలు



(నాగరలిపిలో
వున్నది)
బాళాబోధా
(బాళాబందు ?

అప్పలరెడ్డి వ్రాలు

(ఈ ప్రక్క అడ్డముగా చిన్నవి నాలుగు పంక్తులు నాగరి అక్షరములలో వ్రాయబడియున్నవి)

మాజె లింగాలాలోనుండే నృసింహసోమయాజులవద్దనుండె సన్నదుల నకళ్లు హాలి యీ గ్రామం తురకాణ్యంలో జప్తిగా వున్నది. జప్తి అయి కొన్నాళ్లు శ్రోత్రియంగా నడిచెను. పౌఢ దేవరాయలవారు లింగాల అగ్రహారం యిచ్చేటప్పుడు నాగర తామ్రశాసనం పోయి యుండగాను దాని నకలు తెనుగు కాగితం నకలు.

నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామరచారవే ।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయశంభవే ॥

మృడానీవామాంకస్థితశిశుర ద్యప్రోద్యతకరస్స
మాకర్ష త్యేనం ప్రసభమసకృత్పుష్ప మతిమాన్ ।
యితీందుర్యచ్చేష్టాకృతపరిభవశ్శర్వశిరసం
విహాయాంత్తేనం తే తవ-హాసుముఖం నౌమిశిరసా ॥

తుండేనకాండంసకలం సమాత్తికం
వేదండవక్త్రోఽల ధేర్గృహీత్వా ।
యదున్నతాశ్వాద్వదనే నముక్తా
తారాభభూవు స్తమహాన్న మామి ॥

అశేషలోకవ్యవహారహేతు భూతాపినాణీకమలాసనస్య ।
ప్రియాసతీకంఠసమాశ్రయేతి చిత్రంచరిత్రంతవదేవిమన్యే ।
త్వమేవబ్రంహ్మేతి శృతిశిఖర ? వాదః ప్రకటిత
స్తువంతుత్వాంకేవా కతిపయవచోభిస్సుకృతినః ॥

త్వదన్యశ్శబ్దోమేయదిభవతి శక్తోహమధునా ।
ప్రవక్తుంబ్రాహ్మి త్వాం తదపిహృదయే దేవికలయే ॥

వరాహ త్వాంనౌమి ప్రళయసమయే (మ)గ్న(గ్న)పృథివీ ।
త(థా)వేధోవిష్ణుత్రినయన ముఖాశ్చప్రమనసః ।
బభూవుర్దేవా స్త క్షణ జనితకారుణ్య విభవో ।
యథాదంష్ట్రాగ్రేయాభవతు నితరాం సద్రుమనగా ॥

సుధాసారాధారా సురనికరదత్తాఖిల (?) వపు
స్సురేశానశ్రేణీగణిత సుగుణః శ్రీసమజని ।
త్రయఃత్రింశద్భార్యే(?) సమనయన చూడామణిరసౌ ।
సురాణాంమోర్గేమో భవతునితరాం శీతకిరణః ॥

తత్సంత్తా......భవద్యదురాజవంశే ।
దేవస్వయం మధు రిపుర్వసుదేవసూనుః ।
దుష్టాంనిహంతుమధశిష్టజనేష్ట దాతా ।
యోద్వాపరేప్రభురసావచితార్ధి(ఖిలారి ?)ంతా ।

కలాకల్పద్రుమ(?) కవివరజనాంగ్గార(?)నిలయః ।
కృతక్ష్మాభృత్కోటి ప్రకటితమహాదానసికరః ।
మహారాజశ్రీమాన్ సహ హరిహరభవద్బుక్కనృపతిః ।
పపౌ సర్వాన్ లోకాం స ఇత ఇహాపిస్మృతయశాః ।

సంగమక్ష్మాపతిర్జజ్ఞే బుక్కభూపాలనాయకాత్ ।
సహస్రాక్షస్సమ స్సోయం పాలయామాస మేదినీం ॥

తతస్సంగమభూపాలాద్దార్యాగర్భమహార్ణవే ।
చంద్రవజ్జనితో రాజా నామ్నా హరిహరో విభుః ।
సాక్షాద్ధరిహరావేకో హ్యసౌ శౌర్యశమాదిభిః ।
స్వాభేదనిశ్చయాయేవ జనానామపి ధర్మతః ॥

తస్మాద్ధరిహరాద్రాజ్ఞో మేలాంబాగర్భశుక్తితః ।
ముక్తామణిరభూదేకో దేవరాయమహీపతిః ॥

మేలాంబాదేవరాయాభ్యాం మహేశాభ్యామివోన్నతైః ।
గుణైర్యుక్తః కుమారోసౌ జాతో విజయభూపతిః ।
పురంధ్రీతస్యనృపతేర్నామ్నా నారాయణీసతీ ।
దమయంతీనలస్యైవ శక్రస్యచయథాశచీ ।

కమలాక్షస్యలక్ష్మీర్వా విధేర్బ్రాహ్మీయథాతథా ।
గిరీశస్యయథాగౌరీ సోయమాసీద్వధూమణిః ।
ప్రతాపవాన్ దేవరాయః పుత్రోజాతో మహాయశాః ।
విజయక్ష్మాపతేర్దేవ్యాం నారాయణ్యాం నృపోత్తమః ।

అధు(?)నా దేవరాయోపి పితృసింహాసనేస్థితః ।
శశాస సకలాంభూమిం ధర్మరాజోయథాపురా ।
ప్రతాపరుద్రతుల్యోసౌ క్షాంత్యాహిమవతాసమః ।
దాతృత్వే.....పాలః సామ్రాజ్యేచశచీపతిః ।

అంగవంగకళింగేశాః యస్యాజ్ఞావశగానృపాః ।
పాలయామాసురవసౌ సశుభ్రాత్పదభూషితః(?) ।

రాజాధిరాజశబ్దాఢ్వ(?) యో రాజపరమేశ్వరః ।
భాషాలంఘిశభూపాలభుజంగబిరుదాంకితః ।
మూరురాయరగండాంకః పరరాయభయంకరః ।
హిందురాయసురత్రాణో వందివర్గేణ వర్ణ్యతే ।

తుంగభద్రానదీతీరే నగరే విజయాహ్వయే ।
పిత్ర్యం సిహాసనంప్రాప్య పాలయ త్పృథివీ మిమాం ।

పుణ్యశ్లోకానుగుణ్యోయం దేవరాయమహీపతిః ॥
సకదాచిద్దేవరాయో సోండూరుపురవాసినః ।

కుమారస్వామిసందృష్టం పంచదశ్యాం చ కార్తికే
కృత్తికాశివయోగేసా మహోత్సవచికీర్షయా ।
సమాగత్యమహారాజః తస్థౌతత్రముదాన్వితః ।
తతఃస్సమీపేయోవిద్వాన్ హిమకుంటలవంశజః ।

సాంగవేదేసముద్రేషుకర్ణధార ఇవానఘః ।
తపస్వీబ్రహ్మనిష్ఠశ్చ విశ్వనాథాహ్వయోద్విజః ।
తస్యనప్తాసింగయజ్వామహారాజాగ్రతస్థితః ।
చతుష్షష్టిషుశాస్త్రేషు సమ్యగ్రక్షాపురస్సరం ।

సంవాదంసూరిభిఃకృత్వా విజయాసబభూవహః ।
రాజాధిరాజశబ్దాద్యా స్వరాట్ఛబ్దస్తథైవచ ।
యస్మిన్ శ్రుతి ప్రసిద్ధాస్తు తేనతుల్యోమహావిభుః ।
తతఃప్రీతః సవిదుషే హిరణ్యంభూషణాసిచ ।

వస్త్రాణిచ దుకూలాని అడభేదాంవాతు(?) ముఖ్యతః ।

తతశ్చరాజా సమవేక్ష్యవిద్వాన్ సత్కర్మకర్తుం నిరతాన్నదానం ।
వాంఛాయుతోగ్రామమముం యయాచే లింగాలనామానమసౌ
సుధీంద్రః ।

ప్రహృష్టచేతాఃనృపసత్తమోసౌ ప్రాయశ్చతస్మైద్విజపుంగవాయ ।
విఖ్యాతవిద్యాధికవైదికశ్రీసామ్రాజ్యయుక్తాయబుధోత్తమాయ ॥

శాకేక్షిసహ్స్ర గ్గుణభూభాసి తేసమే ।
ఖరాహ్వయేకార్తిక్యాం పౌర్ణమాస్యాంతిథౌశుభే ।
ఖవాసరే స్వామినికటే సభాయామాస్థితోన్నృపః ।
కృత్తికాశివయోగేచ హిరణ్యోదకధారయా ।

ఆపస్తంబాఖ్యసూత్రాయ కాశ్యపాయకుటుంబినే ।
సర్వదేవముఖేంద్రస్యపౌత్రాయ చ మహాత్మనే ।

సోమేశ్వరస్యపుత్రాయ సింగయజ్వాభిధాయచ ।

సోసౌ రాజాధిరాజో హరిహర నృపతేః పౌత్ర తామేత్యభూయో ।
బాహాసారప్రచారప్రకటిత విజయక్షోణిపాలస్యసూనుః ।
గ్రామంలింగాలనామ్నా విదిత ప్రా "గనిమేల" గ్రామ సామీప్యభాజం
ప్రాదాచ్ఛ్రీ పౌఢ దేవః సకలజనయుతం సత్తటాకాభిరామం ॥

ఇందులో నుండే శకం ౧౩౩౨ ఖర సం. కార్తిక శు॥ ౧౫ లు*
౨ రెండో సన్నదు.

(మరాటి లిపియున్న పంక్తి)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౮౧ అగునేటి ప్రమాదినామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౨ లు శ్రీమద్యజనయాజన షట్కర్మనిరతులైన హిమకుంటల విజయరాఘవసోమయాజుల వారికి శ్రీనివాసకోనేరి అమీలుపరగణె కామలాపురంగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక సన్న ౧౧౬౯ ఫసలి మ॥ కర్తిపల్లె పరగణెమజకూరుబెచిరాఖు అయివున్నది. మాకు శ్రోత్రియంగా వ్రాసియిస్తే కిర్దు అబాదా చేసుకొనేము అని మందలించుకుంటిరి గనుక అదేప్రకారం శ్రోత్రియం నిర్ణయం చేసియిచ్చిన వివరం. రుసుములు యినాములు వరుసాశనాలు శివాయిగాను సాదిలవారు పట్టి బాజులు దేశీలుగాను సర్వంమశ్హూ పందార్రిమోడీ హాసన్నులు ౧౮౫

* **The date is wrong – Ṣaka 1332 does not fall within the reign of Devaraya II.**

అక్షరాలా నూటయేనభై అయిగు వరహాలు కాగునైశాఖాలకు సకల సువర్ణాదాయాలు నిర్ణయంచేసి యిస్తిమి గనుక మీ పుత్రపౌత్రపారం పర్యం ఆచంద్రార్కస్థాయిగాను, అనుభవించుకొని సుఖాననుండేది. వేములవారి సుదాముడు కావలి రుసుము కట్టుబడి సదరహి బేరిజులో సాలుబసాలు ముజరా యిప్పించగలవారం.

స్వదత్తా ద్విగుణ్యం పుణ్యం పరదత్తాను పాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

श्रीनिवास कोनेरि

(ఈ పంక్తి అంతయు మరాటిలిపిలో వ్రాయబడినవి)

కామలాపురం అప్పళరెడ్డి (మరాటి సంతకము గలదు)

(ఇంకొకటి కూడా మరాటి సంతకమే యున్నది)

మౌజె ఇందుకూరిలో చెల్లె మజరా అయ్యవారిపల్లె శ్రోత్రియ దార్లు బిల్లూరి నృసింహశాస్త్రిలవద్ద వుండె దానపత్రం నకలు. అలీ ఖాను ప్రభుత్వంలో బిసమిల్లా సాహెబు.

ఉరుదు లిపి  ఫారసి మొహరు

మహ్మదాబాదు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౯౦ అగునేటి సర్వధారినామ సంవత్సర మాఘ బ॥ ౧౦ లు శ్రీమద్యజన యాజనధ్యయన అధ్యాపక దాన ప్రతిగ్రహషట్కర్మనిరతులైన హిమకుంటల అనంతశాస్త్రిలవారికి ఇందుకూరి అధికారి, రెడ్డికరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియదాన పత్రం. మీరు మా గ్రామంలో శ్రోత్రియంపల్లెకట్టిస్తున్నాము అని కావలెనని అడిగితిరి గనుక అదేప్రకారం నిష్కరషచేసి యిచ్చినది. పల్లెపోలానకు హద్దు దక్షిణం అంకిరెడ్డి జంగంబావికొన తోట హద్దు పడమట చాకల

వాని మూస్యప్త చేను హద్దు ఉత్తరం తేలాగివాని చేను హద్దు తూర్పు దోరణపుమాకుల కట్టవ మొదలు చేనుకి ఎక్రిగడ్డలచేను హద్దు గాను పొలం అయకట్టు నిర్ణయం అనంతభట్ల బావితోట దసబంధం కాక తోట ౧౦।।। కాడారంభం పొలం ఖ ౦।।।౩।౦ ఉభయంపొలం ఖ ౧ పుట్టెడుకి సంవత్సరం ౧కి ౪ ౧౮ వరహాలలెఖను పద్దెనిమిది వరహాల లెఖను విరోధి సంవత్సరంనుంచి యేడుయేండ్ల పర్యంతరం దివాణానకు యిచ్చి ఆవల యెనిమిదో సంవత్సరంనుంచి పల్లె ఆయకట్టుకు లోగా త్రొవ్వించిన బావులను, చాతుర్భాగం దసవందముగాక నిలిచిన పొలానకు సకలసువర్ణాదాయాలు, ఫలవృక్షాలు దేఖిలుగాను, యప్పటికి ముప్పైవరహాలకు శ్రోత్రియం నిష్కర్ష చేసియిచ్చినారం కనుక పల్లె కట్టించి రైయ్యతుల కుదిరించి పల్లెకిర్దు ఆబాదానుచేసి మీా పుత్రపౌత్ర పారంపర్యంతరం అనుభవించుకొని సుఖాననుండేది. అని వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రం. స్వహస్తం ఇందుకూరి కరణం మూర్తి రాజు వ్రాలు ప్రసన్నయ వ్రాలు.

స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా॥

శ్రీ శ్రీ శ్రీ

మాజె అల్లిదొనలో మజరా పీరలపల్లె పూర్వశ్రోత్రియం హాలి జప్తిఅయినది. శ్రోత్రియందార్లు లింగాలకాపరస్తులైన యజ్ఞేశశాస్త్రులు నైషధంవారివద్దనున్న దానపత్ర సన్నదులు యొక్క నకళ్లు.

౧. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౩ అగునేటి విషునామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు సోమోపరాగ పుణ్యకాలమందు (Monday 18th May A D. 1761.) శ్రీమద్యజయాజనాధ్యయన అధ్యాపన దానప్రతి గ్రహషట్కర్మ నిరతులైన వేదశాస్త్రసంపన్నులైన నైషధం లక్ష్మీనరసింహశాస్త్రిల

అయ్యవార్లు అల్లిదొనరెడ్డి కరణాలు అందరు వ్రాయించియిచ్చిన గ్రామ శ్రోత్రియదాన పత్రిక. మీరు మా గ్రామంలో చెల్లెగ్రామగ్రాసి పీరంపల్లె శ్రోత్రియం కావలెనని అడిగితిరి గనుక అదేప్రకారం మేము రెడ్డికరణాలు అందరూ సమ్మతించి, సంవత్సరం ౧కి పూర్వ ఆ పల్లె క్రింద చెల్లెపొలం రేగడి చేలు యఱ్ఱ చేలు తోటలు మరి నీరారంభంకాడారంభాలతో కూడా కారు వైశాఖాల సకల సువర్ణా దాయాలు ఫలవృక్షాలు సహాగాను ౧౫ వరహాలు అక్షరాలా పందొమ్మిను మొనబై అయిదు వరహాలకు నిర్ణయం చేసియిస్తిమి గనుక మాన్యాలు సివాయి సదరహిమ్పైకం కారువైశాఖాలకు ముక్కుం దాయ ప్రాప్తిన చెల్లించి, చెల్లించినందుకు చెల్లుచీటి తీసుకుంటూ రాగలవారు. గ్రామము కుదుర్చుకొని మీ పుత్రపౌత్రపారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం బరదత్తానుపాలనం ।
పరత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

పెద్దవోబళరెడ్డి వ్రాలు, పెద్దిరెడ్డి వ్రాలు, యఱ్ఱవోబళరెడ్డి వ్రాలు, కరణం చెన్నకృష్ణమ్మ వ్రాలు.

(సంతకం ఉరుదులో వ్రాసినారు).

మహాజతు అసారు పాపాశాస్త్రి బాఖియతు బాపందు స్న ౧౧౮౬ ఫసలి అదరివిల్లా అల్లిదొనరెడ్డి కరణాలు పీరపల్లె మీకు శ్రోత్రియంగా వ్రాయించినారుగదా, యే ప్రకారం అల్లిదొనరెడ్డి కరణాలు కౌలు వ్రాసియిచ్చినారో ఆప్రకారం తఫావతు కాకుండా నడిపిస్తున్నారం మరెబాబుకు వసవసాచేయక ఖాతిరుజమాతో రయితులు దిలాసాదిల్ బరి యిచ్చి కుదిరించి పల్లెకట్టించి అబాదాని చేసేదిగాన తెలిసేది.

(నాగరిభాషలో ఒకటిన్నర పంక్తి వ్రాసినారు)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౭ అగునేటి తారణ సంవత్సర శ్రావణ శు॥ ౧౫ లు శ్రీమద్యజనయాజన

అధ్యయన అధ్యాపక దానప్రతి గ్రహషట్కర్మనిరతులైన నైషధం లక్ష్మీనృసింహశాస్త్రులయ్యవారికి అల్లిదొనరెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన గ్రామ శ్రోత్రియపు దానపత్రిక: మీరు మా గ్రామంలో చెల్లె గ్రామకాంక్షసీ వీరలపల్లె శ్రోత్రియం కావలెనని అడిగితిరి గనుక అదే ప్రకారం మేము సమ్మతించి సంవత్సరం ౧కి పూర్వం ఆ పల్లె క్రింద చెల్లే పొలం రేగడచేలు యెర్రచేలు తోటలు మడి నీరారంభాలుతో కూడా కారువై శాఖాలు, సకలసువర్ణాదాయాలు ఫలవృక్షాలు సహా గాను ౫౮౦ వరహాలు యెనుబై వరహాలు అక్షరాలాపంధ్రామోడి యెనబై వరహాలకు నిర్ణయించే యిస్తిమి గనుక మాన్యాలు సివాయీలు యీ సదరహి ప్రైకం కారువై శాఖాలకు ముక్కుందాయ వ్రాప్తిగా చెల్లించి చెల్లించినందులకు చెల్లు చీటీలు తీసుకుంటూ రాగలవారు. గ్రామం కుదుర్చుకొని మీ పుత్రపౌత్రపారంపర్యంగాను ఆచంద్రార్క స్థాయిగాను అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

పెదవోబళ్రెడ్డి సమ్మతిని పెద్దిరెడ్డి వ్రాలు - వోబళ కొండారెడ్డి సమ్మతిని యెర్ర వోబళ్రెడ్డి వ్రాలు.

కరణం కృష్ణప్ప వ్రాలు, కృష్ణప్పసమ్మతిని స్వహస్తం వెంకటాద్రిముని వ్రాలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౮౩ అగునేటి తారణనామ సంవత్సర శ్రావణ బ॥ ౧౫లు శ్రీమద్య జనాది షట్కర్మ నిరతులైన నైషధం లక్ష్మీనృసింహశాస్త్రి వారికి వెంకటాద్రిపు వెంకాజి అమీలు. श्री वेंकटराव वेंकाजि పరగణె కామలాపురంగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రం: మాజె అల్లిదొనలో మజరా వీరలపల్లె మీకు శ్రోత్రియంగా

గ్రామస్తులు కారువై శాఖాలకు ప్రతిసంవత్సరం ౫ ౮౨ వరహాలకు నిర్ణయించేసియుండిరి గనుగ ఆ బేరిజుకు పల్లె లుకసాను మాచేత కాదని తమకు విడిచిపెట్టేమని అంటిరి గనుక మేమున్ను మీా లుకసాను తెలిసి మీాకు గ్రామస్తులు వ్రాసియిచ్చిన దానపత్రానకు ౫ ౨ అయిదు వరహాలు మాఫుచేసి మొకరరు ప్రతి సంవత్సరానకు ౫ ౮౦ యెనభై వరహాలు చంద్రాను మేము నిర్ణయించేసి శ్రీస్వామికి ప్రీతిగాను యిచ్చి నారం. మీా పుత్రపౌత్రపారంపర్యం త్తం ఆచంద్రార్కస్థాయిగాను శోత్రియం అనుభవించుక యీా సదరహి వ్రాసిన ప్రకారం దివాణానకు రూకలు అచ్చుకొనియుండేది. ఇట్లని వ్రాయించి యిచ్చిన దానపత్రం సహి.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

(సంతకం నాగరిలో నున్నది)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవర్షంబులు ౧౭౦౮ అగునేటి ప్లవ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౨ లు అల్లిదొన అధికారి రెడ్డి కరణాలు శ్రీమద్యజనాది షట్కర్మనిరతులైన నైషథం పాపాశాస్త్రిల వారికి వ్రాయించి యిచ్చిన గ్రామ శ్రోత్రియ దానపత్రిక. మా గ్రామంలో మజరా పీరలపల్లె మీాకు శ్రోత్రియంగా యిచ్చిన వివరం. ఆ పల్లెకు సుదామదు ప్రకారం పొలం మడి చేను తోట దేఖలు సంవత్సరానకు ౫ ౩౦ లు ముప్పై వరహాలు, ఆవల ముందరసంవత్సరం౫ ౩౨, ఆవల సంవత్సరాలు సంవత్సరం ౧ కి ౫ ౪౦ లెఖను, ఆవల సంవత్సరం ౧ కి ౫ ౫౦ వరహాల లెఖను యిచ్చినాము గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను అనుభవించుకొనేది.

యర్ర వోబుల్రెడ్డి వ్రాలు. కరణం వెంకటరామయ్య వ్రాలు. వోబళరెడ్డి వ్రాలు. చెంచురెడ్డి సమ్మతిని చినవోబల్రెడ్డి వ్రాలు.

అంతువహీ ౧ కి సన్నదులు తామ్రశాసనములుతో కూడా ౪౭

(ఈ పుటలో యేమి వ్రాయలేదు)

కమలాపురం గ్రామమునకు భాస్కరవారు అగ్రహారం చేసిన దాన పత్రం. అగ్రహారికులు వద్ద నున్న దానపత్రం నకలు, కిరణం సుబ్బ రాయని వద్దనున్న నకలు ప్రకారం శ్రోత్రియం దానపత్రం ప్రకారము వ్రాసి యిచ్చిన కైఫియ్యతు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౨౨ అగునేటి విక్రమనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులైన యేటూరి పరగణె కామలాపురం ప్రతినామమైన శాహాజీ మహాదేవపురం అగ్రహారస్థితా శేషవిద్వన్మహాజనులకున్నూ విస్సాజీ యమ్మాజీ భాస్కర కానుగోలు కులకరణీకులు కర్ణాటక దేశముఖ్ సరదేశముఖ్ మహాల్లానిహాయగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రిక. కామలాపురం సీమలో చెల్లే యేటూరుగ్రామము మేము శ్రోత్రియంహొన్నలు మల్లీలు(?) ౯౦ అక్షరాలా మల్లీలు(?) తొంభై యెనిమిది వరహాలకు తీసుకొని అగ్రహారం యిస్తివై రెండు వృత్తులు నిర్ణయంచేసి యిస్తిమి గనుక యీ సదరహిమ్మైకం దివాణానకు చెల్లించు కొని మీ వృత్తులు నిర్ణయం ప్రకారము అనుభవించుకొని మీ పుత్రపౌత్ర పారంపరియంతరం ఆచంద్రార్కస్థాయిగాను ఉండేది.

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥
స్వదత్తా ద్విగుణం పుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

సదరి గ్రామం అగ్రహారికులువద్ద నుండె దానపత్రాలు.

(ఇక్కడ మరాటి దస్కతు కలదు.)

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరషంబులు ౧౬౨౨ అగునేటి విక్రమనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమద్యజనాది

షట్కర్మ నిరతులైన స॥ గోటూరు ప॥ కామలాపురంకు ప్రతి నామమైన మహారాజశ్రీ బొపోజీమహాదేవపురం అగ్రహారస్థితా శేష విద్వత్ మహాజనులకున్ను విస్వాజీయమ్మాజీ భాకరా కానుగో కులకర్ణి కుల్లె కర్ణాటక దేశముఖి సర దేశముఖి మహల్లా నిహాయగారు వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక.

ఇందుకు వృత్తుల నిర్ణయం చేసినది.

| యజమాన వృత్తులు విస్వాజి | | అక్కకొండమాచార్యులు | |
|---|---|---|---|
| భాకరావారు | ౨ | | ౧ |
| బోనాల అచ్చిభట్లు | ౧ | కందనూరిజనార్దన భట్లు | ౧ |
| వెనుచర్ల వేంకటభట్లు | ౧ | ఉల్లిగొండం లక్ష్మణాచార్యులు | ౧ |
| కాసుల పినవెంకటసోమయాజులు | ౧ | కాసులరామన్న సోమయాజులు | ౧ |
| మోక్షగొండం అప్పకొండయ్య | ౧ | సాధు సుబ్బాభట్లు | ౧ |
| యమ్మనూరి రామచంద్రభట్లు | ౧ | రూపావతార తిమన్నభట్లు | ౧ |
| కైప అన్నంభట్లు | ౧ | కైప నరసింహశాస్త్రులు | ౧ |
| కైప ఓబళభట్లు | ౧ | సాధు నృసింహసోమయాజులు | ౧ |
| శివాజీ అవధూతు | ౧ | వెంకాజీ జక్కరసు | ౧ |
| గణేశసాన్నాజు | ౧ | విస్సమరాజు వెంగన | ౧ |
| కరణం నారాయణప్ప | ౧ | | |

ఈ సదరహి యిరవై, రెండు వృత్తులకు వృత్తి ౧ కి చేను కుందర పాండవ బీడు నలుతుం చెలకితూమెండు గుంత్తతోటి బీడు తవ్వొడు. ఈప్రకారం యీ యథాతిథి పుణ్యకాలమందు సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగాను యిస్తిమి గనుక యీ సర్వమాన్యం అనుభవించుకొని మీ పుత్రపౌత్రపారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని యుండేది.

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥



పారశీ మొహారు

సదరి భాకరా వారిది.

అమీలాని వ దేశపాండీయాని వ దేశముఖేయ్యాని హాలు వ యిస్తికబాలు మ॥ జంబులమడ్గు సర్కారుఘుండికోట బూదుబిదానందు సూయి స్నయిసనేతిస్సైనుఅల్ఫి కంచెనెపల్లి అప్పాజీ అచ్ఛరను హజూరున యిస్తిమాసు చేసెను. మ॥ చినదండ్లూరు పయిమజ్కూరులోను రెడ్డి కరణాలు చేతను బంజరు జమీను, వో లాయి ఖుజమీను కూడా హన్నులు ౫ ౨౨ వరహాలుకు కౌలు తీసికొని ఆజాగాను గోపాళపురం అనే పల్లె కట్టించి బావులు త్రవ్వించి వనం వేయించి యీ పల్లె అగ్రహారం చేసియిచ్చి బేరీజు సర్కారుకు పాచాయిస్తూ వచ్చినారు. ఇంద...మాజూలు అముఉదార్లు మొబలగు మజ్కూరుకు శ్రోత్రియం యిజారా కరారుచేసి నడిపిస్తూ వచ్చినారు. ఈ ప్రకారంగా మొహబ్బానీకిచేసి పరవానాకు హుకుం యిప్పించవలెనని యిందు మీద అప్పాజీ మజ్కూరు యిల్తిమాసు ఖాతిరు ముబారక్కు తెచ్చుకొని బదస్తురె సాబకుబాబు హుకుం యిచ్చినారు. సదరహు మొబలగు మజ్కూరు సాలు బసాలు సర్కారుకు కిస్తీల చాలుజమచేయించుకొని సదామదుబోలు నడిపిస్తూవచ్చేది. దంబాబు. తాకీదు తెలిసి వుజూరు చాయ పనిలేదు. చందు ౨౦ మాహేరబిసాని. ఫసలీ ౩౫(?).

నకలు వ్రాసికొని అసలు తిరిగీ యిచ్చేది.

మొకద్దమాని వ రయ్యాని వ కులకర్ణియ్యాని మ॥ చినదండ్లూరు మ॥ జంబులమడుగుకు ఆ సం॥ సూలున్నయిహాదే సమాశీను అల్ఫముల మజ్కూరుకొండవార నున్న పాండవబీడు కొంత ఖర్దుపొలం కాలకై తీఖండీ ఖ॥ ౫ అయిదుపుట్ల పొలముకు మక్తా వ ౫ ౨౨ వరహాలకు

బేరీజు తేరుగడచేసి కంచెనపల్లి అప్పాజీకి కౌలు వ్రాసియిచ్చినారు; గనుక యీప్రకారముగా రామాజీ రఘునాథ తలుదారునింగారు వ్రాసియుండగాను, ఆజాగాను వ్రయ ప్రయాసపడి గోపాళపురం అనేపల్లి కట్టి దేవళం, వనం, కోనేరు బావులు కట్టించి అగ్రహారం చేసినారు; గనుక యీ ధరా...మా కౌలు కావలెనని తెల్పుకొనె గనుక ఆప్రకారంగా కౌలు వ్రాయించి, ఆతగాని పేర దానపత్రం వ్రాయించి యిచ్చినారు. సదరహీ బేరీజు ముక్కుందాయం ప్రాప్తిని చెల్లించుకొని సాలుబసాలు శ్రోత్రియం నడిపిస్తూ వచ్చేది. ఖోజూదావెదూ ఖాను సన్నదూ.

జుబ్బుతేల మొకరాను కౌలూరి నల్లపరెడ్డి బతవజ్జుహాతు ఖాతరు వుమేసువారు బూమరిచిదానందు దమిలా కంచెనపల్లి అప్పాజీ జాహీరుచేసెను. యేమని చినదండ్లూరి పొలంలోను యిరవై రెండు వరహాలుకు జాగా తీసుకొని అక్కడ గోపాళపురం అనే అగ్రహారం కట్టించినారు. అందుమీాద మాజూలు అములుదారులు బేరీజు యిర్వై రెండు వరహాలు నడిపిస్తూ వచ్చినారు. నీవున్ను శ్రోత్రియం వ్రాసి యిచ్చి అందుకు యిప్పుడు అగ్రహారం నడిపించక ఖలలు చేస్తూ ఉన్నావట. ఇది మంచి పనికాదు. సాలింసాలా బాదుహుకుం యిచ్చినారం. వుజూరు సేయక నడిపించేది. దరింబాబు తాఖీదు తెలిసి ఫిర్యాదు రాకుండునట్లు నడుచుకొనేది. చ ౨౧ మాహెరబ్బిలవలు ౧౧౧౫ ఫసలి శకము ౧౬౨౭ లు.

ఈశ్వర సంవత్సర శ్రావణ శు॥ ౨ లు రాజశ్రీ కంచెనపల్లె అప్పాజీగారికి రాజశ్రీ కాలూరి నల్లపరెడ్డిగారు వ్రాయించి యిచ్చిన దానపత్రం. మా మొఖాసా, చినదండ్లూరి క్రింద వుండే గోపాళపురం శ్రోత్రియం అగ్రహారంగాను గ ౨౨ వరహాలుకు మీాకు బహుకాలాల నుంచి నడుస్తూ వుండెను గనుక ఈ సంవత్సరమున మాకు మొఖాసా అయినందున మా దానపత్రం కావలెనని మందలిస్తిరి గనుక మేము అది అంతా పూర్వోత్తరం విచారించి మీారు పెరుమాళ్ల గోపాలస్వామి కోవెల కట్టించి కోనేరు కట్టి అక్కడ వుంచినారు;

గనుక యీ ధర్మ ప్రయోజనానకు మేము సంతోషించి సాంతఃకరణ గాను మా యిష్ట దేవతా ప్రీతిగాను సాలిం సాలాబాదుబాలు ౫ ౨౨ వరహాలుకు శ్రోత్రియముగాను మన్నించినారం, ఈ లెక్క ముక్కం దాయం ప్రాప్తిగాను చెల్లించుకొని మీ పుత్రపౌత్రపారంపర్యంతంపల్లె అనుభవించుతు సుఖాన ఉండేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

నల్లప్పరెడ్డిగారు యిచ్చినది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౭ అగునేటి మన్మథనామ సంవత్సరం కార్తిక శు॥ ౧ లు రాజశ్రీ కంచెన పల్లి అప్పాజీ పుత్రులయిన......వుగారికి. చినదండ్లూరి రెడ్లు కరణాలు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ విక్రయ దానపత్రము. మా గ్రామము లోను చెల్లే మజరా గోపాళపురం బహుదినాలనుంచి శ్రోత్రియముగాను ౫ ౨౨ వరహాలుగ నడుస్తూ యుండగాను. ఇంతలో మహారాజశ్రీ కౌలూరి నల్లప్పరెడ్డిగారి కమామీసు పోయి కడపదివాణము క్రింద దాఖలు అయినందున పూర్వం ధొరలు వ్రాయించి యిచ్చిన దానపత్రం మాకు చూపి ఆప్రకారం దానపత్రం కావలెనని అడిగితిరి ; గనుక అందు లకు మేమునల్లురము సమ్మతించి సాంతఃకరణ పూర్వకంగాను శ్రోత్రియము నిష్కర్షచేసి యిచ్చినది. మహాలుతారీ హొన్నులు ౫ ౩౫ అక్ష రాలా ముప్పయిదైదు వరహాలు యిస్తిమి గనుక ముక్కందాయం ప్రాప్తిగాను శ్రోత్రియం రూకలు సాలుబసాలు సర్కారుకు చెల్లించి చెల్లినందులకు రసీదు తీసికొని గ్రామం ఖిర్దాబాదాను చేసుకుని మీ పుత్రపౌత్రపారంపర్యంతం అనుభవిస్తూ సుఖాన నుండవలెను. ఇటని మాత్రికరణ, త్రివాచకంగాను వ్రాసియిచ్చిన శ్రోత్రియ దానపత్రము.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మామిళ్ళలక్ష్మిరెడ్డి సమ్మతిన సారసల వెంకట్రాయని వ్రాలు,
గోవిందరెడ్డి సమ్మతిన కరణం పుచ్చకాయలపల్లె సుబ్బరాయని వ్రాలు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౦౪ అగునేటి శుభకృతునామ సంవత్సరం మాఘ శు॥ ౩ లు పండతు ఆజ్ఞము కంచినెపల్లి వరదా అప్పాజీగారికి, ఆజం మీర్జాగనీబేగు ఆమీలు ముదుప్పూరుగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియం, చినదండ్లూరి మజరా గోపాళపురం మీకును సుదాముదు నడుస్తూఉండెను; గనుక అదే ప్రకారం మేమున్ను సుదాముదు బమోజీబుసాబకు దస్తూరు శ్రోత్రియం మహాలూలీ హొన్నులు ౬ం అక్షరాలా యాభై వరహాలుకు హ॥ సుకృతముగాను మేము కరారుచేసి యిచ్చినారం; గనుక కిస్తీబందీ ప్రకారం సాలుబసాలు సర్కారుకు రూకలు చెల్లించి చెల్లినందుకు రశీదగీలు తీసుక గ్రామం విస్తారంగా కిర్దాబాదాను చేసి ఆలి అవల్యా దేవర్పర్యంతరం సుఖాన అనుభవిస్తూ వచ్చేది. సదఖులిహివే ప్రమాణ అమలేంత ఆణనేపషారిణిలే అను భోగకరూణ ౯ం దేతదానే బాతారీఖ చంద్ర ౧ రబిలబ్బల్ సన్ ౧౧౯౭ హిజ్రమొహార్ సూద్.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౦౧౩ (?)అగునేటి విరోధికృతునామ సంవత్సర భాద్రపద శు॥ ౧౩ లు రాజశ్రీ కంచెనెపల్లి అప్పాజీపంతులువారి పౌత్రులు అయిన వరదప్పపంతులవారి పుత్రులు అయిన కొండల రాయనివారికి కొలూరి వంశపయః పారావార రాకాసుధాకరులైన గుడిసూళ్ల గోత్రోద్భవులైన మహారాజశ్రీ రంగారెడ్డిగారి పౌత్రులయిన మోహనరెడ్డి గారి పుత్రులయిన రాజశ్రీ కుమారకృష్ణారెడ్డిగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ అగ్రహార దాన ధర్మపత్రిక. ఈ మరియాదగాను మా మొఖాసా చినదండ్లూరు గ్రామములోకి చెల్లే మజరా గోపాళపురం మా వృద్ధ ప్రపితామహులు దాన

పత్రం వ్రాయించి యిచ్చి నల్వు(?)యిచ్చినందున తదారభ్యం ఆస్థళానకు చెల్లే భూమిని సాగించి ఆబాదాను చేసుకొని అక్కడనున్న శ్రీ...... పూజసేయగలందులకు యుక్తుడయిన అర్చకుణ్ణి ఉంచి నిత్యనైవేద్య దీపారాధనలు నడిపిస్తూ సంవత్సరం ఒకటికి సర్కారుకు గ ౨౨ వరహాలు యిప్పించి అనుభవిస్తూఉండి యీ దినం మాసముఖానకు వచ్చి పూర్వం మాకు పెద్దలు వ్రాసియిచ్చిన దానపత్రం ఖిలమయినది అని చూపరాచేసి మీ పేర వఖ పత్రిక వ్రాయించి యిప్పించమని శ్రుత పరచినందున ఆ మాటకు అనుమోదితులమై మా గురు యిష్ట దేవతా ప్రీతిగా వ్రాయించి యిప్పించినారము గనుక ఆస్థళం భూమిలో ముద్దతు నుంచి నడిచిన దేవబ్రాహ్మణ భట యాచక స్థావరమాన్యాలు శివాయ చిక్కిన కాడారంభం నీరారంభంభూమి సాగించుక పూర్వము మరి యీద ప్రకారము శ్రీదేవతకు నిత్యనైవేద్య దీపారాధనలు నడిపించుక ప్రతి సంవత్సరం ౧కి దివాణానకు గ ౨౮ వరహాలు ముక్కుందాయ ముల యిప్పించుక మీ పుత్రపౌత్రపారంపర్యాయం ఆచంద్రార్క స్థాయిగా అనుభవించుక సుఖాన నుండేది.

శ్లో॥ స్వదత్తా ద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం॥
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా భవేన్మాతా విప్రదత్తా వసుంధరా॥

అనే న్యాయం చేత వ్రాయించి యిచ్చిన దానపత్రిక.

కుమార కృష్ణారెడ్డిగారి వ్రాలు.

మాజె పెద్దసెట్టిపల్లెలో మజరా శంకరాపురమునకు లోగడ శ్రోత్రియదారులు అయిన దుర్భాక వెంకటభట్లవారివద్ద నున్న కాగిద పత్రముల యొక్క నకళ్లు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౧ అగునేటి శుక్లనామసంవత్సర ఆశ్వీజ శు॥ ౧౧ లు శ్రీమద్యజన యాజన

అధ్యయనాధ్యాపక దానప్రతిగ్రహషట్కర్మనిరతులయిన ఆపస్తంబ సూత్రులయిన, ఋశ్శాఖాధ్యాయులైన(?) శాలంకాయనసగోత్రులైన దుర్భాకు వెంగన్న పౌత్రులైన వెంకట భట్టు పుత్రుడైన వెంకటజోగి సోమయాజులవారికి సెట్టిపల్లె రెడ్డికరణాలు వ్రాయించియిచ్చిన శ్రోత్రియ గ్రామ పత్రిక. మా పొలంలో చౌడూరుదోవను పల్లె కట్టుక వేద శాస్త్రాలు చదువుకుంటూ ఉండేమని చెప్పుకొంటిరి, గనుక అలాగు మేము సమ్మతించి పల్లె కట్టుకొనేటందుకు స్థళం నిర్ణయం చేసిన వివరము. తూర్పు చెన్నరాయుని మాన్యం చౌడూరి దోవ ఆదిగాను ఆగ్నేయానకు తాటివనం ఆదిగాను దక్షిణానుకు పినాకిని నది ఆదిగాను నైరుతి వరుణ దిక్కులకు చౌడూరి పొలిమేర ఆదిగాను వాయువ్య కుబేర యీశాన్యాలకు కరణాల మాన్యం ఆదిగాను యీ అష్ట దిక్కులకులోనైన పొలం నిష్కర్షచేసి మడి ఖ ౧, చేను ౨, ఉభయం చేను మడి ఖ ౪ నాలుగుపుట్లు నిర్ణయంచేసి పూర్వదత్తమైన మాన్యాలు బేరీజుగాను యిస్తిమి; గనుక యీ నిర్ణయంచేసిన పొలాన్ని ప్రతి సంవత్సరం శ్రోత్రియం రుసుం బాజే ఖర్చు సహాగా గ ౮౦ యెనభైవరహాలు చొప్పున నగరికి యిస్తూ మీ పుత్ర పౌత్ర పారంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక సుఖాన నుండేది. ఈ పైకం కార్తికానకు గ ౬౦ వైశాఖానకున్ను గ ౨౦ లు యీ ప్రకారం ప్రతి సంవత్సరము యిస్తూ-వచ్చేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా భవేన్మాతా విప్రదత్తా వసుంధరా ॥

మద్వంశజాః పరమహీపతి వంశజావా।
యేభూమిపాః స్సతత ముజ్జ్వల ధర్మచింత్తా।
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి।
తత్పాదుకద్వయమహం శిరసావహామి ॥

రెడ్లు, మన్నె యర చెన్నారెడ్డి బయ్యాపరెడ్డి వెంళగరెడ్డి తల్లప రెడ్డి నాగిరెడ్డి బండి ఆత్మకూరి బుద్దారెడ్డిగారి సమ్మతిన సల్లగురుమూర్తి కుమారుడు శివరాయడు వ్రాసిన శ్రోత్రియ దానపత్రిక. గురుమూర్తి కుమారుడు శివన్న వ్రాలు. మద్దూరి పెద్దిరాజు కుమారుడు లింగరాజు వ్రాలు. జంబుల దిన్నె వెంకటకృష్ణమ్మ కుమారుడు వెంకట చెన్నయ వ్రాలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౧ అగునేటి శుక్లనామ సంవత్సరం భాద్రపద శు॥ ౧౧ లు శ్రీమద్యజనయాజనాధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మ నిరతులయిన ఆపస్తంబసూత్రులయిన యజుశ్శాఖాధ్యాయులైన శాలకాలం కాయనస గోత్రులయిన వెంకటజోగి సోమయాజులవారికి శంకరాజీ నరసా సేఖుదారీ ప॥ దువ్వూరుగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దానపత్రిక. సెట్టిపల్లె పొలంలో చౌడూరిదోవను భవానీశంకరాపురం అనేగ్రామం పేరు పెట్టుక పల్లెకట్టుక వేదశాస్త్రిలు పాఠం చెప్పుకుంటూ ఉండే మని చెప్పుకుంటిరి; గనుక ఆలాగే మీాగు పల్లెకట్టించేటందుకు స్థళనిర్దేశంచేసిన వివరము. తూర్పుకు చెన్నరాయని మాన్యం చౌడూరి దోవచేను ఆదిగాను ఆగ్నేయానకు తాటిపనం ఆదిగాను దక్షిణానకు పినాకినీనది ఆదిగాను నైరుతి వరుణ దిక్కులకు చౌడూరి పొలిమేర ఆది గాను వాయవ్య కుబేర యీాశాన్యాలకు కరణాల మాన్యాలు ఆదిగాను యీా అష్టదిక్కులకు లోనైన పొలం సిపర్ష చేసి మడి నీరారంభం ఖ ౧ చేను ఖ ౩ ఉభయం ఖ ౪ ఖండీలు నాలుగుపుట్లు నిర్ణయంచేసి పూర్వదత్త మైన మాన్యాలు బేరీజుగాను యిస్తిమి గనుక యీా నిర్ణయం జేసిన పొలానకు శ్రోత్రియం అష్టభోగ తేజస్వామ్యాలు లోనుగాను రుసుములు బాజాఖర్చులు దేఖీలుగాను బేరీజు కారువై శాఖాలకు శ్రోత్రియం పంద్రామోడీన ౫ ౮౦ వరహాలుకు నిర్ణయంచేసి యిచ్చి నారం. ప్రతివర్షము దివాణానకు చెల్లించుకొని మీా పుత్రపౌత్రపారం పర్యం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక సుఖాన నుండేది.

(యిక్కడ మరాటిభాషలో వ్రాయబడి యున్నది.)

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికా ధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా భవేన్మాతా విప్రదత్తా వసుంధరా ॥

మద్వంశజాః పరమహీపతి వంశజావా ।
యేభూమిపాఃసతతముజ్వల ధర్మ చింతా ।
మద్ధర్మమేవ పరిపాలనమాచరంతి ।
తత్పాదుకద్వయ మహం శిరసా వహామి ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౬౭౪ అగునేటి ఆంగీరసనామ సంవత్సరం మార్గశిర శు॥ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులైన దుర్భాక వెంకటభట్లు కొమాళ్లు దుర్భాక వెంకటజోగి సోమయాజులవారికి ఖానువాలా ఖానుఖానే అజం హాషుదారుఖాను మహామ్మదైసాహేబులవారు రాజశ్రీ హాండేబాగు అప్పాజీ పంతులవారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియం దానపత్రిక. స్న ౧౧౬౨ ఫసలీ సెట్టిపల్లె పొలంలోను చౌడూరి దోవను భవానీశంకరాపురం అనే పేరుపెట్టి పల్లెకట్టుక వేదశాస్త్రిలు చెప్పుకుంటూఉండే మని చెప్పుకొంటిరి గనుక అదే ప్రకారం హాజరతుగారికి సుకృతంగాను మేమున్ను మశుహూరులు ఆనాం శంకరాజీనరసా ఆమీలు మ॥ దువ్వూరుగారు. మీకు శుక్లనామ సంవత్సరాన స్థళనిర్దేశం చేసి వ్రాసియిచ్చిన దానపత్రిక ప్రకారం మేమున్ను సెలవుయిచ్చి దానపత్రం వ్రాయించినాము, మీరు పల్లెకట్టించి అష్టదిక్కులకు లోనైన హద్దుల ప్రకారం పల్లెకట్టించి సీరారంభం మడి ఖ ౧ చేను ఖ ౩ ఉభయం ఖ ౪ నాలుగుపుట్లు నిర్ణయం చేసి పూర్వదత్తమయిన మాన్యాలు బేరీజుగాను యిస్తిమి ; గనుక యీ నిర్ణయం చేసిన పొలానకు శ్రోత్రియం అష్టభోగ తేజ స్వామ్యాలులోను గాను రుసుములు బాజేఖర్చులు దేశిలుగాను బేరీజు కారువై శాఖాలుకు శ్రోత్రియం శంకరాజీనరసా ఆమీలు మ॥ దువ్వూరుగారు యిచ్చిన దానపత్రం ప్రకారం మేమున్ను పంద్రామోడీని గ ౮౦ వరహాలుకు

నిర్ణయంచేసి యిచ్చినాము. ప్రతివర్షం దివాణానకు సదరహీ బేరీజు చెల్లించుకుంటూ మీా పుత్రపౌత్ర పారంపర్యం అనుభవించుకుంటూ సుఖాన నుండేది.

దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

శ్రీమతు సకలగుణ సంపన్నులయిన శ్రీమహామేరుసమానులగు సెట్టిపల్లె రెడ్లు కరణాలకు రా॥ శంకరాజీ నరుసో శేఖుదారు పరగణే దువ్వూరుగారు ఆ॥ న॥ స్న ౧౧౫౯ ఫసలీ మవుజె మజుకూరు దుర్భాక వెంకటభట్లు కుమారుడు వెంకటజోగి సోమయాజులవారు, భవానీ శంకరాపురం అనే గ్రామం కట్టించెను, మడి ఖ ౧ చేను ఖ ౩ ఉభయం ఖ ౪ నాలుగుపుట్లకు శ్రోత్రియం నిర్ణయంచేసి యిప్పిస్తే పల్లె కట్టం చేను అని చెప్పుకొనె గనుక శ్రోత్రియం బేరీజు రుసుములు బాజే ఖర్చులు దేఖేలు పంద్రామోడీని గ ౧౦ యెనభై వరహాలుకు ప్రతి సంవత్సరం దివాణానకు చెల్లించేటట్టు నిర్ణయంచేసి దానపత్రం వ్రాయించి యిచ్చినారం. అదేప్రకారం దానపత్రం వ్రాసియిచ్చి వీరి పుత్రపౌత్రపారం పర్యం నడిపించేది.

మౌజె రామేశ్వరములో రామేశ్వర దేవరగుడి పూజచేసే తంబళ్లు మూలస్థానం నాగరాజువద్దనున్న తాటిఆకులపయిన వ్రాసి యుండే మతలబులు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౩౨ అగునేటి విరోధినామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౦ లు రామేశ్వరం కరణీ కానకుగాను కన్నెలూరి తిరుమలభట్ల కుమారుడు బుచ్చిరాజున్ను, గూడూరి వెంకట కుమారుడు తిమ్మరాజున్ను, కామనూరి యల్లమరాజు కుమారుడు సుబ్బరాజున్ను, కైసాపురం తిరువేంగళప్ప కొమారుడు తిరుపతి, తంబళవారు మూలస్థానం అయ్యలు పెదనాగయ్య చోడయగారి నాగయగారు రామేశ్వరం కరణీక కాణయాచ్చిగాను, తొక్కటపడి

బ్రాహ్మలు నలుగురున్ను కాణయాచ్చి తమదనిన్ని తమ్మళ్ళవారు కరణీక కాణయాచితమదనిన్ని ఉభయత్రులు బహుదినములునుంచి తొక్కటపడి మహారాజశ్రీ భయ్యా సిరాంమణి సాహేబుల వారితో అభర్గణంచేసి(?) అనుభవిస్తూయున్నారని తంబళ్లవారు తెలుపు కొనిరి; గనుక అందుకు సాహేబులువారు తమ పేరట శేఖుజీన్ను అలావ(ర్దీను)గారున్ను రామేశ్వరం జాగీరుపత్తేఖాను కాకడు ఖిల్లేదారు వారి పేరను ఫరవానా వ్రాయించి, చుట్టుపట్టు గ్రామములు, పొదటూరు సెట్టిపల్లె విల్లూరు మాలెపాడు పోట్లదుర్తి రామేశ్వరము యీ గ్రామముల రెడ్డి కరణాల పేరను పరవానా వ్రాయించి రామేశ్వరం కరణీక కాణయాచి ధర్మస్థితిగా తేరుగడ చేయించుమని సెలవు యిచ్చిరి; గనుక ఆలాగుననే శేఖుజీనున్ను అలావద్దీనుగారున్ను గ్రామముల రెడ్డి కరణాలు కూడి రామేశ్వరుల సన్నిధానమందు కూర్చుండి, ఆవాదిప్రతివాదుల ఉభయత్రుల వాజ్మూలవ్యవహారము విని, యిది బహుదినములనాటి తొక్కులాట గనుక యిందుకు ఆలోచన చేసి రామేశ్వరం స్థళం పన్నిద్దరు ఆయమేరగాండ్లు కూర్చి, ఆర్ద్రవస్త్రాలతోటట్టు ముక్తిరామేశ్వరుల సన్నిధానమందు ఆవాదిప్రతివాదుల నిలిపి ఆయమేరగాండ్లకు లోపలికి తీర్థంపైకి ప్రసాదమున్ను యిప్పించి రామేశ్వరం స్థళంకరణీక కాణయాచి యెవరిది అయితే వారిని తీసుకరమ్మని ఆయమేరగాళ్లతో నాలుగు ఊళ్ళ పిన్నపెద్దలు మందలించిరి గనుక ఆతీరుననే పన్నిద్దరు ఆయమేరగాంల్లు యేకవాక్యతగా మాటలాడుకొని రామేశ్వరం కరణీకం పూర్వోత్తర సాంగత్యంగాను తంబళవారిదేను; కామనూరి సుబ్బయ కైసాపురం తిరుపతిగారి తాతగారికి పనిలేదు; వీరి తండ్రిగారి నాటినుంచి ఆచ్ఛేదన భుక్తమంతేగాని నిరాచ్ఛేదన లేదు; అని తంబళవారిని రెట్టపట్టి తీసుక వచ్చిరి, గనుక యీదారభ్యాన్నుంచి తంబళవారిని మీా పుత్రపౌత్ర పారంపర్యంతరం మీా కరిణీకం మీారు అనుభవించమని శేఖుజీన్ని అలావద్దీనుగారున్ను పొదుటూరి సెట్టిపల్లె మాలెపాడు పోట్లదుర్తి విల్లూరు రామేశ్వరం పిన్నపెద్దల సమ్మతిన తమ్మళవారికి వ్రాయించియిచ్చిన జయులేఖ. మాలేపాటి రెడ్డి సమ్మతిన కరణం

రాజన్న వ్రాలు సర్వరాజు వ్రాలు. సెట్టిపల్లె వన్నె వెంకటరెడ్డి వ్రాలు, పోట్లదుర్తి పరిగెపాటి పాపిరెడ్డి ఘంటంముట్టిన సౌంజ్ఞ, పొదటూరి ఆచం వెంకటరెడ్డి మోపూరి నలఓబుళరెడ్డిగారు ఘంటం ముట్టిన సౌంజ్ఞ, ఆలాణిశాయిపంతుల వ్రాలు, రామేశ్వరంరెడ్లు కోనేరు చిన వోబుళురెడ్డి ఉండవోలు బుచ్చిరెడ్డి చామల తిమ్మారెడ్డిగారున్ను ఘంటం ముట్టిన సౌంజ్ఞ, ఇరగంసెట్టి వోబళసెట్టి కొమారుడు వెంకటసెట్టి ఘంటం ముట్టిన సౌంజ్ఞ, అల్లీమహమ్మదు ఘంటం ముట్టిన సౌంజ్ఞ, వీరల యెదుటను బొల్లవరం శేషాద్రి వ్రాసిన జయలేఖ.

చిత్రభానునామ సంవత్సరం ఆషాఢ శు॥ ౫ లు శ్రీమతు రామే శ్వరం స్థానీకులకు, పాశం వోబుళు వ్రాయించి యిచ్చిన ఒడబాటు కమ్మ. మీలో మీకు రెండు సగాల స్థానీకులకున్ను కరణీకం వ్రాసుకు నేటందుకున్ను వంత్తులు చెల్లక, మునుపు మీదగ్గిర హాస్తకంగానున్న నూరపరాజు మల్లయ్యను పరిహరించి, నన్ను నిలుపుకుంటిరి గనుక మీ రెండు సగాల స్థానం వారికిన్ని సమ్మతమైనట్టు లెక్కపత్రం వ్రాసుక, యేడు ఊళ్లమునిమంద హద్దుకు లోగానున్న క్షేత్రమున్ను రామయ లింగానకు నడిచే నిత్యోత్సవ కట్టడలు సహా మీరు చెప్పినట్లు లెక్క పత్రం వ్రాసుక మీ బుద్దిలో నుండగలవాడను. మీకు మనసురాక యెప్పుడు పరిహారిస్తే అప్పుడే మీ సొమ్ము మీకు విడిపెట్టి పో గల వాడను. దాన క్రయ మితి భోగ్యాదులు పెట్టగలవాడను కాను. ఇటని నా రాజీని ఒప్పివ్రాయించియిచ్చిన ఒడబాటు కమ్మ. ఇందుకు సాక్షులు వోబుళునేని చినవోబుళున్ను, కిచ్చప్పనాయుడున్ను, పెదకామన్న వీరల సమ్మతిన స్వహాస్తం. పాశం వోబుళయ్య వ్రాసియిచ్చిన ఒడబాటు కమ్మ సాక్షులు పప్పు రామలింగం.

నందననామ సంవత్సరం వైశాఖ బ॥ ౨ లు శ్రీమతు రామేశ్వరం స్థానీకులకు బయ్యాన్న తిమ్మప్పగారు వ్రాసియిచ్చిన ఒడబాటు కమ్మ. మీలో మీకు రెండు సగాల స్థానీకులకున్ను కరణీకం వ్రాసుకునే టందుకు వంతులు చెల్లక మునుపు మీ దగ్గిర హాస్తకంగానున్న పాశం

వోబుళయ్యగారిని పరిహరించి, మమ్ము నిలుపుకుంటిరి, గనుక మీ రెండు నగాల స్థానంవారికిన్ని సమ్మతమైనట్టు లెక్కపత్రం వ్రాసుక యేడు పూళ్ల మునిమంద హద్దుకు లోగావున్న క్షేత్రముకున్ను రామయలింగానకు నడిచే నిత్యోత్సవ కట్టడలున్ను నహాగా మీరు చెప్పినట్లు లెక్కవ్రాస్తూ మీ బుద్ధిలో నుండగలవారం. మీకు మనస్సురాక యెప్పుడు పరిహరిస్తే అప్పుడే మీ సొమ్ము మీకు విడిచిపెట్టి పోగలవారం; దాన క్రయమితి భోగ్యాదులు పెట్టగలవారము కాము ఇటని మారాజీ ఒప్పి వ్రాయించి యిచ్చిన ఒడబాటు కమ్మ. ఇందుకు సాక్షులు అన్నదానం చెంచు వోబుళ నేని చిన్నవోబుళు యున్ను కిచ్చప్పనాయుడున్ను. వీరల సమ్మతిన స్వహస్తం తిమ్మప్ప వ్రాసియిచ్చిన ఒడబాటు కమ్మ. బయ్యన వ్రాలు, సాక్షులు పప్పు రామలింగం.

౮. ప్రజోత్పత్తినామ సంవత్సరం మార్గశిర శు॥ ౧౫ లు శ్రీమద్యజనయాజన అధ్యైన అధ్యాప దాన దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన కల్లపనాయనిచెరువుకు ప్రతినామమైన అధికప్రతాప దేవరాయపుర అగ్రహార స్థితాశేషవిద్వన్మహాజనులకున్ను రామేశ్వరం మూలస్థానంనాగయ పెదనాగరాజుగారు యిద్దరు ఒప్పి యిచ్చిన వృత్తానువాదపత్రికలు. పినాకినీ తీరమందు రామభద్రుడు ప్రతిష్ఠచేసె గనుక ఆ రామేశ్వరునికి దేవతార్చన చేసేటందులకు పొదట్టూరి దగ్గిర నుంచి యీ ముప్పదిరెండుపాళ్ళ వారము, దేవునికి పూజ నమస్కారములుచేసి పొదటూరికి వస్తూ పోతూ యీ లాగున నుంటిమి. ఆ నాటికి రామేశ్వరుని సాన్నిధ్యమందు ఆయకట్టు లేదు గనుక అంతట కృష్ణరాయలు ఉదయగిరి సాధించపోయేటప్పుడు ఆ రామేశ్వరుని సేవించి ప్రతిష్ఠచేసి అంతట రామభద్రునికి ముక్తి కలిగిన స్థళం యిక్కడనే గ్రామాయకట్టు యేరుపరచవలెనని స్థానంవారిని రమ్మంటే మేము పొదటూరి నుంచి యీ ముప్పైరెండు పాళ్ల వారము, వచ్చేటప్పుడు మాతో కూడ పొదటూరి గ్రామాన నుంచి కొందరు ఆయగాంఢ్లు ఆ సమీప గ్రామాల నుంచి కొందరు ఆయగాంఢ్లు మేము వచ్చి ఆ రామేశ్వరుల వెంటనే గ్రామ నామ ధేయంచేసి యేరుపరచి, కట్టించి

ఆ రామేశ్వరునికి పినాకినీ తీరం యీవల ఆవల గ్రామముల యేడు ఉక్ష్లను మునిమందు యేర్పరచి లింగముద్ర శిలాశాసనములు వేయించి ఆ రామేశ్వరునికి ధారాగ్రహీతంచేసి పాలకీ సేవలకు రథ మహోత్స వాలకు పైడాల వరగ్రామంచేసి పోనూ, గనుక ఆ రామేశ్వరునికి దేవతార్చన మేమే, పొలిమేరహద్దులకు మేమే, కరణాలము మేమే అయి యుంటిమి. ఆ దేవునికి రథమహోత్సవాలకు నిత్యపడి కట్లకు పాలు మేమే. పాయకార్లకు స్థళంలో వారికి యీ లాగున సాగుబడి సంతేనులు చేసుక యీ మర్యాదను ఉంటిమి. ఈ మున్నెరెండు పాళ్లవారము కల హించి ఒక మధ్యస్తిని ఉంచుకుందామని మాటలాడుకొని నూరప రాజు మల్లయ్యగారిని ఉంచుకుంటిమి. వారిచేత కొన్నాళ్లు లెక్కలు వ్రాయించి అంతట వారిని పరిహరించి రామరాజు తిమ్మయ్యగారిని ఉంచుక ఉంటిమి. వారిచేత కొన్నాళ్లు లెక్కలువ్రాయించినాము. వారు వ్రాసే లోగానే కృష్ణరాయలు రామేశ్వరం రామేశ్వరునికి ధారాగ్రహీతం చేసేటప్పటి పైడేల అగ్రహారం చేసియుండెను; గనుక అంతట మన్నెరి కాల క్రిందట అగ్రహారాలునడువకపోయె; గనుక పయిడేలుగ్రామానను పందుంచేను నడుపుతావుండిరి; గనుక ఆ గ్రామానకు సాగుబడి సంతేనీలకు వస్తూ పోతూ యీ లాగున నుండగా అర్కటవేముల దగ్గిరనుంచి బయ్యనతిమ్మప్పగారు, మా పెద్దలకు అనేక స్నేహం పుట్ట మాట్లాడి. వారిని మరి హర్షపుట్ట మాటలాడిరి; గనుక ఆ రామరాజు తిమ్మయ గారిని పరిహరించి బయ్యన తిమ్మప్పగారిని ఉంచుకుంటిమి. వారు మేము అన్యోన్యంగా నుండి మీదట మా పెద్దలు నిలిపిన వారుయెవరు లేరు క్రమేణ అయిపోయిరి; గనుక ఆ రామేశ్వరం, కరిణీకం బయ్యన తిమ్మప్పగారి చేత వ్రాయిస్తూ ఉంటిమి. అంతట తిమ్మప్పపోయెను. బయ్యన మాతో విరోధంపెట్టుక చాడీలకు ఆయత్తపడి నగ(?) చాడీలు చేసెను. అంతట ఆయనను పరిహరించి మా పెద్దలు పోయిరి. అంతట ఆయన దివాణాలకు పోయి మాపయిని ఫిర్యాదులుచేసి మునుకుగుడ్డ కిరీటం వెయ్యి వరహాల నగలు అమ్ముకున్నారు అని చాడీల చేస్తే మా పెద్దలు ఊరువిడిచి పోయిరి.

అంతట బయ్యన్న తిరిగి ఊరుచేరి మా పెద్దలతో ఇది ఆరభ్యాం మీరు చెప్పినట్టు నడుచుకునేను అని ఆయగాండ్లముందర నిర్ణయం చేసుకయుండెను. అంతట ఆయన క్రమేణ అయిపోయెను. అతని కొమారుడు అయిన తిమ్మప్పకు పుత్ర సంతానంలేదు. దేశంమీద పోయిన తిమ్మప్ప కొమారుడు పుల్లయ్యా యిక్కడనే చేరెను. అతడికి యీ ఉన్న తిమ్మయ్య, యిద్దరికి పుత్రసంతానం లేక యుండి కుమార్తెల పెండ్లిండ్లు చేసి వాండ్లకు దాన దౌహిత్రములు చేసేమనగా, మీరు యెవరి సొమ్ము యిచ్చేరని ఆపుచేస్తిమి. అది ఆరభ్యాంగా ఆపుఅడ్డగింపుల మీద అదర్గణభుక్తి అనుభవిస్తూ యున్నారు. ఆరామేశ్వర కరణీకం కొణయూచి స్థానరం మాదే అన్నందులకు, ఆ రామేశ్వరుని సాన్నిధ్యమందు గ్రామ ఆయకట్టు యేర్పరచేటప్పుడు యీ ముప్పై రెండు స్థానలవారున్ను పద్దకొండు ఆయగాండ్లు గ్రామ నెత్తం యేర్పరచేటప్పుడు వస్తిమి గనుక కరణీక కొణయూచి మాది అయినందులకు కన్నెలూరి పుల్లమరాజు కామనూరి సుబ్బయగారి తాతగారిది అయినందులకు గ్రామ ఆయకట్టులో నున్న పద్దకొండు మంది యెరుగుదురు గనుక ఆయగాండ్లను పిలిపించి సామీప్య గ్రామాలు యేడు ఊళ్ల చిన్నపెద్దలను రెడ్డి కరణాలను ఆ రామేశ్వరుని సాన్నిధ్యమందు కూడపెట్టుక రామేశ్వరం గ్రామానకు ఆయగాండ్ల చేతను పూర్వోత్తర సంగతి అయినటువంటి మన్నె అప్పరెడ్డి చేతను, ఏక వాక్యతగా అర్ద్రవస్త్రాలతో రామేశ్వరుని సాన్నిధ్యమందు కరణీక కొణయూచి స్థానంవారిదే కాని కామనూరి సుబ్బయ కన్నెలూరి పుల్లయగారికి పనిలేదు, స్థానంవారిదే కరణీకం, ధణీలుస్థానం వారే అని పలికించగలవారం. ఈ పలికిన పలుకుబడి, సభాసమ్మతమయిన పలుకుబడి అంటే సొమ్ముకు ధణీలు మేము ఆ పెద్దలు సభాసమ్మతమయిన పలుకుబడి కాదంటే సొమ్ముకు మాకూ నిమిత్తం లేదు. అని వ్రాసి యిచ్చిన వృత్తానువార పత్రిక. ఈ వ్రాసిన వ్యవహారమే కాని వ్రాయతగినది లేదు. వ్యయనామ సంవత్సరం చైత్ర శు॥ 3 లు సోమవారం శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన బద్దెవోలి అనంతరాజపురస్థితాశేష విద్వన్మహాజనులున్ను తమ్మయ చోడయగారి

నాగయ పెదనాగయగారికి వ్రాయించి యిచ్చిన ఉత్తర ధర్మనిర్ణయ లేఖ. త॥ రామేశ్వరం కరణీక నిమిత్తమై కామనూరి సుబ్బయ్య, కైసాపురం తిరుపతి, తమ్మనచోడయగార నాగయ పెదనాగయగారు తమలో తాము వివాదించి చెన్నమాంబాపురానకు కమ్మ పెట్టించుకొని వచ్చి ఆ వూరి మహాజనాలుకు వృత్తప్రతిజ్ఞా పత్రికలు యిచ్చి ధర్మ నిర్ణయం చాయమనిరి; గనుక ఆ సభవారిలో ఉపద్రష్ట అయ్యన శాస్త్రిలు చాతనూరి దుర్గాదీక్షితులు ద్వివిధపడి అయ్యన శాస్త్రిలు తంబళవారి సాధన ఖండనం అని ఒక కమ్మ, దుర్గా దీక్షితులు తంబళవారిదే కరణీకం అని ఒక జయలేఖ మావున్న తావుకు తెచ్చి మీారు యేది నిర్ణయం చేస్తున్నారో అది వింటున్నామని అయ్యన శాస్త్రిలు దుర్గాదీక్షితులవారు యిద్దరున్ను ప్రతిజ్ఞాపత్రికలు యిచ్చి ఉభయత్రలవారు వ్రాసిన లేఖలు మాకు యిచ్చిరి గనుక రెండు పత్రికలు విచారించే వరుసలలో దుర్గా దీక్షితులు వ్రాసిన జయలేఖ శాస్త్ర సమ్మతమయి యుండె గనుక నున్ను అయ్యనశాస్త్రుల్లు వ్రాసిన కమ్మ చలంపురస్సరించి శాస్త్ర విరుద్ధంగానుండెను గనుక నున్ను, దుర్గాదీక్షితులు తెచ్చిన జయలేఖ సిద్ధమని తంబళవారిదే కరణీక మని నిర్ణయించినారం.

ఇట్లని రెండు అగ్రహారముల మహాజనుల సమ్మతిని సుదర్శనాచార్యులు వ్రాసిన ఉత్తర ధర్మనిర్ణయ జయలేఖ.

శ్లో॥ వేదాఃప్రమాణం శ్మృ(శు)తయః ప్రమాణం।
ధర్మార్థ యుక్తం వచనంప్రమాణం।
యస్యప్రమాణం నభవేత్ప్రమాణం।
కస్తస్యకుర్యాద్వచన ప్రమాణం॥*

* The names of the Vidvan - mahajanas and others who constituted the *mahasabha* and signed the *jayalekha* are omitted. The last two signatories నర్సు వెంకటాద్రి గు॥ కానుగోటి పరగణె బడ్డవోలు. and నరుసోదేవోజీ గు॥ దేశముఖీ పరగణె బడ్డవోలు who were the representatives of the local Government may however be noted; for they show that the *mahāsabha* was convened at the instance of the Government.

అవిఘ్నమస్తు। శుభమస్తు। నందననామ సంవత్సర శ్రావణ... ౧౦ లు శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపకదాన దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన చెన్నమాంబాపురం అగ్రహారస్థితాశేషవిద్వన్మహాజనులకున్ను రామేశ్వర స్థానీకులైన కరణం పెదనాగయగారు వ్రాయించి యిచ్చిన వృత్తి పత్రిక. శ్రీరామభద్ర ప్రతిష్ఠ రామేశ్వరుడు దేవళమున్ను ఆ గ్రామం కట్టించినదారభ్యం రెడ్డి కరణీకాలు, రెండు దేవతార్చనతో మాయింటికి మేమే బాధ్యులమై అనుభవిస్తూ ఉంటిమి. అంతట కృష్ణరాయలు ఉదయగిరి సాధించ పొయ్యేటప్పుడు యిత్తి(?) గుండా వచ్చి దేవతాదర్శనం చేసి, దేవళం దగ్గరనుండగా మావాండ్లు పదిమందిన్ని వచ్చి కృష్ణరాయలతో విశేషంగా లేదని చెప్పుకొని యిప్పుడున్న పొలం రామేశ్వరులకు నైవేద్యదీపారాధన కట్టళ్లకు చాలదు అని మావాండ్లు మందలించుకొని ; గనుక అంతట కృష్ణరాయలు ఆసామీప్య గ్రామాల వారిచేత కొంత పొలం విడుదల చేయించి హద్దు మట్టుకు లింగముద్ర శిలాశాసనాలు వేయించి, గర్భగృహ అంతరాళిక సుఖనాసిక భోగమంటపములు కట్టించమని సెలవు యిచ్చి, కావలసిన యిస్తువా యిచ్చి పని మనుష్యులనుంచి అంతట కృష్ణరాయలు ఉదయగిరికి తర్లి పోయినమీాదట, రెడ్డి కరణీక స్వాస్త్యాలు అనుభవించుతా దేవతార్చన చేసుకొని గ్రామములో ఉంటున్ను ఉండి మరికొన్నినాళ్లకు సూరప రాజు మల్లయగారిని హస్తకం వుంచుక వారిచేత ఒక కమ్మ తీసికొని లెక్క పత్రం వ్రాయించుకుంటూవుంటిమి. అంతట వారిని పరిహరించి రామరాజు తిమ్మయ చేత ఒక కమ్మ తీసికొని వారిచేత కొన్నాళ్లు హస్తకముగా వ్రాయించుకొంటూ యుంటిమి. అంతట వారిని పరిహరించి పాళెం వోబుళయ్యగారి చేత ఒక కమ్మతీసికొని వారిచేత లెక్క పత్రం హస్తకంగా వ్రాయించుకుంటూ యుంటిమి. అంతట వారిని పరిహరించి బయ్యన తిమ్మగారి చేత ఒక కమ్మతీసికొని లెక్కపత్రం హస్తకంగా వ్రాయించుకుంటూయుంటిమి. అంతట ఆ బయ్యన తిమ్మపగారి యిళ్ళలో నల్గురు కుమార్తెలు ఉండగా కామనూరి వారికి ఒక పడుచును కన్నెలూరి వారికి ఒక పడుచును కేసాపురం వారికి ఒక పడుచును

గూడూరువారికి ఒక పడుచును యిచ్చి పెండ్లిళ్లుచేసి వారు క్షీణ అయిపోయిరి. పోయినమీదట వీరితండ్రిగారు మావాళ్లను ఊడాయించి, అనుభవించసాగిరి. అంతట మావాండ్లు ఆచ్ఛేదనచేస్తూయుండగానే అక్రమభుక్తి అనుభవిస్తూవచ్చిరి. అంతట మరికొన్నాళ్ళకు కామనూరి మల్లమరాజు కన్నెలూరి బుచ్చితిమ్మానూ మా తండ్రిగారున్ను రాచవీటికి ధర్మానకు పోయి అక్కడ ధర్మం తీర్చుకోకనే గ్రామానకు మళ్లావచ్చిరి. వచ్చిన మీదట మళ్లీ ఆచ్ఛేదన చేస్తూయుంటిమి. అంతట మళ్లా ఒక సారి కలుపనాయని చెరువుకు ధర్మానకు పోతిమి అక్కడను తీరక పోయెను. అంతట మేము ఆచ్ఛేదన చేస్తూనేయుండి విరోధి సంవత్స రాన పారాగుణి పత్తెఖాను సాహేబులవారితోను మా అఖీదు చేసి కొంటిమి గనుక ఆ సమీప గ్రామములు నాలుగు ఊళ్లా పిన్న పెద్దలకు ధర్మస్తంగా తీర్చి యెవరిది సొమ్ము అయితే వారికి యిప్పించమని సెలవు యిచ్చిరి. గనుక ఆలాగుననే నాలుగు ఊళ్ళ పిన్న పెద్దలు వచ్చి మరిన్ని రెండు గ్రామాలవారిని వారిసి కూర్చుకొని ఆలోచనగా మాటలాడు కొని ఇది బహుదినాలనాటి తొక్కులాట ఇది గ్రామంలోనున్న ఆయగాండ్ళు ముఖాంతరముగా తీరవలెనని మాటలాడుకొని, ఆయ గాండ్ళను పిలిచి. మీరు ఆయమేరగాండ్లు గ్రామానకు స్థావరీకులు మీ తాతగారు మీ తండ్రిగారికి యేమి చెప్పినారో మీతండ్రిగారు మీకు యేమి చెప్పినారో మీరు యేమి యెరుగుదురో అదిదేవతా సాన్నిధ్యమందు మీరు పదిమంది యేకవాక్యతగా మాటలాడుకొని కోనే టిలో స్నానంచేసి ఆర్ద్రవస్త్రాలతోట్టు పూలతోమాలెమెడ వేసుకొని తీర్థప్రసాదాలుతీసికొని వాదిప్రతివాదులరామేశ్వరుని సన్నిధిని ఉంచికరణీ కకాణయాచి యెవరిది అయితే వారిని తీసుకరమ్మని సెలవు యిచ్చిరి. గనుక ఆలాగుననే కోనేటిలో స్నానంచేసి ఆర్ద్రవస్త్రాలతోట్టు పూల తోమాల మెడ వేసుక తీర్థప్రసాదాలు తీసికొని ఆయగాండ్లు పలికిన వివరము: పూర్వోత్తర సాంగత్యంగా కరణీక కాణయాచి తంబళ వారి దేను కామ నూరి సుబ్బయ. కేసాపురం తిరుపతి కన్నెలూరి పుల్లమరాజు కూడూరి వెంకటగారి తాతగారికి పనిలేదు. వీరి తాతగారు తంబళవారు ఉంచ్చు

కొన్న హాస్తకులు. ఇంతేగాని కాణయాదికి పనిలేదు. వీరి తండ్రిగారి నాటనుంచి ఆచ్ఛేదన భుక్తమంతే కాని నిరాచ్ఛేదన భుక్తం కాదు. అని వెళ్లనాడి మమ్ము రెట్టపట్టి మమ్ము తీసుకవచ్చిరి ; గనుక ఆ పిన్న పెద్దలు మాకు జయలేఖ వ్రాసియిచ్చి కరణీక కాణయాచి అనుభవించుకొనుమని సెలవు యిచ్చిరి ; గనుక మా సొమ్ము మేము అనుభవిస్తూయున్నాము. ఇంతే విన్నపములు. ఈ లేఖ తప్పకూడి సమకూర్చుకొనేది.

నందననామ సంవత్సర చైత్రబహుళ ౫ లు శ్రీమతు రామేశ్వరం రెడ్లు కోనేరు చినవోబుళురెడ్డి, వ్రాతకోట వెంకటరెడ్డి, వుండవోలు బయ్యనరెడ్డిగారు, స్థానికులయిన కరణాలు అయ్యలు పెదనాగయ, బసువయ చోడయగారి నాగయగారు వ్రాయించి యిచ్చిన సమాఖ్య కమ్మ. మన గ్రామ సమాచారానకుగాను మనలో మనము సమాఖ్యచేసి కొన్న వివరము : మీరు మేమున్ను యేకీభవించి దివాణం ప్రయోజనముల లోను గ్రామం కాపాడుక వచ్చే నిమిత్తం మీరూ మేమూ యేక వాక్యంగా సహయోగక్షేమములకు అనుకూలించి నడుచుకొనే యెడలలో మిమ్మునుంచి ఒకటి నేర్చి నేరములు వచ్చినా మమ్మునుంచి నేర్చి నేరములు వచ్చినా యితర ఆలోచన సేయక నడవగలవారము. పరాయి వారితో ఆలోచన విలోచన సేయగలవారము కాము. ఈ వ్రాసిన ప్రకారం తప్పి నడిస్తిమి అయినా మా తల్లితండ్రాదుల వారణాసిలో వధించిన పాతకానబోవువారము, కులాచారాన శివాచారాలకు దూరస్థులమై వుత్తరాభిముఖులమై పోగలవారము. ఇటని మా రాజీన ఒప్పి వ్రాయించి యిచ్చిన సమాఖ్య కమ్మ. ఇందుకు సాక్షులు శ్రీముక్తి రామేశ్వరుడు, బొల్లవరం ప్రసన్న తిరువేంగళనాథుడు పీరలమెరుకను బొల్లవరం కరణం శేషాద్రి వ్రాసిన సమాఖ్యకమ్మ. బయ్యపరెడ్డి వ్రాలు, వోబళరెడ్డి, వెంకటరెడ్డిగారు ఘంటన సొంజ్ఞ. అయ్యలు వ్రాలు, పెదనాగయ వ్రాలు, బసువయ వ్రాలు, నాగయ వ్రాలు.

మవుజె పల్లపాడు కరణం ప్రథమశాఖ శివరాముడు దగ్గర వున్న నాగరలిపి తామ్రశాసనములో వుండే శ్లోకములు. తెనుగున వ్రాయించినది శ్లోకములు.

యస్య సంపర్కపుణ్యేన నారీరత్న మభూచ్ఛిలా ।
యదుపాస్యం సుమనసాం తద్వస్తుద్వంద్వమాశ్రయే ॥ ౧

యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥ ౨

హరే ర్లీలావరాహస్య దంష్ట్రాదంత స్స పాతు వః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీచ్ఛత్రశ్రియం ధౌ ॥ ౩

జయతి క్షీరజలధే జాతం సద్యేక్షణోహరేః ।
సాలంజనం చకోరాణాం మరాయుష్కరం మహః ॥ ౪

పౌత్ర స్తస్యపురూరవా బుధసుత స్తస్యాయు రస్యాత్మజః ।
తద్వంశే నహుషోయయాతి రభవ త్తస్మాచ్చపూరు స్తతః ।
తద్వంశే భరతో బభూవనృపతిః తత్సంతతిశ్శంతనుః ।
తత్పుత్ర్యాం విజయోభిమన్యురుదభూ త్తస్మాత్పరిక్షి త్తతః ౫

నంద త్తస్యాష్టమోభూ త్సమజని నవమ స్తస్యరాజ్ఞశ్చ ।
బుక్కస్త్వాసవ స్తత్స*ప్తమ శ్రీపతిరుచిరభవ త్తస్యపూర్వోనరేంద్రః ।
తస్యశ్రీబుక్కనేంద్రోదశమ ఇహనృపోవీర హేమ్మాదిరాయ స్తాత్రి
లోకోమురారా కృతనదిరుదభూ స్తస్యమాయాపురీంద్రః ॥ ౬

తత్పుత్రోజని తాతపిన్నమ మహీపాలో నిజాలోకన ।
త్రస్తామి త్రగణ స్తతోజని హరద్దుర్గాణిసప్తాహితాత్ ।
అస్మైకేనససోరుదేవ నృపతి స్తస్యైవ జజ్ఞేసుతౌ ।
వీరా రాఘవదేవరాడితి తత శ్రీపిన్నమోభూన్నృపః ॥ ౭

ఆరవీటినగరీ విభోరభూ దస్య బుక్కధరణీపతిస్సుతః ।
యేన సాళువనృసింహరాజ్యమ ప్యేధమాన మహసా నిరీకృతః ॥ ౮

స్వకామిన స్వతనుకాంతిభి రాహరంతీం ।
బుక్కావనీప తిలకాంబుధి తన్యకాసీత్ ।
కల్యాణినీం కమలనాభ ఇవాబ్ధికన్యాం ।
బిభ్రాంబికా ముదవహ ద్బహుమాన్యశీలాం ॥ ౯

సుతేవ కలశాంబుధేః సురభిళాశుగం మాధవాత్ ।
కుమారమివశంకరాత్ కులమహాభృతః కన్యాకా ।
జయంత మమరప్రభోరపిశచీవ బుక్కాధిపాభృతం ।
జగతి బిభ్రమాలభత రామరాజం సుతం ॥ ౧౦

సహస్వే(సై్ర)స్స్తత్యాసహితమః యత్సింధుజనుషాం ।
సపాదస్యానీకం సమితిభుజ శౌర్యేణ మహతా ।
విచిత్యాదత్తేస్మాదవనిగిరిదుర్గం విభుతయావిఘాతేంద్రః ।
కాసపుడయమపివిద్రావ్యసా ॥ ౧౧

కందనవోలి దుర్గమురుకందవదభ్యన్నత ।
యాబాహుబలేన మోజిత్యహరేః ।
సన్నిహితస్య తత్రచరణాంబుజభక్తత ।
యాజ్ఞాతిభిరర్పితం సుధయతిస్మని షేవ్యవిషం ః ౧౨

శ్రీరామరాజక్షితిపస్య తస్య చింతామణేవర్ధికదంబకానాయి ॥
లక్ష్మీస్మరివాంభోరుహాలోచనస్య లక్కాంబికాముష్యమహిష్యలాసీత్ ॥

తస్యాధికైస్సమభవత్తనయస్తపోభి ।
శ్రీరంగరాజనృపతి శ్శశివంశదీపః ।
ఆసక్సముల్లసతి ధారుణీయస్యచిత్రం ।
నేత్రాణివైరిసుదృశాంచ నిరంజనాని ॥ ౧౪

సతీం తిరుమలాంబికాం చరితలయారుంధతీం ।
ప్రియా మపి తితిక్షయా వసుమతీం యశో ।
రుంధతీం హిమాంశుమివరోహిణీం సద్గుణై ।
రమోదతసధర్మిణీ మయమవాస్యవీరాగ్రణీః ॥ ౧౫

రచితనయవిచారం రామరాజంసుధీరం ।
వరతిరులరాయం వెంకటాద్రి క్షితీశం ।
అజనయత స ఏతాన్నామపూర్వాక్ కుమారా ।
న్నిహ తిరుమల దేవ్యామేవ రామమహారాజాః ॥ ౧౬

సకలభువన కంటకానరాతీన్ ।
సమితి విజిత్యసరామరాజ వీరః ।
భరతమను భగీరథాదిరాజ ।
ప్రథితయుగాః ప్రశశాస చక్రముర్వ్యాః ॥ ౧౭

వితరణ పరిపాటీ యస్య విద్యాధురీణా ।
మమర ముఖరవీణా నాదగీతాం నిశమ్య ।
అను కలి మయమావాలాంబుబింబాప దేశా ।
దమరనగర శాఖి లజ్జ యామజ్జతీవః ॥ ౧౮

వ్యరాజత శ్రీవర వేంకటాద్రి ।
రాజః క్షితౌ లక్ష్మణ చారుమూర్తిః ।
ఆఘోష దూరీకృత మేఘనాదః ।
కుర్వన్ సుమిత్రాశయ హార్ష పోషం ॥ ౧౯

త్రిషు శ్రీరంగక్ష్మాపరిభృఢకుమారేష్వధిరణం ।
విజిత్యారిక్ష్మాపాం స్తిరుమల మహారాయ నృపతిః ।
మహారాజాసామ్రాజ్యే సుమతి రభి షిక్తోనిరుప మే ।
ప్రశాస్తుర్వీం సర్వా మతినృఘుమూర్తిష్వివహారిః ॥ ౨౦

యేదాశ్వినానుగ్రహ పరస్య యస్య ।
పట్టాభిషేకేసతి పార్థివేంద్రాః ।
నానాంబు పూరైరభిషిచ్యమానా ।
దేవీపదం భూమిరియందదాతి ॥ ౨౧

యస్యాతి ప్రౌఢ తేజస్సవితరరిపు ధ్వాంతభేదిన్యుదితే ।
కీర్తి క్షీరార్ణవాంతస్ఫుటతరవికస త్పుండరీ కోపమస్య ।
శ్వేతఛత్రస్య మధ్యే ఘనకనకలతాభాసతే కర్ణికాభా ।
తస్యోపాంతే మరాళద్వయమివ విరలచ్చామరద్వంద్వమాస్తే ॥ ౨౨

భోగి త్వేవిదితేపి జిహ్వాగ ఇతివ్యాఖ్యాధిరాజం లస।
దృత్తిత్వే జన సంశ్రయాంతి కమఠందానేపిమందాం ఇతిః।
దిఙ్నాగాం భృశమున్నతాచ కరినా ఇత్యేహ హిత్వాగిరీ।
తత్తత్సత్పృణ సంప్రదేశ శరణం భూశేతిహస్తేణ యం॥ ౨౩

స్వైరం సంహ్రృత కంట కోథ సుకృతః కంసం విహాయాఖిలం।
క్ష్మాకేదారము దారదానసలిలా సా వైన్న మా పూర్యచ।
సంవృద్ధ్యాసషు కీర్తిసత్యనివహం తత్పాలికాం విక్రమ।
శ్రీ కాంతాం భుజకాయమానశిఖరే దత్తేహియ త్తేజసా॥ ౨౪

హుత్వామంత్రపురస్సరం రిపుయశోలాజా ప్రతాపానలే।
సప్రాపయ్యపదాని సప్తభువనే స్వారోప్యమేరూపలం।
ప్రీతః కీర్తి మయీాం వధూం పరిణయం సత్కౌతు కోల్లాసినీం।
యస్సింహాసన మాశ్రితో విజయతే శృష్ణా దింజేంద్రాజిమః॥౨౫

ఆక్రాంతవిశ్రాణన కీర్తి సామ్యం।
సురద్రుమాయస్యతులబ్ధుకామాః।
తటే తపస్యంతి వియత్తటిన్యాః।
ప్రవాళ కాషాయ పటా హతాప్తాః॥ ౨౬

కాంచీ శ్రీరంగ శేషాచల కనకసభా హాబలాద్రీశముఖ్యే।
స్వావృత్యావృత్య సత్వేష్వతనుతవిధి వద్యాయ సే శ్రేయసేయః।
దేవస్థానేషు తీర్థేష్వపి కనకతులాపూరుషాదీని నానా।
దానాంన్యేవోపదానై రపిసమమఖిలై రాగముక్తానితాని॥ ౨౭

అనంతరం తత్తనయః ప్రతీత।
శ్చకాస్తిహస్తాపజిత ప్రశాసిః।
శ్రీ వేంగళాంబాంచిత పుణ్యరాశి।
శ్రీరంగరాజశ్రిత భాగధేయః॥ ౨౮

యథావిధి మహీసురోత్తమ కృతాభిషేకోత్సవే।
యదీయకలవారిదే కన వృష్టిదె సర్వతః।

యశోమయతరంగిణీ దశదిగంత రేజృంభతీ ।
సతాం ప్రశమితో భవత్కృపణా తోరు దావానలః ॥ ౨౯

నిత్యా నిరస్తాది నృపేసపత్నాన్ ।
సంహృత్య సంరక్షిత సర్వలోకే ।
శ్రీరంగరాయక్షితి పాలకేస్మిన్ ।
పదంమురారేః పరమంప్రపన్నే ॥ ౩౦

విద్వత్త్రాణ పరస్తత స్తదనుజ శ్రీవేంగళాంబాపురా ।
పుణ్యోత్కర్ష ఫలోదయ స్త్రిపుమల శ్రీదేవరాయాత్మభూః ।
సంతానో దురితస్థిత సురరా సామ్రాజ్య సింహాసనే ।
సర్వాంశాస్తి నయేన వెంకటపతి శ్రీదేవరాయఃక్షమాం ॥ ౩౧

యథారఘుకులోద్వాహ స్వాయ మరుంధతీ జానినా ।
స్వగోత్ర గురుణా సుధీతిలక తాత యార్యేణయః ।
యథావిధియథాశ్వినా విరచితాభిషేకాం క్షణౌ ।
ద్విభిద్యయవనాళికా న్విజయతే ప్రశాసం మహీః ॥ ౩౨

శ్రీవేంకమాంబా వరరాఘవాంబా ।
శ్రీపెద్దమాంబా వరకృష్ణమాంబా ।
నిత్యాసమేతా ఇవశక్తయోయం ।
దేవ్యోనిరుద్ధంతి పవిత్ర శీలాః ॥ ౩౩

యస్యాతి ప్రధి తౌజ సేరణముఖే సేనాభటై రుద్భటై ।
స్సాటోపాహృత సైంధవద్విపఘటా శాస్త్రాతపత్రాదిమః ।
నిర్వ్యాణామలుకీభుతాముతను భూ సంప్రాప్య గేహాంమహా ।
ర్మంధస్సం మహామంద శావాచరయ తే సార్థాభిధామ నృహాం॥ ౩౪

యస్మిన్నంగద నిర్విశేష మఖిలా ముర్వీం భుజే విభ్రతి ।
ప్రీతా పన్నగ మండలాధిపకుల క్షోణీభృతో నిర్భరాః ।
సేవంతే వృషశీల ।
తాధిగతా శ్రీవేంకటాద్రీశ్వరం ॥ ౩౫

వారాశి గాంభీర్య విశేషధుర్యః ।
శ్చైరాశి దుర్గైక నిభాళ్ళ వర్యః ।
పర్యాష్టది గ్రాయ మనః ప్రకాశమ ।
భయంకరంశార్ఙ్గ ధరాం తరంగః ॥ ౩౬

హాతరిపుర నిమేషానోక హేయాంచకానాం ।
హాంసబిరుదరగండో రాయరాహుత్తు మిండః ।
మహితచరి తధన్యోమేని యాంత్సాములాది ।
ప్రకటిత బరుషిసాపాటితారాతి లోకః ॥ ౩౭

ఉభయదళపితామ హోన్నతీ నా ।
మభయపదార్పణ తత్పరోరిపూణాం ।
అయ మహాళురాయమానమర్ది ।
త్వ ఖిలజనై రభిధీయమాన ధామా ॥ ౩౮

తాండవితోదయో బిరుద మన్నెరగండత యోద్దండ ।
బలో త్కటవీం(ద్ర ?)జయపండిత వీరయుతః చండిమ ।
శాలి బాహుబల దండిత వైరిగణో ।
గండర గూళి మన్నె పులిమాన్యమహోబిరుదః ॥ ౩౯

సార వీర రమయా సముల్లస ।
న్నార వీటి పుర వీర నాయకః ।
కుండ లీంద్ర మహాభుజద్వయీ ।
మండలీక ధరణీవరాహతాం ॥ ౪౦

రాజ్ఞాం వరోరణముఖే । రామభద్ర ఇతి శ్రుతః ।
వర్ణిత బిరుదోనా । నావర్ణ శ్రీమండలీకగండరయితి ॥ ౪౧

ఆత్రేయగోత్ర జా నామగ్రసరో ।
భూ భుజా ముదార యశాః ।
యో బిరుదరాయ రాహిత ।
వేశ్యైక భుజంగ భరితశ్రీం ॥ ౪౨

రమ్యతర కీర్తి రొడ్డియరా ।
యదిశా పట్ట బిరుద ఘోషేణా ।
ఓషధిపత్యుపమాఊత గండ ।
హేమవణరూప జితాసమకాండః ॥ ౪౩

భాషగేతప్పువరాయరగండః ।
ఘోషణనిర్భర భూనవఖండః ।
రాజాధిరాజ బిరుదో ।
రాజరాజ సమాహితిః ॥ ౪౪

మూరురాయరగండాంకో వారిరాశిగభీరధః ।
శిష్టసంరక్షణపరో దుష్టశార్దూలమర్దనః ॥ ౪౫

పరదారేషువిముఖః పరరాజభయంకరః ।
ఇత్యాదిబిరుదై ర్వంది స్తుత్యా మభిష్టుతః ॥ ౪౬

జయజీవేతివాదిన్యా జీవితాంజలిబంధయా ।
కాంభోజభోజకాళింగ కరహాటాదిపార్థివైః ॥ ౪౭

ప్రతీహారపదం ప్రాప్తైః ప్రస్తుతస్తుతి ఘోషణః ।
సోయంనీతిజితాదిభూపతి తతిస్సుత్రామ
శాఖిసుధీస్సార్థానాంభుజతేజ సాస్వవశయం కర్ణాటసింహాసనం
ఆసేతోరపిచాహిమాద్రివిమతాం సంహృత్య శాసన్ ముదా
సర్వోర్వీం ప్రిచకాస్తి వేంకటపతి శ్రీదేవరాయాగ్రణీః ॥

భూశశాంకశరక్షోణి సంఖ్యాతశకవత్సరే ।
విరోధివర్షకే ఖ్యాతే మాసి భాద్రపదాహ్వయే ॥ ౪౯

పక్షే వళక్షే పుణ్యాయాం ద్వాదస్యాంచ మహాతిథౌ ।
శ్రీవేంకటేశపాదాబ్జసన్నిధౌ శ్రేయసాన్నిధౌ ॥ ౫౦

భారద్వాజాన్వయక్షీర పారావారహిమద్విషే ।
వర్ణనీయచరిత్రాయ ఆశ్వలాయన సూత్రిణే ।
రుక్శాఖాధ్యాయినే భీష్టదాయినే సదుపాయినే ।
ఆధీతాఖిలశాస్త్రార్థ సుధీజనసుతాత్మనే ॥ ౫౧

సదాచార సమాచార పరాశరసమాత్మనే ।
నిత్యాన్నదానసంతుష్ట నిఖిలాగమవేదినే ॥ ౫౩
పరోపకార శీలాయ పరిపోషితబంధవే ।
యజనాదిమషట్కర్మ నిరతాయనిరంతరం ॥ ౫౪
వేల్లాలతిమ్మయార్యస్య పౌత్రాయామిత తేజసే ।
శ్రీమత్తిరుమలార్యస్య సూనవేసూనృతోక్తయే ॥ ౫౫
జగద్విఖ్యాత వేంకటసోమయాజిమనీషిణే ।
ఔకుసీమాస్థ మరకటివేమలాత్పశ్చిమేస్థితం ॥ ౫౬
సెట్టిపల్యాద్వాయవ్యస్థం చౌడూరోరపిచోత్తరం ।
శ్రీమత్కలమచప్పల్యా ఐశానీమాశ్రితందిశం ॥ ౫౭
పసపులగ్రామసీమాంతాం ప్రాచీమాశాముపాశ్రితం ।
నైమలదిన్నె సుగ్రామాదాగ్నేయీమాశ్రితందిశం ॥ ౫౮
వేల్లాలగ్రామసీమాంతాం దక్షిణాం దిశమాశ్రితం ।
పైడేలగ్రామసీమాంతాం నైరుతీమాశ్రితందిశం ॥ ౫౯
వేంకటేంద్రమహారాయసముద్రాపరనామకం ।
రామచంద్రపురగ్రామం సర్వసస్యోపశోభితం ॥ ౬౦
సర్వమాన్యం చతుస్సీమా సంయుతం చ సమంతతః ।
నిధినిక్షేపపాషాణ సిద్ధసాధ్యజలాన్వితం ॥ ౬౧
అక్షీణాగామిసంయుక్త మేకభోగ్యంసభూరుహం ।
వాపీకూపతటాకైశ్చ కచ్ఛారామైశ్చసంయుతం ॥ ౬౨
పుత్రపౌత్రాదిభిర్భోగ్యం క్రమాదాచంద్రతారకం ।
దానాధమన విక్రీతయోగ్యం వినిమయోచితం ॥ ౬౩
పరీతఃప్రథితైస్సిద్ధైః పురోహితపురోగమైః ।
వివిధైర్విబుధైః శ్రౌతప్రథితైర్విధిభిర్గిరాం ॥
వేంకటాద్రిమహారాయో మానసీయోమనస్వినాం ।
సహిరణ్య పయోధారాపూర్వకం దత్తవాన్ముదా ॥ ౬౪

అస్యగ్రామస్యసీమానిర్ణయః

ప్రాగ్భాగానకు వరదయకుంట ఆగ్నేయానకు ఆమడలకుంట దక్షిణానకు మోటుగులకుంట నైరుతికి సుగమంచిపల్లె పొలంలోనికుంటకు యీశాన్యం మందు ముయ్యలపోతి రేణి చెట్టు, పశ్చిమానకు లక్కమాంబాపురం బావి, వాయవ్యమందు పసపులమార్గంలోని కుంట ఉత్తరానకు పద్రుజంబిమాను రాయి. ఈశాన్యమునకు ముత్యాలగుంట నిలువు రాయి. ఈ మధ్యభూమి (౧౨౦) నూట యిరువై పుట్ల యిద్దుం ౫=౪. శ్రీః ౪= శ్రీవెంకటపతిరాయ క్షితిపతివర్యస్య కీర్తిధైర్యస్య శాసనమిదం వలయచంద్రస్యభూమహేంద్రస్య శ్రీవెంకటపతిరాయక్ష్మాపతిదేశేనశాసనశ్లోకాః.

కృష్ణకవికామకోటిసరసమహాణత్సభాపతేః!
శ్రీ వెంకటమహారాయసూక్త్యా గణపయాత్మజః ।
శ్రీవీరణమహాచార్యోవ్యలిఖత్తామ్ర శాసనం ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం ॥

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం॥
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥
ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥
సామాన్యోయం ధర్మసేతు నృపాణాం ।
కాలేకాలేపాలనీయో భవద్భిః ।
సర్వానేతాన్భావినః పార్థివేంద్రాన్ ।
భూయోభూయోయాచతేరామచంద్రః ॥

శ్రీవెంకటేశః ॥ శ్రీమంగళ మహాశ్రీం శేయును శ్రీరామం ॥

# దుప్పాటి పరగణాలో
## శ్రోత్రియదార్ల వద్ద ఉండె దానపత్రములు

దుప్పాటు పరగణాలో శ్రోత్రియదార్లువద్ద నుండె దానపత్రములు మొదలైన కాగిదపత్రముల యొక్క నకళ్లూ ఆగి కి వహి అమీలాని వ దేశముఖాని వ దేపాండయ్యానిహాలు యిస్తకబాలు పరగనాతు జమ్మలమడుగు చిదానందకెచూం అప్పాజి అచ్చరున్నజన్నారు దారు యిల్తమాసు చేసెను దర శివము.

చినదుండ్లూరు పొలంలోను కొంత్త నాకిర్దు కొంతకిర్దు అయినది, పొలంకూడాను హొన్నులు ౨౨ వరహాలకు వెనుకటి అములుదార్ల చేతను రెడ్డి కరణాలచేతను యిజారాపుచ్చుకుని ఆ పొలంలోను గోపాళ పురం అనెపల్లె కట్టించి బేరీజు సన్నదులు బా॥ మ॥ మజుకూరు కింద జమ చేసి జ్యాసతిపొలము తస్సరపుచేసి ఫకీరు పకరానికి యినాము యిచ్చి వచ్చే పొయ్యే అరదేశి పరదేసులకు అన్నపానాదులు పరామరికె చేసి నడిపిస్తూ రాబట్టి బహుదినాలు అయినది అని కాబట్టి హ॥ గారికి పుణ్యముగాను సాబకు బా: బహాలువుంచి సెలవుయిచ్చినాము బమోజబు సాబకు బెరీజుఫపుకు దెహ మజుకూరు కింద జమాచేయించి సాలుబసాలు బా॥ బ్యారతి పొలం ఫకీరు ఫకరాని కింద దుంబాలా యిచ్చి నడిపించేది. ఇందుకు యెవ్వరు తఖల్లపు వ బయిచేసినా బగజాఖు దాగిరిస్తారులో వుండేరు తగైరు తబ్దీలకు యీ సన్నదు బాహాలు తెలిసి మవాఫికు పర్వానా చా॥ అవలాదు వ ఆహాఫాదు పర్యతం చెవుబుదుగా నడిపిస్తూవచ్చేది దరహార బాజ్కూ తాకీదు తెలిసి నడిపించేది.

అలంగిరె పాదుశహాకు గజఫరుఖాను కౌలునామా.

నుజాయతు యిజతు దస్తగాహ. శెఖుమహామ్మదు శెఖుమదారు హాలిగండికోట ముతాలీకు అమీనుఖాను వాలాశాను నవ్వాబు... మశూరుల అనాము కుబ్బినపల్లె అప్పాజిగారికి వ్రాయించియిచ్చిన కవులు

నూలున్న శిస్తు తిన్నైన అలపుమజురె గోపాళపురం బా॥ చినమండ్లవారు శరామతుజాగా గనుక వెనుకటి కమావీసుదార్లు గ ౨౨ వరహాలకు మక్తాచేసి సన్నదులు యిచ్చియుండిరి; గనుక బమోజిబు సన్నగు బాబుతుహాలె హాల్కు హాలు పుణ్యాంగాను మేమున్ను సదరహి బేరీజుకు కరారుచేసి యిచ్చినారం. సాలు బసాలు మూడు కి స్తీలలో బెరీజు మజు కూరు చెల్లించుకుని ఖాతరుజమాగాను ఉండేది. ఇది కదానుతుజాగా గనుక మాజి కమావీసుదార్లు బహాలుచేసి నడిపించినారు గనుక బమూజిబు సన్నదు హాయమాజి చాలు కరారు చేసి మేమున్ను సెలవు యిచ్చినారం. సదరహి బెరీజు హాలుబసాలు మూడు కి స్తీల చొ॥ చెల్లించుకునేది.

గీర్వాణ శాసనానకు నకలు

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూల స్తంభాయశంభవే॥

మృడానీవామాంకస్థిత శిశురపి ప్రోద్యతకరః।
సమాకర్ష త్యేవ ప్రసభమపహృత్యప్లుష్ట తమసం(?)।
ఇతీందు ర్వ్యాచేష్టాకృత పరిభవః శంకరశిరో।
విహాయా స్తేసంతే తమిహానుముఖం నౌమిశిరసా॥

చండేర(?)కాండం సకలంసమా క్తికం।
వేదండవక్త్రో(రి)జలజం గృహీత్వా।
యస్యాన్నతస్యాద్వమనేన ముక్తా।
స్తరాబభూవు స్తమహంనమామి॥

అశేషలోకస్య విహారహేతుభూ తాపి వాణీ కమలాసనస్య।
ప్రియాతికంఠ(?)సమాశ్రయేతి చిత్రం చ చిత్రం తవదేవియ త్తత్।
త్వమేవ బ్రహ్మేతి శృ(శ్రు?)తి శిఖరవాదః ప్రకటితః।
స్తువంతు త్వాంకేవా కవయఇవ వచోభిస్సుకృతినః।
త్వదన్యఃశబ్దా మీ యది భవతిశక్త్యోయ మధునా।
ప్రవక్తుం బ్రహ్మత్వాం తదపిహృదయే దేవికలయే॥

వరాహా త్వాంనౌమి ప్రళయసమయే భుగ్నపృథివీ ।
తలేవేధో నిష్ణు త్రినయన ముఖా వ్యగ్రమనసః ।
బభూవుర్దేవా స్తత్క్షణజనితకారుణ్యా విభవో ।
వ్యథాద్దంష్ట్రాగ్రే యో భువమతితరాం సద్రుమనగాం ॥

సుధాధారాసార స్నురనికరదత్తాఖిలవపుః ।
సురేశానాంశ్రేణీగణిత సుగుణా శ్రిత సమజనిః ।
త్రయస్త్రింశద్ధారోర్వ్యసమన(యన) చూడామణిరసౌ ।
సురాణాంమూర్గ్నేయో జయతినితరాం శీతకిరణః ॥

తత్సంతతా ఉదభవ ద్యదురాజవంశే ।
దేవస్స్వయంమధురిపు ర్వసుదేవనామ్నః ।
దుష్టాన్నిహంత్తు మథశిష్టజనాన్ ప్రపాతుం ।
యోద్వాపరే ప్రభురసౌ భువి ముద్వభావః ॥

కలౌకల్పద్వర్యః(ద్రుమః) కవివరజనాగారనిలయః ।
కృతక్ష్మాభృత్కోటి ప్రకటితమహాదాననిచయః ।
మహారాజశ్రీమాన్ భువిసమభవ ద్బుక్కనృపతిః ।
పరాన్సర్వాన్ లోకాన్ తత ఇతఇహావిస్మృతయశాః ॥

సంగమక్ష్మాపతిర్జజ్ఞే బుక్క భూపాలనాయకాత్ ।
సహస్రాక్షసమస్సోయం పాలయామాస మేదినీం ॥

తతఃసంగమభూపాలో గార్యాగర్భమహార్ణవే ।
అజీజన ద్ధరిహారంమహాసేన మివాపరం ॥

సాక్షాద్ధరిహరాదేకూ(కో ?) ప్యసౌశౌర్యశమాదిభిః ।
అద్వైత నిశ్చయాయేవ స్వయర్ల్లో(ంలో ?)కైక మేధసః ।
తస్మాద్ధరిహరాద్రాజ్ఞో మెలాంబాగర్భ శుక్తితః ।
ముక్తామణిరభూదేకో దేవరాయమహీపతిః ।

మేలాంబా దేవరాయాభ్యాం ఉమేశాభ్యామి వోన్నతైః ।
న్వైతైర్యుక్తః కుమారో సౌజాతో విజయభూపతిః ॥

పురంధ్రీతస్యనృపతేః నామ్నా నారాయణీసతీ ।
దమయంతీ నలస్యేవ శక్రస్య చ యథా శచీ ।
కమలాక్షస్య లక్ష్మీశ్చపత్ విధేర్బ్రాహ్మీ యథా ఽఘూః ।
ఈశ్వరస్య యథా గౌరీ సేయుంమహాత్పతివ్రతా ॥

ప్రతాపప్రౌఢశబ్దాభ్యాం అంకితో విజయోత్తమాః ।
నారాయణ్యాం సముత్పన్నో దేవరాయో నృపోత్తమః ॥

శ్రీప్రౌఢదేవరాయోపి పితుఃసింహాసనస్థితః ।
శశాస సకలాంభూమిం ధర్మశాస్త్రానుసారతః ॥

ప్రతాపేరుద్రతుల్యోయం శాంత్తేహిమవతాసమః ।
ఔదార్యేకర్ణతుల్యశ్చ సామ్రాజ్యేతు శచీపతిః ॥

అంగవంగకళింగేశాః యస్యాజ్ఞావశగానృపాః ।
పాలయామాస రవనీ ససామ్రాజ్య దభాషితః(ముఖంశితం ?) ॥

రాజాధిరాజ తేజస్వీ మహారాజ పరమేశ్వరః ।
భాషాలంఘితభూపాల భుజంగబిరుదాంకితః ।
మూరురాయరగండాంకః పరరాయభయంకరః ।
హిందూరాయసురత్రాణో వందివర్గేణగీయతే ॥

తుంగభద్రానదీతీరే నగరేవిజయాహ్వయే ।
పిత్ర్యం సింహాసనం ప్రాప్య పాలయత్పృథివీ మిమాం ॥

పుణ్యశ్లోకానుగుణోయం దేవరాయమహీపతిః ।
శాకే వహ్నిశరాక్షి చంద్రగణితే వర్షేశుభే దుందుభౌ ।
మాఘ్యాం భార్గవవారయుగ్మృష(?)తిథౌ శ్రీమద్విరూపాక్షగం ।
ద్రష్టుంతుష్టమనా స్స దేవనృపతిః ప్రాయాచ్చతత్సంన్నిధిం ॥

తత్కాలే విబుధశ్చ మల్లుమఖిరాట్సద్వట్టిపల్లైన్వయః ।
ప్రౌఢశ్రీనృపతిః సమేత్యనిపుణం సంప్రార్థయ చ త్వరం ? ।
గ్రామం బ్రాహ్మణపోషణాయ విహితస్వాధ్యాయ సత్కర్మణే ।
విద్యావాన్నఖిలస్వధర్మనిరతో విప్రస్తపోమూర్తిమాన్ ॥

సభూపతిః ప్రకృతాంవరిష్టహా ।
సంఖ్యావ తే మల్లుమఖీంద్రశర్మణే ।
తేళ్లూరినామాన మదా దమద్రం ।
గ్రామంమహారణ్యతటాకసంయుతం ॥

కౌండిన్యగోత్రాయ కుటుంబినే చ ।
సాంగేషు వేదేషు నిగూఢసంవిదే ।
వా(ః ?)ప్రవృద్ధిమే లంఘితధీ మదు క్తయే ।
సత్కర్మనిష్ఠాయ వరిష్టవర్చసే ॥

యావ త్తిష్ఠంతిచంద్రార్కతారకాస్సకులాచలాః ।
భోగాయభూయ ధోగ్రామే మయాదత్తోనిరంతరం ॥

యథాచంద్రమసో పృథ్వీ విరహాస్యసంప్రవర్త తే ।
తథాభూదానజం పుణ్యాం సర్వసస్యవివర్ధ తే ॥

బహుభిర్వ సుధాదత్తా రాజభిః సగరాదిభిః ।
యస్యయస్యయదాభూమిః తస్యతస్యతదాఫలం ॥

తసోమయాజికృతవర్తిసమోహాసంఖ్యత్సరో త్తరాష్టశితిప్రతీతిః ।
తత్పుత్రయేలోమాడ నామధేయగ్రామాగతత్ప్మాద్య శకాది
సంఖ్య ।

ఇనగలూరు మడూరుయాఖ్యగ్రామా దశసంఖ్యయయారిభిః ।
ప్రా ప్తత్యాశ్యైభ్యాభిమిరస్మిం ద్విజశ్రీయే గుడ్లమడుగోస్సకాశా ।
చ్చబలపనూరో స్తద్దెవచచారిబిః దశభీః పృథ్వీసంప్రాప్తాచపృథక్
శ్రీవిరూపాక్షు ॥ శఖంద్వాదెరాకృతిగణత్వేనపరరూపంసాధితం ॥

ఈ కయిఫియతు మల్యాలతాలుక మవుంజె తెళ్లూరు నరసంభట్లు వ్రాసియిచ్చిన కయఫియతు (శాసనాన్కు సకలు.)

పులివెందల తాలూకా కసుబా పులివెందలలో తోటిబెల్లం నరసింహాభట్లు వారివద్దనుండిన దానికి నకలు.

కుంఫ్పిణీ సరకారుకు

ప్రమోదూతనామ సంవత్సర కార్తిక బ॥ ౧౧ లు తెళ్లూరి నరసంభట్లు వ్రాయించి యిచ్చిన నకలు కయిఫియతునామా యేమంటే లోగడ తెళ్లూరి సమాచారం శాసనాలు.

ప్రవుఢదేవరాయల దత్తం అని మేము వ్రాయించి యిస్తిమి గనుక అందుకు దానంపట్టిన పురుషుని దగ్గరినుంచి మాతావుకు యంత మంది పురుషులు అయినది బయ్యాంవారీగా వ్రాయించమని సెలవు యిస్తిరి గనుక అదేప్రగారం వ్రాయించి యిచ్చిన పురుషువహీ వివరము.

౧. దానంపట్టినది మల్లు సోమయాజులు. ౨. ఈయన కొమారుడు నరసింహసోమయాజులు, 3. ఈయన కొమారుడు కొండుదీక్షితులు, ర. ఈయన కొమారుడు నరసింహసోమయాజులు, ౫. ఈయన కొమారుడు కృష్ణశాస్త్రులు, ౬. ఈయన కొమారుడు కోనంభట్లు, ౭. ఈయన కొమారుడు తిరుమలభట్లు. ౮. ఈయన కొమారుడు నరసంభట్లు.

సదరహీ దానంపట్టిన మూలపురుషుల దగ్గరినుంచి మా దగ్గరికి యెనిమిదిమంది పురుషులు అని వ్రాయించి యిస్తిమి గనుక మా ముత్తాతగారు యెనభై సంవత్సరములు బ్రతికియుండిరి. మా తాతగారు యెనభై సంవత్సరములు బ్రదికియుండిరి. ఈలోగా మా తాతగారు అనుభవిస్తూయుండగా కొన్ని దివసాలకు మయాణ దరబారులో గ్రామం జప్తిచేసుకపోయిరి. మా తండ్రిగారు వ్యవహారస్తులుగాదు కనుక యే దరబారులో చెప్పుకున్న వారు కారు. మేము యిట్లావచ్చిన ధొరతో యావత్తు మనవిచేసుకుంటూయున్నాము. తాము ధర్మ ప్రభువులు గనుక విచారించి మా అన్నం మాకు పెట్టించి ఉద్ధారణచేయ వలసినది. ఇంతే మా కయఫయతు.

(ఇక్కడ 6-A నుండి 9-B పుట వరకు వ్రాయని పుటలుగలవు)

శ్రీరామ

సోమభట్లు వారివద్ద ఉన్న శాసనానికి నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౮౭ అగునేటి పార్థివ సంవత్సర జ్యేష్ఠ బ॥ ౧౫ లు శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపకదాన దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన యమ్మనూరి మృత్యుంజయ శాస్త్రులవారికి పెంమ్మసాని తిమ్మానాయనివారు శ్రోతియం నిష్కర్ష చేసి యిచ్చేటపుడు కంత(? ళ)బడి రూపముగా విచారణ చేసియిచ్చినది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౭ అగునేటి పార్థివనామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౫ లు శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన ఆపస్తంబ సూత్రులయిన శౌనకసగోత్రులయిన వెంకటాద్రిదీక్షితులయిన వారి పౌత్రులయిన లింగన్న సోమయాజి పుత్రులయిన యంమ్మనూరి మృత్యుంజయ శాస్త్రివారికి శ్రీ బెజవాడ పురవరాధీశ్వరులయిన కౌండిన్య గోత్రోద్భవులయిన వల్లభనాయనివారి పౌత్రులయిన మాధవనాయని పుత్రులయిన గండికోట పెమ్మసాని తిమ్మానాయనివారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియదాన పత్రం. చిక్కరాయలవారు గొండిపల్లెకు ప్రతినామమైన విరూపాక్షపుర అగ్రహారం మీాకు యిచ్చియుండిరి గనుక శకం (౧)౬౭౫ అగునేటి శ్రీముఖ సంవత్సరం తాగాయతి యీాదినం వరకు మీాకు యేకభోగం సర్వాగ్రహారం నడచినది గనుక యిపుడు దేవబ్రాహ్మణ ఆయగాండ్లు ధర్మవెచ్చం సహా మినహాచేసి మిగిలిన పొలం ఖ ౮౦౦౪౩౻౦ కి నాయని ౮౦౦ నలుబై వరహాలకు శ్రోత్రియం నిర్ధారణ చేసి యిచ్చినారము గనుక యీా సంవత్సరం తాగాయితి వ్రాసిన ప్రకారం రూకలు ముక్కుందాయం ప్రకారం చెల్లించి సుఖాననుండేది.

ఇటని టంకసాలవారి గుమాస్తా మజుందారు సీనప్ప వ్రాసిన శ్రోత్రియ దానపత్రము.

ఆప స్తంబసూత్రశౌనకాదియుతం సద్గోత్రజైవాత్సకం।
బ్రాహ్మణోత్తమక్షేత్రపాలక గృహంనామోర్వీముఖ్యాంనరాః।
గత్వాలింగనసోమయాజీ విభవాఢ్యా కృష్ణతీరస్థితం।
పంపాక్షేత్రవిహారచిక్కధరణీ పాలాఖ్యసందర్శితం॥ ౧

పంచాబ్దాశ్రయముఖ్యపర్వయుభయోర్మిత్రద్విజానం పతిం।
దృష్ట్వాశ్రేష్ఠపరాగదత్తశుభదం బోడెమ్మనూరిర్నాంవిదుః।
తిమ్మాంబ్బాక్కపురం గొందిపల్లెసహితం శ్రీసంత్తనూరుండకం।
పంచగ్రామయుతా గ్రహారజనితం ధారాప్రతిగ్రాహితం॥ ౨

ఇత్యగ్రహారవరంగృహీత్వా గతమందిరం।
సంతుష్టవిమలస్వాంత్తం భరితంచకుతూహలం॥ ౩

నిజదేశేమధ్యగ్రామం ప్రవేశో దశవంధకం।
యథావిధియేనుభవం భావంచింత్తనమేవ చ।

యంమ్మనూర్ప్రిత్తిరష్టం చావింశత్యేకశతం భవేత్।
తస్యాష్టవృత్తిం గ్రహితం శేషంవృత్తించబ్రాహ్మణః॥ ౪

నందిపల్లె చతుర్థాంశం వృత్తి నిర్మాణమేవచ।
తద్వివృత్తిం సంగ్రహంచ్చ శేషంబ్రాంహ్మణదత్తయే॥ ౫

సంత్తనూరుండకంచైవ వృత్తిం ద్విపురమిశ్రితం।
తస్యాబ్ధివృత్తిం గ్రహితం శేషం దత్తం చ బ్రాహ్మణః॥ ౬

ముటంబాకాగ్రహారం చ చతుర్వింశతి వృత్తిజం।
యుగవృత్తిం గ్రహిత్వాశం శేషంబ్రాంహ్మణాయ దియ్యతే॥ ౭

శతంపంచచతుఃద్వంద్వం శాలివాహాప్రకీర్తితః।
అబ్దో స్వభానుశ్రావణ్యాం విప్రదత్తం చ పూర్ణిమా॥ ౮

గొందిపల్లెప్రతిపదం విరూపాక్షాగ్రహారకః।
యేకభోగంచా స్మదియ్యం మమసంరక్షణే భవేత్॥ ౯

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౫ అగునేటి శ్రీముఖనామసంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు ఇందువార పుణ్యకాలంలో ర్వపష్ట (?) మహాలింగదేవతా సార్వభౌమ శ్రీమన్మహా పంపాక్షేత్రస్థిత తుంగభద్రాతీరవాస శ్రీవిరూపాక్ష పాదపద్మారాధకులయిన శ్రీస్వామి నిజసేవవైభవ నిజభక్త స్వక్షేత్ర పన్నిచ్చాసిత (?) విద్యానగర సకలరాజ్యాధిపత్య సమస్త ప్రశస్త సహిత ధ్యాన సమాధి శీలగుణ సంపన్న శివాగమావధి గజమస్తకశూల చతుర్దశభువనాంత స్థిత ధర్మమార్గ ప్రశస్త ప్రతిపద్యానవద్య హృద్య నిత్యజ్ఞాన ముద్రపదిళివ స్వరూపావలోకన వీరలక్ష్మీ పుండరీక ప్రసాద నిగనాది సాహసత్యాచల త్రిభువన పరాక్రమోన్నత శ్రీమజ్జయంత్యనోక్త్రాది చతురాశీతి సంస్థానాధీశులవారు, శ్రీమన్మహామేరు మందరానకు దక్షిణ దిక్భాగమందు విజయనగర తత్పూర్వ దిగ్భాగమందు ఉదయగిరి తద్దేశానకు చెల్లే పశ్చిమ దిగ్భాగమందు గండికోటకు చెల్లే మురికినాటి సీమలోను గొంది పల్లెకు ప్రతినామమైన విరూపాక్షపురం అగ్రహారం శౌనకసగోత్రోద్భవులైన ఆపస్తంబ సూత్రులయిన భైరవసోమయాజులవారి పౌత్రులయిన వెంకటాద్రిసోమయాజులవారి పుత్రులయిన క్షేత్రపాలక లింగనసోమయాజులవారి యజ్ఞయాగాది క్రతువులకు, ఆత్రేయగోత్రోద్భవులయిన చిక్కదేవరాయల పౌత్రులయిన హరిహరదేవరాయలవారి పుత్రులయిన చిక్కరాయలు సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను, శ్రీపంపాపతిస్వామికి ప్రీతిగాను యిచ్చినది గొండిపల్లె ప్రతినామధేయమయిన విరూపాక్షపుర అగ్రహారక్షేత్రానకు చతుర్దిక్కులకు లోనైన భూరాదాయ సువర్ణాదాయ నిధి నిక్షేప జలపాషాణ కానికె కాడారంభ సీరారంభాలు మొదలయిన అష్టభోగ తేజోపార్జనలున్ను ఆ గ్రామానకు వచ్చిన సిద్ధాయం కప్పకానికె మేలువాసి గొండమాన్యం ఆరవాసి మిగులు పైగవచ్చినది సుంకం చారార్యాల శిస్తుకట్టడి ప్రహారప్రమాణం కందాచారం తుండ్లమాన్యం దేవస్వం బ్రహ్మాదాయం పురవర్గకార కట్టడి కాశీవర్గం యిండ్లపన్ను కులతప్పు మెలుగావచ్చినది పడితరాలు విశేషాలు మొదలయిన సర్వభూభాగాలున్ను తమ యజ్ఞయాగాది

వైభవాలకు సమర్పించిన అగ్రహారము ఆచంద్రార్కస్థాయిగాను ఉండమని ప్రతిపాలించి యిచ్చినది. వర్ణచతురష్టాదశజాతికుల యేకోత్తర శతదశఖండ్డాఖ్య కులచ్ఛల నృపాలవర్గయూరవమనో వాక్కాయకర్మాదుల యందు త్రికరణ వాచక త్రితయముగాను యిచ్చిన ధర్మశాసన అగ్రహారం ఇది చూచి నడిపించినవారే ధర్మపరులు. ఇంత పరియంత్తరం చతుస్సాగర పరియంత్రం చతుస్సాగర మధ్యమందు పుట్టిన పుణ్యాపరులు సముద్రం చలించినప్పటికైనా గాని యీ ధర్మం స్థిరముగా ప్రతిపాలించినవారు సత్కులవంతులు ద్వాదశఖర్వాట దేశాధిపతి చతురాశీతి సమస్థానాధిష్టితులు రాజ్యపుత్రాది పాలన మూలానకం సంతోషాభివృద్ధిగా కారణమానని సమస్త గ్రామాధిపతి వరబస్తమయ వాదులు. చేతికి మెప్పించి యిచ్చిన ధర్మానకు . రాజ్యగామత్వ చేసినప్పటికిన్ని, చోరగామత్వంచేసినప్పటికిన్ని, వంచనచేసినప్పటికిన్ని విశర్మం అకర్త జగద్భ్రిమణగమనం చేశ్ని(సిన)వారున్ను, యీ ధర్మం చేసినవారున్ను, యీ ధర్మం ప్రతిపాలించిన వారికి గంగా తీర్థావగాహన గయముఖ్య యాత్రపారాయణ సహస్రగోప్రదానమున్ను యిచ్చిన ఫలాన కంటె యెక్కువ ధర్మం ఫలించును. మనుష్యదేహానకు ధర్మం శీర్షమని ప్రతిపాలించవలెను.

ఆదిత్యచంద్రావనలోనలశ్చ ద్యౌభూమిరాపో హృదయంచశాశ్వ ।
అహశ్చరాత్రిశ్చ వుభేచ సంధ్యా ధర్మశ్చ జానాతి నరస్యవృత్తం ॥

పురుషవాహి శ్లోకపద్ధతి
పంచత్రికం లోచనాఖ్యం శాలివాహం ప్రకీర్తితః ।
అబ్దా శ్రీముఖనామంచ్ఛ వైశాఖే సితపౌర్ణమే ॥ ౧
ప్రతినామం గొందిపల్లె విరూపాక్షపురం భవేత్.

శ్రీరామచంద్రస్వామినిత్యశేవ

రాచవేటి తాలూకు

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౭౦౦ అగునేటి విళంబినామ సంవత్సర మార్గశిర శు॥ ౧౫ లు శ్రీమద్యజనాధి

షట్కర్మనిరతులయిన కౌశికగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీకలి వెంగంభట్లవారి పౌత్రులయిన, వెంకటనర్సంభట్లవారి పుత్రులయిన వెంకటాచలమన్నగారికి, కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమన్మహామండలేశ్వర మట్ల తిరువెంగళనాథరాజువారి పౌత్రులయిన వెంకట్రామరాజుగారి పుత్రులయిన తిరువెంగళనాథ దేవచోడ మహారాజుగారు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసన పత్రికక్రమం యెట్లనిన :-మీరు మహారాజరాజశ్రీమానాయన గారితో శ్రోత్రియం కావలెనని పలుకరించినందున వారు గుఱ్ఱంకొండ సరకారు మోచర్ల గుండ్లూరు పరగణ మన్నె కావలిపాలెం మోచేను మడికుంట ౬౦ కి చేను మడితోటను కుంటలు ౪౦ మంచుండుపల్లెను కుంటలు ౪ అంతు మడి కుంటలు ౨౦, చేనుకుంటలు ౪౦ మరిచుండుపల్లెను కుంటలు ౪ శిబ్యాలను కుంటలు ౧౨ తిమ్మసముద్రంలో కుంటలు ౪, అంతు మడి కుంటలు ౨౦ చేను కుంటలు ౪౦ ఉభయం కుం ౬౦ కుంటలు ఈప్రకారం నిర్ణయం చేసి మా అవగారికి సుకృతంగా ధారా గ్రహీతంచేసి దానపత్రం వ్రాసియిచ్చి వుండిరి; గనుక ఆ దానపత్రంలో కొంత శిథిలమైనంత తుడుపులుగానున్నందున మీరు మాసముఖానకు వచ్చి మనివిచేస్తిరి; గనుక మేమున్ను ఆ దానపత్రం చిత్తగించి యథావిధి పుణ్యకాలమందు చేనుమడి ౬౦ కుంటలు శ్రీస్వామికి అర్పితంగా సెలవు యిచ్చినారం; గనుక మీ పుత్రపౌత్ర పారంపరియం త్తరముగా ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకొమ్మని వ్రాయించి యిచ్చిన దాన పత్రిక.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

ఈ దానపత్రాను పూర్వంగా దివాణంతాకీదు ౧ రాజువారి తాకీదు ౧ దానపత్రానకు యీవల రాజువారి తాకీదు ౧ సదరు యీ మూడు తాకీదులు హాజరున్నవి.

(17-ఎ నుండి 17-బి పుటలలో యేమియు వ్రాయలేదు)

ఈ శిలాశాసనం మవుజె ఘా(గా)లవేటిగ్రామం పులివెంద్దల తాలూకులోది సదరుగ్రామానకు తూర్పుదిక్కున కొండ్రెడ్డి కొండప్ప అనేరయితు భూమిమడిలో నుండే శిలమీాదను వ్రాసియుండిన అక్షరాలు ప్రకారం నకలు వ్రాయపడ్డది.[1]

సదరహీ శిలమీాదను ఉండిన ప్రకారం వ్రాసినది.

కసుబా పులివెందల గ్రామానకు దక్షిణం కాలుగడియ దూరాన మిట్టమల్లేశ్వరస్వామి దేవస్థానం ముందర ఉండే శిలాశాసనానకు నకలు.

చంద్రుడు. సూర్యుడు.

శుభమస్తు నందన సంవత్సర భాద్రపద బ౹ ౧ లు శ్రీమతు పూాల కొమారంమ్మగారికి శ్రీమన్మహామండలేశ్వర జగతాపికంచయ్య దేవమహారాయలు దండంబెట్టి వ్రాయించిన దానపత్రక్రమమెట్లన్నను:- మాకు చెల్లె పులివెందులలోను ఏకాదశి మామిడిమాని మడిస్థళం ౧౨ యిద్దుము అమ్మగారికి దండం సమర్పించి చేను ౧౨ యిద్దుము ఉభయం మడిచేను ౧౪ నలుతుమున్ను అమావాస్య పుణ్యకాలానను ధారవోసి సమర్పిస్తిమి. ఇందుకు వచ్చిన ఫలం దేవుని పూజపురస్కారం నైవేద్యానకు సమర్పిస్తిమి. ఈ ధర్మానకు తప్పినవారు కాశిలో గోవును చంపిన పాపాన పోదురు.

శాసనాలు వ్రాసినది బొక్కు ౧౦ కి

ఖిర్ది మొదలు-తఖ్తాకు దాఖలు అయినది.

శిలాశాసనాన్కు నకళ్లు తెనుగు అక్షరాలు. వహీవఖటి (23-బి ఏదియు వ్రాయలేదు)

తాడిపత్రి తాలూకాలో మవుంజె నిట్టూరు అనే గ్రామంలో చెన్నకేశవమూర్తిస్వామి దేవళంవద్ద నున్న శిలాశాసనానకు నకలు.[2]

---

1. చూ. అనుబంధము.

2. A. R. No. 23 of 1953-54.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౨ అగునేటి సౌమ్యనామ సంవత్సర శ్రావణ బ। ౮ లు శ్రీమన్మహారాజాధి రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ సదాశివదేవరాయలు విజయనగర మందు వజ్రసింహాసనారూఢులై పృధివీ సామ్రాజ్యం చేయుచుండగాను నిట్టూరి శ్రీ చెన్నకేశవమూర్త్తికి వల్లుట్ల గోత్రులయిన జక్కుంపాటి పెద్దినాయనిగారి కొమారుడు తిరుమలనాయనిగారు దండం సమర్పించి యిచ్చిన భూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను, శ్రీమన్మహామండ లేశ్వరరామరాజు తిరుమలరాజయ్య దేవమహారాజులుగారు పెమ్మసాని చినతిమ్మతిమ్మానాయనిగారి కుమారుడు రామలింగా నాయనిగారికి నాయంకరానకు పాలించిన సీమలోను ఆ రామలింగనాయనిగారు మాకు ఉంబళిగె యిచ్చిన క్షీరయిటి(చిరబడి)లో నిట్టూరను యీతథాతిథి కృష్ణ జయంతి పుణ్యకాలమందు స్వామికి సమర్పించినది క్షేత్రం నిట్టూరను చెర్లోచేను స్థళం ఖ ౧౬(?) మెట్టుపల్లె వారి రేగడిచేను స్థళం ఖ ౩||| కడురాదాసరి చే(నికి)నుకు (పడుమర) పశ్చిమం చేను ౭౩||౧|| వేముల పల్లెను చా(సా)కిరివారి చే(ని)ను స్థళం ఖం।౨||౩||౦ అంతు స్థళాలు ౪ కి ఖ ౫।౧।౧౭ మడిగుంత మడిలో ఖ |||౬ కాల్వ మడిలోను దసవంధంవారి మడికి ఉత్తరం ౭౪ వంగ(ల)లి కయ్య(లు) ౭౧ మాకుల మడి ౭౧।౬ కోవిల వెనుక మడి ౭౨ మోగలిమాకుల మడి ౭౨ తోర గడ్డ మడి ౭౧|||౬ అంతు మడిస్థళాలు ౬ కి ఖ ౧౭౨ పువ్వలతోట ౭౩౬ తామరకొలను ౭౧||| ఉభయంతోటలు ౭౪౬ నిట్టూరి చెన్నకేశవ మూర్త్తికి వల్లుట్లగోత్రులయిన జక్కుంపాటి పెద్దినాయనిగారి కొమారుడు తిరమలనాయనింగారు యీతథాతిథి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారాపుర్వకంగాను దానవిక్రయ వినిమయయోగ్యంగాను సర్వ మాన్యంగాను నిట్టూరి శ్రీచెన్నకేశవమూర్త్తికి వల్లుట్లగోత్రులయిన జక్కుంపాటి పెద్దినాయనిగారి కొమారుడు తిరుమలనాయనిగారు యీ క్షేత్రానకుగల అష్టభోగ తేజ స్వామ్యతలున్ను ఆచంద్రస్థాయిగాను త్రివాచకంగాను సమర్పించిన చేను ఖ। ౫।౧।౧౯ మడి ఖ ౧౭౨ కాళ యుక్తి సంవత్సర శ్రావణ ఖ। ౮ లు ఈ కృష్ణజయంతి పుణ్యకాలమందు

పెమ్మసాని తిమ్మానాయనిగారి కుమారుడు రామలింగనాయడుగారు సమర్పించిన క్షేత్రము నిట్టూరిలోని వేములపల్లెను నీలకంఠదేవర చేనికి పడమట శి(సి)ంగరాజుగారి చేనిస్థళం ఖ ౦।।।౮౧।।౧।।౦ చేను ఖ ౦।।।౮।।౩।। కామరాజు చేని స్థళం చేను ఖ ౦।।।౨। ముప్పారం నాగయ చేసిన చేని స్థళం చేను ఖ ।।।౧।।౧।। పళ్లం తిమ్మన్న చేని స్థళం చేను ఖ ౧।౦।౧।। సాకిరివారి చేని స్థళంలోని చేను ౭౧ మడి ౧।।౦ అంత తిమ్మనచేసిన చేనుస్థళం చేను ఖ ౧।౦।౧।।౦ చాకిరివారి చేని స్థళంలోని చేను ౧౧౧౧।।౦ కామరాజు చేనిస్థళం ఖ ౻౨।౦ రుపారు నాగయ్య ఖ ౦।।।౧।।౦౧।।౦ అంతుస్థళాలు ౫ కి చేను ఖ ౮౧౦ ఆ నీలకంఠదేవర చేనికి తూర్పు అంచ్చు నిట్టూరి పొలిమేర లక్కిమిరెడ్డి చేసిన మెం(ట్ట)డుపల్లెవారి రేగడి చేను ఖ ।।।౧।।।౦ గవునివారి చేని స్థళం ఖ ।।౮।౨।।౦ దీని తూర్పు ముత్యాల చెన్నయ్య చేని స్థళం ఖ ।౩౻౧౻౦ అంతుస్థళాలు ౩ కి చేను ఖ ౨ అంతు రామలింగనాయనీగారు సమర్పించిన చేను ఖ ౬౧౦ పూర్వాన నుల్లేవేటి రామిరెడ్డి చేని స్థళం ఖ ౻౧౻౧ వరిమడి కోవిల వెనుక ౧౨ తువ్వమడి ౧౨ బోనుతకాలు వన్ను ౧౧ హనుంత్తుకి ఆకుతోట మడి స్థళం ౧౧ గుంతమడిలో ౧౧ అంత్తు స్థళాలు ౫ క మడులు ।౨౧ అంబాళం తిరుమలయ్యగారు తమకు నిట్టూరను చెల్లే క్షేత్రం సమర్పించినది కాపయ్యమడికి ఉత్తరం మడి ౧౧ గొల్లపల్లెకు కోల నాగయ చేని స్థళం చేను ౧౩౻౦ యర్రపల్లి లింగయ్య తనకు నిట్టూరను చెల్లే క్షేత్రం సమర్పించినది చేను ౧౩।।౦ అంతు చెన్నకేశవ మూర్తికి చెల్లే క్షేత్రమందు శిలాశాసనం వేయించినది చేను పద్నెనిమిదిములసిన గశనుతు ౧ కి కుంటలు ౧౦౦ లెక్కన చేను ఖ ౧౨।।౧౨ మడిపదారు మూరలగడను తూము ౧ కి కుంటలు ౩౦ లెక్కను మడి ౧।।౦ తోట ౧౮ అక్షరాలునుచేను పండ్రెండు పుట్లున్ను పందనకు(ండు) తూము రెండు ముంతలున్ను, మడిపుట్టి పందుమున్ను తోటనలుతుమున్ను రాక్షస సంవత్సరం శ్రావణ బ ౮ లు శ్రీకృష్ణజయంతి పుణ్యకాలమందు నిట్టూరు గొల్లపల్లి లేములపల్లె కాపులు లింగిరెడ్డి తన్నురు బాలయ్య పోటిపాటి నాగయ్య పర్వత బసవన్న కోండినుంకన్న సాకరి కొండయ్య మొద

లయిన కాపులున్ను కర్యాంలు నీలకంఠయ్య లింగయ్య శేషయ్య చెన్నయ్యగారున్ను చెన్నకేశవమూర్తికి దండం సమర్పించ్చిన మేర కొల్వుచేను తూము ౧కి జొన్నలు ౧౦౧ లెక్కను దేవబ్రాహ్మణ మాన్యాలు సహా కాపులు చేసిన సేద్యాలకు అంతుటికిన్ని చతుసీమ కున్ను యీ మరియాదను చెన్నకేశవమూర్తికి మేరగాను ఆచంద్రార్క స్థాయిగాను సమర్పించి యిస్తిమి. ఈ ధర్మానకు యెవరు ద్రోహం తలచినాను కాశీలోను తమ మాతాపితృ వధ చేసిన పాపాన బోదురు.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

ఏకైన భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

## శ్రీరామా

తాడిపత్రి తాలుకాలో మవుజె ఎల్లనూరు అనే గ్రామంలో వెంకటాచలపతి దేవస్థానానకు యెదురుగా వాకిటి ముందర నీలపురాతి మీదను ఉండె తెనుగు అక్షరాలు శిలాశాసనానకు నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౪౨ ప్రవర్తమాన సాధారణ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ ౧౫ లు శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండనాయక వేదవేదాంతనువేద్య పురాణపురుషోత్తము లైన వెలటూరి శ్రీవెంకటాచలపతికి రథమహోత్సవ పుణ్యామునకుగాను వెలటూరు సమతు కసుబా మొదలయిన గ్రామాంత్రం రెడ్డి కరణాలు యీశథాతిథి పుణ్యకాలమందు దానధారాపూర్వకంగా నిర్ణయం చేసి నదిప్రతి గ్రామానకు దివాణంవారు చేసిన సిస్తూబేరిజుకు నూటికి రెండేసి రూకలు లెఖను ధారబోసి యిచ్చినారం. కనుక యీనిర్ణయం ప్రకార్యం ఆచంద్రార్కస్థాయిగా నడపగలవారం. ఈ ధర్మానకు యెవరున్ను

విఘ్నం చేసినా కాశీలో గోహత్య చేసిన పాపాన పోదురు. అని వ్రాయించి యిచ్చిన శిలాశాసనం.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఇదే శిలాశిలాసనం.

తాడిపత్రి తాలూకాలో మవుజె. ఎలానూరు అనే గ్రామానకు పూర్వ దిక్కున పాతపేటలో బుగ్గ రామేశ్వర దేవళం వద్ద నున్న శిలా శాసనానకు నకలు. బుగ్గరామేశ్వరుని దేవస్థానం వద్దనుండిన శిలా శాసనానకు నకలు.*

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౭౧ అగునేటి క్రోధననామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ ౧౫ లు పాతపేట దేవర సెట్టి బుచ్చమకు కన్ననూరి రెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక :- మా గ్రామంలో పాతపేటలోను తనుగా రామలింగ స్వామికి తళిహె దీపారాధనకు మాన్యం యిస్తిమి, గనుక యిందుల వివరము సింహాద్రి పల్లె దోవను యేలురి వెంకటదాను చేనికి తూర్పు యిలూ్నరు చలం చేసిన చేను స్థళం ౭౧ అక్షరాలు తూము చేను యిచ్చినాము. సర్వమాన్యంగాను పుత్రపౌత్ర పారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని యుండేది.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

శాలివాహన శకవర్షంబులు ౧౬౬౮ అగునేటి శుభకృతునామ సంవత్సర కార్తిక శుద్ధ ౧౫ లు ఎలలూరి పాతపేట రామలింగస్వామికి సింహాద్రిపుర రెడ్డికర్ణాలు తళిహెదీపారాధనకు గాను యిచ్చినది.

* ARIE No. 11 of 1953-54. The date according to this is Ś 1661.

* A. R. No. 11 of 1953-54.

చేను పాతపల్లె పొలిమేరను నందిమాని చేను నడమాను ౧౧ అక్షరాలా తూమెడు చేను యిచ్చినాము. నడపించకపోతే కాశీలో గోవును చంపిన పాపాన పోదుము.

(ఈ పుట పూర్తిగా ఏమి వ్రాయలేదు.)

తబ్జాకు దాఖలు అయినది. బోక్కు ౧౫ ది. వ్రాసినది ౪౦ మొదలు.

పూలివెందలతాలుకాలో గ్రామాంతరంలో నుండిన శిలాశాసనానకున్ను తామ్రశాసనానకున్ను నకళ్లు.

అదే ప్రకారం వ్రాయబడ్డది.

వహీంవఖటి 31-B ఈ పుటలో వ్రాయలేదు.

32-A శాసనాలు శిలాశాసనానకున్ను తామ్రశాసనానకున్ను నకళ్లు వ్రాయ పడ్డది. కదిరి తాలూకాలో నుండె గ్రామాంత్రాల్లో నున్న దానికి.

కోమటి నూతలలో నుండిన తామ్రశాసనానకు నకలు.

సూర్యుడు. చక్రం. నామం. శంఖం. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౬౬ అగునేటి జయనామ సంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ లు శ్రీమదఖిలాండ కోటి బ్రహ్మాండనాయకులు కోమటినూతల చింతలతిరువెంగళనాడ స్వామికి నిత్యతళిగెదీపారాధన ఉత్సవమునకు నడిచేటట్టుగా తూర్పు దక్షిణ పశ్చిమోత్తరం చతుర్దిక్కుల ఉన్న స్థితాశేష నూటయిబ్బంద్రు నగరంవారు వ్రాసి సమర్పించిన తామ్రశాసనం క్రమ మెట్లన్నను. విజయనగరం ఆదవేని దేశాలలో నున్న నగరంవారు తిరుపతి వెంక టేశ్వరుల సేవించబోయి మళ్లీ తమ దేశాలకు మార్గంతప్పి కణ్వాశ్రమం అనే అరణ్యంలోబడి నీళ్లు లేక పరుష అంత్తా మూర్ఛాగతులయినపుడు పెదవోబిలేటి వెంకటసెట్టి నిర్విణ్ణుడై స్వామీ నిన్ను సేవించవచ్చినవారు

అందరు మృతిఅయ్యేకాలము ఆయెగదా మా పాలిటి దేవుడవయి నందుకు నీ పాదతీర్థం కలిపించితే మా యేడ్గురు అన్నతమ్ములము శిరస్సులు ఉత్తరించుక కానుకలు యిచ్చేమని మ్రొక్కగా వెంకటాచలపతి పాదము త్రొక్కి తీర్థంకల్పించి పరుషను బ్రతికించితే మహాసంతోషమై తమ దేశాలు చేసిన నూట యిబ్బంద్రకు వందనీయములయి మ్రొక్కు చెల్లించి పోగా చతుర్దిక్కుల నూటయిబ్బంద్రు సత్యము చూడవలెను అని ఆ బావిదగ్గర పరుషగూడి సకల దానాలుచేసి పో(వో బి)లెటి వెంకట సెట్టి గారు (సోదరులు) యేడుగురు స్వామిని హృదయమందు నిలిపి శిరస్సులు ఉత్తరించి మంగళహారతులు పాడినప్పుడు శ్రీస్వామి ప్రత్యక్షమై మెచ్చితిని అడుగుమనగా మా పేరిట నిల్వమనగా కోమటి నూతల చింత్తల వెంకటాచలపతి మీకు సమానంగా నిలుస్తున్నాను. మా బావివద్ద దేవతాశిలలుగా నిల్పి మీకు పూజముందు నాకు పూజ వెనుకగా వరమిచ్చిన దేవుణికి అర్పించి వాసవాకిలు(వీకన్య)కున్ను పూజించి భాస్కరాశీర్వాదకులయిన నాల్గుతట్లా నూట యిబ్బంద్రుకు వందనీయులయిన మనకు ప్రసన్నమైన స్వామికి నిత్యకైంకర్యాలకు యింటివర్తన పెండ్లి వర్తన చేయవలెను అని నిత్యముక్తులయిన వారు విన్నపము చేసుకోగా చతుస్సారం నూటయిబ్బంద్రు వారి సత్యానకు మెచ్చి దేవతాకైంకర్యానకు సమ్మతించి త్రివాచకముగా యీ త్రికరణ శుద్ధిగా యథార్థంగా యీ తిథిపుణ్యకాలమందు సంవత్సరానకు యిలువర్తన రెండు టెంకా (టంకా)లు శాశ్వత బ్రహ్మకల్పాలుగా ఒప్పి సమర్పించ్చిన ధర్మశాసనము.

ఊరుజాదుపశల్పాస్త్రా అల్లుకా సోకధిపం
కాకోదరచలాధీశం కలయే కాంక్షితార్థదం ॥

పద్ధెనిమిది పతాలుంగా దండపసపు నాగవెలి బలిపట్టి పుట్టలోనైనా స్థితాశేష నూటయిబ్బంద్రు నగరంవారు యిలువర్తన వరుపాశనం పెండ్లివర్తన నడపించగల వారము ఈ దేవతా ధర్మానకు యెవడు కీడు చరిస్తున్నాడో తమ తలిదండ్రుల వారణాసిలో వధియించిన పాపానపోవును.

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విష్ణుదత్తా వసుంధరా॥

మంగళమహా శ్రీ శ్రీ శ్రీ జేయును.

ఈ తామ్రశాసనం పుట్టి ౮౭౩ యేండ్లు అయినది. ఎత్తి వ్రాసినది తామ్రశాసనం చూచి వ్రాసినది. ప్రమోదూతనామ సంవత్సర కార్తిక శు॥ ౧౧ లు బుధవారం మొకాంపార్లపల్లెలో వ్రాసినది. కోమటి నూతల అనె గ్రామంలో సేనప అనె సాతానివాడి వద్ద యీ తామ్ర శాసనం ఉన్నది.

తుమ్మలలో ఆగా చెరువు క్రిందనుఉండే గుంటికి శిలాశాసనం. మల్లుక వాండ్ల పల్లెకు దక్షిణం చెరువు క్రిందను ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ శు॥ ౮ లు నకలు వ్రాసినది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౯౮ అగునేటి నళ సంవత్సరం పుష్య బ॥ ౩ లు గురువారంనాడు* రఘా ఆత మారి పనహా అగా అహమ్మదు వలదు హాజీమహమ్మదు గంజయిగారు తుమ్మల కసుబాస్థళమందు కొండకు వాయవ్యమూలాను తమ పేరిట చెరువు కట్టించి వేసిన శిలాశాసన నిర్ణయం. ఈ చెరువుకు ఆగ్నేయ భాగమందు మసీదు కట్టించి వనం వేయించి అందుకు యీ చెరువుకాల్వ నీళ్లు పారేటందుకు నిర్ణయం చేసి యీమసీదు వనంచెరువు కాపాడేటందుకు తమ కొమారుడు మహమ్మదు అల్లిని ఉంచి మా చెరువు క్రింద మాకు నడిచె దశవందము యీ మహమ్మదు అల్లీకి సర్వమాన్యంగా యిచ్చి నడిపించేది. ఈ మహమ్మదల్లి దశవంధం మాన్యం యీతని పుత్ర పౌత్రపారంపర్యము నడిపించ్చేది. ఇదిగాక యీ కసుబాస్థళ కరణం చిన వెంకటప్పకు యీ చెరువు క్రింద ఆరుతూముల మడి సర్వమాన్యంగా యిచ్చినారం గనుక వీరి పుత్రపౌత్రపారంపర్యము నడిపించేది. ఇది గాక మలుగుండ్ల పల్లె పాపాభట్లకు యేదుంమడి చాకిబండ జయంభట్లకు

* Thursday 11th-day Jan. A. D. 1677.

యిద్దుంమడి సర్వమాన్యం యిచ్చినారం నడిపించేది. ఈ చెరువు కట్ట మీాద ప్రతిదినం మూాడు పెరికలమన్ను వెసేటందుకు ఉప్పర పోతుగట్టి దాసరిబోయకి యేదుంమడి యిచ్చినారం నడిపించేది. ఇదిగాక హోతు గలు రామాజీకి యేదుంమడి సర్వమాన్యంగా యిచ్చినారం శాశ్వతంగా నడిపించేది. ఇదిగాక స్థళం ఆయగాండ్లకు భటవృత్తి బ్రాహ్మణ మాన్యాలు యెవరికి యేమి దానపత్రాలు యిచ్చినారో ఇదిగాక రాచ కరణం సూరప్పకు యిద్దుంమడి సర్వమాన్యంగా యిచ్చినారం ఈశాసనం చొప్పున నడిపించేది. ఇందుకు యెవరు ఆశపడి చేసినాగాని తురకలు నడిపించకుండా(పోయిరా) మక్కా-మదీనాలలోను పందినితిన్న పాపాన పోదురు. బ్రాహ్మలుమీాద తన(?) సామిద్రోహాతలు చేసి నడిపించక యుంటె కాశీలో గోహత్యమీాద తాను పంచమహాపాతం చేసిన పాపాన పోదురు. ఇటని వ్రాసిన శిలాశాసన నిర్ణయంచేసినది. సోంపల్లెలో కోటమ్మదేవళం తావున ఉండె శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తినామ సంవత్సర మాఘ బ॥ ౧౪ లు శివరాత్రి పుణ్యకాలాన మహారాజరాజశ్రీ శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివదేవమహా రాయలు విజయనగరమందు పృథివీ సామ్రాజ్యం చేయుచుండగాను శ్రీ మహాశివదేవి శ్రీ చౌడేశ్వరికి సితసింహాసనాసీనుడైన వెంగళరాజు రామ రాజుగారు వ్రాయించి యిచ్చిన ధర్మశాసనం. సోంపల్లె అగ్రహారం చతుస్సీమలోనున్ను మాకు వచ్చేరుసుం చ ౧ కి ౧౨ లెఖను యీా రుసుం యావత్తు సంవత్సరోత్సవానకుగాను ధారవోసి యిస్తిమి; గనుక ఆచంద్రార్క-స్థాయిగాను దేవతకు నడిపించగలవారము అని వ్రాయించి యిచ్చిన ధర్మశాసనము.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

శ్రీ చౌడేశ్వరీ దేవతార్పణమస్తు.

పెదపాళెం కనుగొండ్రాయస్వామి శాసనం కయిఫియతు వివరము.
దేవాళానకు ఉత్తరం గుంటిలోనున్న శాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౩౯౨
అగునేటి విజయ సంవత్సర చైత్ర శు॥ ౩ లు శ్రీమన్మమహామండలేశ్వర భాసురస్వ(మ గెతప్పువ)రాయరగండ గండభేరుండ పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రచతుర్భువన శ్రీ విరూపాక్షరాయలు సకల సామ్రాజ్యం చేయుచుండగాను ధర్మవ్రతంచేయడం శ్రీమచ్చతుర్భువ నాధీశ్వర అఖిలాండ కోటి బ్రంహాండనాయక గరుడ నారాయణ వేదవేదాంతవేద్య పురాణ పురుషోత్తములయిన కనుగొండ తిరువెంగళనాథ దేవునికి కళినాయడు త్రికాలముల యందున్ను దండంబెట్టి యిచ్చిన భూదాన శాసనం: పెనుగొండ రాజ్యమందు మా కావిలివారికి ముల్కలచెర్వున పెట్టిన మాన్యం మడిపెద్ద చెర్వు వెనుక మడి బుమ్మరాజు ఖ ౧౧౨ మాకు కావిలికి నడున్తా యుండె గనుక యీ భూమిస్వామి తళిహెందీపారాధనకు గాను ఆచంద్రార్కస్థాయిగాను నడిచేటట్టుగా యీ పుణ్యదినమందు సహిరణ్యోదక పూర్వకముగాను ధారపోస్తిమి. ఈ ధర్మానకు యెవరు ఘాతం చేసినా బ్రహ్మహత్యాది మహాపాతకాన పోదురు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

వు(ఉ)బిజర్ల గ్రామంలోనుండే శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౬
అగునేటి భావనామ సంవత్సర కార్తిక బ॥ ౧౨ లు ఖాద్రినారసింహ దేవునికి శ్రీకృష్ణదేవమహారాయలుకు పుణ్యంగాను శ్రీమన్మహానాయంకాచార్యులయిన గమ్మినాయని కుమారుడు పెదలక్కినాయని వారు నారసింహునికి దండములు సమర్పించి యిచ్చినది వుబిజర్ల గ్రామం. ఈ ధర్మానకు యెవరు తప్పినా వారణాసిలో తల్లిదండ్రిని, కాశిలో గోవును చంపిన పాపాన పోయినవారు కుక్కమాంసము సురా తిన్నవారు, ఇందుకు తప్పినవారు తమ ఆండ్లను మాలమాదిగలకు యిచ్చినవారు.

యీదాస్తు చాకిబండలోనున్న శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౯౧ అగునేటి విరోధినామ సంవత్సర మార్గశిర శు॥ ౨ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లితిరువేంగళనాథరాజయ్య దేవచోడ మహారాజులయ్యవారి కార్యకర్తలయిన ఊటుకూరి తిమ్మరాజు వారి ముందలను చిన్నరుసు చెన్నమనాయుని కుమారుడు అప్పకొండమనాయుడు చాకిబండ స్థళం పంద్రెండు ఆయగాండ్ల సమ్మతిని యేలిన స్వామికి పుణ్యంగాను చాకిబండ చెరువుపైన కాల్వల మడికి సహాగాను మడికి ౧౧ కి ధాన్యం ౧౧ మెడు లెఖ యెత్తించి పనిచేయించేటట్టు వేయించిన ధర్మశాసనం. ఈ ధర్మానకు విరోధించి ధాన్యం యియ్యక పోయినా యెత్తించి చెరువు పని చేయించక పోయినా వారి తల్లి దండ్రిగారిని వారణాసిలో వధించిన పాపాన పొయ్యేరు అని వ్రాయించిన ధర్మశాసనం. శ్రీరామ.

శ్రీ ఖాద్రి నృసింహస్వామి దేవస్థానంలో గర్భగుడికి దక్షిణాన వేసివుండె వేరే రాతిమీద వేసిన శిలాశాసనం యెత్తి వ్రాసినది. ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ బ॥ ౫ లు వ్రాసినది.

*స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౨౭౪ అగు నందన సం॥ కార్తిక శు॥ ౧౧ అగునేటి స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర అరిరాయవిభాడ హిందూరాయ సురతాన భాషగె తప్పువ రాయరగండ పూర్వ పశ్చిమ సముద్రాధిపతి శ్రీ వీరబుక్కణ ఒడయలు దోరసముద్రము పెనుగొండ సుఖంబున పృథివీరాజ్యం సేయగాను స్వస్తిశ్రీ మతు సత్యప్రతిపాలక అగ్రహారం బగంబరమరుకుంటె(?) కూటక తప్పువనాయంకర గ(ం?)డ బాసినగెతప్పువనాయంకరగండ బాసప్రతిపాలక పంపిమసంన్నా ఇనిబలి(?) నాయనిగారు కద్రి అవుభళదేవరనగరి మండపము వారు పని పూర్తి చేసిరి.

---

* A. R. No. 522, of 1906.

యావ చ్చంద్రశ్చ సూర్యశ్చ యావ త్తిష్ఠతి మేదినీ ।
యావద్రామకథాలోకే తావద్రాజ్యం విభీషణ ॥

శ్రీ మంగళమా శ్రీ శ్రీ

కదిరి దేవస్థానం గర్భగుడికి దక్షిణభాగం గరుడవాహనం ఉండే మంటపం అంచున తూర్పు భాగాన ఉండే శాసనం నకలు.[1]

వ్రాసినది ప్రమోదూత సంవత్సర శ్రావణ బ॥ ౮ లు బుధవారం. ముళువాయి కొమారక పంపన్నపనాయక(?) అంగజావర గోపంణను కదిరి దేవరిగె మాడిసిద్యనడతక్క ప్రధాని సోవప్పగరు ప్రతియాగి హక్కి దహార స్వస్తిశ్రీమతు శకవరుషంబులు ౧౨౭౫ నెయ విజయ సంవత్సర ఫాల్గుణ శు॥ ౧౫ లు అయిదండు గ్రిద్దె భానుమభోస్మణాం విమనగొత్త ధరంణ్యస్థలె స్థాతంతప్పె రెఖామ గోత్రి తమితి మీలంనెరాజితి స్వైత స్నెవపణోవిమితిమి గోజేస్వ దొరకంబింబ తత్వయాయాంగమి తేతి సోమకభేరగ్రిడెయకం శ్యాంగి సోమో మంగళశ్రీ.[2]

యాదాస్తు వు(ఉ)రిమెళ్లలో చెన్నకేశవస్వామి మహాద్వారం ముందరనున్న శిలాశాసనం నకలు ఎత్తి వ్రాసినది ప్రమోదూతనామ సంవత్సర కార్తిక బ॥ ౬ లు అంగారక వారం నాడు మూడు ఝాముల వేళ వ్రాసినది.[3]

శ్రీమన్మహామండలేశ్వర రాజబిరుదాంక రాజపరమేశ్వర వీర ప్రతాపదేవరాయ మహారాయడు పృథివీ రాజ్యం సేయగా శ్రీమన్మహా మండలేశ్వరు నిర్మితంబగు శరభండ(?) దేవమహారాయలు ఉలిమెళ్ల చెన్నకేశవ బిరుదుగ విభవానకు వ(ఉ)లిమెళ్లపెద్ద కాలువను మట్టాల బయ్యన్నది శిలాశాసనం క్రమ మెట్లన్నను శాలివాహన శకవరుషం బులు......(రాయి భిన్నమైపోయినది.)

---

1. A. R No. 523 of 1906
2. Saturday 9th March, A. D. 1354.
3. A. R. No. 519 of 1906.

పరాభవ సంవత్సర పుష్య శు॥ ౧౦ లు పెద్ద కాలువకు ఉత్తరం మడి ఖ ౦॥౦ పందుము దేవమహారాయలవారి నిరూపాన బయ్యన్న యిచ్చిన ధర్మము. ఈ ధర్మానకు యెవరైనా తప్పితె వారణాసిలో తల్లితండ్రిని చంపిన పాపాన పోవువారు. కాశిలో గోవునుచంపిన పాపాన పోవువారు.

యీదాస్తు ఈ శాసనం మవుజె గురిజాలది. ఎక్కడ వుండేది అంటె హనుమంతరాయణి దేవస్థానం ముందరనున్నది. శిలాశాసనము.

పరీధావినామ సంవత్సర కార్తిక బ॥ ౨ గురువారం శ్రీమన్మహా మండలేశ్వర తిరుమలరాజు వెంగళరాజు దేవదేవ(?) వరదరాజయ్యగారు గురిజాల కాపులకు యిచ్చిన శిలాశాసన క్రమ మెట్లన్నను. బీడు చేలు ౧౧ కి ల్౨ రెండు రూకల లెఖతో దీబిడు(?) నూరుయేండ్ల దనుకను మళ్లియాళకలు(?) గుత్తకు సాగి స్తిమి. ఈ మరియాదను దున్నుకొని బ్రతికేది. అంతాను యిదే మరియాదను నడువగలవారము. ఇందుకు యెవరు తప్పినానున్ను గోబ్రాహ్మణుని చంపిన పాపాన పోవువారు.

ఈ శాసనం నకలు వ్రాసినది ప్రమోదూతనామ సం॥ కార్తిక బ॥ ౧ లు వ్రాసినది.

సూర్యుడు. చంద్రుడు.

గురిజాలలోనుండే శాసనము నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౮ అగునేటి ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర తిరుమలరాజ వెంగళయ దేవమహారాజులుగారు మల్లసాని తిప్పయ కుమారుడు బసవయకు యిచ్చిన శాసనము.

గొబ్బూరి నరసరాజు యిచ్చినవారు మాకు యిచ్చిన ఉంబళిగె.

ఈ శాసనం కరణం కొండప్ప యినాం రాతి పంపులోను ఉన్న దానికి నకలు వ్రాసినది.

ప్రమోదూతనామ సంవత్సర కార్తికలో వ్రాసిన శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

కురుమల శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౦ అగునేటి విరోధి సంవత్సర కార్తిక శు॥ ౧౦ లు స్థిరవారం మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప అచ్యుతరాయలు రాయసం రామచంద్రుల దీక్షితుల అయ్యవారికి నాయకతనానకు పుణ్యానకు (పాలించిన) పాగుళ్లసీమకు చెల్లే కురుమాలగ్రామం కదిరి శ్రీ నారసింహ దేవుణికి అచ్యుతరాయ మహారాయలకు పుణ్యముగాను అచ్యుతరాయల వారు దధ్యన్నవసరానకు తుంగభద్రాతీరం అయన పుణ్యకాలమందు అచ్యుతరాయలకు పుణ్యముగాను రామచంద్రదీక్షితుల అయ్యవారు కదిరి శ్రీనృసింహ దేవునికి శోళసి శోమాలసరం కురుమాలగ్రామం రామచంద్ర దీక్షితుల అయ్యవార్లు తమకు ధర్మంగా కురుమాల కదిరి నారసింహ దేవుణికి త్రివాచాన ధారాపూర్వకముగా సమర్పించి యీ ధర్మం ఆచంద్రార్కస్థాయిగా నడిపించగల ధర్మము.

మవుంజె ఉబిజర్లగ్రామంలోనున్న శాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౬ అగునేటి భావనామ సంవత్సర కార్తిక బ॥ ౧౨ లు శ్రీఖాద్రి నరసింహ దేవునికి కృష్ణదేవమహారాయలకు పుణ్యంగాను శ్రీమన్మహానాయంకాచార్యులయిన గుమ్మినాయని కొమారుడు పెదలక్కినాయనివారు నారసింహునికి దండము సమర్పి(ంచియిచ్చి)నది ఉబిజర్లగ్రామం. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినా వారణాసిలో తల్లిదండ్రిని కాశీలో గోవును చంపిన పాపాన పోవువారు. కుక్క మాంసం సురాతిన్నవారు. ఇందుకు తప్పినవారు తమ ఆండ్లను మాలమాదిగె(లకు) యిచ్చినవారు.

*శుభమస్తు అవిఘ్నమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సం॥ నిజఆషాఢ శు॥ ౧౨ లు

* The whereabouts of this inscription is not known.

శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివ మహా రాయలు పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను శ్రీమతుచతుర్భువనా ధీశ్వర అఖిలాండకోటి బ్రహ్మాండనాయక గరుడనారాయణ వేదవేదాంత వేద్య శ్రీపురాణ పురుషోత్తములైన గ(చ)ను గొండ్ల తిరువెంగళనాథ దేవునికి సోకపల్లె అగ్రహారం ముదిరెడ్డిగారి మారంరెడ్డి కొడుకు యర్ర గంగిరెడ్డిగారు దండ్డంపెట్టి దధ్యన్న అవసరానకు సమర్పించియిచ్చిన మడికి వివరము. ములకల చెరువు గ్రామం పెద చెరువు వెనుకను స్థానం వారి చేతను సమంఖండభోగ్యంగాను పడిన అరవై వరహాలకు భోగ్యంపడిన బొమ్మరాజు పందొమ్మిది తూములు మడిన యీ ప్రథమ ఏకాదశి పుణ్య కాలమందు దధ్యన్న అవసరానకు నేమకం సమర్పించి మూలపత్రా లున్ను యిస్తిమి గనుక స్వామికి సేవ ఆచంద్రార్కంగాను అవధరింపగల వారు స్థానంవారు మూలంగాను ఉంచుకొన్న ప్రకారం గ ౧౬ పత్రం నీ శిఖర తొలసితో మూల అవధరించగలందులకు యిస్తిమి. ఇట్టి ధర్మ శాసనం సహి.

శ్లో॥ దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం॥

శ్రీరామార్పణ మస్తు.

పార్లపల్లెలోనుండె శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౯౮ యగునేటి ధాతునామ సం॥ మాఘ శు॥ ౧౦ సోమవారం నాటికి చిగ్రెడ్డి పల్లి చెరి(రువు) పూడినకాలువ యిరుగపడను కోనయ్యకు రాయలప్ప ఒడయలవారు నియూపాన విధింక్కలానడుమ(?) దయచేసిన గుండ మడి సమగ్రముగా దష్టాముశ్య(?) దయచేసినది. మంగళమా శ్రీ శ్రీ జేయును.

ఈ శాసనం యెత్తి వ్రాసినది ప్రమోదూతనామ సంవత్సర కార్తిక శు॥ ౧ శుక్రవారంనాడు వ్రాసినది.

చక్రం. శంఖం.

(51-ఎ) ఈపుట అంతయు ఒక అక్షరముకూడా వ్రాయలేదు)

(51-బి) ఈ పుటలోకూడ యేమియు వ్రాసియుండలేదు.)

ప్రమోదూతనామ సం॥ ఆషాఢ బ॥ ౧3 లు అవ్వాలు తుమ్మల సమ్మతమ్మైకి చీకటి మర్రిపల్లె సుబ్బారెడ్డి కరణం నారాయణప్ప ఉభయం యిద్దరున్ను వ్రాయించి యిచ్చిన శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరషంబులు ౧౭౩౦ ఆగునేటి నందననామ సంవత్సర చైత్ర శు॥ ౧౫ లు గ్రహణపుణ్యకాల మందు శ్రీవిక్రమరాయలు నందావజ్ఝులకు యిచ్చిన విక్రమరాయపురం అగ్రహారానకు పాయల్లకట్టు వివరము.

మప్పూరి యరబల్ల గ్రామానకు నయిర్‌ృతి భాగమందు ఒక గడియ దూరంలో పంచ్చలింగాలున్న కొనాను ఉన్నవి. నదరహి పంచ్చలింగాల కోనకు వాయవ్యమూలన పర్వతమందు పర్వతశిలకు వ్రాసియుండె తెలుగు అక్షరాలకు నకలు అదేప్రకారం వ్రాయబడ్డది.

దుర్మతినామ సంవత్సర మాఘ శు॥ ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర అంత్యంబరగండ మన్యగజపతి సరాబు(సంబెట)వల్లభయ్య దేవ మహారాజు అఖండకొమార తిమ్మయదేవమహారాజులు చంగమ సంగమ దేవుని కొమారుడు నాగదేవునికి యిచ్చిన ధర్మశాసనం.

మానాయంకానకు చెల్లే పులివెందలస్థళం యరబదియ సీమలో గల దేవస్థానము అమృతగిరి పంచ్చలింగాల సిద్ధయ్య దేవునికి నీవు పూజ చేసేటట్టుగాను సాగించి నిలిపితిమి. ఆ దేవునికి పూజదీపారాధన నైవేద్యమున్ను సాగేటట్టుగాను మా నాయంకరానకు(చెల్లే) యఱ్రబదిదియల పొలములోను బాలిరాళ్ల కనమకు పొమ్యేదోవను చతుర్దిక్కు- మేరలు: పడమటి మేకల కనుమకు దక్షిణం తొర్రమానుకు ఉత్తరం పులివెందుల దోవను గ ౧ వరహాకు గుత్తకు నడిచే చేను హద్దు చేసుకొని కొలువపాటి ఖ ౹౦ మెదుముచేనున్ను పులివెందుల పొలములోను యరగుడివారు చేసే

అగుదూరు కాలువను ప్రాకున నీరుగట్టుకనువడు చేసిన మడికి స్థళంకొలువ పాటి ద్రి॥3 పద్దకొండు ముంతలున్న యిస్తిమి. గనుక ఆమడిన్ని చేనున్న లెస్స యీ దేవస్థానం త్రికాలమందున్న పూజ దీపారాధన నైవేద్యానకుగాను సూర్యోపరాగ పుణ్యకాలమందు పూజ తప్పకుండా అయ్యేటట్టుగా అష్టభోగ తేజస్వామ్యాలతోనున్న సర్వమాన్యంగా మా తండ్రికి పుణ్యమువచ్చేటట్టుగాను సూర్యచంద్రులు గలంత్తలోగాను మహా రాజులకు పుణ్యముగా ధారవోసి దానపూర్వకంగాను యీ వల్లభయ్య దేవునికి యిస్తిమి. ఈ ధర్మానకు యెవరు దప్పినాగాని గంగాతీరానకు పోయి గోవును చంపిన పాపాన పోదురు. శ్రీవల్లభయ్యగారు వీరభక్తులు.

ఈ శాసనానకు తూర్పున సదరహూ గృహం(?) పర్వతానికి వ్రాసియున్న తెలుగు అక్షరాలకు నకలు.
శుభమస్తు॥

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర అఖండరాజక నిరాజిత వాక్య భయాద్దైవ మహాబీయూను మహారాజకందర్ప మహామండలుడై సామ్రాజ్య పృథివీ రూథుడై రాజేంద్రు సకలరాజ మూర్ధుడుగాను కుల బదిభవుండు సోమకులాంభోధి చంద్ర సౌక్యమరీచి మహనియ్య శ్రీమన్మహామండలేశ్వర హరిహరరాయడు రాజ్యము సేయుచుండగాను సౌక్య మరీచిమహనీయ గజపతి అయ్యను తనురత్రాణ చంద్రుడు సోమండల మహారాజ వీరతనూభవుండు భంగండు.

ఇవతల అక్షరాలు శానామలినం అయినవి గనుక వ్రాయడానకు రాలేదు. ఏమటుకు అక్షరాలు తెలుస్తూ ఉన్నవో ఆ మటుకు వ్రాయడం అయినది.

శంఖం. నామం. చక్రం. సూర్యుడు.

ఎర్రబల్లగ్రామానకు తూర్పు కామచిర్ల పొలములో హనుమంత రాయని దగ్గిరనున్నవి శిలాశాసనాలకు తెలుగు అక్షరాలకు నకలు.

శుభమస్తు. శ్రీమద్రాధిరాజ రాజశ్రీ హండె కొమారరామప్ప నాయక హండె అయ్యగారి కార్యకర్తలయి నలకూజగారు కాచిమర్ల హనుమంతరాయలును పూజచేసే ధర్మానకు క్రమమెట్లన్నను. ధాతు సంవత్సర జ్యేష్ఠ బ॥ ౫ లు మాసుబాకు చెల్లెకాచిమర్ల యర్రబల్ల రెండు పెంటె సుంఖం దేవునికి దీపారాధనకు ధారబోసి యిస్తిమి. ఈ ధర్మ శాసనము ఖరారు యెవ్వరు తప్పినానున్ను గోబ్రాహ్మణుల వధించిన దోషాన పోగలవారు.

శ్రీ శ్రీరామా శుభమస్తు.

ప్రభవ సంవత్సర వైశాఖ బ॥ ౧౨ లు శనివారము ఈ శాసనము యర్రబల్లగ్రామానకు తూర్పు కాలుగడియ దూరములోను హనుమంతరాయనికి యెదురుగాను నల్లరాయికి ఉత్తరముగాను ముదులున్ను వ్రాసినది శిలాశాసనాలకు నకలు.

రెండో శాసనం తెల్లరాతిమీద నుండే శాసనానకు నకలు.

సూర్యుడు. చంద్రుడు.

సౌమ్య సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౫ లు శ్రీమతు కుర్లిమల్లిరెడ్డి చినమల్లిరెడ్డి నల్లమరెడ్డి యర్రమల్లిరెడ్డి జనులు నలుగురున్ను యెర్రబల్లలో యేకస్తులై యెందుకున్ను యలిన కొడుక్కి తమ తండ్రి మలిరెడ్డికి పేరుగాను తన మడిస్థళంలోను ఉండే కాచిమర్లను రెడ్డి మాన్యములో నీ చేని స్థళం తూర్పు ఉండే స్థళంలోను యిద్దుము చేను తమ తండ్రి మలిరెడ్డి తమ పుత్రులు మలిరెడ్డి మాన్యము యిస్తిమి. ఈ మాన్యానికి యెవరు తప్పినను కాశీలో గోవును చంపిన పాపాన పోదురు. ఈ ప్రకారం నడిపించినవారు......

మవుజె మురారి చింతలగ్రామానకు దక్షిణం నయిరుతమూలను ఒక గడియదూరంలో శేషాచల పర్వతానికె పాలకొండలు అనే పేరు ఉన్నది గనుక సదరహీపర్వతం మీదను ఒక తెల్లరాయి వాటికి పేరు

యినకబండ అనే పేరు ఆబండమీాదను వ్రాసియుండె శిలాశాసనానకు నకలు.

అదే ప్రకారం వ్రాసినది.

సూర్యుడు. చంద్రుడు.

దొరగల్లు తిరుమలరాజపురం సందు విప్రదత్తం. ఇంతే వ్రాసి వుండేది. అధికం యేమిన్ని లేదు.

వామనముద్ర

శిలాశాసనానకున్ను దానపత్రాలకున్ను నకళ్లు వ్రాయపడ్డది. తాడిపత్రితాలూకాలోది. వహి ఒకటి అక్షరాలు తెనుగు.

(62-బి ఈ కాగితములో బొత్తిగా యేమీా వ్రాయలేదు.)

63-ఎ వెంకటాచలపతికి

ఈ దానపత్రం తాడిపత్రి తాలూకాలో యెల్లానూరు అనే గ్రామంలో శ్రీనివాస ఆచార్యులవారి వద్దనున్న దానికి నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౯ అగునేటి యీశ్వరనామ సంవత్సర వైశాఖ శు॥ 3 లు శ్రీమధ్వశాస్త్ర సంపన్నులయిన మహిశెకారి శేషాచార్యుల వారికి వెల్లూరు సుంకం మణియం మల్లెపల్లె రామకృష్ణప్ప వ్రాసి యిచ్చిన దాన ధర్మ శాసన పత్రిక. మీారు వెల్లూరు సుంకంమీాద వర్షాశనము కావలెనని అడిగితిరి; గనుక అదే ప్రకారం మా యిష్టదయివం శ్రీ...ప్రీతి గాను సంవత్సరం ౧ కి ౫ 3 లెఖను అక్షరాలా చలామణి మూడు వరహాలు లెక్కను నిర్ణయంచేసి యిచ్చినాము గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని సుఖాన నుండేది. అని వ్రాయించి యిచ్చిన వర్షాశనం ధర్మశాసన పత్రిక.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
ఈ శాసనం అంటె కాగితం దానపత్రం వ్రాసినది.

రామకృష్ణప్ప

తాడిపత్రితాలూకాలో మద్వుజె నిట్టూరు అనే గ్రామంలోను నీలకంఠేశ్వరుని దేవళంముందర నుండే శిలాశాసనానకు నకళ్లు.*

సూర్యుడు. శంఖు. రెండుగీరలనామము. చక్రం. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౨ అగునేటి సౌమ్యసంవత్సర నిజ వైశాఖ శు॥ ౧౨ లు శ్రీమన్మహారాజాధి రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివరాయ దేవమహారాయలు పృథివీ సాంమ్రాజ్యంచేయుచుండగాను వల్లుట్ల గోత్ర జక్కంపూడి పెద్ది నాయనిగారి కొమారుడు తిరుమలనాయనిగారికి నాయంకరానకు పాలించియిచ్చిన చిరబడిలోను నిట్టూరును శ్రీ చెన్నకేశవ(దేవుని) మూర్తికి పూర్వమందు అమృతపళ్లకు చెల్లేక్షేత్రం చెర్లో(చవిటి)చేని స్థళం ఖ ౦।౧ మడి, గుంత్త మడి స్థళము ౧౨, కాల మడి స్థళము ౧౨౧ బోనుత కాల్వ మడి ౧౧, పత్తి 3, ౦॥౦ రెండు పత్తాబలమయినది ౫౦౫ 3 వను బోగం వారి మడికి ఉత్తర స్థళం ఖ ౦।౦ ఉభయం ఖ ౦।౨।౦, బోగుసూతికాల్వ వంగ్గలి మడి కయ్యెలు ౧౧, పూర్వం పెరుమాళ్ల మడికి ఉత్తరం౧౨।౦, ఉభయం ౧3।౦, అంతు స్థళాలు 3; కాను మడి ఖ ॥౧॥౦, తోట పెరుమాళ్లమడికి నిండు పడమట స్థళం ౧౧, కాలువ గడ్డ ౧౫, ఉభయం పుర్వ సహా చేను ఖ ౦౫౨।౦, మడి ఖ ౦౧3౫౦, తోట ౧౧౫౦ కి వినియోగాలు అవుచ్చీతవళ్నికు(?) పల్లకి సేవకు తుంన్నీరు తింమ్మయ చేను ఖ ౦౦॥౧, రాలు చెట్టి చేను ఖ ౦౧౧౧।౦, మెడుపర్న వారి చేను స్థళం ఖ ౦౧, కూచీ వెంగ్గళయ చేను ఖ ౦౫౦, అంత్తు ఖ ౦3।౨।౦ ; గుంతమడ్డిలో చేను ౧౪, బోనుతకాల్వను ౧3।౦, కొన మడి ౧౨।౦, అంతు మడి ఖ ౦।౪౫౦, తోట ౧౧౫౦ కి చేను మడి వినియోగం దివం ౧ కి

* A. R. No. 21 of 1953-54.

ఆవస్సరాలు(అవసరాలు)౩ కి చెల్లే బియ్యం మ ౧; ధనుర్మాసం ఆవసరానకు దినం ౧ కి మ ౦౫౦, పెస్సలు ౦౹౦, ఆనవాలు అవస్సరానికి గు ౫౩౫౦; అఖండ తిరువళగెకు ౮౪౨౦, అలంకారటరువళిగెలు దినం ౧ కి ౨౪ కి, గ ౬౨౦౹౦, కార్త్తికమాసం అఖండ తిరువళిగె నెయ్యి గ ౺౦౧౫౦, పంణ్యారానకు ౨౨, ఉభయం ౫౩౫౦; కార్త్తికమాసాన్కూ అఖండతిరు వళిగె యీా దినం గ ౧౬ దివటీలకు దినం ౧ కి ఆ ముద్యం ౧౻౦ ను గ ౩౨౦, పంణ్యారానకు గ ౫౩, ఉభయం గ ౩౫౩; పారవేట మహోత్సవం వుట్ల తిరుణాలు, తెపు(తెప్ప)తిరునాల మహోత్సవము, చైత్ర మహోత్సవము అంతు మహోత్సవాలు ౩ కి మహోత్సవం ౧ కి ఆముద్యము గ ౦౫౦, పణ్యారానకు ౨౩, వున్న గ ౨౩; శ్రీజయంత్తికి ౨౧, గంధం గ ౧౨౦, కోవిలవార్కి వివరము. భాగవత సేవకు మెటు పట్టం వారి రేగడి చేను స్థళం ఖ ౦౫౦, మంత్ర పుష్పానకు మెట్టువల్లి వారి రేగడి చేను ఖ ౦౹౫౦, బోగం వాండ్లు జనాలు ౬ కి వేముల వున్న రేగడి చేను స్థళం కాల్వ మడి స్థళం ఖ ౦౹౦౹౦, గుత్త మడి ౨౧, ఉభయంతోన్ను నాగసరాలవారికి మెడుపల్లె వారి రేగడి చేను స్థళం గుంత మడి ౨౧, కాల్వ మడి ౨౧, బోగంవాండ్ల కాల్వ మడి ౧౦౫౦ అంత్తు మడి చేను నకీజుల వార్కి మెడుపల్లి వారి రేగడి చేను కుచ్చి వెంగ్గళయ్య చేను స్థళము వు(ఉ)భయం వంకమడ్డి ౨౹౦౻౦ చేను.

## రెండో శిలాశాసనం

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౬౬ అగునేటి శోభకృతునామసంవత్సర భాద్రపద శుద్ధ ౧౧ పుణ్యకాలమందు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివ రాయ మహారాయలు పృథివీ సామ్రాజ్యంచేయుచున్న అచ్యుతగోత్రం జక్కంపుట్టి పెద్దినాయనికుమారుడు తిరుమలనాయనిగారికి నాయంక రానకు పాలించి యియ్య నవధరించిన చిరబడి సీమలోను నిట్టూరును ఆ నిట్టూరు నీలకంఠేశ్వరునికి పూర్వమందు అంగరంగ వైభవముల కున్ను అమృతపళ్లకున్ను నడిచి వచ్చే చేను ఖం ౧౩౨౦౹౦, మడి ఖ

౦౨౹౦ న్ను తిరుమలయ్యగారు తమతండ్రి పెద్దినాయనిగారికి పుణ్యము గాను కాల్వమడిలో క్రొత్తగా నీలకంఠేశ్వరునకు సమర్పించినది. ౧౧ ఉభయం మడి ఖ ౨౹౧ మడి మెడితూర్పులో సగం గొంగడి లింగానకు సగం చెల్లగాను నీలకంఠ దేవరకు చెల్లే సగబాలకిగాను నీలకంఠేశ్వరుని స్థానీకులు శ్రోత్రియంగాను పూర్వానను నగరికి అచ్చె మర్యాదలోను ఆద్యంతమున్ను తుంగభద్రాతీరమందు వీరవేశ్వరు సాన్నిధ్యమందు యీ యేకాదశీ పుణ్యకాలమందు సదాశివరాయలకున్ను రామరాజు గారికిన్ని పుణ్యంగాను సహిరణ్యోదక దాన ధారా పూర్వకంగాను సద్యః ఫలించడంగాను పెమ్మసాని తిర్మలసాని గారికిన్ని తిరుమలయ్య గారు తమతండ్రి జక్కంపుట్టి పెద్దినాయనిగారికిన్ని పుణ్యంగాను ధార బోసి యిచ్చిన ధర్మశాసనములు. సర్వమాన్య ధర్మశాసనానకు యెవరు పరస్థలాల వారున్ను తమ పితురుకు యే ప్రకారం సంరక్షణ చేస్తున్నారో ఆ ప్రకారం చేసి యిందుకు తప్పితేవారణాసిలో హత్య చేసిన పాపాన బోదురు.

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥
స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

(69-ఎ నుండి 69-బి కాలీగా వున్నవి. 70-ఎ ప్రారంభము కావలసి యున్నది.)

శిలాశాసనానకు నకళ్లు. అక్షరాలు తెనుగు. తాడిపత్రి తాలూకాలో మల్లెపల్లెగ్రామందిన్ని చిలంకూరుగ్రామందిన్ని ఉండిన శిలాశాసనానకు నకళ్లు వ్రాయబడ్డది.

మఖుజె పెద్దమల్లెపల్లెగ్రామంలో ఆంజనేయస్వామి దేవాలయా నకు పశ్చిమం గోడకు నీలపు నల్లరాతినుండే శిలాశాసనానకు నకలు తాలూకు తాడిపత్రి.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౭ అగునేటి క్రోధి సం॥ కార్తిక శు॥ ౧౦ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలుగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యం చేయు చుండగాను శ్రీమన్మహామండలేశ్వరులయిన రామరాజు దేవమహారాజు వేయించిన యీ శాసనం చిరబడిలోనున్న మల్లెపల్లెకు ప్రతినామమైన అగ్రహారం కొండాపురము.

సదరహుగ్రామానకు మజరా కొండాపురం పొలిమేరకు వేమ పల్లెకు దక్షిణం పొలిమేర రాతికి పొలిమేర అని తెనుగు అక్షరాలతో వ్రాసియున్నది. ఇది శాసనం కాదు. సరిహద్దు రాయి.

తాడిపత్రి తాలూకాలో మఖుజె చిలంకూరుగ్రామానకు తూర్పు బాణటప్పాలోను ఆంజనేయస్వామి దేవళానకు పశ్చిమం చింతచెట్టు దగ్గర చింతచెట్టుకు ఆనుకుని నల్లరాతి మీదనుండే శిలాశాసనానకు నకళ్లు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౮౮ అగునేటి పరాభవనామ సంవత్సర కార్తిక శు॥ ౧౨ లు శ్రీమన్మహా రాజాధిరాజ పరమేశ్వర శ్రీ వీరసదాశివదేవ మహారాయలుగారు వియజనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యం చేయు చుండగాను సదాశివమహారాయలు అనుమతిగాను రామరాజు దేవమహా రాయ ముందుకుగాను(?)గుత్తిమెర్రతిమ్మరాజులయ్యగారు వేయించిన శిలాశాసనం : చిలంకూరిలో మంగళవారి పన్ను సిద్ధాయము కానికె వెజ(?)దొమ్మర పన్నుసహా సర్వమాన్యంగాను పాలించి విడిచినారు.

ఈ ధర్మానకు యెవరు తప్పిన కుక్కమాంసం సురాసేవించిన వారు. మంగలవాని ఘనస్సకొడుకులు.

యే[ప్రెల్ ౨ నిలు ౧౮౧౩ సం॥

తఖ్తాకు దాఖలు అయినది.

తాడిపత్రి తాలూకు మొ॥ మెడకురతి మొ॥ నిటూరు యీ రెండు గ్రామములో ఉండె శిలాశాసనముల నకళ్లు ౧౦ కి వహి ౧.

తాడిపత్రి తా॥ యల్లానూరు సమ్మతు మాజె మెడకురతి ౧ గ్రామమును తూర్పుకాలువవద్ద నిలవబసవన్న రాతికి శాసనం హాళె కన్నడ అక్షరం.[1]

చంద్రుడు. లింగం. సూర్యుడు.

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥

స్వస్తి శ్రీమతు యాదవనారాయణ ప్రతాపచక్రవర్తి సింగణదేవ రాజ్యాభ్యుదయ శకవర్షద ౧౧౪౩ నెయ విక్రమసంవత్సరద మార్గశిర శు॥ ౧౦ సోమవారదందు శ్రీమతు పట్ట సహణాధిపతి మల్లెయసాహణి రాజధాని పట్టణం వెల్లనూర మధ్యదలు చిత్రవాళి శ్రీజనమేశ్వరదేవర ప్రతిష్ఠెయంమాడి నైవేద్యక్కం అంగభోగరంగభోగ పాత్రమాళక్కె గోవిదేవన మగ గంగరసన కయిందా ధారాపూర్వకవాగి కొట్ట ప్రర్తి మోళికుఱుడు త్యాదియ కాలువ ఆచంద్రార్క తారంబరం సలుత్తమిరె మంగళమహాశ్రీ.

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

౨ ఈ రాతికి రెండో ప్రక్కను వ్రాసియుండేది.[2]

స్వస్తి శ్రీమతు శకవరుష ౧౧ అర్వతేనెయ హేవళంబి సంవత్సర ఆషాఢ శు॥ ౧౫ గురువారదందు శ్రీమన్మహామండలేశ్వరం జగ

1 A. R. No. 18 of 1953-54.
2 A R. No. 19 of 1953-54.

డాళభోగరస దేవమహారాజరు బ్యాపక దేవరిగె గురుదక్షిణ నిట్టూర సీమ దల్లుగుయ్యలు ౧ బిజ ఖ ౬ వెయెమత్తరు ౨కొట్టను ఆచంద్రార్క తారకం సలుత్తమిరె మంగళమహా శ్రీ శ్రీ.

ఈ శాసనానకు ఉత్తరం రాగితోటలో నిలుపరాతిక శాసనం.

సూర్యుడు. లింగం. చంద్రుడు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౨౮ అగునేటి క్షయసంవత్సర......సూర్యగ్రహణ పుణ్యకాలాన*శ్రీమన్మహా మండలేశ్వర నరసింహరాయ ఒడయలు శ్రీమన్మహామండలేశ్వర...... ..................తిమ్యరసయ్యగారు శ్రీమన్మహామండలేశ్వర తిరుమలయ్య దేవమహారాజులుంగారు దండమునమర్పించి యిచ్చిన ధర్మశాసనం. నేము మా......నాయంకరాను చెల్లే చిరబడి నిట్టూరిస్థళం లోని మెడికూరి గ్రామము నిట్టూరి నీలకంఠ దేవరకున్ను గొంగడయ్యకున్ను దీపారాధన నైవేద్యం మొదలైన అంగరంగ వైభవాలకున్ను నరసింగరాయ వొడయలకు పుణ్యంగాను యీ సూర్యగ్రహణపుణ్యకాలాన సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను ధారవోసిన శాసనము గాని(?) ఆ మేడకూరి గ్రామములోగల నిధినిక్షేపజలపాషాణఅక్షీణి ఆగామిసిద్ధసాధ్యంబులనెడి అష్టభోగ తేజస్వామ్యములున్ను ధారవోసియిస్తిమి గాన ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

* In Ś. 1428 Akshaya there occurred two Solar eclipses, (1) on Ashādha ba 30 (Monday, 20 th July, A.D. 1506,) and (2) on pushya ba 30 (Wednesday, 13 th January A.D. 1507). The inscription may be assigned to one of these two dates.

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥

ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను గంగకరతను గోవు బ్రాహ్మలాను చంపినవారు. వారణాసిలో తమతల్లిదండ్రుల వధియించినవారు.

ఈ గ్రామం చతుస్సీమలోనైన నీరారంభం కాడారంభం మొదలైన గ్రామానగల సకల సువర్ణాదాయం మొదలైనది సర్వమాన్యంగాను.........

ఇక్కడ నాలుగు పంక్తులు అక్షరాలు బొత్తిగా అగపడలేదు.

3. యల్లానూరు సమ్మతు తాడిపత్రి తాలూకా మాజె నిట్టూరిలోనుండే శాసనాలు.

గ్రామానికి పడమర నీలకంఠేశ్వరుని దేవాలయంలో నుండే శాసనాలు: ప్రాకారంలో దేవళానకు దక్షిణం దిగువ రాతికి హళెకన్నడం అక్షరాల శాసనం.

౧. శ్రీనమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥

స్వస్తి మస్తభువనాశ్రయం శ్రీపృథివీవల్లభమహారాజా రాజపరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిళకం చాళుక్యాభరణం శ్రీమద్భువనేకమల్ల దేవర విజయరాజ్యముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధమానమా చంద్రార్కతారంబరం సల్లుత్తమిరెలు మహాప్రధానం దండనాయక కళిమయ్యంగళు స్వస్తిసమస్త ప్రశస్తసహితం శ్రీమన్మహామండలేశ్వర త్రైలోక్యమల్ల మల్లిదేవమహారాజరు సుఖదిం నిట్టూరద నీలకంఠ.

ఈ శాసనం సంపూర్ణంగాలేదు. అర్ధంవ్రాసియున్నది. ఇందుకు దిగువన వినం గ్రామకరణాలు వ్రాసియుండేది.

పెద్దన్న కొమారుడు నిట్టూరి లేపాక్షి నీలకంఠస్వామికి నిత్యం పది వేలదండములు. క్రోధి సంవత్సర జ్యేష్ఠ శు॥ ౫ లు.

ఈ దేవాలయం గోడపెలపట నతుద్వారానకు ఉత్తరంగా వ్రాసి యుండేది.

౨.శుభమస్తు' స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౪౫ అగునేటి స్వభానుసంవత్సర మాఘ బ ౧౪ మ శ్రీమద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలు పృథివీరాజ్యంసేయుచుండగాను చతుర్థ వర్ణోద్భవులైన వడమలన్నంగారు నిటూరి నీలకంఠ దేవుని స్థానికులకుయిచ్చిన ధర్మశాసనం క్రమమెట్లన్నను. మాకు కృష్ణదేవమహారాయలు నాయంకరానకు పాలించ నవధరించిన గండికోటరాజ్యంలోని చిరబడి మారససీ(మ)లోని నిటూరి నీలకంఠ దేవుని స్థానం వారికి పూర్వాననుండి విస్తరాకుల వెట్టి సేయంగాను ఆ విస్తరాకుల వెట్టి యీ తథా తిథి శివరాత్రి పుణ్యకాలమందును శ్రీకృష్ణదేవమహారాయలకు బుణ్యంగాను విస్తరాకుల వెట్టిమాని నీలకంఠ దేవునికి నిత్యాభిషేకానను మహానంది ఉదకాలుదెచ్చి అభిషేకం రెండు వేళ(ల)ను సేయంగట్టడసేస్తిమి. ఈ ధర్మం ఆచంద్రార్కస్థాయిగాను, నిటూరి నీలకంఠేశ్వరుని అభిషేకం మహోత్సవ సేనుక సుఖాన బ్రదికేది. ఈ ధర్మానకు యెవ్వరుతప్పినాను కాశిలోను గంగకరతను పంచమహా పాతకాలుసేసిన దోషానం బోదురు. ఈ ధర్మం ప్రతిపాలించినవారు కాశిలో విశ్వనాథదేవుని సన్నిధిని షోడశమహాదానాలుచేసిన పుణ్యానం బోదురు.

ఈ దేవళంలో దక్షిణంగా దిగువరాతికి ప్రథమ భాగం అక్షరాలు శిథిలమై అంతిమభాగమున నుండేది.

* * * * *

ప్రజల ఆరుదేశాలవారు(చాలు)మూలనమస్త పెకగంద్రకున్న శ్రీమల్లికార్జునదేవరసన్నిధిని త్రిసంధ్యలను అనేక ఆశీర్వాదం చేత

సహస్రంబులాను దీవించి మించా(?)ఆశీర్వాదం నేము క్రితనాను గుత్తి దేశంలోని చిరబడిని నిటూరి నీలకంఠేశ్వర దేవరకున్ను గణాచారికర మున్ను వీరముష్టికపన్ను మీకున్ను శ్రీమల్లికార్జున దేవ కృపవసేసినకా పుండె ప్రసాదం పుట్టిస్తిమి. దేశఅవుసులు యిసువై దెమసిని(?)... పంచుముచేను నందాదీపం నాంగల వసరాలున్ను, సోమవారం ఎనమంద్రు జంగాలకు లింగార్చన చేయించిన్ని ఇవి నీలకంఠ దేవర ప్రీతికి ఎవ్వరు పక్రముసేసినాను శునకమాంసం సేవించినవారు....మన్నించి శాసన పత్ర మిచ్చి మీకున్ను అసంఖ్య పంపిస్తిమి మీరు రనాసెంత్వి కట్లుం చలివాదికట్లుము సహితంగాను సర్వమాన్యంగాను యిస్తిమి. గాన శాసనం వేయించ్చేమని చెప్పిపుత్తెంస్తిరి. అట్టిగాను శాసనం వేయించి ధర్మ ప్రతిపాలన సేసేది. మరుజెక్షి వీరభద్రుని ఫుత్తెస్తిమి.

ఈ దేవళానకు తూర్పున మహాద్వారం వద్ద నిలస్తంభానికి ఉండేది.

చేసిన మెట్టుపల్లి వారి రేగడిచేను ఖ ॥౧॥౦ గవుని వారి చేని స్థళం ఖ ॥౪।౨॥ దీని తూర్పు ముత్యాల చెన్నయచేని స్థళం ఖ ।౩॥౧॥ అంత్తు స్థళాలు ౩ కి చేను ఖ ౨ అంత్తురామలింగానాయనిగారు సమర్పించిన చేను ఖ ౬౯ పూర్వానను చెల్లేటి రామరెడ్డిచేని స్థళం చేను ॥।౨॥౧ న్ వరి మడి కోవెల వెనక ౧౨ న్ తువ్వ మడి ౧౨ న్ బోనూతి కాలువను ౧౧ న్ హనుమంత్తునికి ఆకుతోట మడి స్థళం ౧౧ న్ గుంత మడిలో ౧౧ న్ అంతుస్థళాలు ౫ కి మడి ఖ ।౨ న్ను అంబాళారి తిరుమలయ్యగారు తమకు నిటూరను చెల్లేక్షేత్రం సమర్పించినది కాపయమడికి ఉత్తరం మడి ౧౧ న్ గొల్లపల్లెను కొల నాగయ చేని స్థళం చేను ౧౩॥ న్ యఱ్రపల్లి అంగయ తనకు నీటూరను చెల్లేక్షేత్రం సమర్పించినది చేను ౧౩॥ అంతు చెన్నకేశవమూర్తికి చెల్లే క్షేత్రానకు శిలాశాసనం వేయించినది. చేను పధ్నెనిమిది మూళ్లుగడను ౧౧ కి కుంటలు ౧౦౦ లెక్కను చేను ఖ ౧౨॥౧ మ ౨ న్ మడి పదారుమూళ్ల గడను ౧౧ కి కుంటలు ౩౦ లెక్కను మడి ఖ ౧॥ న్ తోటలు ౧౪ న్

అక్షరాలను చేసి ... క్రొత్తగా వ్రాసినన్ను పదనోకొలుతూరు కొండముకుంత లున్నిన్ని మాడి పుట్టి సంగమమున్ను అరటనలుతుమున్న రాక్షస సంవత్సర శ్రావణ బ ౧ లు కృష్ణజయంతి పుణ్యకాలమందు నిటూరు గొల్లపల్లె వేముల పల్లె కాపులువిలగిరెడ్డి తప్పిరు బాలయు పోటిపాటినాగయ పర్వతి బసువన్నకొండ సుంకన్న సాకరికొండయ మొదలైనకాపులున్ను కరణాలు(న్ను) నీలకంఠయ లింగయ శేషయ చెన్నయగారున్ను చెన్న కేశ్వరమూర్తికి దండం సమర్పించియిచ్చిన మెరకొల్వుచేను తూ మొక్కింటికి జొన్నలు మానెడు లెక్కను దేవబ్రాహ్మణ మాన్యాలు సహా కాపుచేసిన సేద్యాలకు అత్తటికిన్ని చతుస్సీమకున్ను మర్యాదను చెన్నకేశవమూర్తికి మేరగాను ఆచంద్రార్కస్థాయిగాను సమర్పిస్తిమి. ఈ ధర్మానకు యెవ్వరు ద్రోహంతలంచినాను కాశిలోను తమ మాతా పితృలను వధచేసిన పాపాన బోవువారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

శుభమస్తు ఈ నిటూరి చెన్నకేశవమూర్తికి చెల్లేక్షేత్రాలుక్క వినియోగం తళిగెలకు దినం ౧ కి దధ్యన్నం అవసరం సహా నాల్గు అవసరాలకును తెల్ల ఆముదు పడి ఆరుముంతలున్ను తవ్వెడింటికి గుంత్త మడిలోను మడి ఖ ॥ న్ కాలువమడిలో ౧౧ న్ కోవిల వెనుక మడి ౧౨ న్ తువ్వ మడి ౧౨ న్ హనుమంతున్కి ౧౨ న్ అంతు మడి ఖ ।।।౨ న్ అఖండ తినువెళిక ౧ న్ని అలంకార తిరువెళ ఘెలు యిరువైనాలుగింటికిన్ని దినం ౧ కి నూనె సోలెడున్ను గిద్దెడు లెక్కను యేడు ౧ కి ఖ ।౨ మ ॥ న్ శుక్రవారం పుళు కాపు ౧ కి నూనె మూడు గిద్దెల లెక్క యేడు ౧ కి ౧।।౧ న్ను

ఉభయం యేడు ౧ కి నూనె ఖ ।౨॥౧॥ కి క్రయం ౯౧ కి లెక్క వగ ౧౦ పెసలు తళిగెలకు దినం ౧ కి మ॥ లెఖ యేడు ౧ కి ఖ ।౩।౩౼ శుక్రవారం పూలకాపు ౧ కి పణ్యారం మ । లెక్క యేడు ౧ కి ౯॥౦౼ పల్లకిసేవకు దినం మ। లెక్క యేడు ౧ కి ఖ ౦।౦॥౨ తెప్పతిరునాళ్ల మహోత్సవానకు పణ్యారానకు ౯౧౼ ఉట్లతిరునాళ్ల పణ్యారానకు ౯౧౼ పారువేట మహోత్సవపణ్యారానకు ౯౧ ౼ మహార్ణమి మహోత్సవానకు పణ్యారానకు ౯౧౼ అంతుమహోత్సవాలు ౪ కి యేడు ౧ కి పెసలు|౯౪౼ ధనుర్మాసానకు దినం ౧కి పెసలు మ ౧ లెక్కను నెల ౧ కి ఖ ౯౧॥౨౼ కార్తికసేవకు పణ్యారానకు పెసలు దినం ౧కి మ। లెక్కను నెల ౧కి ౯।౩॥ అంతు పెసలు యేడు ౧ కి ఖ ౧౯౧ మ ౯॥ కి క్రయం వగ ॥ కి ౯౨ లెక్క క్రయం వగ ౫ ల్ ౩ అమిదెలు పల్లకిసేవకు దినం ౧ కి మ ౧ లెక్క యేడు ౧ కి ఖ ౧౯౨॥౼ దశములు పౌర్ణములకు మహోత్సవం ౧ కి ౯। లెక్క నెల ౧ మహోత్సవాలు ౩ కి ౨॥ లెక్క యేడు ౧ కి ఖ ।౪౼ తెప్పతిరునాళ్లమహోత్సవానకు ౯౨౼ పారువేట మహోత్స వానకు ౯౨॥౼ ఉట్లతిరునాళ్ల మహోత్సవానకు ౯౧౼ మహార్ణవమి మహోత్సవానకు ౯౩౼ అంతుమహోత్సవాలు ౪ కి ఖ ।౩॥౼ అంతు యేడు ౧ కి అమిదెలు ఖ ౨ కి క్రయం వగ ౧ కి ౯౨ లెక్క లెక్క క్రియం వగ ౧౦ నిత్యకట్టడికి తళిగెల మీాది పదార్థాలకున్ను అడికామధుకున్ను నెల ౧ కి వగ ॥౨ లెక్క యేడు ౧ కి వగ ౮ కార్తిక సేవకు అఖండతిరువళిగెకు దినం ౧ కి నెయిమ ।౦ లెక్కను నెల ౧ కి ౯।౩॥ కి క్రయం గ ॥౩ ఈ నెయి అఖండతిరువళికెలు పదారు ద్వాదశి నాడు పెరుమాళ్లు దొడ్డతళిగె అవధరించే నిమిత్తం ద్వాదశి ౧ కి ల్ ౪ లెక్కను యేడు ౧ కి వగ ౮ ఈ ద్వాదశినాడు ఆరగింపుచేసిన దొడ్డతళిగెకు వినియోగం శ్రీరామానుజకూటానను యిరువై శ్రీవైష్ణవు లకు ఆరగింపు నేయుట నిత్యకట్టడి అతిరసపడి నాలుగు అప్పపుపడి నాలుగున్ను ఉభయం ౮ కి ల్ । లెక్క యేడు ౧ కి వగ ౭॥ పరిమ ళాలుకు గంధం వగ ౨ కస్తూరి కుంకుమపువు కర్పూరం ఆరతికర్పూరం సహా వగ ౨ అంతు వినియోగం వగ ౫౩॥ క్షేత్రాలు రామిరెడ్డి చేను

స్థళాలు రెంటాను ఖ ౧౬౧ మ ౨|| సింగరాజు వారిచేని స్థళం ఖ ౧|౦||౧||| చినవరసయ చేసిన పెళం తిమ్మనచేని స్థళం ఖ ౧౬|||౧ సాకిరివారి చేనిస్థళం ఖ |౩||| అంతుస్థళాలు ౪ కి ఖ ౪౬౧|౧| స్థానికులకు కట్టడలకు మెట్టుపల్లి వారి రేగడిచేని స్థళం ఖ ౧౬||| భాగవత సేవకు మెట్టుపల్లెవారి రేగడి స్థళం ఖ |౬|||౧|| మడి చింతమాకులలో ౬౧|౦ బోనూతికాలువలో ౬౧ ఉభయం మడి ౬౨| మంత్ర పుష్పానకు మెట్టుపల్లెవారి రేగడి చేని స్థళం ఖ |౩||౧ చాతుపడి సేవవారికి మెట్టుపల్లి వారి రేగడి చేను ౬౩||౦ కొవిలె వెనుక మడి ౬౧ చాతుపడి తోట చేసే వారికి ముత్యాల చెన్నయ్య చేను ౬౩|| కొవిలె వెనుక మడి ౬౧ పల్లకి పట్టెవారికి, మెట్టుపల్లి వారి రేగడి చేను ఖ | దసవంద వారి మిట్టమడికి ఉత్తరం మడి ౬౧ తోట గడ్డ మడి ౬౧ ఉభయం మడి ౬౨ నకీపుల వారికి మెట్టుపల్లి వారి రేగడి చేనిస్థళం ఖ |౨|౧| కాలువ మడి దసవందంవారి మడికి ఉత్తరం ౬౧ హెగ్గాళ్లెలవారికి మెట్టుపల్లి వారి రేగడిచేని స్థళం ఖ |౨ మ ౩ కాలువ మడిలో దసవందంవారి మడికి ఉత్తరం మడి ౬౧. కొళం నాగసరాలవారికి మెట్టపల్లి వారి రేగడిస్థళం ఖ ||౪|౨ మడి కాలువమడిలో దసవందంవారి మడికి ఉత్తరం ౬౧ వంగలకయ్య ౬౧ మోగలిమాకుల మడిస్థళం ౬౨ అంతుమడి ౬౪ ఉప్పర చిన్నప్పకు పెరుమాళ్ల కోవెల శ్రీరామానుజకూటం పూతపరామరిసించె నిమిత్తం మడి ౬౧|| బోగాలవారికి చెర్లోచేనిస్థళం ఖ ౧౾ వేములపల్లెను ముప్పారం నాగయచేని స్థళం ఖ |||౧||౧||౾ బోయపాటి నాగయచేని స్థళం ఖ ||౦|||౩||౾ కామరాజుచేను ౬౪||౾ అంతుస్థళాలు ౪ ను ఇందుంపుట్టిన్ని పన్నిద్దుము పెరుమాళకోవిల వాకిట పరామరిశించుక యుండెవారికి మెట్టుపల్లెవారి రేగడిచేని స్థళం ౬౪|౧|| తోట మాచయ సేసిన చేని స్థళం ౬౩||| ఉభయం చేను ఖ |౩ మ ౧|| తేరుతిరుణాల మహోత్సవానకు లకిమిరెడ్డి సేసిన మెట్టుపల్లి వారి రేగడ చేనిస్థళం ఖ |||౧|||౾ గవుని వారి రేగడ చేను ఖ ||౪|౨|| ఉభయం చేను ఖ ౧||౧ మ ౨||౬.

తాడపత్రి తాలుకులో కొన్ని గ్రామాలయందు ఉండు శిలా శాసనాలకు నకళ్లు అక్షరాలు తెనుగు ఈ ప్రకారం వ్రాసినది.

మవుజే సజలదిన్న తాలూకు తాడపర్తి సదరహెగ్రామములో వేపమానికి దక్షిణం వీరభద్రస్వామి దేవాలయంలో దక్షిణపుగోడకు నిలువు పాతియుండె శిలాశాసనానకు నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౮౯ అగునేటి ప్రభవ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౫ సోమవారం శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప (సదాశివ) దేవమహారాయలు పృథివీ సామ్రాజ్యం చేయుచుండగాను పెమ్మసాని రామలింగానాయనిగారు సజలదిన్నె గ్రామం పొలం సాగుబడికి వేయించిన ధర్మశాసనం, రామరాజు తిరుమలరాజయ్యగారు పెమ్మసాని రామలింగానాయనికి పాలించిన గుత్తి సీమకు చెల్లేపెన్నబడి తాడిపర్తి రాలింగానాయనిగారు మాకు ఉంబళీకి ముదలు(?) పెట్టిన సజలదిన్నె గ్రామం వెలిపొలం అంతవట్టున్నూ నట్టు బలిసి బీడుపడిన నిమిత్తం మాకలు వేసుకొని అందుకు కటడిచేసిన వివరము తాదాగ్రామం కాపులు తమ స్వేచ్ఛను కావలసిన చేను నట్టు దున్ని చల్లక వేరుపరచుక యెర్వు ఆకులు వేసుకొని ఆకులు వేసిన చేలు యెవ్వరు చల్లిన రాదు. నీనీమం(?)

శ్లో॥ స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం॥
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

గ్రామం సమ్మతిన వ్రాసిన ధర్మశాసనం,

సదరహు శిలాశాసనంరాయి పూర్వం వ్రాసిన ప్రకారం ఉండక కొంత కొంత పోయి పొరలో పగిలి అక్షరాలు యేమి కనిపించక పోయి నందున తెలిసినమట్టుకు వ్రాసినది గనుక మతలబు చక్కగా పొంది పొందకుండా యుంటున్నది. ఈ శిలాశాసనంరాయి వర్తమానం యీలాగున నుంటున్నది.

రెండో శిలాశాసనం రాయి మప్రుజె సజలదిన్న గ్రామం తాలూకు తాడపత్రి సదరహీ గ్రామంలో వీరభద్రస్వామి దేవాలయానకు దక్షిణం ఆంజనేయస్వామి దేవాలయం వెనుకగోడకు నిలువరాళ్లు వేసియుండే శిలాశాసనానకు నకలు.

*స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సంవత్సర కార్తిక శుద్ధ ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప వీరనరసింహదేవ మహారాయలుగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యం సేయు చుండగాను సోమవంశాధీశ్వరులైన అగస్త్యగోత్రులైన ... ధార్మికు లైన శ్రీ కృష్ణపాదారవింద సేవకులయిన శ్రీమన్మహామండలేశ్వర అల్లుడు రామరాజు దేవ మహారాజులు గారు వేయించిన శిలాశాసనం. రాయరాజ్యంలో కలిగిన మగడ (మంగలి ?) పన్ను సిద్ధాయం వెట్టి వీరాళ్లు మున్ను రాయలు తమ పని వోజులు కొం(డో)జుకు సర్వమాన్యాల గాను పాలించ్చి విడిచినారు. జగతాపిగుత్తిరాజ్యంలోన చెల్లె పెన్నమాగా ణికి చెల్లేటి సజలదిన్న మగడపన్ను వెట్టి వీరాళము సర్వమాన్యంగాను విడిస్తిమి. ఇందుకు తప్పినవారు కాకమాంసము శునకమాంసము తిన్న పాపాన బోదురు.

మూడో శిలాశాసనం రాయి. మప్రుంజె సజలదిన్న తాలూకు తాడి పత్రి సదరహీ గ్రామానకు అరకోసుమీద ఈ శాన్యమూలన కావేరి సముద్రందోవకు తూర్పున నుండే బిశ్వేశ్వర దేవస్థానంలోనుండే శిలా శాసనానకు నకలు.

'స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౮ అగునేటి ధాతునామ సం॥ వైశాఖ శుద్ధ ౨ స్థిరవారం శ్రీమన్మహా రాజాధిరాజ రాజపమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరకృష్ణరాయ మహా

---

*** This appers to be a forgery. Vīra-Narasimaha was not ruling in S 1466; and the gotra etc. of Rāmāraja is wrongly given.**

రాయలు పృథివీసామ్రాజ్యం సేయుచుండగాను తద్రాజ్యధురంధరుడైన శ్రీమన్మహాప్రధాని సాళ్వతిమ్మరసయ్యగారి అల్లుండ్లు నాదిండ్ల తిమ్మ రాజు కొమారాళ్లు అప్పయ్యగోప్పయ్యగారు గుత్తిరాజ్యంలోని పెన్నబడి సజలదిన్న బిల్వేశ్వర దేవునికి గండము సమర్పించి యిచ్చిన గ్రామం భూదానధర్మశాసన పత్రిక క్రమ మెట్లన్నను: శ్రీమన్మహాప్రధాన సాళ్వతిమ్మరసయ్యగారు నహా ఉంబళిగె పాలించిన గుత్తిరాజ్యంలోని యేములేటి మాగాణిస్థళమందున పెండెకంటి పొలంలోనికి ఉత్తరపు తట్టున శ్రీమన్మహాప్రధాన సాళ్వతిమ్మరసయ్యగారి పేరట కట్టించిన తిమ్మసముద్రానకు చెల్లే దేవుల కాల్వ ఖిలమై యుండగాను మేము మా చేతి ధనము పెట్టి ఆ కాలువ త్రొవ్వించి ఆ తిమ్మరసయ్యగారి పేరిట లక్ష్మమ్మగారి పేరింటను లక్ష్మీసముద్రం అనె గ్రామం కట్టించి శ్రీమన్మహా ప్రధాన సాళ్వతిమ్మరసయ్యగారికిన్ని ఆ లక్ష్మమ్మ గారికిన్ని పుణ్యముగాను బిల్వేశ్వర దేవునికి మేము గర్భగృహశుకనాశాన్ని అంతరాళరంగ మంటపము కట్టించి తిరతిరుమహోత్సవములు సేవించుతును ఆ దేవునికి పూజ నైవేద్య అంగరంగ వైభవములు నడిచేటందుకు యీ గ్రామం వచ్చే తజని తక్షయ తృతీయ పుణ్యకాలమందు సాళ్వతిమ్మరసయ్యగారి చేత నేము ఆ లక్ష్మీసముద్రం గ్రామం ప్రతిగ్రహించి ఆ తిమ్మరసయ్య వ్రాయించి యిచ్చిన దానపత్రమున్ను ఆ గ్రామమున్ను బిల్వేశ్వర దేవు నికి సహిరణ్యోదక దానధారాపూర్వకముగా ధారబోసి యిస్తిమి, గనుక ఆ గ్రామానకు గల అష్టభోగ తేజస్వామ్య సహితంగాను, ఆ గ్రామం సజలదిన్న బిల్వేశ్వర దేవునికి పూజనైవేద్యం అంగరంగవైభోగాలుకు ఆచంద్రార్కస్థాయిగాను ఆ పారంపర్యంత్తం నడవగలదని మేము మా ధర్మశాసనం సమర్పించి గ్రామం భూదాన ధర్మశాసనం యీ బిల్వే శ్వర దేవునికి సోమవారం యేకాదశరుద్రాభిషేకం చేసేటందుకు అయ్యా లూరి తిమ్మరసయ్యకు ఆ లక్ష్మీసముద్రమందు పెట్టిన మడి ఖ ౦|౦ యేదుం అక్షరాలలో మడి యేదుమున్నూ అభిషేకం చేసినన్నాళ్లు సర్వమాన్యంగాను నడవగలది. ఈ దేవునికి గుత్తిసీమవారు గాక యెవ్వరు కాపురంవచ్చి వున్నాను వారు యాడాది సర్వమాన్యం

గాను, ఆ మీాద యేడు ౧కి మగ్గము ౧కి చక్రయాకలు 3 దేవునికి సమర్పించియుండగలవారు. గుత్తి పెన్నా బడి సుంకర్లు మీా మీా సుంకము సహా నిలికి(?) సహా అడగరాదు.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మవుంజె కొత్త చింతకుంట తాలూకు తాడిపర్తి సదరహిగ్రామా నకు పశ్చిమం అరగడియ దూరంలో మంగలవాని చేనికట్టకు తూర్పు, పెద్ద రేగడి చేని వంకలో ఒక రాతిమీాద అక్షరాలు వ్రాసియున్నది. అది యేమంటె వరదరాజు ధర్మము తిరుమలరాజు దాసిచేను, అని వ్రాసి యున్నది. ఇందులో శాలివాహన శకం లేదు.

మవుంజె పాతచింతకుంట తాలూకు తాడిపర్తి సదరహి గ్రామంలో ఓబళేశ్వరుని దేవళం ఆవరణం గోడకు దక్షిణముగానుండే శిలాశాసనానకు నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౯ అగునేటి సర్వజితునామ సం॥ శ్రావణ శు॥ ౧౦ బు॥* శ్రీమహారాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప జగదేవమహారాయలు పృథివీరాజ్యం సేయుచుండగాను సేనానాయంకరానకు పాలించిన గొతమిగిరి సీమలోని చింతకుంట ఆ ఆదప్పనాయకయ్య మర్తటోకులుకు శీనినాగో ఓబల్లినాయని కొమారకుండు ఓబళినాయడు హానిమినాయండు వీరున్నూ అమరారపు బుచ్చి వీరి యేలుతూ నుంటె ఆ ఓబిళినాయండు యిద్దరిలోనీ కదెలు(?)లహోబళేశ్వరునికి సేయించి దేవునికి మానిమంటపము కట్టించి ఆ దేవుని చింతకుంట శ్రీ ప్రతిష్ఠచేయించి దేవునికి నిత్య అవసరాలు నైవేద్యం నడిపేటట్టుగా పట్రవాణ్ని నిల్పి అందుకు చేను ఖ ౦౧।౦ పరిజనానికి తోట ౧౪౧౧ వరదరాజు ఓబనినాగోజీ. అములు సేయుచుండగా మాన్యము యిప్పించి ఓబళనాయణికి ఖ ౪ యిప్పించినాము.

* Wed. 7th August 1527.

పుచ్చుకొన్నాము. సర్వమాన్యంరాసి యిచ్చినవారు మాతృక కసినేని ఓబళనాయండు మాన్యం దేవరచేసిన నా గోజుకును నిండ ఓ. ళనాయుడు ఓబళనాయని కొమారకుండు నా ఓబళనాయనికి ఆ గ్రామాన ఓబుళేశ్వరునికి వ్రాయించి నడిపెటట్టుగా శ్రీ శ్రీ జేయును.

మవుంజె వెలమకూరు తాలూకు తాడపర్తి సదరహింగ్రామానకు తూర్పు ఆంజనేయస్వామి దేవాలయము ద్వారానకు తెల్ల నిలువురాతికి ఉండే శిలాశాసనానకు నకలు తెనుగు అక్షరాలు.*

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౨౧ అగునేటి* విరోధి సం॥ ఆషాఢ బ॥ ౧౧ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవరాయ మహారాజులుగాగు పృథివీరాజ్యం చేయుచుండగాను వాకిలి ఆద్దప్పనాయణిగారు పాలించిన గుత్తి రాజ్యం పెన్నబడిలోని వెలమకూరు ఆదప్పనాయణిగారు దానప్ప అనే అయ్యవారికి యిస్తిమి దానప్పనాయుణి అయ్యవారు తమ నాయంకరానకు పాలిస్తిమి. శ్రీ మన్మహామండలేశ్వర ఆత్యంబరగండ మన్నెగజపతి సంజీవరాయ దేవమహారాజుల కొమారుడు సంజీవగారు కోవకొండ్ల శాయి కొడుకు రాఘువయ్య ప్రతిష్ఠచేసిన వెలమకూరు హనుమంత దేవునికి యిచ్చిన ధర్మశాసనము. పూర్వాన చెల్లే వరిమడి ఖ ౦౹౧౹౨ చేను ఖ ౦।౧।౦ గాక యీ తథాతిథి పుణ్యకాలమందు మేము ధారపోసి యిచ్చిన వరిమడి ఖ ౦౹౦॥।౨కి దీపారాధనకుబండిలు పుడ్డసుంకము రొఖాలవల్ల దినం ౧ కి గరుడకాసులు చొప్పున ఆచంద్రార్కంగా నడిచెటట్టుగాను త్రివాచకంగా ధారబోసి యిస్తిమి గనుక ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. ఇందుకు యెవ్వరైనా తప్పినవారు గంగలో గోవును చంపిన పాపాన పోదురు. తమ తల్లితండ్రుల వారణాసిలోను చంపిన పాపాన పోదురు. ఈ పుణ్యం యెవ్వరు నడిపిస్తూఉన్నా వారికి అష్టఐయిశ్వర్యాలు కలుగును.

* Virodhi corresponds to S'aka 1451 and not to S'aka 1421. 1st July A. D. 1529.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

౧౦. మం॥ దోగలూరు తాలూకు తాడిపర్తి సదరహుగ్రామా నకు దక్షిణం పదిబారలమీద పాతదోసలూరు బేచిరాకు గ్రామాంలో పూజనడిచె లక్ష్మీన్నృసింహాస్వామి దేవళం పశ్చిమద్వారానకు ప్రాకారం గోడకు ఆనుకొని యెర్ర నిలువురాతికి ఉన్న శిలాశాసనానకు నకలు.

రవుద్రినామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౦ లు శ్రీమన్మహామండ లేశ్వర నందెల తిమ్మరాజుదేవ మహారాజులయ్యవారు కొండ్రాజు అయ్య గారు గండికోట సీమలోను దోసలూరు గ్రామమందు చెన్నకేశవస్వామికి ప్రీతిగాను డోళ్లనాగసరాలు ఊడిగం చేసే జనులు ముగ్గురికిన్ని మండలవు రాజుగారికి కడవకాలను తెరవున మందకాలు తిమ్మయ చేనుస్థళం ఖ ౧ పుట్టెడు చేను తిమ్మరాజుగారికిన్ని సింగరాజువారి తల్లిదండ్రాదులకు పుణ్యంగాను దోసలూరు చెన్నకేశవస్వామికి డోళ్లునాగసరాలు వూ(ఊ)డిగం చేసేటందుకు మండలవురాజుగారికి చేను పెట్టితిమి. శేదనక యీ ధర్మం ఆచంద్రస్థాయిగాను నడిచేటట్టుగాను నందెల తిమ్మరాజు గారి ఆనతిన సింగరాజుగారు మొదలయినవారికి పుణ్యం సిద్ధించేటట్టు గాను పాపరాజుగారు వేయించిన ధర్మశాసనము.

(91-బి ఈ పుటలో యేమిన్నీవ్రాయక వదలిపెట్టి యున్నారు.)

తఖ్తాకు దాఖలు చేసినది.

వ్రాసినది బొక్కు ౧౬ బి.

శాసనాన్కు నకళ్లు.

(92-బి ఈ కాగితం పూర్తిగా యేమియు వ్రాయక వదలినారు)

93-ఎ తఖ్తాకు దాఖలు అయినది.

మ॥ అరకటవేముల తాలూకు తాడిపర్తి నదరహిగ్రామంలో తూర్పుదిక్కున వెంకటేశ్వర దేవాలయానకు ద్వారానకు దక్షిణం

దేవళం ప్రాకారం గోడకు ఆనుకొని యత్రనిలువు రాతికి ఉండె శిలా శాసనమునకు నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౮౧ *రవుద్రి సంవత్సర మాఘు బ॥ ౩౦ లు శ్రీమతు ప్రధాని సోమరుసు పెద్ద తిరుమలయ్యగారు అచ్యుత దేవమహారాయలు గుత్తిరాజ్యంలోని అర కటవేముల గ్రామం దానధారపూర్వకంగాను ప్రతిగ్రహించి అగ్ర హారము చేసి తిరుమలాచార్యులకున్ను కాళహస్తికిన్ని ధారబోసి యిచ్చి క్షేత్ర విభాగము చేసినపుడు యీ అగ్రహారము రామేశ్వర దేవరకున్ను అహోబళేశ్వరులకున్ను వెంకటేశ్వరునికిన్ని హనుమంత దేవరకున్ను నైవేద్యదీపారాధన పర్వతిథిమహోత్సవాలకున్ను పూర్వక్షేత్రాలు సహాగాను సమర్పించిన క్షేత్రాలు రామేశ్వరునికి కత్తువమీద చేను ఖ ౧౧౦ న్ను కడ...దను తోట ౧౧౫౦ న్ను దిగువకాలువ మడి ౧౦౫౦ న్ను వెంకటాద్రి చేనుకట్టువమీద ఖ ౧౧౦ న్ను దిగువ కాలువ మడి ౧౦౫౦ న్ను అహోబళేశ్వర్లకు కొండ దిగువనస్థళాలు ౨ కి చేను ౧౪ న్ను యీాదులగడ్డ చేను, ౧౨ న్ను దిగువకాలువ మడి ౧౧౫౦ న్ను, హనుమంతునికి లోతువాగుగడ్డ చేను ఖ ౧॥౦ న్ను, కడశకాడ తోట ౧౦౫౦ న్ను మెగువకాలువను మడి ౧౦౫౦ న్ను, యీ శాసనస్థమైన క్షేత్రాలు ఆచంద్రార్కస్థాయిగా చెల్లగలవు. ఇందుకు తప్పితే యీ క్షేత్రాలు రొఖ ధాన్యాలు అపహరించి పుచ్చుకొన్నవారు వారి తల్లిదండ్రుల కాశిలో వధియించి రక్తం తాగిన పాపాన...శునకమాంసం సురాను సేవించిన వారు. ఈ ధర్మం పాలించిన వారికి సాయుజ్యము ధర్మమే జయము శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఈ శిలాశాసనంలో కొన్ని అక్షరాలు మలినంగానుండి నందున యేమిన్ని కనబడలేదు. కనపడిన అక్షరాలు యీావత్తు వ్రాసియున్నవి.

రెండో శిలాశాసనము సదరహి వెనుక తట్టు ఉండే శిలాశాసనా ౧కి నకలు.

---

* Ś. 1482 corresponds to Raudri 14th Feb. 1561.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౮౨ *రవుద్రి సంవత్సర ఫాల్గున బ॥ ౩ లు సోమవారము రాజాధిరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప సదాశివదేవమహారాయలు సృష్టి(పృథ్వి) సామ్రాజ్యము నేయుచుండగాను సృష్టికి మూలస్థానమైన శ్రీశైలమల్లికార్జున దేవర మంటపమందు సింహాసనార్హులై యున్న శివభిక్షావృత్తి అయ్యవారి ఆజ్ఞాధారులైన పొడిపోక వీరముష్టి రాచయ్యను నీలకంఠనిటూరివీర ముషివీరయ్యను కూడి భిక్షావృత్తి అయ్యవారికిన్ని సకలపురజనుల కున్ను సకల వీరముష్టులకున్ను సకల శివాచారులకున్ను పుణ్యము గాను జగతాబి గుత్తిరాజ్యంలోను అరకట వేముల అగ్రహారము రామేశ్వర దేవరకు వీరముష్టి పన్ను బలిజెబిక్షసహ ధారాపూర్వకంగాను ధారబోసి యిస్తిమి. ఆచంద్రార్కస్థాయిగా నడవగలది. ఇందుకు తప్పితే శివాచారానకు విభూతిరుద్రాక్షలకు వెలి. సురా శునకమాంసం తిన్న దోషానకులోను...ఈ ధర్మం పరిపాలించిన వీరముష్టి శివసాయుజ్యము పొందును. ధర్మకర్మాల ఒప్పితము వీరబద్ర దేవర శ్రీ శ్రీ శ్రీ జేయును.

మవుజె కడవకొలను తాలూకు తాడిపర్తి సదరహి గ్రామంలో మధ్యభాగాన చెన్నకేశవస్వామి దేవళం ద్వారానకు నైరుతిమూలన నల్లనిలువురాయి దేవళంద్వారానకు నైరుతి మూలన నల్లనిలువురాయి దేవళంతల పాలమంటపం గోడను ఆనుకొని యుండే శిలాశాసనానకు నకలు.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౭ అగునేటి• యువ సంవత్సర ఫాల్గుణ శు॥ ౧౧ లు గురు వారం దినానను శ్రీ కృష్ణరాయమహారాయలు రాజ్యం చేస్తూయుండగా మహాప్రధాని సాళ(సాళ్వ)తిమ్మరసయ్యవారు యేలే గుత్తిసీమ లోపలను దొడ్గంటిగోమసీక లంకకుల బంటరబావ పరనారీ సహోదర అరవత్తారు మండలీకరగండడైన వాల్మీకవంశోద్భవుడైన మెసా చెన్నమనాయని

* S. 1482 corresponds to Raudri Monday 3rd March A.D. 1561
• S. 1437 Yuva is Thursday 14th Feb. A.D. 1438.

కుమారుండు తిమ్మానాయనిగారు తమనాయంకానకు నడిచే కడవకొలని గ్రామమందు శ్రీచెన్న కేశవదేవునికి శిలామంటపము ప్రాకారగోపుర సహితముగాను లక్ష్మీపతి పేరను తటాకం బావులు తోటలు సహితము గాను సమర్పణ చేసి దేవుని కృపవల్లను పుత్రపౌత్రాభి వృద్ధిన్ని రాజ్యాభివృద్ధిన్ని అవి(యి)హొదలుచున్న ఆచంద్రార్కస్థాయియైన కీర్తికి నెలవైన పద్వ(శ్రీనో)యిది(?) ఆ దేవునికి సమర్పణగా చేసిన ధర్మగాడి నీళ్లెత్తేవారికి యిచ్చిన క్షేత్రము మాచుబావి దక్షిణాన జంబులమిట్ట స్థళం ఖ ౧ మాచుబావికి ఉత్తరము ఖ ౧ ఉభయం యిరుపుట్టి భావ రతి(?) తోట ౧౧॥౦ ఇంతవట్టు శ్రీహరికి పుణ్యముగా యిస్తిమి. ఈ ధర్మానకు యెవ్వండు తప్పినవాండ్లు శునకమాంసమున్ను సురత్రావిన వాండ్లు గోహత్య బ్రహ్మహత్యాది మహాపాతకముల పోవువాడు మాతా పితృ వధ వారణాశిలో చేసిన పాపాన పోవువాండ్లు (సో)దరిని కౌగిలించు కొన్న పాపాన పోవునని నియమించిన ధర్మశాసనము.

మపుజె కడవకొలును తాలూకు తాడిపర్తి సదరహిగ్రామానకు పశ్చిమంగా రామేశ్వరస్వామి దేవస్థానమందున్న శిలాశాసనం. దేవ స్థానం పాడుపడి పోయినది.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౦౯ అగునేటి సర్వజితునామ సంవత్సర భాద్రపద శు॥ ౧౫ లు శ్రీమద్రా జాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప వెంకటపతిరాయ దేవమహా రాయలుగారు. పెనుగొండ పట్టణమందు రత్నసింహాసనారూఢులై పృథివీస్థితసామ్రాజ్యం చేలుచుండగాను కౌండిన్యగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యు(ధ్యాయు)లైన వైయ్యాకరణ తిరుమలభట్లకు పౌత్రు లయిన ఆ రామకృష్ణభట్లకు పుత్రులైన అచ్చాభట్టు కడవకొలను వెరిటి రామేశ్వరునికి సమర్పించిన భూదాన ధర్మశాసనం. నందెల నారసింహాయ రాజుగారి వల్ల గండికోటలో చెల్లేటి దొనలూరు గ్రామాన మాకు ధారాగ్రహీతం యిచ్చిన చేను రెండు పుట్లు మోపూరికి వాయువు భాగాన రెకులకుంటలోను మొండెవాని చేసిస్థళంలోను పందుంలోను దక్షిణ మాదిగా తూర్పు పడమట పంపు చేను ౧౮ నల్తుము ధారబోసి

యి స్తిమి. ఈ చేనికి గలిగిన అష్టభోగ తేజస్వామ్యతలోను అమృతి పల్లె(ల్ల)నై వేద్యానకు యీతథాతిథిని సోమగ్రహణ పుణ్యకాలమందు పినాకినీ తటమునుండి సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను ఆచంద్రార్క-స్థాయిగాను త్రివాచక త్రికరణ శుద్ధిగాను ధారబోసి యిచ్చిన భూదాన ధర్మశాసనం. ఇందుకు తప్పినవారు తమ తలితండ్రాదులవార కాసిలో వధించిన పాపాన పోదురు. శునక మాంసం మధుపానం చేసిన వారి పాపాన పోదురు. మంగళం మహాశ్రీశ్రీశ్రీ జేయును.

96-ఎ, 96-బి, 97-ఎ, 97-బి, 98-ఎ, 98-బి, 99-ఎ, 99-బి ఈ పుటలలో యేమియు వ్రాయబడలేదు.

# పులివెందల, తాడిపత్రి శాసనములు

పులివెందులతాలూకా - తాడిపత్రి తాలూకా గ్రామములో నుండు శిలాశాసన నకళ్లు మొదలైనవి. వీటి పుస్తకము శిథిలము. పుటలు ౧౪౪ పంక్తులు ౨౦. గీ. తే. శ్లో వచ - మా దేవతా - బ్రాహ్మణులకు యిచ్చిన భూదానపత్రముల నకళ్లు.

దీనిలోని శాసనములు మొదలైనవానిని ప్రత్యేకముగా ఒక టాకటిగ వ్రాసి యున్నది.

పులివెందల అనేగ్రామానకు పశ్చిమం ఘడియ దూరంలో శ్రీరంగనాయకుల దేవళంలో పూర్వద్వారానకు దక్షిణం తట్టున నుండె శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౧౬ అగునేటి ఆనందనామసంవత్సర చైత్ర శు॥ ౧౫ లు సోమగ్రహణ పుణ్యకాలమందు పులివెంద్దుల* రంగ్గరాజులకును శ్రీమన్మహామండలేశ్వర అత్యంబరగండ ఆత్రేయగోత్ర పవిత్రులయిన ముచ్చుమర్రిక్రిష్ణయ్య దేవ మహారాజులకుమారుడు సింగయ్య దేవమహారాజులు దండ్డము సమర్పించి ధారాగ్రహీతముగాను యిచ్చిన ధర్మశాసనం. శ్రీమన్మహామండలేశ్వర

* 21st March A.D. 1494 Lunar eclipse.

మేదిని మీా సరగండ కఠారిసాళువ యిమ్మడి నరసింగరాయ మహారాయలు మాకు నాయంకానకు పాలించ్చిన పులివెందులసీమను మాపాలికి చెల్లివచ్చేగ్రామములలోను పూర్వనామం భూచుపాడు అనేటి గ్రామం ౧ రంగాపురం అనేగ్రామం ౧ ఈ రెండుమ్రగ్రామాలు శ్రీరంగ రాజులకు అంగరంగవైభవములకున్ను, సహిరణ్యోదక దానధారా పూర్వకంగా నిధి నిక్షేపజలతరు పాషాణ అక్షీణి ఆగామి సిద్ధ సాధ్యంబులనెడి అష్టభోగ తేజస్వామ్యంబులకుగానుసమర్పిస్తిమి గనుక ఆచంద్రార్కస్థాయిగా అవధరించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గ మావాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

శ్రీరంగనాథస్వామి దేవళంలో ద్వారానకు ఉత్తరాన నుండే శిలాశాసనం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౧ అగునేటి శుక్లనామసంవత్సర కార్తిక శు॥ ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప కృష్ణరాయమహారాయలు పృథివీరాజ్యం చేయుచుండగాను వశిష్ఠగోత్రం సూర్య వంశోద్భవులైన బెజవాడ పుర వరాధీశ్వరులైన వల్లభరాయని గారి పుత్రు(పౌత్రు ?)లైన తిమ్మారాయుల గారి పుత్రులైన బసవరాజులగారి తమ్ములైన నరసయ దేవమహారాయలు పులివెందుల శ్రీరంగరాజులకు ఉదయగిరిరాజ్యంలోకి చెల్లే గండికోట సీమలోని ములికినాటిసీమ పులివెందుల సగమందలి పంటలు శుక్ల సం॥ రం కార్తిక శు॥ ౧౨ లు పుణ్యకాలమందును దేవుని నైవేద్యం అంగరంగవైభవాలకు సమర్పించినది.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥
స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

పులివెందుల రంగ్గనాథస్వామికి రాజమాన్యరాజ పూజితులైన రాజశ్రీ పులివెందుల సుంక్కం అల్లూరు సుబ్బయ్యగారికి సేవకుడు కృష్ణ రాయనివారు నమస్కారములు తరువాత పులివెందుల దేవాలయాంలోను పూర్వానకు మా తండ్రిగారు మాసర్ దేశాయిరుసుంలోను అఖండం ఉంచియుండిరి గదా. హాలి యీా దేశంలోను లేనందున ఆరుసుం ఖిలపడి నందున అభ్యంతరం అయివుండెను. ఇవుడు వర్తకులు యథాప్రకారం రుసుం నడిచేలాగున వ్రాసి యిచ్చినారు. ఆరుసుం మీా గుండావసూలు అయ్యేది. పులివెందుల పారణపల్లె సాయరు రుసుం అయివజున దినం ఒఘటింటికి అపరంజీపాతికెలెఖ అర్చకులు బ్రహ్మావరం కేశవాచార్లకు యిప్పించి అఖండం పెట్టించేలాగున చేసేది. నెలనెలకు చెల్లేచెల్లు చీటి తీసుకొనేది. అఖండంమీాద పరామరికె యుంచేది. నకలు వ్రాసుకొని అసలు వారి వశాన యిచ్చేది.

(ఇక్కడ రెండుపంక్తులు బళాబందు అక్షరములలో వ్రాయబడి యున్నవి.)

శ్రీ రంగస్వామికి.

రాక్షసనామ సంవత్సర చైత్ర శు॥ ౨ లు భూచుపాటి రెడ్డి కరణాలు వ్రాయించి యిచ్చిన కరారునామా శ్రీవారికి నడుస్తూ యుండిన చేను ఖ॥ 0।3 మడి ౧౮ పూర్వారభ్యం నడుస్తూవుండి కొన్ని దినములు నడువక యుండినందువల్ల యిపుడు కరారుచేస్తున్న వివరం. గత ఫలంలోను ఒక సం॥ రం ఫలంయిచ్చి రాక్షస సంవత్సరం తాగాయితి మీాదవ్రాశియిచ్చిన ప్రకారం భూమి చేను మడి రంగస్వామి స్వాధీనం చాయగల వారము. ఇటని మాఖుద్దునరాజీన వ్రాయించిన కరారునామా. ఇందుకు సాక్షులు తాడిమఱ్రి, కొమరవోలు శంకర శాస్త్రివారు, సాముదుర్తి భావనాచార్లవారు, పుట్టపర్తి రంగాచార్లు వారు, స్థళములోను గండ్లూరి వెంకటనారాయభట్లవారు. నారాయణ రాయణవారు, కానుగోయి శాయంణపంతులవారు. కనుబాకరణాలు నాగప్ప అయ్యన్నగారు, బలవనూరి చత్తారెడ్డి, మడూరు అప్పయ్య వీరిసమ్మతిన వ్రాయించి యిచ్చిన కరారు నామా. రెడ్ల సమ్మతిన కరణం భాగన్న వ్రాలు.

# జంబులమడుగు తాలూకాలో

## కొన్ని గ్రామములలోవున్న శిలాశాసనములు

**మౌజే గుండచెరువు గ్రామంలో బురుజురాతికి వుండే శాసనము.**

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౬౯ అగునేటి రుధిరోద్గారినామ సంవత్సర శ్రావణ బ॥ ౨ బుధవారం కొండా దాసరి కొమాళ్లు వెంకటదాసరి కట్టించినది బురుజు, కరమల వెంగయ్య వేసిన శాసనం, వంగల చన్నప్ప కట్టినది. ఇందులో యీశకానికి ప్రభవ సంవత్సర మవుతున్నది, శాసనంలో రుధిరోద్గారి సంవత్సరం వ్రాసినది తఫావతుగానున్నది.

౨. *మౌజే పొన్నతోట గ్రామానికి పడమర పాడుగావున్న, చన్నకేశవస్వామి దేవాలయం యెదురుగా నిలువురాతికి వుండేశాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౯౬ అగునేటి భావసంవత్సర జేష్ఠ శు॥ ౧౫ లు శ్రీమద్రాజాధి రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీరంగరాయ దేవమహారాయలు పెనుగొండ పట్టణమందు వజ్రసింహాసనారూఢుండై, పృథివీ సామ్రాజ్యం చేయుచుండగాను, ఆపస్తంభ సూత్రులు, యజుశ్శాఖాధ్యాయులైన...గండికోట సీమలో పొన్నతోట దిగువపట్లం కృష్ణునికి పడితరాల చెల్లే దేవతాగ్రామం నంద్యాల నారసింహ్వరాజయ్యవారు బయినేయనకు పాలించినగ్రామం చెరువు ఒడిపితెగి ఖిలంపడివున్న నిమిత్యం, మీరు ఒడిపికట్టినందుకు దసవందం నక్కలమిట్టను చేను ఖ ౻న్ను మంగల వాని చింతచేను ౦౩ వుభయం చేను స్థళాలు ౨ కి ఖ ౻౩, మడి చెర్వు కిందను మోడల మడి ఖ వుభయం చేను మడి సహా ఖ ౧।౩ అక్షరాలా పుట్టియనమందుము మీ పుత్ర పౌత్రపారంపర్యంతం, ఆచంద్రార్క-

---

* See, for a summary of the inscription, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 66.

స్థాయిగాను, అనుభవించేది. యీ శిలాశాసనం చేనికిన్ని మడికిన్ని యెవ్వరు తప్పినాను తమ తల్లి దండ్రులను, గోవు, బ్రాహ్మల, వారణాశిలోను వధియించిన పాపాన బోవువారు. ఇందుకు యెవ్వరు తప్పినా బిడ్డ...

ఈ దేవాలయానకు పడమర తోటలో రూపులేక పాడుపడిన శివాలయం...ఉన్నదాని వద్ద నిల్వారాతికి శాసనం. *

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౪౭౬ అగునేటి రాక్షస సంవత్సర జ్యేష్ఠ బ॥ ౮ లు శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప సదాశివదేవ మహారాయలు, విద్యానగర మందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యం యేలుచుండగాను, పొన్నతోట గ్రామాన ఉన్న మహాజనాలుకు కాస్యపగోత్రం ఆపస్తంభ సూత్రం యజుశ్శాఖాధ్యాయులైన విప్రవినోదులు...పొంగల పెద్దవల్ల భయ్య కొమారుడు అనంతయ్యనున్ను వశిష్ఠగోత్రం ఆపస్తంభసూత్రం యజుశ్శాఖ్యాధ్యాయులైన తూర్పునాటి మంత్రమూర్తి వీరయ్య కొమారుడు గోవిందయ్యనున్ను వశిష్ఠగోత్ర ఆపస్తంభసూత్రం యజుశ్శాఖాధ్యాయులైన తూర్పునాటి మంత్రమూర్తి మాధవయ్య కొమారుడు మాధవయ్యనున్ను జనాలు 3 న్ను యేకమై యిచ్చిన శిలాశాసన క్రమ మెట్లన్నను.

యీ గ్రామాన మావిప్రవినోదులకు చెల్లే వర్తన పొన్నతోట చెన్న కేశవస్వామికి మకర సంక్రాంతి......మా విప్రవినోదుల వారికి పుణ్యంగాను ధారవోసి యిస్తిమి. ఈ ధర్మానకు యెవరు ఆక్రమించి వర్తనలు కొన్నా తమ తల్లిదండ్రాదులను వారణాశిలో వధించిన పాపాన బోదురు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

అనంతయ్య గోవిందయ్య మాధయ్య వ్రాలు.

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat. pp. 54-55.

ఈ శాసనానకు ఉత్తరం చేరి నట్టుగానే, నిలవబసవన్న రాతికి అక్షరాలు శిథిలమైన శాసనము.

శుభమస్తు' అవిఘ్నమస్తు! శ్రీమన్మహామండలేశ్వర జగతాపి కంచయ్యదేవమహారాజులు.

(ఇక్కడ అక్షరాలు బొత్తిగా శిథిలమయి పోయినది.)

గండికోటలో నుండే శాసనాలు కోటలో రఘునాథస్వామి దేవాలయంలో ప్రాకారం లోతట్టు దక్షిణభాగం ప్రాకారం రాళ్లకు ఉండే శాసనములు.*

గండికోట రఘునాథుని కాణాచి వూ(ఊ)డికెం వడ్లపంటవారిది. ఈ 2 శాసనాలున్నూ యీ దేవాలయ ప్రాకారం గోడరాతికే వున్నది(వి).

మాధవస్వామి దేవాలయానకు పడమర, రంగహాల్ గోడకు వేసిన శాసనం రాయి పగిలి తునకలు అయి అక్షరాలు శిథిలమై ఆ రాయి వెలపట తీసేదానికిన్ని రాదు. అందు అగుపడినది. ఆనంద సంవత్సర ఆశ్వీజ శు॥ ౭ గురు...నాయకాచార్యులైన...

రాజుస్థానికులు కృష్ణయ్య...నంద్యాల నరసింహ్వారాజు...... మాధవస్వామి దేవాలయానకు వు(ఉ)త్తరం పాడువీథిలో వుండే నిలవరాతి శాసనం.♦

సూర్యుడు. చంద్రుడు.

చప్పణబోయిని నాగయకొడుకు పొత్తయరాజుగారి విన్నపంచేసి సర్వమాన్యంగాను యిచ్చి శాసనం వేయించినారు గనుక, మీకులం

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 58,59.

♦ See Gadṇikōṭa-durgam Kaifiyat, p. 66.

వారు పోతన బోయిజీ బహుమానాన బిడ్డబిడ్డ తరమున్ను బహుమానంగా నడుచుకొనేది.

ఇందుకు శాలివాహనశకం ౧౫౦౦ అవుతున్నది.

మాధవస్వామి దేవాలయానకు ఆగ్నేయం దమదమాబురుజుకు పడమర పేటలోనుండే కుంటలోనుంచి కోటలో మాధవస్వామికో నేరుకు నీళ్లు వచ్చే తూముకు వేసిన రాతిపైన నుండేది.*

చంద్రుడు. సూర్యుడు.

దరవాజాకు తూర్పు లోతట్టు చారమైనారవద్ద దిగువ పడియుండే రాతికి శాసనం.♦

సూర్యుడు. చక్రం. తిరుమణి. శంఖం. చంద్రుడు.

కోటకు ఉత్తరం పినాకినీ నదిలో తలంటిగుండుపైన వ్రాసివుండేది.

లింగం. వృషభం.

విరోధికృతు సంవత్సర మాఘ శు॥ ౧ శుక్రవారం దేవపృథివిమహాత్తులయిన...గండికోట పతెచన్నయ్య యింతె......పొన్నతోట జంగమారాధనకు అన్నంపెట్టి ముక్తిగవి కవిసన్నిధి అయ్యవారికి పూజచేసి కొండబిడ్డపొలి......అయ్యవారి బత్త్యానికి పుణ్యులయిరి. మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ

ఈ శాసనానకు తూర్పు దుర్గానకు వెలపల యేటిగడ్డ వేసిన రాతికి వుండేది.

సూర్యుడు. ? శూలము. కత్తి. చంద్రుడు.

స్వస్తిశ్రీ శకవర్షంబులు, ౧౨౫౫ భండారు శ్రీమన్మహాప్రతాప కంఠకాల నాయకుండైన గొంకయరెడ్డిగారు, గండికోట పృథ్వీ రాజ్యం చేయుచుండి, జయితాదేవి త్రిసంధ్యలను పూజింప పుష్పాలతోటి

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 57.

♦ See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 67.

దుందుభి సంవత్సర భాద్రపద ౧౦ లు మ॥ తమకు పుణ్యంగాను, ధార వోసి యిస్తిమి. మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ.

ఇందుకు తూర్పున సత్యనిధిస్వామి దేవాలయం రాతికి ఉండేది.

ఈ గుడి స్వామిగుడి.

सत्यनिधि तीर्थ स्वामीनां तपोमंडपमिदं

కోటకు దక్షిణం నాగఝరివద్ద రాగిచెట్టుకు ఈశాన్యం పుట్ట, శిలపైన వ్రాసియుండేది.*

కోటకు నైరుత రజాబురుజుకు దక్షిణం మజరా అలియాబాదు బేచిరాకు పల్లెకు తూర్పు రాజచెర్వు కోనలో యోగానంద నృసింహ్వస్వామి పాడు దేవాలయానకు తూర్పు దిగువ పుట్టురాతికి వ్రాసియుండేది.♦

సూర్యుడు. చంద్రుడు.

౧౦. శాసనానికి పడమర యీ దేవాలయానకు పశ్చిమం గుంటికి ఉండేది.

చక్రము. తెంగళ నామము. శంఖము.

శ్రీమతే రామానుజాయనమః। ప్లవంగనామ సంవత్సర మార్గశిర బ॥ ౧౩ లు బుధవారమునందు అనూరాధా నక్షత్రంగూడిన అమృత సిద్ధియోగమందును గడల అనమనే ఇని కొమారుడు చన్నమనాయనిం గారి కైంకర్యము ఆళువారు తిరుప్రతిష్ఠ అవధరించిరి. మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ.

ఈ శాసనానకు పడమర గుంటకు ఒక పంక్తి మాత్రం వ్రాసియున్నది.

సూర్యుడు. చంద్రుడు

శుభకృతు సంవత్సర మాఘ శు॥ ౧ శుక్రవారం రుద్రప్పనాయనిగా

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p 54.

♦ See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 20.

నాగఝరితోట మసీదిలోవున్న అరబిశాసనంలో శాహ హుశేనదరవేషు మసీదు కట్టిన సన్న ౧౧౦౨ హిజరి.

(చూ. అనుబం. పార్శిశాసనములు 42)

౧౧. దుర్గానకు తూర్పు దిగువ పినాకినీనదికి దక్షిణదరి ఫరా బాగులో మయాణా సైదుమియ్యా కారంజ పుబారా కట్టించిన సన్న అంకిసంకెలతో వ్రాసివుండేది. ౧౧౭౮ హిజరి.

(చూ. అనుబం. పార్శిశాసనములు 43)

అంత్తు గండికోటలో వున్న శాసనాలు ౧౯.

౧౨. మాజే మైలవరం చేచిరాకు గ్రామంకొండపైన మైలవరే శ్వరుని దేవాలయం ఆస్థానమంర(ప)మున ఉత్తరం స్తంభంపైన నుండే హళేకన్నడమిశ్రితమై వుండే అక్షరాలు.

విరోధికృతు సంవత్సర వైశాఖ శు॥ ౨ లు శ్రీమన్మహామండ లేశ్వర రామరాజు రామయ్యంగారు దేవరాయ మహారాయనికి, హనాన్నయమ్మగ(గా)రికిన్ని సిద్ధియమ్మంగారికిన్ని పుణ్యంగాను నన్నితే మల్లియ భోగమండపము వుత్తరముంపయ వైపు మూలకు హంకనాలు రెండు కట్టించెను. యే(ప)దుము చేను పెట్టెను. శ్రీమయిలవరాయనమః మంగళము.

ఈ దేవాలయానకు ఉత్తరం సోపానాలవద్ద నిలువరాతికి ఉండేది.

ప్లవసంవత్సర చను కొండం తిప్పిసెటి కొడుకు మల్లుతమ్మసు సెట్టి చేసిన ధర్మము యీ నడవ.

సూర్యుడు. (?) చంద్రుడు.

ఇందుకు పడమర సోపానంపైన వుండేది. భగవంత్తునికి వెల్ల మాటి నందిరాజునకు సదాసేవ. ఈ దేవాలయానకు దక్షిణం యేటిదరిన కొండకు వ్రాసి వుండేది.

అప్పణగళు ఆలెబ కటిసి భద్రమాడిసిదఆ కాలివె.

౧౩. మాజే కోంబరనంద్యాలగ్రామం కోటలో చన్నకేశవ స్వామిదేవాలయ గర్భగుడికి వెలపటతట్టు గోడరాతికిపైన వ్రాసియుండే శాసనం.*

ఈ గర్భగుడికె యీ శాసనానకు పడమర రాతికి ఉండేది.

జయసంవత్సర వైశాఖ బ॥ ౧ లు వోనాగారి నారసింహరాజు గారు పొట్టి అప్పయ్యగారి రెడ్డికి యిచ్చిన యెదురుగడ, నీవు కను కామిరెడ్డిగారి పూంటపడిన రొఖం వగ ౫ చెల్లెను. ఆపత్రం దిద్దు పత్రం.

౧౪. మాజే మొరగుడి గ్రామానకు పడమర చెన్నకేశవస్వామి పాడుదేవాలయం యెదుట నిలువరాతి శాసనం ప్రథమ భాగము రాయి పగిలిపోయి అంత్యభాగమున వుండేది.

పురస్థితాశేష విద్వన్మహాజనాలకున్ను, కాశ్య పగోత్ర, ఆశ్వ లాయన సూత్ర ప్రథమ శాఖాధ్యాయులైన, విప్రవినోది వల్లభయ్య గారి పుత్రుడైన పర్వతయ్యంగారున్ను, పెద గోవిందయ్యంగారి పుత్రుడు గోవిందయ్యగారున్ను, రుద్రయ్యగారి కుమారుడు గోవిందయ్య, కోనయ్య కుమారుడు పర్వతయ్యగారున్ను నల్లానయ్య చిన అనంతయ్యగారున్ను యిచ్చిన శిలాశాసనం.

విప్ణ అగ్రహారాన మా విప్రవినోదుల వర్తనలు చన్నకేశవ పెరుమాళ్లకు, మా విప్రవినోదికులంవారిని అందరికి పుణ్యంగాను సూర్యగ్రహణ పుణ్యకాలమందు సంక్రాంతి పార్వేంట మహోత్సవా నకు ధారవోసి యిస్తిమి. ఈ మహోత్సవం యేటా తప్పకుండాను

* See Gaṇḍıkōṭa-durgam Kaifiyat, p. 33. The week day is given as Bhṛiguvāra in addition to the date.

ధారవోసి యిస్తిమి, విప్రవినోదివారికి అందరికి దండము సమర్పించి యిస్తిమి. త్రివాచకంగాను ధారవోసి యిచ్చిన ధర్మశాసనము. ఇందుకు యెవ్వరు వక్రంచేసి వర్తన అడిగినాను తమతల్లి తండ్రిని వారణాసిలో వధియించ్చిన పాపానబోదురు, మాతృ గమనం చేసినవారు, సురాపానం శుణక మాసం భక్షించినవారు. ఇ ధర్మశాసనానకు యెవ్వరు తప్పి అడిగినాను కులాచారానకు వెలి.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

[illegible]

మవుజె తొ్రర వేములగ్రామానికి ఆజ్ఞే(గ్నే)యం అరపరుగు దూరమున ఈ గ్రామానికిన్ని వేపరాళ్లగ్రామం పొలిమేర సందున నిల్వురాతికి ఉండే శాసనం.[1]

సూర్యుడు. వామన ప్రతిమె చంద్రుడు.

౧౬. గ్రామంలో తూర్పు ఆంజనేయ దేవాలయానకు యెదుట దిగువ పడియుండే రాతికి శిథిలమైన శాసనం.[2]

ఈ శాసనం వద్దనే నిలువరాతికి వుండే శాసనం.[3]

సూర్యుడు. శంఖు. చక్రం. చంద్రుడు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౬౫ అగునేటి, శోభకృతు, సంవత్సర శ్రావణ బ॥ ౧౨ లు. శ్రీమద్రాజాధి రాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహారాయులు పృథివీరాజ్యం సేయుచును, రామరాజు చినతిమ్మరాజుకు నాయంకరానకు పాలించిన రామేశ్వరం పొద్దటూరి సీమలోని టోరువేముల, కలుమళ్ల లక్షుమరాజుకు ఉమ్మళి పాలించెను. రామరాజు తిమ్మరాజుకు పుణ్యంగాను, హనుమంతరాయనికి, రేగట గండికోట తెరువు తూర్పు చేను ఖ ౦॥౦ యిందుకు యెవ్వరు తప్పినను తమ తల్లితండ్రి......

౧౭. మౌజె పెదకొమ్మెర్ల గ్రామములో చెన్నకేశవ స్వామి దేవాలయములో మహాద్వారము వద్ద దక్షిణపుతట్టు నిల్వపాతియుండే రాతికి శాసనము.[4]

సూర్యుడు. శంఖం. తిరుమణి. చక్రం. చంద్రుడు.

శుభమస్తు : స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౮ అగునేటి పరాభవ సంవత్సర ఆషాఢ బ॥ ౩౦ లు శ్రీ

---

1. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 65.
2. See Gaṇḍikōṭa-durgam, p. 27.
3. See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 44.
4. See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 68.

మద్రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవ మహా రాయలు విద్యానగరమందు రత్నసింహాసనాసీనులై పృధివీసామ్రాజ్యం చేయుచున్నుండగాను, అఖిలాండకోటి బ్రహ్మాండనాయక, దేవదేవో త్తమ దేవశిఖామణి, పురాణపురుషోత్తమ, పురందరవంద్యులయిన, పెద కొమ్మెర్ల చన్నరాయనికి, శ్రీమన్మహామండలేశ్వర, నంద్యాల, అవుబళ రాజదేవ మహారాజుల పౌత్రులు అవుబళేశ్వర దేవమహారాజులుంగారు అనంతములైన దండములు సమర్పించి, యిచ్చిన భూదాన ధర్మ శాసనము. సదాశివదేవమహారాయలుగారు మానాయంకరానకు పాలించ నవధరించిన గండికోట సీమలోని పెదకొమ్మెర్లగ్రామానను అఖిలాండకోటి బ్రహ్మాండనాయక, దేవదేవోత్తమ, దేవశిఖామణి పురాణపురుషోత్తమ పురందరవంద్యులయిన పెదకొమ్మెర్ల చన్నరాయ నికి శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల అవుబళరాజు దేవమహారాజుల పౌత్రులయిన, అవుబలేశ్వర దేవమహారాజులుంగారి పుత్రులయిన, చిన అవుబళ దేవమహారాజు స్వామి నైవేద్య దీపారాధన అంగరంగ వైభవ మహోత్సవాల సకల తిరుకైంకర్యాలకున్ను యీతధాతిథి ప్రథమ యేకాదశీ పుణ్యకాలాన పినాకినీ నదీతీరమందు లోకపావన శ్రీనృసింహ్వాని సన్నిధిని మా పెదతల్లింగారు లక్ష్మమ్మగారి తిరుకైంకర్యములకు గాను, సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను, పెదకొమ్మెర్లగ్రామాన, కొండపొలమున నరసింహాపురం, లక్ష్మీపురానకు పెదరేగడ స్థళంచెరువు తూర్పు పొలం ఖ ౧౨ న్ను పుప్పాలపాటి తెరువు చేను ఖ ౧ ఉభయం చేను ఖ ౧౩ వరిమడి చెరువు కిందను ఫూరికి నఇరుతి మూల స్థళం మడి ఖ ౦॥ కాన మడి ౧౧ వుభయం ఖ ॥౧ అక్షరాలా...చేను మడి ...కైంకర్యానకుగాను నరసింహాపురం లక్ష్మీపురం చేను ఖ ౧౨ ను మా కైంకర్యముగాను పుప్పాపాటి తెరువు చేను పుట్టెడున్ను వరిమడి చెరువు. దప. కొల్తుమున్ను అఖిలాండకోటి బ్రహ్మాండనాయక దేవదేవోత్తమ, దేవశిఖామణి పురాణపురుషోత్తమ పురందర వంద్యులయిన, శ్రీపెద కొమ్మెర్ల చన్నరాయనికి, శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల అవుబళ రాజు దేవమహారాజుల పౌత్రులయిన, అవుబళేశ్వర దేవమహారాజుల

పుత్రులయిన చిన అవుబళేశ్వర దేవమహారాజులుంగారు పెదకొమ్మెర్ల గ్రామానను, త్రివాచకముగాను, లక్ష్మమ్మగారి కైంకర్యానకు, ఖ ౧౨ మా కైంకర్యముకు ఖ ౧ మడి ఖ ౦॥౧ స్వామి నైవేద్యదీపారాధన అంగరంగవైభవములు మొదలయిన సకల తిరుకైంకర్యాలకున్ను సమర్పిస్తిమి.

ఈ సమర్పించిన చేలుమళ్లలోని, నిధి, నిక్షేప, జల, పాషాణ, అక్షీణ ఆగామి సిద్ధసాధ్యంబులనియెడు అష్టభోగ తేజస్వామ్యాలున్ను ఆచంద్రార్క స్థాయిగాను నడిచే అట్టుగా సమర్పించి యిచ్చిన భూదాన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

మంగళమహాశ్రీ శ్రీ శ్రీ జేయును.

ఈ రాతికి ఉత్తరపు ప్రక్కను.

ఈ పెరుమాళ్ల పొలానకు మేరలు : పడమటికి చెరువుకట్ట మేర. ఉత్తరానకు భీమగుండం పొలిమేరను(?) తూర్పు చినకొమ్మెర పెరుమాళ్ల పొలము, దక్షిణానకు నరసింహాపురము లక్ష్మీపురము, ఈ శాసనము నకు యెవరు తప్పినాను, తమ తలిదండ్రాజు(దు)లను గోవు బ్రాహ్మలను వారణాశిలో వధించిన పాపాన పోదురు. కుక్క మాంసము నురకలువు కొని సేవించిన పాపాన పోదురు.

ఈ దేవళంలో గర్భగుడి ద్వారానకు పశ్చిమం ఉత్తరంగా అడుగున రాతిమీద పొడుగూన వ్రాసియుండే శాసనం.*

* See for a summary Gaṇḍıkōṭa-durgam Kaifiyat, p 52.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౩ అగునేటి విరోధికృతు పంవత్సర స్రా(శ్రా)వణ బ॥ ౮ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ వీరసదాశివ దేవమహారాయలు విద్యానగరమందు, రత్నసింహాసనారూఢులై, పృధివీ సామ్రాజ్యము చేయుచుండగాను ఉదయగిరికి చెల్లే ఘండికోట సీమలో పినాకిని నదికి వు(ఉ)త్తర భాగమందు పెదకొమ్మెర్ల పెరుమాళ్లకు విప్రవినోదులు, కాస్యపగోత్ర ఆపస్తంబ సూత్ర అధర్వణశాఖాధ్యాయులయిన మల్లప్ప పౌత్రులయిన, వల్లభయ పుత్రులయిన పర్వతయ్య పెద అనంతయ్య నల్లారయ, మూర్తయ, చిన అనంతయ్యగారును సుబ్బయ్య పౌత్రులయిన పెద కేశవయ్య పుత్రు...మాధవయాను వల్లభయ్యాను వీరు మొదలయిన విప్రవినోదులు యిచ్చిన ధర్మశాసనము క్రమ మెట్లన్నను, పెదకొమ్మెర్లగ్రామాన మా విప్రవినోదులకు వరుపాచ(సాశ)నం యిచ్చే వర్తన, విప్రవినోదికులముకెల్లా పుణ్యంగాను, యీ తథాతిథి కృష్ణజయంతి పుణ్యకాలమందు ధారబోస్తిమి...ఈ ధర్మానకు యే విప్రవినోదులు తప్పినను, తమ తలిదండ్రాదులను, గోబ్రాహ్మలను, వారణాశి వధించిన పాపాన బోవువారు.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

౨౩. పెదకొమ్మెర్లగ్రామానికి అరగడియ దూరమున ఉండే పెద్ద బీడు చేనులో శాసనము.*

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౬ అగునేటి క్రోధి సంవత్సర మాఘ బ॥ ౩౦ లు, శ్రీమద్రాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయలు విజయనగరమందు రత్నసింహాసనారూఢుడై పృథివీ సామ్రాజ్యము చేయుచుండగాను, ఆత్రేయ గోత్రాన్వయులయిన, శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 45-6.

తిమ్మయదేవమహారాజులు, కొమ్మెరల కందుకూరు బసిరెడ్డికి పోజన మాన్యపు చేనికి వేయించిన శిలాశాసన క్రమమెట్లన్నను.

౨౮. మాకు సదాశివదేవమహారాయలు నాయంకరానకు పాలించియిచ్చిన గండికోట సీమలోని పెదకొమ్మెర్ల, చినకొమ్మెర్ల గ్రామాలు రెంటికి పొత్తు చేను, కిడప పోలిరెడ్డిగారి పెద్దచేని స్థళం ఖ ౦॥౦ అక్షరాలా పందుము చేనున్ను, కందుకూరు బసిరెడ్డికి, మాన్యం పెట్టితిమి గనుక యీ పందుం చేనున్ను కాంపులకు పాలుపంపులు పంపని లేదు.

ఈ పందుము చేనిలో వచ్చిన ఫలం, ఆచంద్రార్కస్థాయిగను, మీా పుత్రపౌత్ర పారంపర్యంగాను అనుభవించగలవారు అని శిలాలిఖితం చేసి వేయించిన శాసనం. శ్రీ శ్రీ శ్రీ జేయును.

మాజె చినకొమ్మెర్ల గ్రామం వెలపట చన్న కేశవస్వామి దేవాలయములో, వు(ఉ)య్యాలమంటపం వద్దపాతియుండే రాయి మీాది శాసనం.*

చంద్రుడు. శంఖు. రెండుగీరలనామము. చక్రం. సూర్యుడు.

శుభమస్తు॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౫౫ అగునేటి విజయ సంవత్సర కార్తిక శు॥ ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరఅచ్యుతయ దేవ మహారాయలుంగారు, వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యం చేయుచుండగాను, చెన్న కేశవ పెరుమాళ్ల దేవుని దివ్యశ్రీపాదపద్మములకు కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన భావయ్యగారి పౌత్రులున్ను, శ్రీరామయ్యగారి పుత్రులున్ను అయిన తిమ్మరుసుంగారు, అనంతములయిన దండములు సమర్పించి యిచ్చిన భూదాన ధర్మ శాసన క్రమ మెట్లన్నను : అచ్యుతరాయ మహారాయలు మా నాయంకరానకు, పాలించియియ్య నవధరించిన గండికోట దేశానకు

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 40.

చెల్లే కొామెరలగ్రామమందు, గ్రామానకు తూర్పు గుండ్లకుంట పొలి మేరకు దక్షిణం...పొలిమేరకు చెరువు కట్టకు ఉత్తరాన, భీమగుండం పొలిమేరకు యీ చతుస్సీమకులోను గాగల క్షేత్రం ఖ ౧౨ అక్షరాలా పంౘ్రెండు పుట్లు క్షేత్రం యీతథాతిథి వు(ఉ)థానద్వాదశి పుణ్యకాల మందు, పినాకినీ తీరమంను, లోకపావన నరసింహ్వాదేవుని సన్నిధిని, సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను, ధారబోసి యిస్తిమిగాన యిందుకు చెల్లే నిధి నిక్షేప జల పాషాణ, అక్షీణ, ఆగామి, సిద్ధ సాధ్యంబు, లనియెడి అష్టభోగ తేజస్వామ్యములు, త్రివాచకముగాను, యీ పంౘ్రెండుపుట్లు క్షేత్రమున్ను ధారబోసి యిస్తిమి గాన యిందున వచ్చిన ఫలం, స్వామి అమృత పళ్లకు త్రివాచకంగాను, సమర్పిస్తిమిగాన, ఆర గింపు అంగరంగవైభవాలకు అవధరించేది.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం ॥

ఈ రాతివద్ద, దిగువ భూమిలో పరచి ఉండే శాసనం.*

ఇందుకు శకం ౧౪౭౫ అవుతున్నది.

ఈ దేవాలయం గర్భగుడి దక్షిణ ప్రాకారం దిగువరాతి గోడకు తూర్పు పడమరగా వ్రాసియుండేది.*

స్వస్తిశ్రీ జయాభ్యుదయ, శాలివాహాన శకవరుషంబులు ౧౪౭౩ అగునేటి విరోధికృతు సంవత్సర నిజభాద్రపద శు॥ ౧౧ లు శ్రీమద్రా జాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీసదాశివదేవమహారాయులు విద్యానగరమందు పృథివీ సామ్రాజ్యము చేయుచుండగాను, కాస్యప గోత్ర, అథర్వణశాఖాధ్యాయులయిన శ్రీధరనగారి...న పెదగోవిందయ్య గారి...విప్రవినోదులు.....గారున్ను విప్రవినోదులు.....గారున్ను

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 54.

♦ See for summary, Gaṇḍikōṭa-durgam-Kaifiyat, p. 52. The month and tithi are given there as శ్రావణ బ॥ ౪ లు.

...మరాజుపద్మనాభుడు కేశవయ్య...ఆలద(?)య అనంతయ్య...... వల్లభయ మంత్రమూర్తి బసి...విప్రవినోదులు మొగలయినవారికి పుణ్యంగాను, గండికోట సీమకు చెల్లే పెదకొమ్మెర్ల, చినకొమ్మెర్లగ్రామ వర్తన చినకొమ్మెర్ల చన్న కేశవనికి......

ఈవల అక్షరాలు శిథిలమయినది(వి)

౨౮. చినకుమ్మెర్లగ్రామానకు దక్షిణం అరపరుగు దూరాన తొగ్రవేముల పొలిమేరను, చేలోపడి యుండే రాయిమీాది శాసనం.

సూర్యుడు. చంద్రుడు.

సాధారణ సంవత్సరం శ్రావణ శు॥ ౫ చినకొమ్మెర్లగ్రామం పొలిమేర దక్షిణం తొగ్రవేముల వారి సందు తమసందు తీర్చుకున్న వివరం: నాలుగు గ్రామాలవారిని పిలువనంపించి, వు(ఉ)భయత్రులు సమ్మతి చేసుక కర్ణాటి చినవెంకటరెడ్డి తొక్కిపోతే అందుకు పొలిమేర రాయి వేస్తిమి, శ్రీరామా.

ఈ గ్రామానికి దక్షిణం అరఘు(గ)డియ దూరాన మల్లప్ప బావి వద్ద పడివుండే రాయిమీాద నాగర అక్షరాలు శిథిలమైనది.

सजालाम........पजन........तुनललवो........ल....स........बने........ मगनं सख........त्र्यं........नातानम......अ........राज........राखन........ तन गमल

౨౯. మాజే చినకొమ్మెర్ల గ్రామములో చేరిన మజరా వెంకటాపురం వురవు కొత్తపల్లెకు వరుణ మూల, పొలిమేర సమీాపంలోనుండే శాసనం.

చంద్రుడు. చక్రం. నామం. శంఖం. సూర్యుడు.

గొడుగుమర్రి కేశవనాథుని పొన్నంపల్లె పొలిమేర. ఈ మేరకే తొగ్రవేముల సరిహద్దులో యింకా మూడుచోట్ల వున్నది.

ఈ శాసనానకు సమీాపం ఉత్తరం చౌడేశ్వరీ దేవాలయానకు పడమట పొన్నంపల్లెలోని మజరా గంగులు నారాయణ పల్లెకు ఉత్తరం వేసియుండే శాసనము.

చంద్రుడు. సూర్యుడు.

రౌద్రి సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు గొడుగుమర్రి చన్న రాయని స్థానం కత్తియ చెన్నమయంగారు కర్ణాట చిట్లారెడ్డికి యిచ్చిన కుంట దశవందం కమ్మ నీకు పూర్వాన చెల్లే...దశవందం చేను స్థళాలు కొ...స్థళం గొల్ల తానే బోయని చేను.

30. మాజే తలమంచిపట్టం ఊరి ముందర రచ్చరావిమానికి పశ్చమం సమీాపమందు ఉండే ధ్వజస్థంభంవద్ద పడియుండే శాసనము.[1]

శ్రీరంగ (Signature)

ఇందు శకం ౧౪౮౪ అవుతున్నది.

31. గ్రామానకు పడమట యె(ఎ)ల్లమ్మ దేవాలయమునకు దక్షిణం రెడ్డిమాన్య జప్తీ...సజ్జచేను గనిమె మీాద పాతివుండే శానసం.[2]

సూర్యుడు. లింగం. చంద్రుడు.

ఈవల...రాయి సుధం(శుద్ధము)గా లేదు మె(లే)చిపోయినది.

32. కోటలో హనుమంతరాయని దేవాలయం దగ్గిర పాతి యుండే శాసనం శిథిలమై పెళ్లు లేచిపోయినది. అక్షరాలు ఖిలమై పోయినవి.[3]

శంఖం. నామం. చక్రం. సూర్యుడు.

---

1. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 69. In the place of Sidupalle, the text here has Chinakomerla and Ganganapalle.

2. See Gandikota-durgam Kaifivat. p. 33-34.

3. See Gaṇḍikōta-durgam Kaifiyat, p. 47.

33. మవుజె అయ్యవారికంభాలదిన్నె గ్రామములో, మంత్రాలమ్మతోట్ల(?) చెట్టు సమీపం చింతమాని వద్ద ఉండే శాసనం రాయి నందిసమేతంగా వున్నది.*

చంద్రుడు. లింగం. సూర్యుడు.

ఈ గ్రామ పొలిమేరలో వుండేది. గ్రామానకు దక్షిణం సమీపం పౌరోహిత మాన్యం వద్ద గొంగటి లింగేశుని గ్రామం.

ఈ చొప్పున యింకా రెండు జాగాల పొలిమేరన వున్నది.

3౪. ఈ గ్రామానికి పశ్చిమంగా పెదబావి వద్ద శిథిలమైన శాసనం వున్నది గాని యిసుకరాయి గనుక అంతుమీద యేమి అగుపడ లేదు పందుము చేనున్న మీ పుత్రపౌత్ర పారంపరియాయం గాను...

మవుజే బెస్తవేముల గ్రామంలోని...గ్రామం కేశవస్వామి దేవాలయం ముందర గరుడస్తంభంమీద ఉండే శాసనం.

రవు(రౌ)ద్రి సంవత్సరం ఆషాఢ బ॥ 30 లు చినవెణుతుర్ల మంగల తిమ్మోజు కొడుకు తిప్పోజు పాతిన స్తంభము.

ఇందుకు తూర్పు మజరా జంగాలపల్లెకు, యీశాన్యపు దిక్కున, కల్లుట్ల సరిహద్దున పడియుండే శిథిలమైన శాసనము నకలు♦

భ్యుదయ శాలివాహన శకవరుషంబులు...వారానను శ్రీమన్మహా మండలేశ్వర గడ్డమయ్య దేవ.....ఘండికోటదుర్గం వీరయ్యకొడుకు... బసువయ్య రాచయ్య చినవీరయ్య...కట్టవేయగాను ౧౧। మీకు యిస్తిమి శ్రీమన్మహామండలేశ్వర గడ్డమయ్య దేవమహారాజుల కొమారుడు వెంగళ రాజు కట్టడ రాజుగారు గండికోట వీరయ్య కొడుకు.....బసువయ్య

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 40-41.

♦ See for summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 55.

రాచయ్య కొరివి వీరయ్యగారి వీరు మొదలయిన అయ్యంగాండ్లకు వ్రాయించి యిచ్చిన శాసనం.

ఇందుకున్న రేగులకుంట పడమర బెస్తవేముల జంగాలపల్లె పొలిమేరన కుమ్మరకుంటకు తూర్పు...

సూర్యుడు. చంద్రుడు.

బెస్తవేముల ప్రతినామమైన ప్రసన్న రాఘవాపురం ఈలాగున యింకా పొలిమేరలో మూడు నాలుగు చోట్ల బెస్తవేములకు ప్రతినామమైన ప్రసన్న రాఘవాపురం అని వున్నది.

...పొలంలోను నీరుతోట...చేను ౧౨ మానులు యిస్తిమి. ఇందుకు సాక్షులు బెస్తవేముల...చి. వా(?)ను మంగినేని కొడుకు ఆవులు వీరల సమ్మతిని బెస్తవేముల కరణం పరదేశి కొండిసెట్టి కొడుకు తిమ్మన్న వ్రాలు......అడుగము. ఇందుకు మొదగు అడిగినా వారణాశిలో బ్రాహ్మల వధించి పాపాన బోవువారు మంగళమహాశ్రీశ్రీశ్రీ.

౩౬. యీ సైదుకులోనున్న పైన వ్రాశిన శిథిలమైన శాసనం వ్రాసియున్నది.

౩౭. మవుజె భూతమాపురి చావడికి తూర్పు, పాతివుండే శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౧ అగునేటి వికారి సంవత్సర వైశాఖ శు॥ ౧౫ శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ అచ్యుత దేవమహారాయలు విజయనగర మందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యము చేయుచున్నుండగాను, గండికోట సీమలోను, పినాకినీ నదికి ఉత్తరం, రేనాటి సీమలోను, బూతమాపూరిగ్రామం, శ్రీచన్నకేశవదేవర దివ్య శ్రీపాద పద్మంబులకు, కాస్యపగోత్రులైన విప్రవినోది పెదగోవిందయ్యవారు... భంన కొమారుండు నలగోవిందయ్య వల్లభయ్య కొమారుండు చినవల్లభయ్య కుంటి వల్లభయ్య కొమారుండు వల్లభయ్యాను జవి...విప్రవినోదులు......

ఈవల అక్షరాలు యే మాత్రము లేదు. అన్ని బండ పేడు లేచిపోయినది.

౩౮. మవుజె సూధవాపురం గ్రామములో హనుమంతరాయని దేవాలయములో గోడ దగ్గిర పడివుండే శాసనం.

ఈశ్వర సంవత్సరానను చలమర్థిగండపట్ణానను, జియ్యంగారి సన్నిధిని, వెంకటయ్యగారికి, కట్ట హరిదాసురాజు ధారబోసిన చేను, నడిమి కత్తుపను, భీమలి గుంకం గ్రోవను చేను ౧౩ న్న బ...

౩౯. గ్రామానికి వుత్తరం గొల్ల ఉప్పలపాడు, కుల్లుట్ల పొలి మేరను, పగిలిపోయిన శాసనం.*

గొల్లల వుప్పలపాడు, గ్రామానకు, అళియరామప్పయ్య దేవ మహారాజులుగారు, పులివిందల నారాయణయ్యకు ధారబోసి యిచ్చిన, గోచర్మం పొలం ఖ ౪౫౦ క్షేత్రం.

ఈ రాతి అంచున ఒక పెద్ద యెర్రరాయిమీద, గొడుగు పోలడు శంఖచక్రాలు సూర్య చంద్రాదులు ఉన్నవి.

యీ గొడుగు పోలడు కృష్ణదేవమహారాయలకు గొడుగుపట్టే వాడని మరియొక చోట వ్రాసియున్నది.

ఈ రాతికి తూర్పు సమీపమునందు పొలిమేరను.

చంద్రుడు.   శంఖం.   చక్రం.   వామనప్రతిమ.   సూర్యుడు

కల్లుట్లగ్రామానికి ప్రతినామమైన, తిర్మలాచార్యపురం అగ్రహారం

కల్లుట్లగ్రామానికి యీశాన్యం సామీప్యమున చెర్వుకట్టను, కరమల వాని మాన్యం మడిలో ఉన్న నిల్వరాతికి శాసనం.♦

---

* Images of the sun and the moon and below them the image of Vāmana. See Gaṇḍkōṭa-durgam Kaifiyat, p.p 56.57.

♦ See Gaṇṇikōṭa-durgam Kaifiyat, p. 41.

ఈ రాతికి రెండో పక్కను వుండేది.*

క్రోధన సంవత్సర మార్గశిర బ॥ ౬ లు శ్రీమన్మహామండలేశ్వర జగతాపి కంచిరాజయ దేవచోడ మహారాజులయ్యగారు, మంగల తిమ్మోజుకు యిచ్చిన వ్రాలుకు హనుమంతుని కిన్ని, గణాధిపతికిన్ని, సేవచేసేటందుకుగాను మాన్యంపెట్టిన చేను స్థళం ... మోడ చేను ౧౨ వ నల్ల చెర్వ క్రింద గొనమడి ౧౧ ఉభయం ౧౩ ఆకులు వక్కలు తాంబూలానకు పెట్టినది ౧౪౨ పొలం అనుభవించి బ్రదికేది.

ఇందుకు శకం ౧౮౪౭ అవుతున్నది.

మవుజె చిన వెణుతుర్లు గ్రామాన నుండే శాసనాలు.

ప్యా(పే)టలో చెన్న కేశవస్వామి ద్వారం వెలుపట నిల్వరాతికి శాసనం.

చంద్రుడు. సూర్యుడు.

శ్రీరామా.

౪౨. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౧౨ అగునేటి ప్రమోదూత సంవత్సర మాఘ శు॥ ౧౫ సోమవారం, శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజపరమేశ్వర, శ్రీవీరప్రతాప శ్రీరామ రాజు రామప్పయ్య విజయనగరమందు పృథివీ సాంబ్రా(మ్రా)జ్యం చేయుచుండగాను, చినవెణుతుర్ల స్థావరజ్ఞులు కరణం తిమ్మరాజు కొమారుడు సూరప్ప, కోట తిమ్మారెడ్డి కొమారుడు యెల్లారెడ్డి మొదలయిన కాపు కరణాలు యీ స్థళమందు పరషు(శు)రామ ప్రతిష్ఠ, చన్నకేశవ పెరుమాళ్లకు జీర్ణోద్ధారణ ప్రతిష్ఠ చేయించి, యీ తథాతిథి పుణ్యకాలమందు ఆగమపరులైన ఘట్టి కేశవయ్య కొమారుడు రామన్నకు పట్లం త్రోవను, గొల్లపల్లె పొలిమేరను, చేను ౧౧; ఈ దేవళ్లు తీర్చిన రాళ్లలింగా బత్తుని కొమారుడు తిప్పయు, లక్కోజు బుచ్చన్న కొమారుడు అయనగారికి, వద్దికేల దోవ తూర్పున జం(బు)

* See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 61.

చేను ౧౧, ఈ మర్యాదను మీకు మాన్యం యిచ్చినారం. గనుక, మీ పుత్ర పౌత్ర పారంపర్యంగాను సుఖాన అనుభవించేది.

౮౩. చెన్నరాయని సేయించినవారు కోటరెడ్డి కొమారుడు యెల్లారెడ్డి, వద్దిరేల మల్లయ్య కొమారుడు చిన గురువయ, నిత్యం కేశవులకు నిత్యదండములు.

ఈ దేవాలయానకు తూర్పు, ఆంజనేయుని దేవాలయం వద్ద ఉన్న నిల్వరాతికి శాసనం.*

సూర్యుడు. శంఖము. తెంగల నామము. చక్రము. చంద్రుడు

శుభమస్తు. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౮౩ అగునేటి రౌద్రి సంవత్సర ఆషాఢ శు॥ ౧౧ లు, శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలు పృథివి సాంబ్రా(మ్రా)జ్యం శా(చే)యంగాను, శ్రీమన్మహా మండలేశ్వర నంద్యాల తిమ్మరాజయ్యగారు, చినవెణుతుర్ల మారకపూరి శ్రీ చన్నకేశవ మూర్తికి దథ్యాన్నానకు సమర్పించిన శాసనం క్రమము. శ్రీసదాశివరాయులు మాకు నాయంకరానకు పాలించిన ఘండికోట దుర్గానకు చెల్లె సుంకిం సమ్మంధం చిన వెణుతుర్ల గ్రామకట్ణం గ ౩, గాండ్ల వారివల్ల గ ౧౫ ఉప్పర వారి గ ౪...ఉభయమున్ను మట్టువ గ ౪ ఈ నాలుగు వరహాలున్ను శ్రీ చెన్నరాయని దధ్యోన్నానకు సమర్పిస్తిమి. ఇందుకు విఘ్నం చేసిన వారు కాశీలోనున్ను, ౧౦౮ తిరుపతులలోనున్ను, తమతల్లి దండ్రాదులనున్ను బ్రాహ్మలనున్ను, గురువులనున్ను, వధియించిన పాపానం బోదురు. శుణకమాంసమున్ను, సురరానున్ను కలిపి త్రాగిన పాపివా(నా)డు. ఈ ధర్మం తప్పక నడిపించిన వారికి అశేష పుణ్యమని సమర్పించిన దధ్యోన్న శాసనము.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 62.

తిండిగుక్క తిప్పరాతిసేవి కోనంగారుడు పోతిసేని నిత్యశా(సే)వ॥
గ్రామానికి వుత్తరం గుట్టపైన కోన నరసింహ్వాస్వామి గర్భగుడి ద్వారం కడపరాతిపైన వ్రాసి యుండేది.

నరసింహ్వానికి మాహాసంకయు సదాసేవ. నరసింహ్వానికి పేరుసోమల రఘుపతి కామరాజు నిత్యసేవ.

౨౮. మాజె గొల్లల ఉప్పలపాడు గ్రామములను నుండే శాసనాలు
గ్రామానికి వాయువ్యం గొల్లపల్లి పొలిమేర సంకు జంబి(జమ్మి) మాను వద్ద శిథిలమైన దేవాలయం వద్ద నిల్వరాతికి వుండే శాసనాలు.[1]

సూర్యుడు. చక్రం. తిరునామం. శంఖం. చంద్రుడు.

ఈ శాసనానకు చేరినటుగానే దక్షిణంగా వుండే శాసనం.[2]

గ్రామానికి తూర్పు ఆంజనేయ స్వామి దేవాలయం యెదుట నిల్వురాయి పగిలివుండేది.[3]

సూర్యుడు. చంద్రుడు.

ఈ శాసనానకు దక్షిణంగా వుండే శాసనము.[4]

సూర్యుడు. చక్రము. తెంగల నామము. శంఖము. చంద్రుడు

౨౯. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౭ అగునేటి రాక్షస సంవత్సర, ఆషాఢ బ॥ ౧౧ లు, శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప సదాశివ దేవమహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢులై పృథివీ సాంబ్రా(మ్రా)జ్యం సేయుచుండగాను. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన, దేవ దేవోత్తముడైన గొల్లల వుప్పలపాటి చెన్నకేశవపెరుమాళ్ల దివ్య

1 See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 34.

2. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 34.

3 See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 56-57.

4. See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 56.

శ్రీ చరణారవిందంబులకు శ్రీమన్మహామండలేశ్వర నంద్యాల తిమ్మయ రాజుల మరిదళి సారప్పనాయనింగారు, దండములు సమర్పించి యిచ్చిన ధర్మశాసనం.

స్వామి సదాశివ దేవమహారాయులుంగారు, నంద్యాల తిమ్మయ దేవమహారాజులుంగారి నాయంకరానకు పాలించిన గంటికోటసీమ లోని, గొల్లల ఉప్పలపాటి గ్రామానను, తథాతిథి ప్రథమ యేకాదశి పుణ్యకాలమునందు, చెన్నకేశవ పెరుమాళ్లకు నిత్యాను ఊళిగెం నంద్యాల సారప్పరాజయ్యవారికి పుణ్యంగాను డోలు, నాగసరాల వూళిగెం చేసేటందుకు మాన్యంవామిచేను, రేగడి చేను ఖ ౦।౧ పుట్ల చేను, తంపా(?) తప్పన చే ౧౮ ను స్థళాలు ౨ టాను మాన్యం వాఒ? ఖ ॥౦ ఆచంద్రార్కస్థాయిగాను, యీ మాన్యం అనుభవించి పెరుమాళ్లకు డోళవారు జ ౨, నాగసరాలవారు జ ౨ ను కూడాను నలుగురు శేషును మాఘ నుడి(?)నాయని వూళిగెం కొదువ కాకుండాను సేసుకొ బ్రతుక గలవారు అని వ్రాయించి యిచ్చిన శిలాశాసనం. మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ జేయును.

మాజె గొల్లపల్లె కోటకు వెలుపట పెంటలో దిగువ పడియుండే శాసనం.* కొన్ని అక్షరాలు శిథిలమై యుండేది, హళేకన్నడ అక్షరాలు.

గ్రామానికి ఉత్తరం జంబి(జమ్మి) చేనులో దిగువయుండే రాతికి శాసనం.

చక్రం. నామం. శంఖు.

శ్రీముఖ సంవత్సర, శ్రావణ బ॥ ౧౦ లు గురువారం నాడు కూర్మయ్య తిమ్మయ్యకు, మాంద్రాజు గోపయ్య కొడుకు లింగరాజు మోసలి మోపూరి ఉత్తరం రేగడి ముత్తును చేను కూర్మయ్య తిమ్మయ్యకు ధారవోసి యిస్తిమి. ఎవ్వరు తప్పినాను, మార్కపురం చెన్నరాయనికి తప్పు తరమగు. మంగళంమహా శ్రీ శ్రీ శ్రీ.

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 10. A. R. No. 307 of 1937–38.

౭౬. మఫుజె మురుపంది గ్రామానికి తూర్పున భుమసాని పల్లెకు తూర్పు తాగి(డి?)తోటలో ధోడియం మురుపంది పొలిమేర సందున నిల్వరాతికి.*

సూర్యుడు. వామనప్రతిమ. చంద్రుడు.

మౌజె కోడూరు గ్రామాన నుండే శాసనాలు.

ఈ గ్రామములో చెల్లే మజరా దబ్బుడ పల్లెలో ప్యా(పే)టలో బావి వద్ద ఉన్న శాసనం.

ఆ బావిపూడి పోయిన తరువాత గ్రామం రెడ్డి, జిల్లేళ్లగోవింద రెడ్డి ముంగిటిలో తెచ్చి పెట్టెను. ఆ రాయి చిన్నది. దానికి నకలు.

సూర్యుడు. శ్రీహరి. చంద్రుడు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౮౭ అగునేటి విశ్వావసు సంత్సరం చైత్ర శు॥ ౧౩ లు కోడూరి కాపు కరణాలు జిల్లేళ్ల అయ్యనకు యిచ్చిన శిలాశాసనం.

నీవు మా పొలంలోను దబూటి పల్లె పొలాన, నీవు పల్లెగట్టి బావి తోవ్వించిన నిమిత్తం, నీకు సూతిమాన్యం బావికి...కిప్పతర చేను ఖ ।౧ నీకు మాన్యం ఇప్పించినారం గనుక, నీ పుత్రపౌత్రపారంపర్యం గాను ఆ బావి పదిలం చేసి నీవు అనుభవించ గలవాడవు, అని ఇచ్చిన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

కోడూరు గ్రామం చెన్నకేశవస్వామి దేవాలయం యెదుట నిలువరాళ్ళపైన చాలుగా నుండే శాసనాలు.*

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 41.

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 45.

ఈ శాసనానకు దక్షిణముగా నుండేది.*

శంఖం. సూర్యుడు. చంద్రుదు. చక్రం.

...నగరపన్నులు అన్నులు అడి...చ్చంగలవారు. వెచ్చాలు యివి మొదలయినవి కట్టడ ప్రమాణాలు మన్నించి సర్వమాన్యంగాను కట్టడ చేసి యిచ్చిన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఈ శాసనానకు యెవ్వరు తప్పినాను, తమ గల్లిదండ్రాదులను, వారణాశిలో వధియించిన పాపాన బోదురు, గోబ్రాహ్మణ వధచేసిన పాపాన బోదురు.

ఈ శాసనానకు దక్షిణంగా నుండేది.♦

శంఖం. సూర్యుడు. నామం. చంద్రుడు. చక్రం.

శుభమస్తు॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౦ అగునేటి కీలక సంవత్సరం భాద్రపద శు॥ ౧౪ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీ॰ప్రతా॰ శ్రీసదాశివదేవమహారాయలగారు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢుండై పృధివీ సామ్రాజ్యం సేయుచుండగాను, శ్రీమన్మహా మండలేశ్వర అళియరామప్పయ దేవమహారాజులుగారు పాలించి యియ్యవవధరించిన గుత్తి సీమలోన పెన్నబడి గ్రామాలలోను కోడూరి గ్రామమందు, శ్రీమతు అఖిలాండకోటి బ్రహ్మండనాయక వేదవేదాంతవేద్య పురాణ పురుషోత్తముండయిన శ్రీ కోడూరి చన్నకేశవస్వామి, దాసానదాసుండయిన దొమ్మరి పెమడృని తిరుమలయ తమ్ముడు సింగరిరెడ్డి కొడుకులు, యర్థయ్య పెద్దినరాజు, వీరబొమ్మినాయుని జనం సింగన్న తిప్పరాజు కొడుకులు

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat. pp. 59-60.

♦ See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat.

జనం ర కోడూరి చన్నరాయునికి ధారవోసి యిచ్చిన ధర్మశాసనం క్రమ మెట్లన్నను : చన్నకేశవుని దీపారాధన అమృతపళ్ళకు, యీ కోడూరి గ్రామమందు వచ్చిన దొమ్మరి పన్ను ౫ రగుజ యిరువై నాలుగు కులాల వారికి పుణ్యంగాను, ధారవోస్తిమి. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను, తమ తల్లితండ్రాదులను, వారణాశిలో వధియించిన పాపానం బోవువారు.

దొమ్మర వారికి కొడుకులు పెనస కొడుకులు అని తమ యిరువై నాలుగు కులాలవారికిన్ని పుణ్యంగాను ధారవోస్తిమి. ఇచ్చిన ధర్మ శాసనం.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఈ రాయివద్ద మరియొక రాయి యుండగా అదితీసి దేవుని ద్వారమునకు వేసినందున అక్షరములు శిధిలమై పోయినది. అందులో,

శుభమస్తు. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహాన శకవరుషం బులు ౧౪౮౩ అగునేటి సాధారణ సంవత్సర...... శు॥ ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివదేవ మహారాయలు విద్యానగరమునందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సామ్రాజ్యం చేయుచుండగాను. (ఇక్కడ అక్షరాలు పోయినది.)

గ్రామానికి ఉత్తరం 10 పరువున బాలచంన్నకుంట చేలో దిగువ రాతికి వుండేది.

సూర్యుడు. శంఖు. రెండుగీరలనామము. చక్రం. చంద్రుడు

కోడూరి చన్నకేశవునికి మాలెపాట తిమ్మరాజు సమర్పించిన చేని స్థళం.

౫౫. మవుజె సంకెపల్లె శ్రోత్రియం గ్రామానమండే శాసనం. గ్రామానికి దక్షిణం సంకెపల్లె నాగమళ్ళ దిన్నె సరిహద్దున వామన ముద్ర రాతికి శాసనం.*

1. See Gandikōta-durgam Kaifiyat, p. 66.

ఈ గ్రామములో ఆంజనేయస్వామి దేవాలయం యెదుట నిలువ రాతికి శాసనం.[1]

గ్రామానను ౪ మగ్గాలుకు గాను నాలుగు... ..సిద్ధాయం చెల్లించగలవారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥

మవుజే నాగమళ్ళ దిన్నె గ్రామానికి తూర్పు పెన్న యేటిగడ్డ పాంతగ్రామ నెత్తం చేనులో నిలవ గరుడ స్తంభంపైన నుండేది.

చక్రము. నామము. శంఖము.

బుక్కపట్ణం వెంకటాచార్యులు వారి శిష్యుడు చాతూరంగా దాసరి యెత్తించిన గరుడగంభం కైంకర్యం.

మవుజే నుగుమంచి పల్లెలో నుండే శాసనం.[2]

శంఖం. నామం. చక్రం. సూర్యుడు.

ఈ దేవళంలోనే యీ శాసనానికి దక్షిణం నిల్వరాతికి వుండే శాసనం.[3]

సూర్యుడు. శంఖం. తిరుమణి. చక్రం. చంద్రుడు.

ఈ శాసనానకు తూర్పు యీ దేవళం ప్రాకారంలోనే దిగువ బండకు వ్రాసినది.

శ్రీరస్తు॥ శుభమస్తు॥ శ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౬౦౦ అగునేటి కాళయుక్తి సంవత్సరాన దొడ్డుగా వర్షం యేడు వెల్వ(ల్లువ)గా వచ్చినందు వల్లను పొదటూరి కాలువ మొగాళాన మడుగు బెట్టి

1. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 45.

2. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 50.

3. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 50.

కాలువను నీళ్లు పోంక కార్తికాన చల్లిన మడి యెండిపోతూ ఉండగా ఆ యూరి రెడ్డి కరణాలు యీ వూరికి వచ్చి రేంగుల చేవుకు ఉత్తరాన నుంచి అంటంట ఉభ్భలో ఉత్తరపువారను సంకెపల్లె త్రోవకు తూర్పునంగా మొగాళం పుట్టించుకోవలెను; ఇందుకు మీాకు మా ఊరి పొలములోనుంచి మీా యూరి పొలంలోనికి అణుకువకిగా మాన్యం చూపెము. అని యిక్కడ రెడ్డి కరణాలను అడిగితే వీరు మందలించిన వివరం. మీారు కొత్తగా కాలువ మొగాళం తొవ్వుకోవద్దు; మీా పొలం మేము వల్లము అని తొవ్వనియ్యక పోయిరి. గనక, పొద్దటూరి వారు తాడిపర్తికి పోయి మా సూరి వెంకన్నతో తెల్పుకొనిరి. అప్పటికి యీ యూరు కరూరు సముతులో నుండెను, పొద్దటూరు జంబులమడుగు, సమతు కింద ఉండెను. ఈ రెండు సమతులకు తరపుదారుంను ఆయనే కనుక యీ యూరికి వచ్చి రెడ్డి కరణాలను వెంటబెట్టుకొని, కాలువ తొవ్వవలసిన తావు చూచి కాలువ తొవ్వుకోనిమ్మని యీ యూరి వారితో మందలించితే వీరు మందలించిన వివరం. మా ఎరిమడి చెరిచే నిమిత్తమేగాని, యీ కాలువ వారికి వైశాఖానికి పసికే రాదు. ఒఘు(క) ఫలానకుగాను, మామడి శానా చెడిపోతూ యున్నదని తెలియుచెప్పితే ప్రభువు చక్కగా పోయెను; పోనీయక తమ యూరికి వెంటబెట్టుకొని పోయి ఆ ప్రొద్దుప్రొద్దటూరిలో ఆయనకు చాలా భంగ పోయితే, ఆ రాత్రి నలుగురు బంట్రోతులను యీ యూరికి వచ్చి భీమరాజుగారి బెణకయ్యను, తిప్పరాజుగారి గరుడయ్యను, బసవరాజుగారి తిరువెంగళను, బసిరెడ్డి టాకయ...పొద్దటూరికి అంపితే వెంకన్న పిలిపించి సంగిన ఫలం నష్టం అవుతున్నది కాలువ తొవ్వుకోనీయక తీరదు అని ప్రభువు అనెను. అప్పుడు అప్పగుంట్రెడ్డి నాగిరెడ్డి వెంకటరెడ్డి, సిద్ధవట్టం వెంగన్న యల్లమరాజు మొదలయినవారు, యీ యూరివారికి ఉడగరలు యిచ్చి తమ యూరి పొలం చాయవాగున ఉండే పొలిమేర రాతికి తూర్పు దండుదోవకు ఉత్తరం చేసు యిద్దుము. ఇందుకు దక్షిణం నల్లగుండ్లలో యుండే రాతి ఛాయకు చేను నలుతూము కుంచెడు, ఈ అర్ధం కుంచెడు, చేనును మీా యూరి పొలంలోనికి అణుకువ యిస్తిమి. అని

తమ పేరట లిఖితం ఆచంద్రార్కస్థాయిగా అనుభవించమని యిచ్చి ఆ యేంటికి ఆరువరహాలు యిచ్చి కాలువ తోవ్వ్యకుని, కార్తికం ఫల పర్చుకొని వైశాఖానకు ముట్టజేటి మొగాళమే చేసికొని సిద్ధార్థిని చేను పద్దెనిమిది మూరె ఘు(గ)డను కొలచి మేరె వేసియిచ్చిరి. ఇదిగాక బుక్క పట్ణం నృసింహ్వా తాతాచార్యులు మూలమళ్లకు తూర్పు నేలలో తోవ్వ్యిన కాల్వకు యిచ్చిన చేను యినుక ఒన్నెంగ ఆగ్నేయానవుండే పాలిచెర రాతికి తూర్పున గొరల తెరువుకు నందెచేను, యిద్దుం యిచ్చి లిఖితం వ్రాసి యిచ్చిరి గనుక.....యీ యినుక చేను, అణుకువ ఆయెను, అప్పటినుంచి యిక్కడివారే సాగుబడి చేసికొని సుఖాన అనుభ విస్తున్నారు. అని బెణకయ్య వ్రాసిన ప్రకారం ఈ వూరు బొందల దిన్నె యను, యర్రగుడి, చామలూరు, కొప్పోలు, పొద్దటూరు మొదలయిన గ్రామాలకు పడ కాణియాచికర్త అని యేసిన(?) శాసనం అంకాబత్తుని గారి సింగరి మలిచిన శాసనం శ్రీ జేయును.

ఈ శాసనానకు ప్రక్కను వ్రాసి వుండేది.

మన్మథ సంవత్సర చైత్ర బ॥ ౧౦ లు శ్రీమన్మహానాయంకా చార్యులైన పెదపోతు...

గ్రామంకోట వాకిట దిగువ పడివుండే రాతికి అంత్యభాగం అక్షరాలు శిథిలమై పోయియుండేది.

శ్రీరామా॥ శుభమస్తు॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౮ అగునేటి దుర్ముఖినామ సంవత్సర భాద్రపద శు॥ ౧౦ లు గుత్తి సరకారుకు చెల్లె పరగణే కదూరుకింది సుకుమంచి పల్లె పారుపత్య రెడ్డికరణాలు సాలెవారు కడప చినయెర్రయ నారా యణ మొదలయిన వారికి సాలెరికం కూర్చి కొత్తగా పేట కట్టె నిమిత్తం యిచ్చిన కౌలు. మొగవాండ్ల పెద్ద మగ్గం ౧ కి గ ౧౫౦ అర మగ్గం ౧ కి గ ౦౫౩ లెఖను, క్రయ ఖడ్డాయాలు విరాళాలు, బల వంతంచేసి వేసేది లేదు. అని యిచ్చిన కౌలు. ఇందుకు తప్పి యెవ్వరు

వేధ చేస్తున్నారో వాని నోటా (ఇక్కడ నాలుగు పంక్తుల అక్షరాలు చితక కొట్టినారు, గనుక అగపడలేదు.)

గ్రామానికి పడమర సుకుమంచిపల్లె పొలం తాడిపర్తి తా॥ మాజే బొందల దిన్నె పొలిమేర సందున పుట్టబండకు వ్రాసియుండేది.*

ఈ బండకే సమీపంగా పుట్టబండకు, తెనుగు పద్యాలు వ్రాసి యున్నవి. రాయి మధ్యమధ్య పెట్లులేచి యున్నవి.

శ్రీనరసింహదేవుని విశేషకృతిగ రచింయించ నేర్తునో।
మానవనాథులార నను మక్కువ జేయుచు ఆదరించుండీ।
మానితవెన్నినామకుల మాన్యుడ భీమయమంత్రి పుత్రుడగ।
నూనిభశంకరాంబ సుకుమారుడనే బెణకాఖ్య సత్కవిన్ ॥ శ్రీ ॥

రాగగరిమ తెరిగి రహిమీరపదములు।
పాడనేర్తు ద్విపద పద్య ఫణితి।
తెలిసి చదువనేర్తు ధీమంతు లౌనన।
పేర్మి భీమయార్య బెణక కవిని॥

శ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౧ అగు ప్రమాది సంవత్సర...

ఈ బండవద్దనే రెండో పుట్టుబండకు వుండేది.

శ్రీశాలివాహన శకవరుషంబులు ౧౫౭౧ అగునేటి వికృతి నామ సంవత్సరం వరకు గండికోట పెమ్మసాని చిన తిమ్మానాయుడు యేలుతూవుండగాను గోలకొండ నుంచి నవాబువచ్చి కోటసాధించి కట్టుకొనెను. నందన సంవత్సరాన యీ ఊరు కోడూరు సమ్మతు క్రింద పడెను, అప్పుడు సేకచందాచేస్తూయుండెను ; ఆ వెనుక మహామ్మదు రజా చేసెను ; ఆ వెనుక గాజీమీర చేసెను ; నవాబువారు గండికోట సాధించిన తర్వాత గుత్తి, గుఱ్రము కొండ, కంచి, వందవాసి, చంగలపట్టు ఆరికాడు, ప్రళయకావేరి, మైలాపురి, చెన్నపట్టం మొదలయిన దేశ

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 64.

ములు సాధించెను గనుక, తూర్పు సముద్రం పర్యంతం గోలకొండ క్రింద చెల్లెను. ఆనాడే విజాపూరానసుంచి ఖానుఖానావచ్చి పెనుగొండ, వేలూరు, చెంజి, ఆరణి, బుసు(బసువా)పట్ణం, వేలూరు మొదలయిన ప్రదేశములు సాధించెను తదనంతరం అక్షయసంవత్సరాన ఢిల్లీశ్వరుడు వచ్చి గోలకొండ, విజయపురం సాధించి, హిమసేతు పర్యంతం యేకచ్ఛత్రాధీశ్వరుండయి యేలెను. పార్థివ సంవత్సరం పర్యంతం పూర్వం గోలకొండ దేశం కుతుపశాహా వారిది. విజాపురం దేశం మొదుల శాహావారిది.

౬౩. కిష్టేపట్టి మవుజే యెర్రగుడి గ్రామాన నుండే శాసనములు. గ్రామానికి దక్షిణం ఆంజనేయుల దేవాలయం యెదుట నిల్వరాతి శాసన.*

చంద్రుడు. దీపస్తంభము. సూర్యుడు.

ఈ గ్రామానికి యీశాన్యం సామీప్యమున కపిలెవాగు బావి వద్ద ఉండే దిగువరాతికి శాసనము.*

గ్రామానికి ఉత్తరం అరపరుగు దూరమున యీ గ్రామం పొలి మేర కున్నా చామలూరి పొలిమేరసంకున నిల్వరాతికి ప్రాచీన హళే కన్నడ అక్షరాల శాసనం:

2. See Gandikota-durgam Kaifiyat, p. 49-50.

1. See Gaṇḍikōṭa durgam Kaifiyat, p. 64.

౬౮. జంబులమడుగు తాలూకాలో కిష్టేపట్టిలో కొన్ని గ్రామములలో వుండే శిలాశాసనాలు. జంబులమడుగు తాలూకే మవుంజే దేవగుడిలో యుండే శాసనములయొక్క నకళ్లు ౬౦ కి వహీ; దేవాలయం గర్భగుడి యెదుట గుఱ్రపు ప్రతిమలు వేసి వున్న రాతిపైన వ్రాసివుండే శాసనము.*

---

See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 11-12.

దీనికి ఉత్తరం శాసనము.*

దేవాలయానకు వెలుపటి దక్షిణపువైపున ప్రాకారం లోతట్టున వున్న శాసనము.

సూర్యుడు. డమరుకము. తెంగళ నామము. చంద్రుడు.

అవిఘ్నమస్తు । శ్రీతలకంటి దేవ్యైనమః ॥

యస్యా దేవ్యాః ప్రసాదేన, ప్రజాః సంపత్ప్రదో ముదా ।
తళకంటీశ్వరీం వందే తాం చంద్రార్క కళా ధరాం ॥

లోకానుపాలన విధౌ పురుషః పురాణః ।
శక్రాదిభి ర్మునివరై రుపసేవ్యమానః ।
ఆ సీత్ప్రధానపురుషాఖిల వృద్ధ సేవ్యం ।
సాక్షాత్స్వయం జగతి బుక్క వసుంధరేశః ॥

తస్యాహితక్షత్రియ పంక్తజాత ।
సందోహ సంతాన సుధాకరస్య ।
పుత్రోభవ ద్దానగుణాభిశాలీ ।
శ్రీ హరియ్యణపః సంశ్రితకల్పభూజః ॥

తస్యాత్మజో హరియ్యణపభూమిభర్తుః ।
శ్రీమానభూ ద్బుక్కణనామధేయః ।
యస్మిన్ సుజాతే సురభూసురేంద్రా ।
స్తుష్టాబభూవు స్తుహినాద్రిధైర్యే ॥

యస్మిన్ఛ్వాభ్రసతి మధ్యలోక మధికం శ్రీహరియ్యణపక్ష్మాపతి
...పుణ్యాసంచయఫలే శ్రీబుక్కభూపాలకే ।
కీర్తిక్షాళిత సర్వభూమిఫలకే వర్ణాశ్రమాణాంస్థితి ।
వ్యక్తాచిత్రవతీ విభాతిసతతం దర్పోద్ధకోహార్యతా ॥

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 12.

శాకాబ్దే గిన్ని ఖ వహ్ని చంద్రకలితే శ్రీదుర్మతే వత్సరే।
మాసేభాద్రపదే శితేపక్షకే రుద్రాఖ్యా దివసే।
శుభేభృగుసుతఖ్యా తేచ వారే[1] రథో।
శ్రీమద్బుక్కణ భూభుజాహారి హరక్షోణీశ సత్సూనునా॥
శ్రీతలకంఠేశ్వరి పాదభక్తినిరతో।
బారికబీజయోగ్యా సాసార్వకాలం సుఖదాస్తుతస్మై।
శ్రీబుక్కభూపా.. ...జాయపాయా।
త్పంకజనంభవాది విబుధస్తోమార్చితాంఘ్రిద్వయే।
భూమాహార్యపభూమిపాలతనయం శ్రీబుక్కభూపాలకం।
......భూపమాళి విలసన్మాణిక్య।
నిర్యత్ప్రభా కాసారాంచితపాదపంకజయుగం।
శ్రీతల్లికంఠేశ్వరీ విశ్వేశ్వరేణ కలినా.........
శాసనంజయాంత...ఆదరిణనులప...తవహి...మయుజమానం॥
మంగళం మహాశ్రీశ్రీశ్రీ.

౭౮. దేవాలయంలో మంటపం యెదుట శాసనం.[2]

సూర్యుడు. డమరుకము. నామం. (శూలం?). చంద్రుడు.

రంగమంటపంలో నైరృతి భాగం స్తంభానికి దక్షిణ భాగమందు శాసనము.[3]

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౨౦ అగునేటి విళంబి సంవత్సర కార్తిక బ॥ ౭ సో॥ తలకంటిదేవి పూజారి బైరజియ్యల నాగజియ్య మనమడు, సంవత్సరాలక అప్పనాంకు, తనకు జరగక పోయి తోడిపాళ్ల వారి సమ్మతి లేక జీడల మల్లజియ్యలకును తన పాలివృత్తిలో నాను వరస దినములలో నాను గూడాను మూడవ పాటును క్రయముగాను అమ్ముకొన్నది.

1. Friday, 20th August, A.D. 1391.
2. See Gaṇḍikōṭa durgam Kaifiyat, p. 23.
3. See Gaṇḍikōṭa-durgam-Kaifiyat, p. 16.

వరహానిరూకలు మాడలు ౨౪ టికిన్ని వారిక్ని యీ తోడి నాలుగు పాళ్లవాండ్లుకు...అండ వేతటి పోటి తళ్లె ప్రోలేపి యిరుగురు గూడను, యినుమడి పడిప్రవృత్తి విడిపంచినది ల్ ౪౮ రూకలున్న నలుభయి యెనిమిది రూకలున్న ప్రయము తగినది ల్ ౨౪ రూకులున్న ఉభయం ౭౨ నన్నాల్గు రూకలు, మాడలు ౧౮ పదునెనిమిది బడి నడిపించిరి. ముందరొక నాటికిన్ని నాగె కొమకు బయ్యాడు యీ వృత్తి తన దని పెనగరాదు. దీనికి సాక్షులు తళజియ్యారు. పత్రానమున్న తబసులు అంతమట్టు వారున్ను, యీ రెండు చెరంగుల వారికిన్ని, పైండి ముడి, ముడిపించిన కాంపు సాక్షులు: రంపులూరు మల్లినాయుడు, మారమరెడ్డి చెంగమరెడ్డి, బోడ్రెడ్డి దేసయని దతుంపు జక్కయపల్లయ అగ్నిమూర్తి సుజానందమయ, ౧౮ మాడలును పట్టెన్ని యిమలూరి చక్రవర్తిని, యింతవట్టంవారు కూడాను రెండు చెరంగువారిని మీదను వృత్తులకున్ను బెనంగగాదని ఒకళ్లకొకళ్ల పెనంగేరని లంబదేవమహా రాజుమీదను, అన తప్పులుంగాను, యీ పైడినూపి పెట్టినవాడు, బాగోజుతిప్ప పయిండిముడిచిన వాండు తిప్పసాని భైరన.....దహాతల జియలాను పంపారూడి పత్రం.

ఈ స్తంభానికి తూప్పతట్టు శాసనం.

స్వస్తి శ్రీమతు శకవషంబులు ౧౨౦౨ అగునేటి విక్రమ సంవత్సర అధిక శ్రావణ శు॥ ౧౫ లు సోమవారం ప్రోవజియ్యాల ముఖ్యమయిన ఆయుక్షువాడపాలికి, యీ నల్లతల జియ్యాలు యిచ్చిన బాసాపత్రము: తన పాలివృత్తి కొరుపురిసీమ, అందు దేవిని పూజింపంగలవాడు గాని, తూముగట్టుచేను మడి యేమిగలను...పాలని అడుగరాదు, తన వరుస పూజించి అయ్యాగి సీమం జొరరాదు, దీనికిన్ని సాక్షులు: రెల జియ్యాలు, జోగి జియ్యాలు మల్లె, పల్లలపాటి నాగజియ్యాలు, రాయంబిను వీరి యుభయాన మతమున వ్రాసినది కరణము నిత్యానందులా, పంచా రూఢి పత్రం. కురుమరి వత్తికి తగిలిన పైడి అడుప లేక మీారే కుడుం డని విడిచిన వృత్తి.

ఈ స్తంభానికి ఉత్తరపు తట్టు శాసనము:

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౨౦ అగునేటి విళంబి సంవత్సర శార్తి బ॥ ౧ లు సో॥ తలకంటి దేవిపూజారివల్ల తల్లజియ్యాలు జయ మన్మథ సంవత్సరాలు కరువునుండి జరగక పోయి తోడి పాళ్ల వారి సమ్మతి లేక నూకజియ్యల వంకగారికిని తన పాలిలో సగం వృత్తిని వరుసను దిన ములు ఆరున్ను కూడానున్ను క్రయముగాను అమ్మికున్న వరహాని రూకలు, రూకలు మాడ్లు ల్ ౪౫ి టికిన్ని వారికిన్ని యిక తోటి పాళ్లవారు ప్రోలజియ్యల తలజియ్యాను, సిద్ధజియ్యాలు తళయాను, ప్రోనరాబళరేను, యీ నలువురంగూడాను, వారికిన్ని యిక యినుమడి వెట్టి, వృత్తివిడి పించినది, రొఖం ల్ ౪౯౦ తొంబై రూకలున్ను వ్రయము తగిలినవి ల్ ౧౨ రూకలున్ను ఉభయము నూట రెండు రూకల సన్నాల్గు రూకల మాడ్లు ౨౫౮౦ యరువదేను మాడ్లు ఆరపెట్టి విడిపించిరి. మీాదను యీా అర పాలి వృత్తికిన్ని తళజియ్యాలకుం బెనంగరాదు. దీనికి సాక్షులు : కురు మరి తబసి వెనయ, మానుజినదేవర, పూజారి శుభకీర్తిన్ని దొడపాటి తికజియ్యలు, నీలజియ్యాలును, దొండపాటి దేవజియ్యాలును చౌడూరినాగ జియ్యల రాయక బయనాను, రాయజియ్యల దేడేను, నంద్యాల నీల యాను, పల్లలపాటి బ్రహ్మజియ్యలూను, కనియంపాటి బటుజియ్యాలు, మల్లజియ్యాలు, వీరు మడకబ్రహ్మేశబండ్లూను, అవుబళుని ప్రాలు పంచాసాటి పత్రం.

ఈ స్తంభానికి ఉత్తరం స్తంభంపై ఉత్తరపు తట్టు శాసనం.

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౭౩ అగునేటి పింగళ సంవత్సరం ఆషాఢ బ॥ ౧౧ లు గురువారం ఎఱదేవజియ్యల కొడుకులు తళజియ్యా కున్ను, ఆ కామజియ్యలకున్ను ఆ తొంబంటంను పోలజియ్యాలు యిచ్చిన శాసనము. తళకంటిదేవిగుడిని మావరుస దినములలోను ఒక దిన మునను కాండి...టంకాలు ౪౯ నలుపై తొమ్మిది టంకాలకు తెగను అమ్మితిమి : సాక్షులు కంచెమరెడ్డి, నలతళజియలాను, మోరజియ్యాలు, మల్లసిరివాళ, నల్లసాని వీర.

ఈ స్తంభానికి తూర్పుతట్టునను కొన్ని అక్షరములు శిథిలమై పోయినవి. వృత్తి రుజనాను, విజనాను, బిడ్డబిడ్డ తరముస సరిగ్గాను పంచి కుడుచువారు, వీరల ఉభయం అనుమతిని నాగయుబళాని వ్రాలు.

దీనికి తూర్పు స్తంభంపైన దక్షిణపుతట్టు శాసనం.

౮౦. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౧౬ అగునేటి భావ సంవత్సర కార్తీక బ॥ ౧౨ లు తళకంటి దేవి స్థానాపతులు బాచజియ్యలు పాలయూన, ఆ కొండురాళ్లను లంకజియ్యలు కొడుకు మల్లుజియ్యలు ౩ యేకస్థులైన లందళజియ్యల కొడుకులు పెద భైరజియ్యలు అప్పజియ్యల పిన భైరజియ్యలు, పత్రము పెదతళు కొడుకు వ్రాసెను జగికి యిచ్చిన శాసన క్రమమెట్లన్నను. ఆబాచజియ్యలకు తళకంటి దేవిస్థానంలోని పాలు దినాలు ౧౦... నెము నలందులవారిచేత బుచ్చుకొ...ప్రతివె ౧౪ క్రయంరాయ...రాయజట ౬౦౦ కున్ను... దినాలున్ను......వారికి ఆచంద్రార్కస్థాయిగాను భూమిన్ని, ఆకాశ మున్ను కులపర్వతాలున్ను, సముద్రాలున్ను కలంత కాలమున్ను చెల్లేటట్టుగాను యిస్తిమి. వారు వారితోటి మర్యాదను చన్నటువంటి గృహారామక్షేత్రాలున్ను ధనధాన్యాలున్ను జీవధనము సహితముగాను వచ్చినటువంటి పాలుపంపు దేవుని పూజించి అనుభవించువారు, ఈ శాసనానకు ప్రతిశాసనాలు వ్రాసి యున్నవి. ఈ శాసనానకు సాక్షులు రామేశ్వరమునకు స్థానాపతులున్ను దండ్లూరి చెంగమరెడ్డి కొడుకు పోతిరెడ్డిన్ని తళకంటి దేవిగుడి స్థానాపతి మెలందళ జియ్యలాన్ను వీరందర భయ మానుసుకాలాను...కరణం భీమరాజు నరహరి కుమారుడు బయ్యన్న వ్రాలు.

ఈ స్తంభానికి తూర్పుతట్టున ఉండే శాసనం.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౧౬ అగునేటి భావ సంవత్సర కార్తీక బ॥ ౧౨ లు ఉభయ నాలగౌరమ్మాను ఆ కొమ్మరాజు భీమన్నాను, బయ్యన తమ్ముడు విజయనాను జనులు

ముగ్గురు యేకస్థులై నలదళజియ్యన కొడుకులు పెద్దభైర అయివుజియలు పిన్నభైరు పాపతళ్లాపద్దళ్లు కొడుకు పాపుడికున్ను యిచ్చిన శాసన క్రమ మెట్లున్నను.

తళకంటి దేవస్థానముంకు మాకు చెల్లేటి నాల్గు దినాలవల్లాను బయ్యన పాలిలోను దినం ౧ కి క్రయం రాయజట ౧౩౫ నూటముప్పది యైదు టంకాలున్ను నలందళవారి చేతను బుచ్చుకొని యిచ్చినది దినం ౧ కి చెల్లేది యటువంటి స్థానం వారి తోటిపాలువచ్చిన గృహారామ క్షేత్రములు, ధనధాన్యాలు, పంచలోహాలు, జీవధనం సహితంగాను దేవివరుస పూజచేసి అనుభవించువాండు, ఆనలందళంవారి ఇదిని చంద్రాదిత్యాలు గలంతకాలమున్ను భూమి ఆకాశము గలంతకాలమున్ను కుల పర్వతాలు సముద్రాలు గలంతకాలమున్ను చెల్లేటట్టుగా యిస్తిమి. విజయనకు చెల్లే వరస దినానకు ఒచ్చి(వచ్చిన) వృత్తిచేను రాయజట ౧౦౦(నూరు టంకాలు) క్రయంగాను, ఆచంద్రార్కస్థాయిగాను యిస్తిమి. ఈ చేనికి యేమి వెచ్చం వ్రయం గలిగినాను, విజయన అచ్చువాడు. ఈ శాసనానకు ప్రతిరాగి శాసనాలు వేసియున్నది. ఈ శాసనానకు సాక్షులు రామేశ్వరం స్థానం వారున్ను, చెంగమరెడ్డి కొడుకు దండ్లూరి, పోతిరెడ్డి మెల్లజియ్యలాను, మారజియ్యల తెళుకాళుభైరున్ను వు(ఉ)భయులు అనుమతానను దానవులపాటి స్థళకరణం భీమరాజు నరహరి కొడుకు భీమన్న వ్రాలు.

ఈ రాతికి ఉత్తరపుతట్టు శాసనము-

సాధారణ సంవత్సర మార్గశిర శు। ౭ లు గురువారమున మార జియ్యల, చెన్నజియ్యల, పాలజియ్యల, నల్లతళ్లు, బాచజియ్యల మెర తళజియ్యల తనపాలి దేవిగుడివృత్తి తన కొడుకులు తళ్ళెకు ౨ పాళ్లున్ను తల్లుకు ఒక పాలున్ను ఆచంద్రార్కస్థాయిగాను, పంచికునువగలవారు. తల్లెను విడిచి తొలగెననక కూడనేసి కుడిచేది. వీరి వుభయానుమతి సంగబత్తుని వ్రాలు. తళ్ళెన్ను, మల్లూన్ను వాసి పో...అప్పుడు

తళి రెండుపాళ్లున్ను మల్లకు పాలున్ను యీా క్రమమున కాలకాలం బిడ్డ బిడ్డలు తరం పంచి కుడుచువారు.

దీనికి దక్షిణం వైపు స్తంభానకు వు(ఉ)త్తరపు తట్టు శాసనం.

నందన సంవత్సర మాఘ బ॥ ౮ మం॥ శ్రీమతు బయ్యనకున్ను, అతని తమ్ముడు విజయనకున్ను తళకంటిదేవి అందు చాచజియ్యపాలి జమలోని పాలు రామేశ్వరం స్థానంవారు చేసిన నిర్ణయం: పోలమ్మకు మూడు దినాలున్ను ఉభయన విజయనకు నాలుగు దినాలున్ను కుడుచు వారు. ఈ నాలుగు దినాలున్ను ఉభయనకు రెండు దినాలున్ను పంచి కుడుచువారు. ఉభయన గడించిన వృత్తిభూమి విజయనకు సరిగాపంచి కుడుచువారు. ఈ శాసనానకు సాక్షులు.

వల్లూరి గంగిరెడ్డిన్ని, వెలివోలిమల్లెల బైరెడ్డిన్ని, దానవుల పాటిన ర్రెళ్ల బైరెడ్డి చౌడూరి నాగి సెట్టిన్ని పీరుల వుభయాడుమతదిం పర్వత రాజు వ్రాలు.

మంటపములో ఉత్తరపుతట్టు గోడదరి స్తంభానకు శాసనము.

౮౪. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శకవరుషంబులు ౧౨౭౭ అగు నేటి కాళయుక్తి సంవత్సర కార్తీక శు॥ ౧౩ గు॥ విజయన తన పాలు దినాలు ౨కి నలతళ జియ్యలకు ట ౪౦ టంకాలకు క్రయం యిచ్చితిని తోటి పాళ్లవారు యెవరు......[1]

దేవాలయానకు వుత్తరం వైపు శాసనము.

స్వస్తి శకవరుషంబులు ౧౨౩౧ అగునేటి సౌమ్య సంవత్సర ఫాల్గుణ శు॥ ౭ గురువారం [2]శ్రీమతు సకల సేనాధిపతి మహారాయ పట్ట సాహిణి సోమయ నాయంకులు ఘండికోటను పృథివీరాజ్యం సేయు

1. See for summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p p. 17-18.

2. Date Irregular. Week day does not tally The Lunar eclipse referred to took place on Sat. 14th Feb. A.D. 1310.

చుండగాను నాగరాజు మల్లయ తమ్ముంను, హరియపరాజు కొడుకు బయ్యన, చిన్నయ మార్గ సుంకం అరయుచున్నండి సోమగ్రహణ కాలమప్పుడు సాహిణిగారికి పుణ్యముగాను, తళకంటి దేవతకున్ను, అఖండ దీపానకు వు(ఉ)భయ మార్గసుంకం వల్ల నెలకు రెండేసి రూకల లెఖను యిస్తిమి. ఎవ్వరైనా యీ నియోగము అరసినవారు యీ ధర్మము తప్పకుండా చెల్లించి పుణ్యము అగునట్టు ఆచంద్రార్కస్థాయిగాను యిస్తిమి ఈ ధర్మం యెవ్వరు చెల్లింపకున్నను గంగకర్తను కపిలెంబొడిచిన పాపాన బోవువారు.

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

మంగళమహా శ్రీ.

దీనికి పశ్చిమం శాసనం.[1]

సూర్యుడు. ఉడుకు. చిన్నకూలం. చంద్రుడు.

దీనికి తూర్పుతట్టు శాసనము.[2]

సూర్యుడు. ఉడుకు. నామం. చంద్రుడు.

దేవాలయమునకు దక్షిణ వైపున పగిలిన నేలను పడియున్న శాసనము[3]

ఈ దేవాలయం యెదుట సుంకెసల చెట్టు క్రింద యిసుకలో పూడియున్నటువంటి శాసనము.[4]

సూర్యుడు. చక్రం. నామం. చంద్రుడు.

---

1. See Gaṇḍikōṭa-durgam Kayfiyat, p. 31.
2. See, Gaṇḍikōṭa-durgam Kaifiyat. p.p 32.31.
3. See, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p.p. 39.40.
4. See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 48.

శుభమస్తు: స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౬౭ అగునేటి పరాభవ సంవత్సర నిజ ఆషాఢ బ॥ ౧౧ లు

శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య ఉభయ వేదాంత ప్రవర్తకులైన కందాళ్ల అప్పళాచార్యులయ్యవార్లగారికి శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివ దేవమహారాయలు పృథివీ రాజ్యం సేయుచుండగాను, శ్రీమన్మహామండలేశ్వర కొండ్రాజు చిన తిమ్మయ దేవమహారాజులు అనంతమ్ములైన దండములు సమర్పించి యిచ్చిన భూదాన శాసనం.

మాకు సదాశివదేవ మహారాయలు పాలించిన చెన్నూరి సీమ గ్రామం తూగట్లపల్లె ధారాపూర్వకంగాను సమర్పిస్తిమి. ఆ గ్రామాన్ను కలిగిన నిధినిక్షేప జలపాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్యంబయిన అష్ట భోగ తేజస్వామ్యములులోను గాను ఆచంద్రార్కస్థాయిగాను అనుభ వించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ జేయు.

ఈ దేవాలయం గోపురం కుప్ప అడుగున బండకు వేశి(సి)వున్న శాసనము.*

అంతు దేవగుడిలో శాసనములు ౧౯

నువుజె సుగుమంచి పల్లెకు తూర్పు అగస్త్యదేవాలయం యెదుట నిలిపి యున్న శాసనం.

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p.p. 69-70.

ఈ వైపు కిందకొన్ని అక్షరములు శిథిలమైనవి.

ఈ వైపు కిందకొన్ని అక్షరములు శిథిలమైనవి.

౯౩. ఈ రాతికి తూర్పు తట్టు వ్రాసి యుండేది.

ఈవల అక్షరములు ఖిలమై పోయినవి. శ్రీ కృష్ణరాజాధిపా ॥.

మవుజె పెదదండ్లూరిం గ్రామాన నుండే శిలాశాసనములు.

ఈ గ్రామానికి నైరుతి భాగం పరువుదూరాన కన్నెతీర్థం వద్ద యీశ్వరుని దేవాలయం యెదుట మామిడి చెట్టుక్రింద పగిలిన రెండు తునకలు పైన ఖిలపడిన శాసనము.

[illegible]
[illegible]
[illegible]

[illegible]
[illegible]

౯౪. వూ(ఊ)రికి దక్షిణం జువ్విమాని దగ్గిర నున్న శాసనం.*

వరదరాజస్వామి దేవాలయం దక్షిణ భాగమునందు గోడన వుండే శాసనము.

౯౫ గుండెళ చెరువులోను, నీలకంఠ దేవరమడి దండమడి ౧౧౪౦ ఉభయం చేను మడి ౧౩|౧ ముత్తుమును అయిదు ముంతలు శిఖరం పెట్టె అందుకు పెటితిమి గాన మీా పుత్రపౌత్ర పారంపర్యముగాను, ఆచంద్రార్కస్థాయిగాను, అనుభవించుకొని బ్రతికేది. ఇందుకు యెవరు గన్క.........

ఈ రాతిపైనను యింతే వ్రాసినది కాని, యెవరు యిచ్చినదిన్ని శక సంవత్సరములు వ్రాసియుండ లేదు.

ఊరికి పూర్వము యేటిగడ్డను ఉన్న శాసనము.

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 15-16.

రామేశ్వరంకాలువ తలపర్యకాలు, తలకట్టు గాయి, పెద దండ్లగారి నీలకంఠేశ్వరుని దేవళం పడమటి మూలకు ఇన్నూట పది బారల పొడవున, రామేశ్వరం కాలువ, తలపర్రె పోట్లమర్తి విలాసం బారను.

ఈ శాసనం మీద శకవరుషంబులు వ్రాసియుండ లేదు.

౯౬. మజరా సున్నపరాళ్లపల్లె కోటకు ఉత్తరపు గోడకు వాకిలివద్ద శాసనము.

సూర్యుడు. చంద్రుడు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౬౮౪ అగునేటి చిత్రభాను సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు వా॥ సైదు అబ్దుల్ రసూలు మయాణాసాహేబులవారి పెండ్లాము మదీనాఖాన కట్టించిన కోట, చందాభాయీ నిలిచి కట్టించిన కోట.

మవుజె గొరిగెనూరు గ్రామమున నుండే శిలాశాసనములు.

గ్రామములో బురుజుకు తూర్పుతట్టు ఉండే శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౬౮౨ అగునేటి విక్రమనామ సంవత్సర కార్తీక బ॥ ౨ సో॥ రా॥ బాలవెంకట రెడ్డిగారి కమామీసున నారాయణరెడ్డి కొమారుడు తిమ్మారెడ్డి, గొంగడి వరిది రెడ్డి కొమారుడు కంచిరెడ్డి, చిన నారాయణరెడ్డిగారి సుంకి రెడ్డి, తిమ్మారెడ్డి కుమారుడు రామిరెడ్డిగారు కట్టించిన బురుజు.

వూ(ఊ)రికి పశ్చిమం పాతపాడున కేశవనాథుని దేవాలయం యెదుటను గరుడస్తంభం పైన వ్రాసి యుండే శాసనము.

౯౭. నందన సంవత్సరం చైత్ర బ॥ ౧౦ లు ఆదివారమునాడు గొరిగెనూరి కేశవనాథునికి ముక్కముళ్లమల్లరెడ్డి కుమారుడు తిప్పిరెడ్డి వేయించిన దివ్య(దివ్వె?) గంభము.

మవుజె కన్నెలూరుగ్రామమునకు తూర్పున పోతురాజు దేవాలయమునకు యెదుట దిగువ పడియున్న శాసనం. శిథిలం. *

సూర్యుడు. చంద్రుడు.

౯౮. గ్రామానకు దక్షిణ భాగమందు హనుమంతదేవ్రుని దేవాలయముయెదుట రెండు తునకలు అయి పడియున్న శాసనముయొక్క నకలు.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౪౪౩ కు సరి అగునేటి విషు సంవత్సర ఆషాఢ శు॥ ౧౧ లు ఇరువైనాలుగు దొమ్మరి కులాల వారి పంపునాను మీసరగండని...పాపరాజు కన్నెలూరి తిరువేంగళనాథుడు రామయదేవునకు యిచ్చిన ధర్మశాసనము.

కన్నెలూరిగ్రామాన, తమ కులాల వారికి నడుస్తూ వుండే పన్ను యిరువైనాలుగు కులాల వారికి పుణ్యంగాను ధారపోసితిమి ; గాన మహోత్సవాలు ఆచంద్రార్కస్థాయిగాను, జరుగవలెనని యిస్తిమిగాన యీ ధర్మం యిరువైనాలుగు కులాల వారి తల్లిదండ్రులకు పుణ్యంగాను, ఆచంద్రార్కస్థాయిగాను, యిచ్చిన ధర్మశాసనము. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను తము తల్లిదండ్రుల గంగ(యు)తను వధియించిన పాపాన బోవువారు.

మవుజె కసుబా జంబులమడుగు కోటకు ప్రథమ సింహద్వారము, లోతట్టున, యెడమ బాజూన ఉన్న నిలువ పాతిన శాసనం.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౪౪ అగునేటి సర్వజిత్తు సంవత్సర కార్త్తిక బ॥ ౩౦ జంబులమడుక మాధవస్వామికి, రామయలంగారికి, ౨౪ కులాల వారి పంపునాను మీసరగండని కొమారుడు గిరి రెడ్డిన్ని, సూరపరాజున్ను, యిచ్చిన ధర్మశాసనం. జంబులమడుకగ్రామాన తమ కులాలవారికి నడిచే

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 38.

వర్తనలు, దశమి, అమావాస్యానున్నూ, శా(సే)వలు సాగించేనియ్యు; సూర్యగ్రహణ పుణ్యకాలమునందు, సహిరణ్యోదకదానధారాపూర్వకముగాను యిరువైనాలుగు కులాలవారికి పుణ్యంగాను, ధారపోసి యిస్తిమి. గాన మహోత్సవాలు ఆచంద్రార్కస్థాయిగాను, అవధరించును. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను పీసువిడిసి అడిగినాను తమ తల్లితండ్రుల చంపిన పాపాన బోగలరు, గంగకర(ఋ)తను, గోబ్రాహ్మణ్ని వధించిన పాపాన బోవువారు. దేవరదేశాల్కు వెలి అయినవారు; కులాలవంటి వారు కారు; తమ మానం కులాల వారి గాడిదెలు కాచే వానికి యిచ్చినవారు ; గాన పాపానకులోను గాక పుణ్యం యీడేర్చేది.

౧౦౦. ఈశాన్యం బురుజుకు ఉండే శాసనం.*

ఖర సంవత్సర ఆశ్వీజ బ॥ ౧౦ లు రాజశ్రీ ఆకునూరి నరసన్న కట్టించినది. సిరిగిరిసెట్టి పెరుమాళనాయకుడు.

ఇందుకు శకం ౧౬౩౩ అవుతున్నది.

ఆజ్ఞే(గ్నే)యం బురుజుకు వెలిభాగం వున్న ఆంజనేయ ప్రతిమవద్ది శాసనము.♦

కసుబాకు వుత్తరాన నారాపురం వెంకటేశ్వరుల దేవాలయ ప్రాకారములో ఆళ్వారుల మండప ద్వారమునకు యెడమ తట్టు ద్వారబంధానికి శాసనము.

పెఇహెఇపూత చతుర్థపోషక కృతే ఆసీన హాస్తాంజలే।
శ్రేతక్షత్రియ శేఖర స్తిరుముడిర్వ్రప్రశ్చ పెర్యాళ్ద్వయః।
తొండ ర్విప్రజమంగయాళ్విషరజో ద్వాపార పణ్యాం స్వరాట్।
దండీ భాష చతుర్థ వంశ మధురా వ్యాఖ్యానసం మాః కృతా॥

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat. p. 8.

♦ See Gaṇḍik  a-durgam Kaifiyat, p. 80.

పేటలో జుమ్మా మహాజిదులో శాసనము.

షుద్బనా మస్‌జిద్ బనా మే రహీమ్. అల్ఫ్ ఒ సద్ ఒ సీజ్ దహామ్ ౧౨౧౩ హిజరి.

౧౦౨. మవుజె చారివారివుప్పుపాడు గ్రామాన వుండే శాసనములయొక్క నకళ్లు. మూ(ఊ)రి వాకిలి ముందర హనుమంతరాయని దేవాలయం యెదుట నిలిచి యున్న శాసనము*.

(ఊ)రి వాకిలి లోతట్టు పడిన శాసనం.

శుభకృతు సంవత్సర జ్యేష్ట బ॥ ౬ లు స్వస్తిశ్రీపర్వత శ్రీ స్వయంభూ శ్రీలింగ చక్రవర్తి శ్రీ మన్మల్లిఖా(కా)ర్జున శ్రీ మన్మహాదేవ దివ్య శ్రీపాదపద్మారాధకులైన, శ్రీకైలాసం మీాది పృథ్వీ దేవా పృథ్వీ మహాత్తు ముఖ్యమయిన శ్రీఅజాతి వీరశైవ సిద్ధ భిక్షావృత్తి అయ్యవారు శ్రీ మన్మహా.........ఇ. తే వ్రాసి యున్నది.

చెన్నకేశవదేవరపెరుమాళ్లు దేవాలయం యెదుట వీథిలో పాతియున్న శాసనము.♦

దేవాలయములో గరుడస్తంభం వెనుక పగిలి పడియున్న శాసనము.

౧౦౫. శ్రీమతే రామానుజాయ నమః. శ్రీ చెన్నకేశవపెరుమాళ్లకు ఆత్రేయగోత్ర పవిత్రులయిన, శ్రీ మన్మహామండలేశ్వర నంబెల అవుబళరాజయ్యగారి పౌత్రులైన చినఅవుబళరాజులగారి పుత్రులైన చినఅవుబళేశ్వర దేవమహారాజులుంగారు ఉప్పాలపాటను దేవునికి నిత్య దీపారాధన, మూాడువేళల ఆరగింపులు...సహా కట్టడ చేసినవి వగ ౨౦ వరహాలకున్ను, చేను ఖ ౬ ఆరుపుట్ల చేనున్ను, త్రివాచకంగా, త్రికరణ

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 57.

♦ See Gandikota-durgam Kaifiyat, p. 37.

శుద్ధిగాను ఆ చంద్రార్కస్థాయిగాను, ఆచేనికి గలిగిన నిధి నిక్షేప జల పాషాణ అక్షీణ ఆగామి సిద్ధ సాధ్యంబులున్ను అనుభవించుమని సర్వ మాన్యం యిచ్చిన భూధాన ధర్మశాసనం.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

మంగళమ్ మహా శ్రీ శ్రీ శ్రీం జేయును.

శ్రీ నృసింహాయ.

౧౦౬. నోసము తాలూకా మవుజే పెదపసుపుల కోటలో వుండే మశీదులో వ్రాసి యున్న శాసనములు.

హిజరి ౧౧౪౨ మసిజిదు కట్టిన తారీఖు.

హిజరీ హజార్ యక్‌సద్ చహాల్ దో బూద్

జంశేదుఖాన్ భార్య సాహేబుజి. ఆమె ద్రవ్యంపెట్టి – మసిజీదు కట్టించినాడు.

జమిషేదుఖాను పేరు శాశ్వతం. తఅమీర్ బనా అష్రఫ్ అల్ హక్ జమ్షీద్ గిరిఫ్త జాదేదానే.

జంషేదుఖాన్ కుమారుడు జంషేదుఖాను. షుద్‌మకాన్ అహాల్ జమ్షీద్‌ఖాన్ పిసర్ జమ్షీద్‌ఖాన్.

మవుజె గుండ్లకుంట గ్రామములో వున్న శిలా శాసనముల యొక్క నకళ్లు.

చెన్నకేశ్వరుల దేవాలయంలో గరుడస్తంభం వద్ది శాసనము. *

శుభమస్తు॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౭౩ అగునేటి విరోధి కృతుసంవత్సర నిజ భాద్రపద బ॥ ౧౧ లు శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ సదాశివ దేవ మహారాయలుగారు, విజయనగరమందు వజ్ర సింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యం సేయుచుండగా శ్రీ నూరకాఫురం చెన్నునికి ఆజ్ఞాధారులైన వేముల కూరుమయ్యగారి ప్రపౌత్రులైన, చిన్నమయ్యగారి పౌత్రులైన వరదరాజులుగారి పుత్రులు చిన్నమయగారికి శ్రీ మన్మహామండలేశ్వర ఆరెవీటిబుక్కరాజులుంగారి ప్రపౌత్రులు రామరాజులుంగారి పౌత్రులు, తిమ్మరాజులుంగారి పుత్రులు పాపు తిమ్మరాజయ్య దేవ మహారాజులుంగారు సమర్పించిన భూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను, మా నాయంకరానకు చెల్లే నవ గ్రామాల గుండ్లకుంటను ధారపోసి యిచ్చిన చేను, వు(ఉ)ప్పులపాటి పొలిమేరకు తూర్పు మేడి దిన్నె పొలిమేరకు పడమట చెన్నూరి యేచు కరకముక్కల పర్వతంగాని చేను స్థళం చేను ఖ॥ ౨ అక్షరాలా యిరు ఫుట్టిన్ని యేకాదశీ పుణ్యకాలమునందు ధారపోసి యిస్తిమి. గాన నీ పుత్రపౌత్ర పారంపర్యంగాను యిస్తిమి.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దీనికి ఆజ్ఞే(జ్ఞే)య మూలనున్న శాసనము.♦

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౩ అగునేటి పరీధావిసంవత్సర మాఖ శు॥ ౧ లు శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివ దేవ మహారాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సాంబ్రా(మ్రా)జ్యము సేయుచుండగాను అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులైన ఆదిపరబ్రహ్మ

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 53.

♦ See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 53.

మైన, అనంతావతారులైన వేదాంత వేద్యులయిన గుండ్లకుంట చెన్న కేశవరాయణికి, గ్రహణ పుణ్యకాలమునందు కాస్యప గోత్రులైన విప్ర వినోది మల్లయ్యగారి ప్రపౌత్రులైన పెదవల్లభయగారి పౌత్రులైన చిన వల్లభయగారి పుత్రులైన విప్రవినోది పెదవల్లభయ్య, అనంతయ్య నల్లారయ్య మొదలయిన విప్రవినోదులు, గుండ్లకుంట శ్రీ చెన్న కేశ్వర దేవునికి ఉట్ల తిరునాళ్ళ సేయించే నిమిత్తం గుండ్లకుంట స్థళమందు వున్న మహాజనాలు మా విప్రవినోదులకు యిచ్చే పన్ను సహిరణ్యోదక దాన ధారా పూర్వకంగాను గుండ్లకుంట చెన్న కేశవపెరుమాళ్లకు ధారపోసి యిస్తిమి. శ్రీజయంతి మహోత్సవము ఉట్ల తిరునాళ్ల ఫిరంగివాని భావి దగ్గర శాసనము, ఊరికి దక్షిణమున నున్నది.

*స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౪౧ అగునేటి వికారిసంవత్సర జ్యేష్ఠ శు॥ ౨ లు శ్రీమతు సుజాయత ఆసాం ఖానే రజాఖాల్లి సాహేబుల వారి ముద్రకర్త విభూరాం సుల్తాను గారు అంబుల గురవయ కొమాళ్లు ఫిరంగిచిన్నన్న గురనయ్యగారికి యిచ్చిన బావి మాన్యం భూదాన ధర్మశాసనము. హాదిమాగాణ గండికోట సీమలో గుండ్లకుంట గ్రామంలో బావి తొవ్వి కట్టినారు గనుక ఆ గ్రామపొలంలోను ఉప్పాలపాటి పొలిమేరను చేను ఖ ౧ పుట్టెడు చేను ఈ తథాతిది పుణ్యకాలమునందు యేలినవారికి పుణ్యంగా యిచ్చి నారము గనుకను, మీా పుత్ర పౌత్ర పారం పర్యంతంగాను యిచ్చిన బావి మాన్యంభూదాన ధర్మశాసనం అంబళ్ళవోబిళిరెడ్డి కనుముక్కుల తిప్పా రెడ్డి, పొన్నరెడ్డి చన్నారెడ్డి, కాచాయెర్రసరెడ్డి, మొదలయిన కాపులు పద్మయ శేషాద్రి కరణాలు ఫిరంగి గురువయకు యిచ్చిన భూదాన శిలాశాసనము. ఈ శిలాశాసనానికి యెవ్వరు కీడు ఆచరించినాను వారణాసిలో, తమ తల్లిదండ్రిని వధియించిన పాపాన బోదురు. కాశీలో గోహత్యచేసిన పాపాన పోదురు.

చెన్న కేశవస్వామి దేవాలయములో శాసనం.*

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat. pp. 60-61.

చెన్న కేశ్వరస్వామి దేవాలయములో శాసనం.

౧౧౧. మవుజె బోడి తిప్పనపాడు గ్రామానికి పూరికి దక్షిణం పాడుబావివద్ద పాతియుండే శాసనము.[2]

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౫౯౧ అగు నేటి ప్రభవ సంవత్సర శ్రావణ బ॥ ౧౦ లు శ్రీమతు పొన్నంరెడ్డి చెన్నారెడ్డి, ఆపొట్టి పాపిరెడ్డిగారు, వేయించిన వన ధర్మశాసనము.

బోడి తిప్పన పల్లెకు దక్షిణం మేడిదిన్నె త్రోవను ఉన్న వనము క్రయానకు తీసికొని, సూర్యనారాయణార్పణముగాను వేయించిన వన ధర్మ శాసనము. పొట్టిపల్లె చెన్నుభట్లుగారికి సూర్యనారాయణార్పణము గాను రెండు చింతచెట్లు యిచ్చినారము.

౧౧౨. మవుజె చిదిపిరాళ్ల దిన్నె గ్రామానకు పూర్వభాగమందు ఈశ్వరదేవాలయం దగ్గరనున్న శాసనము.[3]

౧౧౩. మవుజే చినముడియములో నుండే శాసనముల నకలు.

వీధిలో పడియున్న శాసనము.

గ్రామానకు ఉత్తరం ఈశ్వరుని దేవాలయంలో మంటపములో క్రిందను వేసియున్న అడుగు బండశాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౩౦ విభవనామసంవత్సర మార్గశిర బ॥ ౬ లు, చినముడియం వెంకటాచలం రామతీర్థం నర్సుసంజీవిగారికి యెఱ్ఱగుంట్ల శేశాచలం సుబ్బయ్యగారు

---

1. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 64-65.

2. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 35-36.

3. See, Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 42-43.

4. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 61.

వ్రాయించి యిచ్చిన పైస్సలాతీ కాకితం సన్ ౧౨౧౮ ఫసలి. మీ గ్రామములో మాకు దశబంత్ర (దాహిణ్య) బాధ్యం కరిణీకమిరాసి పీసన్నరసాలు ఉన్నదని రాక్షస సంవత్సరం తాగాయతి, మీరు మేము వ్యాజ్యంపడి పైసలా కానందున హాజరతు చాపలేన్ (Chaplain) సాహేబులువారి తరఫున కసుబా జంబులమడుగు నారాఘురంస్వామి దేవాలయంలో రామతీర్థం నాకు మిరాసి లేదు అని ప్రమాణంచేసినట్టు అయితే ఆమిరాసి తగాదా నేను విడువగలవాడను అని సర్కారుకు ముచ్చలుకా వ్రాసియిచ్చిన తరువాత రామతీర్థాన్ని పిలిపించి ప్రమాణా నకు ఒప్పుకున్నావా అని అడిగినందున అదే ప్రకారం చేస్తానన్నానని ముచ్చలుకా వ్రాసియిచ్చె గనుక మాజీ అమలుదారు రాజశ్రీ గోవింద రాయణి వారి పేర వీరికి ప్రమాణం చేయించి పైసలాతీ చేయించమని సన్నదు సాదరు అయినందున, హాలి అములుదారు మహారాజ శ్రీ నంజప్పపంతులు తాలూకు జంబులమడుగుగారు రామతీర్థాని నన్ను సర్కారుమనిషిని రజ్జాభాయిని వెంట యిచ్చి దేవళానకు పంపించి నందున రామతీర్థం పెన్నలో మునిగి పూలదండ వేసుక దేవళంలో చొచ్చి నేను అడిగిన మాటలు చెప్పి లోగడ అమీన్ సాహేబు కమామీసున తాము వ్రాసి యిచ్చిన పమాఖ్య కాకిదం అబద్ధం అని చించివేసి, నీకు మిరాసిలేదు, అని వెళ్లినాడె గనుక అందుకు ఉత్త రోత్తరా ఆమిరాశికి మీతో తగాదా చేయగల వాడను కాను అని సర్కా రులో పైసలాతీ కాకిదెం వ్రాసి యిచ్చిన తరువాత సీరసైసైజా మమ్ముల తగాదా చేయకుండా వ్రాసి యిమ్మని అడిగితిరి గనుక ఉత్తరోత్తరా ఆమిరాసి తగాదా చాయగలవాడను కాను. ఈమిరాసి నిమిత్తం లోగడ రాక్షస సంవత్సరం తాగాయతి మీరు మేము వ్యాజ్యపడి తాళ్లమాహ్వారు, నోసం వగైరా పంచాయితీ కాకిత పత్రాలు యెక్కడ నున్నా రద్దు. అటువలె వుండక సానీను హాలు, తగాదా చేసినట్టు అయితే సర్కారులో ఒప్పించిన జరుమానా యిచ్చి సర్కారువారు చేసిన నసీయ్యతుకు హాజరుగా ఉండగల వాడను. ఇటని నాఖుద్దు రాజీన ఒప్పి వ్రాసియిచ్చిన పైసలాతీ కాకిదెం. ఇందుకు సాక్షులు కాదరా

బాదు కరణం చిన్నయ్య వ్రాలు, కోటపాటి కరణం వీరభద్రయ్య వ్రాలు, దిగువకలువటాల కరణం క్రి(కృ)ష్ణమ్మవ్రాలు. చినముడియం పలకల గూడూరు సగబాలి కరణాలు యేడు వీసాల భాగర్లు వెల్లాలు వ్రాలు, వెంకట క్రి(కృ)ష్ణమ్మ వ్రాలు, సరాబు వీరన్న వ్రాసిన శిలాశాసనము. కమ్మర వీరన్న వ్రాలు. స్వహస్తం యర్రగుంట్ల శేషయ్య వ్రాలు ఈ సుబ్బయ వ్రాలు.

ఇందుకు ఉత్తరం నువుజె బలపగూడూరు గ్రామములోనున్న శాసనాలు.

౧. గ్రామానాకు పూర్వభాగమందు, దేవాలయములో నాగుల కట్టను ఉన్న పగిలిపోయిన శాసనము.*

శ్రీమన్మహా మండలేశ్వర సోమల్రాజు తిమ్మయ్య దేవమహారాజులు నంబి తిప్పరాజుకు యిచ్చిన ధర్మశాసనము. బందిబోయలు గూడూరు పెరుమాళ్లకు పుష్పాల పేరులు బెట్టను పుష్పాలవారితోట యిరసం తోట సర్వమాన్యముగా ఆచంద్రార్కస్థాయిగా, అష్టభోగ తేజస్వామ్యముగా యిస్తిమిగాన, ఆ తోటలో పువ్వుల చెట్లు వేసికొనేది. ఈ తోటలో దొరువు తొవ్వి యాతము కట్టేనిమిత్తం యేకాపు చేసినాను, సర్వమాన్యంగా యిస్తిమి; గాన వ్యవసాయం చేయించుక బ్రతికేది. ఈ తోట యే రాజు అయినాను చెల్లించేది, గాని చెల్లనియ్యక యేరాజు పుచ్చుకున్నాను, తమ తల్లిదండ్రిని చంపిన పాపాన బోదురు. మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ.

సదరు దేవాలయంలో జమ్మి చెట్టు క్రింద నున్న శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ, సమస్తభువనాశ్రయ, శ్రీపృథివీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వరం పరమభట్టారకం సత్యాశ్రయకుల తిలకం చాళుక్యాభరణం............దేవరు పుత్రపౌత్రాభివృద్ధి

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 44.

పృథివీప్రవర్ధమాన మాచంద్రార్క తారకం, సల్లుత్తమిరె, కల్యాణద నెలెవీడి సుఖసంకథా వినోదదిం రాజ్యంగెయ్యుత్తమిర్దు, తత్పాదపద్మోపజీవి స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర......మత్తరు భూమిమాన్యం.

ఇచ్చినట్లుగా యున్నది. ఇక్కడ రాయి పగిలి పోయినది.

ఇందుకు దక్షిణం మవుజె గరిశలూరు గ్రామములో శాసనము.

౧. గ్రామానకు ఈశాన్య భాగమందు, పాడుదేవళం స్థళమందు, దేవాలయం వెనుకతట్టు నిలు(వ) పాతియున్న శాసనము.[1]

మవుజె నెమళ్లదిన్నె గ్రామములో నున్న శాసనములు.

గ్రామమునకు తూర్పు విష్ణు దేవాలయములో నున్న శాసనములు.

గర్భగుడి యెదుట పాతియున్న శాసనము.[2]

ఇందుకు దక్షిణంగాను ఉండే శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౮౦ అగునేటి కాళయుక్తి సంవత్సర పుష్య శు॥ ౨ లు శ్రీమన్మహారాజ, రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీ వీరప్రతాప శ్రీవీరసదాశివ దేవమహారాయలుగారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ సాంబ్రా(మ్రా)రాజ్యము సేయుచుండగాను, శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమల రాజయ్య దేవమహారాజులుంగారు, అవుకు సీమలోని నెమళ్లదిన్న మంగలవోజులుకు యిచ్చిన ధర్మశాసన క్రమమెట్లన్నను, సదాశివ మహారాయలుగారు విజయనగరమందు మంగల కొండోజుకు రాయసింహాసనానకు చెల్లే సీమలో నల్లాను మంగళవోజరికాలు పెట్టే పన్ను, కానికె, కట్నం, హాసువెచ్చము, దొమ్మరిపన్ను,

1. See, Gaṇḍikōṭa-durgam Kaifiyat pp 38-39.
2. See Gaṇḍikōṭa-durgam Kaifiyat. p. 32.
3. See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 61.

సిద్ధాయం, వెట్టివేములు. సర్వమాన్యములుగాను ధర్మశాసనము యిచ్చిన ప్రకారాన మాకుచెల్లే అవుకుసీమలోని, నమలిదిన్న మంగలవోజులకు, కానికె, కట్నం, వెట్టివేములు, దొమ్మరి పన్ను, సిద్ధాయం పన్ను సర్వమాన్యములుగాను యిస్తిమి. ఆచంద్రార్క స్థాయిగాను యిస్తిమి. ఇందుకు యెవ్వరు తప్పికొన్నాను, తమ తల్లి దండ్రుల వారణాసిలో కుతి కలుకోసిన పాపాన బోదురు. గంగావతిలోను గంగిగోవును చంపిన పాపాన పోమను(రు). శునకచర్మం(మాం)సమున్ను సురయున్ను సేవించిన పాపాన పోదురు.

ఇందుకు ఉత్తరం వైపున నున్న శాసనము.[1]

ఊరిబయట రాజువోలుకు దక్షిణం చలివెందల బండ దగ్గర వున్న శాసనము.[2]

మవుజె ఉప్పలూరు గ్రామానకు పూర్వభాగమందు హనుమ(ంతరాయ)ల దేవాలయం ముంగర నిలువపాతిన శాసనమునకు నకలు.[3]

మవుజే పెదముడియంలో ఉండే శాసనాలు.

శుభమస్తు. ఆనంద సంవత్సర నిజ జ్యేష్ఠ శు॥ ౫ లు, శ్రీమద్యజనాది షట్కర్మనిరతులైన, బ్రాహ్మలముడియం స్థితా శేషవిద్వన్మహాజనాలున్ను, నడ్ల కాళహస్తిగారి సిద్దాబత్తుడు, యాగల్లు పాపయ్యగారి జంగమ మహాదేవడు, జగ్గయ్యగారి అయ్యప్ప, అగసాల శివలింగయ్యగారు, జనులు అయిదుగురికిన్ని, చాగలమర్రి బత్తునిగారి పెద తిమ్మయ్య చిన తిమ్మయ్యగారలు జనులు యిద్దరింటికిన్ని యిచ్చిన శాసన నకలు.క్రమమెట్లన్ననుః-శ్రీ నృసింహ్వ దేవుని శిఖరం కట్టే నిమిత్తం మాకు మాన్యం పెట్టిన చేను ఖ ౦౪౦ పందుముకున్ను వివరము. పాత కందు

1. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 68.

2. See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 44-45.

3 See, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 33.

కూరి చెరువుకు పడమర చవుట చేని స్థళం క్రితం రఘునాయకులకు చెల్లి వచ్చే మాన్యం చేను ఖ ౦౪౦ న్ను యీ చేనికి దక్షిణాన యీ చేని పొందున, మాన్యం బ॥ ౦౧౦ యేదుమున్ను ఉత్తరాన యీ చేని పొందున మాన్యం ఖ ౦౧౦ యేదుమున్ను అంతు చేను ప్రుట్టెడింటిలో రఘునాయకులకు మాన్యం దక్షిణాన యీ చేను స్థానం వారిని ఒప్పించిన మాన్యం ఖ ౦౪ పందుముగాక ఉత్తరాన కడను పండుంచేనున్ను మీకు సర్వ మాన్యముగాను యిస్తిమి గనుక యీ పందుము చేను మీ పుత్ర పౌత్ర పారంపర్యంగాను, ఆచంద్రార్కస్థాయిగాను, అనుభవిస్తున్న సుఖాన బ్రతికేది. మీరు కట్టిన శిఖరం కాలాంతరగాన శిథిలం అయును అయెనా సున్నం రస వర్గములు మేము తెస్తేము. మీరు పదిలం చేయగలవారు. ఈ ప్రకారాన, నూట యెనమండ్రు మహాజనాల పాదాలాన, తప్పక నడుపగలవారం. మా మాటనమ్మి యీ చేను అనుభవిస్తున్న సుఖాన బ్రతికేది. అని యిచ్చిన స్థితాశేష విద్వన్మహా జనాలున్ను సమ్మతించి వేయించిన శిలాశాసనము.

౧౨౫. వీరభద్రుని దేవాలయానకు వాకిలికి పశ్చిమం పాతియున్న శాసనము.*

శుభమస్తు. స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౩ అగునేటి విరోధికృతు సంవత్సర శ్రావణ బ॥ ౮ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీవీరప్రతాప, శ్రీవీరసదాశివ దేవ మహారాయులుంగారు, విద్యానగరమందు, రత్నసింహాసనారూఢులై పృథివీ సాంబ్రా(మ్రా)జ్యము చేయుచుండగాను, గండికోటరాజ్యములోని రేనాటి సీమలోని త్రిలోచన పురానకు ప్రతినామమైన, బ్రాహ్మముడియం యజనాది షట్కర్మ నిరతులైన, వాక్యప్రమాణజ్ఞులైన, సర్వగుణ సంపన్నులైన నూటయెనమండ్రు స్థితాశేష విద్వన్మహాజనాలకున్ను శ్రీత్రిలోచనపురప్రతిగ్రహాలబ్ధమైన, బ్రాహ్మలముడియం అనే సర్వమాన్య అగ్రహారమందు శ్రీసోమేశ్వరదేవునికి, శ్రీ నృసింహదేవుని

* See, for summary Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 62.

కిన్ని లైనచి...అయ్యవారి...వీరముష్టి భూపయ్య కుమారుడు చిన బసువయ్యధారపోసి యిచ్చిన ధర్మశాసనం క్రమమెట్లన్నను. స్వస్తి సమస్త నిజ నామాంక మాలికా ప్రశస్త సహితులైన శ్రీమద్గణేశ్వర దేవ గౌరీశ్వరదేవర దివ్య శ్రీపాదపద్మారాధకు లయిన అయ్యవలి (అయ్యావళి) ముఖ్యమైన చాలుమూల, సమస్త పెక్కండ్ర సమ్మతి నిన్ని సకలపురాంతక (రాతన) సమ్మతిని బ్రాహ్మలముడియం గ్రామమందు, తమ్ముళ్లు మొదలయినవారు అచ్చే వీరముష్టిపన్ను ముడియం సోమేశ్వరదేవుని దీపారాధన, సకల పురాంత(రాతను)లకు పుణ్యంగాను, జుంజునుగా సునారసమున్ను, ముష్టి పలకానున్న పట్టె వీరముష్టులకు పుణ్యంగాను, యీ సంవత్సరం శ్రావణ బ॥ ౮ లు ఆదివారంనాడు శ్రీకృష్ణజయంతి పుణ్యకాలమందు, శ్రీ సోమేశ్వరదేవర సన్నిధిని సకల వీరముష్టులకును పుణ్యంగాను, యీ ధర్మం ఆచంద్రార్కస్థాయిగాను యీ అగ్రహారమందు వుండే స్థితాశేష విద్వన్మహాజనాల ముందరను త్రికరణ శుద్ధిగాను, త్రివాచకముగాను..., శ్రీ లక్ష్మీనృసింహ్వ దేవాలయంలో నుండే శాసనము పగిలినది.*

ఇదిగాక హాళెకన్నడ శాసనం నాలుగో నంబరు వహిలో వ్రాసియున్నది.

౧౨౨. మవుజే పాలూరి గ్రామములో నుండే శాసనాలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౯౦ అగు నేటి విరోధినామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మండనాయకులైన, పాలూరి శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామికి ముడియం పెద్దరెడ్డి కొమారుడు, రామిరెడ్డి కట్టించిన కల్యాణ మంటపము.

శివాలయములో నున్న శాసనము.

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 9

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౬ అగునేటి క్రోధి సంవత్సర జ్యేష్ట శు॥ ౫ లు పాలూరి అగస్తీశ్వరునికి, ఉప్పాటూరి వెంకట కొమారుడు రామిరెడ్డి, కరణం నాగరాజు, కుమారుడు గోపాళయ్య, కరమల వీరబత్తుని కొమారుడు బోడిగాడు కట్టించిన దేవాలయము.

మంటపములో నున్న శాసనము.

కామెలమ్మ బావి దగ్గిరనున్న శాసనము.*

కాసెలింగాబత్తుని చేత చేయించిన బావి.

౧౨౮. చన్నకేశ్వరస్వామి దేవాలయములో నున్న శాసనము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౬ అగునేటి క్రోధినామ సంవత్సర శ్రావణ శు॥ ౫ లు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకు లయిన పాలూరి చన్నకేశవ పెరుమాళ్లకు, కోణుదలు కృష్ణారెడ్డి కుమారుడు తిమ్మారెడ్డి, తిమ్మారెడ్డి కొమారుడు నాగిరెడ్డిగారు కట్టించిన ముఖమంటపము. శ్రీ శ్రీ శ్రీ చేయును.

జగతికట్ట దగ్గిర అగస్తీశ్వరుని దేవాలయమునకు దక్షిణ భాగాన నున్న శాసనము.♦

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౩౨ అగునేటి ప్రమోదూత నామ సంవత్సర కార్తీక శు॥ ౧౨ సోమవారం శ్రీమతు నర్రావుల తిప్పానాయనిగారు కాశవల్లభోజుకు యిచ్చిన ధర్మ శాసనము.

మాకు కృష్ణారాయలు పాలించిన నాయంకరము పాలూరి పొలానను మీకు మాన్యంపెట్టిన చేను ఖ ०॥०. ఈ పాలూరి అగస్తీశ్వరుని దేవర.........

* See, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 71.

♦ See, for summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 80.

రాతికి రెండో తట్టున.

అష్టభోగ తేజ స్వామ్యములును అనుభవించేది. ఆచంద్రార్క-స్థాయిగాను అనుభవించేది. ఈ ధర్మానకు యెవరు తప్పినాను తమ తల్లిని తండ్రిని చంపిన పాపాన పోదురు.

ఈ రాతికి మూడో వైపున, యిచ్చిన చేనులోను...కు క్రయం యిస్తిమి ఖ ౦|౦ అక్షరాలా చేను యేదుము.

అంతు వహీ ౧ కి శాసనములు ౬౮.

౧౩౯. కిల్లేపట్టి మవుజే చామలూరులో నుండే శాసనములు.

గ్రామములో చెన్నకేశవస్వామి దేవళం వద్ద ఉన్న శాసనం నిల్వరాతికి అక్షరాలు శిథిలమై ఉన్నవి.*

విప్రవినోదులనే బ్రాహ్మలు తమకు యీ గ్రామస్తులు యిచ్చే వర్తన చెన్నకేశవస్వామికి సమర్పించి, శాసనము వేయించినారు.

సూర్యుడు. చంద్రుడు. శంఖం. చక్రం.

శుభమస్తు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు......అగునేటి......సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీవీరప్రతాప, శ్రీసదాశివ దేవమహారాయలు పృథివీ సామ్రాజ్యం సేయుచునుండగాను గుత్తిరాజ్యానకు చెల్లే వీరనరసింహ్వపురానకు ప్రతినామమైన చామలూరి, అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండైన శ్రీ చెన్నకేశవ దేవుని...సంక్రాంతి...యిచ్చిన ధర్మశాసన మెట్లన్నను. మా విప్రవినోదులకు, గుత్తిరాజ్యాన చెల్లే చామలూరి గ్రామానకు ప్రతి నామమైన వీరనరసింహ్వపురం అగ్రహారీకులు మాకు యిచ్చే వర్తన......దేవరకు దీపారాధనకు మా విప్రవినోదులకు స్వదారిటి(?) భోగాలు......సహిరణ్యోదక దానధారాపూర్వకం

* See for a summary Gaṇḍikōṭa-durgam Kaifiyat p 53

గాను, మా పుత్ర పౌత్రపారంపర్యంగాను సమర్పించిన ధర్మశాసనం. ఇందుకు మాకులంవారు యెవ్వరు తప్పినా వారు మా కులానికి వెలివారు. స్వమాతృగమనం చేసినవారు...లిన్ని ఈ ధర్మానకు తప్పిన వారు. బ్రహ్మహత్యాది దోషాలు చేసినవారు, శునకమాంసం తిన్నవాండు(రు). గనక మా విప్రవినోదుల స్వాములు.

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

౧౩౩. కిబ్లేపట్టి మవుజే కొప్పోలు శ్రోత్రియం గ్రామానికి వెలుపట తూర్పున లక్ష్మీనారసింహ ఆంజనేయ దేవాలయముకు యెదురుగా నిల్వరాతికి ఉండే శాసనము.*

ఇక్కడ రెండుపంక్తులు అక్షరాలు శిథిలమైనవి.
ఈ రాతికి రెండో పక్కను వుండేది.

సూర్యుడు. లింగం. చంద్రుడు.

చంద్రార్కస్థాఇగాను అనభవించ నవధ

అందుగల పాడుకూప తవ్వినస్యాఫల(?)అందులోగల నిధినిక్షేప జలపాషాణ అక్షీణరాగామి(అక్షీణ్యాగామి)సిద్ధసాధ్యంబు లనెడి అష్టభోగ తేజస్వామ్యములున్ను.

ఇక్కడ అయిదు పంక్తులు అక్షరాలు శిథిలమై పోయినది.

౧౩౨. కిబ్లేపట్టి మవుజే తాళ్ల పొద్దుటూరిలో నుండే శాసనాలు.

గ్రామములో ఆంజనేయుల దేవాలయం వద్ద నిల్వురాతికి హళేకన్నడ అక్షరాలసంబంధం శాసనము.♦

సూర్యుడు. నిలువవృషభం. చంద్రుడు

* See, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 28.
♦ See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 19.

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౪౪ అగునేంటి దుందుభి సంవత్సర మాఘ శు॥ ౧ లు శనివారమునాండు, స్వస్తి యమధనదమహీపాల మౌలి మాలాలాలిత, లలిత చరణారవింద, సకలదిగంతావేల్లిత కీర్తి వల్లీప్రరోహణ కంర, నందగిరినాథ, రక్షితానాథ, బలికులాదిత్య, పరాక్రమవిక్రమాదిత్య, అజమయూరసింధురధ్వజకులాన్వయ, విదిత సకలశాస్త్రాన్వయ, ఒరయూరిపురవరాధీశ్వర, చతుర్విధకామినీ జనరతీశ్వర, దానవినోద, సముదిత సత్పాత్ర, కాస్యపగోత్ర, దినకరకుల కుశేశిసివికాసనప్రభాకర, సుగుణమణిగణరత్నాకర, సేవణసేనా దుగ్ధాంబోనిధానపరిమథన లబ్ధలక్ష్మీగదక్షణభుజమందర, విలాసవిభవ భోగపురందర, నిసితాసికులిశనిపతనశకలిత జోగులకుమారమహామహీ ధర, ప్రతిబలదావపావకధారాధర, విశదతరనయనచంద్రికాపరిజన చిత్తకైరవ, రణరంగభైరవ, ఒరవు(ట)ర భీమని శిరఃకందుకోత్పానట, సంశోభిత తత్సంతతిలతాప్రరోహ, వరాశ్వారోహ,గండపెండార గంగయ సాహిణీసర్వస్వబందికార, మామనంకకార, విరోధిమండళికకాలదండ, చలమర్తిగండ, ఏకాంగవీర, ధర్మావతార, మూరురాయ అసురనారాయణ, ప్రతాపతపనోత్తరాయణ, సంగడిదమండళీకరథకావ, సతతాభ్యర్చిత భూదేవ, మండళీకబసవశంకర, ప్రణతాభయంకర, అధికతర ప్రతాపరాయ దిగస్థాపన, (గంగ?)యదేవచోళమహారాజులు తమ తండ్రి అల్లుగంగరాజు తమ తల్లి గంగాదేవింగారి పేరను, గంగసముద్రము అని తటాక ప్రతిష్ఠ సేసి నిలిపిన శాసనము. మంగళమహా శ్రీశ్రీశ్రీ.

తనదంష్ట్రతుద వసుంధరయెల్ల దాల్చి పెంపొందిన వేలుపుంబంది యొండె,
వీపునందాకదెస విశ్వవిశ్వంభరం గరమర్థిందాల్చిన కమఠుండొండె,
వెలయుంగం దనవేయిుదలలలో నెక్కట నిలదలకొన్న ఫణీంద్రుండొండె,
పాదభాగమున భూభాగమంతయును వహించిన హేమనగేంద్రుండొండె,
నీవయొండెంకాక నిఖిలధరాభారవహనకేలిసలుపు మహితభుజుండు
జగమునందుగలండె జగతాపిగంగ విక్రమవిహంగదీప్తికలితగంగ ॥

ఇలజగతాపి ఖడ్గమున నీల్గిన వీరుని రంభవుచ్చుకొం
దలంచినం దూర్పుదిక్కున ఘి(ఘృ)తాచి గిసుక్కునందుమ్మె నంతలో

పలంజను దెంచె వానికులభామినియగ్నిపథంబునంద ని
ష్ఫలతకు రంభయు న్వెలరువారిన నవ్విరి తోడికామినులు ॥

గురుమరణోచితంబయిన కోపమునన్ జమదగ్నిజుండుము
న్నిరువదియొక్కమాఱు ధరణీశులనెల్లను జంపి యమ్మహా
పురుషుండు మర్త్యలోకమునబుట్టి వధింపగబాపమంచు వి
స్తరముగదోలె గాక జగతాడి(పి ?)దలంచిన నాండచంపడే ॥

పన్నితురంగమంబునకుం బక్కెరవెట్టినవార్త హేరిచే
విన్నభయంబునంగలంగె వీసరనాండునుజక్రగోర్థమును
మన్నియవడ్డె(తె*)క్కెలియు మంథ్యనవెంగికళింగలాదిగా
నిన్నియు నొక్కనాం డవిసె నేఱువభీమనృపాలుదాడికిని ॥

తురగచర్మంబున గరమొప్పనెరికింగాబసరించిదాననమునుంగువెట్టి
తెలుపెక్కంగరవోవబెళగినపునుకమించినవెండికోరగాంజేతంబట్టి
ఏనుకతలలలో నెసగినముత్తియంబులగుంకుమాక్షతంబులుగంబోసి
వేతాళడాకినిభూతంబులారమీకును ముంజికం బనికుడువంజెప్పి

రొయిక పిశావధూటిదానుత్సహించె తాయజగతాపగంగ భూరమణుండాజి
నమరబెండ్లి కొడుకుమల్లావనీశుజెలంగిసురకాంతతోంబెడ్లి సేయునపుడు ॥

ఈ శాసనానకు తూర్పుగంగమ్మతోట సీలితోటలో పూర్వాం సంతసాగుతూవుండగాను సంతబసవన్నవుండే నిలువురాతికి శాసనం.

తాడపరతి రామేశ్వరుని దీపారాధనకు 3 రూకలు తాడపరతి...

ఇక్కడ అక్షరాలు పోయినది(వి).

ఇందుకు దక్షిణం రామేశ్వరదేవుని దేవాలయానికి తూరుపు నిలువురాతికి ప్రాచీన హళెకన్నడ అక్షరాలు శిథిలమైవుండేది.

కిట్లెపటి మాజె రేగడిపల్లెకు ఆగ్నేయం చేనులో దిగువ రాతి...
గండికోటమార్గానకు వుత్తరం.*

సూర్యుడు. చక్రం. శంఖం. చంద్రుడు.

౧౩౭. కిట్లేపట్టి మవుజె బుక్కపట్టణములోనుండే శాసనములు.♦

సూర్యుడు. నిలువువృషభం. చంద్రుడు.

గ్రామానికి దక్షిణం యీ గ్రామం ముచ్చుమరి పొలిమేరను నిలువురాతికి ఉండే హళేకన్నడ అక్షరాల శాసనం.

స్వస్తిసకలజగత్రయాభివందిత సురాసురాధీశ పరమమహేశ్వర ప్రతిహారీకృతమహాబలికుళోద్భవ కృష్ణధ్వజ విరాజత్ప్రసాదిత పటహా మథన నందగిరినాథ పరమేశ్వర.........

ఈ రాతికి రెండోపక్కన వుండేది.

స్వస్తిశ్రీ విజయాదిత్యుని కొడుకు(కు)ళగ్గప్పరాజు వుత్తరాయన సంక్రాంతినిమిత్యంబున బుళియమనాయకునికి గుడుపకుంటలు ధారా పూర్వకంబు నేసి పుఱయమయు...ళువక్రి...

ఈ రాతికి మూడో ప్రక్కను వుండేది.

సూర్యుడు. చంద్రుడు

లొమడ పుళియమయు విళువరికి లొమడదెవురసక్రి(?)గ్రామానికి ఆగ్నేయం రాగితోటల కాల్వవద్ద దిగువ వుండేది.

---

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p.p. 30,31.

♦ See Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 24.

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషం బులు ౧౪౫౨ అగునేటి విరోధి సంవత్సర కార్తీక శు॥ ౧౫ లు సోమ గ్రహణ పుణ్యకాలమందు...దక్షిణ ద్వారమైన బుక్కపట్నం వీరభద్ర దేవునికి నందాదీప ఆరగింపు నైవేద్యాలకున్ను స్వస్తిసమస్త ప్రశస్త సహితులైన యాభయ్యారు దేశాల చాలుమూల సమస్త పెక్కండ్రు లున్ను యిచ్చిన ధర్మశాసనం. బుక్కపట్టణం హేరాది నడచెడి కండ్ల (కంట్లా) నకు క ౨ న్ను, మిరియాల పెరికెకు క ౨ న్ను, బెల్లంపెరికెకు క ౨ న్ను, అనుములపెరికెకు క ౨ న్ను, జొన్నల పెరికెకు క ౧ న్ను, పోకలపెరికెకు క ౨ న్ను కాయలపెరికెకు క ౨ న్ను కాలినడవ క. యీ మర్యాదను నడుపంగలవారము. పచ్చడాలకంట్లానకు పాతికె లెక్కనున్ను నడుపంగలవారము ; గంపకుకూర పిడికెడేసి ఇచ్చేటట్టు పెట్ట కట్టచేసి దండం సమర్పించిన ధర్మశాసనం ఈ ధర్మానకు యెవ్వరు తప్పి యియ్యకున్నాను దెవరు...వెలి.కాశిలోను గంగకు అర్ధను గోబ్రాహ్మణాలను వధించిన పాపాన బోవువారు.

ఇక్కడగ్రామానికి తూర్పు యేటివొడ్డున రాగితోట వద్ద ప్రాచీన హాళెకన్నడ అక్షరాలు శిథిలమై వుండేది.

[illegible]

కిల్లెపట్టి మాజె ఫకీరుపల్లెకు వుత్తరం యీ గ్రామానికిన్ని బుక్కపట్నం పొలిమేర సందున దిగువరాతికి వుండెది.

విజయభారతిపురానకు వుత్తర పొలిమెర.

౧౩౯. కిల్లేపట్టి మవుజె బెడదూరు పొలంలో వుండే శాసనాలు.

కోటకు దక్షిణం వీరభద్ర దేవాలయం యెదుట నిలువు రాతికి శాసనం.*

చంద్రుడు. లింగం. సూర్యుడు.

శుభమస్తు.

నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే॥

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౧ అగునేటి సౌమ్యసంవత్సర చైత్ర బ॥ ౧౦ లు, శ్రీన్మమహారాజాధి రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివ దేవమహారాయలు విద్యా నగరమందు పృథివీ సామ్రాజ్యం సేయుచుండగాను పృథివికి మూల స్థానమైన, శ్రీగిరి మల్లికార్జున దేవుని ఆనతిని, స్వస్తి సమస్త భువన ప్రశస్త సహితులైన శ్రీమతు సిద్ధ భిక్షావృత్తి అయ్యవారి మొదలను ఒడయుల భక్తుల సమ్మతిని, ఛప్పన్న దేశాల సకల పురాంతకాలు (పురాతనులు) గండికోటకు చెల్లే బెడదూరికి ప్రతినామమైన నరసింహ్వా పురం అగ్రహారం వీరేశ్వరుని గవిరామలింగాని అమృతపళ్లకున్ను, మాసమహోత్సవాలకున్ను, దే(ద్యా)వా పృథివీ మహాతు పుణ్యం గాను, సూర్యగ్రహణపుణ్యకాలమందు యీశ్వరుని సన్నిధిని సిద్ధవటం గుంట వీరయకుమారుడు, కొమారలింగయను, కూటగూళ్ల రాచయాను కనివటిపల్లె గుంటివీరయాను, కాటివీరయ కొమారుడు వీరయాను, వీరు మొదలయిన, సకల పురాంతతు(ను)లున్ను, నరసింహ్వాపుర ఒడ యుల భక్తులు పురాంతకులకు అచ్చుకవచ్చే వీరముష్టిపన్నుయేందు ౧ కి పగ 3 అక్షరాలా మూడు మాళ్లున్ను, యియ్యకట్టడ సేసి, నరసింహ్వా పురం వీరేశ్వరుని గవిరామేశ్వరుని అమృత పళ్ళకును, మాసమహో త్సవాలకున్ను, రాచవీటి వీరేశ్వరునిని, సకలపురాంతకులకు, పుణ్యము గాను ధారవోసి యిచ్చిన ధర్మశాసనము. ఈ శాసనం ఆచంద్రార్క-

* See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat. p. 51.

స్థాయిగాను, గ్రామములో మహాజనాలు ఒడయులభక్తులు నడుపంగల వారు. ఈ ధర్మానకు యెవ్వరు తప్పినాను, శివద్రోహి, లింగద్రోహి, గురు ద్రోహి. ఈ గ్రామాన పురాంతకులు వచ్చి జుంటకాసె వేసినాను దేవర (అ)దేశాలకును విభూతిరుద్రాక్షకు తప్పినవారు అని యిచ్చిన ధర్మశాస నము. ఈ శాసనం యిచ్చిన పురాంతకు ఒప్పం రాచవీటి వీరేశ్వరుండు॥ శ్రీశ్రీశ్రీ.

ఇందుకు తూర్పు చెన్నకేశవుని దేవాలయములో గర్భగుడిలో పైన దూలం రాతికి వుండే శాసనము.

స్వస్తిశ్రీ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౮ అగు నేటి పరాభవ సంవత్సర మార్గశిర బ॥ ౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర, శ్రీవీర ప్రతాప, శ్రీ సదాశివ దేవమహారాయలు విద్యానగర మంను, రత్న సింహాసనారూఢులై, పృథివీ సామ్రాజ్యం సేయుచుండగాను దొమ్మరి సిరిగిరి చెనాదేవిగారి మనుమడు గోపరాజును, పెసల తిప్పరాజు కొడుకు చిన గంగరాజును, మూరితి పెదఅరుసయ కొడుకు తిమ్మరాజును జనం 3 రున్ను గండికోట సీమలోను, నంద్యాల తిమ్మరాజుగారు సదాశివ దేవమహారాయలచేతను, శాసనం పుచ్చుకొని, తమ తండ్రిగారి పేర సేసిన బెడదూరికి ప్రతినామమైన, నరసింహాపురము అగ్రహారమందు, కొండమీది తిరువేంగళనాథునికిన్ని, చెన్నకేశవునికిన్ని మహాలింగాని కిన్ని యీ మూడు దేవాలయాలకున్ను దొమ్మరి పన్ను స(మ)ంగాను(?) ధారబోసి, మా యిరువై నాలుగు కులాల పీశ(?) వారికి పుణ్యముగాను ఛప్పన్న దేశాలు చరియించే యిరువయి నాలుగు కులాల దొమ్మర్ల వారి పుత్ర పౌత్రపారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను, యీ మూడు దేవస్థానాలకు యిచ్చిన ధర్మశాసనము. ఈ గ్రామమందు అడకాడివేసి దున్నిన కాపులును ఫలంపెట్టడానకు యేడు ౧కి వగ ౧ యీ అక్షరాలాను యెనిమిది వరహాలున్ను యియ్యకట్టడ చేస్తిమి. ఇందుకు యెవరు వక్రించినాను, దొమర్లగాడి దలకాచినవాడు

* See for a summary, Gaṇḍikōṭa-durgam Kaifiyat, p. 49.

తమ మానం యిచ్చువారని,...సేయించి నేము ధారవోస్తిమి. ఇరువయి తొమ్మిది పంచకాల కాపులు యాదోటి...ముగా ధారవోసియిస్తిమి. ఈ ధర్మానకు మా యిరువై నాలుగు కులాల దొమ్మర్లలో యెవరు తప్పినాను, వారు దేవర దేశాలకు వెలి కులం వారికి వెలి. ఇందుకు తప్పిన వాండ్లు తమకు చెప్పులు గుట్టిన మాదిగ వానికి మానం యిచ్చినవారు.

గ్రామమునకు తూర్పు కొండ దిగువ వుండే రాతికి శాసనం.*

గ్రామానికి యీశాన్యం అరపవుపు కొండకు ఉత్తరం బురుజుపల్లె యేటూరి పొలిమేర సందున చేనిలో దిగువరాతికి ప్రాచీన హాళె కన్నడ అక్షరాలు.

* See Gaṇḍikōṭa-durgam Kaifiyat, pp. 26-27.

౦ı౦. కరణీకం వృత్తి ౦ı౦.

ఈ ప్రకారం గణసంఖ్యావృత్తులు పద్నాలుగు నిర్ణయంచేసి రామపట్టాభిషేక మహోత్సవకాలమందు శ్రీరామచంద్రార్పణముగా సహిరణ్యోదకధారా పూర్వకముగాను యిస్తిమి; గనుక యీ క్రిమాన మీ పుత్ర పౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగా అనుభవించి సుఖాన వుండవలెను.

రెండోసన్నదు వెలుగచర్ల రెడ్డికరణాల పేర వ్రాయించి యిచ్చినది.

మట్లి తిరువెంగళనాథ రాజు

విరోధినామసంవత్సర వైశాఖ బ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులుగారు వెలగచర్లరెడ్డి కరణాలకు పుత్తెంచిన ప్రయోజనం; తర్వాత మీ గ్రామంలో పెరుమాళ్ల రెడ్డికుంట ఖిలమైపోయినది. అది ప్రబలం చేసుకొనేము అని బ్రాహ్మలు వచ్చి మనవిచేసికొన్నంతలో మహారాజ శ్రీ నాయ్నగారు అగ్రహారానకు సన్నదు సెలవు యిచ్చియుండిరి గదా అందుకు వారు యిక్కడ వృత్తుల నిర్ణయం చేసుకొని దానపత్రం వ్రాయించుక పోయిన ప్రకారానకు కొందరు నిభావు అయ్యేటందులకు బలం చాలక తమ వృత్తులు గ్రామంలో కాపురం ఉన్నవారికి యిచ్చి తాము చెరువుకు యిచ్చిన వరహాలు తిరుగా రాబట్టుకొని పోయిరి; గనుక గ్రామంలో కాపురంఉన్న వారు అందరు సముఖానకు వచ్చి అగ్రహారానకు మంగమాంబాపుర మనే నామధేయం నిష్కర్ష చేసుకొని అందుకు ఆలూరి వెంకటపతిని యజమానుణ్ని యేర్పరచుకొని వత్తులు ౧౮ దృఢముగా నిష్కర్ష చేసుకొనిరి: గనుక ఆప్రకారం దానపత్రం సెలవుయిచ్చి పంపించినారం. దానపత్రం ప్రకారానకు చతుర్దిక్కులకులోగానున్న చేనున్ను చెరువు క్రింద తీరిన మడికి అగ్రహారీకులకు సర్వమాన్యంగా సెలవు యిచ్చినారం నిరాచ్ఛేదనగా నడిపించేది.

కొండూరి గ్రామాన భట్టవృత్తిమాన్యం అనుభవించే శేషాద్రి శాస్త్రుల వద్ద నున్న దానపత్రం కాగితం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౭౭౯ అగునేటి అక్షయనామ సంవత్సర కార్తీక బ॥ ౧౦ లు ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర యజుశ్శాఖాధ్యాయులయిన వెలకూచి రామలింగంభట్ల వారి పౌత్రులయిన శంకరావధానులవారి పుత్రులయిన సుబ్బాజోస్యుల వారికి, ఆపస్తంబసూత్ర కాస్యపగోత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమన్మహామండలేశ్వర మట్లి నరసింగరాజు వారి పౌత్రులయిన వెంకటపతిరాజుగారి పుత్రులయిన తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులు గారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక. శ్రీశైల ద్వారమునకు ఉపద్వారమయిన సిద్ధవటం సీమలో చెల్లే మాయేలుబడి పొత్తపినాటిసీమలో కొండూరు మాగ్రామాన మాగడ్డదీరులో మాన్యం కావలెనని పలకరించినారు. గనుక అందులక్రమమెట్లన్నను, మహాలక్ష్మిసమానురాలగు మా అక్క అపరచింతల అచ్చమ్మగారికి పసుపు కుంకుమనిమిత్తార్థమై యిన్నవడగాయ గుంత మడి స్థళానకు ౩౹౦ సందిరేవునకు ౦।౦ వెరసికు ౪ నాలుగుకుంటలు యీ నాలుగుకుంటల మడి వారికి యిచ్చియుండగా వారు సహగమనం స్వర్గస్తకాలమందున వెలకూచి సుబ్బాజోస్యుల వారికి ఆస్థళం ధారాగ్రహీతం చేయమని వారు ఆజ్ఞయిచ్చిరి, గనుక ఆదేప్రకారం వారి పిండప్రదాన కాలమందు యీ నాలుగుకుంటల మడి సహిరణ్యోదక దాన ధారా పూర్వకంగా యిస్తిమి. మీ పుత్ర పౌత్ర పారంపర్యంగాను సర్వమాన్యంగా అనుభవించుకొని సుఖాన నుండేది.

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥
దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥
హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్సపాతు వః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీఛత్రశ్రియం దధౌ ॥

ఈ దానపత్రం కుంపినీవారి ప్రభుత్వంలో పైనవ్రాసిన రాజు తమగడ్డతీరు బ్రాహ్మణుడికివ్రాసి యిచ్చినారు. ఇందులో మాయేలుబడి

పొ_త్తపినాటిలో కొండూరు అని వ్రాసియున్నది గాని వారియేలుబడి లేదు. కుంపిణీవారి యేలుబడిలో వున్నారు.

లోగడ కొండూరు అమరం అనుభవిస్తూయున్న మట్లవారి వంశీకు లయిన తిరువెంగళనాథరాజు వారి కొమారుడు మట్లి వెంకటపతిరాజు గారి వద్ద నుండే సన్నదు.

(ఈ పుట అంతయు ఉరుదు భాషలో వ్రాయబడినది.)

ఆమీలానే హాల యి_స్తకబాలు ప య్య వనికొండా సర్కారుముర్తు జాన్నగరు సుబేఫరబంద్దె బునియాద హైదరాబాదనవి_స్తే మొదె హారద దరివిల్లాము య్య యీడుకలపాడు స య్య పూనూరు అమలె వయ్య ముజుకూరు సరకారు మస్తురు మొబలగ చారహజారరూపయ్యాహస్తానా జమాకామిలు దారదు హాసబుల మస్తుర బతరీక యినాం బచనరాజే జమీ దారుకె దరహజూరతకదీము తుమేను మాయద మరహామతీ ఖుదా బాయదకేమ మజబూరరా అజయి_స్తదాయ స్న ౧౧౮౨ ఫసలీ రూవాలె మహార్నలె నము దేరసీదబగీరంబిదె హామజబూరముజాహిం వ ముత అదజనమవదదరీబాబ తాకీద ఆకీదదానిస్తా హాసబులమస్తురు బ్రాము లారందబతారీఖు దొజ్దా హాలంమహారరజ్జబులముర బ్బె బస్న ౧౧౮౨ హిజరికళిమిఖుర.

(తక్కిన పుట అంతయు ఉరుదులో వ్రాయబడినది.)

క్రిందవ్రాసిన దాని పై భాగములో రెండు పంక్తులు వురుదులో వ్రాసియున్నారు. బ నాయబానె హాల యి_స్తకబాల వ దేశముఖ యానె వ దేశపాండియానె వ మొకద్దమానె వ కులకర్నియానె వ॥ వినికొండా సరకారము_ర్తుజాన్నగరుక సుబేపరబంద బునియాద హైదరా బాద భిదానంద మ॥ యిడుపులపాడు అమలె వ॥ మజుకూరుజాగీరు మట్లిరమణారాజు జమీదార వ॥ సిద్ధవట అమి కదిములయ్యాము బ॥ మొజిమొజిబి అననాద హాజూర్న మోకరరు వుండెగనుక వి(ద?)రిం విలాస్నదుల ప్రకారం బిదస్తురు సాబక బహాలు చాయనాయను. బామొ

(యు(?)నకిం గీరువారు మునకలుగా గ్రహించి మ ! పుజుకూరు జటా దారు పుజుకూరు శామాయిషు చేసుకొనిచ్చేది. నకిం బాబాతాకీదు దానిస్తా హాసబుల మన్సూబా అమలారండ బతారీఖ చ ౧ సూహే మొహారం సన్న ౧౧౮౫ హిజరి.

ఈటిమార్పురం గ్రామాననున్న తాళ్లపాకం చిన్నన్నగారి సంతతి నందవరీకులు బ్రాహ్మలు వెంకటాచార్యుల వద్ద తామ్రశాసనం తెలుగు అక్షరముల రేకు లు ౩। పద్మసాలెవాండ్లు వ్రాసియిచ్చిన వర్తన నకలు తాట్యా ౹ లమీాద తామ్రశాసనం యిప్పుడు గుర్రంకొండ సీమకు తీసుక పోయినారు.

చక్రం. నామం. శంఖు.

శ్రీమదలమేలుమంగా మనోహార శ్రీవెంకటరమణ బహుపరాకు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవర్షంబులు ౧౪౬౩* అగునేటి శుభకృతునామసంవత్సర మాఘ శు ౧౫ లు గురువారం శ్రీమతేరామానుజాయనమః శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య ఉభయ వేదాంతప్రవర్తకులయిన తాళ్లపాక అన్నమాచార్యపుత్ర తిమ్మార్య నందన రత్నమకరకుండలయుగ్మమండితకర్ణ సకలవైష్ణవపాదసంసేవ కాబ్జసదనావధూలబ్ధ సరసకవిత్వ విదితమానస తిరువెంగళనాథయ్య దివ్య శ్రీపాదపద్మములసన్నిధికి అన్నమాచార్యులవారి పౌత్రులయిన తిమ్మా చార్యులవారి పుత్రులయిన తాళ్లపాక చిన్నన్నగారి ఛపన్నయాన్నై యారుదేశంబులంగల పద్మసాలెకుల సంభవులు వ్రాయించి యిచ్చిన వరుసాశన తామ్రశాసనక్రమమెట్లన్నను : శ్రీమన్నారాయణునినాభికమ లంబున చతుర్దశ భువన నిర్మాణ సకలభూత చరాచర ప్రపంచో త్పత్తిహేతుభూతుండైన చతుర్ముఖుండైన బ్రహ్మదేవుం డుద్భవిల్లె. ఆ బ్రహ్మకు మానసపుత్రుండైన భృగుమహామునీంద్రు డుద్భవిల్లె. ఆభృ గువుకు మృకండు డను మహామునీంద్రు డుద్భవిల్లె. మృకండునకు మార్కం

* Date Irregular. S'ubhakṛit 1464 and not 1463. Māgha śu 15 is, according to L. D. Ephemeris, a Saturday, and not Thursday as stated in the inscription. S'ubhakṛit Māgha S'u 15. 20th Jan. 1543.

డేయుండుద్భవిల్లె. ఆ మార్కండేయునకు అయోనిసంభవుండైన తద్వేదాగ్నికుంభమధ్యంబున పంచమహాఋషి భావనమహాఋషులను యిరువురుపుత్రు లుద్భవించిరి. జ్యేష్ఠపుత్రుండైన పంచమహాఋషియు వంశంబున దేశంవారుద్భవించిరి. ద్వితీయ్యపుత్రుండైన భావ ఋషియు వంశంబున సకల సురాసుర మనుష్యగుహ్యకాభిమాన రక్షకులయిన శ్రీపద్మసాలెసెట్లు పెక్కండ్రులున్ను, బండారవాడకులాచార ప్రతిపాలకు లున్న పులియజంగలిమలవరగండరులున్న వ్యాగ్రహ గంధర్వశాప విమోచనలున్న ఘూలకాసురసంహారులున్న కాల్వసేన శిరఃఖండను లున్న కార్పాసతంతువస్త్రనిర్మాణులున్న శ్రీమన్నారాయణుని నాభి కమలంబున తంతుకైకొని శృంగారపరుండైన నారాయణునకు పీతాంబర మున్న లక్ష్మీదేవికి లక్ష్మీనారాయణంచుపుట్టమున్న యీశ్వరునికి పులివన్నెపుట్టమున్న పార్వతికి గవాక్షులపుట్టమున్న, బ్రహ్మకు పొప్పళివన్నెపుట్టమున్న, సరస్వతి సన్నవోలుపుట్టమున్న, మన్మధరతీదేవులకు లతావిచిత్రములైన పుట్టములున్న, విఘ్నేశ్వరునకు గరుడవన్నె పుట్టమున్న, భైరవునకు బద్దెల పుట్టమున్న, ఋషులకు మునులకు కాషాయ వస్త్రములున్న, త్రయిత్రింశత్కోటి దేవతలకు యోగ్యంబులయిన పుట్టంబులు నిర్మించి యొసంగిన, అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మెచ్చి యిచ్చిన బిరుదావళ్లు కనకదండె, అందల, కాళంగి, అడపం, వింజామరలు పంచమహావాద్యంబులు అక్షయతూణీరాలు పులిటెక్కెములు గరుడ ధ్వజంబులు స్వర్ణాలగరిగె ముత్యాలగొడుగులు కుంచె కాళంజి అయిరావతంబులగు భద్రగజంబులు ఉచ్చైశ్రవంబులగు అశ్వంబులున్న కనక జందెము కాలుదివ్వెలు బ్రహ్మ విష్ణు మహేశ్వరులచేత గైకొన్న సాహస వీరులున్న కోరమీసంబులు గల కోదమ సింహంబులున్న రూపకందర్పులున్న ఆడితప్పనివారున్న పలికిబొంకనివారున్న శ్రీకాంచిక్షేత్ర వీర పుంగవులున్న నూటయెనిమిది దివ్యతిరుపతులయందు ధ్వజ పటారోహణ రాజవీధి మంటప తలంబ్రాలుమంటప మంగళసూత్ర దివ్యాభరణ వస్త్ర కైంకర్యపరులున్న అనవేమారెడ్డిసాన్నిధ్యాన కులవ్యవహార తత్పాయిత పిండనిగ్రహ విజయులున్న భావనాఋషి భద్రావతీ కన్య గర్భ పూర్ణో

దయ చంద్రులున్ను వారికి అత్తనాగున్ను లక్ష్మీదేవిపుట్టింటివారున్ను మాతృవంశంబున సూర్యునికి మనుమలున్ను పితృవంశంబున బ్రహ్మకు మనుమలున్ను ఉపనయన సంధ్యగాయత్రీమంత్రప్రవీణులున్ను మార్కండేయ గోత్రోద్భవులున్ను హరిహర బ్రహ్మదేవతలచేత బిరుదావళులు పుచ్చుకొన్న పద్మసాలెకుల సంభవులు అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికాపురి ద్వారావతి మొదలయిన తిరుపతి, చంద్రగిరి, శ్రీరంగం, తిరుచనాపల్లి, రామేశ్వరం, కంచి, కాళహస్తి, వెంకటగిరి, వేలూరు, నెల్లూరు, ప్రళయకావేరి, చెన్నపట్ణం, పొదిలె, కందుకూరు, ఉదయగిరి, పెనుకొండ, వినుకొండ, చీరాల, పేరాల, మంగళగిరి, కంభం, కందనవోలు, జగన్నాథం, ఢిల్లి, అవరంగాబాదు, రాయదుర్గం, గుర్రంకొండ, అవుకు, శ్రీరంగపట్నం, బెంగుళూరు, కడప, సిద్ధవటం, రాజమహేంద్రవరం, మొదలయిన యేనూరుకోట్ల భూమండలంలో గల యాభైయారు దేశాల పద్మసాలెసెట్లు [వారి పేర్లుగలవు.]లక్ష్మీదేవి దక్షిణ ముఖమంటపమందు వ్రాయించియిచ్చిన ధర్మశాసనం క్రమమెట్లన్నను : దేవరవారు మాకు గురువులు గనుక దేవరవారికి మేము ప్రియశిష్యులు గనుక, జాంద్రవారున్ను మేమున్ను వివాదపడి లక్ష్మీదేవి పుట్టింటి వారు తామని జాంద్రవారున్ను మేమని మా జాతివారున్ను, వివాదపడి మీ సముఖానకు వస్తిమి గనుక, అప్పుడు లక్ష్మీదేవి పుట్టింటివారని మమ్ముల నిర్ణయంచేసి పురుషోత్తమరాయుల వారిని గురువుల తిరుమల తాతాచార్యులవారిని జాంద్రవారిని మమ్ములను అలమేలు మంగాపురానకు వెంట బెట్టుకపోయి అప్పుడు పురుషోత్తమరాయులుతో......సకలమైన ప్రజలు వింటూవుండగా అలమేలుమంగమ్మచేత తన పుట్టింటి వారు పద్మసాలెవారు అని అలమేలు మంగమ్మచేత పలకరించి మా కార్యం నిర్వాహకం చేసి మా కులం ఉద్ధరిస్తిరి గనుక, అప్పుడు పురుషోత్తమరాయుల చేత మాకు బిరుదులు గండపెండేరం సింహాతలాటం వింజామరలు యిప్పించి, అప్పుడు భట్టులచేత కైవారంచేయిస్తిరి గనుక, అప్పుడు దేవరవారికి పదివేలువరహాలు పాదకానుక యిస్తిమి గనుక దేవరవారి భండారాన పదివేలవరహాలు తెప్పించి ఉభయం యిరువైవేల వరహాలు పురు

షోత్తమరాయలకు యిచ్చి, చంద్రగిరి తూర్పుభాగమందు..... ... ఆళ్లగట్టు క్రయసిద్ధిచేసి తీసికొని యీగట్టురాయి యెవరు దేవస్థళాలు కట్టినా వారికి పాలుభాగం ధర్మ. పద్మసాలెవారికి పాలుభాగం. ధర్మదేవ స్థళాలు కట్టినవారికి పాలుభాగం ధర్మం. యీ ప్రకారం శిలాశాసనం వేయిస్తిరి గనుక అప్పుడు అలమేలుమంగమ్మ సాన్నిధ్యమందు రంగ మంటపంలో దానపత్రం వ్రాయించి యిచ్చిన క్రమ మెట్లన్నను. మీ తిరుమాళిగె ధర్మవెచ్చానకు సంవత్సరం ౧కి మగ్గం ౧కి ల్ ౧ లెక్కను పెండ్లి ౧కి ల్ ౧ లెక్కను యీ ప్రకారం వ్రాసి యిస్తిమి గనుక మా పద్మసాలె వంశం చతుస్సముద్రములకు లోగల వారు నడిపించగల వారం. ఇందుకు మా జాతివారు యెవరు యివ్వక యెగవేసిన కాశీలో మణికర్ణికా ఘట్టమందు స్త్రీహత్య శిశుహత్య గోహత్య బ్రహ్మహత్యా దులు చేసిన పాపానపోదురు. భావనాఋషి భద్రావతీ కన్యకకు... వారలగుదురు. ఇటని మా రాజీన ఆకాశవాణి భూదేవి సూర్యచంద్రా దులు అలమేలుమంగమ్మ వీరలసాక్షిన మాఖుద్దురాజీన వ్రాసి యిచ్చిన దాన పత్రిక.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

౧ పుత్తనవారిపల్లె అగ్రహారీకుల వద్దనున్న దానపత్రము.

హారే ర్లీలా వరాహస్య దంష్ట్రాదండ స్సపాతువః।
హేమాద్రి కలశాయత్ర ధాత్రీచ్ఛత్రశ్రియం దదౌ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౭౭ *అగునేటి యువనామ సంవత్సర చైత్ర శు॥ ౧౫ లు శ్రీమద్వేదమార్గ పతిష్ఠాపనాచా ర్యోభయ వేదాంతాచార్యులయిన వెంకటరామాపురం అగ్రహారస్థితాశేష విద్వాణ్మహాజనులకున్ను కాస్యపగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమన్మహామండలేశ్వర ముట్లె

* Thursday 27, March 1755, when there occured a lunar eclipse.

అనంతరాజువారి పౌత్రులయిన తిరువెంగళనాథరాజువారి పుత్రులయిన వెంకటరామరాజు దేవచోడ మహారాజులవారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక. శ్రీగిరిద్వారమునకు ఉపద్వారమయిన సిద్ధవటంరాజ్యంలోకి చెల్లే మా యేలుబడి పొత్తపినాటి సీమలో ఊటుకూరి పొలంలో పుల్లవాగు వెంకటరాజుపేట మధ్యమందు శ్రీవెంకటాచలమార్గమందు అడవిపుత్తనవారిపల్లెపొలం ఆళ్లగట్లుకు దక్షిణం కుంట వేయించి బావులు త్రవ్వించి అడవి సాధించుకొని పొలంయేర్పరుచుకొని ఫలంచేసుకొనేము శ్రోత్రియముగా దయచేయవలెనని మనవిచేసుకొంటిరి. గనుక అదేప్రకారం యీ స్థళం యేడు ౧ కి యెనిమి(ది) చక్రాలు శ్రోత్రియం నిర్ణయంచేసి పరికల్పిత గణసంఖ్యాక వృత్తులు ౧౨ నిష్కర్ష చేసి మీ హద్దులోనుండే నిధిక్షేప జలపాషాణాది అష్టభోగ తేజస్వామ్యమానట్టుగాను, ఫలవృక్షాలు సహితంగాను, యీ సోమోపరాగ పుణ్యకాలమందు శ్రీస్వామికి అర్పితంగా మా అయ్యగారికి సుకృతంగాను త్రికరణ త్రివాచక త్రిశుద్ధిగా ధారాగ్రహీతం చేసినాము. గనుక ప్రతి సంవత్సరం యెనిమిది చక్రాలు నగరికి అచ్చుకొని ఆ పొలంవగను వచ్చిన సకల ఫలాదులున్ను మీ పుత్ర పౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకొని సుఖాననుండేది. ఇందుకు మీకు హద్దుల వివరం. తూర్పుపుల్లవాగు నాగావారికాల్వ, దక్షిణం తాళ్లవనం, పశ్చిమం పుత్తనవారి కుంటమడి, తోతమామకుంట, ఉత్తరం కరణం వారి బావి ముసలమ్మతోపున్ను. ఈప్రకారం చతుర్దిక్కులు హద్దులు యేర్పరచి సెలవు యిచ్చినారు గనుక యీ మధ్యమందువుండే భూమి కుంటలు బావులు మొదలయినవి యేర్పరచి ఫలపరుచుకొని అనుభవిస్తూయుండవలెను. ఈ స్థలంలో ముడియం రఘునాథాచార్యులు పుత్తనవారిపల్లెకు తూర్పు యేటియొడ్డున బావి త్రవ్వించుకున్నాడు. గనుక ఆ బావి క్రింద పొలంలో ఉత్తరభాగమందు వారికి మాన్యం పదికుంటలు పోగా నిలిచిన భూమి అంతా వృత్తులప్రకారం అనుభవించుకొనేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

వృత్తుల వివరం

సూర్యుడు చంద్రుడు

శ్రీరామా మట్లి వెంకటరామరాజు

శ్రీవత్సగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన ముడియం కృష్ణమాచార్యుల పౌత్రులయిన, రఘునాథాచార్యుల పుత్రులయిన శ్రీనిసాచార్యులు.

౨ యజమాన వృత్తులు అయిన.........

౧ వీరి పినతండ్రిగారు అయిన నృసింహాచార్యుల వృత్తి.

౧ వీరి పినతల్లి కుమారుడైన కృష్ణమాచార్యుల వృత్తి.

౨ అయిన

హారితగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన గుడిపాటి శ్రీనివాసాచార్యుల పౌత్రులయిన, నృసింహాచార్యులవారి పుత్రులయిన కృష్ణమాచార్యులవారి వృత్తి ౧.

శ్రీవత్సగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన కొండూరు వెంకటాచార్యులవారి పౌత్రులయిన తోళప్పాచార్యుల పుత్రులయిన శ్రీనివాసాచార్యుల వృత్తి ౧.

శ్రీవత్సగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన ఆచికొండమాచార్యుల పౌత్రులయిన యామునాచార్యుల పుత్రులయిన శ్రీనిసాచార్యుల వృత్తి ౧.

భారద్వాజనగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన పిసుపాటి కొండుభట్ల పౌత్రులయివ నరసంభట్ల పుత్రులయిన వెంకటభట్ల వృత్తి ౧.

కౌశికగోత్రాప స్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన కందూరి వీరరాఘవాచార్యులు పౌత్రులయిన నృసింహాచార్యులవారి పుత్రులయిన రంగాచార్యులవారి వృత్తి ౦౼౦.

శ్రీవత్సగోత్రాప స్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన పోట్ల మర్తి కృష్ణంభట్ల పౌత్రులయిన రామలింగంభట్ల పుత్రులయిన వెంకటాచలం వృత్తి ౦౼౦.

భారద్వాజసగోత్ర ఆప స్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన అమృతకవి వెంకటపతి పౌత్రులయిన వెంకన్న పుత్రులయిన వెంకట రామాభట్ల వృత్తి....

శ్రీవత్సగోత్ర ఆప స్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన బట్టే పాటి పాపన్న పౌత్రులయిన వెంకన్న పుత్రులయిన రామచంద్రయ్య వృత్తి ౧.

కౌండిన్యగోత్ర ఆప స్తంబసూత్ర యజుశ్శాఖాధాయులైన యల కూచి నరసంభట్ల పౌత్రులయిన సీతారామ పుత్రులయిన వెంకట్రామా భట్ల వృత్తి ౧.

ఈ ప్రకారం పంద్రెండు వృత్తులు నిర్ణయంచేసినారు గనుక అను భవించుకొని సుఖానవుండేది.

వెంకటపల్లె అగ్రహారీకుల వద్ద దానపత్రము నకలు యీరెండోకృ- నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౬౭౬ అగునేటి ధాతునామ సంవత్సర శ్రావణ శు ౧౫ లు* శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన్న ఆప స్తంబ సూత్ర యజుశ్శాఖాధాయులయిన గార్గేయన గోత్ర పవిత్రులయిన

* S. 1675 Srimukha and not Dhātu and no sōmōparāga on Srāvana su 15 of Dhātu.

జయంతి సింగభట్ల పౌత్రులయిన తాళంభట్లపుత్రులయిన పాపాభట్ల యజమాన వృత్తులు ౨. ఆపస్తంబసూత్రులయిన ఆత్రేయసగోత్ర పవిత్రులయిన చోరగుడి వెంగంభట్ల పౌత్రులయిన నందిభట్ల పుత్రులయిన గోపాలభట్ల వృత్తులు ౨ ఆప స్తంబస్తూత్రులయిన గార్గేయస గోత్ర పవిత్రులయిన జయంతి నారాయణభట్ల పౌత్రులయిన పుల్లంభట్ల పుత్రులయిన తిమ్మనభట్ల వృత్తి ౧. ఆపస్తంబసూత్రులైన ఆత్రేయగోత్ర పవిత్రులైన చోరగుడి తిమ్మనభట్ల పౌత్రులయిన వెంకటభట్ల పుత్రులయిన నారాణభట్ల వృత్తి ..ఆపస్తంబసూత్రులయిన కౌండిన్యస గోత్రపవిత్రులయిన యలకూచి సర్వాభట్ల పౌత్రులయిన సీతారామాభట్లపుత్రులయిన వెంకట్రామాభట్ల వృత్తి ౧. ఆపస్తంబసూత్రులయిన ఆత్రేయసగోత్రపవిత్రులయిన చోరగుడి తిమ్మనభట్ల పౌత్రులయిన పురుషోత్తమభట్ల పుత్రులయిన కృష్ణంభట్ల వృతి ౧. ఆపస్తంబసూత్రులయిన కాశ్యపగోత్ర పవిత్రులయిన మొదలి శంకరనారాయణభట్ల పౌత్రులయిన కృష్ణంభట్ల పుత్రులయిన లింగంభట్ల వృత్తి ఆపస్తంబసూత్రులయిన హారితస గోత్రపవిత్రులయిన కోణకంచి అయ్యంభట్ల పౌత్రులయిన కోటభట్ల పుత్రులయిన కొండుభట్ల వృత్తి ౧. ఆపస్తంబసూత్రులయిన గౌతమస గోత్రపవిత్రులయిన భోజనపల్లె రంగాచార్ల వృత్తి. ఆపస్తంబసూత్రులయిన శ్రీవత్సగోత్ర పవిత్రులయిన అప్పావఝుల నారాయణప్ప వృత్తి ౧. ఆపస్తంబసూత్రులయిన కాశ్యపస గోత్రపవిత్రులయిన శ్రీమన్మహామండలేశ్వర మట్లి అనంతరాజు వారి పౌత్రులయిన తిరువెంగళనాథరాజు వారి పుత్రులయిన వెంకట్రామరాజు దేవచోడమహారాజుగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను: సిద్ధవటంసీమలో చెల్లే మా యేలుబడి పొత్తపినాటిసీమలో ఊటూరికి ఆగ్నేయభాగమందు వెంకటేశ్వరపురం అగ్రహారం అనే నామాంకలిగిన గ్రామం పూర్వాం రాజశ్రీ అనంతరాజుగారు మీకు నాలుగుచక్రాలకు శ్రోత్రియం నిర్ణయం చేసియిచ్చియుండిరి గనుక మేమున్ను అదేప్రకారం నాల్గుచక్రాలకు నిష్కర్ష చేసి సహిరణ్యోదక ద్దానధారాపూర్వకముగాను యిచ్చినాము గనుక, మీ పుత్రపౌత్ర పారంపర్యంగా ఆచంద్రార్కస్థాయిగాను అనుభ

వించుకొని సుఖాననుండేది. ఇందుకు హద్దు: తూర్పు లింగాపురం పొలి మేర, దక్షిణం పెమ్మాబుచ్చిరెడ్డికుంట, పశ్చిమం చెల్లికాల్వగుంట, ఉత్తరం చిట్టివోలుబాట. ఈ చతుర్దిక్కులలోగా నున్న పొలం వాపీ కూప తటాక పాషాణ నిధినిక్షేప సహితంగా సోమోపరాగపుణ్యకాల మందు యిచ్చినాము గనుక ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని సుఖాన నుండేది.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

కొత్తపల్లె అగ్రహారీకుల వద్దనున్న దానపత్రం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాన శకవర్షంబులు ౧౬౩౦* అగునేటి సర్వధారినామ సంవత్సర భాద్రపద బ॥ ౩౦ లు కాశ్యప గోత్రాపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమన్మహామండలేశ్వర మట్లి రాజయ్యగారి పౌత్రులయిన కుమార అనంతరాజయ్యగారి పుత్రు లయిన మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడ మహారాజులుగారు శ్రీవత్స గోత్రాపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన తిమ్మాజీపంతులుగారి పౌత్రులయిన నాదాజీపంతులగారి పుత్రులయిన రాజశ్రీ వెంకాజీపంతులు గారికి వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక క్రమ మెట్లన్నను: శ్రీగిరి ద్వారమునకు ఉపద్వారమైన సిద్ధవటరాజ్యమునకు చెల్లే పొత్తపినాటి సీమలో కొత్తపల్లెగ్రామం మీకు సర్వాగ్రహారంగాను మా అయ్యగారికి సుకృతంగా శ్రీస్వామివారికి అర్పితంగాను జలపాషాణ నిధినిక్షేప అక్షీణ ఆగామి సిద్ధసాధ్యంబు లనేటి అష్టభోగ తేజస్వామ్యమానట్టుగాను త్రికరణ

* 3rd Sept A. D. 1708 There occured a solar eclise on this day, though this fact is not referred to in the *sonnad*.

త్రివాచకత్రిపురుషోద్దేశంగాను యిచ్చినారం గనుక మీా పుత్రపౌత్రపారం పర్యం గాను ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక సుఖాన నుండేది.

స్వదత్తా ద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోా ర్మధ్యే దానాచ్ఛ్రేయోానుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

సామాన్యోయం ధర్మసేతుర్నృపాణాం ।
కాలేకాలే పాలనీయో భవద్భిః ।
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్ ।
భూయోభూయో యాచతే రామచంద్రః ॥

మద్వంశజాః పరమహీపతి వంశజా వా ।
యేభూమిపా స్సతత ముజ్వలధర్మచిత్తాః ।
మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి ।
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి ॥

ఇటని యిచ్చిన దానపత్రిక.

ఊటుకూరి గ్రామం రెడ్లవద్దనుండే సన్నదుల వివరము. ఎర్ర పావుల్లారెడ్డి వద్దనుండేది.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౩౨ అగునేటి వికృతినామ సంవత్సర శ్రావణ శు॥ ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులుగారు నాగా తిమ్మారెడ్డి కొమారుండు నారాయణరెడ్డికి యిచ్చిన రెడ్డితనమిరాశి నిరూపం. తర్వాతను, శ్రీగిరిద్వారమునకు ఉపద్వారమయిన సిద్ధవటరాజ్యమునకు చెల్లే పొత్తపినాటిసీమలోను వోపిలిగ్రామం చాలా అరూంపకమై

అయియుండగాను ఆగ్రామం రెడ్డికరణాలు అష్టాదశవణా(వర్ణా)లవారు మాసముఖమునకు వచ్చి మా గ్రామం మేము నిర్వాహం చేసుకొనే టందుకు తేరిరాక నాగానారాయణరెడ్డికి మా గ్రామంలో పాతికెపాలు రెడ్డితన మిరాసి యిచ్చి ఆయనను సముఖానకు వెంటబెట్టుక వచ్చి మీారున్ను సెలవుయివ్వవలెనని విన్నపం చేసుకొన్నారు. గనుక మేము చిత్తగించి ఆప్రకారంగానె వోబిలిగ్రామంలో పాతికెపాలు రెడ్డితనం మిరాసిని నీకు యీా సంవత్సరం సెలవు యిచ్చినారం. కాబట్టి ఆ పాతిక పాలు రెడ్డితనం మిరాసికి వచ్చిన మాన్యం సామ్యం స్వతంత్రములు యేమియున్నదో అనుభవించేద. ఇదిగాక మేము నూతనంగా నీకు విశేష మాన్యం యీా సంవత్సరాన మడి కుం ౧౦, చేను కుంటలు ౨౦; మాన్యం సెలవు యిచ్చినారం. యీా (ఈ) విశేషమాన్యం మడి ౧౦ కుంటలు చేను యిరువై కుంటలున్ను పాతికెపాలు రెడ్డితనం మిరాసికి వచ్చిమాన్య స్వామ్యము మీా పుత్రపౌత్ర పారంపర్యంతంగా ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక సుఖాన నుండమని యిచ్చిన రెడ్డితనం మిరాసి నిరూపం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౬౩౬ అగునేటి జయనామ సంవత్సర పుష్య బ॥ ౧౨ లు శ్రీమతు స్వస్తిసమస్త నిజనామాంకమాలికా ప్రశస్తసహితులయిన శ్రీమన్మహేశ్వర గౌరీశ్వరదివ్య శ్రీపాదపద్మారాధకులయిన అభినవజంబూద్వీప పాపనిర్హరణులయిన ఘటోపేత సువర్ణయిందిరామందిరంబైన పృధివికి పుణ్యక్షేత్రంబైన పరమపవిత్రస్థానమైన ధర్మాధర్మములకు తరగలైన శ్రీశైలమునకు ఉప ద్వారమైన దక్షిణదిగ్భాగమందు ఒప్పుచున్నటువంటి తంగటూరిగంత శానబసవేశ్వరదేవర ముఖమంటపమందు వజ్రసింహాసీనులై కూడి కూర్చున్న స్థళం చతుర్దిక్కుల యాభైఆరు దేశములవారున్ను నాగా కోనరెడ్డిగారి నారాయణరెడ్డికి వ్రాయించి యిచ్చిన మగల(మ) దాన పత్రం. తంగటూారు, రాజంపేట, వెంకటరామరాజుపేట, అప్పయరాజు పేట, ఓబుళమ్మపేట, ఎల్లమ్మపేట, గోపాలపురం, బుక్కాపల్లె, ఘల్లూారు, చుంగుటూారి నారాయణపల్లె, నెల్లూారు, రాపూారు, సైదాపురం, చెన్నూరు, వెంకటగిరి, తిరుపతి, చంద్రగిరి, అననాపురం, రాచవేడు,

వంగమళ్ల, గలకడ, గుండ్లూరు, నీలకంఠనాయకుని దిన్నెపాడు, కుమార్లకాల్వ, వేముల, పులివిందల, మల్లె, పైడికాల్వ, కడప, కామలాపురం, దువ్వూరు, నందేలమ్మపేట, పోరుమామిళ్ల, బద్దెవోలు, సిద్ధవటం, భాకరాపేట మొదలయిన దేశంవారు పొత్తపినాడు, పులుగులనాడు సీమల సుంకమండవలకున్ను వ్రాయించి యిప్పించిన మగం నిర్ణయము నకు వక్క, మిరియం, దూది, పచ్చడాల నగలు, నూలినగలు, సొరబి చెక్క, అల్లేకుమైనం, జిలకర, సత్తు, సీసం, తామ్రం, గంధకం మొదలయిన నగల నిలచిన నగ ౧ కి ౧౦౽ లెక్కను; బెల్లం, పొగాకు వెల్లుల్లి, పట్టులు నగలు, చిరివేరు, నువ్వులు, నూనె, చింతపండు, కంబళ్లు మొదలయిన రసవర్గములు నిలచిన నగ ౧ కి ౧-౦ లెక్కను, ఉప్పు, సీరుల్లి, బియ్యం, కాయధాన్యం యీనగలకు నిలిచిన నగ ౧ కి ౧ - వీసం లెక్కను; ఎరికలచిక్కం ౧ కి కాసులెక్కను యీ ప్రకారం మగం యేర్పాటు చేసినారం. మీ పుత్రపౌత్రపారంపర్యంగా ఆచంద్రార్క స్థాయిగా అనుభవించుక సుఖాననుండేది. ఇందులకు యెవరు అడ్డి చేసినా కాశి గయా ప్రయాగలలో పంచమహాపాతకములు చేసిన పాపాన పోగల వారం. ఇది మాధర్మం సాక్షిగా వ్రాయించి యిచ్చిన దానపత్రం. తంగటూరి స్థలంవారి వ్రాలు. బుక్కపల్లె స్థలంవారి వ్రాలు, వంగిమళ్ల స్థలంవారి వ్రాలు, వేములస్థలంవారి వ్రాలు, మల్లెలస్థలంవారి వ్రాలు, పులివిందలస్థలంవారి వ్రాలు.

శ్రీరామా.

మట్లి కొమార అనంతరాజు

జయనామ సంవత్సర శ్రావణ బ॥ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కుమార అనంతరాజు దేవచోడ మహారాజులుగారు ఎరబావు తిమ్మారెడ్డికి యిచ్చిన కౌలు నిరూపం. తర్వాత అవాంతర వ్యవస్థలచేతను స్థలపల్లటమై పరదేశములయందు కష్టపడుచూ యుంటె పొందుల తిరుమలరాజువారు చాలాదయచేసి మీ నిమిత్తం శ్రుతంచేసిరి గనుక మేము ఆ ప్రకారంగానే దయచేసి యీ వరకు మీయందున్న గుణదోషములు

యేమియున్నా అన్ని మాఫుచేసి ఊటుకూరు గ్రామంలో మీా మేటిదశ మందములున్ను పూర్వంనుంచి నడచిన మాన్య సామ్యములున్ను యిటు వెనక రాజా అప్పయరాజువారు యే యే స్థళముల్లో యేమి మాన్యం సెలవు యిచ్చినారో ఆ మాన్యం చేలుమళ్లున్ను నిరాఛ్ఛేదనగా నడిపిస్తూ యున్నారము. ఈ కవులు త్రికరణంగా విశ్వసించి గ్రామమునకు వచ్చి పాళ్లవారితో పాటి ని మేటి సాగుబడి చేసుకొని చాలాబాదు ప్రకారం పాళ్లవారితో పాటు అప్పనం అచ్చుకొని దశమందములు మాన్యసామ్యములు అనుభవించుకొని బుద్ధిమంతుడవై నగరి హితవిశ్వాసములలో సుఖంగానుండేది. నూతనంగా నారాయణమ్మ పేరట మీా తండ్రి చెరువు చేయించినాడు గదా. అందు క్రింద అచ్చుకట్టు తీర్చుకొన్నందున దశ మందమున్ను కవులుకు మునుపు నన్నదుపుట్టి యున్నది గదా. ఆ నన్నదు ప్రకారం నడిపిస్తూయున్నారం. ఆ చెరువు ఊర్జితం చేసుకొని విస్తారంగా అచ్చుకట్టు తీర్చుక దశమందం మాన్యం అనుభవించుక కాలు పోలానకు కవులాచారం మూకలు అచ్చుక సుఖానవుండేది.

సూర్యుడు. చంద్రుడు.

శ్రీరామా.

మట్లి కుమార అనంతరాజు.

జయనామ సంవత్సర మార్గశిర శు॥ ౧౯ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కుమార అనంతరాజు దేవచోడమహారాజులుగారు నాగా నారాయణరెడ్డికి వ్రాయించి యిప్పించిన దశమందం కాలుసరూపం. తర్వాత, తిరువెంగళనాథరాజుపేట దగ్గర ఫల్లవాగుకు కాల్వ మొగాళం యేర్పరచి కాల్వత్రొవ్విస్తే ఊటుకూరి పొలంలో ఉడుంవారిపల్లె పుత్తన వారిపల్లె మొదలయిన స్థలములు అచ్చుకట్టు దీరీని. ఆలాగు నగరివారు సగంభాగం కలుసుకొని సెలవు యివ్వవలె నని విన్నపంచేసుకొంటిరి గనుక ఆ ప్రకారంగానె మహారాజశ్రీ వెంకట్రామయ్యవారి పేరట కాలువ తీర్పించేటట్టు సెలవుయిచ్చి అందుకు భాగం యేర్పరచి కవులు వ్రాయించి యిప్పించిన వివరం. ఆ ప్రకారం మాఖాసా భాగం సగం

ఊటుకూరు రెడ్లు సగంభాగమున్ను.....మహారాజశ్రీ వెంకట్రామ రాజయ్యగారి కాల్వ తీర్పిస్తే ఆ కాల్వక్రింద అచ్చుకట్టు తీరిన పొలానకు సమాంశం దశమందం మాన్యం సగంపోగా నిలచిన గుత్తపొలానకు మొదటి సంవత్సరమునకు కుంట ౧ కి ౯౧ లెక్కను, రెండో సంవత్స రానకు కుంట ౧ కి ౯౨ లెక్కను, మూడో సంవత్సరం ఆరభ్యం మెప్పటి కిన్ని కుంట ౧ కి ౯౪ లెక్కను యెప్పటిని నిరాచ్ఛేదనగా నడిపిస్తూ యున్నారం. మా కవులు త్రికరణంగా విశ్వసించి కాల్వమాయూరు చేయించి విస్తారంగా అచ్చుకట్టు తీర్పించి సగంభాగ సగం దశమందం మాన్యంగాక మీ సగభాగమునకు వచ్చిన పొలం సదరహీ ప్రకారం అనుభవించుక సుఖాననుండేది.

(మరాటీ లిపి వున్నది)

సూర్యుడు. చంద్రుడు.

శ్రీరామా.

మట్లి వెంకట్రామరాజు.

ప్రమోదూతనామ సంవత్సర ఆశ్వీజ బహుళ.౧౦ లు శ్రీమన్మహా మండలేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడమహారాజులుగారు నాగా రాజు ఆ తిమ్మప్ప ఎరబాపు రాఘవరెడ్డి నాగా పెరుమాళ్లరెడ్డి గారికి వ్రాయించి యిచ్చిన కౌలు నిరూపం. తర్వాత, నగరికి పదిరూకలు విశేషం యిచ్చి బళువుపడినాము. చాలంబాదు ప్రకారం అప్పనం అచ్చలేము అని కవులు కావలెనని మనవి చేసుకొంటిరి. గనుక, చిత్తగించి కౌలు యిచ్చిన వివరం. మీ ముగ్గురి కులాలకు పెరుమాళ్లరెడ్డిగారి పాళ్ళు వారి దేశీలు.....వన్ను పొలం దశమందాలు, తేజోమాన్యాలు, గడ్డ దీర్లు, కౌలుపొలం సహాగాను సర్వమక్తాగా చెరువునిండిన సంవత్సరం మొనమన్నూరు చక్రాలు, చెరువునిండని సంవత్సరం ఆరునూరు చక్రా లకు నిర్ణయం చేసినారం. పొగతోట, మిర్యం, పైరు అద్దుల కాడా రంభం నీరారంభం, ఆకుతోటలు సహాపైరు చేసుకొని సదరహీప్రకారం రూకలు ప్రమోదూత ప్రజోత్పత్తి యీ రెండు సంవత్సరాలు ఎంగా

కవులు ప్రకారం అచ్చుకొని సుఖానసుండేది. ఈ సంవత్సరం యాకలు పై శాఖములో గాబట్టుకొంటున్నారం తెలిసేది.

వికృతినామ సంవత్సర శ్రావణ శు॥ ౧౩ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులుగారు వోబిలి గ్రామం రెడ్డికరణాలకు వ్రాయించి యిప్పించిన కౌలునిరూపం. తర్వాతను, మా గ్రామం చాలా అరూపకమైయున్నది. అని మా గ్రామం అపనబది (అప్పనబడి ?) కౌలు అప్పనబడి పొలములు రెడ్డికరణీక జాతికట్టుమాన్యములున్న తిరువెంగళనాథరాజుపురం క్రిందను కలసినది అని విన్నపం చేసుకొంటిరి. గనుక, మీకు సమాధానంచేసి కౌలు యిచ్చిన వివరము. తిరువెంగళనాథరాజు పురంక్రిందను ఉన్న అప్పబడి కౌలుశిస్తు క్రింద కలసిన పొలమున్ను ప్రాకున యెవరెవరికి నడిచిన రెడ్డి కరణీక జాతి కట్టుమాన్యములు యీ సంవత్సరానకు ఆ స్థలాననె నడిపిస్తున్నారము. మీదటి సంవత్సరానకు మీ గ్రామాననె ఆ మాన్యములు బదులు చెప్పిస్తున్నారం. ప్రాకుశిస్తుక్రింద కలసిన పొలం సంవత్సరం యేమి యున్నదో ఆ పైకం మీ గ్రామాననే సెలవు యిచ్చినారం. మీదటికి అప్పనబడి తోటలు నారికేళములు యీ సంవత్సరాన నగిరిక్రిందకలసిన శాఘలకు సెలవుయిచ్చినారం. చాలాబాదు గ్రామదబూ(?)లుగా నగరనున్న తోటలకు చాలాబాదు ప్రకారం ఆ పైకం మీ గ్రామంక్రిందనే ముజరాయిస్తూయున్నారం. ఈ ప్రకారం కౌలు యిచ్చినారం గనుక మా కవులు నమ్మి గ్రామం విస్తారంగాను బలపరచుకొని సుఖానసుండేది. ఈ వ్రాసిసిందుల్లో(?) నగరిఖాసాను సెలవు యిచ్చినారం. ఈ తోట సంబంధం పోగా నిలచినది ఖరారుగా సెలవుయిచ్చినారం తెలిసేది.

మట్లి వెంకట్రామరాజు.

కాళయుక్తి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంట్రామరాజు దేవచోడ మహారాజులుంగారు ఎర్రబాపు రాఘవరెడ్డికి వ్రాయించి యిచ్చిన సన్నదు. తర్వాత, ఈ సంవత్సర మొదలు నీకు మాన్యం గుండ్లూరిఖండి కుం ౫ లు అయిదుకుంటలు సెలవు

యిచ్చి మాన్యానకు దేశపుస్వంధవృత్తి(దశమందం వృత్తి?) పోను అర్ధ సమశ్చను నిర్ణయంచేసినారం. మాన్యం అనుభవించుకొని వ్రాసిన ప్రకారం రూకలు చెల్లించుకొని సుఖానను౦డేది.

రుధిరోద్గారినామ సంవత్సర భాద్రపద బ॥ ౧౩ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడ మహారాజులుగారు ఎర బాపురాఘవరెడ్డి నాగారాజుకు వ్రాయించి యిచ్చిన కౌలు నిరూపం. మీా గ్రామానకు తూర్పు కూనాకాల్వపూడిపించి చేను అచ్చుకట్టించుకొనేము, కౌలుకావలెనని విన్నపంచేసుకొంటిరి, గనుక, చిత్తగించి కౌలు యిచ్చిన వివరం. ఆస్థలాన అచ్చుకట్టించిన పొలానకు మొదటి యేడుకు కుంట ౧ కి పాతికెలెక్కను, రెండోయేడుకు అర్ధగలెక్కను మూడో యేడుకు రూకలెక్కను, నాలుగో యేడు ఆరభ్యం రెండు రూకలు లెక్కను కాయం. పైరు పైరుఅడుగులకు అర్ధతీర్వను మడిసాగితే యీా ప్రతికి యీా ప్రకారం యినుమడి నడిపిస్తున్నారం. తోటలు చేసుకొంటే మడితోపాటు నడిపిస్తున్నాము. మా కౌలునమ్మి పొలం అచ్చుకట్టించి కౌలునడిపించుకొనేది. ఆ స్థళానత్రొవ్వించిన బావులకు బావి ౧ కి రెండు కుంటలు లెక్కను బావిమాన్యం నడిపిస్తున్నాము. మా కౌలునమ్మి విస్తారం పొలంచేసుక కవులు ప్రకారం దివాణానకు రూకలు అచ్చుకొని సుఖానను౦డేది.

(మరాటీలో ఒక చిన్న పంక్తి వ్రాసినారు)

ఆంగీరసనామ సంవత్సర ఆషాఢ బ॥ ౬ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడ మహారాజులుగారు ఊటుకూరు రెడ్లకు వ్రాయించి యిచ్చిన కవులు మేటీలనిర్ణయం కౌలునిరూపం. తర్వాతను, మీా గ్రామం రాజు రాఘవరెడ్డి పెరుమాళ్ల రెడ్డి మొదలయిన మేటీలు యీా దినం కట్టుకొంటిరి గనుక సంవత్సరం నిర్ణయం చేసినది. ౧ నాగా అనంతయమేటి, ౧ నాగారాజుమేటి, ౧ నాగా పెరుమాళ్ళరెడ్డి ౧ ఎఱ్ఱబాపురాఘవరెడ్డి, ౧ కొమార్తుడు పెరుమాళ్ళరెడ్డి, ౧ నాగావెంకట్ల పతిముసలయగారు. ఈ ప్రకారం అయిదు మేటీలు నిర్ణయంచేసి

సెలవు యిచ్చినారం. మీా పన్నుపొలం దశమంసం, గడ్డదీర్ఘ, కాలు పల్లెలు, పెరుమాళ్ళరెడ్డి క్రింద యాడుకుంట పొలం, దేశీలు అయిదు మేటీలును పంచుకొని మేటీపొలం తక్కువపడిన పొలానకు ఉత్తమం మధ్యమం కనీసాల స్థళాలు విడచెప్పి గ్రామంలో కాపులను అయిదు మేటీలను ఉండ చూచుకొని యిజారా పేశవ నిర్ణయప్రకారం సూకలు అచ్చుకొని సుఖాన నుండేది.

(మరాటీ లిపి కొంచెము వున్నది.)

శ్రీరామా

మట్లి వెంకట్రామ రాజు

దుర్మతినామ సంవత్సర శ్రావణ శు॥ 2 లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడ మహారాజులుగారు ఎర్రబాపు రాఘవరెడ్డికి వ్రాయించియిచ్చిన తేజోమాన్య పత్రిక.

నీవు ఊటుకూరు గ్రామంలో జాటనరిలో నుండి పొయ్యేవారికి ధర్మం చేసుకొంటూ మాహితవులో నడుచుకొంటూఉన్నావు; గనుక నీకు దయచేసి పొందలూరను కుంటలు 5 నారాయణనెల్లూరను కుంటలు 5 ఉభయం పది కుంటలు మీాకు తేజోమాన్యం సెలవు యిచ్చినాము; గనుక మీా పుత్ర పౌత్ర పారంపర్యంగా అనుభవించుకొని మా హితవులో నడుచుకొంటూ సుఖానసుండేది.

(ఇక్కడ నాలుగయిదు మరాటీ అక్షరములు వున్నవి.)

శ్రీరామా

మట్లి వెంకట్రామరాజు

ప్లవనామ సంవత్సరముకు చెల్లే శుభకృతునామ సంవత్సర చైత్ర బ॥ ౧౦ లు అత్తినవర సంగన్నపంతులు గారికి శ్రీమన్మహామండలేశ్వర మట్లి చెంద్రాజు దేవచోడ మహారాజులుగారు నమస్కారం. నాగారామిరెడ్డి పొత్తపినాటి సీమలోను చాలా జాదునడిచె మాన్యాలు సెలవు

యిచ్చినారట. ఏ యే గ్రామాన నడిచే మాన్యాలు చాలాబాదు ప్రకారం నడిపించేది. ఊటుకూరు గ్రామం పొలములో నూతనంగా అడివినరికించి తిమ్మారెడ్డి నారాయణరెడ్డి కొండామ్మగారి పేరను పల్లె కట్టించినందుకు కుమార అనంతరాజు వారు కవులు వ్రాయించియిచ్చినారుగదా ఆకవులంబారమొ(?) సెలవుయిచ్చినారం. ఆ ప్రకారం నడిపించేది. తాలికు వ్రాసుకొని అసలు తిరుగా యిచ్చేది.

## శ్రీ సీతారామ

చిత్రభాను సంవత్సర భాద్రపద బ॥ ౭ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కుమార అనంతరాజయ్యదేవచోడ మహారాజులుగారు ఎరబాపు పెరుమాళ్ళ రెడ్డికి వ్రాయించియిచ్చిన కవులు దసమందంకౌలు నిరూపం. తర్వాత, నీవు వెనక యీ మొల్లకావుళ్ల వాగు ఏటికాల్వ తప్పించి కూనాకాల్వచేలస్థలంలోను గడ్డిగాను నూతిస్థలంలోను అధప్రాకేండ్లబీడు అచ్చుకట్టించే నన్నావు గనుక అందుకు నీకు కవులుయిచ్చిన వివరం. అచ్చుకట్టిన పొలంలోను మీాకు దసవందం సగం పోగా నిలిచిన మడికి యీ సంవత్సరానకు కు ౧ కి రూక లెక్కను అనుభవించుకొని సుఖాన నుండేది.

వికృతినామ సంవత్సర కార్తీక బ॥ ౧౦ లు శ్రీమన్మమహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులుగారు ఎఱ్ఱబాపు పెదపెరుమాళ్లరెడ్డికి వ్రాయించియిచ్చిన దసమందం కవులు నిరూపం. తరువాత, ఊటుకూరు పొలంలోను సింగనవారిపల్లె చేని స్థళాన కన్నెచెరువుకట్టించి ఆ చెరువు క్రిందసాగిన మడికి దసమందం కవులు మన్నించవలెను అని తెల్పుకొంటివి. గనుక, నీకు కవులుయిచ్చిన వివరం. ఆ చెరువు క్రింద అచ్చుకట్టిన మడికి సగపాలు దసవందం సెలవు యిచ్చినాము. నిలిచిన నగరిసగపాలు మడికి ప్రాకుచేల అచ్చుకట్టు కుంట ౧ కి అడుగు లెక్కను అధప్రాకుబడి చేలకు చెట్టుకొట్టిన అచ్చుకట్టు ౧౹ లెక్కను రెండో యేడు అచ్చుకట్టు రూక లెక్కను, చెట్టుకొట్టి చేసినమడికి కౌలు అడ్డుగలెక్కను మూడో యేటికి చేలఅచ్చుకట్టుకు రెండు

రూకలులెక్కను, చెట్టుకొట్టిన బీటిమడికి రూకలెక్కను నాలుగోయేటికి చేనుఅచ్చుకట్టుకు మూడురూకల లెక్కను, చెట్టుకొట్టిన మడికి రెండు రూకలలెక్కను అయిదోయేడు ఆరభ్యంనుంచి పైటుకు నాలుగురూకలు లెక్కను పంపకాలు మినహాగాను యెల్లప్పటికి తప్పకుండా నడిపిస్తున్నాము. చెరువుమీద విస్తారంగా పని ముఖుంచేయించి చెరువులో పూర్జితం చేసుకుంటూ విస్తారంగా మడిఅచ్చుకట్టు తీర్చుకొని ఫలాదులు అనుభవించుకుంటూ సుఖాన నుండేది.

(ఇక్కడ కొద్దిగా మరాటి లిపి వున్నది)

శ్రీరామా

మట్లి చంద్రరాజుగారు

శుభకృతు నామసంవత్సర కార్తీక బ॥ ౧౫లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి చంద్రరాజు దేవచోడ మహారాజులుగారు నాగాకోనెరెడ్డి కొమ్మిరెడ్డి వీరప్పగారికి వ్రాయించి యిప్పించిన కాలువ దసమందం కవులు నిరూపం. తర్వాత, కొమారుని పల్లె స్థలాన కుంటిమాకుల గుంత దగ్గర మోగాళంబుట్టించి నూకినేనిపల్లె కయ్యాంశలగడ హద్దుచేసి లక్ష్మీపతిగారి చేలస్థళం వడ్లకరమలవాండ్ల మాన్య స్థళం వరపబావి సహాగాను నూకినేనిపల్లెకాలువ పశ్చిమం కుమారునిపల్లె పొలములో కరగురువయ్య చేను అవల కుందానెల్లూరుపొలములో ఊరిపడమరహద్దుచేసి కుందానెల్లూరు మాలవాడ పరియంతం అచ్చుకట్టితీర్చి సాగుబడిచేయించేము. అందుకు కవులు కావలెనననిన్ని విన్నపంచేసుకొంటివి గనుక మీకు కవులు యిచ్చిన వివరం. మీకు మాన్యం దసమందం పోగా నిలిచిన సగంమడికి యీ సంవత్సరానకు కుంట ౧ కి ౦౧ ఒక రూకలెక్కను శోభకృతు సంవత్సరానకు కుంట ౧ కి ౦౩ మూడేసి రూకలలెక్కను, క్రోధిసంవత్సరానకు కుంట ఒకటింటికి నాలుగు రూకలలెక్కను నడిపిస్తున్నారం. మా కవులు త్రికరణంగా విశ్వసించి కాలువతీర్పించి పొలం విస్తారంగా అచ్చుకట్టుతీర్పించుక ఫలపర్చుక పుత్రపౌత్రపారంపర్యంగా అనుభవించుక సుఖానసుండేది.

(కొన్ని మరాటి అక్షరాలు కలవు)

శ్రీరామా

శ్రీరామ మట్ల కొమార అనంతరాజు

జయనామ సంవత్సర శ్రావణ శు॥ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కొమార అనంతరాజు దేవచోడ మహారాజులుగారు ఊటుకూరు గ్రామ రెడ్లకు పుత్తెంచిన ప్రయోజనం తరువాత ఎరబాపు పెరుమాళ్లు క్రమణ(?)అయి చిన్నవాడు పరదేశములో కష్టపడుచూనుండిరి. గనుక, వారిసమాచారము తిరుమలరాజువారు చాలా శ్రుతంచేసిరి. గనుక, వారి యందున చాలాదయచేసి వెనుకటి గుణదోషము సర్వం మాపుచేసి ఆ పెరుమాళ్ల కొమారుడు తిమ్మారెడ్డికి నమ్మికయిచ్చి వారిమేటి దస వందాలు మాన్యములు యిటువెనుక రాజశ్రీ అప్పయరాజువారు యేయే స్థళములో యేమి మాన్యము దయచేసినారో ఆమాన్యములున్ను నిరాచ్ఛేదనగా దయచేసి సెలవుయిచ్చినారము. ఆప్రకారం నిరాచ్ఛేదనగా నడిపించేది. ఇదిగాక పెరుమాళ్లరెడ్డి నారాయణమ్మ పేర చెరువు చేయించినాడు గదా. ఆ చెరువు ఊర్జితముచేసి అందు క్రింద అచ్చుకట్టు తీర్చక మునుపు ఒకరికి కవులు ఘట్టిన ప్రకారము దసవందాలకు కొలు పొలమున్ను కొలాచారమున్ను నడిపిస్తున్నారము. అది సాగుబడి చేసుకొనేది.

శ్రీకృష్ణ

క్రోధననామ సంవత్సర మార్గశిర బహుళ ౫ లు రాజశ్రీ చుండూరుముసలనాయనివారు ఊటుకూరు రెడ్లకు వ్రాయించి యిచ్చిన కవులునామా. ఎర్రచెరువు క్రింద క్రొత్తగా కాలువతీయించి చెట్టు నరికి క్రొత్తగా అచ్చుకట్టించుకొనేము అని కవులుకావలెను అని అడిగితిరి. గనుక, మేము యేయే స్థళం త్రొక్కి చూచి మీకు కవులుయిచ్చిన వివరము. వెంకట్రామరాజుపేటకు పశ్చిమం పుల్లవాగు యేటికి పడమర నూతనముగా చెట్టునరికి అచ్చుకట్టు తీర్చుకొన్న పొలానకు కుంట ౧ కి ౮౧ లెక్కనే, మూడో సంవత్సరానకు, రెండోసంవత్సరానకు ౨ రూకల లెక్కను, యీ సంవత్సరానకు ౪ రూకలు, సర్వమక్తాగాను నడిపిస్తున్నారము. ఈ స్థళంలోను కాడారంభానకు కుంట ౧ కి అడ్డుగ లెక్కను.

అబ్దుల్లా సాహేబుల వారి కౌలునామా

హేవళంబినామ సంవత్సర వైశాఖ బ॥ ౧౨ లు హా॥ గు॥ మహామ్మద ఇసాకు తిమ్మాసముద్రము అగ్రహారీకులకు, నాగా కోనే రెడ్డిగారు నారాయణ రెడ్డి గారిక వ్రాయించియిచ్చిన కౌలు. తరువాత, తిమ్మసముద్రము గ్రామములోను చిట్టేటివంకను బ్రాహ్మణకాలువ యేట కలసి ఖిలపడియుండెను గనుక ఆ కాలువ త్రొవ్వించి చాంకి అచ్చుకట్టి ఫలపరిచేమని కవులు కావలెనని అడిగితిరి. గనుక, మీకు కవులు యిచ్చిన వివరము. అచ్చు తేలిచినమడికి మొదటియేటి ౦౧ కి సర్వమక్తాగాను X ౧౦౨ లెక్కను రెండో యేటికి X ౨౦౮ లెక్కను మూడోయేటికి X ౩౪౧ లెక్కను తప్పక నడిపించగలవారము. ఈ ప్రకారము యెప్పటికి నడిపించగలవారము. మా కవులు నమ్మి విస్తారంగా మడిఅచ్చు తేలుచుకొని సుఖాననుండమని యిచ్చిన కౌలునామా. సాగినమడిలోను దసవందము సర్వమాన్యము సగంపోగా నిలచిననగం నగరిమడికి యీ వ్రాసిన ప్రకారం తప్పక నడపగలవారము అని యిచ్చిన కవులునామా. సముదాయాన పెళ్ల మొత్తుమాన్యము ౦౧ నడిపించగలవారము. సాగుబడిచేసుకొని ఫలపరుచుకొని సుఖాననుండమని యిచ్చిన కవులునామా. మంజూరు తారీకు ౨౬.

మట్లివారు వీరికి అభయహస్తం గంధముతో కాగితంమీద రెండు హస్తములున్ను దాని దిగువ వ్రాసియుండేది. హస్తములు యెగువ.

శ్రీరామా

వెంకటేశ్వరా

శ్రీరామా

విజయనామ సంవత్సర భాద్రపద్ధ శు॥ ౧౩ లు రాజశ్రీ మట్లి మంగమ్మగారు వెంకటరాఘవరాజు దేవచోడ మహారాజులుగారు ఎర్ర బాపు పెరుమాళ్ల రెడ్డికి వ్రాయించి యిచ్చిన నమ్మిక ప్రమాణలిఖితము. మహారాజశ్రీ శ్రీరాజుగారు అయ్యళరాజుగారు తంగటూరివద్ద కార్య

ముఖమందు స్వర్గస్తులు అయిరి గనుకనున్ను, మేము బాలులము గనుకను యికమీదటి తరణోపాయమునకు యేమి యోచన అనిన్ని నిన్ను పిలుచుక ఆలోచన చేసేటందులలో నేను దేశస్తుణ్ని మీరాశిదారుణ్ని గాని అన్యుణ్నిగాను, మీలోమీకు అన్నతమ్ములలో కలహాలువచ్చి నప్పుడు నేను దివాణములు అట్టియెత్నములు చెయ్యపోయేది నాకు విహితంకాదు. మీకు యేమి అయినా ఒక సౌకర్యపడికుదిరేపరియంతం విడిచిపెట్టి ఆవలపోయ్యేది మర్యాదకాదు. కాబట్టి మీహితవులోనే చూపెట్టుక ఉంటున్నాను. లక్ష్మీపతి అయినానసరే మరి యెవ్వరినైనా సరే మీరు చేపట్టి సంస్థానం కుదిరే యత్నమునకు చేపట్టి నడిపించుకో వలెగాని నాచేతనే ప్రయోజనములు కాదు. మీకు ఒక సౌకర్యపడి కుదిరేపరియంతం మీసముఖానవున్నంతసేపు మీ ఆప్త ఆలోచనలోనే వుంటూఉన్నాగాని ఉపేక్షగావుండతగినదిలేదు. అని ప్రమాణపూర్వకముగా విన్నపంచేస్తివి గనుక మేము మీకు వ్రాయించిన నమ్మికె నీవు మామేలు కీళ్లలో కలిసి మాతోపాటు కష్టపడుచు మాశ్రేయస్సుకోరి పరమ ఆప్తుడవై వున్నావు గనుక ఒక స్థళమందున్న దినములను సరే సంస్థానమున కుదరి స్థళంలో వున్నపట్టికి సరే యెల్లప్పటికి మేము తల్లి కొమాళ్లము మాలోమాకు విశ్వాసము యెటువలెనో అటుమట్టుకు విశ్వాసమే నీయందుంచి మాదాయాదులు బంధువులు సామయాడులు(?) దేశకర్తలు మరి మాశత్రువులు మరిమాపరిజనం మొదలయిన వారు యెవ్వరు యేమి నీమీద కీడు ఆచరించినా మా అన్నదమ్ములకు కీడు ఆచరించినట్లుగా భావించి మాచేత తీరినంత సమర్థించుకోగలవారము. కాని ఉపేక్ష ఊరికేయుండగలవారము కాదు. నీమీద యెవ్వరు యేమి విషమములుగా మాతో విన్నపంచేస్తూవచ్చినా అవి నీకు తెలివిడి పరచి ఆ విషమములు చెప్పేవారిని దండించతగినవారిని దండించి పరిహరించ తగినవారిని పరిహరించి మీకు అనుకూలంచేయుతగిన వారిని అనుకూలం చేసి నీ మీద హిత విశ్వాసము ఉంచేటట్లు చేయతగిన వారలను ఆలాగు హితవుచేసే దింతేకాని యెవ్వరు యేమివిషమములు చెప్పినా అవి ఒకతట్టు వింటూ ఉపేక్షగా నీతో చెప్పక ఊరకయుండ తగినది లేదు. ఇప్పుడు

మాకు యిటువంటి విపద్దశవచ్చినవేళలలో మాకీడుమేళ్లకు మా కీర్తి అపకీర్తులకు ఆలాయమై మమ్ముల కాబెట్టుకయున్నావు గనుక యిది ఆరభ్యాం యెప్పటికి యెవ్వరు యేవీ నీమీాద ఉపాధిచేయవలసి మాకు సంకటములు పుట్టించి నిన్ను పనిచెర్చవలెనని ఆ ప్తంతస్పించి పనిచెర్చ వలెనని యిక్కట్టువేళలు చూచి సహించనివారు యెవ్వరైనా నిన్ను ఒక దిక్కు గిరువులు ఉంచవలెనని నీ పేరట పత్రం ప్రాపకములు పెట్టించవలెనని యిటువంటియుక్తి ఆలోచనలు చేసినాగాని మాఅదృష్టం కొద్దిన్ని అయినట్లు అయ్యేగాని అటువంటి ఉపాధులకు నిన్నుచూపవ తగ్గదిలేదు. ఇందులకు మేము తల్లీకొమాళ్లము ముగ్గురము నీవు ఒక కొమారుడకూడా నలుగురయిగాను భావించి దయచేసి వడిపంచుకోగల వారము. ఈ ప్రకారం వ్రాయించియిచ్చిన నమ్మికలో మేము యేమి తప్పినడిపించుకొన్నా మహారాజశ్రీ రాజువారి పాదపద్మములకు తప్పినట్టు మాగర్భవానమందు పుట్టిన కొమాళ్లకు తప్పినట్టయిని. శ్రీమదఖిలాండ బ్రహ్మాండనాయకులయిన శ్రీ......స్వామిపద్మములతో మా ధర్మము సాక్షిగా వ్రాయించి యిచ్చిన నమ్మిక లిఖితము.

శ్రీరామా

నాగానారాయణప్పకు గ్రామములలో నడిచే మాన్యములు :

రాజశ్రీ అప్పరాజువారి సెలవు

౨ తంగటూరమడికుంటలు
౨ పొందలూరమడికుంటలు
౬ పెనలూరమడికుంటలు
౪ పొత్తపిగ్రామానమడికుంటలు

రాజశ్రీకుమార అనంతరాజువారు సెలవు యిచ్చినది
౫ సిద్ధవరం గ్రామానమడికుంటలు కడపకుమాచిన్నవాండ్లువచ్చినప్పుడు సెలవు యిచ్చినది.

౧౪ మొత్తము మడికుంటలు

మేము అన్నదమ్ములము భాగము అయిన తరువాతను సెలవు యిచ్చిన మడికుంటలు. ౧౦ చేను.

౧౦ పోలిగ్రామాన చేనుకుంటలు, ౫ గుండ్లూర మడికుంటలు, ౫ మన్నూర మడికుంటలు ౨ తంగటూరు మడికుంటలు, 3 ఓబలిమడి కుంటలు అంతు, ౨౦ చేనుకుంటలు, ౧౫ మడికుంటలు.

అంతు యెర్రబావి పుల్లారెడ్డివద్దనుండే సన్నదులు ౧౯ ; యివిగాక యింకా కొన్ని నన్నదులు మట్లివారు వ్రాసియిచ్చినవి కొన్నియున్నవి. నాగా అనంతరెడ్డిగారి నారాయణరెడ్డివద్ద యుండేది.

శ్రీ వెంకటపతి.

श्रीभवानीपते

శ్రీమతు నలమూరు కృష్ణారెడ్డి యిజారాతిదారు. తర్వాత సిద్ధవటంకు రాజశ్రీ వెంకటపతిజక్కరనుసరుసురువు హాకిమే సుబే కులు కర్నాటకు గారు అ॥ సురన్నసబానమానీనుఅలఫు. పొత్తపినాటి సీమకు నాగా తిరుమలరెడ్డిచేత చరావుదేఖీలు ఒప్పించి మేము కతపా పుచ్చుకొంటిమి. నీవు ఒప్పిన నఫరాగిపదివేలకు పులుగులనాడు పొత్తపినాడుసీమలో రెడ్ల మాన్యం దసబంధాల వలన గుత్తగ్రామాలవల్ల వారివారి అనుభవాలు పదియేండ్లుఆరభ్యాం మజుందారునిలెక్కప్రకారం విచారించి యీ తాలూకావారివల్ల దివాణానకు జమఅయినది పోగా నిలచిన అనుభవం మీద యీనఫరాగిపదివేలు దస్తుచేయవలెనని నిర్ణయంచేసియుంటిమి. ఇప్పుడు నీవు నెలందలూరిలోవుండే రెడ్లకు మరి రయితులకు ఆసరా యిస్తూ తిరుమలరెడ్డిని ఘూసాగాకుండా నీముతాలికుల ఉంచి తంత్రాలు చేస్తూ కతపా ప్రకారానకు పయికాలు కట్టమని నఫరాగి సమ్మంధం అయిదువేలవరహాలు తకదారు జమచేయమని తిరుమలరెడ్డిని ధావంతు పెట్టుతూ యీలాగున నడిపించుకొంటూ వస్తూయున్నావని జాహీరు ఆయెను. ఆ సమ్మతు నిఘాకు పోను మీకు యేమినిమిత్తం ఉండెను ? నీ ముతాలికుల ఉంచ కారణం యేమి ? ఈలాగైతే ఆతగాని నిఘా యేమినడిచేని ? పైకాలు యెట్లాచెల్లిస్తున్నాడు ? నీకు ఉచితంకాదు. నీ సమతులలో నీవు ఉండి నిఘాయేమివున్నాను అక్కడనే సాహేబి చేసి నడిపించుకొనేది. పొత్తపినాటి సీమనిఘాకు నీకు పనిలేదు. ఆ సంమ

తుకు మలుమహాలాదులు మొయిను యేమి యున్నది అది ముజరా యిచ్చి తిరుమలరెడ్డినే నిఘా నిర్ణయంచేసుకొని అందుకు యేర్పాటు చేసి పై కాలుచెల్లించుకొమ్మని రా॥ పర్వతాలకు తెలియవ్రాసినాము. నఫరాగి పదివేలకు పులుగులనాడు పొత్తపినాటి సీమ రెడ్లమాన్యదన బందాలువల్ల గుత్తగ్రామాలవలన యెవ్వరియెవ్వరి అనుభవాలు మజుం దారుని లెక్క పరామరచేయించి యీలా॥ వారివల్ల దివాణానకు జమ అయినది పోగా కొరువ అనుభవం కాదిని యీనఫరాగి పదివేలు తక్సీం చేసి, పులుగులనాటి దేశము రెడ్లమీాద లాజమ అయిన పైకం తిరుమల రెడ్డి దస్తుచేసే యిస్తున్నాడు. ఈ లాగున నిర్ణయంచేసినాము. ఈ ప్రకారం నడిపించుకొని రాజశ్రీ పర్వతాలకు తెలియవ్రాసినాము. నీవు నీజాగాలోనే ఉండేదిగాని పొత్తపినాటి సీమనిఘాకు పోవనిలేదు. తెలసి నడుచుకొనేది. మునువు తెరగడ యెట్లాచేసుకొన్నారో ఆచాలాబారు నడుచుకొనేది.

(చూ, అనుబం. పార్శ్వశాసనములు )

శ్రీవెంకటపతి. శాహం.

సూర్యుడు చంద్రుడు

శ్రీమతు నాగాతిమ్మారెడ్డిగారికి రాజశ్రీ వెంకటపతి జక్కర్సు నరునురువు......హకీమే నుబె కులు కర్నాటకులుగారు అ॥ను॥ స్నసబా పమానిను అలపు నివె శ్రీమద్యజనాదిషట్కర్మనిరతులయిన పౌండరీక యాజలవారికి నీవేజాబువ్రాసి పంపించినావు గనుక ఆయన మాతో తెలప గాను అన్ని వివరములు తెలిసెను. అందువల్ల ఉత్తరాలకు ఆయన తోను తెలియచెప్పినాము. రాజశ్రీ పర్వతాల లక్ష్మీనరను తరఫు దారు గారి పేరను వ్రాసి పంపించినాము. అదిగాన ఖాతిరు జమాతోను దివాణం దాలతు ఖ్యాహిలో నుండిన నఫరాగి జాహీరు చేసుకొని సరఫ రాగి అయ్యేది.

(అక్షరాలు కొన్ని మరాటీలోను నున్నవి)

(మిగిలినకాగితము ఉరుదు లిపిలోయున్నది.)

కౌలునామా రఫియ్యత యాలిపనహా గులామరజాబేగు అమీను ఫౌజుదారుగారు. నాగా కృష్ణారెడ్డి వ ఎర్రబాపు పెరుమాళ్ల రెడ్డి మొకదకదమ ఊటుకూరు తాలూకు పొత్తపినాడుకు వ్రాయించియిచ్చిన కౌలు. సు॥ స్నసలాసుసమానిూ అలఫుమీారు, మీారు ఉన్నదిక్కుకు గాలా వెంకటపతి రంపా వెంకటపతి వచ్చి బహుశా మాతో యేమిచెప్పినారో వారికి మాటలు మేముయేమి ఖాతిరికి తెచ్చినామో అని మీారు అందేశా చేసి మాహాజరికి రాకయున్నారని ముషుహాబరల అనా వెంకన్న కరోడి మాతో మాల్మ్ చేసె. గనుక, నేము ఖాతిరుకు తెచ్చి మీాకు నేము కౌలు యిచ్చిన వివరం. మేము వెంకటపతిగారి మాటలు విని మీామీాదతహాద్ది చేయతగ్గదిలేదు. మునుపుమీారు ఆ పతిహిాశాబితియేమి వెంకటపతి సందు మీాసందు తేరుగడ చేసుకొన్నారో అదే తేరుగడగాను నేము పక్షాపరపక్షము చేయక మీాయందు మరివొక విధంగా మనస్సున యెంచక నడిపించుక వస్తుయున్నాము. మరియేబాబుకు మీారు విచారం చేయక మా కౌలునమ్మి సుఖానమహాజూరికి వచ్చేది. మీా బాబుకు మీామాసందు ముషురల్లా అనాంపండిత అంజాజీ పాపాజీగారు ఉన్నారు. ఆయన వ్రాయంగా తెలుసుకొని ఆ చొప్పున పీసువాసు చేయక హాజరు వచ్చేది.

కవులునామా పింగళనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు రాజశ్రీ లింగోజిసంగర్సు తరఫదారు తరపు గుర్రంకొండగారు తాలూకు రంపా తిరుమలరెడ్డిరయా వ॥ పొత్తపినాడుకు వ్రాయించి యిచ్చిన కవులు గు॥ స్నసమాసబైన అల్ఫు. కసుబే పొత్తపు. రెడ్డితనంజదీమ ఫలిసు అయివుండగాను కసుబామజుకూరులో పద్దెనిమిది ఫణాల ఆయ మేరగాండ్లు ఏకస్తులై రెడ్డితనానకు చౌధరి తా॥ మజుకూరు కౌలుకావలెనని యిత్తిమాను చేస్తిరి గనుక ఆలాగే యిత్తిమాను మనసుకు తెచ్చుకొని కౌలు యిచ్చిన వివరం: కసుబే మజుకూరు రెడ్డితనం మొకర్రరుచేసి రెడ్డితనం మొకర్రరుచేసి రెడ్డితనానకు నీకు మాన్యం యిరువై కుంటలు మడి యిచ్చినారం. మా కవులు నమ్మి గ్రామంరెడ్డితనం చేసుకొని మాన్యం అనుభవించుకొని గ్రామం విస్తారపరచుకొని సుఖానసుండేది.

(ఖాళాబందులో కొంత వ్రాసినారు)

పైసెది మస్తా

పారశీ వ. ము



శ్రీమతు నాగా తిమ్మారెడ్డి వ తిరుమలరెడ్డి దేశాయి అక్షరములు తెలియదు. యీనిసు పొత్తపినాడు... వా॥ ఖుజుఖునహ ఉండే నుస్న సమాను సమానీ అల్ఫుమహూరల్ల అనాయి. అం తా వెంకటాద్రి అనే అతగాడు మహూరల్ల దౌలతు పంఢిత అజ్జనుమెల్లో వెంకటాద్రి ..లా తోను అక్కడ మీసహావాసాన నుంటున్నాడు. ఆతగానికి యిల్లుకట్టించి యిచ్చి ఆ జాగాను వారి కబీలాను కుదిరిచి అంకుల హాకీకత్తు హాజూరికి వ్రాసిపంపిస్తేను యిందువలన మీకు ముజరా చాలఅయ్యాని మహూర్లు అనాం మెల్లో వెంకట మాకు అవశ్యమైనవాడు; దరబారుకు తగువైన వాడు. కాబట్టి మీరు దివాని దౌలతఖ్వాహాలు కాగాను వ్రాయబడెను. ఇదియెరిగి బేపెర్వదు గాను తమఖా రాప్రయోజనంగా యెంచి నడిపించేది.

(మరాటి అక్షరాలుకొన్ని వ్రాసినారు)

చానే అజుబిఖ్తుబందు ఖానుసాహేబు.





కౌలునామా వజీరతుపనహ...... తా॥ నాగాతిమ్మారెడ్డి మోకదంము పొత్తపినాడుకు వ్రాయించియిచ్చిన కౌలు. స॥ స్న సమాను సమానీను అల్ఫు ఫ॥ మజుకూరు నాల్గుమేటీలుచేసి ఆలాగే నలుగురి చేత దివాణానకు కతుఫాలు విలేవేయించి అందుకు నరుకదుఫా నీవె వ్రాసియిస్తివి. గనుక ఆ చొప్పున నీవే తేర్చి నిరడచేసిన నాల్గుగు మేటీల మీద నీవేచేసిన తరువాత చ॥ పైకాలు రాబట్టగ నిల్వనబాకీకి నీవే చెప్పిన ప్రకారం యెవ్వరి యెవ్వరి ఆమిషంకొద్దినిష్ట హవాలాదారునిచేత రాబట్టిం

చినందుకు అనేక అత్తరియం వుంచి నడిపిస్తున్నారం. నీవే మరి యెందులకు నముశయం చేయక మన శహాసాహేబును చూచి నడిపిస్తున్నారము. మా కౌలు నమ్మి విశ్వసించి యుండేది. ఇందుకు తప్పిలేను తప్పినయే(?) మమ్మును నమ్మి దిలాసాతో వుండేది. చ ర మా॥ రజ్జబు.

(సుమారు పది అక్షరములు మరాటి లిపిలో వ్రాయబడినవి)

కౌలునామా రాజశ్రీ కంచనపల్లె రామచంద్రులయ్యవారు తరఫుదారు తరఫమహాలాతుహాయగారు నాగాతిమ్మారెడ్డి త॥ పొత్తపినాడుకు వ్రాయించి యిచ్చిన కౌలు స॥ స్న సమాను సమానిను అల్ఫు ప॥ నీకు పొత్తపినాటి సీమలో సేద్యనాద్యాలు విస్తారంగాయున్నవి గనుక కృష్ణారెడ్డి రాజశ్రీ లింగోజి సంగర్సు సరసురీతో విన్నపంచేసి అమా ......సర్వమాన్యంగా సెలవు యిచ్చియుండెను గనుక ఆ కృష్ణారెడ్డి తేరుగడ చేసి వ్రాసియిచ్చిన ప్రకారం నూరుకుంటల మడికి పొత్తపిని పదిహేను, నూకచేని పల్లెను పదిహేనుకుంటలు, తంగటూర పదిహేను కుంటలు, పెనగలూర పదిహేనుకుంటలు, వారానెల్లూర పదిహేను కుంటలు, సింగమలలో పదికుంటలు, పాటూర పదికుంటలు....వరన పది కుంటలు ఉభయం నూరుకుంటలు సర్వమాన్యంగా సెలవు యిచ్చినారం. యీ బైకుంటల చేను నేము సెలవు యిచ్చినారం. నీకు...* శాశ్వతంగా అనుభవించేది. కొన్ని మారాటీ అక్షరములు.

కంచనపల్లె రామచంద్రయ్యవారు.

ఈ రెండు మొహారులలోను (పారసివ్రాసి)యున్నది. అది తెలియలేదు.



శ్రీరామా

కౌలునామా రాజశ్రీ కంచెనపల్లె రామచంద్రులయ్యవారుగారు. తా॥ నాగా తిమ్మారెడ్డి మొకడం పొత్తపినాడుకు వ్రాయించి యిచ్చిన సూ॥ స్న సమాను సమానీను అలఫు. పరగణె మజుకూరి ఆరు మేటీలు

---

* ఇక్కడమూడు పంక్తులు కాగితం చినిగిపోయినది.

చేసి ఆరుగురిచేత దివాణానకు కతుబాలు విలెచేయించి అందుకు సరుక తుఖా నీవే వ్రాసియిస్తివి. కనుక ఆ చొప్పున నీవే తేర్చేనని వర(డ?) చ॥ ఆరుమేటీల మీాదను నీవేచేసిన ముద్దతుల చొప్పున పైకాలు రాబట్టంగా నిలిచిన బాకీకి నీవేచెప్పిన ప్రకారం వారివారి అముమంకొద్ది రాబట్టి నీయందు అనేక ఆంతర్యంవుంచి నడిపించుకొని వస్తున్నారం. నీవు మరియెందుకు సంశయంచేయక మా రామకృష్ణుడు లక్ష్మీనపతి మరియాదగా నిన్నుచూచి నడిపిస్తున్నారం, మా కవులు నమ్మి సుఖాన మా హితవిశ్వాసముతోను ఉండేది. ఇందుకు తప్పితే మా యిష్టదైవానకు తప్పినట్టు తెలిసి మా యందు వచ్చిన ద్రోహాలు లేక దేశం కుదిరించుకొని పైకం పాతికె చెల్లించి నీవు సుఖానవుండేది.

(ఇక్కడ కొన్ని అక్షరములు మరాటిలో వ్రాయబడియున్నవి.)

శ్రీమదనగోపాలా.

కవులునామా రాజశ్రీ ధర్మభూపాల భాలేరాయనింగారు. నాగా కృష్ణారెడ్డికి వ్రాయించియిచ్చిన కవులు. సూర సన్న నలాను తిస్సైను అలఫ్. పొత్తపినాటి సీమలోను మర్లబయలు అనే గ్రామం యిజారాతికి యిప్పించమని యిలతిమాను చేసుకొంటివి గనుక నీయిలతిమాను మనసుకు తెచ్చుకొని దేవాదాయ బ్రహ్మదాయాలు బేరీజుగాను, ఫలవృక్షాలలోనుగాను యీా సాలుమజుకూరుకు ౨౦ యిరువై చక్రాలు పెస్తరు సన్న అర్థసాలుకు ౩౦ చక్రాలు నిర్ణయంచేసి యిజారాతికి యిస్తిమి గనుక సదరు వ్రాసిన బేరీజు సాలుబస్సాలు ముక్కుండ్దాయా ప్రాప్తిని చెల్లించి చెల్లిన హుజుతులు పుచ్చుకొని గ్రామం ఖర్దుమామూారు ఆబాదాను చేసుకొని సుఖాన బ్రతికేది.

(ఇక్కడ కొన్ని మరాటి అక్షరములున్నవి)



శ్రీమదనగోపాలా

కవులునామా రాజశ్రీ శ్రీధర్మభూపాల భాలేరాయనింగారు నాగా వెంకటపతి నాగా కృష్ణయ్యకు వ్రాయించి యిచ్చిన దసవందర

కౌలు. సు॥ న్నుసలాసు తిస్సైన్నను అల్ఫ. మీరు యీ పొత్తపినాటి సీమలోను విందూరు అనే గ్రామాన కాలువ త్రొవ్వించి కొన్నాళ్లు ఫలాదులు అనుభవించి యీమధ్య తూమండాంబరాలచేత ఖిలమై పడిపోయి యుండగా యిప్పుడు తిరిగీ సాలు మజుకూరు కాలువ త్రొవ్వించి సాగుబడి చేసుకొనేము దసమందపు కౌలు కట్టిదయచేయుమని యిత్తిమాసు చేసుకొంటివి. గనుక, మీ యిత్తిమాసు మనస్సుకు తెచ్చుకొని మీరు కాలువ త్రొవ్వించిన సాగుబడిచేసిన మడికి సగముదసమందం కడమ సగము మడికి మేటికి కుంట ౧ కి ౧౩ లెక్కను పైస్తరుకు నాలుగు రూకల లెక్కను నడిపిస్తున్నాము. మా కౌలునమ్మి కాలువత్రొవ్వించి ఖర్దు మామూరు చేసుకొని దసబంధం అనుభవించుక సుఖాననుండేది.



శ్రీమదనగోపాల

కవులునామా. రాజశ్రీ ధర్మభూపాల భాలేరాయనింగారు నాగా కృష్ణారెడ్డి మొకద్దంకు వ్రాయించి యిచ్చిన కౌలు. సూ॥ న్నుసలాసు తిస్సైన్నను అలపు. పొత్తపినాటి సీమలో మల్లెమడుగు అనేగ్రామం సాగుబడి అయిధురా అయివుండను సాగుబడికి కవులు యిప్పించమని యిత్తిమాసు చేసుకొంటివి. గనుక, నీ యిత్తిమాసు మనస్సుకు తెచ్చుకొని నీవు ఆ గ్రామం పాలెకూరున యీ చిల్లర మరిచిల్లరకాండ్లకు యెవరెవరికి నీవు యేలాగు కౌలుయిచ్చి సాగుబడిచేస్తున్నావో నీవు యిచ్చిన కవులు తప్పక నడిపిస్తున్నాము. మా కవులు నమ్మి విస్తారంగా ఖర్దుమామూరి అబాదాను చేయించేది.

(ఇక్కడ మరాటి అక్షరములు వున్నవి.)



కౌలునామా. రాజశ్రీ బాపోజి హీరో పంతులు గారు న్నాగా కృష్ణారెడ్డి వ యెర్రబాపు పెరుమాళ్లరెడ్డిగారికి వ్రాయించి యిచ్చిన

కాలు. సు॥ నన్ను నలాను తిసై ౹సు అలఫు లోనున్నది. గనుక, గాలా వెంకటపతి రంపా వెంకటపతి నచ్చి యేమేమి మాకు వడ చెప్పినారో అందుకు నేము అనుకూలించినామో యిదిగాక రంపా వెంకటపతి కృష్ణా రెడ్డిగారి సందు తేరుగడలో నేము వెంకటపతికి సహాయముగాను నడిపించి నాము. అని యివి మొదలయిన విమరాలు రాజశ్రీ ఘంటీల వెంకన్న గారితో మీరు చాలా మందలించినారని ఆయన మాతోను తెలిపెను. గనుక మనస్సుకు వచ్చి నేము హిన్నాపి తప్పి ఒక నాటికి ఒకరిమాటలు విని ఒకరికి ఒకరికిని చిన్నబుచ్చు తగ్గదిలేను. మీరు మాతో యెన్నడు కలిసినవారుకారు గనుక మా స్వభావము తెలిసినదికాదు గనుక మీ స్వభావము మాకు తెలిసినది. ఇది వరకు మీ మనస్సు ఒక విధముగా నుండేది మాకు తెలియకయుండెను. ఇప్పుడు మీ బాబుకు వెంకన్న చెప్పినందున తెలిసెను. మీరు మరియెందుకు సంశయము చేయక మునుపు ఆపత హిస్సాభి చొప్పున యేమి నివాదా చేసుకొన్నారో అదే మేము సమ్మతించి నడిపించుకొంటున్నాము. మీలో మీకు అరలు పుట్టి అవి మాధర్మం తప్పి నడిపించవలసినది యేమి? మీరు నేము కలసిన తరువాతను నీ మనసు సమాధానం అయినట్లుగానే నడిచీని. వెంకన్న మీకు యే చొప్పున నడుచుకొన్నారో ఆ చొప్పున నేము నడుచు కొంటున్నాము గాన తెలసి మమ్ముల నమ్మివచ్చేది.

పారశీ మొహరు 

కవులునామా॥ నాగా కృష్ణారెడ్డిగారికి వ్రాయించి యిచ్చిన కాలు. సు॥ స్న ౧౧౹ ౩ అర్బామయ్యా అలఫు. త॥ గుండ్లూరి పరగణాలో జాగీరు సిబ్బంది గ్రామాలలో సేద్యం పెట్టుకొనే టందుకు కావలెనని తెలుపుకొంటివి. గనుక, ఆలాగే నీకు కవులు యిచ్చిన వివరం. వరిమడి తూము ౧ కి రుసుములుగాక ౧౦ పం౹డెండు రూకలు లెక్కను నిర్ణయంచేసినారం. మా కవులు నమ్మి విస్తారంగా సాగుబడిచేసుకొని సేద్యంపెట్టుకొని కవులాచారం సరకారుపైకం చెల్లించుక సుఖాన నుండేది.

(కొన్ని మాటలు మరాటీ లిపిలో వ్రాసియున్నవి)

ప్రమాదీచనామ సంవత్సర......శు॥ ౧౩ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి అనంతరాజు దేవచోడమహారాజులుంగారు ఊటుకూరు రెడ్డి కరణాలకు పుత్తెంచినప్రయోజనం. నాగా శేషయ క్రమించి పోయినందున ఆతగాని కొమారుణ్ని సముఖానకు పిలిపించి యుండి ఆతగాని ఖాసాశానకు ఆపనబడి పాతికె పాలు మన్నిమేచేసిసెలవు యిచ్చి పంపించినారం. ఆ ప్రకారం నడిపించేది. ఎందెందులకుకూడతి ౫ (?) నడిపించుకొంటూ వచ్చేది.

(ఇక్కడ మరాటి అక్షరములున్నవి.)

శ్రీరామా

ఆనందనామ సంవత్సర మాఘ బ॥ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి అనంతరాజు దేవచోడ మహారాజులుంగారు నాగా రాజుకు వ్రాయించి యిచ్చిన కౌలు. ఊటుకూరు ఊర పాటిస్థళాన తలారివాండ్ల యిండ్లకు దక్షిణాన అధ ప్రాకేండ్ల బీడుగడ్డమెత్తించి బావిత్రొవ్వించి పొగతోటచేసుకొనేను కౌలుసెలవు యివ్వవలెనని అడిగితివి. గనుక, నీకు కౌలు యిచ్చిన వివరం. సంవత్సరానకు కుంట ౧కి ౮ ర లెక్కను రెండోయేటికి కుంట ౧కి ౦౪౩ లెక్కను మూడోయేటికి కుంట ౧కి ౧౧౨ లెక్కను నాలుగోయేడు ఆరభ్యం యెల్లప్పటికి కుంట ౧కి ౧॥౧ పదహారు రూకల లెక్కను నడిపిస్తున్నారం. విస్తారంగా ఫలంచేసుక కవులాచారం రూకఅచ్చుక సుఖానసుండేది. వెలిపైరు సాగితేను దశ వందం బావిమాన్యం నడిపించి నిలిచినందుకు సంవత్సరానకు ౮ ౨ లెక్కను రెండోయేడు ౮ ౩ లెక్కను మూడోయేడు ఆరభ్యం యెల్లప్పటికి కుంట ౧కి ౮ ర లెక్కను నడిపిస్తున్నారం.

श्रीकोदंडराम

वेंकटरामराज

कुमार अनंतराज



శ్రీరామా

మరాటి అక్షరముల మొహరు.

దుర్మతినామ సంవత్సర ఫాల్గుణ శు॥ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కొమారఅనంత రాజు దేవచోడమహారాజులుంగారు నాగా రాజుకు వ్రాయించి యిచ్చిన కవులు నిరూపం. తరువాత, పూటుకూరి పొలంలో రాజుగారిపల్లెకు పరమటను మీ అయ్యవారట పల్లెకట్టించి నందులకు కౌలుసెలవు యివ్వవలెనని చాలావిన్నపం చేసుకొంటివి. గనుక నీకు కౌలు యిచ్చిన వివరం. ఆ స్థళమందు చెట్టుకొట్టిసి చేసుకొన్న పొలానకు యీ సంవత్సరానకు పెద్దపైరుకు కుంట ౧కి ల్ ౧౪ లెక్కను, కాయపైరుకు కుంట ౧కి ల్ ౧౦ లెక్కను, రెండో సంవత్సరానకు పెద్ద పైరుకు కు ౧కి ల్ ౧ లెక్కను, కాయపైరుకు కుంట ౧కి ల్ ౪ లెక్కను, మూడో సంవత్సరానకు పెద్దపైరుకు కుంట ౧కి ల్ ౧౪ లెక్కను కాయపైరుకు కుంట ౧కి ల్ ౹౹౹౦ లెక్కను నాలుగో సంవత్సరం ఆరభ్యం యెప్పటికి పెద్దపైరుకు ౧కి ల్ ౨ రెండుగూకల లెక్కను, కాయపైరు కుంట ౧కి ల్ ౧ హూక లెక్కను యీ ప్రకారం నిర్ణయంచేసి యిచ్చినారం. గనుక మా కవులు నమ్మి చెట్టునరికించి విస్తారంగా పైరుచేసుకొని పల్లె మామూలు పర్చుక సుఖానవుండేది. నీకు పల్లెగట్టుమాన్యం చేనుకు యెనిమిది కుంటలు కౌలు యిచ్చినారం. మాన్యం అనుభవించుకొని సుఖాన వుండేది. అని వ్రాయించి యిప్పించిన కౌలుసిరూపం.



శ్రీరామా

సూర్యుడు చంద్రుడు

మరాటి మొహరు

నందన సంవత్సర మార్గశిర బ॥ ౬ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి కొమారఅనంతరాజు దేవచోడమహారాజులుగారు నాగా కృష్ణ

మయకు యిచ్చిన కవులు నిరూపం. తరువాత వూటుకూరను తిమ్మారెడ్డి, పేరిటను చెరువు వేయించి ఆ చెరువుకిందను నారాయణరెడ్డికాల్వను చేను జంతి మడి స్తలం అనాది బీడుగాను వుండెను. గనుక, సంవత్సరాన అచ్చు కట్టించుకొనేటందుకు యిచ్చిన కవులు వివరము. అచ్చుకట్టు తేలిన పొలానకు సగంపాలు దసమందం పోగాను నిలచిన నగరి పొలానకు యీ సంవత్సరం ఫలానకు కుంట ౧ కి ల్ ౧ లెక్కను, రెండో సంవత్సరం ఆరభ్యంగాను దసవందాల ప్రకారం తప్పక నడిపిస్తున్నారం. మాకవులు విశ్వసించి విస్తారంగాను సాగుబడి సంతనచేసుకొని సుఖాన వుండేది.
(మరాటి అక్షరాలు)

శ్రీరామా

వికృతినామ సంవత్సర ఆషాఢ బ॥ 3 లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడమహారాజులుగారు నాగా క్రిష్ణమ యకు వ్రాయించి యిప్పించిన కవులు నిరూపం. తరువాత, వూటుకూరి పొలంలో ఫల్లనాగుకు తూర్పు మీ తండ్రిగారి పేరట చెరువు చేయించి అక్కడ పల్లెకట్టించెను. అందుకు కవులుకావలెనని విన్నపంచేసుకొంటివి. గనుక నీకు కవులు యిచ్చిన వివరం. యీ సంవత్సరమునకు చలక బీళ్లకు పెద్దపైరుకు కుంట ౧ కి ల్ ౧ లెక్కను, కాయపైరుకు కుంట ౧ కి ల్ ॥ అడ్డగ లెక్కను, చెట్టుగొట్టి చేసిన చేలకు కుంట ౧ కి ల్ ॥, కాయ పైరుకు కుంట ౧ కి ల్ । లెక్కను ఖరసంవత్సరమునకు ల్ ర నాలుగు రూక ప్రతికి మూకన్నడ్డుగ అడ్డుగ ప్రతికి ముప్పాతికె లెక్కను, నందన సంవత్సరమునకు రూకాన్నడ్డుగ ప్రతికి రెండేసిరూకల ముప్పాతికె ప్రతికి రూక లెక్కను, జయసంవత్సర మారభ్యంయెప్పటికి పెద్దపైరు కుంట ౧ కి ల్ 3 మూకు రూకల లెక్కను, కాయపైరుకు కుంట ౧ కి ల్ ౧॥ రూకాన్నడ్డుగ లెక్కను యీ ప్రకారం తప్పక నడిస్తున్నారం యిందుకు పల్లెగట్టు మాన్యంకు ౧౦ కుంటలుచేను శల్వొయిచ్చినారం, మాన్యం అను భవించుక కాపులకు కొలు విస్తారంగా ఫలపరుచుక......స్తున్నారం. తెలిసి పల్లె మామూలు చేసుక సుఖాన వుండేది.

(ఇక్కడ మరాటి అక్షరములు కలవు.)

శ్రీరామా

విక్రమనామ సంవత్సర అధిక ఆశ్వీజ శు॥ ౧౦ లు శ్రీమన్మహా మండలేశ్వర మట్లి గోవిందరాజు దేవచోడమహారాజులుంగారు నాగా క్రిష్ణమయకు వ్రాయించి యిచ్చిన దసవందపుకవులు నిరూపం. పులు పత్తూరి పొలమున తుమ్మునూతికలికిరికి కాలువలు తీర్పించి కలికర్లు అచ్చుకట్టుకొనేము దసవందంకావలెనని విన్నవించేసుకొంటిరి. గనుక అందులకు సెలవు యిచ్చిన వివరము. ఆ కాలువకింద తేలినమడికి సమాంశం దశవందం పోగా నిలచిన నగర సగంమడికి ముదటి ఫలమునకు కుంట ౧ కి లే ౧ లెక్కను, రెండోఫలమునకు కుంట ౧ కి లే ౨ రూకలు, మూడోఫలానకు కుంట ౧ కి లే ౩ రూకలవంతున యెల్లప్పటికి నడిపిస్తు న్నారం. మా కవులు నమ్మి మీ పుత్రపౌత్ర పారంపర్యముగా దశ వందం ఫలపర్చుకొని సుఖాన వుండేది.

(ఇక్కడ కొన్ని బాఘాబందు అక్షరములు వ్రాయబడినవి)

శ్రీరామా

యీశ్వరనామ సంవత్సర శ్రావణ శు॥ ౩ లు శ్రీమన్మహామండ లేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడ మహారాజులుగారు నాగా క్రిష్ణమరెడ్డికి వ్రాయించి యిప్పించిన కవులు నిరూపం. యీ సంవత్స రానకు మర్ల యి॥ లు యిజారతికి కావలెను అని తెలుపుకొంటివి. గనుక దేవాదాయం బ్రహ్మాదాయం కావలికానుగోత్రలేశ్వరం(?) వినహా గాను ఆరంభం చక్రాలు గ ౧౬౦ నూటఅరవై చక్రాలకు యిజారాతికి యిచ్చినాము. సదరహీ బేరీజు ముక్కాందాం ప్రాప్తిని చెల్లించే చేలును వాయిజూరు తలుపు॥ పప్పూకంలో(?) గ్రామం మామూలుచేసుక సుఖాన వుండేది.

(నాగరి వున్నది.)

శ్రీరామా

యీశ్వరనామ సంవత్సర శ్రావణ శు॥ ౩ లు శ్రీమన్మహామండ లేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడమహారాజులుంగారు నాగా క్రిష్ణా

రెడ్డికి వ్రాయించియిచ్చిన యిజారతి కవులు నిరూపం. వల్లూరి పల్లె యీ సంవత్సరానకు యిజారతికావలెను అని తెలుపుకొంటివి. గనుక నీ మనవి చిత్తగించే దేవాదాయం బ్రహ్మదాయాలు కావలి కానుగోయి త్రేతేశ్వరం కొలువున్న వినహాగాను అపరంజి చక్రాలు ౧౦౫ నూటఅయిదు చక్రాలకు యిజారతికి యిచ్చినాము. సదరహు బేరీజు ముక్కండాయం ప్రాప్తిన చెల్లించే చేలును హుజుతులు పుచ్చుకొని యీ గ్రామం మామూరు చేసుకొని సుఖాన వుండేది.

(ఇక్కడ బాళాబందులో కొంచెము వ్రాసియున్నారు)

శ్రీరామా

రౌద్రినామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౫ లు శ్రీమన్మహామండ మండలేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడమహారాజులుగారు నాగా రాజుకు వుత్తించిన ప్రయోజనం. తరువాత నారాయణరెడ్డి మేటి యీ మధ్య రాజశ్రీ అనంతరాజువారి నాడు చెరిసగం చేసుకొని రంప తిమ్మప్ప నీవు అనుభవిస్తూవుంటిరిగదా. యీలో తిమ్మప్ప లిగాడు వడి యంత మార్గంచేసి దయచేసినావో(?) పొలం అంతాబీడు పెట్టుకొని నగరికికూడి రాకపోమె. గనుక పూర్వంరాజశ్రీ వెంకట్రామరాజువారు రాజశ్రీ తిరు వెంగళనాధరాజువారు తేరుగడ చేసిన జయం లెక్కప్రకారం నీకేకరారు చేసిసెలవుయిచ్చినారం. యీసంవత్సరం వడికాలము గనుక వొకమార్గంగా దయచేసి పట్టుక వస్తున్నారం. నంగడిరెడ్లతోపాటు మీాదటి సంవత్సరం ఆరభ్యం నగరికి రూకలు వొప్పుకొని మీా మీారాశీలు స్వదేశపరదేశా లలో యెక్కడవున్నా మీా పుత్ర పౌత్ర పారంపర్యముగాను అనుభవించు కొని సుఖానవుండేది.

(ఇక్కడ నాగరి అక్షరములు కొన్ని యున్నవి.)

శ్రీకృష్ణా

దుర్మతినామ సంవత్సర భాద్రపద శు॥ ౨ లు శ్రీమన్మహామండ లేశ్వర మట్లి వెంకట్రామరాజు దేవచోడమహారాజులుంగారు పూాటు

కూడు రెడ్లు నాగా నాగా రాయ యనె బాపు రాఘవరెడ్డికి వ్రాయించి యిచ్చిన యిజారాకవులు. కూడు యీ సంవత్సరానకు మీ గ్రామం యిజారా చేసేము. కవులు దయచేయవలెనని విన్నపంచేసుకొంటిరి. గనుక చిత్తగించి కవులు యిచ్చిన వివరము. చెరువు నిండితే సకల సువర్ణాదాయం ధాన్యములు ససంపూర్ణములు ఫలవృక్షాలు దేశీలు గాను కొలువుచెళ్లు బేరీజుగాను 3000 రాజచక్రాలున్ను, చెరువునిండ కుంటె 2200 రెండువేలరెండువందలున్ను రూసుమూకట్నాలున్ను దేశీలుగాను, నిర్ణయంచేసి సెలవుయిచ్చినారము. గ్రామం వుద్యమానం పొలం కాపులను చెరసఖాన వుండచూచుకొని నాగా అనంతయ వెంకటపతిగారిని రాజుమేటిలోను తిమ్మప్పమునసలయగారిని రాఘవరెడ్డిమేటిలో వుంచుకొని గ్రామంలో రైతురజాబంది సాగుబడినంతను విస్తారంగా చేసుకొని సదరహీ యీ ప్రకారము కవులు అనుభవించుకొని నిర్ణయము ప్రకారము ముక్తాదాయం ప్రాప్తిని దివాణాకు రూకలు అచ్చుకొని నగరిపట్ల విశ్వాసంవుంచుకొని నడుచుకొంటూ సుఖానవుండేది. గ్రామం ఖర్చులు యేమివున్నా గ్రామంలోనే వుండచూచుకొనేది.

స్వస్తిసమస్తనిజనామాంకితమాలికా ప్రశస్తసహితులయిన శ్రీనుద్గణేశ్వర గౌరీశ్వర దేవరదివ్య శ్రీపాదపద్మారాధకులయిన పరసమయ ధ్వాంత విధ్వంసకులయిన పరసమయ వేశ్యాభుజంగులయిన సర్వసమయ ప్రళయకాలాంతకులయిన పరసమయనిర్ధూమధాములయిన పరవాక్య ప్రమాణాగ్నులయిన బంధుజనచింతామణులయిన నయవినయ దయా దాక్షిణ్య పరవుపకారులయిన అఖిలైశ్వర్య సంపన్నులయిన దేవబ్రాహ్మణపూజావిధేయులయిన అనవరత భూసురాశీర్వాద సంపన్నులయిన, శరణాగత వజ్రపంజరబిరుదాంకులయిన కస్తూరి, కర్పూర, గోరోజన పట్టు పటువాసనా సురభిద్రవ్య నిపుణులయిన పూగిఫలసద్వర్ణనాగ వల్లిదళ కర్పూర చర్చిత చూర్ణసహితగంధ కస్తూరి పునుగు జవ్వాజి పరిమళాలంకృతులయిన, మౌక్తిక, మాణిక్య, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరగత, నీల ప్రవాళంబులనియెడి నవరత్న పరీక్షకులయిన చీనిచీనాంబర పట్టుపటావళి సకలాతి మొదలయిన వస్త్రాలంకారు

లున్ను, కరుణయందు రఘుపతియంతవారలున్ను కావ్యమందు కాళిదాసు యంతవారలున్ను, సత్యభాషా హరిశ్చంద్రులున్ను, అసిముసలముద్గర భిండివాలకరవాలపరశు పట్టిశప్రాశ త్రిశూలగదకుంతలాది భత్రి(బత్తి) శాయుధప్రవీణులయిన, ధర్మాధర్మ వివేకశాలులైన, మంచుకుంచాన గొలుచు నేర్పరులున్ను పారెలండ్లకు పాదములుచాచు వారలున్నూ చింతా కునగంతకట్టువారలున్ను, పులిమీసాలను యుయ్యాలలూగు(వారలున్నూ) చత్రాతిన నారచీల్చువారలున్నూ, తృణము మేరు(మేరు) వీతృణంచేయు వారలున్ను, చెల్లేనాణ్యం చెల్లనించక చెల్లిన నాణ్యం చెల్లింప రక్షకులున్నూ, బయిలే పందిలి ఆకాశమే మేలుకట్లుగా గల పంచాశత్కోటి విస్తీర్ణ భూమండలము సింహాసనముగాగలవారలున్నూ, దుష్టనిగ్రహ శిష్ట పరిపాలకులున్నూ, ఆచారాగ్రగణ్యులున్ను, శివాచారసంపన్నులున్నూ, గంగాసాగర గాంభీర్యపవిత్ర చరితులున్ను, వృషామహేశ్వరగర్భ నంజనితులున్నూ, హరిహర పూజా విధేయులున్నూ, మహామ్మేరు పరిసమాన ధీరులయిన తంగటూరు, గండవరము, నెల్లూరు, వెంకటగిరి, రాపూరు కడపేరు, మహిమలూరు, ఉదయగిరి, బద్దెవోలు, శిధవటు(ట)ము దువ్వూరు, చాగలమర్రి, కృష్ణాపురం, బసగానిపల్లె తిమ్మానాయునిపేట గుత్తి, చిర్యేడుదుర్గం, బసువపట్ణం వోసుభాయి సక్రయపట్ణం, బెంగుళూరు, కొత్తపాళెం, గుర్రంకొండ, కావేరుపాక, పులివెందల, మల్లేల, సొరబు, వేంపల్లి కోమాళ్ల కాల్వ, రాచవేడు, అనంతరాజుపేట, మన్నూరు, తిరువెంగళనాథరాజు పేట మొదలయిన చతుర్దిక్కుల యాభైయూరు దేశం మహానాడు వారున్ను, నాగా తిరుమలరెడ్డి కొమారుండు తిరుమలరెడ్డికి యిచ్చిన దానపత్రం. మీకు చాలి చాలాబాడుగాను కృతం చతుర్దిక్కులా యాభైయూరు దేశమువారున్నూ మగసుంకం తీర్పుకు నిలచిన నగలకు వక్కలనగకు ౦౧= వరకా, మిరియాలు నగకు ౦౧=వరకా, దూది కట్నానకు ౦౧= వరకా, కొబ్బెర, ఖర్జూరం, శీకాయ, మెంతి మొదలయిన నగకు ౦౧= లెక్క, తొగురు గుంతకు ౦౧।౦ పాతికె, దవసం పెరికెలకు ౦౧= వీసం లెక్కను; పుప్పునగకు బెల్లం నగకు ౦౧= లెక్కను, జవళికట్నాలకు సన్నపు జవళీకి ౦౧౦।౦ పాతికె, ముతకజ

వశీకిం ౨౧= పరకా, పట్టెల శెంగానకు ౧-౦ వీసము, పొగాకుకట్టానకు ౧౧-౦ వీసము, ఆముదం, నూనె, నెయ్యి నగలకు-(వీసము) లెక్కను మడ్డి చెక్కనగకు, అల్లి ఆకు నగకు ౧౧-౦ లెక్కను, యీ మరియాదను దేశంవారు మీకు నగము పొత్తపినాటి పేము పోలుగువాటి సీమల నాల్గు మండలాల నడిపించి వుండిరి. గనుక, యీ ముఖ్య అవాంతరవ్యవస్థ చేత నడవక వుండె. గనుక యూ ప్రాలి మామూలు నడిచినది యెప్పటి వలెనే నడిపించవలెనని మాలో మీకు తెలుపుకొంటిమి. గనుక, ఆలాగ యీ ఆరు దేశాలవారమున్ను సమ్మతించినారము. గనుక, యీ మర్యాదకు మీ పుత్రపౌత్ర పారంపరియంగా ఆచంద్రార్కస్థాయిగా అనుభవించగలవారు. యీ దానపత్రం బసవేశ్వర దేవర సాక్షిగా వ్రాయించి యిచ్చినారము. యీ దానపత్రం విరోధికృతునామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౫ లు వ్రాయించి యిచ్చిన దానపత్రము. అంతు ౨౮. యిదిగాక యీ అనంతయగారి నారాయణరెడ్డివద్ద యింకా కొన్ని సన్నదులు కాగితములు చెదులు తిసిపోయి వుండేవి కొన్ని వున్నవి.

శ్రీరామా

నాగా శేషారెడ్డివద్ద వుండేవి.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౩౩ అగునేటి పరిధావినామ సంవత్సర చైత్ర బహుళ ౧౦ లు శ్రీమద్యజన యాజన అధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన దేవపూరికి ప్రతినామమైన తిమ్మసముద్రం అగ్రహార స్థితా శేష విద్వన్మహాజనాలున్ను తిమ్మసముద్రం రెడు కోడిమోపూరిరెడ్డి, పెదకంబిరెడ్డి, దేపలుపెద్దగుడ్డ రెడ్డన్న, కరణాలు తిరువెంగళప్ప అప్పయగారి వెంకటాద్రి, చీనేపల్లి పెదసుబ్బయ్య, అమునలప్పగారు శ్రీమతు నాగా నారాయణరెడ్డిగారికి వ్రాయించి యిచ్చిన సమాఖ్యపంటకమ్మ. మాగ్రామంలో చెల్లేగొల్లపల్లెలో వంకబడిగావుండి తొమ్మిది కాలువలకు ప్రాకు సంవత్సరం వరకు స్థితం అయివున్న మడికి ఖండదెనమందం నిర్ణయంచేసి యీ సంవత్సరం ఆరభ్యం అచ్చుతేలిన మడికి చెరువుకు అనుకువగా దస

మందం నిర్ణయం చేస్తిమి. గనుక ఆమరియాదగానే తిరుమలరెడ్డి చెరువు ఆరభ్యంగాను వంక చెయ్యేరున కలిసెవరకు యీ సందున వంకబడి కాలులకు ప్రాకుసంవత్సరం కకు స్థితంఅయి చెంగవరిశప్రకారం స్థితం అయినది పోగా సంవత్సరం ఆరభ్యంగా అచ్చు తేలి మడ్డికి చెరువుకు అనుకువగా పాళ్లవెంబడిని దసవందం నడిపించగలవారము. నేడు ఆరభ్యంగా కన్నె కాలువ యేమి పుట్టినప్పటికిన్ని చెరువు కింద కే అణుకువగా నడిపించగలవారము. యిటని మా రాజీనా వ్రాయించి యిచ్చిన సమాఖ్యపట్టకమ్మ.

౧ కాళిదాసు గురుపప్ప వ్రాలు.
రెడ్లు ఘంటంముట్టిన సవృజ్ఞ.
౧ కరణం తిరువెంగళ వ్రాలు.
౧ నిట్టూరి చెన్నప్ప వ్రాలు.
౧ దర్భాలరాజన్న వ్రాలు.
౧ దర్భల వెంకటాద్రి వ్రాలు.
౧ చిట్టియగారి వెంకన్న వ్రాలు.
౧ యయరవరవాబన్న వ్రాలు.
౧ వెంకటాద్రి వ్రాలు.
౧ పెదసుబ్బయ వ్రాలు.



శ్రీమదనగోపాల

కవులునామా రాజశ్రీ ధర్మ భూపాలు బాలేరాయణింగారు నాగా కృష్ణయకు వ్రాయించియిచ్చిన దసమందం కవులు. ॥ సు ॥ స్న ॥ సలాను తిస్సెను అలఫ మాజాగీరు పొత్తపినాటిసీమలోను తేబాక అనే గ్రామాన యేటికాల్వ తోవ్వించి ఆ కాల్వ కిందపోయి ప్రయానమీద మడి దీయించేము అందుకు దెసమందము కవులు కావలెను అని యిలతి మేను చేసుకొంటివి గనుక నీ యిలతిమేను మనస్సుకు తెచ్చుకొని నీకు నడిపించిన మర్యాద. నీవు కాల్వతోవ్వించి ఆకాల్వకింద తేలిన మడికి సగము దసమందం కట్టడ చేసినాము. కడమ సగము మడికి యీ యేటికి రెండేసిరూకలెలెఖ. వెస్తరుసాలుకు మూడేసిరూకలుచొప్పున నడిపిస్తున్నాము. మా కవులునమ్మి కాలువతోవ్వించి విస్తారంగా ఖర్చుచేయించి సఖము మడి దెసమందం అనుభవించుక కడమ సఖముకు సదరహీ

ప్రకారము కవులుచొప్పున తీరువఅచ్చుకొని ఖర్దు మామూలు ఆబాదాను చేసుక సుఖానవుండేది.

(ఇక్కడ కొన్ని అక్షరములు నాగరిలిపిలో వున్నవి.)

శ్రీరామా.



సూర్యుడు చంద్రుడు

మట్లి తిరువెంగళనాథరాజు

వ్యయనామసంవత్సర వైశాఖ శు॥ ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడ మహారాజులుగారు నాగా క్రిష్ణమయకు యిచ్చిన కవులునిరూపం. తరువాతను నీవు యీ మధ్యే సమాధానం చాలక వున్నందుచేతను నీ మిరాసీలు నడువక వుండేటందులలో యిప్పుడు దివాణం ప్రస్తుతమతుల నిర్వాకం వయించే నడిపించుకొంటివి. గనుక నీయందు దయచేసి మహారాజశ్రీగారు నీకు యేప్రకారం దయచేసి నడిపింతురో అటువలెనే మార్జాడ సీమలో నారాయణరెడ్డి చెరువు సంబంధం మడి పొత్తపినాటి సీమలో మిరాశీలు దసమంధంలు మొదలయినవి సెలవుయిచ్చినారం. యితరాలోచ చేయక మహా రాజశ్రీగారి దినములలో నడిచిన మిరాశీలు దెసమంధంలు మార్జాడ సీమలో చెరువు దెసమంధం మొదలయునవి అనుభవించుక మా హిత విశ్వాసములలో బుద్ధిమంతుడవై స్వామికార్య పరుండవై సుఖాన వుండేది.

(ఇక్కడకొన్ని నాగరి లిపిలో వ్రాసిన అక్షరములు కలవు)

శ్రీరామా

వ్యయనామ సంవత్సర శ్రావణ బ॥ ౨ లు శ్రీమన్మమహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడ మహారాజులుంగారు నమస్కారము. తరువాత నాగా తిమ్మారెడ్డి నారాయణరెడ్డి పొలంలోకూడి

నందులకు వొకరిమేటి ప్రకారము చెప్పక తంటలుచేస్తు వున్నారట. యీలాగే మానము బాస మనిమి చేసుకొన్నారు. యర్ర బాపు రాఘవ రెడ్డి కో(?)ప్రకారము నీరారంభం కోనేరెడ్డి కో(?)ప్రకారం కాడారంభం ఆప్రకారం పొలం వీరికి పంచియిచ్చేటట్టుచేసేది. ఇందుల ఫిర్యాదు రాకుండా నడుచుకొనేది గాన తెలిసేది.

శ్రీరామా

నందననామ సంవత్సర ఆషాఢ బ॥ ౭ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువెంగళనాథరాజు దేవచోడ మహారాజులుగారు నాగా రాజుగారి తిమ్మారెడ్డికి శేషారెడ్డినారాయణరెడ్డికి వ్రాయించి యిచ్చిన కవులునామా. తరువాత, వూటుకూరు గ్రామంలో మీ మేటితోకూడి నందులకు అచ్చే లెక్కలు కసానుపడి మేటి విడిచివేసి కొంచెగువ్వ కవులుకు వ్యవసాయముచేసుకుంటువుండి యిప్పుడు తిరుణాలు సముఖానకు వచ్చి సెలవుయిస్తే మామోతె మీరు చేసుకొనేము అని మనివి చేసుకొంటిరి. గనుక, అదేప్రకారం సెలవుదయచేసి యిచ్చినారము. వొక మేటి ప్రకారము గ్రామం చేను దెసమందాలు వుండచూచుక సాగుబడి చేసుకొని వొక మేటి వయ్యందరూకలు ముకందాయం ప్రాప్తిన అచ్చుకొని గ్రామంలో వ్యవహారము విచారించుకొని సుఖాన వుండేది.

శ్రీరామా



సూర్యుడు. చంద్రుడు.

మట్లి వెంకట్రామరాజు

ప్రభవనామ సంవత్సర శ్రావణ బ॥ ౧౩ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రామరాజులుగారు యర్రమనేని వంజికొండమనాయునికి వు॥ ప్రయోజనము॥ తరువాత గొల్లపల్లె దగ్గర నారాయణరెడ్డి చెరువుతో కూడిన సమాచారానకు సయిదు సాహేబులవారు రాజం రెడ్డి మీద దయచేసి కవులు వ్రాయించి యిచ్చివుండిరి. ఆ ప్రకారం నడుపక తిమ్మసముద్రం రాఘువుండు అన్యాయముచేసి రూకలు తీసు

కొనిన్ని గడ్డిసవాగా విక్రయించుకొంటేను రాజురెడ్డికి కవులు పుట్టవలెనని సాగుబడి నిలిపి స్తే రాఘవుండు సాగుబడిచేయించేమంటె నీవు అనుకూలించి వీరికి కవులు పుట్టకుండా సాగుబడి చేసున్నారట. యిలాగే సాలాదు వేల పరియంతరం వ్రయంచేయించి చెరువు కట్టించి కవులు బహుదినములనుంచి నడిచే కవులు తప్పించినందున వారు కవులుకు వస్తే నీవు మిరాశిదారుండవు వారి మిరాశినడపకుంటే ముందర నీకు యేట్లా నడుచును. రాజంరెడ్డి మాసముఖానవుంటె మేము దయచేస్తావుంటే యిప్పుడు నీవు యీలాగు యేమి విచారించి నడుచుకున్నావు. యిందు నుంచే నీకు యేమి వ్రాయవలసినది. యిప్పుడు నిరూపం పంపాస్తూనే రాజంరెడ్డి కవులు అయి అతడు వచ్చే సాగుబడి చేసేపరియంతము ఆ చెరువు కింద సాగుబడి చేయపని లేదు. దూరము తెలసి వ్రాసిన ప్రకారము నడుచుకొనేది.

(ఇక్కడ కడపట కొన్ని నాగరి అక్షరములు కలవు)

శ్రీరామా



సూర్యుడు. చంద్రుడు.

మట్లి వెంకట్రామరాజు

ప్రభవనామ సంవత్సర పుష్య శు॥ ౧౦ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకటరామరాజు దేవచోడ మహారాజులుగారు గొల్లపల్లె రెడ్డికరణాలకు వ్రా॥ జు॥ బ్రాహ్మణకరణాలకు సు॥ తుం॥ నారాయణరెడ్డి చెరువు సం॥ దనమంధం వ్రాకున నాగారాజుకు నడవకుండా తంటాలు చేసి యిరుగారు ధాన్యం విక్రయించి గడ్డి సవాగా విక్రయించుకొని సంవత్సరం సాగుబడి కాకుంటే నిమిత్తంలేని రంప తిమ్మాప్పను పిలుపించుకొని రాఘవుడు తంటాలు చేసినాడట. యీ ప్రకారం నడిపించుకో వలసిన మానా యేమివున్నది? యిటువలె తంటలు చేస్తే చెడిపోయ్యేను. తెలిసి వ్రాకు సంవత్సరములకు రాజుకు రావలసిన ఫలం

యిప్పించి యిందు ఫిర్యాదురాకుండా నడుచుకొనేది. రంప తిమ్మప్ప అక్కర పనిలేదు. తెలిసి జాగ్రతగా నడుచుకొనేది గాన తెలిసేది.

(ఇక్కడ నాగరి అక్షరములు వ్రాయబడినవి.)

నాగా శేషారెడ్డి వద్ద వున్నది ౭.

అంతు పూటుకూరు రెడ్లవద్ద వుండినది ౮౦ నల్లబై.

మాజేనరసింగరాజపురం అగ్రహారీకులవద్ద వుండే తెనుగు తామ్ర శాసనము పలకలు అయిదు ౫కి నకలు.

హారే ర్లీలా వరాహస్య దంష్ట్రాదండ స్సపాతునః ।
హేమాద్రి కలశా యత్ర ధాత్రీ చ్ఛత్రశ్రియం దదా ॥
జయతి శ్రీపతేర్లీలావాస భూమండలో రవిః ।
యద్రూపం సర్వదోపాస్యం బ్రహ్మవిద్భిస్సనాతనం ॥
తత్పుత్రో వైవస్వతో మనుర భూ త్సూను స్తదివ్యో మహాః ।
నిక్ష్వాకుప్రభు రస్యవంశతిలకో రాజాదిలీపో రఘుః ।
తస్యాపత్య మజ స్తతో దశరథ శ్రీరామచంద్ర స్తత ।
స్తద్వంశోద్భవ దేవచోడకులజ శ్రీమల్లి కోనప్రభుః ॥
శ్రీమాన్ యల్లమరా ట్తత స్సమభవద్యః సిద్ధపూర్వ్వంవటం ।
లబ్ధ్వాతత్ర పరాక్రమేణ మహతా రాజ్యం కరోతిస్మసః ॥
రామాద్యా ఇవ సూనవోస్య నృపతే శ్చత్వార ఏషాం సుతో ।
నంతక్ష్మాధిపనందన స్సమభవ త్తిర్వేంగళేంద్రో నృపః ।
శౌర్యౌదార్య గుణాన్వితః పితృసమో రాజ్యాభిషిక్తో బభౌ ।
మత్స్యాంకై ర్వ్వరగండముఖ్యబిరుదై ర్విఖ్యాతకీర్తి శ్రియా ॥
తత్పుత్రాః ఖలు పంచ తేషుచ కుమారానంతరాజో మహాన్ ।
భేరీనాదభయంకృతారిహృదయో భూమీవరాహాంకితః ।
చిన్నానంతమహీపతిశ్చ బల్లవాన్ తస్మాత్సుజాతః కుమా ।
రానంతక్షితిపాలకో స్యతనయాః కృష్ణాంబికాసంభవా ॥

యాకృష్ణమాంబాతనయా వభూతా మనంతరా ద్వేంకటరామరాజా ।
తయోః స్వధర్మార్జితభూమిభాజోః ప్రతాపవాన్ వెంకటరామరాజః ॥

తస్యదానపయోధారా ససువర్ణసరస్వతీ ।
రిపుస్త్రీబాష్పయమునా కీర్తిగంగాసవీత్రయం ।
శ్రీమద్వేంకటరామభూవర పతేః శేషాంబికానందనః ।
కందర్పాంకమలేవ శైలతనయా లేభే కుమారం యథా ।
పౌలోమీవ జయంత మాత్మని కుమారానంత రాజం తతో ॥

నంతక్ష్మాధిప మేవమేవ సుగుణం సామంత సర్వోత్తరం ।
యోయం వెంకటరామరాజ తనయ స్తిర్వేంగళేంద్రో నృపో ।
నంతా దగ్రతయేవ సోభ్ను దభవ ద్వేగాంబికాగర్భతః ।
ఏతాన్ వేంకటరామరాజ తనయా స్సంతః ప్రకాశాగ్రణే ।
త్రేతాగ్నీరివభావయన్ రిపుగణః ప్రాప్నోతివందారుతాం ॥

కుమారానంతరాజస్య గోత్రోద్ధరణకాంక్షిణః ।
తా వృభా వనుకుర్వాణౌ[...]జావివ నిజానుజౌ ।
సోయం వేంకటరామరాజతనయో విఖ్యాతకీర్తిర్ముదా ।
విద్వద్భి స్సహితః పురోహితగణా మాత్యానుజన్మాన్వితః ।
స్వామిన్ గండరబాల శత్రుగజసింహాంకేతి వందిస్తుతో ।
రాజ్యం శాస్తికిరీటరత్నకుసుమై స్సంపూజితాంఘ్రిః పరైః ।
సదా తన్మాతుల శ్రీమాన్ చెన్నరాజో మహాబలః ।
తద్వృద్ధిమేవ మనుతే సర్వకార్యవిచక్షణః ।
సేనానీ స్సురసేన మేవ సమరే తచ్ఛేనయా సంయుతః ।
శత్రూన్ హంతి హరి ర్యథామదగజేంద్రాం స్తారకాదీనివ ।
తస్మాచ్చెన్ననృపాల ఇత్యభిహితం త న్నామమాత్రం నృపాః ।
శ్రుత్వా భీతియుతా భవంతి సతతం దేశాంతరేపి స్థితాః ।
యోయం క్షీరసముద్రజో హిమకర స్తత్సంతతౌ శంతను ।
స్తద్వంశే విజయోభిమన్యు రథ తత్పుత్రః పరీక్షి త్తతః ।
తత్పుత్రో జనమేజయ స్సమభవ త్తత్సప్తమో భూన్నృపో ।

నందస్తస్యకులోద్భవః ఖలుమహాన్ రాజేంద్రరాజోత్తరః ।
యోభూద్రాజనరేంద్రవంశతిలక శ్రీబిజ్జళేంద్రో నృపః ॥

తద్వంశోద్భవసోమిదేవ నృపతి ర్దుర్గాణి సప్తాహితాత్ ।
అహ్నైకేన సమాహర త్తమదిత శ్రీరాఘవేంద్రో నృప ।
స్తత్పుత్రః ఖలుపిన్నమోనృపవరో శ్రీబుక్కరాజ స్తతః ।
యోభూత్సోమకులాంబురాశి హిమగు శ్రీబుక్కరాజాత్మజ ।

స్సింధూత్పన్నసహస్ర సప్తతి మహాస్సైన్యంసపాదం రణే ।
త్వా స్వీకృతవాన్ తదియ్యమవనిం గిర్యాదిదుర్గంబలాత్ ।
తంకాళ స్వతయం(?)చరామ నృపతిర్విద్రావ్యకీర్త్యాబభౌ ॥

సమాహార త్కందనవోలిదుర్గం సరామరాజోత్ర హరేఃప్రసాదాత్ ।
సమశ్నుతేస్మామృత తుల్యమేవ యథాతిభిర్ధత్రవిమఃవిచిత్రం ॥

రిపునృపజయశౌండో రాయరాహుత్తమిండో ।
హొసబిరుదరగండో మన్యరాజ్య ప్రదాతా ।
ఇతిబహుబిరుదాంకో వందిభిర్వర్ణ్యమానః ।
సముభవదతుల శ్రీరామ(రాజోతికీర్త్యా)।

తత్పుత్రో నరసింగరాజతిలక స్తస్య ప్రియానందనాః ।
రామత్క్ష్మాపతి తిర్మలేంద్రనృపతి శ్రీవేంకటేంద్రాః క్రమాత్ ।
తద్వంశే వరచింతతాంకమహితే శ్రీరంగపత్క్ష్మాపతిః ।
తత్పుత్రో రఘునాథరాడుదితో రామక్షితీశాగ్రణీః ।
రామరాజస్యతనయో వెంగమక్షితిపాగ్రణీః ।
తిర్వేంగళనాథశ్చ శ్రీమాన్నరసింగ మహీపతిః ।

నరసింగమహీపాలా జ్ఞానాంబాగర్భ సంభవా ।
సుబ్రహ్మణ్యమహీపాలా చ్ఛ్రీమచ్చన్న నృపాలకః ।
కుమారానంతరాజేంద్రం సింహాసనే సుఖస్థితం ।
శ్రీమచ్చన్ననరేంద్రో యమేవ మాహా దయావరః ।

నరసింగమహీపాల సముద్రప్రతినామకః ।
అగ్రహారో మయా కార్య ఇతి మే జాయతే మతిః ।
పలమ్నపాటినామైకో గ్రామో ఽస్తి రెలభూపతేః ।
యరాశిపలసంయుక్తో దానయోగ్యో ద్విజన్మనాం ।

పూర్వం యల్లమరాజేంద్ర సముద్రేంతర్గతీ కృతః ।
స్వతంత్రగ్రామ ఏవాసీ త్తతో రాజ విపర్యయే ।
తతః కుల్యాత్రయం తత్ర విప్రైశ్శూద్రైశ్చనిర్మితం ।
తత్ర కుల్యాద్వయం నష్టం దివైకపూరితం ।

అశక్తాః పూర్వకర్తారః పునరుద్ధరణే తతః ।
శ్రీమ ద్యల్లమరాజేంద్రసముద్ర స్థితభూసురైః ।
తత్కుల్యాకర్తృభిశ్చాన్యై ర్ధనార్థం ప్రేరణం కృతం ।
పునరుద్ధరణంకృత్వా కుల్యయో రుభయో రపి ।

క్రియతా మగ్రహారోత్ర నదీతీరే విశేషతః ।
పాలాశాది తరుక్రాంతా సికతాపరిపూరితా ।
కుల్యా కేదారభూ శేషా పాలనీయా త్వయా ప్రభో ।
కుల్యాద్వయం సముద్ధృత్య సమస్థానపయం త్వితి ।

తతోధనవ్యయం కృత్వా కుల్యేద్వేపాలి తేమయా ।
తత్పూర్వభాగే కుల్యైకా సజలాఫలదాస్థితా ।
యరాశిపల్లసంయుక్త మేతా దృశగుణాన్వితం ।
పలమ్నపాటినామానం గ్రామం త్వం దాతుమర్హసి ॥

ఇతితద్వచనం శ్రుత్వాకుమారానంత భూపతిః ।
మాతాపితృకులోత్తంస స్తథాస్త్వితి వదన్ముదా ।
మాతామహోన్నతస్థాన ప్రాప్త్యై విష్ణుమనుస్మరన్ ॥

వసురామర్తుభూసంఖ్యా శకవర్షగణాన్వితే ।
వర్షే దుర్ముఖివిఖ్యాతే మాసి ఆశ్వయుజాహ్వయే ।
పక్షేవళక్షే పుణ్యాయాం దశమ్యాం చ మహాతిథౌ ॥

శ్రీమన్మహామండలేశ శ్రీమత్కాశ్యపగోత్రజః ।
యాజుషో వేదశాస్త్రజ్ఞపురోహితసమన్వితః ।
నానాగోత్రాభిధాసూత్రశాఖాభ్యశ్శాస్త్రమార్గతః ।
శ్రీసిద్ధవటదేశీయ్యే దేశే పొత్తపినాడుకే ।
మహాబాహునదీ తీరే పూర్వదిగ్భాగ సంస్థితం ।
బాహుదా కుంజరనదీ సంగమాద్దక్షిణే స్థితం ।
శ్రీవరాహ్వాయసద్గ్రామా త్పశ్చిమాశాముపాశ్రితం ।
కొండూరు చెన్ను పల్ల్యాఖ్యగ్రామా దుత్తరత స్థితం ।
పల్లమ్మపాటి సద్గ్రామ ముపగ్రామ సమన్వితం ।
నరసింగమహీపాలసముద్ర ప్రతినామకం ।
సర్వమాన్యచతుస్సీమాయుతమారామశోభితం ।
గంగాతరంగిణీతుల్య కుల్యాత్రయ విరాజితం ।
వాపీకూపాదిసంయుక్తం కేదారస్థలసంయుతం ।
నిధినిక్షేపపాషాణ సిద్ధసాధ్యఫలాన్వితం ।
అక్షీణాగామి సహితం గణభోగ్యం సభూరుహం ।
దానాధమనవిక్రీతియోగ్యం వినిమయోచితం ।
పుత్రపౌత్రాదిసంతత్యా భోగ్య మాచంద్రతారకం ।
శుద్ధాంతఃకరణోభూత్వా శ్రీమహావిష్ణు సన్నిధౌ ।
వస్త్రభూషణగంధాద్యైః పూజయిత్వాద్విజోత్తమాన్ ।
వసువర్ణపయోధారాపూర్వకం దత్తవాన్ ప్రభుః ।
నరసింగమహీపాలో విష్ణులోక మవాప్తవాన్ ।
ఇతీవ ఘోషయంతిస్మ విప్రా వేదధ్వనిచ్ఛలాత్ ।
ధన్యో స్మీతి వద స్ప్రీత్యా వవందే బ్రాహ్మణో త్తమాన్ ।
కుమారానంతరాజేంద్ర శ్చన్నరాజ [illegible] ।
గాయత్ర్యక్షరసంఖ్యాక వృత్తియుక్తే [illegible]స్వతే ।
నరసింగమహీపాలసముద్రక్షేత్ర భాజనః ।
లిఖ్యంతే విబుధా నామ గోత్ర శాఖాదిపూర్వకం ॥

సూనూ రాఘవ భట్టసూరితరణే ర్వాసిష్ఠ గోత్రోద్భవో ।
బొంతాఖ్యాన్వయవాన్ ఛ్ఛ్రుతిస్మృతిసదాచారేషు పారంగతః ।
సార్థాన్ వెంకటభట్ట బహ్వృచ్ఛవర స్తద్వ్యాజమాన్యాన్వితాం ।
వృత్తించెన్నన రేశ్వరేణ దయయా సంప్రాపసింగోత్రాఖ్య తే ॥

శ్రీమత్కౌశిక పిత్తలాన్వయవరో వేదస్యపఠా నిశం ।
ప్రతల వెంకటకృష్ణభట్ట విదుషో విమదేస్స దార్యాసవాన్ ।
శ్యాతో వెంకటభట్ట పండితమణి ర్భాసాం నిధిః పావభి(ః) ।
సోయంవృత్తి మవాప్తవాన్ గుణనిధిస్సార్థాంప రేణ్యాగ్రియాం ॥

గౌరీజానిపదారవిందమకరందాస్వాదతుం విభవ త్సాన్య(?) ।
తూంబుచ్చనభట్టనంశీశవరో జోతిర్వేదామగ్రణీః ।
పుల్లంభట్టసుధీసుతో హారితగోత్రో భాయజుః పారగ ।
సోఽయం నిట్టలనామ పత్కులభవో వృత్యాత్ర ॥

సంరాతినూను వెంకటకృష్ణభట్ట విదుషో జ్యోతిర్వేదామగ్రణీః ।
శ్రౌతస్మార్త విశారదో విమలధీ సోఽయం యజుః పారగః ।
శ్రీమత్కౌశిక పిత్తలాన్వయ వరే జాతో యశస్వీ మహాన్
సుబ్రహ్మణ్య విపశ్చి దత్ర లభతే వృత్తిం సదాంసమ్మతః ॥

శ్రీమద్వ్యాజమకౌశికాన్వయవరో వేదాంగ మీమాంసయో ।
స్తర్క వ్యాకరణాది తంత్రనివహో స్వాతంత్ర్యవత్స్వగ్రణీః ।
వంశే పిత్తలనామకే ప్రభవవాన్ సూను ర్నృసింహార్యయ ।
స్యాయం చిట్టనశాస్త్రిరత్ర లభతే వృత్తిం సతి స్సజ్జనః ॥

మారేపల్లి మహాకులాబ్ధిహిమగుః శ్రీవత్సగోత్రో యజు ।
ర్వేదీ వెంకటరామనామకసుధీ శ్రీరామకారుణ్యవాన్ ।
శ్రీమన్మట్లికులావతంసక కుమారానంత రాజేంద్రన ।
న్మాన్యవృత్తిమిహాశ్నుతే ధిరయశో వాగ్మీ నృసింహాత్మజః ॥

బహ్వృచ చికిడిసగోత్రో నిడిగంటికులాబ్ధి పూర్ణహిమగుః ।
పెరుమాళనామధీమా నయ్యంభట్టాత్మజో శ్నుతేవృత్తిం ।

శ్రీమద్యాజుషశాఖహస్తికులజ స్సాంబేశితు స్సత్కృప ।
సూనూ రాఘవభట్ట సూరితరణిర్విశ్వోస్మి తార్య్యః ॥

పాపాభట్టసుధీర్మ రేఫ్నారితగోత్రాఢ్యః శ్రుతేః పారగో ।
వృత్తిం సోత్ర సమశ్నుతే నుతసుధీ ర్భాసాన్నిధి పాపభీః ।
శ్రీమద్వేదశిరోయుగశ్రుత సంస్థాపనాచార్యతాం ।
ప్రాప్తో యాజుషతర్క భూషణ కులాంభోధే స్సుధాంశుః స్వయం ॥

పుత్రో వెంకటబుధస్య శుచిమ త్కౌండిన్యగోత్రోద్భవః ।
సోయం రాఘవదీక్షితోత్ర లభతే వృత్తిం సుసన్మానితః ॥

యాజుషో చెన్నభట్టస్య సూనుః కౌశిక గోత్రజః ।
వీరరాఘవభట్టోత్ర పిత్తలియోర్ధ వృత్తిభాక్ ।
కిడాంబికృష్ణమాచార్య స్తిరువెంగళసూరిజః ।
భారద్వాజో వృత్తిమేకాం సామగోత్రః సమశ్నుతే ॥

లింగంభట్టస్యసూనుః స్సువిమలమతి ర్మ(?)గార్గ్యగోత్ర ।
స్సుశితో యజుర్వేదిం విప్రశ్రీద్బుధజన వినుత స్సత్రికూటాన్వయః ।
అయ్యంభట్టాహ్వయోయం మృదుతర వచనః ।
ఖ్యాతో నాతిధేయసోయం వృత్తిమవాప్తవాన్ ।

నృపవరాచ్చన్నభూపా ద్విహైకాం యాజుషః ।
క్త్రోకం యంగంభట్టసూనుః సుధీమణిః ।
సుబ్రహ్మణ్యాహ్వయోప్యత్ర పిత్తలియోర్ధ వృత్తిమాన్ ।

ఆత్రేయగోత్రాంబుధిపూర్ణచంద్రః కిడాంబిరంగార్యసుతస్సుమేధః ।
రామార్యనామా రఘువీర భక్తో భుక్తే యజుర్వేదవిదత్ర వృత్తిమ్ ।
ఆపస్తంబస్య సూత్రోయం సూత్రకృష్ణార్య సూరిజః ।
శ్రీవత్సగోత్ర తిలకో వెంకటాఖ్యోత్ర వృత్తిమాన్ ॥

యనమంద్రకులాబ్ధీందుః కౌశికో బుచ్చనాత్మజః ।
వెంకన్నపండితో ప్యత్ర బహ్వృచో వృత్తిమశ్నుతే ।

# హనుమద్గుండం రామభట్లు వద్దనున్న సన్నదుల నకళ్లు

౧. మవుజే హనుమద్గుండంలో కాపురం ఉండే కురుమేటి శివ రామశాస్త్రుర్ల కొమారులు మల్లుభట్లు రామాభట్లు గారివద్ద ఉండిన సన్నదులు వగైరాల నకళ్లు.

నెం. ౧.

భావ సంవ్వత్సర మాఘ శుద్ధ ౧౫ లు శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దాన దానప్రతిగ్రహషట్కర్మనిరతులయిన కురు మేటి కృష్ణసోమయాజులవారికి రాజశ్రీ నరుసో కేశవు తర్ఫుదారు మహల్లాతిహాయగారు యిచ్చిన శ్రోత్రియపు దానపత్రిక : జంబులమడ్గు సముతులోను నాగిరెడ్డిపల్లె బహుయేండ్లనుంచి పాడుపడి ఊరుయెక్కక వుండె ; గనుక ఆ గ్రామంలో మీరు కష్టపడి ఆకృతిచేసినారు ; గనుక రాజశ్రీ రంగో రఘునాథుగారు శ్రీముఖ సంవత్సరంలోను సర్వాంముక్తా గాను మీకు యెనభై వరహాలుకు శ్రోత్రియముగా నడిపించినారు ; గనుక మేము ఆప్రకారముగానే నిర్ణయంచేసి సర్వాం ముక్తాగాను యెనుభై వరహాలకు శ్రోత్రియముగాను యిచ్చినాము ; గనుక హరసాలినా యీ ప్రకారముగా నడిపించుకొని మీ పుత్రపౌత్రపారంపర్యము అనుభవించి సుఖాననుండేది.

నకలు ౨.

శ్రీముఖనామ సంవత్సరం వైశాఖ శు॥ ౧౦ లు రాజశ్రీ రంగో రఘునాథ తరుఫుదారు మహల్లాతిహాయుగారు శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులయిన కురుమేటి కృష్ణసోమయాజులువారికి యిచ్చిన పత్రిక : జంబులమడుగు సమ్మతులోను నాగిరెడ్డిపల్లె బహుయేండ్లనుంచి పాడు పడి ఊరుయెక్కకవుండె; గనుక ఆ గ్రామం యిండ్లు కట్టించి ఆకృతిచేసి యుంటిరి ; గనుక సర్వముక్తాగాను హొన్నులు గ ౭౦ డెబ్బై వరహాలకు

శ్రోత్రియంగా నిర్ణయంచేసి యిచ్చినారం; గనుక వారసాలీనా యీ చేరీజుప్రకారం నడిపిస్తున్నారం; ఇందుకు తప్పితంలేదు. మీా పుత్రపౌత్ర పారంపర్యంతం గ్రామం కీర్దుమాయిూరు చేసుకుని నిరాచ్ఛేదసగా అను భవించేది.

3. శ్రీమతు నాగిరెడ్డి(పల్లె) కరణాలకు రాజశ్రీ భోగప్పగారు ఆ॥ ను॥ తం॥ రాజశ్రీ తరపుదారుణింగారు ఎప్పటివలెనే గ్రామం అయ్యా వారికి సెలవు యిమ్మని మా పేర వ్రాసినారు; గనుక మేము ఆలాగే అయ్యవారికి ఆ గ్రామం సెలవు యిచ్చినారము. మీారు మరేమిన్ని విచారంచేయక ఖాతిర్జమాతో అయ్యవారు చెప్పిన బుద్ధిమతులతో సాగుబడి సంతనలు చేసుకుంటూ సుఖాన నుండేది. ఇప్పుడు అయ్యా వారు యేకరణముచేత పని నడిపించుకొనునో ఇప్పుడు ఆ చొప్పున నడిపించుకొనేది.

౪. రాజశ్రీ శ్రీనివాసతిమ్మరసుగారు రెడ్డికుల కరణీయాని మవుజే నాగిరెడ్డి పల్లెకు వ్రాయించి పంపించిన సన్నదు. నన్నవోతిసైనో అల్లవు, మవుజే మజుకూరు పొలం పాయికారీలవలన సాగుబడిచేయించగా మీారు పాయికారీలు రాకుండా యిషాక్కులు(?) చేస్తున్నారట. మానా యేమి? చేయదక్కి(?) యీా పర్వానా చూస్తున్నే యజనాది షట్కర్మ నిరతు లయిన కృష్ణసోమయాజులువారు ఏలాగు చెప్పుతున్నారో ఆప్రకారం నడుచుకునేది. ఇందుల ఫిర్యాదువచ్చినా తాకీదు వర్మానించ నయ్యాని గాన తో(తెలి)సేది.

శ్రీ శ్రీ శ్రీ హజరతులవారి ఫర్వానా.

ఇజ్జతు అసార కురుమేటి కృష్ణసోమయాజులు మాల్మునమాయు దకె జంబులమడుగు సమ్మతులోను మ॥ నాగిరెడ్డిపల్లె అనే గ్రామం ముతల్బకు హైరాము అయి బేచిరాకుగా నుండగాను మ॥ అనాం రంగో పండతు గుమాస్తే జరతరఫె మజుకూరుగారు సకల సువర్ణాదాయం దేఖిలు సర్వమక్తాగాను సాలీనా హణాన్నులు యొనసై వరహాలకు నివాడా

చేసి మీాకు శ్రోత్రియం యిచ్చినారం; గనుక మవుజే మజుకూరి కిర్దుమా మూారు ఆబాదాను చేసుకుని సాలీనా యెనబై వరహాల చొప్పున దివాణానకు సాలుబస్సాలు చెల్లించి ఖాతిర్జమాతోను దివాణండాలతు బోహాలోనుండి విశేషం యేమి వచ్చినా హాజరతుగారికి పుణ్యాంగాను మీారు అనుభవించుకొని సుఖంగా నుండేది.

శ్రీ శ్రీ శ్రీ

౬. హాజరతు నవ్వాబుసాహేబులవారి పర్వానా.

తాకిదియ్యాని కులకరణియ్యాని మవుజే నాగిరెడ్డిపల్లె సర్కారు జంబులమడుగు. తా॥ సన్నసబాసతైను. అల్లఫు మీా గ్రామము షట్కర్మనిరతులైన దత్తంభట్లుగారికి శ్రోత్రియం నివాడాచేసినాము. ఈతగాడు మీాకు కౌలు యేలాగున యిస్తున్నాడో ఆ కౌలు మేము యిచ్చినట్టుగాను యెంచి స్థళపరస్థళాలువారికి పొలము కిర్దుమామూారు ఆబాదాని చేయించేది.

౭. శ్రీమధ్యాజనాది షట్క.

అసలు

తాకీదియ్యాని కులకరణియ్యాని నాగిరెడ్డిపల్లి, సర్కారు జంబుల మడుగు. రా॥ సున్నసబాసితైను అలఫు. మీా గ్రామం శ్రీమధ్యాజనయాది షట్కర్మ నిరతులైన దత్తంభట్లుగారికి నివాడాచేసినాము. ఇతను మీాకు కౌలు యేలాగు యిస్తున్నాడో ఆ కౌలు మేము యిచ్చినట్టుగాను స్థళ పరస్థళాలవారికి పొలం కిర్దు మామూారు ఆబాదా చేయించేది.

౮. రాజశ్రీ మాధో భానుజీ సూర్యప్రకాశరావు మజ్మూదారు.

శ్రీమతు పేరామల్లారెడ్డి వ మజ్జులకుమారమల్లారెడ్డి వ అరియప్ప రెడ్డి వ మంచిరెడ్డిగార్లకు......గారు వ్రాయించి......*. దేనమానన్తో అలఫు. శ్రీమధ్యాజనాది షట్కర్మనిరతులైన అనుమనుగుండం కురుమేటి

* ○ ఈ వెుంహారు కాగితం శిథిలమైనందున అక్షరాలు అగుపడలేదు.

కృష్ణశాస్త్రుర్లగారు దేశంలోకి సెలవుపుచ్చుకొని వచ్చినారు వారిపఠ్యాలు పైద్యులు(?) దేశముఖ్ కోనుస్నారు. వారి మొదల యేదొక్క బాబుకు బహుమానముగాను నడిపించుకొని వచ్చేది. వీరు పెద్దలు మా ఆశ్రి తులు ఉన్నారు. మీ మొఖాసాగ్రామాదులలోను వీరి మాన్యపు క్షేత్రాలు ఉన్నవి. మాన్యాలమొదల వీరిమొదల సాయాచేసుకు నడి పిస్తూ వచ్చేది.

మహారాష్ట్రం దస్కతు.

౯. అసలు శ్రీరామా

ల. శార్వరి సంవత్సర మాఘ శు॥ ౧౦ లు రాజశ్రీ అరియప్ప రెడ్డి కృష్ణారెడ్డిగారు వంగలు సిద్దారెడ్డికి మెర్రగుడి పాటిరెడ్డకు పుత్రెం చిన ప్రయోజనం కరణాలకు దండం. తర్వాత, శ్రీమద్యజనాది షట్కర్మ నిరతులైన కురుమేటి ఉమామహేశ్వరుల వారిచేని గృత్తసమ్మంధం వంద్రామోడి నగ ౧౨ అక్షరాలా పన్నెండు వరహాలు సెలవు యిచ్చి నారం; గనుక యీ వరహాలు యిప్పించేది. పెండ్లి ప్రయత్నంతలపెట్టు కొని వచ్చినారు. ఆలస్యం చేయక పైకం యిచ్చి పంపించేది.

౧౦. నవాబు నేకునాంఖాన్ తరపుదారు.

దపా అతమాతిహ్నా యిజ్జత్ అదలద స్తగాః మహమ్మదు తక్కిం బేగుహా॥ న॥ తిమ్మానాయని చెర్వు వజ్రగిరి. శ్రీమద్యజనాది షడ్వోశేషణ విశిష్టులయిన హానుమనిగుండం కృష్ణశాస్త్రిల అయ్యవారికి వ్రాయించి యిచ్చిన భూదానపత్రిక. స్నయినసె సబైన అలఫ. మీకు విరోధికృతు సంవత్సరం భాద్రపద శు॥ ౧౫ లు సోమోపరాగ పుణ్యకాలమందు హా॥ ని...వారికి పుణ్యంగాను హా॥ సాహేబులవారికి పుణ్యంగాను తిమ్మానాయని చెరువు సమ్మతులో వుప్పలూరి గ్రామాన ఊరితూర్పున చెర్వు లోతట్టున యిద్దుం మడి ధారాదత్తంగా మాన్యం యిచ్చినారం. శారున్యాసంగులు ఫలపరుచుకుని మీ పుత్రపౌత్ర పారంపర్యతం సుఖాన అనుభవించేది. ఈ మాన్యం హా॥ గారికి సుకృతంగా యిచ్చిన మాన్యం

గనుక దీనికి యెవ్వరు ఆచ్ఛేదనచేసినా నడిపించకపోయినా బ్రాహ్మలు అయితే గోమాంసం దిన్న దోషాన బోదురు. మ్లేచ్ఛులు అయితే సూకరమాంసం దిన్న దోషాన బోదురు.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా ॥

౧౧. హానుమద్గుండం సంస్థానం సన్నదులు.

క్రోధినామ సంవత్సర వైశాఖ శు॥ ౫ లు శ్రీమతు రాజశ్రీ హారియపురెడ్డి కృష్ణారెడ్డిగారు వెణుతుర్ల కరణం వీరన్న వేంకటగారికి దండం కాపులకు పుత్తెంచిన ప్రయోజనం. తర్వాత, మీ గ్రామం రొఖ్ఖం వగను యేగోను అయ్యప్పగారి సంబళానకు పంద్రామోడిన ౫ ౧౦ పది వరహాలు సెలవు యిచ్చినాం గనుక యిప్పించేది. కృష్ణారెడ్డి వ్రాలు.

౧౨. శ్రీమతు రాజశ్రీ హారియపురెడ్డి కృష్ణారెడ్డిగారు వెణుతుర్ల కరణాలకు దండము, కాపులకు బుత్తెంచిన ప్రయోజనం. తర్వాత, మీ గ్రామం తరసాలనాయకుకు యిజారాకు యిచ్చినాము. మీరు వారి బుద్ధిమతులలో నడుచుకునేది గాన తెలిసేది. వీరికి తమిరీఫుంకు గాను నాలుగు వరహాలు సెలవు యిప్పించినాము. ఆ పయికం యిచ్చేది. విశ్వావసు సంవత్సర ఆశ్వీజ బ॥ ౨ లు.

కృష్ణారెడ్డి వ్రాలు

౧౩. ప్రమాదినామ సంవత్సర ఆషాఢ బ॥ ౨ లు రాజశ్రీ హారియప్పరెడ్డి పుల్లారెడ్డిగారు వెణుతుర్ల వెంగన్న వెంకటగారికి దండం కాపులకు అణిమిగానికి బుత్తెంచిన ప్రయోజనం. తరువాత, శ్రీమద్యజనాది షట్కర్మనిరతులయిన ఓరుగంటి కేశవమూర్తిగారికి మీ గ్రామాన ముత్తుంచేను మాన్యం సెలవిచ్చినాము. వీరికి ఉత్తమక్షేత్రమయిన చల్క చేను ముత్తుమున్నా ఒక స్థళానసే చూపించేది. కాపులకు పొలము

సాగించియుంటే ఆ స్థళం పిరికి మాన్యంక్రింద వ్రాసి ఆ సంగతి కాపులకు చెప్పి క్రయం యిప్పించేది.

శ్రీరామ

౧౮. బహాదరు ఫారిసీ మొహరు అక్షరాలు తెలియ లేదు. యీ మొహరులో ఫతేహైదరు అని వ్రాసి వున్నది.



పైన వ్రాసిన మహారాష్ట్రం కౌలుకు తర్జుమా.

కౌలునామా జమీన్‌దారు హనుమనిగుండం కలశపాడు నరసాపురం గార్లకు వ్రాయించేది యేమంటే, మీరాగు హుజూరుకు వచ్చి వెనకటి మొకద్దమా పేష్కష్షు నజరు యిచ్చేలాగున ఒప్పుకొన్నారు. కనుక ముందరి వికారి సంవత్సరమునుంచి సంవత్సరి ప్రతిసంవత్సరముకు యిచ్చే పేష్కషు యిరవై నాలుగువేల రూపాయిలు సర్కారుకు ముట్టజేసి మీ తాల్లూకా ఆబాదుచేసుకుని మామూలుప్రకారం కడప తాల్లూకాలో నడిచే కావలిరుసుం మొదలయినవి అనుభవించి యే మాటకున్ను చింతచెయ్యక ఖాతరుజమాతోటి ఉండేది. తెలిసేది. చందు ౨౪ రబ్బిసాని సన్న ౧౧౯౩ హిజరి.

ఈ సన్నదు టిఫాఫా పైన మొజ్జులక్కాతో ఉండే మొహరు.



౧౯. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౭౧౩ అగునేటి ప్లవనామ సంవత్సర జ్యేష్ఠ బ॥ ౧౧ లు పైడిపాల్ల గోత్రోద్భవులయిన పర్వతరెడ్డిగారి పౌత్రులయిన చిట్టారెడ్డిగారి పుత్రులయిన అరియపరెడ్డి పుల్లారెడ్డిగారు శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనా

చార్యులయిన ఉభయ వేదాంతాచార్యులయిన శఠమర్షణ గోత్రోద్భవ ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన తిరుమలాచార్యులవారి పౌత్రులయిన సింగరాచార్యులవారి పుత్రులయిన సింగరాచార్యులయ్యవార్లంగారికి యిచ్చిన భూదానధర్మశాసన క్రమమెట్లన్నను: గోలకొండ రాజువారి నేకనాంఖాన్ సాహేబులవారు మాకు అమరనాయంకరానకు మన్నించిన గండికోట సీమలోని హనుమద్గుండం గ్రామాన నందిపాటి త్రోవను బలభద్రయ చేనిస్థళం కొంకలబుడ్డయ్యబీడు దున్నిన చేను ౧౧ ఆరట్లు తూమెడు, బావిదగ్గర మూలగడ్డమడిలో కంసాలయెల్లా బత్తుని మడి తూర్పు మడి ౧౧ తూమెడున్నూ సోమోపరాగ పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారా పూర్వకంబుగా త్రిపురుషోద్దేశంగా త్రివాచకముగా ఆచంద్రార్కస్థాయిగా మీ పుత్రపౌత్ర పారంపరియాయంగా అనుభవించేది అని యిచ్చిన దానపత్రం.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

౧౬. ఈ పుల్లారెడ్డి మనుమడు కృష్ణారెడ్డి జీవంతుడై యుండగా యితని కుమారుడు వ్రాయించి యిచ్చిన దానపత్రం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౬౩౫ అగునేటి విజయసంవత్సర ఆషాఢ బ॥ ౫ లు రాజశ్రీ అరియపురెడ్డి గోపాళయ్యగారు బుక్కపట్నం నరసింహతాతాచార్యులవారికి యిచ్చిన భూదానధర్మశాసనపత్రిక. మా గ్రామాలు హనుమనిగుండం లోను కనుబా అంచున నడిచే యెర్రగుడిలోను ౧౨ యిద్దుం మడి, పెద వెణుతుర్ల లోను ఖ॥ ౦।౦ యేందుంచేను మీకు సర్వమాన్యం సెలవు యిచ్చినాము. గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యంతం అనుభవించుకొని సుఖానసుండేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

౧౭. హనుమసిగుండంలోనుండే యెగ్గోని వేంకటరావు వద్ద నున్న దానపత్రం నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౫౮౯ అగునేటి ప్లవంగినామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౧౫ లు రాజశ్రీ అరియప్ప రెడ్డి కృష్ణారెడ్డిగారు యెగ్గోను అయ్యప్పకు వ్రాయించియిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక. మా మొఖాసా గ్రామాలలో మాన్యం కావలె నని తెలుపుకొంటిరి. గనుక కోకటగ్రామాన చేను ఖ॥ ౦।౧ తుమ్మ లూరు మడి ౨౩ ముత్తుం, కొండూరను మడి ౨౩, ఉభయం గ్రామాలు మూడింటికి చేను మడి సహాగాను ఖ॥ ౦॥౨ పన్నిద్దుం ఉతధాతిథి కాల మందు శ్రీకృష్ణార్పణంగా సర్వమాన్యం యిచ్చినాము. గనుక మీ పుత్ర పౌత్ర పారంపర్యంతం ఆచంద్రార్క-స్థాయిగాను, అనుభవించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

కృష్ణారెడ్డివ్రాలు.

౧౮. కాకరవాడ పెదవెంకట చినవెంకట అనే కరణాలు బోడెమ్మ నూరికి కరణం మిరాశికి అర్థాంశకర్తలు గనుక వారి వద్దనున్న కౌలు కాగితం నకలు.

యువనామ సంవత్సర మాఖ శు॥ ౧౦ లు శ్రీమతు రాజశ్రీ అరియప్పరెడ్డి పల్లారెడ్డిగారు కాకరవాడ పెదవెంకట చినవెంకటకు యిచ్చిన కౌలునమ్మా. చినయమ్మనూరులో మహారా॥ గజబరల్లీఖాన్ సాహేబులవారిచేతను మొఖాసా తీసుకొన్నాము. గనుక మీకు॥ రా॥ ఆకునూరు నరసన్నపంతులు యేలాగున మాన్యములు నడిపించినారో ఆ ప్రకారం నడిపించగలవాడను. మీరు, కరిణీకమాన్యం ఖం౧౪॥ కి ౮ ౦॥౦॥౦ అడ్డుగా అరవీసముమన్నా పుట్టి పన్నిద్దుం సర్వమాన్యముగా

నడుపగలవాడను. విాకు నడిచే భటవృత్తిమాన్యం ఖం॥ర సర్వమాన్యం నడిపిస్తున్నాము. గణపూజ వర్తనలు నగరికి సాగినంతలో యిప్పించ గలవాడను. మరి విశేషంగా ఉద్యోగంయిచ్చి నడిపిస్తున్నాము. మాదొర తనం ఉన్న దినాలలో లెస్సగా అరమరలేక నడిపిస్తున్నాము. ఈ వ్రాసిన ప్రకారం తప్పక నడిపిస్తున్నాము. మా కౌలు నమ్మి గ్రామములో కుదురుకొని ఉండేది. ఇందుకు సాక్షి రాజశ్రీ కోనప్పఅల్లుడు పూర్ణ పంత్తులు కోనప్ప.

౧౯. ఉయ్యాలవాడ జమీన్‌దారు మజ్జరి మల్లారెడ్డిగారి వద్ద నున్న సన్నదుల నకళ్లు.



ఈ మొహరులోనుండే అక్షరములు సయ్యదు హామీదు సాదుల్ హానసం దివానుపాదుషాహ ఆలంగీరు.

ఫర్మాను జహామతా ఆప్తాబ యిరితిఫా అజ దివాన్ హుమా యూన్ నలతనత మళహూనబజోనిబె మజ్జల పాపిరెడ్డి చినాంశరపుయి నదారు యా ప్తకే దివాణం బందగికి అర్జుదాస్తు వ్రాసినావు, యేమని: తన తండ్రి జాగా తనకు మొకరరు చేస్తే నాలుగువేలవరహాలకు పేష్కష కబూలువున్నాను. ఈ బాబుకు తన హేజీబు పాపరాజు యేమి అర్జు చేస్తున్నాడో ఆ చొప్పున సరంజాం చేయవలెనని. అందువిూద సెలవు దయచేయ నవధరించ బడెను. యేమని అంటే, యిలతిమాను విూద నీ తండ్రిజాగా నీకు మొకరరుచేసి తసరీపు యినాయతుచేసిపెట్టి పంప నవధరించినారం. గాన పుచ్చుకుని సరఫరాజు అయి మరియే జాబుకున్న అందేషాచేయక ఖాతరుజమాతో దివాణపుదొలతు ఖ్యాహిలోనుండేది

పేషకసుకు నాలుగువేలవరహాలు హుజూరుకు పంపించేది. ఇటని మొరిగి ఫర్మాను ఆలిచొప్పున నడచేది. ఇందుకు హిజరిఅహ్యేది ౧౨౦౪.



౨౦. మొహరులోవుండేది. నిజాముల్ముల్కు అసఫజా మీరనిజామలీ ఖానే బహాదరి అజిరులక్ష మరాహిదలిసుపిరుముల్కున మొఅయిన ఉద్దాల హయాత్(?) గులామ్ సయ్యదు సుహరాబఖాన్ బహాదరు.



౨౧. మొహరులోవుండేది. అబ్దుల్‌సబిఖాన బహద్దరు ఫిదలి పాదషాః గాజీమహమ్మదుఖాన్ తాలూకా దేశంలో దొంగతనం కాకుండా విచారించమని తాకీదు.



౨౨. మొహరులోవుండేది. షాహి అలంగిరు పసలఖతా బమీనఖ్వాజ దావుదూ.

౨౩. మొహరు. ఫిదలిపాదుషాహషహాగాతిఖాన్ మయనౌ,

౨౪. పట్టా యిజారా బె॥ జుల్సతుల్ అమానలవలయకరాగ మజ్జల వరదారెడ్డి జమీందార్ పుయ్యాలవాడ అంకె చూం మపుజె సుంకనుల వగైరా దేహ(శా?)యు 3 అమలె పరగణేచలచలమలో సర్కారు ఫుండి కోట తాలూకే బాలామాటు నూబెఫరకున్‌ద బునియాద మొంబలగ

శేరీజు మాన్నులు ౬౫౫ అర్నాటయాఖై యైదు వరహాలు చెన్నపటానకు పౌజుదారి సహాగాను సన్న ౧౧౭౯ ఫసలీనుంచి సాలీనా బతరిక హింజారా సివాయ మాక్కులతమాశ్శీలు నిర్ణయంచేసి యిచ్చినారం. ఖాయడకె రయితురజావందివుంచి గ్రామం ఆబాదాను చేసుకొని మాంగాము వచ్చి నప్పుడు రూక వసూలుచేసి ఆఖైరు సాలువరకు మూడుకిస్తులు సాలు బసాలు సర్కారుకు చెల్లించేది. మాలుజూరు సన్నదు లేక దాందిరు(?) ఖర్చుచేయ పనిలేదు. ఖాతిరు జమా వుంచేది.

మవుజే నుంకెనుల ౩౨౦ పయి నరసెపల్లి ౨౭౦

పయి గోవిందుపల్లె ౬౫

జమాలా

అయిన ౫౩౦ ఫౌజుదారి ౧౨౫

ఇందుకు వాయిదా సన్న ౧౧౭౯ ఫసలీకి రబిలవ(?)

అవ్వల కిస్తీ ఆఖైరు. జిలకాదు. ౨౧౯ రెండో కిస్తీ ఆఖైరు ౨౧౮

మూడోకిస్తీ ఆఖైరు మృగసాలో ౨౧౮

సదరహి ప్రకారంగాను సాలు బసాలు సర్కారుకు చెల్లించి ఖాతిరుజమా వుంచేది.

మొహారు వున్నది. దావుదుఖాన్



౨౫. జుబ్దతుల్ అమాసిల్, మజ్జల మల్లారెడ్డి బతవజూహాత ఖాతిరువుమేదవార బూడే బిదానెం దరివిల్లా మీా నిమిత్యం మాలుజూరు నుంచి యిజ్జతు ఆసార రాఘవయ్య అర్జుచెయ్యగా ఖాతిరుకు తెచ్చు

కొని మీ మీద మహార్ బానగిరి చేసి సవారి నిమిత్తం హవుదా యేనుగు అంపించినాము, శిరోపావు అంపినాము. ఈ సాలు మీ తగులు ఉయ్యాల వాడ వగయిరా సంగపట్నం వగైరాలకు పేషకసు రెండువేలువరహాలు సివాయ పౌజుదారి రుసుం మొకరరుచేసి పంపించినారం. సరఫు రాజు యిచ్చిన ఖాతిరుజమావుంచేది.

సన్ ౧౧౭౬ హిజరి చ ౨౭ మాహె రబిలవ్వలు

౨౬-౨౭. జుబ్బతుక్ మాసిల్ వలాయకా నా మజ్జరి బుచ్చి మల్లారెడ్డి చిదానందచూం తాలుకు సంగపట్టణ. మీరు అర్జుచేసి బలోజి సన్ ౧౧౮౨ ఫసలీనుంచి శివాయ యినాంవగైరా ఆలవాల నజరు బముక్తజాయం భజలు కరంబ వో పోలెంవో మొకాసా స్వాధీనం చేసి నారం బాయద లేగయ్యతు రాజిలోను యిస్సిరంగాయ నగూయి న యిస్త సవాల ఆమలాని సర్కారు మచేరోజు ఖతారు సర్కారు సరగరంగా ఉండి వజె పేషకసు సరకారు బలోజబ ఆశీశాతమును నజరానా సాలు బసాలు దాఖలు ఖజనాసరకారుచేసి రసీదు తీసుకుంటూ వచ్చేది. దర తాలూకా చోరివరహాజనికాకుండా నడుచుకునేది. అగరు బోరి ఆయెనా చోరులను ఆనవాలుతో పట్టితెచ్చి మాలు మాలీకులుకు వోహజాయించి ఆణాదులను హుజూరుకు అంపించవలెను. లేదా చోరు లుకు మీరే వోహదాజరాజు చేసేది. తాలూకాలో బిమూన్నహాంకుం గటి వ తోఫ వ ఖందూక చెలుచవనిలేదు. మిమ్మును హుజూరు మక లఖుచేసినా మొహిము పరుమాయించినా రుఖుమియ్యాదు ఖసరంజామకా యిస్తా సరగరంగా వుండవలెను. బతాలీఖు.

౨౮. జుబ్దతుల్ అమానలవలయుకరా ఉయ్యాలవాడ మల్లారెడ్డి ఆఫియ్యత్ బాషందు. దరిమిల్లా హైదరల్లీ ఖాను ఫకీరివల్ల ఉపద్రవం తగలడం లేక యుండగా మిక్కిలి గర్వాహంకారాలతో కూడుకొని సురక్షితంగా ఉండే వేళలో చుట్టుపక్కయుండే రాజ్యంలో వచ్చి హన్నికారణముగా ప్రజలను గష్టపరచి అనేక విధములుగా హంగామా చేసినది సకలమైనవారికిన్ని తెలిసియున్నది గదా. కుంఫిణీవారు ప్రజ

యొక్క సౌఖ్యం ముఖ్యంగా యెంచేశారు గనుక ఆజనకంటకుణ్ణి శిక్షించే నిమిత్తం జయం గాంచేటట్టుపంటే తమ ఫౌజును నాల్గుదిక్కుల నుంచిన్ని మొఖాలిఫ్ రాజ్యంలో ప్రవేశించేటట్లుగా మొకరరుచేసినారు. ఇప్పుడు ఖుదాయతాలా దయవల్లను విస్తారముగా ఫౌజు సీమనుంచి వచ్చియున్నది. నీవు తన యొక్క క్షేమసౌఖ్య నిమిత్తమున్ను మొఖాలిఫ యొక్క జుల్మునుంచి విడుదల అయ్యేటందుకున్ను వాని రాజ్యంలో ప్రవేశించి నీవు ఉపద్రవం పొందినందుకు బదులు అయ్యేటట్టుగా నడుచుకునేది. ఇందువల్ల కుంఫిణీవారు దయచేసి నడిపింతురు. కుంఫిణీవారికి మీరు అందరూ జుల్మునుంచి విడదలయి సౌఖ్యపడవలె ననిన్ని తమామ్ము హిందుస్థానురాజ్యంలో సురక్షితంగా నుండవలెననిన్ని అపేక్షగాని వేరేలేదు. దేవుని దయవల్ల యిన్ని దినములలో ఆలాగే నడువపోతున్నది; గనుక మీరందరున్ను ధైర్యముగా తగతదర్థూదు చేసేదిగాన తెలిసేది. జిలహేద్ నెల ౧౪ తారీఖున ౧౧౯౬ హిజరీ (A. D 1781-83) ఇంగిరీజ్ దస్కతు.

౩౧ A. D. 174ˀ శకం ౧౬౬౨ సన్న ౧౧౫౦ ఫసలి.*

రౌద్రి సంవత్సర శ్రావణ బ॥ 3 శ్రీమన్మహామండలేశ్వర నందెల కుమారరాఘవరాజు దేవమహారాజులుగారు మజరి కుమార మల్లారెడ్డి గారికి వ్రాయించి యిచ్చిన కాగితం. ఈ మరియాదను మేము స్థలం విడిచి బయటయున్నాగాని నీవు అభిమానించి మాస్థలం మాకు కుదిరిస్తున్నానని మాటయిచ్చినావు గనుక మా ప్రయోజనం సానుకూలం చేయించేటట్లుగా మీకు చనుగొండ్ల గ్రామం ఉత్తరోత్తరాన నడిపించ గలవారము. మీ పుత్ర పౌత్ర పారంపరియంతరం నడిపించగలవారము.

మొహరులో అక్షరాలు శాయి(?) అధికమైనందున తెలియలేదు.



బారామహాలు రాజా తేజోవంత

* This should be 1153.

౩౨౦ జబతుల్ అసూసల్ పల యకరాన మజరి పిదమల్లా రెడ్డి జమీందారు ఉయ్యాలవాడ సంగపట్టణం వగయిరా ఖాపియ్యత బాపందు. దరివిల్లా మీ తాలూకా జవాబుస్వాలు పరిఖా చేసుకోమని ఇనాయత్ నామా వ్రాయించియున్నది. గనుక, ఖాతిరుజమాతో సర్కారుకు రుజువు అయి ఉయ్యాలవాడ సంగాపట్టణం లిగందిన్నసు కేసుల వగయిరా గ్రామాలకు రూపాయిలు ౧౦౮౦౦ పదివేలయెనమన్నూర్లు పేషకషి మొకద్దు ఆజరా హాకరంపుజిలుతో సెలవు యిచ్చినారం. గనుక యిందుకు వాయిదా నాల్గు నెలలు మొకరరుచేసినారం. గనుక, హాస్తాల ప్రకారం పయికం చెల్లించి సర్కారు కాలవాయిలో సరగరకగా నుండేది. ఏ మాటకు వసవాసు చేయక ఖాతరుజమాతో వుండేది. 33 A. D. 1719.

౨౮ రబ్బిలవ్వల్ సన్న ౧౨౦౫ హిజరి.

మొహారులో వుండేది.



లిఫాఫా మీాద మొహారులో నయిదు అలావగ్దీను.

జబ్బతుల్ యకరా మజరి మల్లారెడ్డి జమీాందారు తాలూక ఉయ్యాలవాడ ఖాఫియ్యతు బాపందు దరివిల్లా మేము పహారుకు వచ్చి పోతూ యిక్కడ సర్కారు పైకం వసూలు చేసేటందుకు తిరుమల రావును సయ్యదు యిమామును ఉంచినాము. గనుక, మా పేష్కషు రూకలుపైన చెప్పిన వార్లగుండా సర్కారుకు చెల్లించి రసీదు తీసుకు నేది మీా బెహబూద కావలసినది మంజూరు ఉంటే వ్రాసిన ప్రకారం నడుచుకొనేది. మీాకు అభివృద్ధి కావలెనని కోరికయుంటే పయిన వ్రాసిన ప్రకారం నడచుకునేది.

చం ౮ షవ్వాల్ సన్న ౧౨౦౬ హిజరి.



*

మొహార్బాన్ గోస్తాన్ మల్లారెడ్డి జమీందారు తాలూక ఉయ్యాలవాడ సంగాపట్నం జుసలురుహా దరివిల్లా మీరు మామూలు ప్రకారం యీ తాలూక పేషకషి రూపాయిలు ౧౬౦౦౦ సమ్మతి (అగ్రిమెంటు) కబూలు అయినందుకు చెల్లుపోగా బాకీ అయివజుకు యీ దినం లగాయతి మొనిమిది దినములుకు కొంత ఆవల మొనిమిది దినములుకు కొంత యీ ప్రకారం మూడు వాయిదాలు సర్కారు పయికం ఝాడాగా చెల్లించి రసీదు తీసుకుని మీజాగాలో మీరు జాగ్రత్తగా నుండవలెను. పయికం దస్తుమహామ్మదుఖా హామ్మదుసిద్దికి మారిఫత్తు చెల్లించేది ఏ మాటకు రెండో(?) వసవాస చేయపని లేదు. ౨౫ సఫరు ౧౨౧౧ హిజరి.



*

౩౨. మలమీది ఉప్పలపాడులో నుండే ఇమానిగా అనే తురక దాని వద్దనున్న తామ్రశాసనం.

కాళయుక్తి సంవత్సరం మాఘ శు॥ ౫ లు ఖాన్‌వాలశాన్ అమ్యాఖాన్ సాహేబులవారికి ఉప్పలపాటిరెడ్డి కరణాలు పచ్చా తిరువెంగళం నాగోతు తిరుపతి పోటం నాగయ్యా చల్లా జంగం కరణం వేంకటగారు జ॥ యీ అయిదుగురున్నూ వ్రాయించి యిచ్చిన కాగదం.

మీరు జపస్థలం యీదుగాహా కట్టించి అక్కడ గోరీలకు జాగా కావలెనని అడిగితిరి. గనుక ఊరి దక్షిణం పూర్వం పేట అనుగున ఉన్న బుడిగితోట లు ౬౦।౧ గుట్టల అడుగు సంమదం ౬౦ ౧ ఉభయం ౬।౨ ఆరుముంతలింటికి పర్కుశా ౯ ౬ క్రయానకు యిచ్చినారం. గనుక,

* These 3 Sannads contained in M. Vol. 251 foll 19-b 20-b have been described under D. Nos. 360—362 in the Descriptive catalogue of Marathi Manuscripts Vol. II (pp. 327—329).

మీరు ఆజాగా దురస్తు చేయించుకుని యీ దగహా కట్టించుకొనేది. ఇట సిమా సమ్మతిని వ్రాయించి యిచ్చిన గహి(?) పైన వ్రాసిన కరణాల చేవ్రాళ్లు వున్నవి.

### హసన్‌ఖాన్ గురానివద్ద నుండే తామ్ర శాసనం.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౫౩ విరోధికృతు సంవత్సర మాఘ శు॥ ౧౫ లు ఖాన్‌వాలాశాన్ అయ్యాఖాన్ దురాణీవారికి ఉప్పలపాటి రెడ్డికరణాలు నాగోతు పుల్లానాయుడు, ఉప్పర్ల రామానాయుడు, పచ్చా తిరువెంగళం, నాగోతుపాపయ్య నాగిరెడ్డి, కరణం పేరయ, కరణం వెంకటగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను: మా వూరుపడమట కొత్త చెరువు కట్టిస్తిరి గనుక యిందుకు మీకు దసవందం యిచ్చిన వివరం చెరువు క్రింది బీడు ప్రాకెండ్లది ౧౦।।౦. ఈ అంచున రామానాయనిచేలో బీడు ౧౦।౦; వాగు అంచున బీడు ౧౦।౦, గోపన వెంకట బాలిరెడ్డి కిచ్చయ్యగారి సేద్యం సంమంధం చేను ౧౨।౦, ఇప్పర్ల రామానాయని చేను ౧౧౪౦, యీ అంచున వడ్లవాండ్లబావిదగ్గెర రాయకాల్వ క్రింద గోడల అడుగు యీవల బీడు చేను ౧౦।౦. అంతుచేను ఖ ౦।౦ కి, వరి మడి మడిపాటిన ఖ ౧ అక్షరాలా పుట్టెడు మడి దసవందం యిచ్చినారం గనుక మీరు పుత్ర పౌత్ర పారంపర్యాయంగా అనుభవించుకుని సుఖాన నుండేదని వ్రాసియిచ్చిన భూదాన ధర్మ శాసన పత్రిక. ఈ ధర్మం మెవ్వరు పాలిస్తున్నారో తురకలు పాలించి నడిపించిరామెనా మక్కాకు పోయివచ్చిన పుణ్యానబోదురు. కర్ణాటకులు పాలనచేసి నడిపించి రాయనా కాశికిపోయివచ్చిన పుణ్యానబోదురు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ।

పైన వ్రాపిన వారి చేవ్రాలు వున్నవి. రుజువు నాగో నరసాగుమాస్తా కానుగో ఉప్పలపాడు ఒప్పితం.



ఇది గాక శక ౧౬౬౨ రౌద్రి సం॥ర పురవపని చేయించినందుకు గ్రామస్థులు వద్దనున్న తామ్రశాసనం పల్క ఒకటియున్నది.

౪౦. ఆంజనేయస్వామి దేవాలయం అర్చకుడు బెట్టద శ్రీనివాసాచార్యులు యిలాకా దారు మంగసూళి శేషాచార్యులవద్ద నుండిన సన్నదు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౭ అనునేటి యువనామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౦ లు శ్రీమతు అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకులైన కొత్తపేట ఆంజనేయస్వామికి కసబా ఉప్పలపాటి రెడ్డికరణాలు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను: శ్రీస్వామితళిగె నిమిత్తముగాను శ్రీమద్వేద శాస్త్రసంపన్నులయిన బెట్టద శ్రీనివాసాచార్యుల కొమారుడు కృష్ణం భట్లుగారికి హు॥ వారికి సుకృతంగాను రా॥ మెలగిరి పంతులవారి సెలవు ప్రకారం ఉప్పలపాటి పొలములోను బుక్కనసరవణి విడదల కుమ్మరి గడ్డమడికట్లన ౧౦॥౦ యిరసమడి సర్వమాన్యంగా యిచ్చినారం. గనుక మీా పుత్రపౌత్రపారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను సుఖాన దేవుడికి తళిగెసమర్పించుకుంటూ అనుభవించేది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥
దానపాలనయోా ర్మధ్యే దానాచ్ఛ్రేయోానుపాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం॥

కునుకుంట్ల బసవరాజు వీరలసమ్మతిని స్వహస్తం మీానాక్షయ్య వ్రాసి యిచ్చిన దానపత్రం.

౪౧. పెంపల్లె తాలూకా పైకిరాజుపాళెంలో నుండే దేవనూరు వెంకప్ప తావున నున్న సన్నదు ప్రకారం.

శ్రీ పుమామహేశా. శాహీ.

అక్కరసును భాజీ సాహెబుని విన్న.

శ్రీమతు అలియపురెడ్డి మించిరెడ్డి వెంగన్న మన్నెవారు మొకాసా యీ మజుకూరు కోకటం సమ్మతు కామలాపురానకు రాజశ్రీ ...గారు వ్రాసుకున్న ప్రకారం సూరసన్న సమానిను ఆలఫ్. యీలాగున జారి ఆమెను. శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులయిన దేవనూరు తిరువెంగళయ్యవారికి. మీా మజుకూరులో పూర్వాన యేదుం చేను మాన్యంవుండీ యిచ్చియున్నందుకు అది యీమధ్య నడవక పోయినదట. అయితే పెద్దలయిన వారికి దాన పూర్వకంగాను మాన్యక్షేత్రములు యిచ్చినవుడు మధ్యే అభ్యంతరం అయినదట. ఈలాగునడిచేతురా? వెనకటి ప్రకారాన యేమికద్దో ఆప్రకారాన సెలవు యిచ్చినాము. ఈ బాబుకు యిస్కిలుశాయక సురక్షితాన నడిపించేది. ఇందుల ఫిర్యాదు రానియ్య పనిలేదు. గాన తెలిసేది. రోఖా తారీఖు వ్రాసుకొని అసవి తిరుగా యిచ్చేది.

౮౨. జంబులమడుగు తా॥ బెస్తవేములలోని మజరా వేంకటాపురం శ్రోత్రియందారు గరుడాచలంభట్లు వద్దనున్న సన్నదు నకలు.

నవాబు నేకనాంఖాన్, తరఫుదార రపా అతమాలహ్నా యిజ్జిత అదాలదస్తగాః మహమ్మదు తక్కిబేగు తిమ్మానాయని చెరువు వజ్రగిరి లింగంబోడుగారు. శ్రీమద్యజనాది షట్కర్మవిశేషణవిశిష్టులయిన హనుమనిగుండం కృష్ణశాస్త్రిల అయ్యవారికి వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక. స్నయిసనేన స్బైన అలఫ. మీాకు విరోధికృతు సంవత్సరంలో ......వారికి పుణ్యంగాను హా॥ సాహేబులవారికి పుణ్యంగాను తిమ్మనాయని చెరువు సమ్మతులో ఉప్పలూరు గ్రామాన ఊరుతూర్పు చెరువులోతట్టు యిద్దుముమడి ధారాదత్తముగా యిచ్చినాము. అనుభవించేది.

# నందలూరు శిలాశాసనములు

మౌజె నందలూరు గ్రామాన నుండే శాసనములు.

గ్రామాన సోమనాథస్వామి దేవాలయాన నుండేవి.

తూర్పుగోపురం వెలుపట నిలవరాతికి శాసనములు.

సూర్యుడు. చౌరి. వరాహం. చౌరి. చంద్రుడు.

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౩౧ నేండి కీలక సంవత్సర ఆషాఢ శు॥ ౧ గు॥ నాడు స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్ర దేవ మహారాజులు నెలందలూరి మహాజనాలనానతిత్రుద్మి(?) నెలంద నూరను గ్రామగ్రాసవుపల్లెలు, ఆండపూరు, మందడము, మన్నూరు అస్తాపురము, ఇలఇదుఉంళా, సుంకమూను, సాదమూను మొదలు అఇన అవనాయాలూను క్రితమున యేలినవారు కొందురని విద్వాంసులు మాకు జెప్పిరి. వారుంగొంట అన్యాయిముగాన మేమీకు, సుంకమూ సాదమూ అవనాయాలు లోనైన అష్టభోగ తేజస్వామ్య సహితముగాను సర్వ మాన్యముగాయిస్తిమి. మంగళమహా శ్రీశ్రీశ్రీ.

ఇందుకు ఉత్తరం నిలువరాతికి.

సూర్యుడు. దీపం. వరాహ. చంద్రుడు.

నిరంతరాయోస్తు.

ఏతద్బ్రహేంద్రరుద్రాదిమౌళిమాలోపలాలితం।
శ్రీమత్సుందర నాథస్య శాసనంలోక విశ్రుతం॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలిశాహన శకవరుషంబులు ౧౪౨౩ అగు నేటి దుర్మతి సంవత్సర ఆషాఢ శు॥ ౧౨ సో॥నాటి పుణ్యకాలమందును శ్రీమన్మహామండలేశ్వర మీసరగండ కఠారిసాళువ సాళువ నరసింగ రాయ మహారాయల కొమారుడు ఇమ్మడి నరసింగరాయమహారాయడు సకల సేనాధీశ్వర సామ్రాజ్యహస్తుండై విజయనగరమునందుండి రాజ్యం

ప్రతిపాలనచేస్తున్న నరసానాయంక ఒడయుల ఆజ్ఞప్రతిపాలక తొండ మండన స్థాపనాచార్య ఆదివంశావతార వాళపందిలి గోత్రోద్భవుండై గండికోట రాజధానింగాను, సిరివోళ్ల సిద్ధవట్టం సకలి పొత్తపినాటి రాజ్యాలు, ఏలుచున్న సర్వపనాయని దేవినేనిగారి కొమారుండు పర్వతనాయుండంగారు తనకు సిద్ధవటం స్థాయిగాను సకలి. పొత్తపినాటి సీమ ఆజ్ఞాపాలనం చేస్తుండి తమ నాయంకరానకు చెల్లే పొత్తపినాటి రాజ్యములోని ఆకింపాడనే గ్రామము నరసానాయంక ఒడయులకు పుణ్యముగాను నలందలూరి చొకనాధదేవునికి ప్రాతఃకాల దధ్యోదనం అవసరానకు సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను అష్టభోగ తేజ సామ్యమై సర్వమాన్యంగాను ధారవోసి యిచ్చిన వివరం: ఆ గ్రామా నకు తూర్పున రెడ్డిమరెడ్డి, పాపిరెడ్డి, ఆనమేరగానున్న పడమటికి చెయ్యేరుగుండాలభాయలి. మందవల్లి ఒంటిదూబతిప్ప గుర్రాలకొండ పడమర విరాకుంట నరిసికొని ఆరెంపాటి పొలిమేరగానున్న దక్షిణానకు మంగలమోరము కాంకర్రకొండ నడుము, బొల్లిగుండ్లు నరిసికొని సుబ్బ రాయనికుంటకు తూర్పు తిప్ప మేరగానున్న ఉత్తరానకు వడ్డి గంగుప్రాటు జువ్విమాను గెరునుగా మరగానున్న అయిన మెల్లచతుస్సీమాంబుట్టిన సకల సువర్ణాదాయ, ధాన్యాదాయాలు గలంతపట్టునను దధ్యోదన పణ్యా రాలు రెండింటికి బియ్యం మెనిమిదిముంతలు పెరుగు నాలుగుముంతలు, నెయ్యి అరముంతెడు, గంధం అరపలిమెడు, వక్కలు పది, ఆకులు ౨౦, యిర్సువై............

మొదటి ప్రాకారపు గోడ ఉత్తరం గోపురం వద్ద కొవ(?) రాతి శాసనములు.

సూర్యుడు. కలశము. చేతిత్రమాను. కలశము. చంద్రుడు.

అవిఘ్నమస్తు. శుభమస్తు.

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౫౫ అగునేటి ప్రమాదీచ సంవత్సర ఆషాఢ శు॥ ౧౫ గు॥* పూర్వదక్షిణ

* Thursday 220 July 1433.

ఒక్ఫ్ మో త్తర చతుస్సముద్రాధీశ్వర శ్రీమన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప దేవరాయమహారాయలు సామ్రాజ్యము చేయుచుండగా నెలందలూరి శ్రీచొక్కనాథ పెరుమాళ్లుకున్ను అశేష విద్వత్ మహాజనులకున్ను పొత్తపినాటి ప్రోలినాడవులున్ను (? సీమల తాలూకు) లెంబాక రెడ్లున్, తాళ్ల పాక రెడ్లున్, తంగటూరి రెడ్లున్, ఓబలి రెడ్లున్ యీ అయినూర్లున్ ముఖ్యమైన పొత్తపినాటి భూమివారు ఇచ్చిన ధర్మశాసనము. పొత్తపినాంటి భూమిమీాదను విడిచిన వీసపడి పన్ను కాసికె కట్నాలు వెట్టివేమి అసద్రయాలు మొదలైన పన్నులు మీాకున్ను బాహునదితీరమందు శ్రీ చొక్కనాధ పెరుమాళ్ళ సన్నిధిని సోమగ్రహణ పుణ్యకాలమందు శ్రీ వీరప్రతాప దేవమహారాయలకున్ను భూమివారికిన్ని పుణ్యముగాను ధారవోసి సర్వమాన్యంగాను యిస్తిమి. గాన మీారు ఆచంద్రార్కస్థాయిగాను సర్వమాన్యంగాను అనుభవించు వారు. ఈ ధర్మానకు యెవ్వరు విఘ్నము చేసినాను గంగకరతను కపిలమహాధేనువున్ను తమ తల్లిదండ్రులాను వధించిన దోషానబోవు వారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

భూమివారిపంపునను యీ శాసనం వ్రాసిన కరణం తాళ్లపాక కరణం చొక్కరాజురామన్న వ్రాలు. ప్రోలినాడువుల ఒప్పము. గణేశ్వరుడు ప్రోలి ఊరగరణం ముత్తిముమ్మడి వ్రాలు. లెంబాక రెడ్ల ఒప్పము. గణేశ్వరుడు లెంబాక ఊరగరణం ఎఱ్ఱవ్రాలు. తాళ్ళపాక రెడ్ల ఒప్పం. గణేశ్వరుడు, తాళ్ళపాక ఊరగరణం చొక్కరాజు రామన్నవ్రాలు. తంగటూరి రెడ్లు ఒప్పం. గణేశ్వరుడు తంగటూరి ఊరగరణం పెమ్మరాజు వరదన్నవ్రాలు. ఓబలి రెడ్ల ఒప్పం. గణేశ్వరుడు ఓబలికరణం సంగోరాజు నిడకలనారువ్రాలు మంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

ఈ శాసనానకు దక్షిణం నిలవరాతికి.

సూర్యుడు. కలశము. చంద్రుడు

శుభమస్తు. అవిఘ్నమస్తు.

స్వస్తిశ్రీజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౫౬ అగునేటి మన్మథసంవత్సర పుష్య శు॥ ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరఅచ్యుతరాయ మహారాయలు విద్యానగర సింహాసనమందు పృథివీసామ్రాజ్యం చేయుచుండగాను నెలందలూరి చొక్కనాథపెరుమాళ్లకు పూర్వశాసనస్థమైన గ్రామం అండపూరు రాజకాన(?) ఖిలమైయుండగాను యీ గ్రామం తాళ్ళపాక తిరుమలయ్యంగారు అచ్యుతరాయ మహారాయలకుం జెప్పి ఆ గ్రామం చొక్కనాథపెరుమాళ్లకు రాయలచేత యిప్పించి రామాభట్ల అయ్యవారికిని రాయలచేత ఆనతి యిప్పించి అండపూరి గ్రామం తథాతిథి మకరసంక్రమణ పుణ్యకాలమందు అచ్యుతరాయమహారాయలకు పుణ్యంగాను రామాభట్ల అయ్యవారు తిరువేంగళనాథుని సన్నిధిని సర్వమాన్యంగ్రామంగాను ధారవోసి ఆచంద్రార్కస్థాయిగాను పెరుమాళ్లకు సమర్పించిరి. ఈ ధర్మానకు యెవ్వరుతప్పినాను వారణాసిలోను గోబ్రాహ్మల వధించిన పాపాన తమ తల్లిదండ్రుల వధించిన పాపానం బోవువారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః ॥

మంగళంమహా శ్రీశ్రీశ్రీం జేయును.

ఈ శాసనానకు దక్షిణం నిలవరాతికి ఉండేది.

సూర్యుడు. చక్రము. చంద్రుడు

శుభమస్తు. నిరంతరాయోస్తు.

స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౭౮ అగునేటి నళసంవత్సర పుష్య బ॥ ౧౨ లు సోమవార మకరసంక్రమణ పుణ్యకాలమందు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరసదాశివదేవ మహారాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢుండై పృథివీ రాజ్యం ప్రతిపాలనం జేయుచుండగాను నెలందలూరి జక్కుల తిప్పా బత్తుని కూతురు తిమ్మసానికి చెల్లేక్షేత్రం సొమ్ము నెలందలూరు పాలూరు అండపూరు తంగటూరు ఓబలి పందలూరు తాళ్ళపాక గుండ్లూరు ఊటు కూరు యీ తొమ్మిది ఊళ్లను వచ్చిన మడికుంటలు ౨౭ కుంటలున్ను దోశెలపడికి తనకు పుణ్యంగాను చొక్కనాథదేవునికి ధారవోసి యిస్తిమి. ఈ పుణ్యానకు యెవ్వరు తప్పగలవారం కాము. ఇందుకు తప్పితేను గంగ కరతను గోవును చంపిన పాపానబోదురు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

జక్కుల తిమ్మసానిసేవ. మంగళమహా శ్రీశ్రీ జేయును.

చొక్కనాథునికి సమర్పించిన జక్కుల తిమ్మసాని కూతురు లక్ష్మి యిచ్చిన పంజరం కమ్మలు.

౬. ఈ శాసనానకు దక్షిణంగా నిలవరాతికి ఉండేది.

సూర్యుడు. చక్రము. నామము శంఖు. చంద్రుడు.

పింగళ ౧౪౭౯. శుభమస్తు.

ఏతత్ బ్రహ్మేంద్ర రుద్రాది మౌళిమాలోపలాలితం।
శ్రీమత్సుందర నాథస్య శాసనంలోక విశ్రుతం॥

స్వస్తి శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౯౦ అగునేటి పింగళ సంవత్సర ఆషాఢ శు॥ ౧౧ లు* శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరసదాశివదేవమహారాయలు విజయనగర

---

Pingala ŚS, 1479 (8th July AD. 1557.)

కవులునామా. తర్వాత, పొళ్లోపల్లె ...సుబ్రహ్మణ్యుని మడి అచ్చుకట్టుకు నేము కవులు కావలెనని అడిగితిరి గనుక మీకు పిల్చుకు యిచ్చిన విషరము. అచ్చుకట్టుకు కుంట ౧ కి రెండురూకల లెక్క, రెండో సంవత్సరం తాగాయితి కుంట ౧ కి సర్వమక్తా నాలుగు రూకల వంతున కవులు యిచ్చినారము. మా కవులు నమ్మి విస్తారం ఫలంచేసుకొని సుఖాన నుండేది. చింతమానిపల్లె దక్షిణం మడి కోనను రట్టురాముని మడికి దక్షిణం బావి తొవ్వించుకొనేము కౌలు యివ్వమని అడిగితిరి గనుక తొలిసంవత్సరం కుంట ౧ కి అడ్డగలెక్క, రెండోయేడు కుంట ౧ కి రూక లెక్క, మూడోయేడు తాగాయతి యెల్లప్పటికి కుంట ౧ కి రెండు రూకల లెక్క సర్వమక్తాగా నడిపించ గలవారము. రెడ్ల వ్రాలు. రట్టు రాముని వ్రాలు.

33. ప్రమాదీచనామ సంవత్సర ఆషాఢ శు॥ ౭ లు మహారాజ పురం అగ్రహారస్థితాశేష విద్వన్మహాజనులు గండికోట బుచ్చన్నకు వ్రాయించి యిచ్చిన కవులు. తర్వాత, మా అగ్రహారము చెర్లో చేను ఆరు కుంటలు, కుంట ౧ కి రెండురూకల పట్టి(?) రెండురూకలు యీప్రకారం సర్వమక్తాగాను కౌలు యిచ్చినాము. గనుక, మా కౌలు విశ్వసించి విస్తారం ఫలం చేసుకొని, సుఖాన నుండేది. సభవారి సమ్మతిని చూడామణి సోమయాజులు వ్రాలు.

34. ఆనందనామ సంవత్సరం శ్రావణ బ ౨ లు శ్రీమద్వేద మార్గప్రతిష్ఠాపనాచార్య ఉభయవేదాంత ప్రవర్తకులయిన భాకరాపురం అగ్రహారం సభవారు గండికోట బుచ్చన్నకు వ్రాయించి యిచ్చిన కవులు. మా అగ్రహారములో చేను కవులుకు కావలెనని అడిగితిరి; గనుక, రామరాజుపట్టెను ఆకులవెంకట కంసాలముత్యాలు యీడ్వ కుంటలు ౨౪ కి, కుంట ౧ కి రెండురూకల లెక్క, పట్టి(?)అర్ధంలెక్క సర్వమక్తాగాను కవులు యిచ్చినాము. మా కౌలు నమ్మి విస్తారం ఫలం చేసుకొని సుఖాన నుండేది. శ్రీనివాసాచార్యుల వ్రాలు, కొండమాచార్యుల వ్రాలు, గోడ అయ్యంభట్ల వ్రాలు, కవి రామన్న వ్రాలు, చక్రవర్తుల కృష్ణమా చార్యుల వ్రాలు.

౩౫. ఆనందనామ సంవత్సర మార్గశిర బ॥ ౫ లు వెంకట్రామ రాజపురం అగ్రహారస్థితాశేషవిద్వన్మహాజనులున్నూ రాజశ్రీ గండి కోట బుచ్చన్నగారికి వ్రాయించి యిచ్చిన కవులు. మా అగ్రహారంలో మీ బావికి పడమట చేను కావలెనని అడిగితిరి. గనుక, తొలి సంవత్సరం కుంట ౧ కి రూక లెక్క, రెండో సంవత్సరం కుంట ౧ కి రెండురూకల లెక్క, మూడోయేటి తాగాయితి యెల్లప్పటికి కుంట ౧ కి మూడు రూకల లెక్క, పట్టి(?) దేశ ఒప్పందానకు అర్ధం లెక్క పంపకాలు పని లేకుండా యిచ్చినాము. గనుక, మా కౌలు నమ్మి విస్తారం ఫలం చేసుకొని సుఖాన నుండేది. సభవారి సమ్మతిన వెంకటచలం వ్రాలు.

౩౬. రాక్షసనామ సంవత్సర శ్రావణ శు॥ ౧౦ లు శ్రీమద్వేద మార్గప్రతిష్టాపనాచార్య ఉభయవేదాంత ప్రవర్తకులయిన వెంకటేశ్వర పురం అగ్రహారం సభవారు, గండికోట బుచ్చన్నకు వ్రాయించి యిచ్చిన కౌలు. అగ్రహారానకు పడమట బీటిపొలంలో బావి తొవ్వించుకొనేము కౌలు కావలెనని అడిగితిరి గనుక కౌలు యిచ్చిన వివరం. బావి క్రింద చేను యెనిమిది కుంటల యింటికి, తొలియేటికి సర్వమాన్యం, రెండో యేడు కుంట ౧ కి పాతికె, మూడోయేడు అడ్డుగ, నాలుగోయేడు ముప్పాతికె. అయిదోయేటి తాగాయితి యెల్లప్పటికి, కుంట ౧ కి రెండురూకలు లెక్క, పట్టి(?)పంపకాలు యీ కౌలు ఒప్పందంగాను, నడి పించగల వారము. ఇటని మారాజీని వ్రాయించి యిచ్చిన కవులు. అగ్రహారీకుల సమ్మతిన శేషాచార్యుల వ్రాలు.

౩౭. హేవళంబినామ సంవత్సరం ఆషాఢ శు॥ ౨ లు శ్రీమద్యాజనాది షట్కర్మనిరతులయిన గంగరాజుపురం అగ్రహారస్థితాశేషవిద్వన్మహా జనులున్నూ గండికోట బుచ్చన్నకు వ్రాయించి యిచ్చిన భూమి చేను క్రయపూర్వక ధారాగ్రహీత పత్రిక. మాకు అగత్యము వుండి మీ చేత గ ౧౦ పది చెక్రాలు, తీసుకొని అందుకుగాను మా అగ్రహారానకు ఉత్తరం సముదాయపొలం తంగెళ్ల బీడు, యెండ్ల తాగాయతి బీడు వుండె గనుక, ఆ చేను యెనిమిది కుంటలు మీకు క్రయంచేసి దాన

పూర్వకముగా యిచ్చినాము. గనుక ఆ చేలో బావి తొవ్వించుకొని పైరు పైరడుగులు ఫలం చేయించుకొని, మీ పుత్రపౌత్రపారంపర్యాయం ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని సుఖాన నుండేది. సర్వ మాన్యంగా అనుభవించుకొనేది. ఇందుకు సాక్షులు, వంగలూరి మూర్తి కరణం వెంకటనారాయణ, ఒండారు ఓబవ, బల్లాణి నారాయణ, కుంజేటి రంగప్ప, వీరలసమ్మతిని పేటపెనుబోల కరణం జగన్నాథయ కుమారుడు రాముడు వ్రాసిన క్రయపూర్వక ధారాగ్రహీత పత్రిక. పట్టి(పంపు?) వ్రాతకాలు యెల్లప్పటికి పనిలేకుండా అనుభవించుకోగలవారు. భాగవతుల గుండాలయ వ్రాలు, సాంబయ్య వ్రాలు. నరసంభట్ల వ్రాలు, అవధానం కిచ్చంభట్ల వ్రాలు.

మవుజె చెన్నమాంబాపురములో అనంతసముద్రము కరణము నందవైదీకి శ్రీ సీతారామన్న వద్ద యున్న కాగిత పత్రము యొక్క నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహాన శకవరుషంబులు ౧౭౧౨ అగుననియెడి సాధారణనామ సంవత్సరం ఆశ్వయుజ శు ౧౨ లు ఋక్ శాఖాధ్యాయులయిన, శ్రీవత్ససగోత్రోద్భవులయిన గండికోట కొండప్ప పౌత్రులయిన కొండప్ప పుత్రులయిన గంగాధరయ్యగారికి, కౌశికవిశ్వామిత్రస గోత్రోద్భవు లయిన వత్తలూరి పుల్లన్న పౌత్రు లయిన గరుడాచలము పుత్రు లయిన యెల్లప్పగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను: లోగడ మా తండ్రి మా పెద తండ్రిగారు ఉన్నప్పుడు మా పెదతండ్రికి కొమాళ్లు లేక మీ తండ్రిని పిలుచుక వచ్చి తన కుమార్తెను యిచ్చి వివాహాం చేసి తన పాలు మీ తండ్రిగారిది అని పదిమంది ముందర నిష్కర్ష చేసి యుండెను గనుక, మా తండ్రి మామిరాసీలు మహారాజశ్రీ మట్లివారికి తెగవ్రాయించి యిచ్చినందున మీ తరఁడ్రిగారు తిరిగి రాజువారికి కట్టుం ఒప్పి సంవత్సరం దరబాదు కాజిమహారాజశ్రీగారి పేరట మిరాసీకి తిరుగా దానపత్రము వ్రాయించుకొని మిరాసీ సాధించి నందున, ఆతాగాయతి మీ తండ్రి

గారు స్వర్గస్థులు అయిన తాగాయతి మీరు మా తావుననే కూడా మీకు మాకు వ్రాతముఖాంతరం మీరాసి బాబులు వగదెగి యుండవలె నని పదిమంది మడిచెరువు, ఉదయమాణిక్యము, యర్రావారిపాలెము సభ వారి ముందర షోచ్చరిస్తిరి, గనుక అదే ప్రకారము వ్రాయించి యిచ్చిన వివరము. వత్తలూరు, దేవసముద్రం, అనంతసముద్రం, మడిచెరువు వగయిరా గ్రామముల కరణీకమిరాసీ దసవందాలు భటవృత్తులు వగయిరా మేరబాబులు, దేశిలు, అప్పం(?)అస్తి, పశ్వాదిపంచలోహాలు, దేశిలు, యే దినము వేరుపోతే ఆ దినము చెరిసగంగా పంచుకొని అనుభవించుకోగల వారమని, అర్ధాయము మీకు మీ పుత్రపౌత్ర పారంపర్యంతరం మా పుత్రపౌత్ర పారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగాను, అనుభవించుకొని సుఖాన నుండమని వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక. యెల్లప్ప వ్రాలు. అని వ్రాలు ఉన్నది.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మద్వంశజాః పరమహీపతి వంశజా వా ।
యేభూమిపా స్సతత ముజ్వలధర్మచిత్తాః ।
మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి ।
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి ॥

సిలసిలాజారీ.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౩ అగునేనిమెడి విరోధికృతునామ సంవత్సర శ్రావణ శు॥ ౧౫ లు ఆశ్వలాయనసూత్ర శ్రీవత్ససగోత్రోద్భవు లయిన గండికోట కొండన్న పౌత్రులయిన కొండప్ప పుత్రులయిన గంగాధరునికి ఆశ్వలాయన సూత్ర కౌశికవిశ్వామిత్రసగోత్రోద్భవు లయిన వత్తలూరి పుల్లయ పౌత్రు లయిన గరుడాచలం పుత్రు లయిన యెల్లప్ప వ్రాసి యిచ్చిన కరిణీక మిరాసి భాగము ధర్మశాసన పత్రిక, వత్తలూరు, దేవసముద్రం అనంతసముద్రంలో మా భాగం మిరాసి వత్తలూరిలో గండికోట

అప్పన్న భాగము పాతికె, వత్తలూరి చెంచు భాగం పాతికె, ఆ అప్పన్న భాగం పాతికె, జుమలా ముప్పాతికె గాక నిలిచిన మా భాగం పాతికెలో అర్ధంపరకపాలు ; దేవసముద్రం అనంతసముద్రంలో మా భాగంలో అర్ధం మీకు ధారాగ్రహీతంగాను వ్రాసియిచ్చినాము. గనుక కరిణీక మిరాశిసహా గోపమాంబాపురములో వృత్తి సమ్మంధం మా భాగములో అర్ధం యీతధాతిధి ప్రసిద్ధపుణ్యాకాలమునందు సహిరణ్యోదక దానధారా పూర్వకంగా యిచ్చినాము. గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యంతరం అనుభ, వించి సుఖాన నుండమని వ్రాసియిచ్చిన కరణీక మిరాసి ధర్మశాసన పత్రికె. స్వహస్తం యెల్లప్ప వ్రాలు.

స్వదత్తా ద్విగుణంపుణ్యాం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా ॥

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

సిలసిలాజారి.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౭౫ అగుననిమెడి రుధిరోద్గారి నామ సంవత్సర మార్గశిర బ॥ ౧౦ లు శ్రీవత్సస గోత్రోద్భవులయిన ఋక్శాఖాధ్యాయులయిన గండికోట కొండప్ప పౌత్రులయిన కొండప్ప పుత్రులయిన గంగాధరయగారికి, కౌశికవిశ్వామిత్రస గోత్రోద్భవు లయిన ఋక్శాఖాధ్యాయు లయిన వత్తలూరు గరుడాచలం పౌత్రు లయిన యెల్లప్ప పుత్రు లయిన రామకృష్ణయ్యగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమ మెట్లన్నను : మా పెదతాతగారు యెల్లప్ప, చినతాతగారు గరుడాచలము ఉభయులు వారు ఉన్నప్పుడు యెల్లప్పగారికి కుమాళ్లు లేనందున నీ తండ్రిగారిని దేశములోనుంచి పిలుచుకొని వచ్చి తన కుమార్తెను యిచ్చి వివాహము చేసి తన భాగము మీ తండ్రిగారిది అని పదిమంది

ముందర నిమ్కరచేసి నందున, ఆ యెల్లప్ప గరుడాచలం మీా తండ్రిగారు కూడ నష్టమయి పోయినందున గరుడాచలం కుమారుడు మా తండ్రి గారు, మీా తండ్రిగారు మీారు కూడా యున్నప్పుడు, వత్తలూారు, దేవ సముద్రం అనంతసముద్రల మడిచెరువు వగైరా దసవందాల, మాన్యాలు కరిణీకమిరాశి బాబులు కూడా అర్ధాయం వ్రాయించి యిచ్చియున్నం దున, అదేప్రకారం మా తండ్రి యెల్లప్పగారికి కొమాళ్లు లేనందున, నన్ను దత్తత చేసికొనెను; గనుక నాపేరట దానపత్రము కావలయునని యెచ్చరి స్తిరి గనుక అదేప్రకారం వత్తలూారు అనంతసముద్రం మడి చెరువు వగైరా గ్రామాదుల దసవందాలు కరణీకమాన్యాలు భట వృత్తిమాన్యాలు వగైరా మేరబాబులు, దేశీలు, పశ్వాది పంచ లోహాలు, అప్పు ఆస్తి దేశీలు చెరిసగం అనుభవించగలవారం. యే దినము మేము వేరుపోతే ఆ దినము యిన్ని గ్రామముల మిరాశీలు అప్పు ఆస్తి పశ్వాదిపంచలోహాలు కూడా ఆదినం వరకు ఉండిన సగం మీా తట్టుచేర్చి తతిమ్మాసగం నేను తీసికొని పోగలవాడనని వ్రాయించి యిచ్చినాము. గనుక మీా పుత్రపౌత్ర పారంపర్యంతరం మా పుత్రపౌత్ర పారంపర్యంతరం ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకొని సుఖాన నుండ మని భూదాన ధర్మశాసన పత్రిక సరి. రామకృష్ణయ వ్రాలు అని యున్నది. ఇందుకు సాక్షులు: మెడకుర్తి మహేశ్వర సోమయాజుల వారు, మహారాజశ్రీ బాలాజీ రాయనివారు, మడిచెరువు సభవారు ఉదయమాణిక్యం, చింతగుంట యెర్రావారిపాళెం సభవారు, వీరల ముందరను మోదుకూరి సుబ్బన్న చేత వ్రాయించి యిచ్చినది.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

మద్వంశజాః పరమహీపతి వంశజా వా ।
యేభూమిపా స్సతత ముజ్వలధర్మచిత్తాః ।
మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి ।
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా ।

సిలసిలాజారి.

మవుజె చెన్నమాంబాపురం అగ్రహారీకులు రంగసముద్రం సీతా రామభట్లు, కాచు సుబ్బాభట్టు వగైరాల వద్ద ఉన్న కాకితముయొక్క నకలు.

హారేర్లీలావరాహస్య దష్ట్రాదండస్స పాతువః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీ ఛత్రశ్రియందదా ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౮౪ అగు నేటి శుభకృతునామ సంవత్సరం ఫాల్గుణ శు॥ ౧౪లు భానువాసరే సోమోపరాగ పుణ్యకాలే తస్మిన్ పుణ్యదివసే ఆపస్తంబ సూత్రే యజుశ్శాఖాధ్యాయి కాస్యపసగోత్రోద్భవు లయిన శ్రీమన్మహామండలేశ్వర మట్లి యెల్లమరాజుగారి నప్తృ లయిన కుమార పెద అనంత రాజుగారి పౌత్రులయిన కుమార అనంతరాజుగారి పుత్రులయిన అనంత రాజుగారు శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన చెన్నమాంబాపుర అగ్రహార స్థితాశేషవిద్వన్మహాజనులకున్ను వ్రాయించి యిచ్చిన సర్వాగ్రహార భూదానధర్మ శాసన పత్రిక క్రమమెట్లన్నను. శ్రీగిరిద్వారమునకు పూర్వ(?) ద్వారము అయిన సిద్ధవటం సీమలోకిచెల్లే మా యేలుబడిలో పొత్తపినాడు పుల్లుల నాటి సీమామూలంలోకి మా యేలుబడి పులుగులనాటి సీమలో వత్త లూరి గ్రామంలోకి చెల్లే అనంతసముద్రం గ్రామంలో ప్రాక్ ఉదీచ్య దిగ్భాగమునందు అరణ్యం ఉండగాను. అగ్రహారం చేసి హద్దులు యేర్పరచిన వివరము.

అగ్రహారం పొలానికి తూర్పు తుమ్మల పొదవంక హద్దు, దక్షిణం ద్వారి చింతల హద్దు, పడమట పణిదెం కుంట హద్దు, ఉత్తరం గానుగ మిట్ట హద్దు. ఈ స్థళమున్ను మడికి నిర్ణయం చేసినది.

పెద్ద చెరువు క్రింద ఒడ్డు క్రింది మడికి హద్దులు యేర్పరచిన వివరం.

తూర్పు గోనెలవానిచేను పడమట కట్ట హద్దు, దక్షిణం ఒడ్డు హద్దు, పడమట చెరువుపంక హద్దు, ఉత్తరం యిటికెలగడ్డ హద్దు. ఈ ప్రకారం ఉభయచతురశ్రములు ఉన్నట్టి పొలానకు హద్దులు యేర్పరచి సంఖ్యాగణాన వృత్తులు ౧౨ కి శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన ఆపస్తంభసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన భారద్వాజసగోత్రులయిన వెంకటాద్రిభట్లనప్తృలయిన వెంకట్రాద్రిభట్ల పౌత్రులయిన, పెరుమాళ్లభట్ల పుత్రులయిన గిండ్లూరి గోపాల దీక్షితులవారికి యాజమాన్యంసహా వృత్తిన్నర, భారద్వాజస గోత్రు లయిన అనంతభట్లనప్తృలయిన కృష్ణంభట్ల పౌత్రు లయున వెంకట సోమయాజుల పుత్రులయిన భండాత్మకూరి సీతారామ సోమయాజుల వారి వృత్తి ౧, శ్రీవత్ససగోత్రులయిన వెంకటాద్రిభట్ల నప్తృ లయిన వెంకటాద్రిభట్లపౌత్రు లయిన తిరుమలదీక్షితుల పుత్రులయిన మానం తిమ్మన జోశ్యుల వారికి వృత్తి ౧, కాస్యపసగోత్రు లయిన విశ్వనాథ భట్ల నప్తృ లయిన అహోబళభట్ల పౌత్రు లయిన తిప్పశాస్త్రిల పుత్ర్రు లయిన ఆలూరి అహోబళశాస్త్రిలవారికి వృత్తి ౧, శ్రీవత్సస గోత్రులయిన రామాభట్లనప్తృ లయిన లింగంభట్ల పౌత్రు లయిన రామాదీక్షితుల పుత్రు లయిన యిమ్మనూరి రఘుపతి శాస్త్రిలవారికి వృత్తి ౧ శ్రీవత్సస గోత్రు లయిన వెంకటాద్రిభట్లనప్తృ లయిన వెంకటాద్రి భట్ల పౌత్రు లయిన తిరుమలదీక్షితుల పుత్రు లయిన మానం తిరుమల జోశ్యులవారికి గ్రామ పౌరోహిత స్వాస్థ్యం, వృత్తి ౧. కౌండిన్యస గ్రోతు లయిన యజ్ఞంభట్ల నప్తృ లయిన యజ్ఞంభట్ల పౌత్రు లయిన యజ్ఞంభట్ల పుత్రు లయిన సాధు నరసంభట్ల వారికి వృత్తి ౧. ఆత్రేయస గోత్రు లయిన లక్ష్మణభట్ల నప్తృ లయిన నాగంభట్ల పౌత్రు లయిన లక్ష్మణభట్ల పుత్రు లయిన ఉల్లెం భైరవ శాస్త్రిల్ల వారికి వృత్తి ౧. శ్రీవత్సస గోత్రు లయిన రంగనాథయ నప్తృ లయిన బసువయ పౌత్రు

లయిన కొండప్ప పుత్రు లయిన గండికోట కొండప్పకు వృత్తి ౧. వసిష్ఠన గ్రోతు లయిన లింగపరాజు నప్త్రు లయిన, రమణప్ప పౌత్రు లయిన లింగమరాజు పుత్రు లయిన మోదుకూరి వెంకటరామన్నకు వృత్తి ౧. ఈ ప్రకారం వృత్తులు ౧౨. పురుషవహి ౧౧ నిశ్చయించేసి, త్రికరణ, త్రివాచక, త్రిపురుషోద్దేశంగాను శ్రీస్వామికి అర్పితముగాను జలపాషాణ, నిధినిక్షేప, అక్షీణఆగామి, సిద్ధసాధ్యంబులనియెడి అష్టభోగ స్వామ్యంబులగునట్టుగాను యీ సోమోపరాగ పర్వణి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారాపూర్వంగాను యిస్తిమి; గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యాయంగాను ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుకొని సుఖాన ఉండేది.

సామాన్యోయం ధర్మసేతుః నృపాణాం ।
కాలేకాలే పాలనీయోభవద్భిః
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః ॥

యేభూమిపాః సతత ముజ్జ్వలధర్మచింత్తా।
మద్వంశజాః పరమహీపతి వంశజా వా ।
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి ।
తత్పాదుకద్వయమహం శిరసా వహామి ॥

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

౫. మవుజే వత్తలూరిలో యుండే గండికోట వెంకటనారాయణరావువద్దనున్న సన్నదులు :

శుభకృతునామ సంవత్సరం ఫాల్గుణ శు॥ ౧౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రాజు దేవచోడ మహారాజులుగారు వత్తలూరు

దేవసముద్రం రెడ్డికరణాలకు పుత్తెంచిన ప్రయోజనం. ప్రాకు సంవత్సరం గ్రామాదులలో వత్తలూరు పెదతిమ్మన్న భాగం కరిణీకమిరాసితో కూడి సందులకు అతగాడు మృతనష్టమయిన గ్రామాన జాస్తిఅయి యున్నందున యిప్పుడు గండికోటఅప్పన్న తాళ్లపాక వెంకన్న సముఖానకు వచ్చి ఆమిరాసి తనకు దయచేయవలసినది, నగరికి కట్నము ఒప్పుతున్నా మని మనవిచేసికొనిరి. గనుక యిప్పుడున్నూ పెద్దతిమ్మన్న భాగము మిరాసికిగాను కట్నం ౧౧౫ చక్రాలు నూటపదిహేనుచక్రాలు. ఆమిరాసీ యేమియున్నప్పటికిన్ని అప్పన్నకు వెంకన్నకు సెలవు యిచ్చినారము. ఆభాగమునకు వచ్చిన మేర మీరాశి వగయిరా యావత్తున్ను వీరికి నడిపిస్తూ వచ్చేది.

ఇందుకు తాలీకు వ్రాసుకొని అసలు తిరుగాయిచ్చేది. శ్రీరామా అనేవ్రాలుతో కూడిన సన్నదు ౧.

౬. రాక్షసనామ సంవత్సరం అధిక భాద్రపద ఒ ౬ లు శ్రీమతు గండికోటఅప్పన్న గారికి సాయపనేని చింతన్న మిక్కిలినేని మూర్తెన్న గారు వ్రాయించి యిచ్చిన చెల్లుచీటి. వత్తలూరు దేవసముద్రము గ్రామాదులలో తాళ్లపాకవెంకన్న మీరు పెద్దతిమ్మన్న భాగం దివాణానకు జప్తిఅయి యుండగాను అది మీరు ఉభయత్రులు కట్నం ఒప్పుకొని మీరు తీసుకొని పుచ్చుకొని(?)కొన్ని దినములు జరిగిన తరువాతను వెంకన్నవచ్చి నాకుమీరాసివద్దని మమ్ముల వత్తలూరికి వెంటబెట్టుకొనివచ్చి వత్తలూరి అప్పన్న, పిడతల నరసన్న, కొడవలి రామిరెడ్డి, అంబటి వెంగనరెడ్డి వీరల ముందర నాకు మీరాసి అక్కర లేదు, అక్కర పనిలేదు, అని ఒప్పగించి ఆమిరాసి తనభాగం క్రయం ౫౭౪ యాభైయేడు వచ్క్రాలన్నర మీద మాకు హాకాతి యిచ్చె గనుక ఆప్రకారం ౫౭౪ చక్రాలకు చెల్లిస్తిరి గనుక చెల్లించుకొని వ్రాయించి యిచ్చిన చెల్లుచీటి. చింతన్నసమ్మతిన మూర్తెన్నవ్రాలు, వత్తలూరి కరణం రామన్నవ్రాసిన చెల్లుచీటి. చింతన్న సమ్మతిన మూర్తెన్న వ్రాలుతో ఉండే కాగితము చెల్లుచీటిసహా.

౭. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౧ అగునేటి సౌమ్యనామ సంవత్సర ఆషాఢ శు॥ ౧ లు షడ్దర్శనం చూడామణి సోమయాజులవారున్ను రామాభక్తుల సోమేశ్వర సోమయాజుల వారున్ను గండికోట అప్పన్నకు వ్రాయించియిచ్చిన అమరికెచీటి. పూర్వమందు షడ్దర్శనం ఈశ్వర సోమయాజులవారు మీతండ్రి తిమ్మన్న గారి పేరిట మహారాజపురం అగ్రహారంలో కాపులను కుదిర్చి పల్లెకట్టించి పొలంసాగించి పంపుచేసేటందులకు పల్లెకట్టుమాన్యం నడిపిస్తూ యున్నామనిన్ని వ్రాసియిచ్చియుంటిమిగదా. వృత్తులపొలం విడికాక పంపకంచేసికొంటూ యున్నంతలో నిర్ణయముచేసిన స్థళనిర్ణయ వివరం : తూర్పున బాడువను మీరుతొవ్వించుకొన్న బావిక్రింద చేను ౩ కుం మూడుకుంటలు, గంగులరేవుచేలికి ఉత్తరం పోచిరాజు అప్పన్న విడుదల చేను కాడారంభము కుం ౫ అయిదుకుంటలు : ఉభయం చేను కుంటలు ౮ యెనిమిదికుంటలు సర్వమాన్యముగాను వ్రాయించి యిస్తిమి. అనుభవించుకొని మీపుత్రపౌత్ర పారంపర్యంగాను ఆచంద్రార్కస్థాయిగాను సుఖానఉండేది. సోమనాథసోమయాజుల(వారి)వ్రాలు, సోమేశ్వరసోమయాజులవారివ్రాలు.

౮. రౌద్రినామ సంవత్సరం శ్రావణ శు॥ ౧౦ లు రాజశ్రీ గండికోట అప్పన్నగారికి ముక్కా కృష్ణమయగారి మారంరెడ్డి వ్రాయించి యిచ్చిన మాన్యవిక్రయపత్రిక వివరము. జిల్లేళ్లమడక ముక్కా చెంచురెడ్డి మారిఫత్తు పొలంమాన్యం ఉండగా మా అవసర నిమిత్తం మీచేత అప్పతీసికొన్న రొక్కం ౬ (౧౪) ఆరుచక్రాలు నాలుగురూకలకు మా భాగం మాన్యం కు ౧ కుంటెడు మడిన్ని మీకు ఖరీదీకియిస్తిని గనుక మీపుత్రపౌత్ర పారంపర్యతరం అనుభవించుకొని సుఖాన ఉండేది. ఇందుకు సాక్షులు అచ్చిరాజు చలమన్నవ్రాలు ముక్కారామిరెడ్డివ్రాలు మారంరెడ్డివ్రాలుతో కూడా కాగితం.

రౌద్రినామ సంవత్సర శ్రావణ శు॥ ౫ లు శ్రీమతు చిన ఓబళాపాటి రెడ్డి కరణాలు గండికోట తిమ్మప్పకు వ్రాయించి యిచ్చిన

కాలునామా. తరువాతను, పొదుచేలస్థళానకు చినగాలుగారి సముదాయం మడి `గడ్డతీర్పు మీరు ఖరీదికి తీసికొంటిరి గనుక ఆ స్థళానకు ఉత్తరం గడ్డతీర్పు తీర్పించుకొని ఫలంచేసికొనేము కౌలు కావలయునని అడిగితిరి గనుక, మీకు కవులుయిచ్చిన వివరం. ఈ సంవత్సరం మడికుంట ౧ కి తూక లెక్కను, రెండో సంవత్సరం మడి కుంట ౧ కి రెండు తూకల లెక్కను, మూడో సంవత్సరం తాగాయితి యెల్లప్పటికిన్ని కుం ౧ కి నాలుగు తూకల లెక్కను దేశ ఒప్పందం పట్టి తగిలితే అర్ధం లెక్కను పయిరడుగుకు . యీ కవులుకు అర్ధం లెక్కను యీ ప్రకారం సర్వ మక్తాగా కవులు యిచ్చినారం. మా కవులును విశ్వసించి విస్తారముగా ఫలముచేసికొని సుఖాన నుండేది. రెడ్ల వ్రాలు తోకూడా కాకితం కవులు ౧.

౧౦. దుర్మతినామ సంవత్సర నిజ జ్యేష్ఠ శు॥ ౨ లు శ్రీమతు వత్తలూరి అధికారము రెడ్డికరణాలకు గండికోట అప్పన్నగారికి వ్రాయించి యిచ్చిన కవులునామా. తరువాతను ఊరస్థళంలో భట్టు వారిబావికి చేనికి దూర్పు దిన్నెమీద బావి తొవ్వించుకునేము కవులు కావలయునని అడిగితిరి గనుక మీకు కవుయి యిచ్చిన వివరము. భట్టు వారి బావి క్రింద చేను, విడుదల భండారం వెంగమరాజు వెంకటగారి బావి క్రింద చేను విడుదలచేసి యిప్పితిమి గనుక అందుకు కుంట ౧ కి ౧౨ లెక్కను, పైరడుగుకు కుంట ౧ కి ౧౧ లెక్కను కట్టి తొవ్వించుకొని గడ్డతీయించుకున్న మట్టుకు కుంట ౧ కి యీ సంవత్సరం ౧౧ లెక్కను. పైరడుగుకు అర్ధం లెక్కను, గడ్డతీరు తీయించుకున్న మట్లుకు బాలాటాబా చేనికి యెల్లప్పటికిన్ని కుం ౧ కి ౧౩ లెక్కను, పైరడుకు అర్ధంలెక్కను యిందుకు అరవాసి వడ్డిన్ని కుంట ౧ కి ౧౪ లెక్కను, పైరడుగుకు అర్ధంలెక్కను యీ ప్రకారం కౌలు యిచ్చినారం. మా కవులు విశ్వసించి విస్తారం ఫలం చేసుకొని సుఖాన నుండేది. అని. కౌలుకాగితము ౧ రెడ్లు అంబటి వెంగళరెడ్డి వ్రాలు, కొడవలి పాపిరెడ్డివ్రాలు, కరణం రామన్న వ్రాలు.

౧౧. మపుజే వత్తలూరు గ్రామం అంబడి శేషారెడ్డిగారి దగ్గర నున్న రాగివలక మీాద ఉన్న తామ్రశాసనానికి నకలు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౪౩ అగునేటి విరోధికృతునామ సంవత్సర మార్గశిర శు॥ ౧౦ గురువారం, ముమురుబాల గోత్రోద్భవు లయిన అంబటి తిమ్మారెడ్డి పుత్రస్య, చినతిమ్మారెడ్డి నామధేయస్య వత్తలూరి గ్రామం పొలిమేర తొక్కిన హద్దులు నిర్ణయం మొదటి హద్దు సుద్ద రేవు పేయిపరకు హద్దు, ఆ తూర్పు పాలెం కుంట హద్దు, మూకురాళ్లవందర హద్దు, ఆ దక్షిణము ఓరంపాటి వత్తలూరు గడిసందు సిగవెళ్లగుంట హద్దు, దూకురాళ్ళవంద హద్దు, ఆ దక్షిణమున గవానిమిట్ట హద్దు, ఆ దక్షిణం నైరృతి మూలవంటి చోటు హద్దు, ఆ పశ్చిమం చలమలగడ్డ హద్దు, ఆ పడమట మేడి మాను చాపు హద్దు ; ఆ దక్షిణం మనారుతూముహద్దు, ఆ పడమట మారునితువ్వ హద్దు, ఆ పడమట పుల్లతీగెలతోన తలగడ హద్దు, ఆ పడమట రాళ్లేరేవు దక్షిణపు కట్టు హద్దు, ఆ పడమట మల్ల బయట పడమటినట్టువ హద్దు, ఆ ఉత్తరం మంటిచింత మొడ హద్దు, ఆ ఉత్తరం నెద్రగుండం హద్దు, ఆ ఉత్తరం రాజనపుకోన, కోన ఉత్తరం చాపు హద్దు, ఆ ఉత్తరం పడికి కనుమ హద్దు, ఆ ఉత్తరం నల్లముంతల సెల హద్దు, ఆ ఉత్తరం వాలుమమానుపడె కట్టుకొమ్మ హద్దు, ఆ ఉత్తరం నడపి చెరువులో పడమటి కొమ్మ హద్దు, ఆ ఉత్తరం దేవసముద్రం చెరువులో కూడలివంక హద్దు, ఆ ఉత్తరం కోన రాజు గట్టు హద్దు, ఆ తూర్పు బండల రేవు హద్దు.

గ్రామం మిరాశిదార్లు ఇంజేటి పెదరామకృష్ణయ, గ్రామ- పురోహితులు మానం తిరుమలభొట్లు, వడ్ల వోబయ, కరమల వెంకటపతి చాకలకనకడు, మంగలవెంకటపతిగాడు, , తెలాడిచెన్నుగాడు, మాదిగె ఓచు(బు?)గాడు, శెట్టిగాలినాగడు, నీరుకట్టు ఎల్లుగాడు, గ్రామం పద్దెనిమిది వర్ణాలవారు, గ్రామంపెద్దమనుష్యులు 'బుచ్చిరెడ్డి, ఎల్ల ఆవుల ఎఱ(?), రావేటిపుట్టయ, మంచినీళ్లగంగనబోయుడు, సెట్టిపల్లినాగయ ఈజనాలతో

కూడ అల్లె(మెల్ల)తొక్కినవిర్ణయం. యందుకుమాన్యం వ్రాటుకూరి వత్తె లూరిగండి సందున చేను ౨౬ కుంటలు; ఉమ్మడి వత్తెలూరిచెరువుక్రింద తొ్రవమాని మడిలో చింత కుంటలు ౮; ఉభయం చేను మడి కుంటలు ३४ ముప్పై నాలుగు కుంటలు యిచ్చినారం. గనుక మీా పుత్ర పౌత్ర పారం పర్యంతరం అనుభవిస్తూయుండేది.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం ॥

౧౭. గాదెల గ్రామములో గంగాళమ్మ దేవాలయం ముందర వ్రాడ్చివేసియున్న శిలాశాసనం ప్రకారం నకలు.

శ్రీ సూర్యనారాయణ నీ పాద మేగతి॥ నమ్మినాము. శాలివాహన శకవరుషంబులు ౧౭౧౯ వెలియేండ్లు(?) హేవళంబినామ సంవత్సర మాఘ శు॥ ౧౦ లు భానువారం ఉత్తరాయణ కాలమందు గాదెల అనే పాళెము యేర్పరచుకునే నిమిత్తం అల్లె(మెల్ల?)హద్దులు యేర్పరచు కొనే నమిత్తం, రాజుల నలసిద్దులగారి గురప్ప గోలకొండకుపోయి పాచ్చాయివారి పేర, దేశాయి నలమూరు బుచ్చిరెడ్డి పేర, గంగారావు నరసింగరావు పేర పరవానా తెచ్చియిస్తే వారు దేశాయి రెడ్లను, గ్రామాదుల రెడ్డికరణాలను, పిలిపించుకొని యీా వర్తమానం చెప్పినంత టిలో పూర్వము అల్లెహద్దులుయేర్పరచిన కేతంరెడ్డి బోడిరెడ్డి కుమా రుణి పిలిపించి, పూర్వం మీా పెద్దలు అల్లెహద్దులు యేర్పరచినారుగదా, ఇప్పుడు గాదెల అనేగ్రామానకు అల్లెహద్దులు యేర్పరచుమని సెలవు యిచ్చిరి గనుక యిందుకు మహారాజశ్రీ మల్లిమెల్లమరాజుగారిచేత సెలవుతీసికొని అంచితయోగిమునీశ్వరుడు ఉండే నల్లరాళ్లగవిగట్టు దగ్గ రకువచ్చి అక్కడనిలిచి విఘ్నేశ్వరుని పూజచేసి మునీశ్వరులకు వందనం చేసి కేతంరెడ్డి నారాయణరెడ్డి గాదెల గ్రామానికి అల్లెహద్దులుయేర్ప

రచిన నిర్ణయం: గవిగట్టుకు దక్షిణం సోవినూకుల యెఱ్ఱప చేను సోమి మాను హద్దు, అటుదక్షిణం రాజులవాండ్లపల్లెనడుమ కంభము చేను చెలికచేలు హద్దు, వెదుళ్లవంకమూల పాలమానితిప్ప సారితీగెల కట్టువ పడ(మ)ట(?)వేపమానుహద్దు, అటుదక్షిణం గుంపిళ్లకట్టువ దక్షిణం యెఱ్ఱ వా(తా?)డక చాలురాయి పుల్లయచేను డ(డొ)ంకపడమట వేపమాను చీకర్లకయ్య చిక్కిమాకుల మొదటిరాయి హద్దు, దక్షిణం నోరనెవులు పాటికురువ పడమటి దడిహద్దు, పట్టికోనవెంట తూర్పు వాయ మడుగు యేరు పడమటగడ్డ హద్దు, అటుదక్షిణము యినుమద్దుల తూర్పుకట్టువహద్దు, అటు దక్షిణం చాలు చింతమాకులుహద్దు, అటుదక్షిణం పాతకనమమోర తూర్పు కరకమాని కొప్పడొక్కలపెంట కొండగార్లయేరు మొబ్బు రేవు బలుసుబండల సరిహద్దు, అటుపడమట నచ్చుసీళ్ల మొడపెంట బొల్లిమోర తువ్వపడమట మంచినీళ్లకందువ వెంట ఆ పడమట గుడాలతువ్వహద్దు, ఉత్తరం లేకువెట్లతువ్వ సరిహద్దు, అటుఉత్తరం రాయితీసినపొలం తూర్పుగడ్డ అటుఉత్తరం పులుసుగుంత అల్లిగుంపుల సెలమరికె అందుకు పడమట కట్టువ హద్దు, అటుఉత్తరం యిందులగుంతకోన ఉత్తరంపల్ల తీగెలకోన అటుఉత్తరం యంతర్లకొప్పు ఉత్తరం మొరపెంట చింతమ్మ బోటు పడమటిహద్దు, అటుఉత్తరం గూబలగుంత పడమట పేటహద్దు అటుఉత్తరం మల్లెలతిప్పబోటుకుతూర్పుదరిహద్దు, అటుఉత్తరం పొక్కిటి చింతమాకులహద్దు, అటుఉత్తరంమా రేడుమాకులడొంకసరిహద్దు, అటు ఉత్తరం ముష్టిమానుల చెలిక ఆ ఉత్తరం పెద్దవడియ యెఱ్ఱవందకు దక్షిణము తూర్పు చంద్రమాకులు యెఱ్ఱతెరప పెనుపెంటజువ్విమాను హద్దు, అటుతూర్పు జిన్నగట్టుకు ఉత్తరం తువ్వబైట వేపమానుహద్దు, అటుతూర్పు పెద్దగట్టుకుదక్షిణం తూర్పునహద్దు, అటుతూర్పుకమడ మాకులచెలికను కమడమానుహద్దు, అటుఉత్తరంతూర్పు పాములయేటి తూర్పుగనిగట్టుకుదక్షిణము పడమటజువ్విమాను. ఈ ప్రకారముగాదెల అనే గ్రామమునకు అల్లెహద్దులను నిర్ణయముచేసి యేర్పరచిన అల్లె నిర్ణయము. ఇదియెవ్వరులేదన్నను, కాశీలోగోవునుజంపినపాపానబోదురు. గోహత్య, బ్రహ్మహత్య, స్త్రీహత్య, శిశుహత్య చేసిన పాపానబోదురు.

ఈ గ్రామానకు అల్లై నిర్ణయముచేసియేర్పరచిననారాయణరెడ్డికి, బుచ్చిరెడ్డికి అప్పుకొండుబోడి కట్టుబడి యినాముచెప్పినాము. గట్టుకు పడమట నాగాకొండ్రెడ్డికి ఆవుమాన్యము కుంటలు ౪ నాలుగు స్థళము చెప్పినారం. మీా పుత్ర పౌత్ర పారంపర్యంతం అనుభవించుకొని సుఖానసుండేది. హరిహరాదులుచూడగాను, తిరునామాచారిచేతను రెడ్లు తండాయీా, యెఱ్ఱా బత్తుడు, మంగినేనిహాపానాయుడు, గాజులునలశిద్దుగారెగురవప్ప వేయించిన అల్లైశాసనము. ఇదివరకు అబద్ధమనిచెప్పినప్పటికిన్ని వంశనాశనమయి పోదురు.

ఈ శాసనము దాఖలాపడేదిలేదు, ఎందువల్లనంటే అప్పట్లోమట్లి యెల్లమరాజులేడు. ఇదిగాక నలమూరువారికి అప్పుడు దేశాయీాతనము అయియుండలేదు.

చినవోరంపాటిసమ్మతులో మవుజే జిల్లేళ్లమడక అగ్రహారీకులయిన తిరుమల కొమారవరదాచార్యుల దగ్గరనున్న నాగరపుతామ్రశాసనం నకలు.

నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామరచారవే।
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయశంభవే॥ ౧

హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్సపాతువః।
హేమాద్రికలశా యత్ర ధాత్రీచ్ఛత్రశ్రియం దదౌ॥ ౨

కల్యాణా యాస్తు తద్ధామ ప్రత్యూహతిమిరాపహాం।
యద్గజోప్యగజోద్భూతం పంచాస్యే నాపి లాలితం॥ ౩

జయతి క్షీరజలధేః జాతంసవ్యేక్షణం హరేః।
ఆలంబనం చకోరాణా మమరాయుష్కరం మహః॥ ౪

పౌత్ర స్తస్య పురూరవా బుధసుత స్తస్యాయు రస్యాత్మజః।
సంజజ్ఞే నహుషో యయాతి రభవ త్తస్మా చ్చపూరు స్తతః।
తద్వంశే భరతోబభూవ నృపతిః తత్సంతతౌ శంతనుః।
తత్పుత్రో విజయో భిమన్యు రుదభూ త్తస్మాత్పరిక్షి త్తతః॥ ౫

నంద స్తస్యాష్టమోభూ త్సముజని నవమ స్తస్య రాజ్ఞశ్చళుక్యః ।
క్ష్మాప స్తత్ప్ర ప్తమః శ్రీ పతిరుచిరభవద్రాజపూర్వో నరేంద్రః ।
తస్యాసీద్బిజ్జలేంద్రో దశమ ఇహ నృపో వీర హెమ్మాళిరాయః ।
తా త్త్రియాకోమురారా కృతవతి రుదభూ త్తస్య మాయాపురీశః ॥ ౭

తత్తూర్యో జని తాతపిన్నమ మహీపాలో నిజాలోకన ।
త్రస్తా మిత్రగణా స్తతోజనిహరన్ దుర్గాణి సప్తాహితాన్ ।
అహ్నైకేన ససోమదేవ నృపతి స్తస్యైవ జజ్ఞే సుతో ।
వీరో రాఘవదేవరాజు రభవ త్తేషాంసమోభూ న్నృపః ॥ ౮

ఆరవీటినగరీవిభోరభూ దస్య బుక్కధరణీపతి స్సుతః ।
యేనసాళువ నృసింహరాజ్యమ ప్యేధమాన మహసా స్థిరీకృతమ్ ॥

స్వఃకామినీం స్వతను కాంతిభి రాక్షిపంతో
బుక్కావనీపతిలకో బుధకల్పశాఖీ ।
కల్యాణినీం కమలనాభఇ వాబ్ధికన్యాం
బుక్కాంబికా ముదవహ ద్బహుమానశీలాం ॥ ౯

సుతేవ కలశాంబుధే సురభిశాఖగం మాధవా
త్కుమారమివ శంకరా త్కుల మహీభృతః కన్యకా ।
జయంత మమర ప్రభో రపిశచీవ బుక్కాధిపాత్ ।
సుతం జగతి బల్లమాలభత రామరాజం సుతం ॥ ౧౦

సహాస్రైస్సప్తత్యాసహితమపియ స్సింధు జనుషాం ।
సపాదస్యానీకం సమితి భుజ శౌర్యేణ మహతా ।
విజిత్యాయం తస్మా దవనిగిరి దుర్గం విభుతయా ।
విభూతేంద్రః శాసవ్యోదయమపి విద్రావ్యసహసా ॥ ౧౧

కందనవోలిదుర్గ మురుకందళమభ్యుదయో
బాహుబలేన యో బహుళతరేణవిజిత్యహరేః ।
సన్నిహితాసు తత్రచరణాంబుషుభ క్తితయా
జ్ఞాతిభిరర్పితం సుధాయ తేస్మని షేవ్యవిషం ॥ ౧౨

శ్రీరామరాజక్షితిపస్యతస్య చింతామణే రర్థికదంబకానాం ।
లక్ష్మీస్మరి వాంభోరుహ లోచనస్య లక్కాంబికాముఖ్యమహిష్యథాసీత్ ॥ ౧౩

తస్యాధికై స్సుమభవ త్తనయ స్తపోభిః
శ్రీరంగరాజ నృపతిః శశివంశదీపః ।
అసత్యముల్లసిత ధాముని యస్యచిత్రం ।
నేత్రాణి వైరిసుదృశాంచ నిరంజనాని ॥ ౧౪

గాండీవివాన లేష్వాసకుండే తతగిరిచుభుజే స్తంభ తేజోవివస్వ ।
త్ప్రే)మ్నా రాతి నానావిధపురల(ల)నాంమందహాసే(ఎ)బాసే ।
పాదాతాశ్వీయదంతావళనివహరజఃపూరితాశాయశూరః ।
త్రిష్వేకాయోధనేకః త్రిదశపతిభృదాశ్చర్యధుర్యాయతస్మై ॥ ౧౫

సతీం తిరుమలాంబికాం చరితలీలయారుంధతీ ।
ప్రథామపి తితిక్షయా వసుమతీయశోరుంధతీం ।
హిమాంశురివ రోహిణీం హృదయహారిణీం సద్గుణైః ।
ఆమోదత సధర్మిణీ మయ మవాప్యరాజాగ్రణీః ॥ ౧౬

రచిత నయవిచారం రామరాయం చ వీరం ।
వర తిరుమలరాయం వేంకటాద్రిక్షితీశం ।
అజనయత స ఏతా నానుపూర్వ్యా త్కుమారా ।
నిహా తిరుమలదేవ్యామేవ రాజో మహౌజాః ॥ ౧౭

సకలభువనకంటకా నరాతీన్ ।
సమితి నిహత్య స రామరాజవీరః ।
భరతను(త)భగీరథాదిరాజః ।
ప్రథితయశాః ప్రశాసచక్రముర్వ్యాః ॥ ౧౮

వితరణపరిపాటీ యస్య విద్యాధరీణాం ।
సఖుంముఖర వీణానాదగీతం నిశమ్య ।
అనుకలమయ మాలాంబుబింబాపదేశా ।
దమరనగరశాఖీ లజ్జయామజ్జతీవ ॥ ౧౯

వ్యరాజత శ్రీకర వేంకటాద్రి।
రాజాశ్రితో లక్షణచారుమూర్తిః।
జ్యాఘోషదూరీకృత మేఘనాదః।
కుర్వన్ సుమిత్రాశయ హర్షమిత్రం॥ ౨౦

త్రిషుశ్రీరంగక్ష్మా(ఙ్మా?)ప్రభృతి కుమారేష్వధిరణం।
విజిత్వాధత్తేస్మతిరుమలమహారాయ నృపతిః!
మహారాజస్సామ్రాజ్యే సుమతి రభిషిక్తో నిరుపమే।
ప్రశా స్యోర్వీంసర్వామపి తిసృషుమూర్తిష్వవహారిః॥ ౧౨

యశస్వినామగ్రసరస్యయస్య పట్టాభిషేకే సతిపార్థివేంద్రః।
దానాంబుపూరై రభిషిచ్యమానాం దేవీపదంభూమిరియందధాతి॥ ౨౨

యస్యాత్రిప్రౌఢతేజ స్సవితరివిరుతధ్వాంతభేది న్యుదితే।
కీర్తిక్షీరార్ణవాంతః స్ఫురుతరవికసత్పుండరీకోపమస్య।
శ్వేతచ్ఛత్రస్యమధ్యే కనకకలశికాభాసతే కర్ణికాభా।
తస్యోపాంతే మరాళద్వయమివవిలసచ్చామరద్వందమాస్తే॥ ౨౩

పౌలోమీవసురాణాంపత్యు శ్చంద్రస్సరోహిణీవశుభా।
శ్రీరివ జయతిమురారే శ్చన్నమదేవీసధర్మిణీయస్య॥ ౨౪

అవినీతజాత పరిభూతభూరసా
మవనీం బలేన మహతాసముద్ధరన్।
శరణీభవం వినయునాం సమంజనాన్।
ధరణీవరాహబిరుదం బిభర్తియః॥ ౨౫

భోగిత్వే విదితేపి జిహ్మగఇతి వ్యాళాధిరాజం లస
ద్వోత్తత్రై(?)జలసంశ్రయాంతికష్టరం దానేపిమంచాశ్రితి।
దిగ్నాగాంబుజనాగ పుష్పకకుశైరిత్యేవహిత్వాగిరిం।
స్తత్తత్సద్గుణసంపదైకశరణం భూరేతివస్తేణయన్॥ ౨౬

స్వైరం సంభృతకంటకోథసుకృతోత్కృష్టం విధాయాఖిలం ।
క్ష్మాకేదారముదారదానసలిలో సారైస్సమాపూర్యచ ।
సంవృద్ధ్యానఘకీర్తిసస్యనివహాంతత్త్వాలికాం విక్రమ ।
శ్రీకాంతాంభుజతోయమానశిఖరీదత్తేహి యస్తేజసా ॥ ౨౭

జిష్ణుత్వం శుచితాం ప్రజాసుసమతా వర్తిత్వమ ప్యాశ్రితో
వృత్తిం పుణ్యజనప్రియామధిగతః ఖ్యాత ప్రతాపా ఇతి
ప్రాప్తః కిన్నర విభ్రమంధనపతి స్సర్వజ్ఞభావాంచితః
ప్రాయోయః ప్రకటీకరోతి భువనే తత్త ద్దిగీశాంశతాం ॥ ౨౮

హుత్వా మంత్రిపురస్సరం రిపుయశోలాజాన్ ప్రతాపానలే ।
సంప్రాపయ్య పదానిస ప్తభువనేష్వారోప్య మేరూపలం ।
స్ఫీతః కీర్తిమయీం వధూం పరిణయన్ సత్కౌతుకోల్లాసినీం ।
యస్సింహాసనమాశ్రితో విజయతే గృష్ణాద్విజేంద్రాశివః ॥ ౨౯

దివ్యాః కన్యారిపుభ్యో దిశతివనభువం తన్నివాసం విధత్తే ।
తద్దారాంస్త్రీస్తపాకం సృజతి జనయతే సాధ్వసం తత్పురేషు ।
తధ్వానైఃకీర్తికావ్యంపఠయతి నిదధాత్యద్భుతం తద్భదాఘ్న
తల్లక్ష్మీర్ధామ చ స్వం కలయతినియతం ధర్మతోయస్యబాణః ॥ ౩౦

అశ్రాంత విశ్రాణనకీర్తి సామ్యం
సారద్యుమం యస్యతు లబ్ధరామాః ।
తచ్ఛేతపస్యం తిలియఃతటిన్యాః ।
ప్రవాళకాషాయ పదాజపాప్తాః ॥ ౩౧

కాంచీ శ్రీరంగ శేషాచల కనకసభాహ్యేళాద్రీశ ముఖ్యే ।
ష్వావృత్త్యావృత్య సర్వేష్వతనుత విధివద్భూయసాం శ్రేయసే యః
దేవస్థానేషుతీర్థేష్వపి కనకతులాపూరుషాదీనినానా ।
దానైఃప్రదానైరపి సమమఖ విభవైరాగమోక్తాని తాని ॥ ౩౨

యస్మిన్ మహీమంగదనిర్విశేషం యశోధనేభిభ్రతి బాహుకాండే ।
అహీశ్వరోగోపురధారివేష మాధోకతే భూభరణకేయూరం ॥ ౩౩

యస్మింశ్శాసత్యేకవీరే ధరిత్రీమేణాక్షీణామేవ కార్శ్యం విలగ్నే ।
కౌటిల్యం తత్కుంతళే కర్కశత్వం తద్వక్షోజే చాపలం తత్కటాక్షే ॥ ౩౪

వారాశిగాంభీర్యవిశేషధుర్యః । చౌరాశిదుర్గైకవిబాళవర్యః ।
పరాష్టదిగ్రాయయశోంశః । ప్రకారం భోగ్యం కరశార్ఙ్గదరాంతరంగః ॥ ౩౫

హాతరిక్షరని మేషానోకహో యాచకానాం ।
హోసబిరుదరగండో రాయసరాహుత్తమిండః ।
మహితచరితధన్యో మన్నియర్ సోముకాది ।
ప్రకటితబిరుదశ్రీః పాటితారాతిలోకః ॥ ౩౬

ఉభయదళపితామహోమతానాం ।
అభయపదార్పణతత్పరోరిపూణాం ।
అయమవహాళురాయమానమర్ద ।
త్యఖిలజనైరభిధీయమానధామ ॥ ౩౭

తాతవితోడయో బిరుదమన్నెరగండతమోద్దండ ।
బలోత్కళేంద్రబయపండితవీరయుతః బిండమశాలి ।
బాహుబలదండిత వైరిగణో ।
గండరగూళి మన్నెపుల్లి మాన్యమహాబిరుదః ॥ ౩౮

సారవీరరమణీయాసముల్లసన్నారవీటిపురహారనాయకః ।
కుండలీశ్వర మహాభుజాశ్రయన్మండలీకధరణీవరాహతాం ॥ ౩౯

అంతెంబరగండాంకః సింధ్వంతక్షితిరక్షకః ।
వెంగ్యత్రిభువనమల్లసింఖ్యాక్షితికశార్జునః ॥ ౪౦

అరిగోళసురత్రాణో హరిగోచరమానసః ।
రాజ్ఞాంవరోరణముఖే రామభద్రఇతి శ్రుతః ॥ ౪౧

వర్ణ్యతేయశసా నానావర్ణశ్రీమండలీక గండఇతి ।
ఆత్రేయగోత్రజా మగ్రసరోభూభుజా ముదారయశాః ॥ ౪౨

అతిబిరుదతురగదప్పా మతిగురురోదప్పామగధమాన్యపదః ।
కల్యాణినీతిశాలీ కల్యాణపురాధిపః కళాచతురః ॥ ౪౩

చాళుక్య చక్రవర్తి మాణిక్యమహాకిరీట మహనీయః ।
హేబిరుదరాయశాహాత్త నేత్రైక్యైకభుజంగబిరుదరమణీయః ॥ ౪౪

కూలంకలక్లోనరానికోపాలకోంగజయభరి త్త(స్త్రి)ః ।
రమ్యతరకీర్తితద్ద(వడ్డి)యరాయదిశాపట్ట బిరుద ఘోషణే ॥ ౪౫

ఓషధపత్యురమా ఇతగండ్ల స్తోషణహూవజితాసమకాండః ।
భాషగెతప్పువరాయరగండః పోషితనిర్భరభూనవ ఖండః ॥ ౪౬

రాజాధిరాజ స్తేజస్వీ శ్రీరాజపరమేశ్వరః ।
మూర్ఘరాయరగండాంకో మేరులంఘియశోభరః ॥ ౪౭

పరదారేషువిముఖః పరరాజభయంకరః ।
శిష్టసంరక్షణపరో దుష్టశార్దూల మర్దనః ॥ ౪౮

హిందూరాయసురత్రాణ సింధురాజగభీరధీః ।
మాలీభగండభేరుండో హరిభక్తిసుధానిధిః ॥ ౪౯

ఇత్యాదిబిరుదై ర్వందితత్యా నిత్య మభిష్టుతః ।
జయజీవేతి రాజన్యరచితాంజలి బంధయా ॥ ౫౦

కాంభోజభోజకాళింగ కరహాటాదిపార్థివైః ।
ప్రతీహారపదం ప్రాప్తైః ప్రస్తుతి స్తుతిఘోషణః ॥ ౫౧

పరిష్కుర్వన్ కర్ణాటకకనకసింహాసనమసౌ ।
మహామేరుం కల్పద్రుమఇవ బుధానందననిధిః ।
మహీం సర్వాం శాసత్ తిరుమలమహారాయ నృపతిః ।
మనోర్జితానిత్యం మహితభుజ తేజా విజయతే ॥ ౫౨

మాంధాతామహితే స్వపక్షసిమహాబాహోర్వన్మరుక్మాంగదో
రామశ్చారు వరాకృతా పృథురపిస్కంధేముఖేలక్ష్మణః ।
చిత్తేహర్ష విశేషవానవయ వై దేవాదివక్షాశ్రభృతాం ।
ఖ్యాతింయాతిమహాభుజ స్తిరుమల శ్రీదేవరాయ ప్రభుః ॥ ౫౩

శ్రీశకాబ్దే గుణనిధివేదేందు గణితేక్రమాత్ ।
ప్రజోత్పత్త్యాహ్వాయేవర్షే మాసేకార్తిక నామకే॥ ౫౪

పక్షేవళక్షే చోద్ధాన ద్వాదశ్యాం సౌమ్య వాసరే ।
శ్రీరామచంద్ర దేవస్య సన్నిధౌ శ్రేయసాం విధౌ ॥ ౫౫
శ్రీరంగరాజ భూపాల శేఖరస్యాబ్దికే దినే ।
శరమర్షణ గోత్రాబ్ధి చంద్రమా చార్యమూర్తయే ॥ ౫౬

వాదివారణ సింహాయ వరాపస్తంబసూత్రిణే ।
యశస్వినే యజుశ్శాఖాధ్యాయినే భీష్టదాధాయినే ॥ ౫౭

ప్రపేదుషే వేదమార్గ ప్రతిష్ఠాచార్య ముఖ్యతాం ।
విఖ్యాతోభయ వేదాంతాచార్యవర్యాయధీమతే ॥ ౫౮

వైష్ణవాగమసిద్ధాంతభావదూరోక్తిశాలినే ।
రాజన్యకోటికోటీ రత్న పీఠాంచితాంఘ్రయే ॥ ౫౯

షడ్దర్శనీకమలినీ సముల్లాస వివస్వతే ।
యజనాదిమషట్కర్మ రచనాపావనాత్మనే ॥ ౬౦

సత్యానువర్తమనసే సద్బృందావన కర్మిణే ।
యశోదయాలంకృతాయ యదునాయకమూర్తయే ॥ ౬౧

సద్వృత్తాంసపదన్యాస సాలంకారాం రసోత్తరాం ।
కవితాంకుర్వతే జస్రం కాంతామివ వశంవదాం ॥ ౬౨

హంసకాలంకృతంశౌరే రరుణం చరణాంబుజం ।
ఆశయేవహతేనిత్య మన్తేచోపనిషద్వరే ॥ ౬౩

ఊర్ధ్వపుండ్రందధానాయ వదనాబ్జకృతస్థితం ।
వాగ్దేవ్యానిగమవ్యాఖ్యా దస్తాంగుళియుగ ప్రభం ॥ ౬౪

మహాశ్రీభాష్యసదన మణిదీపాత్మబుద్ధయే ।
రామానుజమతారామ సీమాకేళీశుకాత్మనే ॥ ౬౫

వ్యాఖ్యాతాఖిల శాస్త్రాయ విశ్వవిఖ్యాత కీర్తయే।
శ్రీనివాసోత్సవే జాతే ప్రబంధాగమయోస్సదా ॥ ౬౬

ఆదౌ స్వనామసంధానయుక్తాయ బ్రహ్మగోష్ఠిషు।
వేంకటేశారాధనార్థం వ్యోమగంగాహృతాంభసే ॥ ౬౭

కాలద్వయే మంత్రపుష్ప కైంకర్యైకరతాత్మనే।
తిరుపతి శ్రీ తోళప్పాచార్య పౌత్రాయ భాస్వతే॥ ౬౮

శ్రీ వేంకటాచార్యవర్య చిరపుణ్యఫలాత్మనే।
శ్రీనివాసాయవర్యాయ శేఖరాయమనీషిణాం ॥ ౬౯

శ్రీ సిద్ధవటసీమాంత ద్వాసినం సస్యభాసినం।
ఖ్యాతిం వరాం పులుగురునాడం చ సముపాశ్రితం ॥ ౭౦

రెడ్డిపల్లీతి విఖ్యాతా ద్గ్రామాత్ప్రాచీదిశిస్థితం।
మహీంధరాణ్మందకట్ట(మండికుట్య?) నామ్నః పశ్చిమతాంజుషా ॥

మొరుగన్యాఖ్యకుల్యాయాః ఆగ్నేయాం దిశ మాశ్రితం।
శ్రీ పెద్దోరంపాటినామ్నో గ్రామాద్దక్షిణ తాద్రితాత్ ॥ ౭౨

దక్షిణంతామరమడు గ్గభిధాన హ్రదాంతరాత్।
అప్పకొండా రెడ్డిపల్లె నైరృత్యాంహారితి స్థితం ॥ ౭౩

అడ్విమల్లెల తిప్పాద్రి శ్రీబొమ్మవరపశ్చిమాత్।
నిరువంజులహేరంబా కుండాదపిచ పశ్చిమం॥ ౭౪

కొర్లకుంటాహ్వాయ గ్రామా దుత్తరస్యాందిశిశ్రితం।
ప్రఖ్యాతే గాడెలగ్రామా దుత్తరస్యాం దిశిశ్రితం ॥ ౭౫

గ్రామా న్నూకనపల్ల్యాఖ్యా దైశానీ మాశ్రితం దిశం।
ఖ్యాతచించలగప్పాఖ్య శైలేనాపి సమన్వితమ్ ॥ ౭౬

ప్రఖ్యాతపెద్దోరంపాటి గ్రామాద్దక్షిణతస్థితం।
మహాత్తోరత్పృతీయాంశం తటాకే సముపాశ్రితం ॥ ౭౭

జిల్లేళ్లమడకాఖ్యేవ గ్రామేన చ తనీయ్యసా ।
శ్రీ తిప్పరెడ్డిపల్లాఖ్యామేయుషాగ్రామకేణ చ ॥ ౭౮

చా(తక)చామరనగ్రాశ్రీ పల్ల్యాఖ్యాగ్రామకేణ చ ।
గ్రామేణబలినాయిాని చెన్నుపల్ల్యాఖ్యయేన చ ॥ ౭౯

గ్రామకేణోత్తనవాడి పల్ల్యాఖ్యసముపేయుషే ।
ఇత్యేతైః పంచభిర్యుక్త ఉపగ్రామైస్సమంతతః ॥ ౮౦

నిధినిక్షేపపాషాణ సిద్ధసాధ్యజలాన్వితం
అక్షీణ్యాగామి సంయుక్త మేకభోగ్యం సభూరుహం ॥ ౮౧

వాపీకూపతటాకైశ్చ కుల్యారామైశ్చసంయుతం ।
పుత్రపౌత్రాదిభి ర్భోగ్యం క్రమా దాచంద్రతారకం ॥ ౮౨

దానాధమన విక్రీత యోగ్యం వినిమయోచితం ।
పరీతః ప్రయత స్నిగ్ధైః పురోహిత పురోగమైః ॥ ౮౩

వివిధై ర్విబుధై శ్రౌత పథికై రధికై ర్గిరా ।
మహాభుజ స్తిరుమల మహారాజమహీపతిః ॥ ౮౪

సహిరణ్య పయోధారా పూర్వకం దత్తవాన్ముదా
శ్రీహరిమూర్తి స్తదిదం తిరుమలరాయస్య నామతోయస్య
శాసనమితి వలశాసన తరుకరదానస్య గుణనిధానస్య ॥ ౮౫

తిరుమలరాయస్య గిరా స్థిర కీర్తే స్తాంమ్రశాసనశ్లోకాః ।
కవిశాసనస్స్వయంభూ స్సరస మవాదీ త్సభాపతేస్సూనుః ॥ ౮౬

మనునీతే స్తిరుమలమహారాయస్య శాసనాద్ ।
వీరయ్య గణపాచార్యో వ్యలిఖ త్తామ్రశాసనం ॥ ౮౭

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గమవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥ ౮౮

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥ ౮౯

స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥ ౯౦

ఏకైవ భగినీ లోకే సర్వేషామేవ భూభుజాం।
నభోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥ ౯౧

సామాన్యోయం ధర్మసేతు నృపాణాం।
కాలేకాలే పాలనీయో భవద్భిః।
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్।
భూయోభూయో యాచతే రామచంద్రః॥ ౯౨

వరాహముద్ర

శ్రీ విరూపాక్ష

మవుజే కోటవెంకట్రాజపురం అగ్రహారములో రాజు నరసంభట్లు దగ్గిర నున్న కాగితము దాన పత్రం నకలు.

హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్సపాతు వః।
హేమాద్రికలశా యత్ర ధాత్రీచ్ఛత్రశ్రియందదా॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౫ అగునేటి స్వభానునామ సంవత్సర శ్రావణ బ॥ ౩౦ లు శ్రీమత్కాశ్యప గోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన, శ్రీమన్మహామండలేశ్వర మట్లి కుమార అనంతరాజుగారి పౌత్రులున్ను వెంకట్రామరాజుగారి పుత్రులున్ను అయిన, కొమార అనంతరాజ దేవచోడ మహారాజులుగారు హారితసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు, విట్టలకోనంభట్లుగారి పౌత్రులయిన పురుషోత్తమభట్లుగారి పుత్రులయిన బుచ్చనభట్లుగారికి వ్రాయించి యిచ్చిన సర్వమాన్య అగ్రహార భూదాన ధర్మశాసన పత్రిక క్రమమెట్లన్నను :- శ్రీమదుమామహేశ్వర పరి

పాలితం బయిన శ్రీగిరిద్వారమునకు ఉపద్వారము అయిన సిద్ధవటమునకు చెల్లే పులుగులనాటి సీమలో సకల సంపత్కరం బయిన మెఱ్రగుంట్ల పురమునకు ప్రాగ్భాగమున్ను కొల్లగుంటకు దక్షిణభాగమున్ను పిరంగి తిప్పకు పశ్చిమభాగమున్ను గుండాలకోనకు ఉత్తరభాగము అయిన గుండాల నదీతీరమునందు వనమువేయించి దేవాలయం కట్టించి కోనేరు త్రొవ్వించి తత్తీరమునందు మా తండ్రిగారి పేరటను వెంకట్రామరాజు సముద్ర మనే అగ్రహారం కట్టించి, ఆ అగ్రహారమునకు సకల ధాన్య కరంబయిన బ్రహ్మవరం చెరువుక్రిందను, తూర్పుకమతం మడిలో రెండు నేరేడుమాకుల దక్షిణమందు కోటూరు కాలువ పశ్చిమమందు చాకి రేవుతిప్ప ఉత్తరమందు కుమార అనంతరాజసముద్రములోకి చెల్లేటి కిచ్చమ్మగారిపల్లె దగ్గిర పొలిమేర యేర్పరచి వేసిన అల్లెరాయి. ఈ ప్రకారం నాలుగు తట్లకును హద్దులు యేర్పరచి ఖండ్రిగచేసిన మడి కుంటలు ౩౬౦ మున్నూట అరువై కుంటలున్ను, చేనికిగాను యీ గ్రామములో చెల్లే చిన్నమక్కపల్లె వలయమాన శాసనముల తోటి ఉపగ్రామముగాను పరికల్పిత గణసంఖ్యాక వృత్తులు ౧౮ పద్దెనిమిది నిర్ణయం చేసి అందులోకి యజమాన వృత్తులు ౨ రెండు. మీకున్ను కడమ పదహారు వృత్తులు మహాజనాలకున్ను ఉభయం పదునెనిమిదిన్ని యీ పద్మక యోగసావర్ణిక మన్వాది ప్రయుక్త మహాపుణ్యకాలమందు మా అయ్యగారికి సుకృతంగాను శ్రీఅలిమేలుమంగా సమేత శ్రీవేంక టేశ్వర అర్పితం గాను సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను యిస్తిమి.*

మా అయ్యవారికి సుకృతంగాను, త్రికరణంగాను, త్రివాచకం గాను, త్రిపురుషోద్దేశంగాను, సహిరణ్యోదక దానధారాపూర్వకంగాను యిస్తిమి, గనుక మీ పుత్రపౌత్ర పారంపర్యంగాను, ఆచంద్రార్కస్థాయి గాను అనుభవించుక సుఖాన నుండేది.

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ।

* The text is repeated here again.

శ్రీ రామముద్ర



మవుజే జిల్లేళ్ళమడక అగ్రహారంలో శ్రీ వైష్ణవులు పణతుల దేవ రాజాచార్యుల వద్ద ఉండే తామ్రరేకు శాసనం యొక్క నకలు:

స్వస్తి సమస్త నిజనామాంకమాలికా ప్రశస్తిసహితులయిన, శ్రీ మద్గణేశ్వర గౌరీశ్వర దేవర దివ్యశ్రీ పాదపద్మారాధకు లయిన అయ్యావళీ ముఖ్యమయిన యాభైయారు దేశాధీశ్వరు లయిన అఘో రాగ్రహు లయిన పదవాక్యప్రమాణజ్ఞు లయిన బంధుజన చింతామణు లయిన బహుకుటుంబాధారు లయిన ఆశ్రితజనకల్పవృక్షావతారు లయిన యనవరత భూసురాశీర్వాద సంపన్ను లయిన, మహామేరు సమానధీరు లయిన పృథివిసెట్టి రాయసెట్టి, రాయనమంత్రి భాస్క రుడు మొదలయిన సాలుమూల సమస్త మయిన యాభైయారు దేశా ధీశ్వరులున్నూ, అనంతరాజపేట స్థళమందున్న స్వదేశ, పరదేశ, ఉభయ - నానా దేశ అయ్యావళీ ముఖ్యమయిన చాలుమూల సమస్త మయిన యాభైఆరు దేశాధీశ్వరులున్ను విళంబి సంవత్సర ఆషాఢ బ॥ ౧౧ లు బసవేశ్వర దేవర ముఖమంటపమునందు పెనుబాల పణుతుల కృష్ణప్ప కుమారుడు లక్ష్మణపణతులకు ధారాగ్రహీతముగా యిచ్చిన దానపత్రం. మీకు యెవరి యింట వివాహమయినా ఒక్కొక రూక లెక్కను కట్టడ వేసినారం. ఇందుకు తప్పి యెవ్వరు యివ్వకున్నా కాశిలో బ్రాహ్మణవధ చేసిన పాపాన బోదురు. ఇటని ఒప్పి యిచ్చిన ధర్మశాసనం.

ఇందుకు సాక్షులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

రాఘవరాజపురం అగ్రహారీకు లయిన మండెం పురుషోత్తమ దీక్షితులున్ను, పిశుపాటి సుబ్బాభట్లున్ను వీరివద్ద నుండే కాకితం దాన పత్రం నకలు.

హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్సపాతు వః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీచ్ఛత్రశ్శ్రియం దదా ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౧ అగునేటి బహుధాన్యనామ సంవత్సర చైత్ర శు॥ ౧౫ లు శ్రీమద్యజన యాజన అధ్యయన అధ్యాపన దానప్రతిగ్రహషట్కర్మనిరతు లయిన వెంకటరాఘవరాజపుర అగ్రహారస్థితాశేష విద్వన్మహాజనములకున్ను, కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన శ్రీమన్మహా మండలేశ్వర మట్లి కుమార అనంతరాజుగారి పౌత్రు లయిన తిరువేంగళ నాథరాజుగారి పుత్రులయిన వెంకట్రామరాజ దేవచోడమహారాజులు గారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక : శ్రీగిరిద్వారము నకు ఉపద్వారమైన సిద్ధవటం రాజ్యంలో చెల్లే మా యేలుబడి పులుగుల నాటి సీమ, కోడూరు పెనుబాల గ్రామాదుల పొలిమేర సందిష్టమున కుర్రావారిపల్లె స్థళాన శ్రీ వెంకటాచల మార్గమందు మా అన్నగారి పేరట అగ్రహారం చెయ్యగలందులకు పూర్వం అడివిలో ఖిలపడిన కుంట వడియ ఉండగా అది విస్తారం వరనలు వేసుకొని ప్రబలము చేసుకొని జీవనం చేసుకొనేమని పలకరించుకుంటిరి ; గనుక అదేప్రకారం దయచేసి పరికల్పిత గణసంఖ్యాక వృత్తులు పద్దెనిమిది నిర్ణయం చేసి యీతథా తిథి పుణ్యకాలమందు శ్రీస్వామివారికి అర్పితంగాను సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగా త్రికరణ త్రివాచక త్రిశుద్ధిగా దానాది వినిమయ విక్రయముల యోగ్యమానట్లుగాను నిధినిక్షేప, జల, పాషాణా, దృష్ట భోగ తేజ సామ్యమానట్టుగాను, సర్వమాన్యముగాను సెలవు యిచ్చి నారము గనుక చెరువు ప్రబలముచేసుకొని అక్కడ వచ్చిన ఫలాదులను అనుభవించుకొని మీా పుత్రపౌత్ర పారంపర్యాయముగా ఆచంద్రార్క-

స్థాయిగా అనుభవించుకొని సుఖాన ఉండవలెను. వృత్తులు ౧౮కి వివరము :

౧. పరాశరగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన ఊట్ల చలపతి భట్లగారి పౌత్రులయిన శేషాద్రిసోమయాజులవారి పుత్రు లయిన - శేషంభట్లకు, యజమాన వృత్తి ౧.

౨. గార్గ్యసగోత్ర ఆపస్తంబసూత్ర - యజుశ్శాఖాధ్యాయు లయిన అవధానం బొజ్జకభట్లవారి పౌత్రులయిన లింగన దీక్షితులవారి పుత్రులయిన శంకరావధానుల వృత్తి ౧.

౩. వాధూళసగోత్ర - ఆపస్తంభసూత్ర - యజుశ్శాఖాధ్యాయు లయిన - శాబల్లి రామాభట్ల పౌత్రు లయిన కృష్ణంభట్ల పుత్రు లయిన అప్పంభట్ల వృత్తి ౧.

౪. కౌశిక గోత్రాశ్వలాయన సూత్ర-ఋక్ శాఖాధ్యాయు లయిన యనమంద్ర పరదేశిభట్లగారి పౌత్రులయిన - వెంకనభట్ల పుత్రు లయిన సర్వదేవభట్ల వృత్తి ౧.

౫. వాధూళసగోత్ర - ఆపస్తంబసూత్ర - యజుశ్శాఖాధ్యాయు లయిన - కేశవభట్ల పౌత్రులయిన - రామాభట్ల పుత్రు లయిన కోనం భట్ల వృత్తి ౧.

౬. గార్గ్యస గోత్రాపస్తంబసూత్ర-యజుశ్శాఖాధాయు లయిన అవధానం మల్లుభట్ల పౌత్రు లయిన - ఈశ్వరభట్ల పుత్రు లయిన - సేతు మాధవభట్ల వారి వృత్తి ౧.

౭. భారద్వాజసగోత్ర - ఆపస్తంబసూత్ర-యజుశ్శాఖాధ్యాయు లయిన-పిసుపాటి నరసంభట్ల పౌత్రు లయిన లింగంభట్ల పుత్రులైన వెంకటనరసింభట్ల వృత్తి ౧.

౮. కౌండిన్యసగోత్రాపస్తంబసూత్ర-యజుశ్శాఖాధ్యాయు లయిన తల్లంభట్ల పౌత్రు లయిన-రవణం భట్ల పుత్రు లయిన నరసంభట్ల వృత్తి ౧.

౯. కాశ్యపస గోత్రాశ్వలాయన సూత్ర - ఋక్ శాఖాధ్యాయులయిన - త్రిపురాంతక దేవుణి నారాయణభట్ల పౌత్రు లయిన - రామాభట్ల పుత్రులయిన వెంకట వీరరాఘవభట్ల వృత్తి ౧.

౧౦. కౌండిన్యస గోత్రాపస్తంప సూత్ర - యజుశ్శాఖాధ్యాయులయిన - బోయలకుంటల శంకరభట్ల పౌత్రు లయిన ఉమామహేశ్వర భట్ల పుత్రు లయిన శంకరభట్ల వృత్తి ౧.

౧౧. హరితస గోత్రాపస్తంబ సూత్ర-యజుశ్శాఖాధ్యాయులైన గోటూరి పాపన్న పౌత్రు లయిన - రామన్న పుత్రు లయిన కృష్ణప్ప గారి వృత్తి ౧.

౧౨. కౌండిన్యస గోత్రాపస్తంబ సూత్ర - యజుశ్శాఖాధాయులయిన గొరావఝలతిల్లంభట్ల పౌత్రు లయిన అక్కంభట్ల పుత్రు లయిన వెంకటాచలం వృత్తి ౧.

౧౩. ఆత్రేయసగోత్ర ఆశ్వలాయనసూత్ర-ఋక్ శాఖాధ్యాయులయిన - కొనగొండ్ల వెంకన్న పౌత్రు లయిన రామప్ప పుత్రు లయిన పాపన్న వృత్తి ౧.

౧౪. శ్రీవత్సస గోత్రాపస్తంబసూత్ర యజుశ్శాఖాధాయులయిన బెన్నుభట్లవారి పౌత్రులయిన లింగంభట్లగారి పుత్రులయిన అహోబళ దీక్షితులవారి వృత్తి ౧.

౧౫. శ్రీవత్సగోత్రాపస్తంప సూత్ర - యజుశ్శాఖాధ్యాయులయిన మండెం అహోబళశాస్త్రులవారి పౌత్రు లయిన కుప్పాభట్లవారి పుత్రు లయిన పురుషోత్తమ దీక్షితులవారి వృత్తి ౧.

౧౬, ౧౭. భారద్వాజసగోత్రావస్తంబసూత్ర - యజుశ్శాఖాధ్యాయులయిన పిసుపాటి నరసంభట్ల పౌత్రు లయిన వీరరాఘవభట్ల పుత్రులయిన కృష్ణంభట్ల వృత్తులు ౨.

౧౮. శాలావత్ససగోత్రాపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయులయిన పిడతల పురుషోత్తమ భట్ల పౌత్రు లయిన కృష్ణంభట్ల పుత్రు లయిన వెంకటకృష్ణం భట్ల వృత్తి ౧.

ఈ ప్రకారం పద్ధెనిమిది వృత్తులు నిర్ణయం చేసినారము. ఇందుకు హద్దుల నిర్ణయం తూర్పు గుంజన నది దిగువ గొబ్బురేవు హద్దు. అక్కడ నుంచి ముష్టేరు మొదలుగాను దక్షిణానకు రాఘవరాజపురం చెర్లోకి వచ్చే ముష్టేరు కట్టుగొమ్మ హద్దు. పశ్చిమానకు ఉర్లగుట్ట పడమట హద్దు. ఉత్తరానకు చెరువు. పశ్చిమాన ఆకొనను ఉండే ఊడల మఱ్ఱిమాను దగ్గిరనుంచి పెద్ద పాలమాని మీదుగా నేరేళ్లకుంట కట్ట హద్దు. ఈ మధ్యనువున్న పొలము సర్వమాన్యంగా సెలవు యిచ్చినారము. అడివి సాధించి ఫలపరుచుకొని సుఖాన నుండేది.

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

మవుజే మంగంపేట అగ్రహారం సభవారు వెల్లాల నరసన్న అయ్యల సోమయాజులు, రామేశ్వర శ్రౌతులు వారి దగ్గర నున్న దానపత్రం నకలు.

హారే ర్లీలావరాహస్య దంష్ట్రాదండ స్స పాతు వః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీ ఛత్రశ్రియం దదౌ ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషంబులు ౧౬౭౫ అగు నేటి విజయనామ సంవత్సర ఆశ్వీజ శుద్ధ ౧౫ లు శ్రీమద్యజన యాజన అధ్యాపక దాన దానప్రతిగ్రహ షట్కర్మనిరతు లయిన మంగంపేట వెంకటరాజపురం అగ్రహారస్థితాశేషవిద్వన్మహాజనులకు కాశ్యపసగోత్రఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన శ్రీ మన్మహామండలేశ్వర మట్లి తిరువేంగళనాథరాజుగారి పౌత్రులయిన వెంకట్రామ రాజుగారి పుత్రు లయిన తిరువేంగళనాథరాజ దేవచోడమహారాజులుగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన క్రమ మెట్లన్నను. శ్రీగిరిద్వారానకు ఉషద్వారమైన సిద్ధవటం రాజ్యంలోకి చెల్లే మా యేలుబడి పులుగులనాటి సీమలో మంగంపేట అనే గ్రామము సర్వాము అనంతరాజుపేట పొలం విడుదల సురభికుంట క్రింద మడి నూరు

కుంటలు బ్రాహ్మణచెరువుక్రింద మడి నూరు కుంటలు ఉభయం మడి యిన్నూరు కుంటలు మడి ఖండికగా యేర్పరచి హద్దులు నిర్ణయించేసి ఇరవై వృత్తులు నిర్ణయించేసి వెంకట్రామరాజపురము అని నామాంకితముచేసి మీకు నిధినిక్షేపజలతరుపాషాణాద్యష్టభోగ స్వామ్యం అవునట్టుగాను దానాధమన వినిమయ విక్రయములకు యోగ్యమవునట్టుగాను యీ సోమోపరాగ పుణ్యకాలమందు శ్రీ స్వామివారికి ప్రీతిగా సహిరణ్యోదక దాన ధారాపూర్వకంగా గృహోపకరణాలతో కూడా యిస్తిమి; గనుక మీ పుత్ర పౌత్రపారంపర్యంతం ఆచంద్రార్కస్థాయిగాను సుఖాన అనుభవించుకొని ఉండగలవారు. అగ్రహారానకు హద్దులనిర్ణయం. తూర్పునకు చక్రాల చేనికి తూర్పు బొమ్మవరంకాలువ మర్రిచెట్టు. దక్షిణానకు ఝువ(?)కాలువ నక్కలగండి; పశ్చిమానకు శిగతిప్పను రాళ్ళకట్ట; ఉత్తరానకు నీరు వంపులలో సంజీవరాయణి దేవాలయం గోవిందమ్మకుంటకట్టె పిడుగుపడిన కొండానున్ను. ఈప్రకారం హద్దులు నిర్ణయం చేసి యిస్తిమి గనుక సుఖాన అనుభవించుకొని యుండగలవారు. ఇందుకు వృత్తుల వివరం: ౧. వెల్లాల వెంకట్రామ శాస్త్రులవారి వృత్తులు ౨. అన్నదానం వెంకటావధానులు వృత్తి ౧. ఓరుగంటి సుబ్బావధానుల వృత్తి ౧. మున్నా వెంకావధానుల వృత్తి ౧. పాణ్ణెం కృష్ణశాస్త్రులవారి వృత్తి ౧. జీవణిగి శ్రీనివాసాచార్యుల వృత్తి ౧. తీగెలపల్లి శీతారామశాస్త్రులవారి వృత్తి ౧, బనగానిపల్లె యజ్ఞేశ్వరశాస్త్రులవారి వృత్తి ౧, (౯) భండాత్మకూరి అన్నప్పశాస్త్రులవారి వృత్తి ౧, ఆరణి భాస్కరశాస్త్రుల వృత్తి ౧, రామాభక్తుల సోమేశ్వర దీక్షితుల వృత్తి ౧, రామాభక్తుల గిరిభట్ల వృత్తి ౧, అయ్యనసోమయాజుల రామేశ్వర శ్రౌతులు వృత్తి ౧, ఈశ్వరభట్ల స్వామిశాస్త్రుల వృత్తి ౧, మలుపూరి నారాయణశాస్త్రుల వృత్తి ౧, బుక్కపట్ణం వెంకటాచార్యులవారి వృత్తి ౧, వంగీపురం శ్రీనివాసాచార్యులవారి వృత్తి ౧, (౧౮) అన్నదానం నరసావధానుల వృత్తి ౧, వెల్లాల అన్నంభట్ల వృత్తి ౧. ఈ ప్రకారం యిరవై వృత్తులున్ను ప్రత్యేకం గృహోప

కరణాలతో కూడా యిస్తిమి. గనుక మీ పుత్రపౌత్రపారంపర్యం ఆచం
ద్రార్క స్థాయిగాను సుఖాన అనుభవించుకొని ఉండగలవారు.

స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥
దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥
ఏకైవ భగినీ లోకే సర్వేషా మేవ భూభుజాం ।
నభోజ్యా నకరగ్రాహ్యా పితృదత్తా వసుంధరా ॥
స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా ॥
మద్వంశజాః పరమహీపతి వంశజా వా ।
యేభూమిపా స్సతత ముజ్వలధర్మచిత్తాః ।
మద్ధర్మమేవ సతతం పరిపాలయంతి ।
తత్పాదుకద్వయ మహం శిరసా వహామి ॥
సర్వేషాం చరితంభుక్తే క్ష్మాపిస్వచ్ఛరితన్నతు ।
తతః కష్టతరోసిచో విప్రదత్తాపహారకః ॥

మంగంపేట హద్దు పత్రిక.

విజయనామ సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౫ లు శ్రీమన్మహామండ
లేశ్వర మట్లి తిరువేంగళనాథరాజు దేవచోడమహారాజులుంగారు అనంత
రాజుపేట రెడ్డికరణాలకు పుత్తెంచిన హద్దు పత్రిక. తర్వాత. మంగం
పేట గ్రామము మహారాజశ్రీ నాయనగారి పేరట వెంకట్రామరాజపురము
అని అగ్రహారము నామధేయ నిర్ణయముచేసి ఆగ్రామానకు హద్దులు
యేర్పరచి సెలవు యిచ్చిన వివరము :- ప్రాగ్భాగానకు నల్లచెరువుకట్టకు
తూర్పున ఊడగుట్టకు దక్షిణపు తట్టున బొమ్మవరం కాలువకు దక్షిణం
చక్రార్లచేను చుండి మడికిన్ని తూర్పు రాయలపాటి వంక హద్దు,
ఆగ్నేయభాగానకు కపిలేశ్వరుని దేవాలయము హద్దు, దక్షిణపు భాగా
నకు పూరపాలుకు దక్షిణం పాములకుంట మడి హద్దు, నైరృతి భాగా

నకు గుడుంపాటిదిన్నె కున్నూ నక్కలదిన్నె కున్నూ బ్రాహ్మణ చెరువు ఉత్తరపు అలుగుకట్ట మట్టుకు హద్దు, పశ్చిమం కొర్లకుంట అల్లెకు నడిగుట్టను అల్లెరాయిహద్దు వాయువ్యభాగానకు నీరువంపులలో సంజీవరాయుణి దేవాలయము హద్దు, ఉదద్భాగానకు గోవిందమ్మపల్లెయ చెరువు లోతట్టున్నూ ఊరగుట్టకు పిడుగురాళ్లదిన్నె హద్దు, ఈశాన్యభాగానకు నడిగుట్టసాల్పున బొమ్మవరం కాలువహద్దు. ఈ ప్రకారము చేనికిగాను హద్దులు నిర్ణయముచేసి సెలవు యిచ్చినారము. ఈ హద్దులకు లోగానుండే పొలము విడచెప్పి సర్వమాన్యముగాను నడిపించేది.

హా శ్శ్రీలావరాహస్య దంష్ట్రాదండ స్స పాతువః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీ చ్ఛత్రశ్రియందదా ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౭౧౨ అగునేటి సాధారణనామ సంవత్సర చైత్ర శు॥ ౧ భౌమవాసరమందు ఆశ్వలాయనసూత్రు లయిన భారద్వాజసగోత్రులయిన, వెల్లాల వెంకటపతిగారి పౌత్రు లయిన, ఆకొండుభట్లుగారి పుత్రులయిన, వెంకటాచలంశాస్త్రిల వారికి, సైలాలగోత్రోద్భవు లయిన చలుచల్మల ఓబులు రెడ్డిగారి పౌత్రు లయిన, ఆ కుమారవెంకటరెడ్డిగారి పుత్రు లయిన రాజశ్రీ చలుచల్మల జయరామిరెడ్డిగారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన పత్రిక క్రమ మెట్లన్నను: మా యేలుబడి నోసం తాలూకా లోను గ్రామం కావలెనని మనవి చేసుకొంటిరి గనుక అదే ప్రకారం నోసం దగ్గరనుండే అక్కంపల్లె చెరువులో పొలం సమేతు అష్టభోగ తేజస్వామ్యములతో కూడా దేవబ్రాహ్మణ మాన్యాలు మినహాగా సహిరణ్యోదక దానధారాపూర్వకముగాను మా పెద్దలకు సుకృతంగాను యీ తథాతిథి పుణ్యకాలమునందు, శ్రీకృష్ణార్పణముగాను మీకు ధారా గ్రహీతం చేస్తిమి. గనుక మీ పుత్ర పౌత్రపారంపర్యంగాను, ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించుక సుఖాననుండేది. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

జయరామిరెడ్డిగారి వ్రాలు

స్వదత్తా ద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం ।
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ॥

స్వదత్తా పుత్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ।
అన్యదత్తా స్వయంమాతా విప్రదత్తా వసుంధరా॥
దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం।
దానాత్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥
మద్వంశజాః పరమహీంపతి వంశజా వా।
యేభూమిపా స్సతత ముజ్వలధర్మచిత్తాః।
మద్ధర్మమేవ పరిపాలన మాచరంతి।
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి॥

మవుజే వెల్లాలవారి ఖండ్రిగె సమ్మతుకోడూరు, మవుజే ముజు కూరు అగ్రహారయజమానులు, వెల్లాలనృసింహశాస్త్రులవారి తావున నున్న సన్నదుకు నకలు.

నందన సంవత్సర మాఘ శు॥ ౫ లు శ్రీమన్మహామండలేశ్వర మట్లి తిరువేంగళనాధరాజ దేవచోడ మహారాజులుంగారు, వెంకట్రామప్పకు పుత్తెంచిన ప్రయోజనం. తర్వాత వెల్లాల వెంకట్రామశాస్త్రుల వారు అగ్రహారం చేసే నిమిత్తం అరణ్యాం ఖండిగ దయచేయవలెనని మనవిచేస్తున్నారు. గనుక అనంతరాజపేట పొలంలో తురకపల్లెకు తూర్పు వెలిగొండపర్యంతం ఉండే అరణ్యాం ఖండిగ సెలవిచ్చినారం. గ్రామస్థులతో చెప్పి అష్టదిక్కుల హద్దులు యేర్పరచి పొలం విడచెప్పి నడిపించే టట్టు చేసేది. నకలు వ్రాసుకొని అసలీ తిరుగా యిచ్చేది.

మవుజే యమ్మనూరివారి అగ్రహారము యమ్మనూరి చెన్న భట్ల దగ్గిర ఉండే దానపత్రము నకలు :



శ్రీరామ మట్లివెంకట్రామ

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౭ అగు నేటి యువనామ సంవత్సర చైత్ర శు॥ ౧౫ శ్రీవత్సగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన యమ్మనూరి రామాభట్ల పౌత్రు

లయిన రఘుపతిభట్ల పుత్రు లయిన చెన్నుభట్లకు కాశ్యపగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన మట్లి అనంతరాజుగారి పౌత్రు లయిన తిరువేంగళనాథరాజుగారి పుత్రు లయిన శ్రీమన్మహామండలేశ్వర మట్లి వెంకట్రాఘవరాజు దేవచోడ మహారాజులుగారు వ్రాయించి యిచ్చిన శ్రోత్రియ దాన పత్రిక. శ్రీ గిరిద్వారమునకు ఉపద్వార మయిన సిద్ధవటం రాజ్యములోకి చెల్లే మా యేలుబడి పొత్తపినాటి సీమలో పుల్లవాగుపేట పొలంలో అనాది బీడు అడవిస్థళం వెంగమ్మపల్లె పొలము అక్కడికుంటా మేము పనుపరచుకొని ఫలము చేసుకొనేము, శ్రోత్రియంగా సెలవు యియ్యవలెను. అని మనవి చేసుకొంటిరి గనుక అదే ప్రకారము దయచేసి ఆ పొలానకు హద్దు నిర్ణయము. దక్షిణము చిరుతెల్లకట్ట, పశ్చిమము పెద్దమద్రిమాను బావిన్ని, ఉత్తరమున రావుల బాటకు దక్షిణము తూర్పు రేగటి కుంటలోతట్టున్నూ తిమ్మారెడ్డిపల్లె బీడుపొలంసహాగా సెలవుయిచ్చినారము, ఈ ఆవరణములో యుండే చెట్టుగుట్టాగోభూమి సహా యీ సోమోపరాగ పుణ్యకాలమందు శ్రీస్వామికి అర్పితముగా మా అయ్యగారికి సుకృతముగా యిస్తిమి ; గనుక నాలుగు సంవత్సరములు సర్వమాన్యముగా అనుభవించుకొని అయిదో సంవత్సరము తాగాయితి, మొదటి సంవత్సరము ముప్పైరూకలు, రెండో సంవత్సరము ఆరుచక్రాలు మూడోసంవత్సరము ఆరంభము చేసుకొని యెల్లప్పటికి పదిచక్రాలు, లెక్కను మీకు క్రయవిక్రయాలకు యోగ్యమౌనట్లుగా సెలవు యిచ్చినారము గనుక మీ పుత్రపౌత్రపారంపర్యంతరము ఆచంద్రార్కస్థాయిగా అనుభవించుకొని శ్రోత్రియప్రకారంగాను దివాణానకు రూకలు యిచ్చి సుఖాన అనుభవించుకొని యుండేది.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం ।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతం పదం ॥

మవుజే తుమ్మకొండ వెంకట్రామరాజపురము అగ్రహారంలో యుండే నరియనూధి వెంకట్రామాభట్లవారిద్దగ్గర ఉండే దానపత్రం నకలు.

హా రేర్లీలావరాహస్య దంష్ట్రాదండస్స పాతువః ।
హేమాద్రికలశాయత్ర ధాత్రీ ఛత్రశ్రియందదౌ ॥

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౬౭౬ అగునేటి భావనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమద్యజన యాజనఅధ్యయనఅధ్యాపక దానదానప్రతిగ్రహ॰ షట్కర్మనిరతు లయిన వెంకట్రామరాజపురం అగ్రహార స్థితాశేష విద్వన్మహాజనులకున్నూ కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన శ్రీమన్మహా మండలేశ్వర మట్లి అనంతరాజుగారి పౌత్రు లయిన తిరువెంగళ నాథరాజుగారి పుత్రు లయిన వెంకట్రామరాజు దేవచోడమహారాజులు గారు వ్రాయించి యిచ్చిన భూదాన ధర్మశాసన క్రమమెట్లన్నను : శ్రీగిరి ద్వారమునకు ఉపద్వారమైన చంద్రగిరి సరకారులో చెల్లే మా యేలుబడి పులుగులనాటి సీమలో రాజయ్యచెరువు గ్రామంలో బొమ్మవరం గ్రామంలోనున్న అడవిస్థలాయం ఖండికె చేయించి, అగ్రహారానకు గణసంఖ్యాక వృత్తులు ౧౪ పద్మాలుగున్న నిష్కర్ష పరచి, అగ్రహారము చేసినాము. గనుక అందులకు వృత్తుల నిర్ణయానకు వివరము : ఆత్రేయసగోత్ర ఆశ్వలాయనసూత్ర ఋక్శాఖాధ్యాయు లయిన పోలకంపల్లె చెంచుభట్లకు పౌత్రు లయిన సుబ్బాభట్లకు పుత్రు లయిన ఆదిభట్లకు వృత్తులు ౨న్ను, గార్గేయస గోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన అవధానం బొజ్జంభట్లగారికి పౌత్రు లయిన లింగన దీక్షితులవారికి పుత్రు లయిన మల్లుదీక్షితులవారికి వృత్తి ౧. తథావిధి సంపన్ను లయిన ఆ శంకరావధానులవారికి వృత్తి ౧, తథా విధి సంపన్ను లయిన అయ్యవారి దీక్షితులవారికి వృత్తి ౧, హారితసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన నిరియనూరి వెంకటాద్రి భట్లగారికి పౌత్రులయిన గోపాలభట్లుగారికి పుత్రు లయిన సీతారామన సోమయాజులవారికి వృత్తి ౧, కౌశికసగోత్ర ఆపస్తంబసూత్రయజుశ్శా ఖాధ్యాయు లయిన పిడతల విశ్వనాథభట్లకు పౌత్రు లయిన విరూపాక్షు భట్లకు పుత్రు లయిన సుబ్బాభట్లకు వృత్తి ౧, శ్రీవత్ససగోత్రం యజు శ్శాఖాధ్యాయు లయిన దిట్టకవి కిచ్చన్నగారికి పౌత్రు లయిన రవణప్పకు పుత్రు లయిన కిచ్చన్నకు వృత్తి ౧, వసిష్ఠసగోత్ర ఆశ్వలాయనసూత్ర ఋక్శాఖాధ్యాయు లయిన చింతలపల్లి వెంకటభట్లకు పౌత్రు లయిన

